భారతవర్ష గ్రంథాలయోద్యమమునకు కల్పతరువు

## శ్రీ శాయాజీ గాయక్వారు - బరోడా మహారాజ



1936 లో వీరికి వజ్రోత్సవము జరిగినప్పుడు, అఖిల భారత ధర్మ గ్రంథాలయ సంఘ పక్షమున శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య బరోడాకు పోయి వీరికి "శ్రీ సరస్వతీ సామ్రాజ్య రమారమణ" అను బిరుదు నిచ్చిరి.

బరోడా గ్రంథాలయోద్యమోద్ధారకులు

## శ్రీ జనార్ధన కుడాల్కారు



శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య మద్రాసులో 1919 న జరిపిన అఖిల భారత ధర్మ గ్రంథాలయ సభకు వీరు అధ్యక్షత వహించిరి.



పుస్తకములను ఎరువిచ్చు శాఖ



ఆమూక్ (రిఫరెన్సు) గ్రంథాలయము




బాలురు చదువు — ఆటలను ఆడుకొంటున్నారు




స్త్రీల శాఖ

# GRANDHALAYA JYOTI

A Collection of Essays & Speeches
on Library Movement in all its aspects
*on the principle*
**"Library is The People's University"**

**1910—1966**

OF

## Iyyanki Venkata Ramanayya

Father of The Indian Public Library Movement

EDITED BY

**VELAGA VENKATAPPAIAH**

Principal, School of Library Science, Vijayawada 6

*PUBLISHED BY*

TEKUMALLA RAMACHANDRA RAO, M. A., B. L.,

Secretary, Andhra Desa Library Field Workers' Association.

SARASWATI SAMRAJYA BHAVANAM

VIJAYAWADA-2

FIRST EDITION ·
1,000 COPIES

PAGES
40 + 88 + 400 + Photo piints 30 = 558

PRICE Rs 15

PRINTED AT
GRAMA SWARAJYA PRESS
VIJAYAWADA-2

PHOTO BLOCKS
PRINTED AT
VIJAYA PRESS, VIJAYAWADA 2

BOUND BY
SREE ABDUL MAJEED

గ్రంథాలయోద్ధారక, గ్రంథాలయ శాస్త్రవిశారద, గ్రంథాలయ పితామహ



శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య

# అపరసరస్వతి :

## నాయనమ్మ : సుందరమ్మదేవి



నా జీవితపథము సుగమ మగుటకు
వలసిన క్రమశిక్షణము నంతేను
ఆట - పాట - లతో చిన్ననాటనే
నాకు అలవడజేసిన
సరస్వతీదేవి అవతారమే యగు
నాయనమ్మ సుందరమ్మ దేవి
పద కమలముల యందు
ఈ తొలి గ్రంథమును సమర్పించుచున్నాను.



శ్రీ పాదరేణువు
**అయ్యంకి వేంకట రమణయ్య**
విజయవాడ : సంక్రాంతి పండుగ (1967)

# గ్రంథాలయ జ్యోతి

## విషయసూచిక

### మొదటి విభాగము

## రెండవ విభాగము

---

## మూడవ విభాగము

4. గ్రామ గ్రంథాలయములు



5. వయోజన విద్య



6. చిన్న పిల్లలకు సేవ



7. కార్మిక సమస్య : గ్రంథాలయములు

---

## చిత్రపటముల వివరము

గ్రంథాలయ యాత్రలు :

# శ్రీ ర వ్యా త్

ఆ చా ర్య
రాయప్రోలు సుబ్బారావు — సికింద్రాబాద్.

"అస్య శ్రీ పుస్తక మాలా మంత్రస్య
స్వచ్ఛంద ఛ్ఛందః
శ్రీ వేంకటరమణ ఋషిః
మహా సరస్వతీదేవతా
అజ్ఞాన జాడ్యనివృత్త్యా
ప్రయోజన విద్యా ప్రదానేచ వినియోగః"

అని ఒక మంత్రమును అనుసంధానము చేస్తే శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య అఖండ తపస్సు నిక్షేప మవుతుంది.

ఇది మిత్రస్తోత్రము కాదు. కవుల అతిశయోక్తి కాదు.

శ్రీ వేంకటరమణయ్యను నేను 59 సంవత్సరములనుండీ ఎఱుగుదును. రాజమహేంద్రనగము చింతామణీ ముద్రణాలయములో వచ్చి కలుసుకొన్నారు; ధవళాంబరధారి; నూనూగుమీసాలు; బంగారు చాయ; సహజస్మిత సౌమ్యమయిన ముఖము; తరుణ స్నిగ్ధమైన వయస్సు. ఆయనను చూడగానే శ్రీమంతుల యింటి చిన్నవా డనిపించింది నాకు.

"శుచీనామ్ శ్రీమతాం గేహే
యోగ భ్రష్టోఽభిజాయతే"

అని కదా గీతానిరూపణం!

(శ్రీ)

శ్రీ వేంకటరమణయ్యతో మరొకవ్యక్తి ఉన్నాడు. చామన చాయ దేహము; వామనాకారము; ఏ దురాచారం మీదనో కోప గించినట్లు, కండ్లలో జీరలు; ఆయనే శ్రీ మంగిపూడి వేంకటశర్మ; "వందేమాతరం" అను గేయసంపుటిని రచించిన లలితకవి; "బాల భారతి" అను పత్రికను నడిపిన శక్తిమంతుడు. తెనుగులో పత్రికా వ్యవసాయంచేసి, సంస్కారతప్తమయిన ఆంధ్ర మండలమున, క్రొత్త విత్తనాలు చల్లడానికి సంకల్పించుకొని వచ్చారు.

సంఘ సంస్కార దుమారము అణగింది. కాని రాజకీయాలు కాలమేఘములవలె తారాడ సాగినవి. అన్యాపదేశ విన్యాసంతో "ఆంధ్రకేసరి" (జాతీయ వారపత్రిక) గర్జిస్తున్నది.

"భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుంద
దెల్లవారను గతసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి"

అని ఆనాడు, రాజమహేంద్రవరములోనేగాక ఆంధ్రదేశ మంతటా కూలినాలి జనంకూడా పాడ నారంభించారు. నిజానికి, మొట్టమొదటుగా, తెలుగునాటిలో సామాన్యజనమును గిల్లి-గిచ్చి-లేవ గొట్టింది శ్రీ చిలకమర్తివారి పద్యాలేయని నా నమ్మకము.

తరువాత (1910) ఒందరు వెళ్ళాము; "ఆంధ్ర భారతి" (మాస పత్రిక) అవతరించింది. ఎలా! సర్వాంగసుందరంగా - ఆకా రములో క్రొత్త - వ్యాసరచనలో క్రొత్త - జీర్ణవస్త్రములు వదలి వేసింది; క్రొత్త నేతచీరలు ధరించింది ఆంధ్రభారతి; కంఠస్వరములో కమ్మని తెనుగు; కల్పనా తంత్రములో కళాకైన దీప్తి. ఇలాటి వాౙ్రిలకు ముట్నూరివారి కలం ఒరవడిపెట్టింది; కృష్ణాపత్రిక ఆనాడు నూదికొమ్ముల సురభిధేనువువలె ఉండేది. అయినా పాలే పిండింది.

నావంటి నవ కవులందరికీ శ్రీ వేంకటరమణయ్యగారి "ఆంధ్ర భారతి" మొదటి గరడీ అంటే ఆశ్చర్యంలేదు. మాకేకాదు; "ఆంధ్ర భారతి" లేకపోతే "గురజాడ" వారి రచనలు ప్రచురించే పత్రిక వేరొకటి ఉండేది కాదేమో ఆనాడు.

శ్రీ వేంకటరమణయ్య బెజవాడ స్వగ్రామముగా చేరిన తరువాత, ఆయన ప్రజ్ఞా ప్రభావం పలువిధముల పల్లవించింది. ప్రకృతి ధర్మము (చికిత్స) ను అభ్యసించారు; బాల భటోద్యమములో చేరి ఉపచార కంకణం కట్టుకొన్నారు, దివ్యజ్ఞాన సమాజములో చేరి అనుష్ఠాన మారంభించారు. పుస్తక ప్రతిమలకు ఆలయములు కట్టించారు. కట్టించరా మరి...

ఏమంటే, శ్రీ వేంకటరమణయ్య సమస్త విద్యా విజ్ఞాన వికాసములకూనూ, కర్మదీక్షకును, జీవిత కలాపమున కంతకునూ పుస్తకమే శరణ్యము - సాధన - స్వయంకృషి - తల్లీ - తండ్రి - గురువూ — దైవమూ — మిత్రుడూ - ధాత్రుడూ — అందరూ పుస్తక రూపంగానే ఆయన దర్శనం- అందువల్ల గ్రంథమే ఆయనకు సర్వస్వ మయింది.

అదే "గ్రంథ — ఆలయ - సర్వస్వము"

ఆ పత్రిక నవ్యసాహిత్యానికి తొలకరి అయింది. స్వాతంత్ర్య సన్నాహానికి ప్రచ్ఛన్న ప్రబోధగీత మయింది. యువజనుల ఉత్సాహ శక్తికి మూలమంత్ర మయింది. జాతిని మేలు కొలిపింది. మాంద్యమును పోద్రోలింది. కార్యదీక్షకు శతవర్ష సత్రయాగం ప్రారంభించింది. సరస్వతీ సామ్రాజ్య స్థాపనతో జీవిత పురుషార్థము చరితార్థమయింది.

—రాయప్రోలు సుబ్బారావు.

———

# ప్రశంస

సాహిత్యరత్న
పి. వి. నరసింహారావు
న్యాయశాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ ప్రభుత్వము

హైదరాబాదు
19-12-66

ప్రసిద్ధ దేశభక్తులు, నిరంతరం సాహితీ సేవాపరాయణులు, గ్రంథాలయోద్యమ మహారథులు ఐన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి వ్యాససంపుటి "గ్రంథాలయజ్యోతి" పండితపామరులందరికి స్ఫూర్తిదాయకమనుట నిస్సందేహము. 1910 నుండి 1966 వరకు వారు పొందుపరచిన అనేక సంఘటనలు, అనుభవములు, వారి వ్యాసములలో ఎంతో సహజసుందరముగా వర్ణింపబడినవి. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర వారి రచనలలో సంగ్రహముగా ఉల్లేఖించబడినది. గ్రంథాలయములకు సంబంధించిన ఏ అంశమునూ వారు ఉపేక్షించలేదు. కావున ప్రస్తుత సంపుటిని "గ్రంథాలయ సర్వస్వ" మనుట సమంజసము.

గ్రంథాలయము లీనాడు ప్రజాసంస్థలతోపాటు ప్రభుత్వ బాధ్యతగా రూపొందినది. శ్రీ వేంకటరమణయ్యగారు ఇకముందు జరుగవలసిన కార్యక్రమమునుగూర్చి చేసిన సూచన లెంతో ఉపయుక్తమైనవి. అవి వీలైనంత త్వరలో అమలులోనికి వచ్చునని ఆశించుచున్నాను. వారు వ్రాసిన ఒక్కొక్క వ్యాసమును గురించి వేర్వేరుగా సమీక్షించుట కిది సందర్భముకాదు. ఏ దృష్టితో చూచినను ఈ వ్యాసములు పాఠకులకు, అధికార అధికారేతర కార్యకర్తలకు నూతనోత్సాహమును ప్రసాదించు ననుట నిర్వివాదము. శ్రీ వేంకటరమణయ్యగారికి ఆంధ్రమహాజనులు కృతజ్ఞులై యుందురని విశ్వసించుచున్నాను.

ఈ నాలుగు మాటలు వ్రాయు సదవకాశము నా కిచ్చినందులకు నా ధన్యవాదములు.

—పి. వి. నరసింహారావు.

# అభినందన

యం. ఆర్. అప్పారావు
మద్యనిషేధశాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ ప్రభుత్వము

హైదరాబాదు.
18-11-1966.

---

"అయ్యంకి వారే గ్రంథాలయోద్యమం"గా. "గ్రంథాలయోద్యమమే అయ్యంకి వారు"గా అహర్నిశలు పని చేసిన విశిష్ట వ్యక్తి గ్రంథాలయోద్యమ పితామహులైన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు; అంతేకాదు దేశస్వాతంత్ర్యమునకు, ప్రజా సేవకు, భాషా సేవకు, విజ్ఞానవ్యాప్తికి తన జీవితమును అంకితము చేసి, తన ధ్యేయములందు చిత్తశుద్ధిని ప్రకటించినవారు శ్రీ వేంకటరమణయ్యగారు; ఇట్లు వివిధ రంగాలలో పరిణతి పొందిన శ్రీ వేంకటరమణయ్యగారి విజ్ఞానమును చిరకాల సేవానుభవమును అక్షరరూపముగ చిరస్థాయి చేయసంకల్పించిన సహృదయులు, సంపాదకులు, ప్రచురణకర్తలు అభినందనీయులు.

శ్రీ వేంకటరమణయ్యగారు కన్నకలలు ఫలించి, నేడు దేశమంతటను వాడవాడలా గ్రంథాలయములు నెలకొనుచున్న ఈ శుభసమయములో "శ్రీ వేంకటరమణీయ వాణి"లో తొలి పుష్పముగా వెలువరింప బడిన ఈ "గ్రంథాలయ జ్యోతి" గ్రంథాలయ లోకమునకే కాక విజ్ఞానాభిలాషులందరకును ఎంతయో ఉపకరింపగలదని విశ్వసించుచున్నాను.

యం. ఆర్. అప్పారావు.

---

# తొలిపలుకు

గొట్టిపాటి బ్రహ్మయ్య
సభాపతి
ఆంధ్రప్రదేశ శాసన పరిషత్తు

హైదరాబాదు,
8-11-1966

---

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి స్వగ్రామం అయ్యంకి. చాల చిన్న గ్రామమే. అయినా, భరతనాట్యంలో ఆంధ్రప్రశస్తిని అఖిల భారత వర్షానికి చాటిన కూచిపూడి: త్యాగరాజస్వామికి సమకాలికుడు — శ్రీకృష్ణుని తన ఆరాధ్యదేవుడుగా, తానొక గోపికగా పదముల నల్లిన క్షేత్రయ్య నివసించిన మొవ్వ: ఆంధ్రసామ్రాజ్యానికి ప్రధాన నగరమైన శ్రీకాకుళము: బౌద్ధవిజ్ఞానానికి ఆటపట్టయిన ఘంటసాల: వీరికి సమీప గ్రామాలు. ఆ ప్రాచీన సంస్కారం అంతా ఆయనలో వెల్లివిరిసింది.

చరిత్రాత్మకమైన 1906 లో కలకత్తా కాంగ్రెసుకు అధ్యక్షత వహించిన భారత భీష్ముడు దాదాభాయి నౌరోజీ — స్వరాజ్యం — స్వదేశీ— మన గమ్యస్థానం అని ప్రవచించుట; 1907 లో "స్వరాజ్యం నా జన్మహక్కు, దానిని నేను ప్రసాదింతును" అని లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయుడు ప్రతిజ్ఞాబద్ధుడగుట; సూరతులో స్వరాజ్య సంపాదనకు అతివాద శక్తులను సంఘటిత పరచుట, జరిగి కాలము పరిపక్వమయింది.

ఆంధ్రదేశంలో ఆనాడు రాజకీయ ఉద్యమానికి ప్రధాన కేంద్రం బందరు అఖిల భారత అతివాద త్రయం లాల్, పాల్, బాల్ లలో- బిపిన చంద్రపాలు ఆంధ్రదేశ పర్యటనకు ముందు బందరు రావటం, బందరు ప్రముఖులను, యువకులను వెంట నిడుకొని ఆనాడు రాజకీయ ప్రచారం చేయుటం, మనకు సువిదితమే.

శ్రీ వేంకటరమణయ్యగారు జన్మతః రాజస ప్రవృత్తిగల వ్యక్తి. దేశాభిమానం, దేశభక్తి ఆయనను ఉద్రేకపరిచి— తనజీవితం

దేశసేవకు స్వారాజ్య సంపాదనకు అంకిత మొనర్చు దీక్షవహింపజేశాయి. 1908 నుంచి 1911 వరకు బందరు తన కార్యరంగంగా చేసుకున్నారు. శ్రీ వేంకటరమణయ్యగారు తనకంటె పెద్దలు కోపల్లె, భోగరాజు, ముట్నూరి, కౌతా, అవటపల్లె, చిల్లరిగె- ప్రభృతుల సహచర్యం అలవరచుకొన్నారు. నిరంతరం వారితో జరిగిన సంభాషణలను అవగతం చేసుకొని రాజకీయ సారస్వతరంగాలకు సంబంధించిన వాఙ్మయాన్ని పూర్తిగా చదివి నిష్ణాతులై "ఆంధ్రభారతి" అను మాసపత్రికను స్థాపించారు. తద్వారా ఆంధ్రసంస్కృతిని ప్రబోధిస్తూ, వ్యాసాల ద్వారా మన పూర్వసంస్కృతి నుద్ధరించ ప్రజల నుబోధించుట తమ కర్తవ్యంగా జేసుకొని పత్రికాసంపాదకత్వంలో నైపుణ్యం చూపారు. బందరులో ప్రారంభమైన "స్వదేశీ సంత" నేర్పరచుట - "ఆంధ్రభాషాభివర్ధనీ గ్రంథమండలి" స్థాపన-వగైరా కార్యక్రమాలలో తగుపాలు వహించారు.

రాజకీయాలలో తీవ్రవాదులు, కృష్ణా పత్రికకు ప్రధాన వ్యాసాలు వ్రాయుటంలో పేరుగన్న-అవటపల్లి,ముట్నూరి వారి సహచర్యం నిరంతరం కలుగజేసికొన్నారు. ముట్నూరి శ్రీకృష్ణరాయ దర్బారులో సభ్యుడుగా వుండటంతో, ఆంధ్రదేశంలో జాతీయోద్యమం వేరూనుటకు ప్రజలను విజ్ఞానవంతులుగా రాజకీయ చైతన్యవంతులుగా చేయుటకు సంకల్పించారు. అందుకు ప్రాతిపదికగ గ్రంథాలయోద్యమమే ముఖ్యమని భావించారు.

అంతట ఆంధ్రదేశానికి మధ్యస్థంగా అన్నిజిల్లాలకు ప్రజలకు అనుకూలమైన బెజవాడకు తన కార్యరంగాన్ని మార్చుకొన్నారు. అక్కడ తన వయస్కుడగు శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రితో చేరి, పెద్దలగు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు, పెద్దిభొట్ల వీరయ్యగార్ల సహాయం తీసుకొన్నారు.

శిష్టులయిన ఈ నలుగురు మహనీయులు శ్రీరామమోహన గ్రంథాలయమును అభివృద్ధికి తీసికొనివచ్చారు.

1918 లో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాన్ని స్థాపించి, తద్వారా వేంకటరమణయ్యగారు ఆంధ్రదేశంలోనే గ్రంథాలయోద్యమానికి మూలపురుషు లయ్యారు.

వీరి తర్వాతనే, వీరి ప్రబోధంతోనే – అసంఖ్యాకులగు విద్యావంతులను ప్రభవించిన అంగలూరులో గ్రంథాలయాన్ని పెట్టడం జరిగింది. శ్రీ వేంకటరమణయ్యగారి వల్ల తగిన స్ఫూర్తిని (Inspirat పొందిన నా వర్గ్గా విద్యార్థులు మావూరు– ఘంటసాలలో కూడా గ్రంథాలయం పెట్టుకొనటం – దానికి "రామమోహన గ్రంథాలయం" అని నామకరణము చేయటం జరిగింది.

శ్రీ వేంకటరమణయ్యగారిని ఆంధ్రదేశం అంతటా గ్రంథాలయ పితామహులుగా – మనం పూజ్యభావంతో చూచుకుంటున్నాము.

మహాత్ముడు నడిపిన జాతీయోద్యమంలో, ఉప్పుసత్యాగ్రహం నాటినుండి "క్విట్ ఇండియా" ఉద్యమం వరకు ప్రథమ శ్రేణిలో నిలిచి కదనరంగంలో దుమికిన వీరులను వెన్నుతట్టి ప్రోత్సాహాన్నియిస్తూ, యువకులను కార్యకర్తలను ఉత్తేజితుల నొనరించి రాజకీయ పరిజ్ఞానం కలుగజేసి తగిన ప్రోత్సాహం యిచ్చినట్టివారు శ్రీ వేంకటరమణయ్యగారు; ఈ కార్యక్రమం అంతకీ ఆటపట్లు గ్రంథాలయాలు.

గ్రంథాలయ ఉద్యమ వ్యాప్తికి వీరు స్థాపించిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమును గ్రంథాలయ సర్వస్వము అను పత్రికయును, శ్లాఘనీయమైన కృషి జేసినాయి. తాను స్థాపించిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము ఇటీవలనే వైభవంతో జేసికొన్న స్వర్ణోత్సవమునందుగూడ పాల్గొను భాగ్యము శ్రీ వేంకటరమణయ్య కబ్బినది.

వీరు 1934 లో స్థాపించిన ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ సేవక సంఘము ఈ మూడు శతాబ్దముల పై కాలమునుండియు వీరి అధ్యక్షత క్రింద మహోజ్వలమైన కృషి చేస్తున్నది.

అంతేగాక ఆంధ్రదేశంలో బయలుదేరదీసిన గ్రంథాలయో ద్యమాన్ని విస్తృతం జేసి వేంకట రమణయ్యగారు అఖిలభారత గ్రంథాలయసంఘాన్ని స్థాపించిరి(1919)ఆంగ్లేయ భాషలో; ఇండియన్ లైబ్రరీ జర్నలు" అను మాసపత్రిక కొన్ని సంవత్సరాలు నడిపి, సార్వజనిక గ్రంథాలయోద్యమ తత్వాన్ని అఖిలభారతానికంతకూ వ్యాపింపజేశారు. వీరి కృషిఫలితంగానే మద్రాసు - పంజాబు - బెంగాలు - గ్రంథాలయ సంఘములు స్థాపింపబడి, ఆయా రాష్ట్రాలలో ఈ ఉద్యమం సుస్థిరతనుగాంచింది.

వేంకటరమణయ్యగారు మంచి వక్త. వీరి ఉపన్యాసములలో హాస్యరసం తొంగిచూస్తుంటుంది. సున్నితమైన, సరసమైన కొరడా దెబ్బలు కొట్టడంలో కూడ వీరికి మంచి నేర్పు ఉంది. వీరు కొంత కాలం "కొరడా" పత్రికనుకూడ నడిపారు. చురుకయిన ఎద్దుకయినా ముల్లుకర్ర అవుసరము కదా ! రాజకీయరంగంలోని పెద్దలను హెచ్చరించుటకు యీ "కొరడా" పత్రిక అప్పుడు వుపయోగపడింది.

తన చిన్ననాటి నుండి నేటివరకు 50 సంవత్సరముల కాలము, స్వార్థరహితంగా సాహిత్యరంగంలోను - ప్రకృతి వైద్యరంగంలోను శాలభట స్వచ్ఛందసేవారంగంలోను ప్రముఖంగా సేవజేసి, పెద్దల పిన్నల ప్రేమను రమణయ్యగారు చూరగొన్నారు.

అన్ని ఉద్యమాలకు గ్రంథాలయోద్యమమే తల్లి ఉద్యమంగా వీరు తీర్చి దిద్దారు. పరిజాజీవితం అంతకీ గ్రంథాలయం కేంద్రమై, ప్రజాబాహుళ్యానికి అది గ్రామ విశ్వవిద్యాలయ స్థాయిని సేవజేయడానికై రూపొందించారు; ఇదే ఆంధ్రగ్రంథాలయో ద్యమం యొక్క స్వరూపం, విశిష్టత.

ప్రపంచంలో సుఖము, శాంతి, సిరి, సంపద, ప్రేమ, అను రాగము, కలిసికట్టుతనము, వ్యాపించడానికి విజ్ఞాన వ్యాప్తి ఒక్కటే సాధనంగా — గ్రంథాలయోద్యమాన్ని — సరస్వతీ సామ్రాజ్యంగా విశ్వవ్యాప్తంచేసి, వేంకటరమణయ్యగారు ఒక నూతన ప్రపంచ సృష్టికి పునాది వేశారు.

నేటికీ మంచి ఆరోగ్యముతో వుండి చక్కని సలహాలతో యువకులను ప్రోత్సహిస్తున్న అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు వారి అనుభవాలు — వారు సంపాదించిన విజ్ఞాన విశేషాలు — యిచ్చిన ఉపన్యాసాలను, ఒక పుస్తక రూపంలో ప్రచురింపబడినందుకు సంతోషం.

ఈ గ్రంథం యువకులకు కార్యకర్తలకు భవిష్యత్తులో తమ్ము తాము తీర్చిదిద్దుకొనుటకు ఎంతో వుపయోగపడగలదని భావిస్తున్నాను.

భగవంతుడు శ్రీ వేంకటరమణయ్య పంతులుగారికి ఆయురారోగ్యాన్ని ప్రసాదించి, పూర్ణాయుష్కునిగా ఆశీర్వదించి, ఇతోధికంగా ప్రజాసేవ చేయుటకు యింకా అనేకములగు ప్రజోపయోగ గ్రంథములను రచించుటకు శక్తిసామర్థ్యాలను అనుగ్రహించ పరాత్పరుని వేడుచున్నాను.

—గొట్టిపాటి బ్రహ్మయ్య

---

# సుస్వాగతము

శ్రీ దేవులపల్లి రామానుజరావు — హైద్రాబాదు
ఆంధ్రసారస్వత పరిషత్తు

దీపావళి: పరాభవనామ సంవత్సరం

---

ఆంధ్రదేశ సాంస్కృతిక రంగానికి శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు సుపరిచితులు. నిజానికి కొలదియో గొప్పయో విజ్ఞానముగల ఆంధ్రులలో వీరి కృషి తెలియనివారు ఎవరును ఉండరు; ఉండకూడదుకూడ; వెంకటరమణయ్యగారి ప్రజాసేవ బహుముఖమైనది. అర్ధశతాబ్దముకన్న యెక్కువ వయస్సు కలిగినది.

ఈ శతాబ్దమున భారతదేశములో తలయెత్తి వ్యాపించిన అన్ని ఉద్యమాలలో శ్రీ వెంకటరమణయ్యగారు పాల్గొని నాయకత్వము వహించారు. ఈనాడు ఆంధ్రదేశములో ప్రముఖులైన పండితులను, కవులను అనేకులను వారు వెలుగులోనికి తీసుకొని వచ్చినారు. వారి సంపాదకత్వమున వెలువడిన, ఆంధ్రభారతి, గ్రంథాలయ సర్వస్వము చేసిన సాహిత్యసేవ చరిత్రాత్మకమైనది; అద్వితీయమైనది. భారత దేశ స్వాతంత్ర్యోద్యమము, సంఘ సంస్కరణోద్యమము, దివ్యజ్ఞాన ఉద్యమము, బాలభటోద్యమము, ఆంధ్రోద్యమము, సర్వోదయము—మొదలైన వివిధ రంగాలలో వెంకటరమణయ్యగారు చేసిన కృషి నిరుపమానమైనది. ఒక్కమాటలో వెంకటరమణయ్యగారు ఒక మహాసంస్థ,

అనేక ఉద్యమాలలో పాల్గొని తరువాత తరాలకు మార్గదర్శకులైన వెంకటరమణయ్యగారికి గ్రంథాలయోద్యమము మిక్కిలి ప్రీతిపాత్రమైనది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి వారే స్థాపకులు. ఈ సంఘము యితర రాష్ట్రాలలోని గ్రంథాలయోద్యమాలకే కాక సకల భారతస్థాయిలో గ్రంథాలయోద్యమానికికూడ దారిచూపినది. ఏబదియారు సంవత్సరాలు ప్రజాహిత జీవితములో వీరు గావించిన ఉపన్యాసములు, వ్రాసిన వ్యాసములు అనేకములు. ఇందులో కొన్నింటిని యేరికూర్చి "గ్రంథాలయజ్యోతి"గా ప్రచురించుట చాల సమంజసమైన కార్యము; విజ్ఞానానికి ఆటపట్టులైన యీ వ్యాసాలు, ఉపన్యాసాలు సర్వదా నిలచి ఉండవలసినవి. ఉత్సాహశీలురైన శ్రీ వెలగా వెంకటప్పయ్యగారు సంకలనము గావించిన ఈ సంపుటానికి, పెద్దలు కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ శివశంకరస్వామి, శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారలు సంపాదకులుగా నుండుట సర్వవిధాల సముచితముగా నున్నది. శ్రీ వెంకటరమణయ్యగారికి ఆంధ్ర మహాపురుషులలోనున్న విశిష్టమైన స్థానానికి, యీ సంచికకు యీ త్రిమూర్తుల సంపాదకత్వము ఉత్తమమైన తార్కాణము.

శ్రీ వెంకటరమణయ్యవాణి వరుసలో గ్రంథాలయజ్యోతి మొదటి ప్రచురణగా వెలువడుచున్నది. అనేక సందర్భాలలో, అనేక సంచికలలో దాగుకొనియున్న యీ వ్యాసాలను ఒకచోట చేరి కూర్చి సంపాదకులు ఆంధ్రభాషకు మహోపకారము గావించి నారు; ఇందులో వారి జీవిత విశేషాలను గూర్చిన ఒక వ్యాసముతో పాటు, వారికి ప్రాణపదమైన సరస్వతీ సామ్రాజ్యము - ఆశయాల వివరణను చేర్చుట మిక్కిలి సందర్భశుద్ధిగా నున్నది. ఈ గ్రంథా లయజ్యోతి పదునైదు భాగాలుగానున్నది. ఇందులో రెండుభాగాలు మాత్రమే గ్రంథాలయోద్యమానికి సంబంధించినవి. కడమవన్ని యును గ్రంథాలయ విజ్ఞాన నిక్షేపములు. ఈ గ్రంథాలయజ్యోతి - గ్రంథాలయ విజ్ఞాన సర్వస్వమని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. ఈ సంపుటము గ్రంథాలయోద్యమమువందు అభిమానము కలిగిన ప్రతివ్యక్తియు తప్పక చదువదగిన గ్రంథము; ప్రతి గ్రంథాలయ ములో చేర్చవలసిన పుస్తకాలలో యీ గ్రంథాలయజ్యోతికి ప్రథమ స్థానము.

ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయ శాసనము అమలులోనికివచ్చి ప్రతి జిల్లాలో లోకల్ లైబ్రరీ అధారిటీలు ఆవరించి పనిచేయుచున్నవి. శ్రీ వెంకటరమణయ్యగారు యేబది సంవత్సరాలక్రింద కనిన స్వప్న ములు యీనాడు కొంతవరకు సత్యమగు చున్నవి. భారత దేశములో యీ విధమైన గ్రంథాలయోద్యమ ప్రగతికి మనరాష్ట్రము మార్గ దర్శకమై యున్నది, ఇందుకు కారణము శ్రీ వేంకటరమ ణయ్యగారు - వారి అనుయాయులు గావించిన కృషియేనని నిస్సం దేహంగా చెప్పవచ్చును. ఈ "గ్రంథాలయజ్యో"తికి సుస్వాగతము. ఈ జ్యోతి దేశమంతటను ప్రకాశించి, మూలమూలలోనున్న చీకటిని తొలగించగలదని ఆశించుచున్నాను. లోకల్ లైబ్రరీ అధారిటీలకు, గ్రంథాలయోద్యమాలకు యీ జ్యోతి సరియైనదారి చూపించగలదని విశ్వసించుచున్నాను. శ్రీ వెంకటరమణయ్యవాణి ప్రచురణ వరుస కడమ సంపుటాలు త్వరలో వెలువడగలవని ఆశించుచున్నాను.

—దేవులపల్లి రామానుజరావు

# ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘము
## ANDHRA DESA LIBRARY FIELD WORKERS' ASSOCIATION



కార్యనిర్వాహకవర్గము : 1. మాజేటి రామచంద్రరావు, సంయుక్త కార్యదర్శి. 3. మారేపల్లి రామచంద్రశాస్త్రి, ఉపాధ్యక్షులు. (చనిపోయినారు)
2. అయ్యంకి వేంకట రమణయ్య, అధ్యక్షులు. 4 శేకుమళ్ల రామచంద్రరావు, ఎం. ఏ., బి. ఎల్., కార్యదర్శి.

# ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘ చతుర్థసమావేశము

## గంటూరు, 13-14 డిశంబరు 1942

ప్రతినిధులలో కొందరు :

సర్చీలమీదివారు :— 1. పి. కొండారెడ్డి [ప్రధాన కార్యదర్శి]. 2. శ్రీ రాజా వాసిరెడ్డి హరిప్రసాదు బహద్దరు [చింతపల్లి రాజా]. 3. తలిశెట్టి రామారావు [జయపూరు దివాను]. 4. గాడిచెర్ల హరిసర్వోత్తమరావు [ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు]. 5 తెల్లాకుల జాలయ్యశ్రేష్ఠి [ఆహ్వాన సంఘాధ్యక్షులు]. 6. శ్రీ రాజా రంగయ్యప్పారావు బహద్దరు [వుయ్యూరు యువరాజా, ప్రదర్శనమును తెరచిరి]. 7. శ్రీ శ్రీ విక్రమదేవవర్మ, [జయపూరు మహారాజా, సభా ప్రారంభకులు]. 8. బెజవాడ రామచంద్రారెడ్డి, సి. బి ఇ. [సభాధ్యక్షులు]. 9 శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య [సన్మానమును పొందినవారు]. 10. దేశిరాజు హనుమంతరావు పంతులు. 11. శ్రీ యస్. బి. సచ్చిదానంద [విశ్వవిద్యాలయ గ్రంథభాండాగారి]. 12 శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్య [ప్రొఫెసర్, విశ్వ విద్యాలయము]. 13. మందలపర్తి ఉపేంద్రశర్మ [కార్యదర్శి]. 14. ఈదర వెంకట్రావుపంతులు [వెంకట్రామా అండ్ కో., ప్రొప్రటయిరు].

నేలమీద కూర్చున్నవారు :— 1. హేమాద్రి కొండలరావుశర్మ. 2 నిడదవోలు వెంకట్రావు. 3. బుద్ధ విశ్వనాథం.

వెనుక నిలుచున్నవారు :— 1. కోన వెంకటరాయశర్మ. 2 గుంటుపల్లి జ్వాలానరసింహారావు. 3. మారేపల్లి రామచంద్రశాస్త్రి 4. డాక్టరు మారేమండ రామారావు. 5 యలమంచిలి వెంకటేశ్వరరావు. 6. కోగంటి రాఘవయ్య. 7. అడుసుమిల్లి శ్రీనివాసరావు. 8. జి యస్. కె. ఆర్య. 9. గొట్టిపాటి వెంకటసుబ్బయ్య. 10. మల్లెల శ్రీరామమూర్తి. 11 వద్దూరు వెంకటప్పయ్య. 12. బి. హనుమంతరావు. 13. ఎ. లక్ష్మీపతి. 14. వారణాసి రామమూర్తి. 15. రంగావఝ్ఝుల రాధాకృష్ణమూర్తి. 16. డాక్టరు పుచ్చా వెంకట్రామయ్య. 17. జి. పుల్లారావు. బి. ఎ. 18. జూలూరు అప్పయ్య పంతులు.

బెంచీలమీద నిలుచున్నవారు :— 1. అంబటి కుటుంబరావు. 2 పాతూరి నాగభూషణం 3. చేకుమళ్ళ రామచంద్రరావు. ఎం.ఏ., బి.యల్. 4. పుణ్యమూర్తుల రాజశేఖరం. బి.ఏ., బి ఇడి. 5. ఊటుకూరు జయరాందాసు. 6. టి. రామలింగేశ్వరరావు. [రామా అండ్ కో]. 7. యస్. నరసింహారావు [వెంకట్రామా అండ్ కో]. 8. యస్. శేషగిరిరావు [మున్సిపల్ లైబ్రేరియన్, గుంటూరు.]

## ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకసంఘ చతుర్థ సమావేశము
గుంటూరు, 13 - 14 డిశంబరు 1942



ప్రవర్శనము తెరచినది : శ్రీ యం. ఆర్. అప్పారావు
ప్రారంభకులు : శ్రీ విక్రమదేవవర్మ
సభాధ్యక్షులు : శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి
సన్మానము పొందినది : శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య

డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి ఈ సభలో
శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యకు
సన్మాన సంచికలను సమర్పించినారు

# పడవ గ్రంథాలయము



గుంటూరు జిల్లాలో పెదపాలెం సేవాశ్రమంవారు కృష్ణానది కాలువలో రహదారి "బోటు"లో ప్రయాణము చేసేవాళ్లకి, ఆ పడవలోనే చదువడానికి పుస్తకాలను, పత్రికలను - కొన్ని సంవత్సరములు ఏర్పాటుచేసినారు.

267 పుట చూడుడు

# ఉపోద్ఘాతము

ఆచార్య 18, సికింద్రాబాద్
మామిడిపూడి వేంకట రంగయ్య, ఎం. ఏ. 5-12-1966

---

గత శతాబ్దపు ఆఖరు భాగములోను, ఈ శతాబ్దంలోను, ఆంధ్రరాష్ట్రం అనేక ఉద్యమాలకు జన్మస్థానంగాను, ప్రధాన కేంద్రంగాను విలసిల్లి భారతఖండ మందంతట పేరు ప్రఖ్యాతులను సంపాదించింది. సంఘంలో ప్రవేశించిన దురాచారాలను రూపుమాపి, సంఘాన్ని సర్వవిధాలా సంస్కరించుటకు ఉద్దేశింపబడిన సంఘ సంస్కరణోద్యమానికి వంగరాష్ట్ర మహారాష్ట్రాలతోపాటు ఆంధ్ర దేశం ముఖ్య కేంద్రం అయింది; గ్రంథాలయ ఉద్యమానికి ఇది జన్మస్థానంగా ప్రఖ్యాతి గాంచినది. భాషా ప్రయుక్త రాష్ట్రాలు పునర్విభజనం కావలసి ఉన్నదనే ఉద్యమం ఇచటనేపుట్టి, క్రమక్రమంగా దేశమందంతటా వ్యాపించింది. పరాయి ప్రభుత్వాన్ని తొలగించి, స్వరాజ్యాన్ని స్థాపించుటకు భారతీయ నాయకులు లేవదీసిన స్వాతంత్ర్య సమరానికి ఇది ఒక ప్రధానరంగం అయింది. పాశ్చాత్య సంస్కృతిలో సన్నిహిత సంబంధం కలిగిన కారణంగా విద్యాధికులలో సన్నగిల్లిన మతవిశ్వాసాలను ఆధ్యాత్మిక చింతనను అభివృద్ధి చేయుటకున్నూ, సర్వమానవ సౌభ్రాతృత్వ ధర్మాన్ని బలపరచుటకున్నూ ఉద్దేశింపబడిన దివ్యజ్ఞాన సమాజం ఆంధ్రదేశాన్ని ఆకర్షించింది. దేశాభిమానాన్ని సేవానురక్తినీ అలవరచుకొనుటకు బాల్యదశయే ప్రధానంగా ఆధారం. అనే సూత్రానుసారంగా స్థాపింపబడిన బాలభటోద్యమం ఆంధ్రలో నాటుకొనగలిగింది. ప్రజలలో ఆధునిక శాస్త్ర విజ్ఞానం స్థాపించుటకును, వారిని విద్యావంతులుగా చేయుటకును మాతృభాషలో పత్రికలను గ్రంథములను ప్రచురించుట ప్రధానం అనే భావం ఇచ్చటనే పుట్టి బహుళ వ్యాప్తి గాంచింది. ఈ అన్ని కారణాలచేత ఆంధ్రదేశపు ఇటీవలి చరిత్ర సర్వవిధాలా మహోజ్జ్వలమైనట్టిదని చెప్పదగియున్నది.

ఏ ఉద్యమంకూడా తనంతట అది బయలుదేరి వృద్ధి గాంచజాలదు. ఉద్యమాన్ని ప్రారంభించేవాడు నడిపించేవాడు మానవుడు. అతని శక్తిసామర్థ్యాలు, తెలివితేటలు, ఉత్సాహము, కార్యదీక్ష,

దాని విజయానికి ప్రధాన సాధనాలు. కాలమహిమ మూలంగాను దేశపరిస్థితులు అనుకూలించడం ద్వారాను ఉద్యమాలు సాఫల్యం చెందగలవనే వాదం ఒకటి లేకపోలేదు. కాని ఇందులో ఎక్కువ సత్యంలేదు. కాలానికి దేశపరిస్థితులకు బలం కల్పించేవాడు మానవుడు. వాటిని మార్చి, తనకు అనుకూలంగా చేసుకోగలశక్తి మానవునికి కలదు.

ఆంధ్రదేశంలో బయలుదేరిన ఇటీవలి కాలపు ఉద్యమాలు ఈ సత్యాన్ని స్పష్టంచేస్తూ ఉన్నాయి. వివిధ రంగాలలో వీరేశలింగంపంతులుగారు, వెంకటరత్నం నాయుడుగారు, కొండా వెంకటప్పయ్యపంతులుగారు, నాళం కృష్ణారావుగారు, కోపల్లె హనుమంతరావుగారు మొదలైన మహానుభావుల కృషి ఫలితంగా - ఈ ఉద్యమాలన్నీ ఫలప్రదంగా కొనసాగగలిగినవి. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు ఈ నాయకుల కోవకు చెందినవారు. అన్ని అభ్యుదయ రంగాలలోను వీరు సలిపిన కృషి అమోఘమై వెలసినది.

బాల్యంలో వీరు వందేమాతరం ఉద్యమంవల్ల ఆకర్షింపబడి దేశాభిమానపూరితులయ్యారు. 1910 లో "ఆంధ్రభారతి" అనే మాసపత్రికను స్థాపించి భాషాసేవ చేయుటకు ఉపక్రమించినారు. తర్వాత రెండు మూడు సంవత్సరాలకు గ్రంథాలయ ఉద్యమాన్ని ప్రారంభించి- ఆ ఉద్యమానికి పితామహులన్న బిరుదాన్ని సార్థకంగా పొందినారు. దానిని ప్రచారంచేయుటకుగాను "గ్రంథాలయ సర్వస్వము" అనే పత్రికను ప్రారంభించి నడిపారు. ఈ ఉద్యమం ద్వారా గ్రామాలలోని వయోజనులలో విద్య వ్యాపించింది. నిరక్షరాస్యులనేకులు అక్షరాస్యులయ్యారు. ఆంధ్రదేశాన్నుంచి ఈ ఉద్యమం భారతఖండమంతటా వ్యాపించింది. అందుకై ఏర్పరచబడిన సంస్థలకు శ్రీ వేంకటరమణయ్యగారు మూలపురుషులయ్యారు. గ్రంథాలయశాస్త్రం వీరి మూలంగా పరిణతిని గాంచింది. దానికి సంబంధించిన విషయాలన్నిటిని ఈ గ్రంథంలో వీరు సమగ్రంగాను, సహేతుకంగాను విపులీకరించారు.

ప్రజాసేవయే శ్రీ వెంకటరమణయ్యగారి ఆదర్శం— అదియే వారిని 1918 లో దివ్యజ్ఞాన సమాజ సభ్యులుగా చేసింది. అదే

కాలంలో శ్రీమతి అనిబిసెంటమ్మగారు అఖిల భారత బాలభటోద్యమాన్ని ప్రారంభించిరి. దాన్నిచే శ్రీ వేంకటరమణయ్య ఆకర్షింపబడి అందులో ప్రవేశించి దానికి కావలసిన ప్రత్యేకమైన తర్ఫీదును పొందినవారై, ఆంధ్రదేశానికంతకూ శాలపట "కమీషనరు" గా సేవ జేసినారు; దాని కవాతు పద్ధతులలోను దుస్తులలోను ఆంధ్ర సంప్రదాయానికి అనుగుణమైన మార్పులను గావించి దాని వ్యాప్తికి విశేషంగా తోడ్పడిరి. దివ్యజ్ఞాన సమాజ సిద్ధాంతములను ఆంధ్రదేశంలో ప్రచారం చేయుటలో వీరు అమోఘమైన కృషి — అప్పటినుండి ఇప్పటివరకును— కావించుచునే యున్నారు.

వీరు అభిమానించిన ఉద్యమాలలో ప్రకృతి జీవనము చికిత్స మరియొకటి. ఇందుకై వీరు అనేక శిబిరములను నడిపి, ఒక "ప్రకృతి ధర్మ పరిషత్తు"ను గూడ స్థాపించినారు. దీనికి సంబంధించిన పత్రికలను నడపసాగారు. ఇదేవిధంగా సహకారోద్యమము పట్ల అభిమానం కలవారై సహకారసంస్థలను కొన్నింటిని స్థాపించినారు. వీరి ప్రజ్ఞ సర్వతోముఖమైనది.

శ్రీ వేంకటరమణయ్యగారు చేసిన విశిష్టమైన గ్రంథాలయ సేవకై, వారిని గౌరవించుటకు 1943 లో గుంటూరు పట్టణమున నాల్గవ ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసభ వైభవోపేతముగా జరిగినది. అప్పుడు ఆ సభకు నేను అలంకరించు భాగ్యమబ్బినది. ఆ సభకు అధ్యక్షత వహించిన శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు చెప్పిన ఈ క్రింది సంగతులు ఎంతయు సమంజసముగ నున్నవి.—

"గడచిన మూడు శతాబ్దములుగ ఏకదీక్షతో ఆంధ్రగ్రంథాలయోద్యమమునకు సేవయొనర్చి, ఆ శాఖయందు ఆదర్శప్రాయమైన జీవితమును నడుపుచున్న శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారికి ఆంధ్రులెల్లరును నిరంతరము కృతజ్ఞులై యుండగలరు. వారు నిర్వహించిన గ్రంథాలయసభలేమి, ప్రదర్శనములేమి, పత్రికలేమి, యాత్రలేమి, ప్రభుత్వ విరాళములను సంపాదించుటకు చేసిన కృషియేమి, గ్రంథాలయ చట్టనిర్మాణమునకు వీరొనర్చిన ప్రయత్నములేమి, గ్రంథాలయ శాస్త్రాభ్యాసమునకు వారు కలుగజేసిన యుత్సాహమేమి, చిరస్మరణీయములు. వారు ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమమునకు చేసిన సేవ అమోఘము."

మరియు, ఆ సభయందే ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు వైస్‌ఛాన్సలరు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు శ్రీ వేంకట

రమణయ్యగారికి ఆంధ్ర ఆంగ్ల సన్మానసంచికలను బహూకరించుచు చెప్పిన సంగతులు శ్రీవారి ప్రతిభను ఇనుమడించుచున్నవి:—

"శ్రీ వేంకటరమణయ్యగారు గ్రంథాలయోద్యమమునకు చేసిన సేవ అసామాన్యమైనది. వారు చిన్ననాటినుండియు గ్రంథాలయ సేవయందే నిమగ్నులై వారి జీవితమంతయు దానికే ధారవోసిరి. వారికి వెన్నతోబెట్టిన విద్యయే యది. వారు నిజముగ గ్రంథాలయోద్యమ పితామహ బిరుదమున కెంతయో తగియున్నారు. ఇట్టి మహనీయులను సన్మానించుటకు నన్ను నిమిత్తమాత్రముగ నియమించుట నా యదృష్టము. ఈ భాగ్యము నాకు గలుగుట నేను వారికిచేయు గౌరవముకంటె గౌరవము ఇనుమడించె నని భావించుచున్నాను."

ఇప్పటికి వీరి వయస్సు 77 సంవత్సరములు; కాని వీరి ఉత్సాహం, కార్యదీక్ష, సేవాతత్పరత- ఎలాంటి మార్పు చెందక, యథాపూర్వంగా విభాసిస్తున్నవి.

వీరు గత అర్థ శతాబ్దంలో ఎన్నో వ్యాసాలు వ్రాశారు, ఎన్నో ప్రసంగాలు చేశారు; తోడి మానవులకు ఎన్నో సందేశాలు ఒసంగినారు; ఇవి యన్నియు అనుభవ పూర్వకములు— వీటిని గ్రంథస్థం చేయువలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈ అవసరాన్ని మిత్రులు కొందరు గ్రహించి, దానిని తీర్చుటకు వీరి రచనల నన్నింటిని, వీరి కార్యరంగ ములలో సంపాదించిన "సరంజామును" వంతటినీ కొన్ని సంపుటాలుగా ప్రచురించుటకు సిద్ధపడ్డారు. వాటిలో ఇది "గ్రంథాలయ జ్యోతి" అనే ప్రథమ సంపుటము.

శ్రీ వేంకటరమణయ్యగారితో నాకు పరిచయం 50 సంవత్సరాలనాడు కలిగింది. వారు స్థాపించిన శ్రీ రామమోహన గ్రంథాలయ అధ్వర్యాన నేను 1920 లో అర్థశాస్త్రానికి సంబంధించిన ఆరు ఉపన్యాసాలను చేశాను. నాటి మొదలు మా యిద్దరిమధ్య ఏర్పడ్డ స్నేహం దినదిన ప్రవర్ధమానమైనది. మే మిద్దరము దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులము. మాది భ్రాతృవాత్సల్యము. శ్రీ వారి కీర్తి ప్రతిష్ఠలకు స్థిరత్వమును కల్పించగల ఈ "గ్రంథాలయ జ్యోతి"సంపుటానికి ఉపోద్ఘాతము వ్రాయుట నాకు మహాభాగ్యమనిభావించుచున్నాను.

నా మిత్రుడు, నా సోదరుడు అయిన శ్రీ వేంకటరమణయ్య శతవర్షకాలము జీవించి సేవాతత్పరత యందు నిమగ్నులై ప్రజల ఆదరాభిమానములకు లక్ష్యమై వర్ధిల్లుగాక!

—మామిడిపూడి వేంకటరంగయ్య

# పీఠిక

కోదాటి నారాయణరావు బి. ఏ., బి. ఎల్.   వినయకుటీరం,
అధ్యక్షులు: ఆంధ్రప్రదేశ గ్రంథాలయ సంఘం,   చిక్కడపల్లి, హైద్రాబాదు,
4-12-1966.

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ పితామహులు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి వ్యాసావళిని ఏరి, కూర్చి, ప్రచురించ సంకల్పించడమూ, అందులో గ్రంథాలయోద్యమానికి సంబంధించిన వ్యాసాలే తొలుత వెలువడడమూ చాలా సముచితమైన కార్యము. ఇందుకు సరస్వతీ సామ్రాజ్య నిర్వాహకులను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ధన్యజీవి :

శ్రీ వేంకటరమణయ్యగారు ధన్యజీవి. ఆంధ్రదేశంలో కొమ్ములు దిరిగిన రాజకీయ మహానాయకులలో చాలమందికంటె కూడ ఆయన అదృష్టవంతుడు. రాజకీయ నాయకులతో ఎందుకు పోలుస్తున్నానంటే. ఈ యుగంలో దానికి చలామణి ఎక్కువవున్నది గనుకనూ, అది పూర్వము ఇప్పుడు కూడా ఏ కారణము వల్లనైతే నేమి - ఎక్కువ ఆకర్షిస్తున్నది గనుకనూ; స్వర్గీయులైన శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ఒకసారి అన్నారు: "రాజకీయంలో వచ్చిన కీర్తిప్రతిష్ఠలు నీటిపైన వ్రాసిన పేరువంటిది" అని. అది అక్షరాలా సత్యమనిపిస్తుంది. ఒకానొక కాలంలో దేశం అంతటా మారుమ్రోగిన రాజకీయ మహానాయకుల పేర్లు ఈనాడు ఏ కొందరు పాతవారికో తప్ప ఎవరికీ తెలియవు. పేర్లుకూడా ఎత్తి చూపగలను గాని, అది సమంజసము కాదనుకుంటాను. ఈ విధంగా ప్రాణాలు సహా సర్వస్వం త్యాగంచేసిన రాజకీయయోధుల పేర్లనే జనం మరచిపోతే, మూడునాళ్ళ ముచ్చటగా పదవుల ప్రాబల్యంవల్ల వచ్చిన అల్పప్రతిష్ఠలమాట చెప్పవలెనా? "అధికారాంతమునందు చూడవలెగదా ఆ యయ్య సౌభాగ్యముల్" అనే నానుడి ప్రత్యక్షంగా మనము చూస్తూనే వున్నాము.

అయితే వేంకటరమణయ్యగారి జీవితం ధన్యమని నేను చెప్పటానికి కారణమేమిటంటారేమో! అర్థశతాబ్దానికి పూర్వం, ఆయనా మరికొందరు సహచరులూ కలిసి నెలకొల్పిన ఒక చిన్న ఉద్యమము గ్రంథాలయోద్యమం — ఆ నాటికీ ఈ నాటికీ, పటాటోపం, ఆడంబరం లేకుండా సాగిపోతూనే ఉన్నది. ఈ అర్థశతాబ్దంలో దేశంలో వచ్చిన ప్రబలమైన పరివర్తన ధాటి దీనిమీద ఏమీ దెబ్బతీయలేదు; సరిగదా, దానివల్ల పుష్టిచెంది, అడపాతడపా దానికి కొంత ఊపుగూడా ఇచ్చి కృతజ్ఞత చూపినాయి.

ఉద్యమ సారథులు :

ఏదోరూపంలో మన ఈ గ్రంథాలయోద్యమం, మన ఊహాలకందని కాలంవరకు సాగుతూనే వుంటుదనటంలో సందేహం లేదు. ఈ విధంగా ఒక ఉద్యమం అవిచ్ఛిన్నంగా కొన్ని శతాబ్దాలవరకు సాగగలగడమూ, ఆ ఉద్యమంపేరు వినగానే "అయ్యంకి" వారిపేరు స్ఫురించడమూ — ఇంతకంటే ధన్యత మరేమి కావలె! అర్థశతాబ్దానికి పైగా అవిచ్ఛిన్నంగా నడచిన ఈ ఉద్యమ చరిత్రలో ఎన్నదగినవారు ఎందరో మహానుభావులు కలరు; అయితే ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు కార్యదర్శులనంటే, ఉద్యమసారథులనంటే — ఇద్దరే ఇద్దరు కలరు. వారిలో ఒకరు అయ్యంకి వేంకటరమణయ్య గారు. రెండవవారు పాతూరి నాగభూషణంగారు. మొదటివారు దాదాపు పాతికేళ్ళు సారథ్యం వహిస్తే తరువాత రెండవవారు అంతకు ఎక్కువకాలంగానే పగ్గాలు పట్టుకొని రథాన్ని నడిపిస్తున్నారు. మొదటివారు ప్రచార దుందుభులు మ్రోగించి విజ్ఞాన వాతావరణాన్ని సిద్ధబరుస్తే, రెండవవారు సౌధాలు నిర్మించి అన్ని హంగులు సమకూర్చి ఉద్యమాన్ని సర్వాంగశోభితం చేస్తున్నారు.

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, తాను స్థాపించిన ఉద్యమం తన తరువాత, అదీ తన జీవితకాలంలోనే, మరొకరు చేపట్టి, దీటుతో ముందుకు తీసుకొనిపోవడం ఆంధ్రప్రజాసేవారంగంలో అపరూపమైన దృశ్యం. సమర్థుడనిపించుకున్న పుత్రుని చూస్తే తండ్రికి కలిగే పుత్రోత్సాహానికి మించిన ఆనందం — ఈ

ఉద్యమాన్ని, దాని నిర్వాహకులను - ముఖ్యంగా నాగభూషణం గారిని చూస్తే కలుగుతున్నది శ్రీ వేంకటరమణయ్యగారికి. "నాగభూషణం మా అబ్బాయి" అని శ్రీ వేంకటరమణయ్యగారు పొంగిపోతూ మాట్లాడడం అనేక సంభాషణలలో నేనే విన్నాను; ఇంతకన్న శ్రీ వేంకటరమణయ్యగారి ధన్యజీవితానికి నిదర్శనం ఏమి కావాలి !

పితామహులు :

ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి యదార్థానికి జనకులు శ్రీ వేంకటరమణయ్య పంతులుగారు. ఇలా ఆదిపురుషులవటం చేతను, ఆయన తరువాత మరొకరు ఆ ఉద్యమాన్ని బిడ్డగా సాకుతున్నారు గనుకను - శ్రీ వేంకటరమణయ్యగారికి ఆంధ్రలోకం గ్రంథాలయోద్యమ పితామహులని బిరుదిచ్చి సత్కరించింది. ప్రజాస్వామ్య యుగంలో ప్రజల మాటలను కాదనగల హక్కు అధికారము ఎవరికీ లేదు. ముమ్మాటికీ ఆయన గ్రంథాలయోద్యమ పితామహులే; ఆంధ్రదేశంలోనే కాదు, భారతదేశమంతటా గ్రంథాలయోద్యమం ఇంకా శాఖోపశాఖలుగా విస్తరిల్లి, చిరకాలం మనగలదనుటలో సందేహం లేదు.

ఆంధ్రగ్రంథాలయోద్యమ చరిత్ర వ్రాసినప్పుడు హరిః ఓం అని అయ్యంకి వేంకటరమణయ్యగారి పేరును చదువుతాము. అంతే కాదు. భారత గ్రంథాలయోద్యమ చరిత్ర యథావిధిగా వ్రాయడం జరిగినప్పుడు, అందులోనూ వేంకటరమణయ్యగారి పేరు అనేక పుటలపైన స్వర్ణాక్షరాలలో వుంటుంది. ఇంకొక్క మాట. వెంకటరమణయ్యగారి జీవితమంతటికీ మణిమకుటాయమానంగా వెలిగేది గ్రంథాలయోద్యమం; వారి జీవితానికి అదే ధన్యత్వం చేకూర్చి పెట్టింది.

ఆయన అనేక రంగాలలో పనిచేశారు. రాజకీయరంగాన్ని వదలిపెట్టలేదు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి "చాటువు"లోకి కూడా ఎక్కారు. బాలభటోద్యమం, దవ్యదానోద్యమం, ప్రకృతి జీవనోద్యమాల్లోనూ ఆయన ఎంతో శ్రమపడి

సేవచేశారు. అయినప్పటికీ గ్రంథాలయోద్యమాన్ని వీటి అన్నింటికీ తలమానికంగానే రూపొందించారు.

గ్రంథ పరిశంస :

ఇక గ్రంథ పరిశంస : ఈ గ్రంథము వివిధ సమయాలలో విభిన్న సందర్భాలను పురస్కరించుకొని అందుకు అనుగుణ్యంగా వ్రాసిన వ్యాససంకలనం. ముఖ్యంగా, చాలామటుకు ప్రచారార్థం వ్రాసినవి; ఈవిషయాన్ని దృష్టిలో పెట్టుకొని చదువుతే ఈ గ్రంథం లోని ప్రాశస్త్యం బోధపడుతుంది. ఈ గ్రంథసంపుటిలోని మొదటి వ్యాసం "ధర్మగ్రంథాలయములు - నిర్వహణము" సావధానంగా చదివితే, గ్రంథాలయోద్యమం ద్వారా "అయ్యంకి" వారి హృదయాన్ని - అందులోని ఆశలను - ఆకాంక్షలను స్పష్టంగా చూస్తాము. ఆయన మాటలలోనే ఆయన హృదయస్పందనను చూడండి: "గ్రామోద్ధరణకు పునాది సరస్వతీదేవి ఆలయం. దీనినే ధర్మగ్రంథాలయ మందిర మందురు. జనసామాన్యమంతయు కూడా విద్యావంతులు, జ్ఞానవంతులు అయియుండవలెను ...... ఆమె (విద్యాధిదేవత) దయను సంపాదించుటకు మన మిపుడు ఘోర తపస్సును చేయవలసి యున్నది. ఈ తపస్సును చేయుటకు నిర్జనప్రదేశములకు గాని, కొండగుహాలకుగాని పోనక్కరలేదు. మన మున్న గ్రామములయం దెల్ల సరస్వతీదేవి ఆలయములను నిర్మించుకొన్న చాలును." అయ్యంకి వారి హృదయం జనసామాన్యంలోని అవిద్యను చూచి ద్రవించింది. గ్రంథాలయోద్యమం ద్వారా ఆయన ఆరాధించింది గ్రామీణులైన నిరుపేద మనిషిని. మరోకమాటలో చెప్పవలెనంటే సమాజంలోని చివర మనిషికూడా విద్యావంతుడు మాత్రమే కాదు జ్ఞానవంతుడున్నూ కావలెనని వేంకటరమణయ్యగారి ఆకాంక్ష. అదే వ్యాసంలో "గ్రంథాలయము యొక్క ఉపయోగ మెవ్వరికి" అనే శీర్షికను చదివితే పిల్లలకు - పెద్దలకు - స్త్రీలకు - అక్షరాలువచ్చిన వారికి - చివరకు రాని వారికి _ అందరికీ నంటారు. గ్రామీణ పాటక జనాన్ని ఆత్మీయులుగా భావించుకోవలెనని, వారి సుఖదుఃఖాలలో

పాలు పంచుకొని వారి వాంఛలను తెలుసుకొని, అందుకు అనుగుణ్యంగా ఉద్యమ మార్గాన్ని రూపొందించుకోవలె నంటారు. ఇది అపామాషీ కాదని హెచ్చరించి "జీవితమునంతను ధారబోసి చేయవలసిన మహాత్కార్య"మని హెచ్చరించారు. ఉద్యమాన్ని జనాకర్షకంగా చేయటానికి తమ అనుభవాలతో పాటు ఇతరుల అనుభవాలు ఎన్నో చెప్పారు. ఈ వ్యాసంలో గ్రంథభాండాగారిని గురించి వారు వ్రాసిన వాక్యాలు చదివితీరవలసినవి. వేంకటరమణయ్యగారి దృష్టిలో గ్రంథభాండాగారి ఆదర్శమైన ప్రజాసేవకుడు. ఒకవిధంగా గీతలో చెప్పిన స్థితప్రజ్ఞుడు. ఎందులోనూ పండితుడు కాకున్నమానె ప్రపంచ పారమార్థికాలైన అన్ని విషయాలలోను ప్రవేశమైనా వుండవలె. ఇట్టి గ్రంథభాండాగారులను సిద్ధపరచవలెననే మహదాశయంతో ఆయన ఉద్యమాన్ని నెలకొల్పి ముందుకు నడిపించారు. అయితే ఈ దృష్టిలో నేడు గ్రంథభాండాగార వృత్తియందున్న వారిని పోల్చిచూడరాదు. అట్లా చూస్తే ఒకవిధంగా ఆశాభంగమే కలుగుతుంది. స్వరాజ్యం రాగానే రామరాజ్యం నెలకొంటుందని ఆశించిన వారికి ఆశాభంగము కలగటము లేదా మరి! ఆ కాంక్షకూ ఫలితానికీ, ఆదర్శానికీ వాస్తవికతకూ ఉండే తేడా ఉండనే వుంటుంది. వేంకటరమణయ్యగారి గ్రంథభాండాగారి సేవాధర్మపరాయణుడు. నేటి గ్రంథభాండాగారి వృత్తివ్యాపారి. మొత్తం పుస్తకానికి ఈ వ్యాసమే బీజప్రాయము. తరువాత చెప్పుకోతగింది "ఆంధ్ర గ్రంథాలయోద్యమం - సింహావలోకనం" అనేది. దీనిలో ఆంధ్ర గ్రంథాలయోద్యమం దేనికీ అనుకరణ కాదని, స్వయంభువని నిరూపించారు. ఒక వేళ స్ఫూర్తిని పొందితే బరోడా ఉద్యమమునుండి పొందియుండవచ్చును. అయినా ఇది దానికి నకలు కాదు. ఇది స్వతంత్రోద్యమం. ఆంధ్రుల ఇంటి ఆడపడుచు. ఈ విషయాన్ని ఉద్యమ ప్రచారకులమంతా చెప్పుతూనే వున్నప్పటికి, "రమణయ్య"గారి ఉల్లేఖన చూపిస్తే అది ప్రామాణికం అవుతుంది. లోకం చూపులో అనుకరణకు అనుసరణకు పేరుపొందిన ఆంధ్రులకు తమది అని చెప్పుకోతగిన ఒక ఉద్యమం వున్నదన్నప్పుడు గర్వకారణం

గాదూ ! ఈ వ్యాసములో మనకు తెలియని అనేక చారిత్రికాంశాలు, అందులో మనను ఇతర ప్రాంతాలవారు సెబాస్ అన్న సందర్భాలు, అనేకం గోచరిస్తాయి. గ్రంథాలయోద్యమాసక్తి పరులే కాకుండా, ఆంధ్రుల సార్వజనిక జీవితాన్ని గురించి పరిశీలించ దలచిన ప్రతివారు చదవవలసిన దీ వ్యాసం -

"ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ ప్రగతి - గ్రంథాలయచట్టమున చేయువలసిన మార్పులు" అనే వ్యాసములో ఈ నాటి ఉద్యమాన్ని గురించి వేంకటరమణయ్యగారి అభిప్రాయాలు స్థూలంగా కనుపిస్తవి. ఒక ముఖ్యాంశము ఇందు గమనించవలసి యున్నది. "లోకల్ లైబ్రరీ అథారిటీలు" ఎంత అవిరళంగా కృషి చేసినా, సార్వజనిక గ్రంథాలయాల అవసరం ఇప్పట్లో తీరదనేది : అయితే ఈ సార్వజనిక గ్రంథాలయాలకు ప్రభుత్వమూ, లోకల్ లైబ్రరీ అథారిటీలు కూడా తగిన ప్రాధాన్యం కలిగించటము లేదు. పైగా కార్యకర్తలలో నిరుత్సాహం కలగటానికి పరిస్థితులు తోడ్పడుతున్నవి. ఈ రెండు రీతుల గ్రంథాలయాలలో సమన్వయము కలిగించుట గ్రంథాలయ సేవకుల కర్తవ్యమని హెచ్చరించారు.

మరొక వ్యాసం. "ఈడు ముదిరినవారి విద్యాభివృద్ధికి మార్గములు." ఈ వ్యాసంలో గ్రంథాలయాలకు వయోజన విద్యకుగల సంబంధాన్ని దజ్ఞాత్రంగా సూచించారు. ఇప్పటికీ ఈ స్థితి మారలేదు. ప్రభుత్వం గ్రంథాలయ శాఖలో వయోజన విద్యను పుస్తకాల రిజిస్ట్రేషనునూ జోడించి, ఒక ప్రత్యేక డైరెక్టరును వేసిన గాని ఈ సమస్య పరిష్కారం కాదు.

"నా బరోడా యాత్ర" అనే వ్యాసం "బరోడా రాజ్యంలో ఆనాడు "శాయాజీరావు గాయక్వాడ్" నెలకొల్పిన గ్రంథాలయ ప్రణాళికలను గూర్చి మనకు స్పష్టమైన చిత్రాన్ని చూపిస్తుంది. అట్లే చిరస్మరణీయమైన స్వర్గశ్రీ "కుడాల్కరు" యొక్క సేవాదీక్షను తెలుపుతుంది మరొక వ్యాసం -

"ప్రాచీన భారత గ్రంథాలయాలు" అనే వ్యాసం వలన మన దేశమున సారస్వత ఐశ్వర్యమును పరిరక్షించుటకు అచ్చు ఆఫీసులు లేని ఆ కాలమున ఎట్టి పరిశ్రమ చేసినదియు బోధపడగలదు.

"గ్రంథాలయ యాత్రలు" అనేది ముఖ్యంగా చదువవలసిన ఇంకొక వ్యాసము. ఆ నాడు ఉద్యమ ప్రచార విధానాలు దీనివల్ల తేటపడగలవు. ప్రాచీన సాంప్రదాయికమైన "రామదండు" ఈ యాత్రకు స్ఫూర్తిని కలిగించుటను తెలుసుకోదగిన విషయము. నిజానికి వేంకటరమణయ్యగారి కీర్తికి ప్రతిష్ఠకు ప్రథమసోపానం ఈ యాత్రలే యని నా అభిప్రాయము. వీటివల్లనే వారిపేరు దేశంలోని మూలమూలలకు ప్రాకింది

"గ్రంథాలయ శాస్త్రం" అనే మరొక అధ్యాయాన్ని చదివితే మన ఉద్యమము గ్రంథాలయ శాస్త్రాభ్యాసము శిక్షణా అనే విషయాలలో కూడ — అన్ని విషయాలలో వలెనే అగ్రగామిగా ఉన్నదని తెలుస్తుంది. తెలుగు పుస్తకాల వర్గీకరణానికి చిరకాలంగా (1924 నుండి) జరిగిన కృషి కూడా తెలుస్తుంది. మన ఉద్యమం [illegible] అవలంబించటంలో ఎన్నడూ వెనుకబడలేదు; పైగా [illegible] విస్మరించలేదు కూడాను.

వేంకటరమణయ్యగారు కార్మికులను కూడా జ్ఞాపకం పెట్టుకొన్నారు. గ్రంథాలయములు కార్మికులకు చేయదగిన ప్రత్యేకమైన సేవను గూర్చి ఒక వ్యాసంలో ఉదాహరణలతో వివరించి చెప్పారు.

ఈ విధంగా కొన్ని ముఖ్యవ్యాసాలను, వాటి ప్రాశస్త్యాన్ని స్థాలీపులాకంగా ఎత్తిచూపించాను. మిగతా వ్యాసాలున్నూ గ్రంథాలయ ఉద్యమాభిమానులు నేడు కూడా చదువదగ్గవే.

ఈ సంపుటి ఈనాటికైనా వెలువడటం గ్రంథాలయ ఉద్యమాభిమానులందరికీ హర్షదాయకమైన విషయం.

స్వీయచరిత్ర :

వేంకటరమణయ్యగారు ఈ ఉద్యమం కొరకు పడ్డ కష్టాలు నష్టాలు, ఆయన సహచరులు, వారు ఉద్యమానికి ఇచ్చిన చేయూత పొందిన సాఫల్య వైఫల్యాలు - వివిధ ఘట్టాలలోను అనేకమంది,

వ్యక్తులతోను పొందిన అనుభవాలు - ఇతర ఉద్యమాలలో ఆయన కృషి - అన్నీ మనకు తెలిస్తే, గ్రంథాలయోద్యమ చరిత్రకు ప్రధాన ఘట్టం దొరుకుతుంది. అందుచేత వారు స్వీయచరిత్రనుకూడ వ్రాయమని కోరుతున్నాను. వారు పూర్తి ఆరోగ్యంతో ఉన్నప్పుడే దాన్ని పూర్తిచేసి లోకానికి అర్పించవలసి యున్నది. ఆంధ్ర నాయకులలో ఎక్కువమంది ఆత్మకథలను వ్రాయలేదు. అందుచేత వెన్వెంటనే పూనుకొవలసిందిగా వేంకటరమణయ్యగారికి నా వినయపూర్వకమైన ప్రార్థన.

ఈ పీ ఠి క :

నేను ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ గ్రంథాలయ సంఘానికి అధ్యక్షుణ్ణి కావటం వల్లనో - లేక నా యందుగల వాత్సల్యం వల్లనో నన్ను ఈ పుస్తకానికి పీఠిక వ్రాయవలసిందిగా ఆదేశించారు వేంకటరమణయ్యగారు. వారు ఆంధ్ర గ్రంథాలయోద్యమ పితామహులు. నేను కాకతాళీయంగానే అధ్యక్షుణ్ణి; అయినప్పటికీ ఆంధ్ర ప్రదేశ గ్రంథాలయ సంఘానికి అనుజుణ్ణి, అంటే ఈ సంఘం స్థాపించిన కొన్ని నెలల తరువాత నేను పుట్టాను; వయస్సులో వెంకటరమణయ్యగారు నాకు పితృసమానులయినా, వారిలో తాత మనుమలమైనాము. తాతగారి పుస్తకానికి మనుమడు పీఠిక వ్రాయడం ఉభయులకు గౌరవదాయకమే.

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు కనుపరిచిన వాత్సల్యానికి అమితంగా కృతజ్ఞుణ్ణి

శ్రీ వేంకటరమణయ్యగారికి దీర్ఘ ఆయురారోగ్యాలను ప్రసాదించి, వారిచే అనేక రచనలను అందేభాగ్యం ఆంధ్రలోకానికి, వారి ఆశీస్సులను నిరంతరం పొందేభాగ్యం గ్రంథాలయోద్యమానికి - ముఖ్యంగా ఆంధ్రప్రదేశ గ్రంథాలయ సంఘానికీ, గ్రంథాలయ సేవకులకు లభింపచేయ వలసినదిగా పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

—కోదాటి నారాయణరావు

ఆంధ్రప్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షుడు

# సరస్వతీదేవి



శ్లో॥ పరబ్రహ్మాత్మికాం దేవీం
భుక్తి ముక్తి ఫలప్రదామ్
ప్రణమ్య స్తౌమితామేవ
జ్ఞానశక్తిం సరస్వతీమ్.

— తల్లాప్రగడ సూర్యనారాయణరావు, 1934.

# సరస్వతీ దేవి స్తుతి



శ్లో. యా కుందేందు తుషార హార ధవళా యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణా వర దండ మండిత కరా యా శ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభి ర్దేవై స్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా.

శ్లో. సరస్వతీం సమాశ్రయే సరోజ పీఠ వాసినీం
సదా సదాదరాం ముదా సరోజ పీఠ గేహినీం
సువీణయాఽక్షమాలయా సుపుస్తకేన శోభినీం
సురేంద్ర బృంద వందితాం సుధాకరావతంసినీం



కమాసు రాగః] సరస్వతీ కృతిః [ఆదితాళం

సేవేసేవే, దేవి సరస్వతి, సేవేసేవే
తవ పద మహ మిహ, సేవేసేవే, సం.

౧. సేవక జనతా – దైవత భూజం
దేవ నుతం నిఖి – లార్థసుబీజం, ॥సేవేసేవే॥

౨. మాధవ భగవతి – మహాసరస్వతి
సోమ వతంసిని – సుగుణ విలాసిని ॥సేవేసేవే॥

౩. జప వర పుస్తక – సద్వీణాఢ్యే!
కృపయావహమాం – కృతిరత్నాఢ్యే ॥సేవేసేవే॥

గ్రంథాలయ సర్వస్వము; సంపుటము 9; సంచిక 1; 1934



# సరస్వతీ సామ్రాజ్యము

## సృష్ట్యాది

నిరాకారుడు, నిరంజనుడు, నిర్వికారుడు
సచ్చిదానందాత్మకమునునైన పరబ్రహ్మ

అనేకం కావలయునని సంకల్పించినాడు;
అపుడు, ప్రథమమున

నాదము - (ధ్వని) గా - శబ్దముగా విస్తరించినది.
ఆ శబ్దమే "ఓం" కారము

ఆ "ఓం" కారమే సమస్త చరాచర ప్రపంచమంతయు గా
నైనది.

## మహా సరస్వతి

వాయువునకు తేజమునకు అతీతమైన అనంత మార్గముననే నాదమున్నది. అదియే మహాసరస్వతీ సామ్రాజ్యము - రసమయి-స్వరమయి-అది నిత్యము, అపౌరుషేయము; సకల సృష్టికి మూలము.

## సరస్వతీ స్వరూపము

సృష్టి వికాసమంతయు తేజోమయము. తేజోమయమే వాక్కు; సరస్వతీరూపము వాగ్రూపము, వాగీశ్వరీ మహాతేజస్సు విశ్వవిశ్వములో ప్రతి అణువునందు నిండియున్నది. అన్నింటికి అదియే స్పందమును ప్రసాదించుచున్నది.

సరస్వతి రస స్వరూపమున బ్రసరించు తత్వము గలది. అట్లు ప్రసరించిన సరస్వతి ప్రపంచ రూపమైనది; విశ్వాకృతిగా సరస్వతి గోచరించును; శబ్దాకృతిగా వినిపించును; అక్షరాకృతిగా ప్రసరించును.

సరస్వతీ స్వరూపము మనకు విశ్వవాఙ్మయ స్వరూపమున సాక్షాత్కరించుచున్నది.

విశ్వోద్గతికిని, విశ్వస్థితికిని, విశ్వకళ్యాణమునకును మూలకందమైనది సరస్వతీ వైభవమే.

"శబ్దబ్రహ్మ"మని ప్రాచ్యసంస్కృతియందును, "లోగస్"అని ప్రతీచీ సంస్కృతియందును పేర్కొనబడు మహాశక్తియే సరస్వతి. చతుర్విధ పురుషార్థ సాధనకు సరస్వతీదేవి ఆరాధనమే శరణ్యము.



## నా ద ము

నాదము సర్వశబ్దములకు ఉత్పత్తిహేతువు. కూడలి. అన్ని శబ్దములు ఇందుండియే జనించును. అన్నిశబ్దములు అవ్యక్తముగ ఇందున్నవి. దాని స్వరూపము అవ్యాహతము, అనాహత స్వభావము - దాని స్వరూపమునకు నాశములేదు. నాదబ్రహ్మాంకురమైన ఈ రహః స్వార్గము వ్యక్తమయినదనుట, సర్వవర్ణావిర్భావ బీజ మభివ్యక్తమని తాత్పర్యము. అట్లు వెలువడిన నాదాత్మకమైన ధ్వని "పరా-పశ్యంతీ-మధ్యమా-వైఖరీ" రూపమున, నాలుగు విధములు.

పరావాక్కు : మూలాధారమున జనించును. ఇదియే శబ్దబ్రహ్మ. వాక్కుల కిది మూలము.

పశ్యంతీవాక్కు : ఇది నాభీగతము.

మధ్యమావాక్కు : మనలో మన మూహింపగలిగి హృదయగతమై ఉపచేతనలో భాసించును.

వైఖరీవాక్కు : ఇతరులు వినుటకు శక్యమై ముఖనిర్గతమై బహిశ్చేతనలో గోచరమగును.

ప్రాణశక్తి ప్రేరితమై వెలువడు వాక్కు కంఠ-తాలు-మూర్ధ-ఓష్ఠము లందు వ్యక్తమై నానారూప మయినది.

## "ఓం" కా ర ము

"ఓం"కారము అకార- ఉకార- మకారముల కలయిక మొదటిభాగ మగు "అ"కారము నాలుక యొక్కగాని, అంగిలి యొక్కగాని, యే భాగమువలనను నుచ్చరింపబడనిదై, ఓంకారము నకు బీజమైయున్నది; "మ"కారము కడపటిదై, మూయుబడిన పెదవు లచే నుచ్చరింపబడుచున్నది; "ఉ"కారము నోటియందలి శబ్దోచ్చా రణ ఫలమున మూలభాగమునుండి అంత్యభాగము వరకును దొరలు చున్నది; ఇట్లు ఓంకారము శబ్దోచ్చారణ ప్రక్రియ నంతను చూపు చున్నది.

శక్తి,- పదార్థము- ఓంకారము యొక్క స్వరూపములే.

సృష్టియంతయు చేతనశక్తి- పదార్థము - అని రెండు రూప ములుగ వ్యక్తమగుచున్నదిగదా ! ఆ రెంటును "ఓం" కార స్వరూపములే యైయున్నవి. ఆ ఓంకార రూపమగు శక్తియే ఘనీభవించిన స్థితిలో "ఓం"కార స్వరూపమగు పదార్థముగా వ్యక్త మగుచున్నది. అనగా శక్తి - పదార్థము- "ఓం" కారము యొక్క రెండు స్థితి గతులు మాత్రమే.

"భూః" అను శబ్దోచ్చారణము చేతనే భూమి ఉత్పన్న మైనది.

## స ర స్వ తీ సా మ్రా జ్య ము

సమస్త పుస్తకముల స్వరూపమును ధరించి, పుస్తకమును చేతబూని, వీణను మీటు సకలవేదశాస్త్ర సరస సాహిత్య సంగీత మున కధిదైవతమగు సరస్వతి సకలలోక జనని: పరాశక్తి: ఆమె యొక్క ఆరాధనమే సరస్వతీ సామ్రాజ్యవైభవము.

క్రైస్తవుల మతగ్రంథమయిన బైబులునందు సృష్ట్యాది ఇట్లు తెలుపబడినది:—

"ఆదియందు శబ్ద మున్నది-
ఆ శబ్దము దేవునియం దున్నది.
ఆ శబ్దమే దేవుడు"- బైబిలు.

**In The begining was the Word**
**And The Word is with God**
**And the word is God - Bible.**



# సరస్వతీ సామ్రాజ్యము
# సర్వులకు ఎట్లు సేవ్యమగును!

1. ధ్యేయము .

౧. వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో జ్ఞానము కూడ అట్లు స్వాధీనము కావలయును.

౨. ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో జ్ఞానముకూడ అట్లు సేవ్యమై యుండవలయును.

3. సూర్యచంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో జ్ఞానముకూడ అట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును.

2. ఉద్దేశములు :

౧. భౌతిక - ఆధ్యాత్మిక విద్యలను సమశ్రుతిలో మేళవించుటకు తగు సాధనములను అన్వేషించుట.

౨. మానవకోటియొక్క ఉద్ధరణకు ఉత్తమమైనట్టియు నవీనమైనట్టియు మార్గములను నెలకొల్పుట.

3. శాస్త్రీయమైనట్టియు- సాంస్కృతికమైనట్టియు, ఉద్యమములను విస్తృత మొనర్చుట.

౪. సార్వజనీనికమైన విద్యామూలమున సమైక్యతను సాధించి విశ్వమానవ శాంతికి భద్రతకు దోహదము చేయు సజీవ శక్తిని చేకూర్చుట.

3. ఆదర్శము :

సరస్వతీవైభవమును విశ్వవ్యాప్త మొనరించి, ప్రపంచములోని సర్వమానవులకు సులభసాధ్య మొనరించుట.

4. సాధనము :

గ్రంథాలయమే సరస్వతీ సామ్రాజ్యము; సార్వజనిక గ్రంథాలయమే సార్వజనిక విశ్వవిద్యాలయము. అది అందరికిని విజ్ఞానమును ప్రజ్ఞానమును ప్రసాదింపవలయును.

5. ఫలశ్రుతి :

ఎంత చిన్నదానినైనను- ప్రతి మానవుడు ఒక స్వంత గ్రంథాలయమును గలిగియుండి, తానే సజీవ సంస్కృతీ నిలయమై వెలయవలయును.



# విజ్ఞప్తి

## తొలి వెలుగు

భారతీయ యువకుల హృదయమున ఈ శతాబ్దారంభమున అపూర్వ చైతన్యలహరి ప్రవహించెను. "కర్జన్" ప్రభువు కాలమున బ్రిటిష్ సింహము భయంకరముగ గర్జించెను. వంగసీమ హృదయమును చీల్చుటకై అతడు సమకట్టెను. ఈ యత్నము భారతీయుల హృదయమున అపూర్వ సంచలనమును బుట్టించెను.

భారతీయతకు భంగ మాపాదించు ఉద్యమమును శ్రీ వేంకటరమణుడు సహింపజాలడు. మత ధర్మాదర్శములందు విశ్వ జనీన భావము స్వభావసహజమయినను, భారతీయతా భావభారము కల శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య హృదయమున అపూర్వ సంచలనము కలిగినది. పూర్వసంవేదనమును సమరసముగా నందుకొనినది.

దేశమందలి వక్తలును, రచయితలును, త్యాగులును నూతన జీవిత సందేశము లొసగుచు యువకులకు జ్ఞానభిక్ష పెట్టిరి. తమ తమ మణికట్టులకు దీక్షాసూత్రములను కట్టుకొని యువకులు యజ్ఞవాటిక యందు ప్రవేశించిరి. దేశమాతసేవకై సర్వశక్తులను వినియోగింప వీరు కృతనిశ్చయులైరి.

నిత్య విద్యార్థియయిన శ్రీ వేంకటరమణయ్య వక్తయై, రచయితయై, త్యాగియై నవ సందేశములను నవాదేశములను అందుకొని యందరకు నందించెను. దీక్షాకంకణము ధరించెను, ధరింపజేసెను.

లాల్—బాల్—పాల్ (లాలా లజపతిరాయి, బాలగంగాధర తిలక్— బిపినచంద్రపాల్) మహాశయుల గంభీరభాషణములకు వీను లొగ్గియు, అరవింద ప్రభృతుల రచనలందలి భావబ్రహ్మాండముల నవలోకించియు, వీరపూజ తమ నైసర్గికగుణమగుడు శ్రీ వేంకట

రమణయ్య భారతవీరుల సముజ్జ్వల జీవితములను మేలుబంతు లొనరించుకొని, భాస్వదాశయజ్యోతిర్జ్యోతిర్లీలకు జేజేలు పాడనారంభించిరి.



## దీక్ష

వంగదేశ విభజనోద్యమ ఫలితముగ దేశమునం దావిర్భవించిన నూతన చైతన్యమునకు మూలపురుషు డనదగిన శ్రీ బిపినచంద్రపాలు స్వదేశీ ఉపన్యాసముల నిచ్చుచు, రాజమహేంద్రవరము వచ్చినపుడు (1907 సం॥న) శ్రీ అయ్యంకి దేశ స్వాతంత్ర్యమునకు, ప్రజాసేవకు, భాషాసేవకు, ఆయన జీవితమును అంకితముచేసి తన ధ్యేయములందు చిత్తశుద్ధిని ప్రకటించినారు.

శ్రీ బిపినచంద్రుని రూపాంతరముగా లోకచంద్రుడయిన శ్రీ వేంకటరమణయ్య స్వతంత్రభావుడై ప్రజల సేవించెను. భాషను సేవించెను. ప్రజలకు సేవించుటను నేర్పెను. అయ్యంకిత ధ్యేయమే శ్రీ వేంకటరమణయ్యకు జీవితానంద మిచ్చినది. లక్ష్య మందించినది. చిత్తశుద్ధిని సంపాదించినది. సర్వము సరస్వతీ సామ్రాజ్య వైభవమే యని శ్రీ అయ్యంకి భావించెనో!

ఆ కాలమున బందరు నగరము వీరి యుదారాశయములకు నాటపందిరి యాయెను. అప్పటివారు మహాపురుషులైరి. శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య, శ్రీ ముట్నూరి కృష్ణారావు, శ్రీ కోపల్లె హనుమంతరావు, శ్రీ వల్లూరి సూర్యనారాయణ ప్రభృతులు తమ దివిటీలను వెలిగించిరి. శ్రీ వేంకట రమణయ్య ఉదారాశయములకై తమ హృదయ కవాటమును తెరచుకొని, జ్యోతిర్మయమైన పూర్వోక్త సన్నివేశమున నారాధకుడై గోచరించినపుడు ఆ లోకపూరము అవిరతముగ నంతరంగమున ప్రవేశించి, అందలి భావరాజీవములను ప్రఫుల్లమొనరించెను. 1910 లో "ఆంధ్ర భారతి" యను మాసపత్రికను మచిలీపట్నములో వారు ప్రచురింప దొరకొనిరి. పద్యాంతరముకై మక్కువతో వ్రాలు రాయించలవలె జిజ్ఞాసువుల చిత్తములు

భావప్రభాకలిత సాహితీసుమములపై వ్రాలునుగదా! వారపత్రికలును, మాసపత్రికలును గుప్పున నారిపోవు దీపపుంజములు కావు; వానియందలిది మతాబా వెలుగే కాదు. సాహితీచిత్రమండపమున చేరజాలు ప్రదీపకళిక లందు మహితభావతైలము నాస్వాదించుచు తేజరిల్లుచుండును. "ఆంధ్ర భారతీ" మందిరమున పరిఢవిల్లిన తెలుగు వెలుగులు వాఙ్మయవీథులందు నూతనయత్నములకు తేజస్సు ప్రసాదించినవి.

## సాధనా ప్రారంభము

పత్రికామందిరమునుండి శ్రీ వేంకటరమణయ్యగారి యూహాలు గ్రంథాలయములోనికి ప్రసరించినవి. గ్రంథాలయము వారికి దేవాలయ మాయెను; ప్రధానముగ తమ జీవితాశయములు అందు ప్రస్ఫుటించవలెనని వారు నిశ్చయించుకొనిరి. గ్రంథాలయోద్యమ స్యందనమున సారథులై వా రధి వసించిరి. సర్వశక్తులను వినియోగించి తమ తేరుపై వారు గెలుపు సిడెము నెత్తిరి.

శ్రీ వేంకటరమణయ్యగారు బెజవాడ పట్టణమును కేంద్ర మొనరించుకొని, 1911 వ జననమొందుటయేగాని, ఊపిరి అందక యున్న శ్రీ రామమోహన గ్రంథాలయమును చేపట్టి కార్యదర్శులైరి. పదునేను సంవత్సరము లాపదవి నలంకరించి ఆ సంస్థకు ఘనతరమైన భావశబలతను చేకూర్చిరి. వారి కృషి ఫలితముగ నీ సంస్థకును, అందలి స్త్రీ శాఖకును, ప్రత్యేక భవనముల నిర్మాణములు కలిగినవి. వారు చేసిన ప్రారంభమే క్రమాభివృద్ధినొంది నేడు రామమోహన గ్రంథాలయము ఆంధ్ర ధాత్రిలోని అగ్రశ్రేణి గ్రంథాలయమై విలసిల్లినది.

## ఆంధ్ర గ్రంథాలయోద్యమము

ప్రాచీప్రతీచీ సంప్రదాయ విజ్ఞానముల నవగతము చేసికొని వానిని మన సంస్కృతియం దెట్లు మేళనము చేయవలెనో - అట్టి

సమ్మేళనమునందు మన సంస్కృతి నెట్లు ఆధునిక యుగమున సు సంపన్నము చేయవలెనో యోచించి అనుభవములోఁబెట్టిన అనుభవశాలి శ్రీ వేంకటరమణయ్యగారు. వారి కార్యాచరణమునం దెల్లయెడల ఈ విషయము విస్పష్టముగా ద్యోతకమగును.

గ్రంథాలయోద్యమమును నడపుటయందు శ్రీ వారు సంపాదించిన అనుభవము, విజ్ఞానము అసమానములు. భారతదేశము పరాధీనమైన కాలమున ముఖ్యముగ గ్రంథాలయోద్యమము నడుపవలెననిన అసమానమైన ప్రచారకార్యక్రమము ననుసరించవలెననుట విజ్ఞులెరింగినదే. బాలురు, స్త్రీలు, వయోజనులు-వీరి మన స్తత్వము బాగుగా గ్రహించి అందుకు తగినట్లుగా వారిని విజ్ఞాన పథగాములుగా జేయు విధానముల పరిశోధించిరి. ఒకవిషయమును ప్రచారము చేయుటయం దెట్టి నైపుణ్యము కలదో, బోధించుటయందును అట్టి ప్రజ్ఞయే సంపాదించిరి శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు.

గ్రంథాలయ విజ్ఞాన విషయకము లయినవి చదివిన వానిని, చూచినవానిని గురించి యోచించిరి. విచారణచేసిరి. ధ్యానించిరి - మననము చేసిరి; పిమ్మట తమ పాలనలోనున్న "రామమోహన గ్రంథాలయ" మందు ఆచరణలోఁబెట్టి శోధించిరి. ఈ విధముగా బాలశాఖ, ప్రచారశాఖ, విస్తరణశాఖ, సేవాశాఖ, గ్రంథవర్గీకరణ శాఖ,ఆచూకీశాఖ;-వీని నన్నిటిని వారు రా । మోహన గ్రంథాలయ సంఘమునకు కార్యదర్శిగనున్న పదునైదు సంవత్సరములలో పరిశోధించి నిర్వహించిరి. ఆ యా విషయములందు అసమానమైన ప్రజ్ఞానుభవముల గడించిరి. వారేమి చెప్పినను బోధించినను అనుకరణములుగాక అన్నియు అనుభవమును పురస్కరించుకొనియే యుండును.

ప్రాచీన సాంప్రదాయ సాంస్కృతిక సంస్థలగు పురాణములు-హరికథలు- జంగమకథలు- తోలుబొమ్మలాటలు మొదలగువానిని గ్రంథాలయ ప్రచారమునందు పునరుద్ధరించిరి. గ్రంథాలయ శిక్షణ తరగతుల నేర్పరిచి శాస్త్రీయ పరిజ్ఞానమును గ్రంథాలయసేవకుల

కందజేసిరి. గ్రంథాలయమునకు ప్రభుత్వమువారు గ్రాంటుల నేర్పాటుజేయుట వారి కృషిఫలితమే.

"గ్రంథాలయ యాత్ర" అను ప్రచార విధానము గ్రంథాలయోద్యమ ప్రచారమున క్రొత్త సృష్టి. దీనిని సృజించుటలో వీరి సృజనాత్మక సామర్థ్యము పతాకస్థాయి నందుకొన్నది. ప్రప్రథమమున గ్రంథాలయయాత్ర భీమవరము, తాడేపల్లిగూడెము తాలూకాలయందు నిర్వహించి ప్రచారస్థాయియందు ముందెన్నడును కని విని యెరుంగని సత్ఫలితముల బడసిరి. ఈ యాత్రలవలన గ్రంథాలయోద్యమ వ్యాప్తికై అపూర్వమగు నూతన చైతన్యము గలిగినది.

ఏ యుద్యమమును చేపట్టినను దానిని యథాతథముగపోనీయక దాని అభివృద్ధికై నూతన పరిశోధనలను చేయుటయందు- మెరుగులు దిద్దుటయందు - నూతన దృక్పథమును వెలయించుటయందు శ్రీ వేంకటరమణయ్యగారు జూపుచుండిన నిపుణత్వము, దానికి విశిష్టమైన - ప్రత్యేక స్థానమును- జేకూర్చుచుండెను.

## అఖిల భారత గ్రంథాలయోద్యమము

1919 సంవత్సరమున "ప్రథమఅఖిల భారత సార్వజనిక గ్రంథాలయ మహాసభ"ను మద్రాసునందు సమావేశపరచి "అఖిల భారత సార్వజనిక గ్రంథాలయసంఘము"ను స్థాపించి,ఆ సంఘమునకు కార్యదర్శిగ పదునైదు సంవత్సరములు పనిజేసి, యావద్భారతవర్షమునను సార్వజనిక గ్రంథాలయోద్యమమందు ఆసక్తిని ప్రోత్సహింప జేసిరి. ఆ కాలముననే "అఖిల భారత గ్రామ గ్రంథాలయ మహాసభ"ను కూడ సమావేశపరచి, దేశాభ్యుదయమునకు గ్రామసేవ మూలకందమను సూత్రమును నిర్వచించిరి. "దక్షిణ భారత గ్రంథాలయ మహాసభ" లను సమావేశపరచి, దక్షిణ భారత గ్రంథాలయోద్యమమును గూడ విస్తరింపజేసిరి.

ఈరీతిగా వీరి గ్రంథాలయోద్యమ నాయకత్వము ఆంధ్రదేశా వధులను దాటి మద్రాసు, పంజాబ్, వంగదేశము, కేరళ, పుదుకోట మొదలగు ప్రదేశములందు ప్రప్రథమముగ గ్రంథాలయోద్యమ బీజములను నాటుటకు, దోహదమొనర్చుటకు ఉపకరించి ఆ యా ప్రదేశ ప్రజల మన్ననలను, జోహారులను పొందినది.

## ఇతర వైజ్ఞానికోద్యమములు

"ఆంధ్ర గ్రంథాలయోద్యమము" భారతీయ సౌధ నిర్మాణ మునకు ఆంధ్రదేశమున పునాదులు వేసెనను మాట నిశ్చయము. మహాత్ములు స్థాపించిన జాతీయోద్యమము యొక్క జయము చాల వరకు ఈ యుద్యమ మూలమున చేకూరెనని నే నెరుగుదును. ప్రతి గ్రంథాలయ అధ్యక్షుడును, కార్యదర్శియును, గాంధిరాజ్యపు మున సబుగాగాని, కరణముగాగాని మారెను. ఈ రెండు సంవత్సరములలో ఆంధ్రదేశమందలి చాలా గ్రామములలో నేను సంచారము చేసి యుంటిని. అప్పుడు ప్రతి గ్రంథాలయమును ఈ మహోద్యమమును ప్రజ్వలింపజేయు కార్యక్షేత్రమై ప్రాముఖ్యము వహించియుండెను"-(1923)

అని "ఆంధ్రరత్న" శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు నుడివి యున్నారు. అట్టి ప్రశస్తి - మన్ననల నందిన మహోద్య మమునకు మూలపురుషులగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యపంతులు గారికి ఆంధ్ర ప్రజానీకము ఋణపడి యున్నది.

శ్రీ వేంకట రమణయ్యగారి నిరంతర కార్యదీక్షా ఫలితముగ విస్తరిల్లిన బహుళ గ్రంథాలయ సంస్థలే కాలాంతరమున ప్రవర్తిల్లిన ఆంధ్రోద్యమమునకు- మహాత్ముని అసహాయోద్యమమునకును- స్వాతంత్ర్యోద్యమములకును-తమ జీవితముల నంకిత మొనర్చిన పెక్కుండ్రు సేవావ్రతులకును, త్యాగమూర్తులకును, పూర్వాశిక్షణా కేంద్రములై పరిఢవిల్లినవి.

ఈ రీతిగా ఆకాలమున గ్రంథాలయోద్యమ రూపమున ప్రాదుర్భావమునొందిన అద్భుత చైతన్యము బహుళ వైజ్ఞానికోద్యమములకు సాంస్కృతిక కార్యకలాపములకు జనయిత యాయెను.

## ప్రకృత్యభిగమనోద్యమము

ప్రకృతి ధర్మప్రవృత్తివలన-సాత్వికాహారావలంబనము వలన-జీవిత నిర్వహణము ధర్మప్రవృత్తియు సుసాధ్యమని యెరిగి, అందులకై పలువిధముల కృషిచేసిరి.

అట్లే ప్రకృత్యభిగమనోద్యమమందు, శిబిరముల నిర్వహించి "అఖిల భారత ప్రకృతి వైద్యమం" దొక వినూతన శకమును ఆవిర్భవింపచేసిరి శ్రీవారు.

నవీన కుహనా నాగరిక ప్రభావమువలన "పంచభూతముల"ను పుష్కలముగ అనుభవించుట యను జీవిత విధానమును విస్మరించిన నేటి దినములలో వీరిచే నిర్వహింపబడిన ప్రకృతి ఉద్యమ సభలు సమావేశములు, శిబిరములు- వీరి యుపన్యాసములు- ప్రజలకు కనువిప్పు అయినవి.

ప్రకృతి కార్యాలయ ట్రస్టునకు 1933 నుండి ఇరువది యైదు సంవత్సరములు కార్యదర్శిగానుండియు, అఖిల భారత ప్రకృతి ధర్మ ప్రచారక సంఘమునకు సహాయకులుగా నుండియు "ప్రకృతి పత్రికను" - "ఇండియన్ నేచరోపాత్ జర్నలు"ను ప్రతిభావంతముగ ప్రచురించిరి.

## దివ్యజ్ఞానోద్యమము

ప్రపంచ ప్రఖ్యాతిని బడసి సర్వసమానవ సోదరత్వ సిద్ధికై కృషి సలుపుచున్న దివ్యజ్ఞాన సమాజము శ్రీ పంతులుగారి దృష్టి నాకర్షించి, అందు 1918 సం॥న సభ్యులుగా చేరిరి. ఆనాడే వీరి జీవితమున మరియొక అద్భుత ఘట్టము గోచరించినది. సరిదంతములన్నియు సముద్రమున గలియున్నట్లు, సమస్త ధార్మిక సూత్రములును సారస్వత

సిద్ధాంతములును ఈ సమాజ సృష్టియందు జేరినవి. ఆంధ్రదేశమున ఈ యుద్యమ నాయకులలో నొకరై, శ్రీ పంతులుగారు 1930 సం॥ నుండి సమాజ ప్రచార కార్యదర్శిగా కృషిసలుప నారంభించిరి. "దివ్యజ్ఞాన దీపిక" యను పత్రికను పెక్కు సంవత్సరములు నిర్వహించిరి. ఈ పత్రిక వీరి యాధ్వర్యమున నూతన కాంతులను సంతరించుకొన్నది. చందా లిచ్చినను, ఇయ్యకపోయినను, అందరికిని పత్రిక అందుచునే యుండెను. దివ్యజ్ఞాన విషయికములైన 40 గ్రంథములు ప్రచురించిరి. బహుళాబ్దములు బెజవాడ దివ్యజ్ఞాన సమాజముకు అధ్యక్షులుగ నుండిరి. దివ్యజ్ఞాన వ్యాప్తికై పల్లెలందును పట్టణములందును ప్రచార ప్రబోధములు కావింపసాగిరి.

దివ్యజ్ఞాన విద్యాప్రచారమున వీరి కృషి నూతన మార్గముల స్వేచ్ఛగ ప్రసరించి దేశమును పునీత మొనర్చినది. దివ్యజ్ఞానోపదేశములు విరివిగ జనసామాన్యమునందు ప్రచారమగుటకుగాను వేలకొలది కరపత్రములను, ముద్రించి పంచిపెట్టిరి. "పరమార్థసాధనము" అను చిన్న పొత్తమును ఒక లక్ష ప్రతులను ప్రచారమునకుంచిరి. దివ్యజ్ఞాన సమాజశాఖా నిర్వహణమునుగూడ నూత్నశోభతో వెలార్చి మార్గదర్శకులై ధన్యులైరి శ్రీ రమణయ్యగారు.

## సేవోద్యమము - బాలభటోద్యమము

"మానవసేవయే మాధవసేవ" యను సూక్తి ననుసరించి 1916 వ సంవత్సరమున కృష్ణానది, కొల్లేరు సరస్సుల వరదలు వచ్చినపుడు వరదబాధితుల కమోఘమైన సేవ జేసిరి.

"అనీబిసెంటు"గారిచే 1918 వ సంవత్సరమున స్థాపింపబడిన బాలభటోద్యమమున వీరు చూపిన చాకచక్యముగూడ నిరుపమానమైనది. అచటకూడ వీరు నిత్య నూతన విధానములను – అనుకరణమాత్రములుగాక – స్వకపోలకల్పిత విధానముల రూపొందించి అనుభవములోనికి దెచ్చి, ప్రపంచ బాలభటోద్యమ నాయకులగు

"బేడెన్ పవెల్" గారి మన్ననలపొంది వారిచే "బాడ్జి" బహుమతిని పొందిరి. బాలభట ప్రతిజ్ఞలో రాజభక్తి కూడ కలదు. అందుచే 1921 లో గాంధిగారి అసహాయోద్యమ ప్రచారముతో సర్వస్వతంత్ర మైనట్టి "రవి" భట సంఘమును స్థాపించి ప్రచారముచేసి చాల కాలము నిర్వహించిరి. 'బాలభటుని తరిబీతు" మొదలగు గ్రంథము లనుకూడ రచించిరి.

బాలభటోద్యమమున సంజ్ఞల మూలమున దూరప్రదేశములకు వార్తలుపంపు (Signalling) విధానమందు ఆంగ్లేయ భాషనే కాక తెలుగుభాషనుకూడ ఉపయోగించు పథకము నేర్పరిచిరి. కవాతు ఆజ్ఞలను ఆంగ్లేయ భాషకు బదులు హిందీభాషను ఉపయోగించి మార్గదర్శకులైరి. చివరకు దుస్తులందుకూడ మన క్షత్రియులు వేసు కకు పంచె విరిచికట్టు పద్ధతిని ఒక బాలభట పటాలమును తయారు చేసి- భటోద్యమమందు ప్రపంచ నాయకులకు"సర్ రాబర్టు బేడెను పవెలు"గారికి స్వయముగా అందుగల విశిష్టతనజూపి వారి మన్నన లను బడసిరి.

## ఆంధ్రోద్యమము

ప్రప్రథ మాంధ్ర మహాసభ 1913 వ సంవత్సరమున బాపట్ల లో జరిగినది మొదలు ఆంధ్రరాష్ట్రము సిద్ధించువరకు శ్రీ వారు ప్రచారకునిగా, కార్యకర్తగా, స్వయంసేవకులుగా, ఆంధ్రోద్యమము లోకూడ యథోచితమైన సేవజేసి ధన్యులైరి. ఆంధ్రరాష్ట్రమును సంపాదించుటతో ఆంధ్రోద్యమము సంపూర్ణము కాలేదను కోవలో నరినవారు శ్రీ వేంకటరమణయ్యగారు. అది సంపూర్ణము కావలె నన్న ఆంధ్రుల సాంస్కృతిక, వైజ్ఞానిక జీవనోజ్జీవనము కావలెనని వారి యభిప్రాయము.

## పత్రికా సంపాదకత్వము

ఆంధ్రదేశమున వెలసిన సారస్వత పత్రిక లనేకములు గలవు. "అవి యన్నియు శ్రీ వేంకటరమణ భావచ్ఛాయ కలవి" అని సార

స్వత హృదయులు భావింతురు. "ఆంధ్ర భారతి" 1910 లో శ్రీ రమణీయవాణి "ఉపక్రమముతో" సక్రమముగ సాక్షాత్కరించిప్రచురింపబడిన రమణీయ మాసపత్రిక. నవశోభ తో వెలుగొందినది. అయ్యంకివారి "గ్రంథాలయ సర్వస్వము" హృదయభావములకు దర్పణమై రాణించినది. అనంతరకాలమున వచ్చిన అన్ని పత్రికలకు "సర్వస్వము" సర్వస్వమయినది. వీరి ఆధ్వర్యమున వెలువడిన "సహకారము" సర్వులతో సహకార మొనర్చినది. వీరి పరిపాలనక్రింద నడచిన "ప్రకృతి" పత్రిక "ఇండియన్ నాచురోపాత్" పత్రికలు ప్రకృతి జీవన విధాన ప్రచారమునకై చేసిన సేవ అమోఘమైనది.

## సహకారోద్యమము

"ఆంధ్ర సహకార సమ్మేళన" కార్యనిర్వహణమునందును శ్రీ పంతులుగారి చేయికలదు. కొంతకాలము "సహకార" పత్రికను నడిపిరి. విజయవాడలో గాంధీ కో-ఆపరేటివు అర్బన్ బ్యాంకును స్థాపించి దానికి పదేండ్లు అధ్యక్షులుగానుండి, దానికి విశేష పురోభివృద్ధిని చేకూర్చిరి. కలవారు లేనివారను భేదము లేకుండ ఎల్లరకు సహకారోద్యమ మెట్లు తోడ్పడునో క్రియారూపమున వీరు విదిత మొనరించిరి.

## గుప్త దానములు

అర్థార్థులెందరు వారి గుప్తదానములను స్వీకరించి కృతార్థులైరో లెక్కింపజాలము ఆనాడు వారి యందను వర్ధిల్లిన గుండు గోఖుల లెన్నియో తెనుగుతోటలను తమ తేనెపాటలలో మంచి తేల్చుట జగ మెరిగిన విషయము.

## జీవిత పరమార్థము - సందేశము

ప్రథమమునుండి శ్రీ వేంకటరమణయ్యగారి భావనా జగత్తు నావేశించి, వారిని నిరంతర కార్యదీక్షకు బురికొల్పినది గ్రంథాలయోద్యమమే.

**సరస్వతీ సామ్రాజ్యము :** శ్రీ వేంకట రమణయ్యగారు చేసిన ముప్పదేండ్ల తపః ఫలితముగ, 1950 సం॥న వారికి జరిగిన షష్ఠి పూర్తి మహోత్సవ సందర్భమున, గ్రంథాలయోద్యమ విస్తరణముగ "సరస్వతీ సామ్రాజ్యము"ను స్థాపించి తదాది లోకవ్యాప్తముగా - నేటికి పదునారు సంవత్సరములుగ సారస్వతసేవను చేయుచున్నారు.

సర్వతోముఖముగ, సార్వజనీనముగ, సరస్వతీ వైభవమును విస్తరింప జేయుటయే ఈ యుద్యమమునకు ఏకైక లక్ష్యము.

సరస్వతీ దేవ్యాలయమగు గ్రంథాలయమును యథాధికారముగ వినియోగించుకొని కృతార్థులగుటకు న్యూనాధిక భేదము లేకుండ సర్వజనులకు సావకాశముండవలెను. అనగా గ్రంథాలయములు సర్వజన సేవ్యములు కావలయును. ఈ మహా ప్రయోజనమును శ్రీ వేంకటరమణయ్యగారు తమ యచంచల కృషిచేత సాధించిరనుట నిర్వివాదాంశము. ఆయన సహస్రాధిక గ్రంథభాండాగార ప్రతిష్ఠాపనకు హేతుభూతులై ఆధునిక యుగమున "సరస్వతీ సామ్రాజ్య ప్రతిష్ఠాపనాచార్య" బిరుదమునకు సర్వవిధముల అర్హతలు సంపాదించుకొనిరి.

రామరాజ్యము: శ్రీ వేంకటరమణయ్యగారి ఆశయము ననుసరించి, సరస్వతీ సామ్రాజ్యమేర్పడి సరస్వతీ వైభవము సర్వత్ర భాసించగా- దేశమున కాలుష్యము లన్నియుపోయి- పూజ్యశ్రీ బాపూజీ కలలుకన్న "రామరాజ్యము" ఏర్పడగలదు. భూలోకమే దేవలోకము కాగలదు.

## గ్రంథ ప్రచురణము

చాలకాలము క్రిందటనే "ఆంధ్రపరిషత్తు" అను గ్రంథమాలను స్థాపించి "కర్మయోగము" "భారత యోధులు" శేషాద్రి రమణ కవులచే రచింపబడిన "పాపరాయ నిర్యాణము" గాంధీ విరచిత "ఆరోగ్య మార్గబోధిని", "గాంధి తత్త్వోపదేశము";"మాలపల్లి" - మున్నగు ఉత్తమ గ్రంథముల ప్రచురించి దేశసేవ జేసిరి.

(3)

తరుపరి "కళాపీఠము" అను గ్రంథమాలకూడ - శ్రీ వేంకట రమణయ్యగారి పర్యవేక్షణనే అనేకములైన సావనీర్లు, ఉత్తమ గ్రంథములను ప్రచురించినది; కళాసేవ జేసినది. "శ్రీ హనుమద్భగవద్గీత" అను గ్రంథమును 1940 లో వారి మూడవకుమారుడు చిరంజీవి శ్రీ రంగారావు వివాహ సందర్భమున కృతిపొందినారు.

## కాంగ్రెసు

పంతులుగారు భారత జాతీయ కాంగ్రెసు సభ్యుడుగానుండి దేశమున కనేక విధముల సేవజేసినారు. 1920 సంవత్సరమున గాంధీగారు విజయవాడ వేంచేసినపుడు మహాసభా సక్రమనిర్వహణ నిమిత్తమై వాలంటీరు దళాధిపతిగానుండి నిర్వహించిరి. 1930 వ సంవత్సరమున "దండియాత్ర" చేసి గాంధీగారు ఉప్పు సత్యాగ్రహోద్యమము నిర్వహించినపుడు శ్రీ డా॥ పట్టాభిగారు చిన్నాపురంలో నడుపుచున్న ఉప్పుసత్యాగ్రహోద్యమ శిబిరమునకుబోయి ఉప్పును తెచ్చి, విజయవాడ "టవును"లోనున్న శ్రీ గాంధీచౌకులో బహిరంగ విక్రయ కార్యక్రమమునందు పాల్గొనిరి. విజయవాడనుండి చిన్నాపురంపోయి ఉప్పు సత్యాగ్రహోద్యమమందు పాల్గొన్నవారిలో ప్రప్రథములు శ్రీ పంతులుగారు. మొదటినుండియు ప్రతి కాంగ్రెసు మహాసభకు హాజరై, దేశీయ కాంగ్రెసు మహాసభా కార్యక్రమముల నతి జాగరూకతతో పరిశీలించిన వ్యక్తి పంతులుగారు. నిత్య ఖద్దరు ధారణాదితత్పరులు. కాకినాడ కాంగ్రెసు మహాసభలో వాలంటీరు దళాధిపతిగానుండి మహాసభల నిర్వహణమున కత్యంతమైన సేవ జేసిరి.

## జీవితముయొక్క పూర్ణత్వము

మానవుని జీవితమునందు భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక అంతరువుల మూడింటికిని సమన్వయము కుదిరినపుడే-పూర్ణత్వము సిద్ధించునని మన భారతీయ సంప్రదాయ విశ్వాసము ఈ సమన్వయ సాధన జేసి జీవితముయొక్క పూర్ణత్వమును పొందిన యోగి శ్రీ వేంకట రమణయ్యగారు.

మానవాభ్యుదయమునకు వలసిన విజ్ఞాన సేవోద్యమము లన్నింటియందును ప్రవేశించి విహరించి సమన్వయసిద్ధిని పొందిన జ్ఞాని శ్రీ రమణయ్యగారు,

ఈ రీతిగ తన పదునేడవ యేటనే "వందేమాతరోద్యమమున" ప్రవేశించి, దేశసేవా దీక్షాకంకణధారియై తన ధ్యేయమును నేటికిని యథాతథముగా ననుసరించి యాదర్శపాత్రియు లగుచున్నారు శ్రీ పంతులుగారు.

వారికి ఈనాడు 77 వ సంవత్సరము ప్రవేశించినది. నిత్య నూతనముగా నేటికిని శ్రీ వారు ప్రజోద్యమములలో సంపూర్ణోత్సాహముతో వీరవిహారము చేయుచునే యున్నారు.

## అనుభవములు - జ్ఞాపకములు

గత అయిదు దశాబ్దుల కాలములో శ్రీ వారు పాల్గొనిన వివిధోద్యమ విజ్ఞాన సంబంధములైన వ్యాసములు, ఉపన్యాసములు, అనుభవములు, జ్ఞాపకములు, వందలాదిగనున్నవి. భావితరము వారికి మార్గదర్శకములగు వారి విజ్ఞాన వ్యాసములు- ఉపన్యాసములు- అనుభవములు- వీనిలో ముఖ్యమయిన వానిని గ్రంథస్థము చేయుటకును, విజ్ఞాన దాయకమును ఆదర్శపూరితము మార్గదర్శకమును నగు వారి జీవితచరిత్రను ప్రచురించుటకును ఈ శుభసమయమున ఏర్పాట్లను చేసినాము. "శ్రీ వేంకట రమణీయవాణి" అను గ్రంథ మాలపేరున ప్రచురింపబడు వారి సాహిత్యము,వారి సేవాఫలితములు ఈ క్రింది శీర్షికలతో ప్రచురింపబడును:-

1. గ్రంథాలయజ్యోతి
2. దివ్యజ్ఞానజ్యోతి
3. ప్రకృతి విజ్ఞానజ్యోతి
4. "మానవసేవయే మాధవసేవ"

5. "ఎందరో మహానుభావులు"

6. శ్రీ వేంకటరమణీయము (శ్రీవారి జీవితచరిత్ర)

7. రామదండు

8. సరస్వతీ సామ్రాజ్యము

9. History of the Public Library Movement in The Andhra Pradesh.

10. History of the Public Library Movement in India.

11. The Library Movement in india, (Collected Essyas)

ఇవియేగాక, శ్రీ వేంకటరమణయ్యగారి ధ్యేయమునకు సంబంధించిన ఇతరుల గ్రంథములుకూడ ప్రకటింపనగును. కావున ప్రజా సేవలో పరిణతిపొందిన శ్రీ వేంకటరమణయ్యగారి విజ్ఞానమును చిరకాల సేవానుభవమును — అక్షర రూపముగ చిరస్థాయి చేయు సంకల్పమునకు చేయూత నిచ్చి మీ సంపూర్ణ సహకారమునందజేయ గోరుచున్నాము.

చిరంజీవి శ్రీ వెలగా వెంకటప్పయ్యచే సంకలనము చేయబడిన అయ్యంకివారి మొదటి గ్రంథము "గ్రంథాలయజ్యోతి"ని ఇందుతో ఆంధ్రమహాశయుల కర్పించుచున్నాము,

భవదీయులు,

సరస్వతీ సామ్రాజ్య భవనమ్<br>బీసెంటురోడ్డు, విజయవాడ-2<br>23 - 10 - 1966

జమ్మలమడక మాధవరామశర్మ<br>విశ్వనాథ సత్యనారాయణ<br>శివశంకర స్వామి

# శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారి
# ప్రజా జీవితము

**గ్రంథాలయోద్యమము:-**

ఆంధ్ర ప్రదేశ్ స్టేటు లైబ్రరీ కమిటీ సభ్యులుగా 3 సం. లు
కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుడుగా 5 సం. లు
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా 25 సం. లు
అఖిలభారత గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా 15 సం. లు
రామమోహన ధర్మగ్రంథాలయసంఘకార్యదర్శిగా 15 సం లు
ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘాధ్యక్షుడుగా 32 సం.నుండి
దక్షిణభారత గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా 3 సం. లు
అఖిలభారత గ్రామ గ్రంథాలయసంఘకార్యదర్శిగా 3 సం.లు
గ్రంథాలయ యాత్రల నాయకుడుగా 10 సం. లు

**ప్రకృతి ఉద్యమము:-**

అఖిలభారత ప్రకృతి ధర్మసంఘ ప్రచారకార్యదర్శిగా 25 సం. లు
ప్రకృతి కార్యాలయ ట్రస్టు కార్యదర్శిగా 25 సం. లు
ప్రకృత్యభిగమన శిక్షణ శిబిర నిర్వాహకులుగా 10 సం. లు
ఆంధ్ర ప్రకృతి చికిత్సా పరిషత్తు ఉపాధ్యక్షుడుగా 3 సం. లు

**దివ్యజ్ఞానోద్యమము:-**

ఆంధ్ర దివ్యజ్ఞాన సంఘ ప్రచార కార్యదర్శిగా 10 సం. లు
విజయవాడ పట్టణ దివ్యజ్ఞానశాఖ అధ్యక్షుడుగా 5 సం. లు
కృష్ణా-పశ్చిమ గోదావరి దివ్యజ్ఞాన జోనుకార్యదర్శిగా 10 సం. లు

**సేవోద్యమము:-**

"విజయవాడ సేవాసంఘ" కార్యదర్శిగా 4 సం. లు
ఆంధ్రరాష్ట్ర బాలభట కమీషనరుగా 4 సం. లు

ఆంధ్ర రాష్ట్రీయకాంగ్రెసు సంఘ వాలంటీరు
కమిటీ కార్యదర్శిగా 4 సం. లు
రామదండు కార్యకర్తగా 3 సం. లు
ఇండియన్ కాన్ఫరెన్సు ఆఫ్ సోషల్ సర్వీసు
సభ్యుడుగా 10 సం. లు

ఆంధ్రోద్యమము:-
ఆంధ్రమహాజన సంఘ కార్యనిర్వాహక
సభ్యుడుగా, ప్రచారకుడుగా 30 సం. లు

కాంగ్రెసు:-
ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘ సభ్యుడుగా 3 సం. లు

మునిసిపాలిటీ:-
విజయవాడ మునిసిపాలిటీ కవున్సిలరుగా: రెండు టరములు.

సర్వోదయము:-
ఆంధ్రరాష్ట్ర నిర్మాణ కార్యకర్తల సంఘ కార్యనిర్వాహక
సభ్యులుగా 6 సం॥లు.

పత్రికలు:-
ఆంధ్రభారతి - గ్రంథాలయ సర్వస్వము- ఇండియన్ లైబ్రరీ
జర్నలు -
"కోరడా" ప్రకృతి — ఇండియన్ నాచురోపాత్ -
సహకారము - పత్రికల సంపాదకుడుగా -

వారు సాధించిన కార్యములు అప్రతిమానములు.

# ఆ ము ఖ ము



భారతదేశపు శిరోరత్నాలలో ఒక మేటిరత్నంగా ఎన్నదగిన మహాపురుషుడు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు ద్యోమండలము అనంత జ్యోతిర్మయమై ప్రకాశిస్తుంది; కాని భూ మండలాన్ని ప్రకాశింపజేసేది అనంత విజ్ఞానము ఒక్కటే. ప్రపంచాన్ని విజ్ఞానమయంజేసి సరస్వతీదేవియొక్క మహాసామ్రాజ్యంగా తీర్చి దిద్దాలి అనే ప్రయత్నంలో ప్రథమ సోపానంగా శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు "ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాన్ని" స్థాపించి ఇప్పటికి ఏభై రెండేళ్లు గడిచినవి.

అప్పటినుండే పల్లెలనక, పట్టణాలనక, ఆంధ్రదేశమంతా నిరంతరం సంచారంజేసి, గ్రంథాలయోద్యమాన్ని శ్రీవారు విస్తరింపజేశారు. అంతేగాక అఖిల భారతావనిలో గూడా ఈ ఉద్యమాన్ని వ్యాపింపజేసి దానిని నిత్య నూతనంగా ఉద్దీపింపజేస్తూ నలుమూలలా విజ్ఞాన తేజోపుంజాన్ని ప్రసరింపజేస్తూ, అజ్ఞానతిమిరావృతమైన మాతృదేశము కళాకాంతులతో శోభిల్లడానికి దోహాదంచేశారు

శ్రీ వేంకటరమణయ్యగారు తమ కరకమల సంజనితమైన "ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘా"న్ని స్థాపించి (1914) గ్రంథాలయసంఘ స్థాపనకు యావద్భారతంలోనూ ఆంధ్రులే ప్రథములన్న ప్రతిష్ఠను మనకు గడించి పెట్టారు.

గ్రంథాలయోద్యమాన్ని విశిష్టంగా నిర్వహించి దానికి దోహదం జేసే "గ్రంథాలయ శాస్త్రశిక్షణ తరగతు" లను "ఉద్యోగులు" కాని ప్రజాసేవకులుగా 1920 లోనే ప్రథమంగా ప్రారంభించినదీ ఆంధ్రులే.

అట్లే "గ్రంథాలయ సేవకు" లను సంఘటితపరచి వారికి ఒక ప్రత్యేక వ్యక్తిత్వము, స్థానము సమకూర్చి "ఆంధ్రదేశ గ్రంథా

లయ సేవక మహాజనసంఘు" మును ప్రారంభించినదీ ప్రథమంగా ఆంధ్రులే. (1934)

గ్రంథాలయాలు కేవలం గ్రంథాలను భద్రపరచే స్థలాలు కావనీ, "గ్రంథభాండాగారి" కేవలం "పుస్తకాల కాపరి" కాడనీ, గ్రంథాలయాలను దర్శించే పుస్తక పఠనాసక్తులకు - వారి వారి కోరికలబట్టి ఎవరికి ఈయదగిన గ్రంథాన్ని - వారికి అందించడమే కాకుండా, గ్రంథాలయాలకు రాలేని, ఆసక్తిలేని వారియొద్దకు "గ్రంథాలయాలే" వెళ్ళి విజ్ఞానాన్ని ప్రసారం చెయ్యాలని ప్రబోధించటానికీ ఆంధ్రులే ప్రథములు.

జ్ఞానోపార్జనకు, మానవుని సర్వతోముఖ వికాసానికీ కావలసిన సాధన కార్యకలాపము అంతా గ్రంథాలయ పక్షాన "సేవా" కార్యక్రమంగా నిర్వహించాలనీ, సర్వసంక్షేమ కార్యకలాపాలకు గ్రామంలో గ్రంథాలయమే కేంద్రమనీ, అది "సార్వజనిక విశ్వవిద్యాలయ" మనీ ప్రబోధించి ఆ లక్ష్యసిద్ధికి పాటుబడటానికి కూడా ప్రథములు ఆంధ్రులే.

1919 వ సంవత్సరంలోనే "అఖిల భారత సార్వజనిక గ్రంథాలయ సంఘం" స్థాపించి, సార్వజనిక స్థాయిలో "అఖిలభారత గ్రంథాలయోద్యమ" ప్రచారానికి నాందిపల్కి - మద్రాసురాష్ట్రము, వంగ రాష్ట్రము, పంజాబురాష్ట్రములకు గ్రంథాలయ సంఘాలను ప్రతిష్ఠింప జేసినది ఆంధ్రులే.

దక్షిణ భారత దేశంలో పత్రికా పఠనాలయాలు, వయోజన విద్యాపాఠశాలలు స్థాపించి వయోజన విద్యాకృషికి ప్రారంభం జేసిందీ ఆంధ్రులే.

గ్రంథాలయోద్యమ ప్రచారానికి ప్రజామోదము పొందిన "గ్రంథాలయ యాత్రలు" అనే విశిష్ట విధానాన్ని రూపొందించినదీ ఆంధ్రులే.

"గ్రంథ వర్గీకరణ"ను గురించి దక్షిణ దేశ ప్రాంతీయభాషల్లో గ్రంథం వ్రాయటానికీ, ఈ భాషలలోని గ్రంథాలకు తగిన వర్గీకరణ విధానాన్ని రూపొందించటానికీ ఆంధ్రులే ప్రథములు.

గ్రంథాలయాలకు ప్రభుత్వ సహాయాన్ని సాధించినదీ ప్రథమంగా ఆంధ్రులే.

సార్వజనిక గ్రంథాలయోద్యమానికి జాతీయ అంతర్జాతీయ ప్రఖ్యాతి సంపాదించటానికీ యావద్భారతంలోనూ ఆంధ్రులే ప్రథములు.

ఈ విధమైన ప్రగతిని సాధించటానికి సాధనభూతులై సారథ్యం వహించిన కీర్తిప్రతిష్ఠలు అవితథశేషులైన శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారికే చెందుతాయని ఉద్యమ చరిత్రను సాకల్యంగా పరిశీలిస్తే అవగాహన మవుతుంది. ఆరంభించినది మొదలు అహో రాత్రములు గ్రంథాలయోద్యమ వ్యాప్తిని గురించి అవిరళముగ తపన పొంది కృషిజేసిన తపశ్శాలి ఈ మహర్షి పుంగవుడు.

ఉత్తర, దక్షిణ భారత గ్రంథాలయోద్యమములనే గంగా యమునా సంగమంలో అంతర్వాహినిగా ప్రవహించే "సరస్వతీ" నదీ స్థానమున- గ్రంథాలయోద్యమ సరస్వతీ స్రవంతీ స్వరూపులైన శ్రీ అయ్యంకివారు కమలాసన యైన శ్రీ సరస్వతీదేవివలె స్వచ్ఛత, ధావళ్యము, పవిత్రత, విశిష్టత, ప్రత్యేకత, నిలుపుకొని ప్రపంచానికి ఆదర్శంగా ప్రత్యక్షమవుతూ వచ్చారు.

అటువంటి విశిష్ట వ్యక్తిత్వాన్ని పొందిన వేంకటరమణయ్య పంతులుగారి ప్రసంగాలను, వ్యాసాలను - ఒక్క చేతిమీదుగా ప్రాంతీయభాషల్లో వ్రాసిన - ఇంత విస్తరిత పరిధిగలవానిని - సంకలనంచేసి సంపాదించిన ఈ విస్తృత ప్రయత్నానికి ప్రథములు ఆంధ్రులే అన్న ప్రతిష్ఠను సంపాదించారు శ్రీ వెలగా వేంకటప్పయ్య గారు.

(౪)

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు అన్నట్లుగా "భారతవర్షమందుండిన ప్రాచీన పుస్తక భాండాగారములను గురించిన కథలుగూడ మాసిపోయిన బహు సంవత్సరములకు తరువాత - భారతీయులు "గ్రంథాలయ" శబ్దార్థమునుగూడ మరచిన ఈ కాలమున- మరల "గ్రంథాలయ శకము" ను ఆంధ్రదేశమున ఆరంభించిన "శక పురుషు"లని శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారిని చెప్పనొప్పును"

శ్రీ అయ్యంకివారి అనుభవాలు, జ్ఞాపకాలు అనేకాలు. అనంతాలు. వారి రచనలు, ఉపన్యాసాలు, ఎప్పుడూ, అనుభవాన్ని పురస్కరించుకొనే ఉంటాయి. అందుచేత ఆచరణయోగ్యంగాను, ఆదర్శప్రాయంగాను ఉంటాయి. ఈ సంపుటం ఆమూలాగ్రంగా పరిశీలిస్తే ప్రత్యక్షరంలోనూ ఈ విషయం స్పష్టమవుతుంది.

ఈ విధంగా ఎపుడో పలువిషయాలను గురించి, పలు ప్రదేశాల్లో పలువిధాల ఈ సరస్వతీ సామ్రాజ్య స్థాపకులు పలికిన పలుకులు ఈనాటికీ పసిడితునకలై అపారమూ అవసరంగానూ, ఆచరణయోగ్యంగానూ, ఉన్నాయంటే- ఆ మహనీయుని దూరదృష్టి, నిశితమైన భావనాబలం మనకు గోచరము అవుతాయి.

అటువంటి ఉపన్యాసాలను, వ్యాసాలను సంకలనంచేసి సంపాదించారు శ్రీ వెలగావారు. వివిధ ప్రదేశాలలో అనేక సంచికలలో పత్రికలలో నిక్షిప్తములై యున్న వ్యాసాలు, ఉపన్యాసాలు అనే దీపకళిక శ్రేణులను ఒకచోట చేర్చి అఖండ "గ్రంథాలయజ్యోతి"గా వెలిగించి ఆంధ్ర గ్రంథాలయ సారస్వత లోకంమీద కేంద్రీకృతమై వన్నెగాంచిన అపూర్వదీధితులను ప్రసరింపజేశారు. వారు గ్రంథ భాండాగారిగా పనిచేసినవారు. ఇపుడు విజయవాడలో "గ్రంథాలయ శాస్త్ర శిక్షణాలయము" నకు అధ్యక్షులై (Principal, School of Library Science) నిర్వహిస్తున్నారు.

ఎంతోకాలం క్రిందటనే, ఎందరో ఎపుడో చెయ్యవలసిన ఈ సంకలన సత్కార్యాన్ని శ్రీ వెంకటప్పయ్యగారు ఈనాటికి ఎంతో

సమర్థతతో సర్వాంగ సుందరంగా సాధించారు. అందుకు ఆంధ్ర గ్రంథాలయలోకం, గ్రంథాలయ సారస్వత ప్రియులు, విద్యార్థులు దేశీయులు, అందరూ, శ్రీ వెంకటప్పయ్యగారికి కృతజ్ఞులై వారిని అభినందిస్తారు.

"మహేంద్రుడు" శ్రీ రామకృష్ణ పరమహంస నోటివెంట వచ్చిన ప్రతిమాటను లిఖించి ప్రపంచానికి మహోపకారం చేశాడు. డాక్టరు మహేంద్ర సర్కారు "శ్రీ రామకృష్ణ కర్ణామృత" వ్రాసి ప్రపంచానికి అమర జీవితసాధనం కల్పించారు. అట్లాగే సోదరి నివేదిత "My master as I see Him" అని శ్రీ వివేకానందుని అంతరాత్మయొక్క సౌందర్యాన్ని, సౌరభాన్ని మాటలలో చిత్రించి లోకంలో ప్రసరింపజేసింది. ఆంగ్ల సాహిత్యంలో "జాన్సన్" జీవితాన్ని అర్థంచేసికొని "బాస్వెల్" మహాశయుడు వ్యాఖ్యానించాడు. ఇందులో మొదటివారు ఆధ్యాత్మిక పురుషులు. తరువాతివారు సాహితీపరులు.

"తరుః ప్రసూతే పుష్పాణి...
మరుద్వహతి సౌరభమ్"

తరువులు పుష్పాలను ప్రసవిస్తాయి. వాయువు పుష్ప సౌరభాన్ని వహించి లోకంలో ప్రసారం చేస్తుంది.

గురుశిష్యుల సంబంధము అటువంటిది- భవతు.
సహనావవతు
సహనౌభునక్తు
సహ వీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు

1942 వ సంవత్సరంలో డాక్టరు సర్ కట్టమంచి రామలింగారెడ్డి గారిచే శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికి సమర్పింపబడిన సన్మాన సంపుటమును ప్రకాశింపజేయు భాగ్యం "ఆంధ్రదేశ గ్రంథాలయ

సేవక మహాజన సంఘు" కార్యదర్శిగా నాకు లభించినది. నేడు ఈ "గ్రంథాలయజ్యోతి" ని ప్రకాశింపజేయు భాగ్యంకూడా నాకే లభించినందుకు నేను ధన్యుడనని తలంచుచున్నాను.

సరస్వతీ సామ్రాజ్యమందిరము,
విజయవాడ
23 - 10 - 66

ఊకుమళ్ళ రామచంద్రరావు
కార్యదర్శి,
ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక
మహాజన సంఘము.



# సంపాదకీయము

గ్రంథాలయోద్ధారక, గ్రంథాలయశాస్త్ర విశారద, గ్రంథాలయ పితామహ శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారిని తెలుగువారికి పరిచయం చెయ్యడానికి సాహసించడం దీపంతో వెలుగును వెదకినట్లుగా ఉంటుంది.

తెలుగుదేశంలో వారు కాలూనని గ్రామంగాని – పట్టణం గాని, నగరంగాని లేదంటేనూ, ప్రజారంగంలో వారితో పరిచయం లేనివారు లేరంటేనూ ఆశ్చర్యంలేదు.

తరతరాలుగా సుషుప్త్యావస్థలో నిద్రాణమైయున్న సామాన్య ప్రజానీకానికి చదువు సాముల అవసరాన్ని తెలియజేసి, గ్రంథాలయోద్యమానికి నాందిపలికించి, నవచైతన్యానికి మార్గం సుగమం చేసిన అయ్యంకివారిని గురించి తెలుగునాడు చిరకాలం మననం చేసికోవలసియుంది.

## ఈ శతాబ్ది ప్రారంభం

ఈ శతాబ్దిలో నవభారత యువకులకు ఉత్తేజం కలిగించిన ఉద్యమాలలో బెంగాల్ విభజనోద్యమం తలమానికమైనది. ఈ యుద్యమ ప్రభావంగా విశాలాంధ్రావనిలో నవ తేజ కాంతికళికలు విచ్చుకున్నాయి; ప్రాదుర్భవించిన నవచైతన్యంలో మోసులెత్తింది. ఈ తరుణంలో పడుగు పేకలాగ అల్లుకుపోతున్న దేశ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని అకుంఠితమైన దేశభక్తి ఆమ్రేడితమైన ఆలోచనల వరవడిలో పరవళ్ళు త్రొక్కుకుంటూ, దేశసేవా దీక్షితులై ప్రజారంగంలోకి ప్రవేశించిన నవ యువకులలో శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారొకరు.

పరాయి పాలననుండి దేశాన్ని విముక్తిచెయ్యడం, అప్పట్లో యీ యువక బృందముయొక్క ప్రధాన ఆశయం. ఇందునిమిత్తం ఎవరికివారు తమకు ఆరాధ్యమైన - తమకు అభిరుచిఉన్న ఉద్యమాన్ని ఊతగాకొని, సర్వవిధముల ప్రజలకు సేవచేయుటకై ప్రారంభించినారు. జాతీయ చైతన్యానికి ప్రాతిపదికగ ఉంటుందని గ్రంథాలయోద్యమాన్ని తమ జీవితపరమావధిగా ఎంచుకున్నారు అయ్యంకివారు.

## స మా జ సే వ

గ్రంథాలయోద్యమం ద్వారా, ప్రజలలో విజ్ఞానాన్ని వ్యాప్తంజేసి,సమాజంలో వారి బాధ్యతలను- ప్రభుత్వం నిర్వహించడంలో వారికిగల హక్కులను- తెలియజెప్పి, తద్వారా విదేశీయుల పాలనను తుదముట్టించడానికి సావకాశం కలుగుతుందనీ, నవశకం ప్రారంభం అవుతుందని వీరి ఆశయం.

## ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

ఇట్టి పవిత్రమైన ఉద్దేశంతో, అయ్యంకివారు 1914 వ సంవత్సరంలో, అప్పటివరకు తెలుగునాట నలుచెరగులా చెదురు మదురుగా వ్యాపించియున్న గ్రంథాలయాలను నిర్వహిస్తున్న కార్యకర్తలందరను చేరదీసి - సంఘటిత పరచి - దేశ పరిస్థితులదృష్ట్యా వారి కర్తవ్యాన్ని తెలియజెప్పి- గ్రంథాలయోద్యమ కార్యక్రమం నిరంతరం ఒక క్రమబద్ధమయిన పద్ధతిలో సాగేందుకుగాను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాన్ని స్థాపించినారు. గ్రంథాలయోద్యమ వ్యాప్తికై భారతదేశంలో తొలిసారిగా స్థాపించబడిన గ్రంథాలయ సంఘం యిదే. నేడు యీసంఘం ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘంగా రూపొంది,గ్రంథాలయోద్యమ వ్యాప్తికి విశేషంగా కృషి చేస్తూంది.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి తొలిసారిగా అయ్యంకి వారే కార్యదర్శిగా ఎన్నిక అయినారు. ఆనాటినుండియు గ్రంథా

లయోద్యమ వ్యాప్తికిగాను విరామ మెరుంగక పరిశ్రమించారు; ఊరూరా, వాడవాడలా, గ్రంథాలయాలను స్థాపించడానికి తగు కృషి చేశారు; ఆ యుద్యమాన్ని సక్రమంగా నిర్వహించడానికి పాటుబడ్డారు; గ్రంథాలయోద్యమానికి ఒక ప్రత్యేక స్థానాన్ని సాధించారు, ఇతర ప్రాంతాలవారు సహితం మన ఉద్యమాన్ని చూచి అసూయపడేటంత సమర్థతతోను ప్రఖ్యాతవంతంగాను నిర్వహించారు.

## శ్రీ "అయ్యంకి" వారే ఒక ఉద్యమం

ఈ రీతిగా, "అయ్యంకివారే" గ్రంథాలయోద్యమంగా, గ్రంథాలయోద్యమమే "అయ్యంకివారు"గా, అహర్నిశలు పని చేశారు. గ్రంథాలయోద్యమమందు ప్రజాసామాన్యానికి ఆసక్తి కలిగేటట్లు చేశారు; ఈ ఉద్యమం ప్రజల జీవితంలో ఒక భాగంగా చొచ్చుకొని పోయేటట్లు చేశారు.

ఇట్టి కార్యక్రమంవల్ల గ్రంథాలయోద్యమానికి జీవశక్తి కలిగింది. ఉద్యమ స్రవంతి జీవనదిలాగ, అన్ని కాలాలలోను ప్రవహించి, పల్లెలను పట్టణాలను పునీతం చేస్తోంది.

ఉద్యమం నాలుగు కాలాలపాటు సజీవంగా నిలబడటానికి యీ పని చాలా అవసరం. ఉద్యమాన్ని ప్రజలు గుర్తించక పోయేటట్లయితే, ప్రేమించకపోయేటట్లయితే - దానికి అచిరకాలంలోనే కాలదోషం పడుతుంది.

## బరోడారాజ్యంలో ఉద్యమం

ఈ శతాబ్ది తొలిభాగంలో ప్రభుత్వపరంగా బరోడా రాజ్యంలో ఉవ్వెత్తుగా బయలుదేరిన గ్రంథాలయ ఉద్యమాన్ని ఆ రాజ్యమందలి ప్రజలు గుర్తించలేదు; అందుచేత ప్రభుత్వ సహకారం సన్నగిల్లగానే, ఆ రాజ్యమందలి ఉద్యమం అడుగంటిపోయింది; గ్రంథాలయ మనుగడ నామమాత్రంగా నిలిచిపోయింది.

## తెలుగు వెలుగు

కాని తెలుగు దేశంలోని పరిస్థితులు వేరు— ఇచటి గ్రంథాలయోద్యమం ప్రజలలోనించి బయలుదేరింది. ప్రజల్లో ప్రచారం అయింది. ప్రజలు దాన్ని ఆదరించారు; ఆశ్రయమిచ్చారు; ప్రజల నిత్య నైమిత్తిక జీవితవిధానంలో గ్రంథాలయోద్యమం ఒక భాగమై వెలసింది. అందుచేత సాంఘికంగా, రాజకీయంగా, దేశంలో ఎన్ని మార్పులు వచ్చినప్పటికీ, ఆంధ్ర గ్రంథాలయోద్యమం తెలుగు వెలుగును చూపుతూ, తెలుగువారు వేసిన బాటమీద నిరంతరం సాఫీగా సాగిపోతూంది.

కనుక యీ విధమైన శాశ్వతమైన — సౌమ్యమైన — వాతావరణానికి మార్గంవేసిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారిని ఏ తీరుగా అభినందించినా, మనం యింకా ఋణపడి ఉంటాము.

## పరిపూర్ణ మానవుడు

అయ్యంకివారు ప్రజారంగంలో ప్రవేశించిన పిదప గ్రంథాలయోద్యమాన్ని బాసటగా జేసికొని— ప్రకృతి ఉద్యమం, సహకార ఉద్యమం, బాలభటోద్యమం, దివ్యజ్ఞానోద్యమం మొదలైన ఉద్యమాలలో పనిజేసి, పరిపూర్ణ మానవు డనిపించుకున్నారు. ఆయా రంగాలలో తమకుగల ఆసక్తిని సమగ్రతను నిరూపించినారు.

వారు యీ వివిధ ఉద్యమాలలో పనిచేస్తున్న తరుణంలో వేలాది సభలు— సమావేశాలలో పాల్గొన్నారు. వందలాది వ్యాసాలు వ్రాశారు; అట్టివాటిలో కొద్దిమాత్రం పత్రికారూపంలో ప్రచురణ జరిగాయి; కాని పుస్తకరూపం ధరించలేదు.

## అనేక సమస్యల పరిష్కారం

అయ్యంకివారు గ్రంథాలయోద్యమ పరంగా చేసిన కొన్ని ఉపన్యాసాలను, వ్రాసిన కొన్ని వ్యాసాలను ఈ గ్రంథంలో సమకూర్చడానికి ప్రయత్నం చేయబడింది.

ఇంతకుముందు మనం చెప్పుకొన్నట్లు విస్తృతరీతిలో గ్రామ గ్రామమున గ్రంథాలయాన్ని స్థాపించడం శ్రీ వేంకటరమణయ్యగారి జీవితాశయం; అందుచేత యిందు పొందుపరచబడిన ఉపన్యాసాలు వ్యాసాలలో కొత్తగా గ్రంథాలయాలను స్థాపించుకొనగోరు వారికి ఎదురయ్యే అనేక సమస్యలు పరిష్కరింపబడ్డాయి; ఆర్థికవనరులు సమకూర్చుకోవడానికి ఏర్పాట్లు చూపబడ్డాయి; పిల్లలలో - స్త్రీలలో వయోజనులలో - చదివే అలవాట్లు పెంపొందింప జేయడానికి మార్గాలు సూచింపబడ్డాయి. గ్రంథాలయమందు ఆసక్తి కలిగించడానికిగల అంశాలన్నీ చెప్పబడ్డాయి. ఇట్టి విషయాలన్నీ ఇందులో సుబోధకంగా చర్చించబడ్డట్లు,సంపుటిని సాకల్యంగా పరిశీలిస్తే స్పష్టం అవుతుంది.

## అనుకరణాలుకావు - అనుభవకాంతి కిరణాలు

ఆంధ్రదేశంలోని గ్రంథాలయోద్యమం దేనికీ అనుకరణం కానట్లే, అయ్యంకివారి వ్యాసాలు చాలాభాగం వేటికీ అనుసరణాలు అనువాదాలుగావు. అనేక గ్రంథాల అవలోకన, పరిజ్ఞానం, అపారమైన అనుభవం మేళవింపగా వెలువడిన కాంతికిరణాలే యీ వ్యాసాలు, ఉపన్యాసాలు; వీటిలోగల విలువలనుబట్టి, నేను వాటిని పునశ్చరణ చేసుకోవాల్సిన అవుసరం కలుగుతున్నది.

## సంకలన క్రమం

ఈ సంపుటి చాల విస్తృతపరిధిలో తయారుచేయబడినది. ఇందు దాదాపు 50 వ్యాసాలున్నాయి. గ్రంథాలయ ఉద్యమం ప్రధాన విషయంగా ఉన్నది. ఈ వ్యాసాలలో అన్నీ గ్రంథాలయోద్యమంలో ప్రాధాన్యం వహించిన అంశాలనుబట్టి పదిహేనుప్రధాన భాగాలుక్రింద విభాగం చేయబడ్డాయి.

శ్రీ వేంకటరమణయ్యగారిని వివిధ ఉద్యమాలకు "శిరోమణి"గా చేసిన "ఆంధ్ర భారతి" పత్రిక సంపాదకీయం (1910) తో వారి జీవితపు మలుపుకు నాంది జరిగినటులనే, యీ సంపుటిగూడ, అదే

వ్యాసంతో ప్రారంభం అవుతుంది; పిమ్మట వారి జీవితానికి తిలక ప్రాయమైన "గ్రంథాలయ సర్వస్వం" సంపాదకీయం (1915) ప్రచు రింపబడింది;తర్వాత అఖండ భారత జాతీయతా దృష్టిని విశదీకరిస్తూ "వారికి" భూషణప్రాయమైన "ఏక జాతీయత" అను వ్యాసాన్ని (1911) వేశాము. ఈరీతిగా ఈ "అలంకార త్రితయా" న్ని ప్రథమ భాగంగా రూపొందించాము.

రెండవ భాగం: గ్రంథాలయముల ధర్మములు - అవి నిర్వ ర్తించవలసిన వివిధ రకములైన శాఖలు, సంఘసేవా విధానము - మొదలగు గ్రంథాలయ స్వరూప విజ్ఞానము - వివిధ దృక్పథాల నుండి కూలంకషముగా చర్చించబడింది.

మూడవ భాగంలో: ఆంధ్ర దేశంలో నవచైతన్యం మోసు లెత్తించిన ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమ ప్రవంతి — స్వరూప స్వభావాలను గురించి సంపూర్తిగా వివరింప బడ్డది. గ్రంథాలయో ద్యమం సింహావలోకనం చేస్తూ, నేటివరకు గ్రంథాలయోద్యమమున జరిగిన ప్రగతియొక్క పూర్తిరూపం ఇయ్యబడింది.తరువాత గ్రంథా లయ చట్టంలో చేయవలసిన మార్పులు చేర్పులు సూచింపబడ్డాయి. గ్రంథాలయోద్యమానికి దోహదం యిచ్చిన మహానుభావులు కందు కూరి వీరేశలింగం పంతులుగారి సేవకూడ ఇందు వివరింప బడ్డది. పశ్చిమ గోదావరిజిల్లాలో గ్రంథాలయోద్యమంలో పనిచేసిన గ్రంథాలయ సేవా వ్రతుల వివరాలుకూడ ఇందు వ్రాయబడ్డాయి.

నాల్గవ భాగంలో: గ్రామ గ్రంథాలయాలను గూర్చిన సమ స్యలన్నీ సాకల్యంగా వివరింప బడ్డాయి.గ్రంథాలయాలు నిర్వహించ వలసిన విధులు - ప్రజల కృషి — గ్రామ జీవనమునకుగ్రంథా లయమే కేంద్రము - మొదలగు విషయములను అనుభవ పూర్వక మైన వాటిని విడమర్చి చెప్పారు.

అయిదవ భాగంలో: వయోజన విద్యావిషయమైన రెండు వ్యాసాలు దీనిలో ఉన్నాయి. పల్లెటూర్లల్లో బస్తీలలో ఉండు

ముదిరినవారికి విద్యాభివృద్ధికై గ్రంథాలయ సేవ చేయదగు పలు మార్గములు ఇందు విశదీకరింప బడ్డాయి.

ఆరవ భాగంలో: చిన్నతనంలో వారుచదివిన గ్రంథాలు వివరింపబడ్డాయి; చదువును ఆటలుగా ఎట్లా మలుచు కోవాలనే విషయాన్ని బాగా వివరించారు; అందరూ సులభంగా రూపొందించు కోవడానికి వీలయిన ఆటల వివరాలుకూడా ఇందు ఇవ్వబడ్డాయి.

ఏడవ భాగంలో: గ్రంథాలయాలు ప్రత్యేకం కార్మిక సమస్యలను ఎట్లు తీర్చిదిద్దగలవో, ఆచరణలో పెట్టదగ్గ మార్గాలను ఇందు వివరించారు.

ఎనిమిదవ భాగంలో: బరోడా రాజ్యాధిపతియైన శ్రీ శాయాజీరావు గాయక్వారును గురించి, ఆ రాజ్యంలో ప్రచారమయిన గ్రంథాలయోద్యమాన్ని గురించి పూర్తి వివరాలు ఇవ్వబడ్డాయి; ప్రథమ అఖిలభారత గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులును బరోడా గ్రంథాలయోద్యమోద్ధారకులు అగు శ్రీ జనార్దన కుడాల్కరుగారి చరిత్ర వివరింప బడింది.

తొమ్మిదవ భాగంలో: ప్రాచీన భారత దేశమున గల గ్రంథాలయములను గూర్చి వివరింపబడినది.

పదవ భాగంలో: గ్రంథాలయ ప్రచారానికి విశేషంగా ఉపయోగించే గ్రంథాలయ యాత్రావిధానం – ఈ ఉద్యమ ప్రచారానికి అయ్యంకివారు ఆంధ్రులకు ప్రసాదించిన అపూర్వమైన కానుక. అఖిల భారతంలోకెల్ల ప్రప్రథమంగా వీరు ఆంధ్ర దేశంలో యీ విచిత్రమైన యాత్రావిధానాన్ని ప్రారంభించి, అనూనములగు సత్ఫలితాలను సాధించారు. ఆ వివరాలన్నీ ఈ అధ్యాయంలో ఉటంకించారు.

సంచార గ్రంథాలయాలు ప్రజల్లో గ్రంథ చైతన్యం కలిగించటానికి అనువైనవనీ – ఆంధ్ర దేశంలో ఇవి ఏవిధంగా ప్రచారమైనదీ వివరాలు కూడా తెలిపారు.

ఆంధ్రప్రభుత్వ సంచారశకట గ్రంథాలయం ఏలూరు జిల్లాలో ఎట్లు ఉజ్వలంగా పనిచేస్తున్నదినీ, ప్రభుత్వ గ్రంథాలయ శాఖను నడుపుచున్న శ్రీ రాఘవరెడ్డిగారు ఎట్టిశ్రద్ధ తీసికొంటున్నదీ కూడా వివరించారు.

పదకొండవ భాగంలో: గ్రంథ పఠనాన్నిగూర్చి అనుభవ పూర్వకమైన అపూర్వ విషయాలనుక్రోడీకరించారు;ఎంతకాలం చద వాలి, వినోదానికా, వికాసానికా, ఎందుకు చదవాలి – మొదలగు ప్రశ్నలకు ఇందు తగు సమాధానాలనిచ్చి, సాధనా క్రమాన్ని కూడ సూచించారు.

పన్నెండవ భాగంలో: గ్రంథాలయోద్యమం బాగా ప్రచా రం కావాలంటే, ఈ శాస్త్రమున శిక్షణపొందిన గ్రంథభాండా గారులు అత్యంత అవసరం; ఈ విషయాన్ని కనిపెట్టి అయ్యంకివారు 1920 నుండి గ్రంథాలయ శిక్షణ తరగతులను ఉజ్జీవింప జేయు టకై వారుచేసిన పరిశ్రమ ఇందు వివరింప బడింది. ఆంధ్ర గ్రంథ ముల వర్గీకరణమునకొక విధానమును రూపొందించి, దానిని బెజ వాడ రామమోహన గ్రంథాలయంలో అనేక సంవత్సరాలు ఆచర ణలోబెట్టిన ఫలితముగూడ ఇందున్నది.

పదమూడవ భాగంలో: పత్రికా ప్రపంచమునుగూర్చి వివ రించారు. దినపత్రికల దగ్గరనుండి మాసపత్రికల వరకూ – అన్నీ – గ్రంథాలయాలకు కన్నులవంటివి, అట్టి పత్రికలను నిత్యం విరివిగా ఉపయోగించు కొంటున్నాము, కాని, మనం నిత్యం చదువు వార్తా పత్రికలను ఆ రూపమునకు తెచ్చువారెవరో ఎట్లు తెచ్చుచున్నారో అను విషయములు మనకు బాగా తెలియవు, అట్టివిషయము లన్నియు ఈ వ్యాసమునందు విడమర్చి చెప్పబడ్డాయి.

పదునాలుగవ భాగంలో: విదేశాలలోని గ్రంథాలయ ప్రగ తినిగూర్చి ఇందు కొన్ని ముఖ్యమైన వ్యాసాలున్నాయి. అమెరికా, జర్మనీ, ఇంగ్లాండు, దేశాలలో గ్రంథాలయ పద్ధతులు, గుడ్డివారికి

గల గ్రంథపఠనసావకాశాలు, చీనాదేశంలోగల అపూర్వ గ్రంథ రాజము లను తెలియజేసే చిత్రమైన సంగతులింకు గలవు.

పదునైదవ భాగంలో : "దేశరక్షణ – మన కర్తవ్యాన్ని" గూర్చి 1963 సంవత్సరము స్వాతంత్ర్యోత్సవదినమున శ్రీ అయ్యంకి వారు విజయవాడ ఆలిండియా రేడియోనుండి ప్రసారం చేసిన "వాణి"ని మనము వింటాము; ఎంత విజ్ఞానమున్నా అది మన మాతృ దేశ సేవార్థమై వినియోగం కానిది సార్థకము కాదుకదా! మనమంతా అట్టి దీక్షను వహించుటకు దేశసేవకై బద్ధకంకణులము అగుటకు ఈ వాక్కులు మనలను పురిగొల్పుగాక.

## గ్రంథాలయ విజ్ఞాన కోశము

ఈ సంపుటి ఒక గ్రంథాలయ విజ్ఞాన కోశమని చెప్పాలి. గ్రంథాలయ నిర్వచనం దగ్గర మొదలుపెట్టి – గ్రంథాలయ పాలన వరకు గ్రంథాలయ ప్రగతియందు ఎన్ని విషయాలున్నాయో- అన్నీ ఇందులో వివరింప బడ్డాయి.

## ఏబదియారు వత్సరాల అవిరళ సేవ

ఇందులో ప్రచురింపబడిన వ్యాసాలు ఉపన్యాసాలు గత అయిదున్నర దశాబ్దాల కాలానికి (అంటే 1910 నుంచి 1963 వరకు) సంబంధించినవి. అందుచేత భాషలో అంతరం ఉన్నా భావాలలో అనుస్యూతిఉంది, పునరుక్తి లేకపోలేదు. అయినప్పటికీ అట్టివాటిని సాధ్యమయినంతవరకు తగ్గించటానికి ప్రయత్నం జరిగినది.

ఈ సంపుటిలోగల రచనలలో ముఖ్యంగా గ్రామసీమల గ్రంథాలయాల పై మొగ్గు చూపబడింది. గ్రామ సౌభాగ్యమే దేశ సౌభాగ్యంగా ఎంచుతూన్న ఈ తరుణంలో యీలాటి పుస్తకాల అవసరం ఎంతో కనపడుతుంది.

## అపూర్వ వ్యక్తి

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారిలాంటి అపూర్వ వ్యక్తిని అనుభవ శీలుని, భావాలను సద్వినియోగ పరచుకోవాల్సిన అవసరం ఎంతో కనిపిస్తుంది; దీనిని విస్మరించితే విజ్ఞాన వికాసానికే వెన్నుపోటు కలిగే ప్రమాదం ఉందని చెప్పడానికి సాహసిస్తున్నాను.

## దీని ఉపయోగం

ఈ సంపుటి జన సామాన్యానికేగాక, గ్రంథాలయ కార్యకర్తలకు, గ్రంథపాలకులకు, గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పొందుతున్న విద్యార్థులకు, గ్రంథాలయ నిర్మాణము, నిర్వహణ విషయంలో దర్పణంలాగ ఉపయోగించగలదనటంలో సందేహంలేదు.

దీనిని తెలుగు నాటగల గ్రంథాలయ లోకం తప్పక సమాదరించగలదని హృదయ పూర్వకంగా నమ్ముతున్నాను.

## కృతజ్ఞత

శ్రీ వేంకట రమణయ్యగారి వ్యాసాల, ఉపన్యాసాల సంకలనానికి ప్రోత్సహించి, అందంగా ప్రచురించడానికి కృషిచేసిన పరిచురణ కర్తలకు నా మనఃపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. సెలవు.

సర్వోత్తమ భవనం
విజయవాడ
25—10—66

వెలగా వెంకటప్పయ్య.
సంపాదకుడు



# అలంకార త్రితయము

## ౧– "శిరోమణి"

### "ఆంధ్రభారతి" సంపాదకీయము

[1910 వ సంవత్సరమున శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారి సంపాదకత్వమున, మచిలీపట్నమునుండి వెలువడిన "ఆంధ్ర భారతి" అను తెలుగు మాసపత్రిక సంపాదకీయము ఇందు ఉద్ధరింపబడినది.

నాటిపరిస్థితుల్లో ఏయే భావప్రేరణ వలన మాసపత్రిక ప్రారంభించడానికి పంతులుగారు ప్రబోధింప బడినారో ఆ ప్రబోధంవల్ల, ప్రకటింపబడిన "ఆంధ్ర భారతి" ఆనాటి మాసపత్రికలకెల్ల "శిరోమణి"యై వెలసింది. ఆ భావపరంపర నాడు సంపాదకీయంగా "ఆంధ్రభారతి"కి శిరోమణి అయింది. తరువాత వెలువడిన "శ్రీ వెంకట రమణీయవాణి"కి ఒరవడి యైనది. ఈ నాటికీ ఆ భావపరంపర పునశ్చరణీయ యోగ్యం అగుటచేతనే "శ్రీ వేంకటరమణీయ వాణి"కి "శిరోమణి" గా ప్రచురిస్తున్నాము.

### వర్తమాన స్థితి

హిందూదేశ చరిత్రయందు ప్రస్తుత కాలమువంటి సందిగ్ధ సమయము మునుపెన్నఁడును దటస్థించి యుండలేదు. పూర్వపు భరత ఖండ చరిత్రమునందనేకములగు మార్పులును, సంస్కరణములును, విప్లవములును, జరిగియుండెను గాని సంఘముయొక్క జీవనమునందలి యన్ని ప్రకరణములయందును, దేశముయొక్క యన్ని భాగముల యందును, నొక్కమారుగ సంచలనము సంభవించి యుండలేదు. విద్యుత్తంత్రుల చేతను, ధూమ యానములచేతను, వార్తాపత్రికా సంచారము చేతను, పరస్పర పరిచయమును వివిధ నాగరికతల సమ్మే

శనమును, వివిధాచార వ్యవహారముల జ్ఞానమును వృద్ధినొంది భారత ఖండమంతయు నేక జాతీయ జీవనంబను ప్రవాహమునందు నిమగ్న మయి పోవుటయేగాక - విశాలమైన మానవజీవన సాగరమునందు సంగమ మగుచున్నది. ప్రాచీనములైన సాంఘిక ప్రతిష్ఠాపనములు శిథిలములగు చున్నవి. ఒక ప్రక్క మత విశ్వాసములు నశించు చున్నవి. ఇంకొకచక్కి నవీనభావము లంకురించుచున్నవి. మరియొక దిక్కున నభినవములైన యాదర్శము లుదయించు చున్నవి. సనాతన ధర్మమునకును ఆధునిక ప్రవర్తనమునకును, ప్రాచ్య నాగరికతకును పాశ్చాత్యనాగరికతకును సంఘర్షణముకలుగు చున్నది. ఈసంఘర్షణముల మూలమున దేశము నందెల్ల సంక్షోభమును అల్లకల్లోలమును జనించి పూర్వమెన్నడు నెదుర్కొనని సమస్యలు నేడు ప్రతి భారతీయుని నెదుర్కొనుచున్నవి.

## పునర్నిర్మాణము - దేశావశ్యకములు

దేశీయ సాంప్రదాయమునకును ఆధునిక పరిజ్ఞానమునకును అతి ఘోరమగు యుద్ధము జరుగుచున్నది. కాలము శ్రీ కృష్ణదత్తమైన సంస్థాపకులకై ప్రార్థించుచున్నది. సంఘము పునర్నిర్మాణమునకై సమర్థులును ప్రతిభావంతులును, ధైర్యనిధులును, దూరవిచారులును, మార్గదర్శకులును నగు నభినవ సంస్కర్తలను గోరుచున్నది. హిందూ ధర్మము పునరుద్ధారణకై లోకజ్ఞులును వేదవేదులును బ్రహ్మజ్ఞాన సంపన్నులు నగు నాచార్యవర్యులను వాంఛించు చున్నది. పరిశ్రమ లభ్యుదయమునకై, శ్రీమంతులును నానా దేశ సంచారవరులు నగు ఆర్థికశాస్త్ర ప్రవీణుల రాకకయి నిరీక్షించుచున్నవి. రాజకీయ జీవ నము సంపూర్ణ విజృంభణమునకై, దేశభక్తి భరితులు- నానా దేశ చరిత్రజ్ఞానులును- నిర్భీక మనస్కులును - మహోదారులు నగు జాతీయ నిర్మాతల నభిలషించుచున్నది. దేశీయ పరిజ్ఞానము విశేష వికాసమునకై కాలానుకూల గ్రంథరచనా దక్షులును, జాతీయ విజ్ఞాన శోభితులును, దేశభాషాభిమానులును, నగు సాహితీ సహి

తులను కాంక్షించుచున్నది. భారతీయుల జీవితమునందు సంచలనము లేని భాగమెందును గానరాకున్నది. ఈ సంచలన మెట్టిమార్గముల ద్రొక్కునో ? ఎట్టి పరిణామమును జెందునో? ఎట్టి ఫలముల నిచ్చునో హ్రస్వదృష్టిగల మానవ మనోనేత్రమున కగోచరముగా నున్నది.

## ఆశాజ్యోతి

ప్రస్తుత స్థితియం దెన్ని నష్టములు కలుగుచున్నను, ఎన్ని కష్టములు వచ్చుచున్నను, ఎన్ని విఘ్నములు తటస్థించుచున్నను, ఎన్ని యపజయములు సంభవించుచున్నను హిందూదేశముయొక్క భావిస్థితి మహాతేజోవంతమై ప్రపంచమునందెల్ల అనుపమానమై విరాజిల్లుననెడు మహాశాజ్యోతి ప్రతి భారతీయుని హృదయాకాశమునందును ప్రకాశించు చున్నది. ఈ యాశచేతనే సంస్కర్తలును, ధనికులును, విద్యాధికులును, భాషాభిమానులును, దేశభక్తులును సర్వవిధముల దేశసేవకయి యథాశక్తిని బ్రయత్నించుచున్నారు. వీరి ప్రయత్నములు కొన్ని సమయములయందు పరస్పర విరుద్ధములైనను, ఏకోద్యమ ప్రేరితములగుట వలన దేశమునకు క్షేమకరములును శుభప్రదములు అగుననుటకు సందియము లేదు.

## భేదము - అభేదము

భేద మెప్పుడును వృద్ధి క్రమమునే సూచించునుగాని, క్షీణ దశకు హేతువు కానేరదు. భేదము ప్రకృతి లక్షణముమాత్రమేగాక జ్ఞాన లక్షణమును అగుట నిశ్చయము. కాని భేద భావములును భేద మతములును మౌర్ఖ్యజనితములుగాక — వివేకజనకములును విమర్శనాయుక్తములు నయినచో తుద కభేదమునందే పరిణమించును.

## విమర్శ — ధర్మనిర్ణయము

ఈ భేదములను మూఢత్వమునుండి తప్పించి జ్ఞానపథంబునం బ్రవేశపెట్టుటకు విమర్శలకంటె సులభోపాయము కానరాదు- విమర్శ

నము హేతువాదనమును, జరిత్రి పరిశోధనమును, దేశ సాంప్రదాయ మును, శాస్త్ర ప్రమాణమును బ్రకటించి ధర్మస్వరూపమును నిరూపించును. ఈ తరుణమునందే యిట్టి విమర్శనాజ్ఞానమును వృద్ధిచేయుట కర్తవ్యమని చెప్పనవసరములేదు. ఇట్టి విమర్శనలకు దేశభాషలయందు బ్రకాశితములగు నుత్తమ పత్రికలే ప్రధాన సాధనములు.

## భావ సంచారములేని సంఘము నిర్జీవము

రక్తప్రసారములేని శరీర మెట్లు మరణావస్థనొందునో యట్లే భావసంచారములేని సంఘమును నిర్జీవము నొందును. భావ ప్రకటనకు సర్వావకాశములను గల్పించుట సంఘ నిర్మాణకుల యవశ్య కర్తవ్యము. ఏ శాసనమైనను ఏ నీతియైనను భావోదయమును నిరోధించరాదు. ఏ సంఘము భావనాశక్తిని భావ ప్రకటనమును నిరోధించునో ఆ సంఘము సర్వపీడలకు ఆకరమై యధోముఖ మార్గగామి యగును.

జాతీయ జీవనమునకు దోహదము నొసంగి వాఙ్మయ ప్రపంచమునకు నూతన తేజంబు నొసంగగల పత్రికలవశ్య ప్రతిష్ఠనీయంబులు.

## స్వధర్మ సంస్థాపనము

అనాదినుండియు పారంపర్యముగ వచ్చుచున్న యాచార వ్యవహారములను జరిత్రి జ్ఞానముచేతను శాస్త్ర పరిశోధనము చేతను సంస్కరించి, యుత్తమ జ్ఞానములను నవీనోద్యమములను వ్యాసముల మూలమున వివరించి, యాంధ్రభాషాభిమానుల కానంద సంధాయకమగు సందేశమును హృద్యముముగా గావ్యగానముల చేనివేదించి-బాలురకును వృద్ధులకును, స్త్రీలకును బురుషులకును, పండితులకును బామరులకును, బాలితులకును బాలకులకును, వణిక్కులకును కృషీవలులకును, స్వాతంత్ర్యవాదులకును పూర్వాచార పరాయణులకును, జాతీయ జీవనమునందలి వారి వారి యధికార బ్రయోజనములను

ప్రబోధించి, స్వధర్మ సంస్థాపనమునకై ప్రవర్తించుచున్న మహా యుగమున కవలంబనమై శ్రీ యాంధ్రభారతి యాంధ్రదేశము యొక్క సత్కీర్తిని ప్రకాశింపజేయునుగాక !

మూడుకోట్ల మహాజనులచే భాషింపబడుచు నన్నయభట్టారకాది మహాకవీంద్రులచే బోషింపబడి కృష్ణరాయాది రాజచంద్రులచే మన్నింపబడి యభివృద్ధి నొందియున్న యాంధ్రభాషా యోషామణియొక్క మాధుర్యమును లావణ్యమును గాంభీర్యమును నాంధ్రభారతి గీతము సేయుచు భారత మహామండలముయొక్క నిరంతరోత్తుంగ సంగీతమును సవిస్తరము జేయుగాక ! †

## భావ విప్లవం

[పూర్వ సాంప్రదాయాలకీ నవీన పద్ధతులకీ మధ్య సంఘర్షణ తీవ్రంగా జరుగుతున్న రోజులవి. రాజకీయంగా సాంఘికంగా సారస్వతపరంగా విద్యావిషయికంగా పారిశ్రామికంగా - సర్వవిధాలా సంఘర్షణ సంకులమైన సంఘాన్ని ఆనాడు తీర్చిదిద్దాలంటే సర్వరంగాల్లోనూ - రాజకీయవేత్తలు సంఘసంస్కర్తలు సాహితీపరులు విద్యాధికులు పారిశ్రామికులు పండితులు భాషాభిమానులు దేశభక్తులు ధనికులూ - సర్వులూ యథాశక్తిని ప్రయత్నించాలి. దేశంలో నాల్గుమూలలా నూతన భావప్రచారం జరగాలి. ఆయా విషయికమైన ప్రయత్నాలు ఏకోన్ముఖం కావాలి. జాతీయ జీవనానికి దోహదంచేసే వాఙ్మయ ప్రపంచంలో నూతన తేజాన్ని ప్రసాదించగల పత్రికలు అవశ్యప్రతిష్ఠనీయాలు. ఈ సంకల్పాన్ని పురస్కరించుకొని పంతులుగారు 1910 వ సంవత్సరంలో "ఆంధ్రభారతి" అనే మాసపత్రికను బందరులో తమ సంపాదకత్వంలో స్థాపించి సర్వులకు వారి వారి అధికార ప్రయోజనాలను ప్రబోధించి "ఆంధ్రదేశం యొక్క

† "ఆంధ్రభారతి": 1 వ సంపుటం: 1 సంచిక; 1910 జూన్.

సత్కీర్తిని ఆ పత్రిక ప్రకాశింపజేయుగాక" అన్న ప్రతిజ్ఞను సఫలీకృతం జేసికొన్నారు. ప్రథమ సంచికలో ప్రథమ సంపుటంలో శ్రీ మంగిపూడి వేంకటశర్మగారు:

" భరత మాతకు ముద్దుకొమరిత యగుచు
నలరి మన యాంధ్రమాత వర్ధిల్లెడుగాత ।
... ... ... ... ... ... ... ... ... ...
యశమున నిమ్రంచుగాత శ్రీ యాంధ్రమాత ।

అని చేసిన ఆశీర్వచనం ఫలించింది.

## దే శ ప రి స్థి తి

ఏదైనా ఒక ఉద్యమాన్ని దేశంలో ప్రవేశపెట్టి ప్రచారం చెయ్యాలంటే ఆనాటి దేశ విదేశ పరిస్థితుల్ని బాగా ఆకళింపు చేసికోవాలి. ఇరుగు పొరుగు రాష్ట్రాలలో ఏమి జరుగుచున్నదో అవగాహన చేసికోవాలి.

ఆ రోజుల్లో విదేశ ప్రభుత్వం మనల్ని పరిపాలిస్తూ, "విభజించి పరిపాలించు( Divide and rule ) అనే దమననీతిని అవలంబించింది. 1905 వ సంవత్సరం జులై 7 వ తేదీన లార్డు కర్జన్(అప్పటి వైస్రాయి)బెంగాల్ రాష్ట్రాన్ని రెండుముక్కలుగా చీల్చే పథకాన్ని ప్రకటించాడు. ఆ రోజుల్లో బెంగాలీలు రాజకీయంగా ప్రాబల్యం వహించడం రాజకీయచైతన్యంతో దేశాన్ని ప్రబోధం చెయ్యగలిగిన సత్తా వారిలోఉందని ప్రభుత్వం గ్రహించడమే దీనికి కారణం. బెంగాలును రెండు చీలికలుచేస్తే — విభజింపబడ్డ రెండు చీలికల్లోనూఉన్న హిందువులు అల్పసంఖ్యాక వర్గమై, రాజకీయాందోళన చెయ్యటానికి బలంతగ్గి ఆ ఆందోళనస్థాయి తగ్గుతుందనే ఉద్దేశం ప్రభుత్వానికి కలగడమే ఈ కార్యానికి కారణం.

## బెంగాల్ విభజన - వందేమాతరోద్యమం

ఈ ప్రభుత్వ ప్రకటన బెంగాలులో తీవ్రమైన ప్రతిఘటనలిచ్చి

ఎదుర్కొంది. పత్రికల్లోనూ, సభల్లోనూ ప్రజాందోళన విపరీతంగా జరిగింది. ప్రభుత్వ ప్రణాళికను ప్రతిఘటించడానికి 1905 ఆగస్టు 7 వ తేదీన కలకత్తా పట్టణం (అప్పుడు కలకత్తా భారతదేశానికి రాజధాని) టౌనుహాలులో ప్రజలందరూ గుమిగూడి బ్రహ్మాండమైన సభలో విదేశ వస్తుబహిష్కారం చెయ్యాలని తీర్మానించారు. ఈ ఆదేశాన్ని అనుసరించి దేశభక్తులైన యువకులు శాంతియుతంగా విదేశ వస్త్ర వస్తు వ్యాపారంచేసే షాపులలో పికెటింగు ప్రారంభించారు. ప్రభుత్వం అండచూసుకొని వ్యాపారస్తులు యువకుల్ని ఉద్రేకపూరితుల్ని జేశారు. యౌవనోద్రేకం హింసాపూర్వకంగా ప్రస్ఫుటీకరించింది. అప్పుడు ఆ సభల్లో దేశభక్తి ద్యోతకమైన "వందేమాతర" గీతాన్ని ఆలాపించి యువకుల్ని ప్రబోధం చేసేవారు. "వందేమాతరం" గేయాన్ని 1880 సంవత్సరంలోనే వంగదేశ ప్రఖ్యాత కవిచంద్రుడు బంకించంద్ర చటోపాధ్యాయ తాను రచించిన "ఆనంద మఠం" అనే నవలలో ఒక పాత్రచేత పలికించారు. ఆ గేయం బెంగాలు స్వదేశ ఉద్యమంలో యువకుల్ని దేశభక్తి పూరితుల్ని చెయ్యడానికి ప్రప్రథమంగా సభల్లోనూ, సమావేశాల్లోనూ గానంచెయ్యబడేది. అంతవరకూ ప్రచ్ఛన్నంగా ఉన్న గేయం ప్రజల్లో ప్రచారం అయింది. 1905 లో స్వదేశీ ఉద్యమం- "వందేమాతరం" ఉద్యమంగా రూపొందింది. ఈ ఉద్యమాన్ని పురస్కరించుకొని, దేశంలో యువకులందరూ, విదేశవస్తు బహిష్కారాన్ని చేయడం- దేశదాస్యశృంఖలా విచ్ఛేదన దీక్షా రక్షా బంధాలు ధరించడం- మొదలయిన కార్యక్రమాలతో బ్రిటీషు ప్రభుత్వాన్ని ఉద్రూత లూగిస్తూంటే, ప్రభుత్వం దౌర్జన్య హింసాకాండల్ని ప్రారంభించింది; వాటిని తట్టుకోలేక, రహస్య విప్లవసంఘాలు వంగదేశమున ప్రారంభమయ్యాయి.

## పంతులుగారి గ్రంథాలయోద్యమానికి బీజాంకురం

1907 లోనే వందేమాతరోద్యమ ప్రచారానికి "అరవింద ఘోష్" సంపాదకత్వంలో "వందేమాతరం" అనే ఆంగ్ల దినపత్రిక

ప్రచురణ ప్రారంభం అయినది. దాని నెలసరి చందా 1-8-0 మాత్రమే. అప్పటికి వేంకటరమయ్యగారు 'నాల్గవ ఫారం' చదువుతున్నారు. తోడి క్లాసుపిల్లలు ఒక్కొక్కరినుండీ రెండణాల చొప్పున వసూలు చేసి "వందేమాతరం" పత్రికను తెప్పించ ప్రారంభించారు.

అదే పంతులుగారి 'ప్రథమ పఠనాలయానికి' ప్రాతిపదిక అయింది భవిష్యత్తులో గ్రంథాలయోద్యమానికి బీజాంకురం కూడా అయింది. 'దేశచరిత్రను జ్ఞాపకంచేసి, దేశీయులను ప్రబోధించే నిమిత్తం భారతవీరుడు సావర్కారు మహాశయుడు 1909 లో "భారతదేశ స్వాతంత్ర్యయుద్ధం - 1857" అనే మహోజ్వలమైన గ్రంథాన్ని వ్రాసి ఇంగ్లండులో ప్రచురించారు; దానిని భారతదేశానికి రాకుండ బ్రిటిషు ప్రభుత్వం నిషేధించింది; బాబు బిపిన్ చంద్రపాలు 1909 లోనే "స్వరాజ్" అను మాసపత్రికను, హిందూదేశంలో ప్రచురించడానికి అవకాశంలేక "లండను" నగరమునుండి ప్రచురించవలసి వచ్చినది, అందుచేత ఈ రెండింటిని భారతదేశంలో రహస్యంగానే ప్రచారం చెయ్యవలసి వచ్చింది.

## పంతులుగారి "దీక్షాకంకణ" ధారణ

వందేమాతరోద్యమ ప్రచారానికీ భారత జాతీయైక్యతా ప్రబోధానికి శ్రీ బిపిన్ చంద్రపాలు 1907 సంవత్సరంలో ఆంధ్ర దేశ సంచారాన్ని ప్రారంభించి రాజమహేంద్రవరంలో ఉపన్యాసాలిచ్చారు. అప్పుడు శ్రీ వేంకటరమణయ్య పంతులుగారు వారి ఉపన్యాసాలను విని ఉద్రిక్తులై దేశదాస్య విముక్తికి బద్ధకంకణులై రక్షాబంధం ధరించారు. "పాలు" గారి వందేమాతరోద్యమ సందేశం ఆంధ్రదేశమంతటా ఎలుగెత్తి చాటారు. రాజమండ్రిలో జరిగిన "పాలు" గారి బహిరంగ సభలకు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు గారు అధ్యక్షత వహించి ఆఖరిరోజున ఈ పద్యమును ఆశువుగ చెప్పారు —

"భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి"

ఆ పద్యమును విన్నవారై ఆ తెల్లవారి యకార్యమునకు ప్రతిక్రియగా చేయవలసిన ప్రతీకారమును తరువాత శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారిట్లు సూచించారు:-

"దుడుకుదనమున దీకదీ గడుసుదనము
గాన తాపులు పోటులు గార్యమనక
లేగ లన్నిటి నేక మౌ లాగొనర్చి
నేర్పుతో దల్లియెగ జేప నేరవలయు"

పోట్లాడకుండ సాత్త్విక నిరోధమునకు అంకురార్పణము ఆయన ఆనాడే జేసినారు.

## వందేమాతరం - దేశభక్తి కవిత్వావిర్భావం

ఆనాడు ఆంధ్రదేశంలో "వందేమాతరం, మందేరాజ్యం" అనే నినాదాలు ఆంధ్రులందరి కంఠాలనుండి మార్మ్రోగుచుండెను. ప్రతి సభలోను, సమావేశాలలో, ఊరేగింపులలోను "వందేమాతరం" గీతాన్ని ఆలపించేవారు: దానితోబాటుగా మంగిపూడి వేంకటశర్మగారిచే రచియింపబడిన "ఆంధ్రమాత శ్రీ సమేత - అనుపమ ప్రఖ్యాత చరిత-అఖిల భక్తపారిజాత-అనఘమంగళం" అనే గీతాన్ని పాడి ఆంధ్ర మాతృవందన సమర్పణకూడా చేసేవారు.

"దేశాభిమానంబు దీపింపజేయు మంత్రంబు వందేమాతరంబు సుండి" అనే మకుటంతో 1907 లోనే మంగిపూడి వేంకటశర్మగారితోనే దేశభక్తి కవిత్వంకూడ తెలుగు వాఙ్మయంలో ప్రథమంగా ఆవిర్భవించింది.

మచిలీపట్నంలో 1908 సం॥న కందుకూరి వీరేశలింగం పంతులుగారి అధ్యక్షతక్రింద "ఆంధ్ర ఆస్తిక మహాసభ" జరిగింది. శ్రీ అవటపల్లి నారాయణరావుగారి ఆహ్వానంమీద అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు ఆ సభా సందర్భంగా మచిలీపట్నం వెళ్ళి-అచట తరువాత శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి ఆధ్వర్యంలో జరిగిన "విప్లవోద్యమ" రహస్య సమావేశంలో పాల్గొన్నారు.

## కర్తవ్య నిర్ణయం

ప్రజలలో రాజకీయ దాస్యవిముక్తి ప్రబోధానికి ముందర భావ దాస్యవిముక్తి కలిగించాలి. విస్మరింపబడుతు న్న చరిత్ర విని ర్మింపబడాలి; ప్రాచీన హిందూ దేశ చరిత్ర, ప్రాచీన ప్రజాస్వామిక పరిపాలనా పద్ధతులను గురించి నూతన దృక్పథంతో ప్రబోధించాలి. ప్రాచీన విజ్ఞానం, అందులోవున్న అందచందాలు, అరమరికలు, సౌరభం, ప్రజలకు అందజేయాలి. ప్రాచీన కళలలోవున్న పరమ సత్యాన్ని, సౌందర్యాన్ని, అందించాలి. అంతకుపూర్వం ఉన్న సంపదనూ సంతరించాలి. భావ దాస్యవిముక్తికి వినూతన మార్గాలు అన్వేషించి వివరించాలి.

ఒకమూల గ్రాంథిక గ్రామ్యభాషావాదాలు, సనాతన భావ శృంఖలాలు; స్త్రీల దుస్థితి: అస్పృశ్యత- మూఢాచారాలతో ముకు ళించుకుపోయిన సంకుచిత హృదయ గ్రంథుల్నివిప్పి సహృదయత్వం సంస్కరించేటట్టు చెయ్యాలి.

## ఆనాటి పత్రికలు

తెలుగుదేశంలో ఆనాడు ప్రఖ్యాతి వహించిన మాసపత్రిక లలో వీరేశలింగం పంతులుగారి "వివేకవర్ధని" (1878), నెల్లూరు నుండి వచ్చే - ఒడ్డె రామకృష్ణయ్యగారి "అముద్రిత గ్రంథ చింతా మణి"(1885); ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారి"కల్పలత" మొదలైనవన్నీ సాహిత్య విమర్శలు చేసేవి; కాని ఆనాటి విమర్శ

శబ్దాత్మకంగా ఉండేది. శబ్దసాధుత్వ అసాధుత్వాలు, శకట రేఫ సాధు రేఫల నిర్ణయం, పాండిత్యప్రకర్షా ప్రదర్శనం, విమర్శకు ప్రతి విమర్శ - ఈ మార్గాల్లో నడిచేది; ఆనాడు శిష్ట వ్యావహారిక భాషా వ్యాసాలు, కథలు, రాజకీయ దృక్పథమున దేశ సమస్యలు - ప్రచు రించేవారుకారు. దేశచరిత్ర - దేశీయ విదేశీయ నాగరికత - నవ్య కవితారీతుల్ని ద్యోతకం చెయ్యటం- సంఘ సంస్కరణ పరిష్కార మార్గాలను సూచించడం - సాంఘికానికి సమన్వయం చేయడం - అట్టి సమస్యా పరిష్కార మార్గాన్ని సాహిత్యంద్వారా ప్రబోధం చెయ్యడం- ప్రాచీన నవీన పద్ధతుల సమన్వయ సామరస్య విధానా లకు దోహదంచేసే వ్యాసాల ప్రచురణ - మొదలైన విధానాలేవీ మాసపత్రికా ప్రచురణ పద్ధతులలో లేవు; సచిత్రాత్మకంగా మాస పత్రికలను అలంకరించే విధానాలు అసలే లేవు.

## "ఆంధ్ర భారతి" స్థాపన

శ్రీ వేంకటరమణయ్యగారు, ఆంగ్లమున కలకత్తానుండి ప్రచు రింపబడే (1907) "మోడరన్ రివ్యూ", మొదలైన వంగదేశమునుండి అందచందాలతో వెలువడే పత్రికలను పరిశీలిస్తూ వచ్చారు. అట్టి విధానాలలో మాతృభాషలో పత్రికను ప్రచురించడానికి మోజు పడ్డారు.

ఇట్టి పరమార్గముల నన్నింటినీ యోచించి, ఆయా ఆదర్శముల సిద్ధికై ఒక శుభముహూర్తమున 1910 సం॥ జూను నెలలో మచిలీ పట్నమునుండి "ఆంధ్రభారతి" మాసపత్రికను అయ్యంకివారు ప్రారంభించారు.

## "ఆంధ్రభారతి"- అభ్యుదయ పంథా

ఆ పత్రికలో సచిత్రాత్మకంగా సాహిత్యం - సంగీతం-చిత్ర శిల్పకళలను గురించిన వ్యాసాలు, ప్రాచీన శాసనాలనుగూర్చిన విమర్శనములు, భాషా విషయికమైన వివిధ సమస్యలను గూర్చిన వ్యాసములు, జాతీయ విద్య- దేశచరిత్ర-మతసంస్కార సమన్వయం,

వ్యవసాయం, పశుసంపద, పరిశ్రమలు, పరిశోధనలు; ప్రఖ్యాత క్షేత్ర యాత్రాస్థలాల చరిత్రలు - ప్రఖ్యాత పురుషుల చరిత్రలు - ఆంగ్ల సాహిత్యాంధ్రీ కరణములు, ఇతర ప్రాంతీయ భాషలలోని- హిందీ, బెంగాలీ, ఉర్దూ, మరాటీ, మొదలైన వాటిలోని సాహిత్యాను వాదాలు ప్రకటింపబడినాయి.

రాజా రామమోహనరాయి, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, బంకించంద్ర చటర్జీ. రవీంద్రనాథ ఠాకూరు- వీరల సాహిత్యం - మొదలైన వైవిధ్యాన్ని అంతా అమర్చి ముద్దులు మూటగట్టే అచ్చుతో మురిపెంతో ముచ్చటగ మూడు సంపుటాలు నిర్వ హించారు పంతులుగారు.

ఆ సంచికలు తిలకిస్తే, ఆనాడు అది చేసిన భాషాసేవ, దేశ సేవ - చారిత్రిక, రాజకీయ, పారిశ్రామిక, వ్యవసాయిక, ఆరోగ్య విష యిక, విద్యాసంబంధమైన సంస్కరణల- వ్యాస విస్తృతిని గమనిస్తూ విస్తుపోతాము.

ఆంధ్ర మాసపత్రికా చరిత్రలో అపూర్వమైన అధ్యాయం ఆరంభించింది "ఆంధ్ర భారతి". ఆంధ్రులకు సర్వతోముఖమైన సముజ్వలమైన సమాచారం అందించింది. ఆనాటి సంఘ ప్రగతికి "ఆంధ్ర భారతి" అద్దంలాంటిదంటే అతిశయోక్తిగాదు- శ్రీ గొర్రె పాటి వేంకటసుబ్బయ్యగారు "దేశోద్ధారక" చరిత్రలో (107 పుట) ఈ పత్రికనుగూర్చి ఇట్లు స్మరించారు - "మనదేశంలో వివిధ భాష లలో శిల్పసాహిత్యములే ప్రధానంగా గలిగిన సర్వాంగసుందరమైన సచిత్ర మాసపత్రికలు కొన్నివుండేవి. కాని ఆంధ్రలో అటువంటి పత్రికలులేని కొరతను తీర్చుటాసికి అయ్యంకి వేంకటరమణయ్యగారు 1910 సంవత్సరములో "ఆంధ్రభారతి"ని స్థాపించినారు".

నానాభావ సుసంపన్నంగా, నవనవోన్మేష భావ సముపేతంగా వెలిగి "ఆంధ్ర భారతి"(1910-13)"గ్రంథాలయ సర్వస్వానికీ(1915)" ఆనాటి "శారద"కూ (1923), నేటికీ నిలచిన "భారతి" కి (1924) నాందీ వాక్యాలు పలికింది.

1910 సంవత్సరము డిశెంబరు 4 వ తేదీన విజయనగరంనుండి శ్రీ గురజాడ అప్పారావుగారు నెల్లూరిలోని ఒక స్నేహితునికి ఉత్తరం వ్రాస్తూ "ఈ మధ్య నేను వ్రాసిన కవిత్వం "ఆంధ్ర భారతి" లో అచ్చుపడింది చూశావా? (1910 జూన్‌లో "ఆంధ్ర భారతి" అయ్యంకివారి ఆధ్వర్యంలో ప్రారంభింపబడింది)."డామన్ పితియస్" ను ప్రాచీన సంప్రదాయాలకు కట్టుబడిన పత్రికలవాళ్లుసైతం ఎంతో మెచ్చుకొంటున్నారు. (గురజాడ రచనలు-౬-లేఖలు విశాలాంధ్ర ప్రచురణ- పేజీ 104).

1911 వ సంవత్సరం నవంబరు 22 వ తేదీన మైలాపూరు-ఎడ్మిరాల్టీ హౌసునుండి ఒక స్నేహితుడికి ఉత్తరం వ్రాస్తూ శ్రీ గురజాడవారు ఇట్లుఉటంకించారు:"నేను వ్రాసిన గేయములు,"నీలగిరి పాటలు", "ముత్యాల సరములు""డామన్ పితియస్", "లవణ రాజు కల" "కాసులు"- ఇవి "ఆంధ్ర భారతి" లో ప్రకటితమయాయి. ఇవికాక"ఆంధ్ర భారతి"లో మరికొన్ని కథలుకూడా ప్రచురించారు. (పేజీ 200), ఈ మధ్యనే "ఆంధ్రభారతి" కినేనొక మూడు చరణాల గేయాన్ని పంపించాను. అందులో పాత శబ్దాలు లేవు" (పేజీ 20?) అనీ శ్రీ అప్పారావుగారు వివరించారు.

ఈ సందర్భంలో ఒక సంఘటన వివరించాలి. ఆ రోజుల్లో శ్రీ గురజాడవారికి తమ రచనలను "ఆంధ్ర భారతి" లో ప్రచురించ టానికి పంపమని వ్రాయగా, వారు "మీరు ప్రాచీన సంప్రదాయా లకు కట్టుబడినవారుకదా, నా రచనలు నవీన పద్ధతిలో ఉంటాయి" అని సమాధానం వ్రాశారు.

ని నవీనమార్గానికికూడా ప్రియులైన శ్రీ అయ్యంకివారు తమ ప్రసిద్ధసారస్వత పత్రికయైన"ఆంధ్ర భారతి"లో వారి రచనలకు కొరుకు లేకుండా స్థానమిచ్చి నవ్యసాహిత్యంలో "గురు జాడ" నేర్పరుచు కొన్న అప్పారావుగారి కవిత్వానికి ఆనాడే దోహదం కల్పించారు.

పంతులుగారితో కలసి గ్రంథాలయోద్యమంలో పనిచేసిన శ్రీ దాసు త్రివిక్రమరావుగారు 1950 లో శ్రీ అయ్యంకి వేంకట

రమణయ్యగారి షష్టిపూర్తికి శుభాకాంక్షలు పంపుతూ, కొత్తగూడెం నుండి ఇలా వ్రాశారు:-

"ఆంధ్ర భారతి" వైదుష్యంతోనూ, సముచితంగానూ ప్రచురింపబడ్డ మాసపత్రిక. ఆ కాలంలో ఉత్తమోత్తమమైనదిగా నది పరిగణించబడినది"; "తరువాత వెలువడిన "శారద"(1923) "భారతి" (1924) "గృహాలక్ష్మి" పత్రికలకు పూర్వరంగ మేర్పరచినది. "ఆంధ్ర భారతి" ద్వారా శ్రీ వేంకట రమణయ్యగారు తెలుగు దేశంలోని యువకులమీద వెలుగు వెదజల్లారు. అందుచే యుక్తంగా- ఆ యువకులు శ్రీ వేంకటరమణయ్యగారిని — అన్ని కాలాల్లోనూ శాశ్వతంగా నిల్వగలిగిన ఒక ఉద్యమ సృష్టికర్తగాను, దాని నాయకుడుగాను పరిగణిస్తున్నారు."

వారు ఈ యుద్యమానికి సారథ్యం వహించటానికిసర్వవిధాల అర్హులు ఈ ఉద్యమ సృష్టి-దాని అభివృద్ధి-అంతా వీరి కృషిఫలితమే"

(అయ్యంకివారి షష్టిపూర్తి శుభాకాంక్షలు-1950)

ఆంధ్రభారతి స్థాపించి, తద్వారా శ్రీ పంతులుగారు నిర్వహించిన దేశసేవ, పిమ్మట అనేక రూపముల దాల్చింది.

ఈ విధంగా ఆనాటి ఆంధ్ర మాసపత్రికల కన్నింటికీ "శిరోమణి" యై వెలసింది. 'ఆంధ్రభారతి,

స్వధర్మ సంస్థాపనానికి సంపాదకీయంలో వేంకటరమణయ్య పంతులుగారు చేసిన ప్రతిజ్ఞ పరిపాలింపబడినది.]

---

## ౨ – "తిలకము"

### ("గ్రంథాలయ సర్వస్వ" సంపాదకీయము)

[1915 వ సంవత్సరములో శ్రీ వేంకట రమణయ్యగారి సంపాద కత్వమున బెజవాడనుండి ప్రచురింప బడిన "గ్రంథాలయ సర్వస్వ" ప్రథమ సంచికలో "ఉపోద్ఘాతము" అను శీర్షికతో వ్రాయబడిన సంపాదకీయం ఈక్రింద ప్రచురింప బడినది

ఆనాడు, పంతులుగారు ఆశించిన సారస్వతోపాసన గ్రంథాల యోద్యమంద్వారా జరిగింది. వయోజన విద్యాప్రచారం అవిరళంగా సాగింది. అనేక నిరక్షరాస్యులు అక్షరాస్యులు అయ్యారు. దేశాభ్యుదయ పథంలో ప్రగతి సాధింపబడింది. గ్రంథాలయోద్యమ ప్రచారానికి "గ్రంథాలయ సర్వస్వం" కారణభూత మయింది. ప్రారంభంలో వ్రాసిన ఆ "సర్వస్వ" సంపాదకీయం "శ్రీ వేంకట రమణీయ వాణి" కి "తిలకం" గా తీర్చిదిద్దాము—]

## గ్రంథాలయాలు - విద్యాలయాలు

"ఈ కాలమున జనసామాన్యమునకు విద్యను గఱపుటయందు గ్రంథాలయములు ముఖ్య సాధనములుగా ప్రసిద్ధిగాంచుచున్నవి.

## దేశము - విదేశములు

మన యాంధ్రదేశమున గడచిన పది పదునైదు సంవత్సరముల నుండియు గ్రంథాలయోద్యమము ప్రారంభమై దినదినాభివృద్ధి గాంచినది. మన దేశమునందీ యుద్యమము నలుదెసల వ్యాపించి, అందువలన చేకూరు లాభమును పూర్తిగ మన దేశీయులు బడయవలెనన్న, నీ యుద్యమ మెక్కువ సమర్థతతో జయప్రదముగ నిర్వహింపబడుచున్న దేశాంతరముల యందును ఖండ ఖండాంతరములయందును ఏయే మార్గముల నవలంబించి యభివృద్ధి గాంచుచున్నదో మనము బాగుగ గమనించి, మన దేశముయొక్క స్థితిగతులనుబట్టి ఆయా మార్గముల దీనినెట్లు నడుపవలయునో నిర్ణయించుకొనవలసి యున్నది.

## అ మె రి కా

ఈ కాలమున గ్రంథాలయములు అమెరికా ఖండమున మిక్కిలి ప్రసిద్ధిగాంచి యున్నవి. ఆ దేశమున గ్రంథభాండాగారి పదవి నధిష్ఠించగోరువారు పట్టపరీక్షయందు త్తీర్ణులైన పిదప మూడు సంవత్సరముల కాలము శాస్త్రమును ప్రత్యేక మభ్యసించవలెను.

## శాస్త్ర గ్రంథముల కొరత

ఈ విషయమువలన నీ యుద్యమ సంబంధమగు వాఙ్మయ

యచ్చుట నెంత విపులముగ వ్యాప్తిజెందినదియు మన మూహించ వచ్చును. మనదేశమున నీ యుద్యమము శైశవావస్థయందుండుటచే నిందును గూర్చిన గ్రంథము లేవియును లేవు. ప్రత్యేక మీ విష యమును గూర్చి పరిశ్రమజేసిన వారలచే గ్రంథాలయోద్యమము యొక్క వివిధాంశములపై వ్యాసములు వ్రాయించి దేశమందు వ్యాపింపజేయవలసి యున్నది.

## గ్రంథాలయ చరిత్ర సంగ్రహణము

మనదేశమందును ఇతర దేశములయందును ఉన్న గ్రంథాలయ ములయొక్క చరిత్రలు తెలిసికొనవలసి యున్నది. ఈ విషయముల నన్నిటినిగూర్చి చర్చించుటకు "గ్రంథాలయ సర్వస్వ" మను పేరుతో గ్రంథమాల నొకదానిని "ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘపక్షమున" "మూడు మాసముల"కొకమారు ప్రచురించుటకు తీర్మానింపబడినది.

## వాఙ్మయాభివృద్ధి

గ్రంథాలయోద్యమము గ్రంథములను గూర్చిన దగుటచేతను గ్రంథములు వాఙ్మయాత్మకము లగుటచేతను వాఙ్మయాభివృద్ధిని గూర్చినట్టియు వ్యాసము లిందు ప్రచురింపబడుచుండును.

## మనుష్యత్వ వ్యక్తీకరణము

ఈనాటి గ్రంథాలయములు ప్రత్యేక గ్రంథసమూహములే గాక, మనుజునియొక్క సమస్త జ్ఞానేంద్రియముల మూలకముగను మనుజుని మనుష్యత్వమును వ్యక్తీకరింపజేయు సాధనముల సముకూ ర్చునవై యుండుటచే, చిత్రకళల యభివృద్ధిని గూర్చిన వ్యాసములు కూడ నిందు ప్రకటింపబడును.

ఆంధ్రదేశాభిమానులును, ఆంధ్రభాషాభిమానులును ఇందు ప్రచురించుటకు వ్యాసములను బంపియు ఈ గ్రంథమాల యభివృద్ధి నొందుటకు ప్రోత్సాహపరచియు నీ యుద్యమమును జయప్రదముగ జేయుటకు ప్రార్థితులు" *

* గ్రంథాలయ సర్వస్వము: 1 సంపుటము: 1 సంచిక: 1915.

[ గురజాడవారి ప్రబోధం

దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుజులోయి
.... .... .... ....
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టి మేల్ తలపెట్టవోయ్
దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
.... .... .... ....
'చెట్ట పట్టాల్ పట్టుకొని'
దేశస్థులంతా నడవవలెనోయ్.

అని గురజాడవారి ప్రబోధం. దేశాభ్యుదయానికి పాటుపడడం అంటే దేశంలో ఉన్న మనుష్యుల అభ్యుదయానికి దోహదం చెయ్యడం అన్నమాట. నిరక్షరాస్యులు ఎక్కువగా ఉన్న మన దేశంలో - వారిని అక్షరాస్యులుగా జేసి విజ్ఞానవంతుల్నిగా జేయడం కంటె ఘనతరమైన కార్యం ఏముంది? విద్యాదానం అన్నిదానాల్లోకీ ఉత్తమదానం.

గ్రంథాలయాలు గ్రంథ సంబంధమైనవి. గ్రంథాలు వాఙ్మయాత్మకమైనవి. అందుచేత వాఙ్మయం, చరిత్ర, కళలు, పరిశోధనలు, వీనిని గురించిన వ్యాసాలు గ్రంథాలయ సర్వస్వంలో ప్రచురింపబడ్డాయి.

నూతన సారస్వతాపేక్ష - గ్రంథాలయ సరస్వం •

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు "గ్రంథాలయ గీతాలు" అను పుస్తక "పరిచయం"లో ఈ విధంగా వ్రాశారు:-

---

• "గ్రంథాలయ గీతాలు" అనే గ్రంథంలో - అనాడు శ్రీ వేంకటరమణయ్యగారి సంపాదకత్వమున వెలువడిన "గ్రంథాలయ సర్వస్వం"లో ప్రచురించ

"ఈ శతాబ్దియొక్క ప్రథమదశలో తలయెత్తిన బహువిధ జాతీయోద్యమాలలో గ్రంథాలయోద్యమము ఒకటి. ఏ యుద్యమ వ్యాప్తికైనను ప్రజల విద్యాసంస్కారము ముఖ్యాధారము గనుకను, ఆనాడు మన ప్రజలు నేడువలె చెప్పుకొనదగినంత విద్యావంతులు కారు గనుకను, వారికి గ్రంథాలయములద్వారా ప్రపంచ జ్ఞానము కలిగించి దేశాభిమాన దీక్షితుల జేయవలెనని కొందరు పెద్దలు పట్టణములలోను, పల్లెలలోను పుస్తక పఠనావశ్యకతను ప్రబోధింప పత్రికలను స్థాపించి ఉపన్యాసము లిప్పించి, ఉత్సవములుచేసి ఒక నూతన సారస్వతాపేక్షను వెల్లివిరియించిరి. ఆ యుద్యమములో తెలుగునాట ఆవిర్భవించినదే "గ్రంథాలయ సర్వస్వము" అనెడు "సుప్రసిద్ధ సారస్వత పత్రిక". దాని నిర్వహణ భారము వహించిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు తమకుద్యమముతో దాదాత్మ్య మును పొంది కడు సమర్థతతో వ్యవహరించిరి."

## "ఆంధ్ర భారతి" - "గ్రంథాలయ సర్వస్వము" ల అసమాన భాషాసేవ

ఆంధ్ర భారతితోపాటు "గ్రంథాలయ సర్వస్వం" రాయప్రోలు మొదలగువారి "అభినవ కవిత్వా"నికి దోహదం చేసింది. ఈ విషయాన్ని స్మరిస్తూ 1924 వ సంవత్సరంలో శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు గ్రంథాలయ సర్వస్వంలో "నవీనాంధ్ర సాహిత్య కవులు" అనే వ్యాసంలో ఈ విధంగా పలికారు:-

---

బడిన "విద్య" "గ్రంథాలయోద్యమము" "గ్రంథాలయ ప్రయోజనము" మొదలైన ప్రబోధానికి సంబంధించిన పద్యములను సంకలనంచేసి - ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంవారు 1961 లో ద్వితీయ ముద్రణం ప్రచురించారు. ఆ సందర్భంలో "ఈ కార్యములో మాకు హెచ్చుగా నుపయోగించిన "గ్రంథాలయ సర్వస్వ" స్థాపకులు "గ్రంథాలయోద్యమ పితామహులు"నగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు మా ప్రత్యేక కృతజ్ఞతకు పాత్రులు" అని శ్రీ పాతూరి నాగభూషణంగారు స్మరించారు.

"కర్జను" దుష్పరిపాలనా ఫలితముగ జనించిన ద్వేషానలము 1910–11 లో మార్లీ సంస్కరణ శీతలమున గొంత చల్లారెను. ఇంత వరకు తెనుగు దేశమున వెలువడిన పద్యములు, నాటకములు- సంఘ సంస్కరణమును గూర్చియు, ఆంధ్రేతర దేశనాయక గుణాభివర్ణము నందును వినియోగింపబడు చుండెను. 1910 లగాయతు ఆంధ్రుల ఆదర్శములు స్వజాతీయ గౌరవ ప్రతిష్ఠాపనముపై, రాష్ట్ర సంపాదన ముపై, లలితకళా పోషణముపై విస్తరింపసాగెను. భారతమాత 1910 లో తెలుగుసీమల నాంధ్రమాతయై వెలసెను."

"ఆంధ్ర" "కృష్ణా", "మానవసేవ", "దేశమాత"-మున్నగు పత్రికలు, "ఆంధ్రభారతి" మొదలగు మాసపత్రికలు ఉదయించి, ఆంధ్ర సారస్వత సంపోషణ మవశ్యకర్తవ్యముగ నెంచి తెలుగుదేశములోని సుధీయులను వెతకి వారి రచనల ప్రచురింప దొడగెను"

"ఇందు ముఖ్యముగ "ఆంధ్రభారతి"ని నెలకొల్పి, యావల దానినే "గ్రంథాలయసర్వస్వము"గ నడిపించుచున్న అయ్యంకి వేంకట రమణయ్య యొక్క -యసమాన దేశసేవాభిలాషకును, కార్యనిర్వాహక సామర్థ్యమునకును, చొక్కంపు చూపులకును, లేనగవులకును, అందరి నాదరించి పూనికతో నేర్పుమై త్రిప్పు జాణతనమునకును, మెచ్చి- తెలుగుసీమల భావోద్రేకమున జిందాడు బాలకవు లెల్లరు తమ తమ కల్పనలను వారికందించి, తెలుగు భాషకు వన్నెలిడుచుండిరి."

"ఆంధ్ర భారతి" తదనుసారి "గ్రంథాలయ సర్వస్వము" వంగి పూడి వేంకటశర్మ, రాయప్రోలు సుబ్బారావు, గురజాడ అప్పా రావు మున్నగు వారిని ముందునకు దెచ్చి యసమాన భాషాసేవ యొనర్చుచున్నది."

వంగీయ "మోడరన్ రివ్యూ" ను అనుకరించి మన సారస్వత విజృంభణ మేర్పడలేదు. వంగీయులు ఏకాలప్రభావమున తమ రీతుల గైకొనిరో, ఆంధ్రులాకాలోపదేశముల నందుకొనియే విస్తరిల్లు చున్నారు. కాలమే, ఈశ్వర సంకల్పమే, సర్వ ప్రయత్నములకు మూలకారణము."

(గ్రంథాలయ సర్వస్వము: సం, ౭; సంచిక ౪; 1924 అక్టోబరు)

(౮)

## అభినవ కవులు - భావ కవులు - అభ్యుదయ కవులు

ఆనాటి "అభినవ కవులు" ఆ తరువాత వచ్చిన "భావకవులకు" ఆ తరువాతి "అభ్యుదయ కవుల" కు మార్గదర్శకు లయ్యారు. నండూరి సుబ్బారావుగారి "యెంకి పాటలు" బసవరాజు సుబ్బారావుగారి "ప్రేమ గీతాలు" కవికొండల వెంకటారావుగారి "ప్రకృతి" ఆరాధన తో బాటు - శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతం, అబ్బూరి రామకృష్ణ రావు. 'మధుర కవి' నాళం కృష్ణారావుల నవభావ వ్యక్తీకరణమూ, జంటకవులు- శ్రీ తిరుపతి వేంకటకవులు, శేషాద్రిరమణ కవులు, జంధ్యాల వేంకట శివకవులు, పిప్పర సోదరకవులు — పండితులు, వ్యాకరణవేత్తలు - శ్రీయుతులు వేలూరి శివరామశాస్త్రి, వఝల చినసీతారామస్వామిశాస్త్రి, గాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మొదలైనవారి సాహిత్య, వ్యాకరణశాస్త్ర, పరిశోధక వ్యాసములు- పురాణం సూరిశాస్త్రిగారి "ఆంధ్ర నాటకోద్యమ సమీక్ష" "నవీనాంధ్ర కవులు"అను కవితా సమీక్షా వ్యాసములు, కొడాలి శివరామకృష్ణయ్యగారి "ఆనాటి తెలుగు పత్రికలు" - వావిలాల గోపాలకృష్ణయ్యగారి "చదువదగిన గ్రంథములు"- మొదలైన వ్యాసపరంపరలతో నవ్యకవిత్వంతో బాటు, నాటకములు, ఇతర వాఙ్మయపరిశోధనావ్యాసంగములతో నూవ్యాకరణశాస్త్రంతో బాటు వ్యావహారిక భాషాపరిశోధనకునూ సమానస్థానమును గల్పించి "క్రొత్త పాత్రల మేలు కలయికమై క్రొమ్మెరుంగులు జిమ్మినది "గ్రంథాలయ సర్వస్వం"

## గ్రంథాలయ ప్రబోధం, పద్య వాఙ్మయసృష్టి

ప్రబోధ వచనాలు గద్యంలోకంటె పద్యంలో శ్రుతి పేయంగావుండి హృద్యంగా ఉంటాయి. అందుచేత గ్రంథాలయ ప్రబోధం పద్యాత్మకంగా ఆంధ్ర వాఙ్మయంలో ప్రప్రథమంగా ఆనాడు "గ్రంథాలయ సర్వస్వం" లో ఆవిర్భవించి ఆంధ్రులకు ఆదర్శప్రాయమైన ప్రబోధం చెయ్యడమేకాక, ఆంధ్రవాఙ్మయానికి ఒక నూతన సారస్వత ప్రక్రియ సాధించి ప్రసాదించింది.

'గ్రంథాలయ సర్వస్వం'లో తొలిసంచికలో మకుటాయమానంగా శ్రీ ముట్నూరి సుబ్బరాయలవారు "ధర్మ పుస్తక నిలయములు" అన్న శీర్షికతో

రాశిఁజేసిన జ్ఞాన సర్వస్వమనఁగ
ధర్మపుస్తక నిలయంబు తనరుచుండు
నుచితగతి దాని నెవఁ డుపయోగపరచు
నతఁడె వెలలేని విజ్ఞాన మందువాఁడు"
"దీని నిజంబెఱింగి మనదేశమునంగల పట్టణంబులన్
జానపదంబులన్ సులభసాధ్యములౌ తగ గ్రంథమందిరాల్
మానుగ నిల్పి సర్వజనమంతలి విద్యల నేర్వకున్న స
న్మాన మొనర్తురే మనల నాగరికాగ్రణులంచు నన్యులున్"

అన్న ప్రబోధభేరీ మ్రోగించినారు. ఆ ప్రమోత రాయప్రోలు సుబ్బరాయలవారి ఈ క్రింది గీతంలో మారోమ్రోగింది.

ధర్మ పుస్తక నిలయ సంస్థాపనమ్ము
లెంతవర కాంధ్రదేశ మాద్యంతములను
అల్లుబెట్టి వర్ధిలఁజేయ మంతవఱకు
నాగరికులము గాఁబో మనాగరికుల
దశలనించుక దాటలేము"

ఈ మారోమ్రోగిత జాతీయ సంపద్విలసితమైన "పుస్తక శ్రీ కుమారి యందగింపఁగల యాలయములు గట్టు డాంధ్రదేశము నందెల్ల" అన్న వారి ఈ పద్యంలో నినదించింది.

## సంఘ సేవానురక్తి

"ఆంధ్రుల శిల్పవిన్యాసంబు చూపించు
కళిమి గోపురముల గలదటంచు
ఆంధ్ర నాగరిక కళ్యాణ చిహ్నములైన
గాన సాహిత్యముల్ గలవటంచు
ఆంధ్రభాగ్యమ్ము మోయగ గౌతమీకృష్ణ
దరులను నావలు దిరిగె ననుచు
ఆంధ్రవీరులకు స్వర్గాతిథ్య మిచ్చి పా
టలు పాడిన యుగమ్ము కలదటంచు

చెప్పి యొప్పించు పుస్తక శ్రీ కుమారి
యందగింపఁగఁగల యాలయములు గట్టి
యాంధ్రదేశము నందెల్ల నాంధ్ర పుత్రు
లాప్త మానవ సంఘసేవానురక్తి"

మానవసంఘ సేవానురక్తి గ్రంథాలయ వ్యాప్తివల్ల ద్యోతక మౌతుందని స్మరించారు. ఎందుచేతనంటే—

యుగ యుగాంతరముల బ్రిజాభ్యుదయ దీక్ష
దేశసేవా తపస్సు గీతములు పాడి
చనిన మహనీయుల ప్రబోధ సరళరాగ
మాలపించు వీణెలు పుస్తకాలయములు

అని వీణను మీటి సున్నితంగా సొంపుగా ఆనాడే "పుస్తకా లయములు" అన్న శీర్షికతో గానం చేశారు.

సత్తెనపల్లి హనుమంతరావుగారు ఈ విధంగా గ్రంథాలయో ద్యమ స్వరూపాన్ని ఆనాడు వివరించి ఆశీర్వదించారు.

## ఉద్యమ స్వరూపం

అక్షరజ్ఞులకెల్ల యమిత జ్ఞానంబిచ్చి
సతతంబుకాపాడు సంస్థయగుచు
ఐకమత్య విహీను లాంధ్రులంచను దూరు
బాపగా జేయు స్వరూపమగుచు
విలువయౌ కాలము వ్యర్థమైపోకుంత
సత్కథాలాపనల్ జలుపదగుచు
స్వీయ వైదేశిక చిత్తివార్తలదెల్పు
పత్రికాళిసజేర్చ పాత్రమగుచు
దేశమర్థింపదగిన పెద్దియేని యున్న
వాని నన్నిటిని సమకూర్పవలయునన్నచు
స్వీయ జనులకు బోధనల్ జేయుచుండు
ఆంధ్రగ్రంథాలయోద్యమం బధిక మగుత

## గ్రంథ పఠనము - దర్శనవృత్తి

శ్రీ మీ అలీషాకవిగారు ఆనాటి దేశపరిస్థితినిగూర్చి వాపోవుచు

"దేశమును సంఘమును సముద్దీర్ణవృత్తి
నరసి యుద్ధరింపగల నాయకులు లేరు
అట్టి మన పూర్వికుల కథ లరల యందు
పుస్తకాకృతి వీక్షింపఁ బోలునింక

యని వివరిస్తూ-

"దేశాభిమానంబు దీపింప నూరూర
గ్రంథాలయములుంచి గావలయు
సంఘ సంస్కారంబు నవరింప నూరూర
గ్రంథాన్వయము జెప్ప గడగవలయు
జాత్యభివృద్ధి విచారింప నూరూర
గ్రంథార్థ పఠనంబు గడపవలయు
జన్మభూమికి మేలు సలుపుట కూరూర
గ్రంథ దర్శన వృత్తిగాంచవలయు
అటులగాకున్న శుష్కవాక్యములవలన
ఫలము చేకూర దాంధ్రుల భావి జీవి
తమ మహానర్థముల గూలి తల్లడిల్లు
గాన భారతికొక యిల్లుగట్టుడయ్య"

అన్న హెచ్చరిక జేశారు. ఈ ప్రబోధాలు ఈనాటికీ అవసరంగానే వున్నాయి.

## తొల్లిటి ఔన్నత్యం

మన పూర్వపు ఔన్నత్యం పొందాలంటే-

.... .... .... .... .... .... .... .... .... ....

"మన సనాతన ధర్మ మహిమోన్నతికి సదా
గ్రంథాలయములె సత్కారణములు
మన సహోదరుల సన్మార్గాభివృద్ధికి
గ్రంథాలయములె సత్కారణములు
మనదేశ మైకమత్య నిరూఢి గనుటకు
గ్రంథాలయములె సత్కారణములు
ఇట్టి గ్రంథాలయోద్యమ మెల్లగతుల
విస్తరింపగ భాషాభివృద్ధిగాంచి
భారతీయులు తొల్లింటి తంగిమెరయ
విన్నవించెద నీ విన్నపంబు"

అని సవినయంగా దేశీయులకు విన్నవించారు శ్రీ వనుగు తిమ్మకవి ఏనాడో.

## "గ్రంథాలయ" నిర్వచనం

"సకల వేదోపనిషత్సార మైన నా
దబ్రహ్మమునకు మరుత్ స్థానమగుచు
జ్యోతిష్కులకు గ్రహచార ఫలంబుల
సమకూర్చు సంయమ స్థానమగుచు
సకల ఖగోళశాస్త్రజ్ఞుల కద్భుతం
బై తగు దర్భిణీ యంత్రమగుచు
పాటనా లౌకిక వ్యవహార రాజ్యాంగ
మంత్రిజనమునకు మేల్ మంత్రియగుచు
గణితజ్ఞులకు నెల్ల గణితశాస్త్రార్థ్యంత
ముం దెల్పగల పూర్ణబిందువగుచు
మంత్రశాస్త్ర విశేష మహనీయతను జూప
విమల మాధ్వణ వేదమగుచు
దేశచరిత్ర నతి స్వచ్ఛముగ దెల్ప
జేవనొప్పెడి స్థిరజీవియగుచు
భూగోళ నిర్మాణ భూరిగైరిక ధాతు
చయముల జూప నంజనమునగుచు
సంఘ సంస్కారణావసరత పద్ధతులను
సరిగ జెప్పెడి మతాచార్యమగుచు
సంగీత సాహిత్య శబ్దమాధుర్య స
ర్వస్వముల్ మీటు విపంచియగుచు
అలరు విజ్ఞాన ఖనియె గ్రంథాలయంబు
అట్టి గ్రంథాలయముల నీ యాంధ్రభూమి
వృద్ధిజేయుడి యూరూర వెలయజేసి
మానధనులార దేశాభిమానులార"

అని మానమే ధనముగా గలిగిన దేశాభిమానులకు ప్రబోధం జేశారు శ్రీ అక్కరాజు రాఘవరావుగారు. ప్రబోధంతో బాటు ప్రత్యగ్ర సత్యములతో గూడిన ఈ పద్యము ఏ వాఙ్మయానికైనా అలంకార ప్రాయమైనదే.

## గ్రంథాలు పఠన పాఠన ప్రయోజనాత్మకాలు

ఈ విధంగా గ్రంథాలు పఠన పాఠన ప్రయోజనాత్మకాలు గాని, కేవలము పూజింపదగినవి మాత్రమే కావని ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు జ్ఞాపకంచేశారు.

మంచి మందంబును సంచిలోనుంచిన
　　　రోగంబు మాన్పి యారోగ్యమిడునె ?
ఫలము మంచిదటంచు వర్ణించి తినకుండ
　　　దాచినచో జిహ్వ తనియఁగలదె
చల్లదనంబిచ్చు చందనంబని చెప్పి
　　　పూయక సుఖమెట్లు పొందగలఁడు
భాగ్యంబు గలదంచు వాడక యుండిన
　　　భాగ్య సౌఖ్యము వాఁడు వడయునెటు ?

జ్ఞానదాయక గ్రంథముల్ చాలదెచ్చి
బీరువాలను నిండించి పెట్టునంత
జ్ఞానభాగ్యంబు కలుగదు చదువకున్న
ఇంటిలో విత్తులుంచఁ జేనెట్లుపండు ?

అని "చదువనివా డజ్ఞుండగు" అన్న సూక్తిని స్మరించారు.

## అందరికీ - గ్రంథాలు - గ్రంథాలయాలు

"భాగ్యవంతుడు నిరుపేద హాఁదటంచు
అగ్ర కులజుఁడు కడజాతి యతఁ డటంచు
ఉచ్చ నీచ విభేదంబు లుజ్జగించు:
అఖిల జనముల హక్కు గ్రంథాలయంబు

అని సర్వజనులకు గ్రంథాలయము హక్కుభుక్తములు గలిగిన యాలయమని నాళము కృష్ణారావుగారు ఎలుగెత్తి చాటినారు.

## అంటుదోషము ఉండరాదు

అంటుదోషము గ్రంథాలయాలలో నుండరాదని శ్రీ యన్. జి. శాస్త్రిగారు సంస్కరణ స్మరించారు:-

ఆలయములోన నవని గ్రంథాలయం
బురు ఫలప్రదంబు: పర మతస్థు

లెందరైన దీని పొందఁగా పిలగు
వంటుదోష మిచట వరయరాదు.

గ్రంథాలయ ప్రబోధ వాఙ్మయమే గాకుండా ఆధునిక ఆంధ్ర సాహిత్య విమర్శ వచ్చినపుడు కూడా వేంకటరమణయ్యగారి ఆధ్వర్యంలో వెలువడ్డ "ఆంధ్ర భారతి" "గ్రంథాలయ సర్వస్వం" - ఈ రెంటినీ నేటికీ విజ్ఞులైన విమర్శజ్ఞులు స్మరించి, వాటికి సాహిత్య చరిత్రలో తగిన స్థానం ఇస్తున్నారు.

1962 వ సంవత్సరం డిశెంబరు నెల "భారతి"లో "అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము" - అన్న శీర్షికతో డాక్టరు శ్రీ పాద గోపాలకృష్ణ మూర్తిగారు అబ్బూరివారి కవిత్వాన్ని విమర్శిస్తూ ఈ విధంగా అన్నారు:- "ఊహాగానము" 1918 వ సం॥లో వచ్చినది. అప్పటికే ఇందులోని పద్యములు చాలవరకూ రెండున్నర సంవత్సరముల ప్రాయము కలిగినవి. రాయప్రోలు వారి "తృణకంకణము" "గ్రంథాలయ సర్వస్వంలో" దేశభక్తి పద్యాలూ (1915) "ఆంధ్ర భారతి" (1910-1913) లోని ఖండకావ్యాలు వచ్చాయి"

భారతి — 1962 – డిశెంబరు – పేజీ 72.

1964 వ సంవత్సరం "కృష్ణాపత్రిక" వజ్రోత్సవ సంచికలో "నవ్యసాహిత్య పరిణామ పరిశీలనం"అన్న వ్యాసములో శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు ఈ విధంగా "గ్రంథాలయసర్వస్వా"న్ని స్మరించారు:- "నవ్య సాహితీపరులు పత్రికావేదిక బాగా ఉపయోగించుకున్నారు. "గ్రంథాలయ సర్వస్వం" (1915) "శారదా" (1923) అనే పత్రికలు కూడా క్రొత్తరచనలకు మంచి దోహదమిచ్చాయి."

## పత్రికా ప్రయోజన ప్రబోధం

అనాడే పత్రికా ప్రచారమునుగూర్చి మంగిపూడి వేంకటశర్మగారు ప్రబోధం చేశారు.

నరుల లోపములెల్ల నరసి దిద్దుకొనంగ
బాగైన రత్నదర్పణములనఁగ

వివిధ ధర్మాధర్మ విషయముల్ దెలియంగఁ
గమనీయ ధర్మశాస్త్రము లనంగ
లోక వృత్తాంతముల్ సాకల్యముగఁ జెప్ప
సరిమీరు కామ సంచారులనఁగ
నీతిమార్గములెల్ల నెమ్మిమై బోధింప
నకలంకులైన శిక్షితులనంగ

నెగడి యెల్లరచేత మన్నింపఁ బడుచు
నితఃప పత్రిక లట్టు లున్నతి వహించి
తెలుగు పత్రికలెల్ల వర్ధిల్లు టెపుడొ ?
యనుచు గాంక్షించు నాంధ్రదేశాభిమాని

'ఆంధ్రదేశాభిమాని' యను శీర్షికతో రచించిన నీ పద్యములో ప్రబోధము, పత్రికల ప్రయోజనము, వివరింపబడి, పత్రికల ఔత్కృష్ట్యము పద్యాత్మకంగా హృద్యంగా వివరింపబడింది.

## సారస్వతాలయాలు

గద్యంకంటె పద్యం హృద్యంగా ఉండటంచేత ప్రచారానికీ ప్రబోధానికీ ప్రముఖంగా ప్రయోగార్హ్యం అవుతుంది. ఈ ఉద్దేశ్యంతోనే "గ్రంథాలయ సర్వస్వం"లో "సారస్వతాలయాలు" అన్న శీర్షికతో "లేవరా సోదరా- జ్ఞానివగునీవు" అన్న పల్లవితో ప్రచారపు పాటలు కూడా ప్రచురింపబడ్డాయి. ఉదహారణకు ఇట ఒకటి వినిపిస్తాను. దీనితో పంతులుగారు గ్రంథాలయ ప్రబోధపద్య వాఙ్మయానికేగాక గేయవాఙ్మయానికికూడా ప్రాతిపదిక పలికారని చెప్పాలి.

లేవరా సోదరా!
జ్ఞానివగు నీవు!
పల్లెటూరు పాట్లు
పాటించి యోచించి
అజ్ఞానహీనులను
సుజ్ఞానులను చేయ
సారస్వతాలయా
లూరూర నెలకొల్ప

అయ్యంకి ప్రముఖుండు
పట్టుపట్టినాడు
భల్లూకపుంపట్టు
ఆదర్శప్రాయుడై

ఆంధ్ర దేశమంత
అరుగుతున్నాడు
అన్నపానీయాలు
మన కెంతి విధియో
గ్రంథలయాలంటె
విధియంచు దెల్పు
సారస్వతాలయా
లూరూర నెలకొల్ప
లేవరా సోదరా!
జ్ఞానివగు నీవు!
ఆరోగ్యవంతులుగ
ఆనంద మొందంగ
రోగమే లేకుండ
రాయిలాగుండంగ
నీరు గాలీ మనకు
నీటుగా రావంగ
సూర్యకిరణపు ధాటి
సూటిగా తగులంగ
పల్లెటూళ్లే మనకు
పరమావధియని దెల్పు
సారస్వతాలయా
లూరూర నెలకొల్ప
లేవరా! సోదరా!
జ్ఞానివగు నీవు!
కూడు గుడ్డా లేక
కుమిలిపోకుండంగ
కులవృత్తులనె తిరిగి
కూర్చుకొనుడని తెల్పు
సారస్వతాలయా
లూరూర నెలకొల్ప
లేవరా సోదరా!
జ్ఞానివగు నీవు!
అన్నదమ్ములవోలె
అక్క-సెల్లెండ్రవలె
ఐకమత్యముతోడ
అలరవలెనని తెల్పు
సారస్వతాలయా
లూరూర నెలకొల్ప
లేవరా సోదరా!
జ్ఞానివగు నీవు!
ఉత్తముడ వీవైన
ఉత్తమాయిల్లాలు
నీ భార్య, నీ సుతులు
ఉద్రేక వీరులగుదు
రడ్డ మెవ్వరు రారు
అది తెలుసుకోవంగ
సారస్వత లయా
లూరూర నెలకొల్ప
లేవరా సోదరా!
జ్ఞానివగు నీవు!
అతురజ్ఞుడ వీవు
అయితేర వాలె
అన్యదేశపు వార్త
లందుకో వాలె
పర దేశ పాలన
పారద్రోలాలి

నీ దేశపాలన
నీకు రావాలి
సొంతముగ నివది
తెలిసికోవంగ
సారస్వతాలయా
లూరూర నెలకొల్ప
లేవరా సోదరా!
జ్ఞానివగు నీవు!
కూడుగుడ్డకు నీకు
కొదువేమిలేనట్టి
విద్యలేనొన్న నేర్వ
విధులు పన్నాలన్న
ఆకలి అప్పుల
ఆర్తిలేనట్టి
ఆర్థికమార్గాల
అరసివేయాలన్న
సారస్వమ్మంత
తెలియాలనుచు తెల్ప
సారస్వతాలయా
లూరూర నెలకొల్ప
లేవరా సోదరా!
జ్ఞానివగునీవు!

యువకుడవగు నీవు
ఉద్యోగమే లేక
యుడికిపోకుండా
తిరిగి గ్రామాలన్ని
పూర్వపద్ధతినుండ
పంచాయితీలుండ
వలెనంచు దెల్ప
సారస్వతాలయా
లూరూర నెలకొల్ప
లేవరా సోదరా!!
జ్ఞానవగు నీవు!!

— శ్రీ కొండేపూడి చలపతిరావు, రవీంద్ర సారస్వత సమాజం,
"గ్రంథాలయ సర్వస్వము" - సంపుటి - 11 సంచిక - 9, 1933,

## ము త్యా ల హా ర ం

ఈ విధంగా పుస్తక పరియోజనం, ఉద్యమ ప్రబోధం, గ్రంథాలయభాగ్యం, పత్రికా నిర్వచనం, పుస్తకాలు పఠించటానికి గాని బీరువాలలో దాచి ఉంచటానికి గాదన్న ప్రవచనములు, గ్రంథాలయం సర్వులసొత్తు అన్న సంస్కరణసూక్తి, సర్వులకు గ్రంథాలు, అన్న ఉక్తి, గ్రంథవరణ మెట్లు ఉండాలన్న విషయ వివరణము— ఈ ఈ విషయాలమీద మనం ఈ నాటికీ ఎంతో ప్రచారం చేస్తున్న గ్రంథాలయ సంబంధమైన సర్వవిషయాలు "ముత్యాల హారంలాగ"

కూర్చి పేర్చి ఆంధ్ర భారతికి కంఠహారాన్ని సమర్పించారు శ్రీ రమణయ్యగారు.ఆనాటికీ, ఈనాటికీ పఠనీయమైన గ్రంథాలయ పద్యవాఙ్మయం సృష్టించి తెలుగు సారస్వతంలో నూతన ప్రక్రియకు తొలిపలుకు పలికినారు.

ఆనాడే - ఈనాటికీ - ఏ నాటికీ - నిల్చి - నిలువనీడ నివ్వగల గ్రంథాలయ పద్యవాఙ్మయ వృక్షాన్ని తెలుగునాట నాటినారు.

ఈ విధంగా నూతన సారస్వతా పీఠ కల్పించారు. అసమాన భాషాసేవ చేశారు. "గ్రంథాలయ వాఙ్మయా"న్ని గద్యంలోనూ పద్యంలోను నిర్మించారు

గ్రంథపఠనాభిలాషను కలిగించారు. డాక్టరు సి. ఆర్. రెడ్డి గారు అన్నట్లు "పూర్వము ఎంత యుత్కృష్ట గ్రంథమైనను ఒక వంద ప్రతులు అమ్ముడుపోవుట కష్టముగ నుండెడిది. కాని గ్రంథాలయోద్యమ ప్రచారము ప్రబలినకొలదిని ప్రజలలో ఉత్సాహమినుమడించి విద్యా సముపార్జనాభిలాషయు వృద్ధియైనది ... ... ... అనగా గ్రంథాలయోద్యమ ప్రచారమువలన గ్రంథముల విక్రయము, తద్వారా గ్రంథపఠనాభిలాష - విద్యా సముపార్జనాభిలాష ఇనుమడించినవని నొక్కి చెప్పవచ్చును. ఇనికంతకును కారణము వేంకట రమణయ్యగారే-

ఆ. వెం, ర. సన్మాన సంచిక- పుట- 18 - 1942.

## స్వధర్మానుష్ఠానం

ఆనాడు ఆంగ్లవిద్యా వ్యాసంగంవల్ల విద్యార్థులల్లో - విదేశ వాఙ్మయం, ఆచార వ్యవహారాలు, కట్టుబొట్టు మొదలైన వాని మీద మోజు హెచ్చింది. ఆంధ్రభాష నేర్వడం, గ్రంథాలు చదవడం అంటే నాగరికతాచిహ్నాలు గావనే అభిప్రాయం ప్రబలింది. ఆంధ్రభాషాభ్యాసానికి, భాషోద్ధరణకు, భాషావ్యాపనమునకు, గ్రంథ ప్రచురణకు, గ్రంథాలయోద్యమం ప్రబోధంచేసి దేశీయుల్ని వారి స్వధర్మానుష్ఠానానికి పురికొల్పవలసి వచ్చింది.

మన సంస్కృతి, సంప్రదాయం గ్రామాల్లో ఉన్నాయి. మన ప్రాచీన గ్రంథాలు గ్రామాల్లో ఉన్నాయి. ఆ గ్రంధాలు తాటాకు పత్రాలమీద, ఇతర లిఖితప్రతుల రూపంలోనూ ఉన్నాయి - అవన్నీ జీర్ణిస్తున్నాయి. ఆ జీర్ణ గ్రంథోద్ధరణము గ్రంథాలయోద్యమ ప్రచార కార్యకర్తల కార్యక్రమంలో ఒక భాగమయింది. ఆ గ్రంథ సేకరణకు ప్రబోధం జరిగింది. ప్రశస్తమైన పనిజరిగింది - ఫలించింది.

## గ్రామమే పునాది

భారత దేశాభ్యుదయ సౌధ నిర్మాణానికి గ్రామమే పునాది. ఏ ఉద్యమం అయినా ఏ సంస్కరణ అయినా గ్రామంతో ప్రారంభంకావాలి. గ్రామాన్ని వదిలితే ఏ ఉద్యమం అయినా పునాదిలేని కట్టడం అవుతుంది. అందుచేత ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమానికి పునాది గ్రామం. ఆ ఉద్యమమే గ్రామ పునర్నిర్మాణోద్యమం. గ్రామాల్లో గ్రంథాలయాలు స్థాపించడం, వాటిలో రాత్రి పాఠశాలలు, వయోజన విద్యాలయాలు ప్రారంభం చెయ్యడం మొదలైన వాటితో - ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమం గ్రామ పునర్నిర్మాణోద్యమంగా ఆంధ్ర దేశంలో నిర్వహింపబడింది.

## దేశ చరిత్ర

మన జాతీయత, మన ఐశ్వర్యము, ప్రాచీనసంపద మన ఔత్కృష్ట్యము అవగాహన కావాలంటే మనదేశ చరిత్రలు వ్రాయాలి. 'మనది' అన్నదాన్ని ప్రతిదానీన్ని విసర్జించాలి అనుకొని పాశ్చాత్య వ్యామోహంలో దేశీయులున్న ఆ రోజుల్లో, దేశచరిత్ర పఠనానికి ప్రజలకు ప్రబోధం చెయ్యవలసి వచ్చింది. గ్రామాల్లో ఉన్న శాసనాలు, తామ్రపత్రాలు, కవిలెకట్టలు, గ్రామ చరిత్రలు సేకరించుటకు కూడ ప్రబోధం, ప్రయత్నాలు చేసింది గ్రంథాలయోద్యమం. దేశచరిత్ర నిర్మించటానికి దోహదంచేసింది. దాని వలన భాషాసేవ, సారస్వతసేవ జరిగిందికూడా.

ఈ కార్యక్రమం అంతా "గ్రంథాలయ సర్వస్వం" ద్వారా జరిగింది.

## మ న సం స్కృ తి

మన సంస్కృతి మన పండగల్లో ద్యోతకం అవుతుంది. మన కళావైదగ్ధ్యం సంక్రాంతి ముగ్గుల్లో మూర్తీభవించింది. అందుచేత గ్రంథాలయాలు పండుగలు, పబ్బాలు, ఉత్సవాలు, ఊరేగింపులు నిర్వహించి మన జాతీయ ప్రాచీన సంస్కృతీ వైభవాన్ని సంస్మరింపజేసేవి.

"ఆధునిక గ్రంథాలయాలు ప్రత్యేక గ్రంథ సమూహములే గాక, సమస్త జ్ఞానేంద్రియముల మూలకముగ మనుజుని మనుష్యత్వమును వ్యక్తీకరించు సాధనముల సమకూర్పునవి అగుటచే-మానవుని సంపూర్ణవ్యక్తిత్వ సాధకములుగ, వానిని మానవ సంక్షేమ కార్యకలాప కేంద్రములుగ ఉద్యమకర్తలు తీర్చిదిద్దినారు. శ్రీ కోటమర్తి చినరఘుపతిగారన్నట్లు "ఊలపాటలు, జోలపాటలు, ఎంకిపాటలు మొదలగు పాటలతో- బొబ్బిలి, బాలనాగమ్మవంటి పదములతో-"గొల్ల కలాపము" "భామ కలాపము" "తోలుబొమ్మలు" మొదలగు వీధి నాటకములతో పరిహాసనములు, ప్రబంధములు, రూపకములేగాక, సినిమాలు, నాటకములు, మొదలగు వివిధ వాఙ్మయాదులచే గ్రంథాలయోద్యమాభివృద్ధిని చేయవలెనని బహువిధ అభ్యుదయ మార్గముల సూచించి బోధించినది "అయ్యంకియే".

(అ. వేం. ర. సన్మాన సంచిక - పుట - 71-1942)

శ్రీ అయ్యంకివారు సభలు జరిపారు, సంఘాలు నెలకొల్పారు. సంస్థలు నిర్మించారు. గ్రంథాలయోద్యమ ప్రచారానికి కావలసిన అన్ని ప్రచార పద్ధతుల్ని ఆచరించారు. ప్రచార వాఙ్మయాన్ని సృష్టించారు. అపూర్వ ప్రచార పద్ధతియైన "గ్రంథాలయయాత్ర" లను రూపొందించారు.

సంచార గ్రంథాలయం గానే తాను సంచరిస్తూ, సమాచారం అందిస్తూ, సంచారగ్రంథాలయాల్ని స్థాపించారు.

గ్రంథాలయ చరిత్రలు ప్రచురించి దేశంలోవున్న పరిస్థితుల్ని ఆకళించుకొని ఉద్యమ ప్రచారానికి దేశీయపద్ధతుల్ని అవలంబించి జీర్ణగ్రంథాలయాలను ఉద్ధరించి "గ్రంథాలయోద్ధారకు" లయ్యారు.

## విదేశీయ ఉద్యమ విజ్ఞానం

అమెరికా, ఇంగ్లాండు, ఆస్ట్రేలియా మొదలైన వివిధ విదేశాల్లో గ్రంథాలయాలు, గ్రంథాలయ సంఘాలు - గ్రంథాలయోద్యమ ప్రగతిని "గ్రంథాలయ సర్వస్వం" లో ఎప్పటికప్పుడు ప్రకటించి విదేశీయ గ్రంథాలయ ఉద్యమ స్వరూప స్వభావాల్ని దేశీయులచే స్మరింపజేసి ఉత్తేజం కల్గించారు.

## దేశీయోద్యమ విజ్ఞానం

దేశంలో అఖిలభారతంలోనూ - బరోడా, మైసూరు, తిరువాన్కూరు, మద్రాసు - పంజాబు, బెంగాల్ మొదలైన రాష్ట్రాలలో ఉద్యమ వ్యాప్తిని గురించి వివరించి అంతర్ రాష్ట్రీయ సమాచారాన్ని సందేశాల్ని సంపుటీకరించి ఆంధ్ర సహృదయులకు నివేదించారు. ఈ విధంగా దేశ విదేశ గ్రంథాలయోద్యమ విషయికమైన విజ్ఞానం అందజేశారు.

## శాస్త్రగ్రంథ ప్రచురణ

గ్రంథాలయ శాస్త్ర విషయికమైన విజ్ఞానం ప్రజల్లో ప్రకటించడానికి 'గ్రంథ విభజన' పేటికలు ప్రదర్శించారు. సంఘం తరఫున వెలిదండ్ల శ్రీనివాసరావుగారి ప్రయత్నమువలన ప్రప్రథమంగా ఆంధ్రగ్రంథముల జాబితా తయారు జేయబడింది. "ఆంధ్ర భాషా గ్రంథముల వర్గీకరణ" గ్రంథాన్ని శ్రీ రమణయ్య పంతులుగారు స్వయంగా రచించిప్రచురించారు. ఇదే దక్షిణ దేశ భాషలో "గ్రంథవర్గీకరణ"ను గురించి ప్రథమంగా ప్రచురింపబడిన గ్రంథము.

దీన్ని గురించి దంటు సుబ్బావధానిగారీవిధంగా ప్రస్తుతించారు:-

"వందలు వేలు లక్షలు ప్రబంధములెట్టుల బీరువాలలో
నందముగాగఁ బెట్టి నిమిషార్థములోఁ దను గోరు పుస్తకం
బుం దెమలించి తెచ్చు విధ - ల్ బుధుడీతఁడు శాస్త్రరీతిగా
నంద తెలుంగ నాంధ్రమున యందునఁ దెల్పె విమాత్న పద్ధతుల్

—  . వేం. ర. సన్మానసంచిక- పుట- 22- 1942

గ్రంథాలయ శాస్త్రాన్ని అధ్యయనంచేసి అనుభవంలో తెచ్చుకొని గ్రంథం రచించి గ్రంథాలయశాస్త్ర విశారదులయ్యారు. పంతులుగారు."ఆంధ్రభారతీతీర్థము"(Andhra Research University )విజయనగరము-యొక్క అధ్యక్షులు శ్రీ రాజా విక్రమ దేవవర్మ గారు శ్రీ రమణయ్యగారికి "గ్రంథాలయశాస్త్ర విశారద" అన్న బిరుదు నిచ్చి సత్కరించారు.

ఈ విధంగా ప్రాచీన సంపదను సేకరిస్తూ, నవీన మార్గాల్ని సమకూరుస్తూ, సంప్రదాయపద్ధతుల్ని అనుసరిస్తూ,సంస్కరణ విధానాల్ని అన్వేషిస్తూ, అనుకరణగాకుండా, పరప్రత్యయనేయ బుద్ధులుగాకుండ స్వీయానుభవాన్ని పురస్కరించుకొని ఉద్యమాన్ని నిర్మాణంచేస్తూ, ప్రగతి పథముగాలై "సంపాదకీయం" లోని ప్రతిజ్ఞల నన్నింటినీ పరిపాలించారు శ్రీ వేంకటరమణయ్యగారు.



# 3. "భూషణము"

## "ఏకజాతీయత" : వ్యాసము

("ఆంధ్ర భారతి" లో (భాగము - ౧ - సంఖ్య ౧౨) శాలివాహనశకము ౧౮౩౨ సంవత్సరమున "ఏక జాతీయత" అను శీర్షికతో శ్రీ అయ్యంకివారు వ్రాసిన వ్యాసమిది. ఇందు భారతజాతీయైక్యత ప్రబోధింపబడినది. భారతజాతియంతయు "ఏకజాతి" అన్న మహదభిప్రాయమే పంతులుగారిని అఖిల భారత

గ్రంథాలయోద్యమ ప్రవర్తకులుగజేసి "దేశావిక" గ్రంథాలయనాయక భూషణాన్ని, ప్రతిపాదించిన "ఈ వాగ్భూషణమే సుభూషణంగా" "శ్రీ వేంకట రమణీయవాణికి" "జాతీయతా" భూషాణాన్ని సర్వాంగభూషిత భూషణంగా అలంకరిస్తున్నాము— సంపాదకులు.)

ఒక జాతియొక్క నిర్మాణమునకు నావశ్యకములగు ప్రాథమిక విషయములందు ప్రముఖమైనవి-ఒకటిఅందరకును సామాన్యమైన దేశము రెండు-నిర్దుష్టమైనట్టియు,స్థిరమైనట్టియు నివాసమును గలిగియుండుట. జాతికిని దేశమునకును పరస్పర సంబంధము గలదు.అందరకును సమానమైన దేశముయొక్కయు, స్వాభావికములగు పరిసరముల యొక్కయు ప్రాబల్యము అప్రతిహతమై యున్నది. కావున భారతవర్షమందు నివసించుచున్న వివిధ జాతులును, జనులును "తామందరును నేక మాతృభూమికే జెందియుంటిమనియు, అభిన్నమైన భూమియందు జన్మించిన బిడ్డలమనియు, తాము ప్రేమించుటకును, సేవించుటకును నేక దేశము గలదనియు" తెలిసికొని, భావించిననే గాని వారందరును ఏకజాతిగ కలసి మెలసిపోవుట యసంభవమని విస్పష్టమగుచున్నది.

## ఏకైక దేశము

కాని దురదృష్టవశముచే భారతవర్షము నేక దేశముగ భావించుట సులభసాధ్యము కాజాలదాయెను. ప్రస్తుతము భారతీయు లందరును తమ మాతృభూమిని యనేక దేశముల సముదాయమని తలంచుచుండిరేగాని ఏకదేశమని తలంచుటలేదు. ఇట్టి యసంగత మావిర్భవించుటకు ప్రబలమగు కారణమొకటి లేకపోలేదు. మన బాలురు చదువు భూగోళశాస్త్ర విషయిక పాఠ్యపుస్తకము లన్నియు ఈ యభిప్రాయమునే వారి హృదయఫలకములందు దృఢముగ చిత్రించుచున్నవి. అయినను నిష్పక్షపాతులగు కొందరాంగ్లేయులుగూడ సదభిప్రాయముల నిచ్చియున్నారు. భూగోళశాస్త్రజ్ఞులయందు పేరు వడసిన వారిలో నొకరగు "ఛిస్ హోలం"గారిట్లు వ్రాయుచున్నారు. "బర్మాదేశమును మినహాయించినచో- భారతవర్షముతప్ప స్వతస్సిద్ధ

ముగ ప్రత్యేక దేశముగ నేర్పడిన భూభాగమెద్దియు ఈ ప్రపంచమునందెచ్చటనులేదు—నైసర్గిక స్వరూపములయందును శీతోష్ణస్థితియందును భారత దేశము చాల వ్యత్యాసములను గలిగియున్నది. కాని ఆ వ్యత్యాసము లంతగా పాటింపతగినవికావు."

## భారతదేశ నానాత్వము

శీతోష్ణ పరిస్థితులు:- అయినప్పటికిని ఈ దేశము వివిధ ప్రభేదము లచే నిండియుండుటవలన భౌగోళికముగ నేర్పడిన ఏకత్వము విస్మరింపబడుచున్నది. ఉత్తరమునుండి దక్షిణము వరకును 2000 మైళ్ల కెక్కువ పొడవును, తూర్పునుండి పడమరవరకును 1900 మైళ్ళను మించిన వెడల్పును, ఆవరించియుండిన ఈ గొప్ప భూభాగమును ఏక దేశముగ భావించుట కష్టసాధ్యము. ఈ దేశముయొక్క యపారమైన విస్తీర్ణమువలననే ఇట్టి భూగోళశాస్త్రిక స్థితిగతు లేర్పడినవి. ఈ స్థితి గతులవలననే నీ దేశము "ప్రపంచ సార" మని విఖ్యాతి జెంది యున్నది. శీతోష్ణస్థితి వివిధ ప్రదేశములందు మిక్కిలి భిన్నముగ నున్నది. హిమాలయ పర్వతములందు నీరు గడ్డకట్టి మిక్కిలి శీతలముగ నుండును. అక్కడనుండి క్రమముగ కొంకణదేశమునకు జనునప్పటికి ఉష్ణ మమితముగ నుండును. ఇక వర్ష మన్ననో "చిరపుంజి" యందు సంవత్సరమునకు 460 అంగుళముల వర్ష ము కురియుచుండ సింధుదేశ పైభాగమందు 3 అంగుళములకు తక్కువగనే కురియును. ఇట్టి భేదములు శీతోష్ణస్థితియందు మాత్రమేగాక నైసర్గిక దర్శనములందును, ఉద్భిజ జాతులందును, వనములందునుగూడ కాననగును. సమాన విస్తీర్ణము గలిగియుండి ఉత్తరార్ధగోళమునందున్న మఱి యే దేశమునందును ఉద్భిజ జాతులయందింతగా వ్యత్యాసములు లేవు. ఈ దేశమునందు అసంఖ్యాకములగు వివిధ జంతు సంతానము లున్నవి. హిందూదేశమునకంటె ఒకటిన్నరరెట్లు ఎక్కువ విస్తీర్ణమును గలిగియున్న ఐరోపాదేశమందైనను వివిధ రకములైన జంతు సంతానము లిన్నిలేవు. వివిధములగు ఉద్భిజములును

అడవులును విశేషముగ నీ దేశమునం దుండుటవలన వృక్షదినుసు లును, జంతు దినుసులును సమృద్ధిగ నున్నవి. ఈ ప్రపంచమునందిట్టి సమృద్ధి కొద్ది దేశములకు మాత్రమే గలదు. "లిల్లీ" దొరవారు చెప్పినట్లు మానవున కావశ్యకములగు సకల వస్తువులును ఈ దేశము నందు ఫలించును.

## నివసించు జనులు

ఇక నీ దేశమునందువసించియున్న జనులనుగూర్చి పరిశీలింతము. ఈ విశ్వము నందున్న మానవకోటియం దైదవభాగమీ దేశము నందే వసించుచున్నారు. ఇందనేక దశలయందున్నట్టియు, వివిధ నాగరికతలకు జెందియున్నట్టియు, వివిధ భాషలను మాట్లాడునట్టియు, వివిధ నడవడికలను, ఆచార వ్యవహారములను, మత సంప్రదాయము లను గలిగినట్టియు జనులు చేరియున్నారు. శరీర ప్రకృతినిబట్టి విభ జించిన ఏడుకంటె నెక్కువ రకముల జను లీ దేశమునందున్నారు. మాటయేబది రకములకంటె నెక్కువ భాషలు మాట్లాడు జనులు గలరు. ప్రపంచమునందున్న సర్వమత సంప్రదాయకులును ఈ దేశ మునందు గలరు. ప్రతి మతమును అనేక లక్షలమంది జనులు అవలం బించుచున్నారు. హిందూదేశము అనేకజాతుల యొక్కయు, మత ములయొక్కయు, భాషలయొక్కయు సాంఘిక ప్రతిష్ఠాపనల యొక్కయు గొప్ప ప్రదర్శనశాల యని చెప్పవచ్చును.

## అనేకమునం దేకత్వము

అందుచేత పైపైని మాత్రము జూచువారు అద్భుతములగు నీ వివిధ సంప్రదాయములవలన దిగ్భ్రమజెందెదరు. ఆంతరంగికముగ నాలోచించి సత్యమైనజ్ఞానమునుబొందు శక్తి వారియొద్ద లేదు. అనేకము నం దేకత్వమును సమిష్టియందు వ్యష్టిని, స్థూలమునందు సూక్ష్మమును వారు తెలిసికొనలేరు. అసంఖ్యాకములగు నీ వివిధ సంప్రదాయము లన్నియు హిందూదేశముయొక్క "ఏక జాతీయత"ను పోగొట్టుటకు మారుగ దానిని మరింత దృఢతరముగ బంధించి భాగ్యవంతముగ జేయునను సంగతివారు గ్రహింపలేరు. భారతవర్షమంతయు నేక సడ

వడికవలన బంధింపబడినదని చాలమంది ఆంగ్లేయ చరిత్రకారులు గూడ గ్రహించియున్నారు.

## భారతవర్ష ఏకత్వము - పౌరాణిక విజ్ఞానము

కాని ప్రాచీన కాలమునందు సామాన్య జనులందరుగూడ ప్రధానమైన నీ యేక జాతీయతను నిశ్చయముగా గ్రహించియుండిరి. భారతీయ మత నాగరికతా సంస్థాపకులందరును తమ మాతృ దేశముయొక్క (భౌగోళికమైన) ఏకత్వమును తెలిసికొనియేయుండి, దానిని జనసామాన్యముయొక్క హృదయ ఫలకములయందు చిత్రింప పరిపరి విధముల పాటుపడి యుండిరని స్పష్టీకరించుట కనేక దృష్టాంతరములు గలవు. విష్ణుపురాణము నందొక శ్లోకమునందు వర్ణింపబడిన ప్రకారము - సముద్రమున కుత్తరముగాను హిమవత్పర్వతమునకు దక్షిణముగాను ఉన్న దేశమున కంతకును ప్రాచీనార్యులు "భరతవర్ష" మని పేరిడిరి. ఈ దేశమునం దేకజాతిగ నేర్పడియుండిన వివిధ జాతులనుగురించియు తెగలను గురించియు వారికి బాగుగ దెలియును. వరాహమిహిరునిచే రచియింపబడిన "బృహత్సంహిత" యందు భరత వర్షాంతర్గతములగు వివిధ ప్రదేశములను గురించి సందర్భవశమున సంపూర్ణ వివరములు వ్రాయబడియున్నవి. మరికొన్ని వివరములు "విష్ణుపురాణ" మాదిగాగల గ్రంథములందును గలవు. భారతీయుల కన్నివిధములగు జ్ఞానమును, జీవమును ప్రసాదించిన మహాభారతము నందుగూడ వివరింపబడియున్నవి. వానియందు వివరింపబడిన కొన్ని దేశముల నిట పేర్కొనెదను! - కిరాతదేశము (నవీనమైన అస్సాము, నేపాలు దేశీయుల 'తారెయి' అను భాగము) అంగ, వంగ, పుండ్ర, మగధ, ఉత్కల కళింగదేశములు (సంయుక్త బంగాళదేశము, బీహారు ఒరిస్సా దేశములు); కురు పాంచాల దేశములు మొదలైనవి(Uniited provinces) కాశ్మీర, గాంధార, సింధు, సౌవీర, మద్ర, అంబష్ట దేశములు (పంజాబునందలి కొన్ని ప్రదేశములు); శూద్ర, ఆభీర, సాళ్వ, మాళవ దేశములు (సింధుదేశము, రాజపుత్రస్థానము)

మధ్య హిందూదేశమునందలి కొన్ని భాగములు) దాక్షిణాత్యము (దక్కను) మొదలైనవి.

## పుణ్యక్షేత్రములు - తీర్థములు - ఐక్యతానుసంధానకములు

పురాతన కాలమునందు భారతీయులు తమ దేశమును గురించిన సంపూర్ణ జ్ఞానమును దెలిసికొని యుండుటయేగాక, దేశమునంతను అవిభాజ్యమగు నేకదేశముగ తమ హృదయ ఫలకముల యందు చిత్రించుకొనుటకు ననువగు నితర మార్గములనుగూడ వారు కనిపెట్టిరి. ఉత్తరభాగమందు నివసించు హిందువుని చేతను సింహళ ద్వీపమునందు వసియించు బౌద్ధుని చేతను - వీరు వారననేల భారత వర్షీయులందరిచేతను మంత్రములవలె నేటికిని పఠియింపబడు కొన్ని శ్లోకములు గలవు. ఈ శ్లోకములయందు భారతవర్షముయొక్క ప్రధాన నైసర్గిక స్వరూపములు పుణ్యస్థలములుగ నొక్కి చెప్పబడి యుండుట వలన, ఈ దేశమునం దనేకము కలసియున్నవను భావమును సూచింపుచు, భారతవర్షముయొక్క ఏక జాతీయతయొక్క స్వరూపమును హృదయ ఫలకములయందు చిత్రించుచున్నది. ఈ శ్లోకములను పఠియించుటవలన ప్రతివానికిని భారత వర్షమునందంతటను ఆవరించి యుండి ప్రవహించుచున్న పవిత్రములగు సప్తజీవనదులు దృగ్గోచరమై దేశమంతయు నవిభాజ్యమైన ఏక ఖండముగ గన్పట్టును:-

> గంగేచయమునాకృష్ణా గోదావరీ సరస్వతీ
> నర్మదే సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధింకురు.

లేదా భారతవర్షము నందంతటను శాంతి, తపస్సునకును బ్రసిద్ధివహించియుండిన సప్త కులపర్వతములు గోచరించి దేశమంతయు నేకఖండముగ గన్పట్టును:-

> మహేంద్రో మలయశ్చైవ సహ్యశ్చైవచ శుక్తిమాన్
> ఋక్షశ్చ పారియాత్రశ్చ వింధ్య స్సప్తకులాచలః.

లేదా మోక్షదాయకములగు సప్తపురములు (వీనిమధ్యనే భారతదేశముగలదు.) జ్ఞప్తికివచ్చి ఏకదేశముగ జూపట్టును:-

అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా
పురీ ద్వారావతీ చైవా సప్తైతే మోక్షదాయకః

మిక్కిలి పవిత్రములును శ్లాఘనీయములును నగు నాలుగు తీర్థయాత్రలును గూడ దేశముయొక్క నాలుగుమూలలయందేర్పరుప బడియున్నవి:-

ప్రాచ్యాంపురీ మహాక్షేత్రం సేతు ర్దక్షిణఏవచ
ప్రతీచ్యాం ద్వారకా ప్రోక్తాహ్యుత్తరే బదరీస్మృతా.

అందుచే ఆసేతు హిమాచల పర్యంతము భారతవర్షీయుల కందరకును నీ దేశ పరిజ్ఞానమేనేర్పడును. మరియు నీ దేశమంతయు గూడ పవిత్రవంతముగ నెన్నబడును. సముద్రయానమును నిషేధించు మత నిబంధనలవలన ఈ దేశమునందుగల స్థలములందుగల భక్తి గూడ ఊహింపనగును. శిక్షాబాధితుఁడు గాకుండ భారతీయుఁ డెవ్వఁడును మాతృభూమిని విడచిపోఁగూడదు. దేశమునంతను ఏకము గను, వివిధ భాగములు దానికి చెందినవిగను బోధించి తద్వారా భారతవర్షముయొక్క వివిధభాగ సంయోగమును శాశ్వతముగ నిలుపుచు ఏకత్వమును హృదయాంతరాళమునకు గొనిపోజాలిన ఇతిహాసములు నిర్మింపబడి దేశమునందంతటను ప్రచారమునందున్నవి. దక్షుని యజ్ఞమునం దవమానితురాలైన సతీదేవి (దాక్షాయణి) దేహత్యాగమును జేసినపుడామె వివిధాంగములు ఏబదిరెండు స్థలముల యందు పడిన వను నితిహాసమొకటి కలదు. ఆమె చేతివేలు ఒకటి కలకత్తా (ఆ స్థలమునే ఇప్పటికిని కాళీఘట్టమని బిలుతురు)యందును, నాలుక పంజాబునందున్న "కాంగ్రా" (జ్వాలాముఖి) యందును, ఎడమచేయి కాశీ (ఆ స్థలమునే ఇపు డన్నపూర్ణ యని బిలుతురు) యందును, కిరీటము కిరీటేశ్వరము నందును, నుదురు లలితేశ్వరము నందును (ఈ రెండును ముర్షీదాబాదు జిల్లాయందు పల్లెటూళ్ళు) పడెనని చెప్పుచుందురు.

పండుగలు - పర్వములు "జాతీయతా" బంధములు

ఉత్తరమునందలి పాంచాలదేశీయులును, వంగదేశీయులును,

తూర్పున ఓఢ్రులును, దక్షిణమున ద్రావిడులును, మళయాళదేశీయులును, పశ్చిమమున మహారాష్ట్రులును, గుజరాతీయులును- వీరు వారననేల భారతీయు లందరును, శ్రీకృష్ణభగవానుని నామ సుధారసమును గ్రోలి యానందించుచున్నారు. మరియు దసరా, వినాయకచతుర్దశి, శ్రీకృష్ణజయంతి-మొదలుగాగల జాతీయ పండుగ లన్నియు వీరందరిచేతను భక్తిపూర్వకముగ ప్రతి సంవత్సరమును జరుపబడుచున్నవి.

### భారతీయ సంస్కృతియే సమైక్య సంవర్ధకము

భారత భాగవత రామాయణాది మహాకావ్యము లన్నియు వీరందరిచేతను పరమ ప్రీతితో పఠింపబడుచున్నవి. దేశముయొక్క భిన్నభాగములయందవతరించిన చైతన్యులు, కబీరు, నానకు, శంకరులు, రామానుజులు, మధ్వాచార్యులు మొదలగు పరమభక్తులు - అందరిచేతను పూజింపబడుచున్నారు. వేరువేరు నామములచేత వ్యవహరింపబడుచున్నను, ఇన్ని సామాన్యధర్మములచే గట్టబడియున్న భారతీయుల ఏకత్వము నశ్వగించునదేది? మరియు సంపూర్ణ తీర్థయాత్రను జేయగోరు వారందరును- ప్రథమమున దక్షిణము నందున్న రామేశ్వరమునకుబోయి సైకతమును సేకరించి తరువాత ఉత్తరముననున్న వారణాశి కేగి పవిత్రమగు గంగానదీ జలమును దీసికొని- తిరిగి రామేశ్వరమునకుం జని ఆ తీర్థము నచటి దేవునకభిషేక మొనర్పవలెను. ఇట్లు జేసినగాని సంపూర్ణయాత్ర ఫలితము దక్కదు.

### పుష్కరములు

పుష్కరములను, అర్థోదయములను, మహోదయములను- వీనిని ప్రతిష్ఠాపనజేయుటయందుగల యర్థమును మీరెప్పుడైన యోచించితిరా? ఇవి యన్నియు భారతీయులను ఏకజాతిగ బంధించు పాశములు. మనము ఎన్ని లక్షల కరపత్రముల నచ్చువేసి దేశము నందంతటను బ్రచురించినను- ఎన్ని వార్తాపత్రికలయందు దీర్ఘవ్యాసములను వ్రాసినను గూడ ఈ పుష్కరములకును, అర్థోదయములకును,

మహోదయములకును గుమిగూడు జనులయందు సగభాగమునైన నొకచోట సమకూర్పగలమా? ఇన్ని యేల! ఎన్నో సంవత్సరముల నుండియు కాంగ్రెసు మహాజనసభ ప్రతి యేటను జరుపబడుచున్నది గదా! అయినను దేశమునందున్న విద్యార్థికులలోనైన ఎందరీ సభకు విచ్చేయుచున్నారు? ఈ ప్రకారముగ వార్తాపత్రికలును, కరపత్రము లును, ప్రముఖులును, చేయజాలని పనిని మన పూర్వుల ప్రతిష్ఠాపనల వలన- అనేక వేల సంవత్సరములనుండియు నిర్విఘ్నముగను, నిరాటంకముగను జరుగుచున్నది. కాని ప్రాచీనకాలమునకును ఇప్పటికిని నొక భేదము మాత్రము గలదు- అపుడివియన్నియు జాతినైక్యతను అభివృద్ధి జేయుచుండెడివి. ఇపుడున్ననో వానియొక్క- పరమోద్దేశ మెంతమాత్రమును స్థిరవేర్పబడకుండుటయేగాక స్నానములతోడను, మంత్ర తంత్రములతో మాత్రము ముగింపబడుచున్నవి.

## ఏకచ్ఛత్రాధిపత్యము- యుధిష్ఠిరుడు

మతరూపముననేగాక రాజాధిరాజులు దేశము నంతను ఏకచ్ఛత్రాధిపత్యముగా నేలుటవలనగూడ ప్రాచీనకాలమునందీ యేకజాతీయత గాపాడబడినది. ఇట్లు చేసినవారిలో ప్రథముడు యుధిష్ఠిర మహారాజని చెప్పవచ్చును. ఆయన 'ఇంద్రప్రస్థ' పురమునందు రాజ్యాధిపత్యమును వహించి తన సర్వాధికారములు ప్రకటించి రాజసూయయాగము చేసెను. ఆ యాగమునకు దేశమునందు మారుమూలలనున్న రాజులుగూడ ఆహ్వానము చేయబడిరి. ప్రాగ్జ్యోతిష, పుండ్ర, మాళ్వ, ఆంధ్ర, ద్రవిడ' సింహాళ, కాశ్మీర, బాహ్లీక మొదలగు దేశముల రాజులీ యాగమునకు బిలువబడిరి. యుధిష్ఠిరుని యనంతరమును, మహమ్మదీయులీ దేశము మీదికి దండయాత్ర చేయుటకు పూర్వమును, రెండుసారు లీ రాజ్యాంగిక ఏక జాతీయత ఆసేతు హిమాచల పర్యంత మేర్పడెను. క్రీస్తునకు బూర్వము మూడవ శతాబ్దమునందు అశోకమహారాజు చెన్నపట్టణమువరకునుగల సమస్తదేశమును పరిపాలించునపు డొకసారియు- క్రీ.శ. నాల్గవ శతాబ్దమునందు ఆంధ్ర రాజగు సముద్రగుప్తుడు, గంగానది మొదలు ద్రవిడదేశము వరకును

గల సమస్త ప్రదేశమును జయించినప్పుడు రెండవసారియును, జయించిన దేశము ఇంతకంటె తక్కువ విస్తీర్ణము గలదైనప్పటికిని ఇతర రాజులలోగూడ సర్వాధీశ్వరులగు రాజాధిరాజు లనేకులు గలరు. పిమ్మట మధ్యకాలమునందు మహమ్మదీయ ప్రభువగు అక్బరు నానా విధములైన జాతులను మతములను కూడదీసి, ఏకచ్ఛత్రాధిపత్యముగ రాష్ట్రమును స్థాపించి, దేశమంతయును ఏకముగ గానుపించునటుల చేసెను.

## భారతదేశము - భౌగోళిక నైసర్గికైక్యత

ప్రపంచము నందంతటను ఇనుప దారులును తంతి మార్గములును విద్యుత్ప్రభావముచే నడుపబడు యంత్రములును వ్యాపించియుండిన నవీన కాలమునందు- భారతవర్షముయొక్క ఏకత్వమును మునుపటికంటె సులభముగాను స్వాభావసిద్ధముగాను మనము ప్రత్యక్షముగ గ్రహింపగలము. ఇంతియెగాక భారతవర్ష పటమునందు గూడ ఈ ఏకత్వము స్పష్టముగ గోచరించుచున్నది. కొంచెము విచక్షణతో చూచిన ఏకత్వమునకు గావలసిన లక్షణము లన్నియు భారతవర్షమునందు సంపూర్ణముగ గలవని తోచకపోదు. ఉత్తరమున 2000 మైళ్ళ పరిహద్దుకు పెట్టనికోటయై సులభముగ గర్భనిర్భేద్యము చేయజాలనివియై వెలయుచున్న హిమాలయ పర్వతములు ఈ దేశమును మిగిలిన ఆసియా ఖండమునుండి సార్థకముగ విభజించుచున్నవి. దక్షిణ దేశము సముద్రముచే చుట్టబడి ద్వీపకల్పముగ నుండుటవలన అనేక లాభములను గల్గియున్నది.

ఈ ప్రకారముగ సముద్రావృతమై పర్వత సురక్షితమైయున్న భారతవర్షముయొక్క నేకత్వము నిర్వివాదాంశము కాదని నెవరు చెప్పగలరు ? ఈ దేశము మధ్య నెవ్వియైన గొప్ప విభాగములున్నవని చూచిన ఒక్కటియైన గానుపించదు. ఉత్తరముననున్న గొప్ప మైదానమును హిమాలయపర్వతములు రక్షించుచున్నవి. ఇండస్ నది వలనను, గంగానది వలనను ఫలవంతమగుచున్న పల్లపు ప్రదేశము- ఫ్రాంసు, జర్మనీ, ఆస్ట్రేలియా దేశముల విస్తీర్ణములను మొత్తము

చేసిన నంతకంటెను గొప్పదియై హిందూదేశమున నివసించుచున్న జనులయందు సగభాగమున కెక్కువమందికి ఆశ్రయ మిచ్చుచున్నది. "బంగాళాఖాతమునుండి గంగానది ముఖద్వారమున పంజాబుదేశమున కరిగి ఇండస్ నదిగుండా, సముద్రమును చేరుటకు 2000 మైళ్ళు ప్రయాణమును చేసినప్పటికిని ఒక చిన్నరాయి యయిన దృగ్గోచరముగాదని చెప్పిన అతిశయోక్తి ఎంతమాత్రమును గాదు" అని 'సర్ రిఛర్డు స్ట్రాచీ' గారు ఈ ప్రదేశమును గూర్చియే చెప్పియున్నారు. దేనిచేతను విభజింపబడక, నదులచేతను కాలువలచేతను ఇనుపదారుల చేతను దట్టముగా నల్లుకొనబడియుండిన నీ దేశమునం దెచట చూచినను గోధుమ సముద్రమువలె గాన్పించు పొలములును, వివిధ వ్యాపారాదులచే శోభిల్లుచున్న స్థలములును, ధాన్యాదులచే నొప్పారు ప్రదేశములును, ఆద్యంతములేని చెఱకు నీలిబయళ్ళును, కన్నులపండువ చేయుచుండును. వింధ్య, సాత్పూరా పర్వతములైనను దక్షిణమునుండి ఉత్తరమునకు రాకపోకల నాటంకపరచుట లేదు. ఈ రెండు పర్వతపంక్తులును సముద్రమట్టమునకు 4000 అడుగులకంటె నెక్కువ ఎత్తులేవు. వీటిగుండ నిపుడు రయిలుబండ్లును బాటలును వేయబడియున్నవి. ప్రాచీనకాలము నందైనను (రామాయణకాలమందుగూడ) ఆర్యుల నాగరికతను, పరిజ్ఞానమును, ఉత్తరమునుండి దక్షిణమువరకును వ్యాపింపకుండ నీ పర్వతము లాటంకపరుప లేదు – ఆయా కాలములందు వీచు గాడ్పులు (Monsoons) గూడ దేశమునంతను అద్వితీయమైన ఆకృతియం దుంచుచున్నవి. ఇన్ని విధములైన నైసర్గిక స్వరూపములవలన భారతవర్షము ఇతర దేశములనుండి ప్రత్యేకపరుపబడి యున్నది. స్వభావసిద్ధముగ జలసమృద్ధిగల దేశములలో నొకటియగు నీ భారతవర్షము సర్వోత్కృష్టమగు వ్యవసాయ దేశముగ నేర్పడియున్నది. నూటికి డెబ్బది మూడనగా మొత్తము జనసంఖ్యలో ముప్పాతికవంతు జనులు వ్యవసాయమునే తమ జీవితాధారముగా నేర్పరచుకొని యున్నారు. ఈ దేశమున సాగుబడియగు 226,000,000 యకరములయందును 44,600,000

యకరములు మాత్రమే స్వభావసిద్ధమగు నీటివసతిలేక మానవుని స్వప్రయత్నమువలన సాగుబడియగుచున్నవి. అనగా మొత్తము సాగుబడియగు భూమియందు నూటికి 80 ఎకరములు నదుల వలననే సాగుబడి యగుచున్నవి.

ఈ స్థితిగతు లన్నిటినిబట్టి చూచిన భారతవర్షీయుల ఏకజాతీయతకు వలయు సంగతులన్నియు మిక్కిలి అనుకూలముగ నున్నవి. దేశమునందలి జనులకును, దేశమునకును పరస్పర సంబంధము గలదు. పైన వివరింపబడిన రీతిగా భారతవర్షము ఏక దేశమేగాని అనేక దేశముల సముదాయ మెంతమాత్రమునుగాదు. ఎన్ని విధములగు జీవిత విధానములు, నడవడికలు, ఆచా వ్యవహారములు, నమ్మికలు, జాతులు, మతములు ఉండియున్నను, రక దేశమను భావము గలిగియుండుట ఒక దేశమునందున్న జనుల కెంతఏయావశ్యకమో నవీనులింకను బాగుగ గ్రహింపలేదు. కాని చరిత్ర యీ విషయమును సంపూర్ణముగ ధృవపరుచుచున్నది. ఊరూరు దిరుగు జను లెంత ఉన్నతమైన నాగరికత గలిగియున్నను స్థిరోభూతమైన నివాసమును గలిగి యుండిననేగాని వారిని గురించి ప్రామాణికమైన చారిత్ర ముండదు. ఈ ప్రకారమే హిబ్రూజాతివారు 'మోసెస్సు' దగ్గరనుండి రాజకీయ తరిబీతును పొందినప్పటికిని, 'పేలస్టయిన్' అను ప్రదేశ నివాసులు గానంత వరకు అభివృద్ధిని జెందలేదు. ఇట్టి దృష్టాంతరములు చరిత్రయందు అనంతములు.

## ఉ ప సం హా ర ము

చదువరు లిదివరకే గ్రహించిన ప్రకారము నడవడికల యందును ఆచార వ్యవహారముల యందును భాషయందును మతము వందును ఎన్ని భేదములు కనబడినప్పటికిని ఏక దేశముయొక్కయు-అంతరకును సామాన్యములగు పరిసరములయొక్కయు ఐక్యత నడ్డగింప - నశక్యమైనదిగా నున్నది. కాబట్టి పైపైని మాత్రము జూచి సిద్ధాంతములను చేయువారు తలంచునట్లుగా భారత జాతీయత అసాధ్యము గాదు. జాతీయ విద్య సరియైన మార్గములం ద్రొక్కనేని మనలో

గల దురభిప్రాయములు త్వరలో నశించి తత్ఫలితముగ నవీనుల హృదయములందు 'ఏకజాతీయతా భావము' అప్రతిహతముగ నావిర్భ వించును.

—ఆంధ్రభారతి; సంపుటము 1: సంచిక 12: 1911 జూను.

మేలుకొనుమీ! భరత పుత్రుఁడ మేలుకొనుమీ సుజన మిత్రుఁడ
మేలుకొనుమీ! సచ్చరిత్రుఁడ! మేలుకొనువయ్యా వత్సా! మేలుకో
వేడుకను "జాతీయతా" యను వేగుచుక్క పొడిచెనదుగో
కూడి "వందేమాతరం" బను కుక్కుటము లరచెన్॥ వత్సా! మేలుకో॥

శ్రీ మంగిపూడి వేంకటశర్మ."ఆంధ్ర భారతి" – సంపుటం 1 సంచిక-1(1910)-

అన్న మేలు కొలుపు ఆంధ్రజాతిని ప్రబోధం చేసింది. ఈ ప్రబోధం ప్రభుత్వ దృష్టిని ఆకర్షించింది పత్రికాధిపతి వెంకటరమణయ్యగారికి మందలింపు వచ్చింది. ఈ "జాతీయత" అనే వేగుచుక్క పొడిచి జాతికంతకూ ఒక ఆదర్శపు వెలుగును చూపింది.

## అనేకత్వంలో ఏకత్వం

ఆసేతు శీతాచల పర్యంతం భారతీయులందరూ ఒకేజాతికి చెందినవారు.వివిధ భాషలు భాషిస్తున్నా, వివిధ మతాలు, సంప్రదాయాలూ అవలంబిస్తున్నా, తరతమ భేదాలు గల శీతోష్ణ పరిస్థితుల్లో నివసిస్తున్నా, అనేకత్వంలో ఏకత్వం. భేదంలో అభేదం – ద్వైతంలో అద్వైతం– సాధించి సమన్వయ పరచే సూత్రం– హారంలో దారంలాగా – భారతీయుల సంప్రదాయాల్లోనూ, సాంఘికాచార వ్యవహారాల్లోనూ– అంతర్నిహితంగా, నిగూఢంగా నిరూపితం అవుతుంది. అందుచేతనే భారతీయు లందరిదీ విడదీయరాని అనుబంధం.

భారతీయులందరూ భారతమాత పుత్రులు. వారు నివసించేది ఒకే దేశము. వీరు ఆరాధించేది ఒకే ఆదర్శము. వీరందరూ ఒకేజాతికి చెందినవారు. అనే విషయాన్ని "జాతీయత"అనే వ్యాసంలో విస్పష్టంగా విశదీకరించారు పంతులుగారు



# శ్రీ గాడిచెర్ల హరి సర్వోత్తమరావు, ఎం. ఏ.



శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యా
బారిష్టరు దాసు త్రివిక్రమరావు
గార్ల ఆహ్వానముల నందుకొని 1944 సంవత్సరమున బెజవాడయందు స్థిరనివాసము
నేర్పరచుకొని, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముతో సన్నిహితమైన
సంబంధమును ఏర్పచుకొనిరి.

పనిపోవువరకును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షులుగా
అసమానమైన సేవజేసిరి.

జననము 14–9–1883 - మరణము 29–2–1960

# అభినందన పరంపర

(ఈ అభినందనలన్నియు 1950 కి పూర్వము ప్రసాదింప బడినవి.)

---

## గ్రంథాలయోద్యమమున "శ్రీ అయ్యంకి" స్థానము సుప్రతిష్ఠితము

"శ్రీ వేంకటరమణయ్యగారు తమ జీవితమున అపజయమన్నది ఎరుగరు. ఆ పదము వారి నిఘంటువున లేదని చెప్పవచ్చును. వారు ఉత్సాహవంతులగుటయే కాక ప్రక్కవారికి ఉత్సాహము పెంపొందించుటకు వారు సర్వదా యత్నింతురు, అనగా వారికి కారణవిఘ్నము లెన్నడును కలుగవని కాదు. అపజయమును నిరాకరించు వారి చిత్తవృత్తినే నేను పాటింతును. శ్రీ "అయ్యంకి" అపజయమునకు విరుగుడు మందు. ఆ శుభ లక్షణమే వారికి ఉద్యమమునందు జయ పరంపరలను సమకూర్చినది, పెక్కు అవరోధములను అధిగమించుటకు తోడ్పడినది ఉద్యమ నిర్వహణమునందు వారి ప్రతిభ నవనవోన్మేషముగా అభివ్యక్త మగుచుండును. నిష్కామ కర్మయే వారి ఏకైక లక్ష్యము. ఆంగ్లమున ప్రచురింప బడు గ్రంథాలయ పత్రిక ద్వారా వారు సార్వదేశికమైన సంబంధములను నెలకొల్పుకొన గల్గిరి. గ్రంథాలయ యాత్రాదళములు వారి ప్రతిభా ఫలితముగా ఉద్యమమునకు సమకూర్చిన అపూర్వ సృష్టియని చెప్పదగును, అవి గ్రంథాలయోద్యమమునకు "దండి" యాత్ర వంటివి.

గాడిచెర్ల హరిసర్వోత్తమరావు.
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు, మద్రాసు.

## మా రాజ్యమున (పంజాబు) గ్రంథాలయోద్యమ ప్రతిష్ఠాపకులు

పంజాబు రాష్ట్రమున గ్రంథాలయోద్యమ ప్రతిష్ఠాపకులుగను, మార్గదర్శకులుగను శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు పంజాబునందు పరిచయులైరన్నచో అందు అత్యుక్తి ఎంతమాత్రమును లేదు. 1929 సంవత్సరం క్రిస్టమసు దినములలో డాక్టర్ పి. సి. రే గారి అధ్యక్షతక్రింద సమావేశమైన "సప్తమ అఖిల భారత గ్రంథాలయ సభ"ను లాహోరు నగరమున సమకూర్చుటకు వారు బెజవాడ నుండి వచ్చిరి ఆ సభయును. ప్రదర్శనమును జయప్రదముగా జరుగుటకు శ్రీ వేంకటరమణయ్యగారి కార్యదీక్షయె ముఖ్యకారణము అందుకు పంజాబు దేశస్థులమైన మేము వారియెడల మిక్కిలి కృతజ్ఞులము. భారతదేశమున గ్రంథాలయోద్యమ సేవకులుగా వారికి అగ్రస్థానము కలదని గుర్తించుటకు మేము ఎన్నడును వెనుదీయము. నామట్టుకు నేను నిజమైన గ్రంథాలయ భావమును వారియందు సర్వదా

దర్శించుచుంటిని. సుప్రసిద్ధ గ్రంథాలయ సేవకులుగను, అఖిల భారత గ్రంథాలయ సంఘ ప్రధాన కార్యదర్శిగను, నూతన భావములతో నూతనోద్యమమునకు నిత్య సంసిద్ధులుగను వారిని ఎవ్వరును విస్మరింపజాలరు. అట్టి "రమణయ్య" లు ప్రతి రాష్ట్రమునకు లభింపవలయునని నేను దైవమును ప్రార్థింతును.

శాంతారాం భాటియా,

సంపాదకులు : "మాడరన్ లైబ్రేరియన్"

("పంజాబురాష్ట్ర గ్రంథాలయసంఘ" పక్షమున ప్రకటింపబడు పత్రిక)

## సహజమైన ప్రవృద్ధి

"ఆంధ్రదేశము నందలి గ్రామములలో వృద్ధిపొందుచున్న గ్రంథాలయోద్యమము – దీర్ఘకాలముగా వచ్చు సామాజిక జీవితమును నిలబెట్టుటకును, జాతీయ భావములను పునరుద్దీప్తము గావించుటకును ఉద్దేశింప బడినదని నిస్సందేహముగా చెప్పవచ్చును."

డాక్టరు భోగరాజు పట్టాభి శీతారామయ్య

## "వృత్తిగాగలవారిని లజ్జితులనుగా జేయుగలవ్యక్తి"

"వృత్తిగా గ్రంథాలయములతో సంబంధంగలవారిని గూడ లజ్జితుల గావింప గల వ్యక్తి శ్రీ వేంకట రమణయ్యగారు – వృత్తిలో నుండువారికది భుక్తసాధన మగుటచే గాబోలు – ఆయనకుగల ఉత్సాహంలో కొంచెమైన మనము ప్రదర్శింప లేకబోవుట? అట్టి మనబోంట్లకు వారి సహచర్యము అత్యంతావశ్యకమని చెప్ప నక్కరలేదు."

యం. ఓ. థామస్,

లైబ్రేరియన్, మద్రాసు యూనివర్శిటీ లైబ్రరీ.

## పనికిముందు : పదవులకు వెనుక

1914 వ సం॥లో విజయవాడలో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారి యాజమాన్యమున గ్రంథాలయ సభ జరిగింది. ఆలమూరునుండి "సరస్వతీ పుస్తక భాండాగారము" తరపున నేను ఆ సభకు ప్రతినిధిగా వెళ్ళినాను. అప్పుడే అయ్యంకి వేంకటరమణయ్యగారితో నాకు ప్రథమ పరిచయము. అప్పటికే అయ్యంకివారు గ్రంథాలయోద్యమమున అధ్వర్యమువహించి ఆరితేరిన దిట్ట.........నేనప్పటికి

స్కూలుఫైనలు చదువుచున్న విద్యార్థిని. అదివరకెన్నడును ఉపన్యాసవేదిక నెక్కని నన్ను ఆనాటి సభలో ప్రోత్సహించి మాట్లాడవలసిన విషయము, ప్రసంగింపవలసిన విధము- ఈ అంశములు ముందుగా తెలియజెప్పి యుపన్యాసమునకై గద్దె నెక్కించి భయము తీర్చినారు. నావలెనే ఎంతమందియో విద్యార్థులను అయ్యంకి వారు గ్రంధాలయోద్యమమున గద్దెనెక్కించి, భయముతీరిచి, యుద్యమాభిమానులుగా తయారుచేసినారు...... ముందుకొచ్చి నాకీ పదవి కావాలని ఎన్నడూ ప్రాకులాడు గోరికలేదు. ఎక్కడచూచినా, తనపని మందహాసముతో చేసికొనిపోవడమేగాని, అధికార పదవులకోసము దేవులాడుట లేదు. పనికిముందు, పదవులకు వెనుక - వీరి జీవితములో నా యనుభవము. ఆంధ్రదేశములో గ్రంధాలయోద్యమము పల్లెలలోకూడా ప్రాకుటకు ముఖ్యహేతువు "నా బొందియేయని" రాత్రింబవళ్ళు జోలె చంకనువేసికొని "రమణయ్య" గారి వంటి నిరాడంబర సేవకు డొకడున్నాడు కనుకనే, జానపదములలోగూడ, ఊరూరా గ్రంధాలయములే వెలసినవి. అయ్యంకివారు సంచార గ్రంధాలయ మేను. •

నరసింహదేవర సత్యనారాయణ,

పెసిడెంటు, ఆలమూరు కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంక్ లిమిటెడ్

## కర్మయోగి

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారిని వారి బాల్యమునుంచీ ఎరుగుదును. వారు నిజమైన కర్మయోగి ... వేంకట రమణయ్య పంతులుగారు కేవల ముత్సాహపరులు మాత్రమేకాక కార్యదీక్ష, సమర్థత, వారి కమరి యుండుటచేతనే గ్రంధాలయోద్యమము దేశములో విజయము గాంచినది. వారు స్వయముగ కార్యముల నిర్వహించుటేగాక ఇతరులను కార్యములకు ప్రేరేపించుశక్తి కూడ వారికి మెండు. వారి చురుకుదనము, చిరునవ్వు, వారి సహచరుల మాంద్యమునకు మందయి కార్యకారులనుగా జేయును. ఇది నాయకులకు ముఖ్యలక్షణములలో నొకటి

వున్నవ లక్ష్మీనారాయణ పంతులు, గుంటూరు.

## రెండు నదులు

కొంతకాలము క్రితము నేను మైసూరు సంస్థానమున నందికొండలలో పర్యటించితిని. అక్కడ రెండు నంది విగ్రహములు కలవు - ప్రతి విగ్రహము నుండియు రెండు నదులు ప్రవహించుచున్న ఉభయ పినాకినులని వారివలన తెలిసి

కొంటిని ఆ సందిద్వయము ఏకమైనట్లు ఊహించిన, ఆ రూపమే శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారి గ్రంథాలయ సేవకా స్వరూపముగా భావించవచ్చును.

రావుసాహెబ్ యస్. ఆర్. రంగనాథన్,
(లైబ్రేరియన్, మద్రాసు యూనివర్శిటీ లైబ్రరీ, మదారాసు.)

## ఇది కవిత్వంకాదు నిజము

"విద్యావిహీనులంటే ఆయన హృదయం ఎంతో కరిగిపోతుంది. అట్టివారి విద్యకై ఆయన యెంతో శ్రద్ధ తీసికొని శ్రమపడతాడు. డబ్బు ఎంతఇస్తాడో రెండోకంటివాడికి తెలియదు. నేనుగూడా డబ్బుఇవ్వటం చూడలేను విద్యసంపాదించి స్వతంత్రులైనవారు చూపే కృతజ్ఞతవల్ల మాత్రమే ఊహిస్తాను.

ఏ పుస్తకమన్నా అచ్చుకాకుండా మాసిపోవటం ఆయనకు ఇష్టములేదు. ఇది ఆయనకు వ్యసనము. మంచి వ్యసనమే అనుకోండి. ఈ వ్యసనములో ఆయన యెంతో డబ్బును ఖర్చుచేసినాడని నాకుతెలుసు. అభివృద్ధి పొందదగినవారిని ఆయన పసికట్టి తెలుసుకుంటాడు. ఆయనచేసే ప్రోత్సాహమువలన రాళ్ళు, సానలుతీరినజాతిరత్నాలు అవుతవి. ఇది కవిత్వంకాదు. నిజము.

వారి ఇల్లు ఒక సరస్వతీమందిరము. దినములు, నెలలు, ఆ పుస్తకాలు చూస్తూ, చదువుతూ గడుపవచ్చును అచ్చట అన్నిరకాల పుస్తకాలు వుంటవి. ఆయనకే సరస్వతీపూజ అంటే ఏమిటో బాగా తెలుసునట్లేవుంది.

పుచ్చా వెంకటరామయ్య-
ఎడిటర్ "ప్రకృతి" "ఇండియన్ నేచురోపాత్"
దంతలూరు అగ్రహారం

## ఉదాత్త ఫలప్రదము

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము కార్య నిర్వాహకుల ఉత్సాహ శ్రద్ధల ఫలితముగా, సాంఘిక జీవితమునకు గ్రంథాలయమును కేంద్రముగావించు విధానమును మనకు ప్రదర్శించినది. సంస్కృతికిని సౌహార్దమునకు గ్రంథాలయమే కేంద్రము. సహకార కృషివలన ప్రజలకు సమకూరు ప్రయోజనములను చూపి గ్రంథాలయ సంస్థ మాన్యతను గడించినది. ప్రభుత్వ సహాయము లేకుండను, బైటనుండి విజ్ఞులను ఆహ్వానించకుండను స్థానిక కార్య నిర్వాహకుల కృషివల్లనే గ్రంథాలయోద్యమము ఉదాత్త ఫలప్రదమైనది

యస్. యన్. ఫెర్నాని ఎం. ఏ.
(సోషియాలజీ ప్రొఫెసర్, బొంబే విశ్వవిద్యాలయం)

# గ్రంథాలయముల స్వరూప విజ్ఞానము

## ధర్మగ్రంథాలయములు - నిర్వహణము

### ప్రాచీనత

మన దేశముయొక్క విద్యావ్యాసంగ చరిత్ర ఉన్నతాదర్శములతోను ప్రావీణ్యముతోను నిండియున్నది. కొన్ని శతాబ్దములకు పూర్వము మనము దేశ స్వాతంత్ర్యమును గోల్పోయినప్పుడు, దానియొక్క క్రమ వికాసమునకు గూడ భంగము వాటిల్లెను. భారత వర్షమున నాగరికతా భానుడు ఉదయించినప్పుడు పవిత్రవంతములగు నదీతీరములందు ఋషిపుంగవులు వేదఘోష జేయుచుండిరి. ఈ ఋషిపుంగవులు తమయొక్క జ్ఞానామృతమును శిష్యప్రశిష్యులచేత వ్యాపింపజేయుచుండిరి. పిమ్మట వ్రాత సాధనములు వెలసినవి. తదుపరి గ్రంథముల ప్రతులను భూర్జ పత్రముల మీాదను తాళపత్రములమీాదను వ్రాయుచుండిరి. ఇట్టి గ్రంథముల యొక్క సమీాకరణమే మనదేశ గ్రంథాలయములకు ప్రాతిపదిక యయ్యెను.

గ్రంథాలయమనునది ప్రత్యేకముగా పాశ్చాత్య సంస్థయని కొందరు జెప్పెదరు. సంస్కృతపరిజ్ఞానముచే పావనవంతమైన భారత వర్షమునందు గ్రంథాలయములు బొత్తిగా నూతనములుగావు. తక్షశిల, నలంద, విక్రమశిల, ఉదయపురి మున్నగు ప్రాచీన విశ్వవిద్యాలయములందు వేలకొలది వ్రాతప్రతులను భద్రపరచుచుండిరి.

దేవాలయములందును, బౌద్ధుల విహారములందును, సన్యాసులమఠము లందును,మత విషయకమైనట్టియు, వేదాంత సంబంధమైనట్టియు గ్రంథముల సముదాయములు మిక్కిలి జాగరూకతతో భద్రపరుపబడు చుండెను. "నలంద" విశ్వ విద్యాలయమునందు "రత్నదధి" యను పేరుగల తొమ్మిది అంతస్తులు గలిగిన గొప్ప మేడయందు విశ్వవిద్యాలయ గ్రంథభాండాగారముంచబడెను. గుంటూరు మండలమున ప్రస్తుతము అమరావతీ పట్టణమున్నచోట "ధాన్యకటక" యను పేర గొప్ప విశ్వవిద్యాలయము వర్ధిల్లెను. దానిననుసరించియే 'ఏలా'పట్టణమునగూడ గొప్ప విశ్వవిద్యాలయము నిర్మాణమాయెను.

ఆ కాలమునందా గ్రంథాలయము అమూల్యములగు గ్రంథరాజములచే నొప్పారి మిక్కిలి గొప్ప గ్రంథాలయముగ విరాజిల్లెను. ఏడవ శతాబ్దమున చీనా యాత్రికుడగు "హ్యూనుత్స్యాంగు" భారత విజ్ఞానమును గ్రోలుటకై మన దేశమున కేతెంచినప్పుడు నలంద విశ్వవిద్యాలయమును అనేక మారులు దర్శించెను. ఈగ్రంథాలయము ఎనిమిదవ శతాబ్దమున క్షీణించెను. విక్రమశిల, ఉదంతపురులయందు గల గొప్ప గ్రంథాలయములు పాల్ రాజుల కాలమున ఉన్నత స్థితియందుండెను. పదమూడవ శతాబ్ద ప్రారంభమున ఖిల్జీయొక్క దండయాత్రయందు ఈ గ్రంథాలయములు నాశనము గావింపబడినవి. ఈ గ్రంథాలయములను సంరక్షించుకొనుచుండిన కొందరు బౌద్ధ సన్యాసులు కొన్ని అమూల్యములయిన గ్రంథములను మాత్రము తీసికొని నేపాలు దేశమున కేగిరి. ఇట్టి విశ్వవిద్యాలయ గ్రంథాలయములే గాక ఆకాలమున రాజులును రాజబంధువులును గూడ తమ మందిరములందు గ్రంథాలయములను గలిగియుండిరి. ప్రాచీన పండితులు, చతుష్పదులయొక్క అధ్యాపకులు స్వీయ గ్రంథాలయములను గలిగి యుండిరి. దేవాలయములందు వ్రాతప్రతులను సంరక్షించుట హిందూ ధర్మముగ నెన్నబడుచుండెను. వేదాంత గ్రంథములయొక్క ప్రతులను వ్రాయుట గూడ బౌద్ధ సన్యాసుల దినచర్యయందొక భాగముగ నేర్పడెను. మత గ్రంథములను ప్రత్యేకముగ సంరక్షించుట జైనభిక్షు

వుల విధిగా నేర్పడెను. అట్టి జైన గ్రంథాలయములు ఇప్పటికిని పశ్చిమ హిందూదేశమునందు "కేంబే," "జసర్‌మీరు," "సూరతు" పట్టములయందు గాననగును.

క్రీస్తునకు పిమ్మట నాలుగైదు శతాబ్దములందు గుప్తవంశపు రాజుల కాలమున మనదేశమున విద్యాప్రాభవము మిక్కిలి ఉచ్ఛదశ యందుండెను. "విన్సెంటు స్మిత్తు" వ్రాసిన ప్రకారము క్రీస్తునకు పిమ్మట 300 సంవత్సరములు మొదలు 650 సంవత్సరముల వరకు గుప్తయుగము-ఇంగ్లాండు దేశమున ఎలిజెబెత్తు స్టూఆర్టుశకములవలె నే- హిందూదేశము విద్యాభివృద్ధి విషయమున మిక్కిలి యభివృద్ధిని జూపినది. ఈ యుగమునందే విఖ్యాతిగాంచిన విక్రమాదిత్యుని యాస్థానమునందు 'నవమణు'లని ప్రఖ్యాతి గాంచిన యశోవంతులు విలసిల్లిరి. ఆవిషయము - ఈ విషయము అని చెప్పనేల! వీరు శారీరశాస్త్రము మొదలు వ్యాకరణ శాస్త్రము వరకు అన్ని విద్యలయందును నిధులని విఖ్యాతి గాంచిరి.

గుప్తయుగాంతమున భారతవర్షము అనేక చిన్న రాజ్యముల క్రింద చీలిపోయినది. ఈ చిన్నరాజులలో గూడ కొందరు ప్రాచీన వ్రాతప్రతుల సంరక్షణయందు విశేష శ్రద్ధాభక్తులను గలిగియుండిరి. మహమ్మదీయుల పరిపాలనయందు హుమాయూను, అక్బరు, జహాంగీరు, ఫిరోజిషా చక్రవర్తులు ఈ విషయమున మిక్కిలి ఔదార్యమును జూపిరి. వారికి లోబడిన కొందరు హిందూరాజులు కూడ జ్ఞాన వ్యాపనమునకై అమితవ్యయమును జేసిరి. వారు వ్రాతప్రతులను సంపాదించుటయేగాక, విఖ్యాతిగాంచిన పండితులను తమ యాస్థానములందుంచి పోషించుచు, జ్ఞానసముపార్జనాపరులకు గావలసిన సహాయమును గూడ జేయుచుండిరి. పదునొకటవ శతాబ్దియందు భోజ మహారాజు మిక్కిలి ప్రముఖములగు గ్రంథరాజములను అమితముగ సేకరించెను. చాళుక్యులు మాళ్వదేశమును జయించినప్పుడు ఈ గ్రంథములను వారు తమ గ్రంథాలయమునందు జాగ్రత్తపరచిరి

చాళుక్య రాజులలో నొకరగు విశాలదేవుడు ఈ గ్రంథాలయమునకై విశేష ద్రవ్యమును వెచ్చించెను.

విశాలదేవుని గ్రంథాలయమునకు జెందిన శ్రీమద్రామాయణము యొక్క వ్రాతప్రతి యొకటి జర్మనీదేశమునందున్న "బాన్" విశ్వవిద్యాలయమునకు జేరినది. అనేక జర్మన్ గ్రంథాలయములందు అపూర్వములగు సంస్కృత వ్రాతప్రతులెన్నియోగలవు. నేపాళము, జమ్మూ, మైసూరు, బికనీరు, అళ్వారులయందుగల స్వదేశ సంస్థాన గ్రంథాలయములందు వ్రాతప్రతులు అనంతముగ సేకరింపబడి యున్నవి. వీని యన్నింటికంటె తంజావూరుమహాలు గ్రంథాలయము గొప్పది, దీనియందు 18000 వ్రాతప్రతులున్నవి. బెజవాడ పట్టణమునకు దగ్గరగా కృష్ణానది కావలివైపున ఇప్పుడున్న "మందడ" గ్రామ సామీప్యమున ఇటీవల బయలుపడిన శాసనములనుబట్టి కాకతీయ రాజుల కాలమున సకల విద్యలను బోధించుటకు విశ్వవిద్యాలయములు స్థాపింపబడినటుల గానవగును.

భారతవర్షమున ప్రాచీనులు ఆధ్యాత్మికౌన్నత్యమునకు ఎక్కువ ప్రాధాన్య మిచ్చినను ప్రాపంచిక వ్యవహార విషయమును గూడ ఉపేక్షచేయలేదు. భారతవర్షము భోగభూమిగాక కర్మభూమిగకూడ విఖ్యాతిజెందినది. కర్మయొక్క ఉత్తమ భావము నిష్కామము. అనగా పనియొక్క ఫలితమును తాను కోరక పరాత్పరునికి విడచిపెట్టుట. ఈ దేశమున మానవ జీవితముయొక్క వివిధమార్గములు హెచ్చుతగ్గులులేని శాస్త్రవిధులవలన నడుపబడు చున్నవి.జనసామాన్యముగూడ తృణీకారభావముతో జూడబడియుండ లేదు. వేదాధికారము ద్విజులకు మాత్రము ప్రత్యేకింపబడినప్పటికిని అక్షరాస్యులుకాని జనసామాన్యముయొక్క జ్ఞానాభివృద్ధికిగాను అనేకమార్గములు అవలంపబడి యున్నవి. హరికథలు, పురాణములు, భాగవతములు, తోలుబొమ్మలాటలు, ఉత్సవములుపండుగలు, తీర్థయాత్రలు భజనలు మున్నగునవి యన్నియు జనసామాన్యము

యొక్క జ్ఞానాభివృద్ధికొరకేర్పరుపబడినవి. అక్షరజ్ఞానములేని పాటకపు జనులచే రచియింపబడి తరతరములనుండి ముఖాముఖిని ప్రచారమగుచున్న గాధలను జూచినయెడల మనజాతియొక్క అద్భుతమగు ఆధ్యాత్మికౌన్నత్యము గోచరించును. ఆ గాధలయందలి కరుణరసము, శోకరసము మెరుగుపూతలులేని కథ - ఇవి యన్నియు విద్యాగంధ మెరుంగని సామాన్యజనుల మనసుయొక్క వికాసమును, జ్ఞానాభివృద్ధిని తెలియజేయుచున్నవి. ఆ దినములయందు విద్యయొక్క ఆదర్శము అక్షరములను నేర్చుకొనుట, వ్యాకరణమును జదువుకొనుటమాత్రము గాదు. నిద్రాణమైయున్న ఆత్మ నుద్దీపింపజేసి పౌరునకు గావలసిన సన్మార్గజీవనమునకును చతుర్విధ పురుషార్థ ప్రాప్తిసాధనమునకును మార్గమునుజూపుటయే విద్యయొక్క ఆదర్శము.

## గ్రంథాలయోద్యమ తత్వము

ఇప్పు డా కాలము మారినది. జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధి గలుగుటకు ఆ దినములందు అవలంబింపబడిన పద్ధతులు నశించుచున్నవి. మానవుని జీవయాత్ర కష్టతరమై పోయినది. ఎవరికివారు కాలూని నిలచుటకు గొట్టుకాడుచున్నారు. విశ్రాంతి తగ్గినది. కాల పరిణామముచేతను పశ్చిమదేశ పరిజ్ఞాన సంఘటనముచేతను మన ప్రాప్యములు, మన యలవాటులు, మన మర్యాదలు, ఎన్నియో విధముల బూర్వముకంటె మార్పుజెందినవి. మన పూర్వులు తమ విశ్రాంతికాలములయందు ఏ దేవళముననో యే తటాకోపాంత తరుచ్ఛాయలనో కూడి ఇహపర సౌఖ్యదాయకములగు నంశములను గూర్చి ముచ్చటించుకొనుచుండెడివారు. ఇందువలన పుస్తకములు చదువుకొనగలిగినవారికేగాక చదువను వ్రాయను రానివారలకుగూడ జ్ఞానము అబ్బుచుండెను. ఆ కాలమున మనుజుని సంపూర్ణ మనుష్యత్వమును వ్యక్తీకరించుటకు తగిన ప్రతిష్ఠాపనలు అనేకము లుండెను. అందులో నాయకమణి యని ఖ్యాతిగాంచినది "దేవాలయము"; దీని యొక్క మహిమ వర్ణనాతీతము; అది "వివాహములకు సాక్షి;

ప్రమాణములకు రచ్చ; ధర్మశాస్త్ర చర్చలకు సభా భవనము; పర దేశీయులకు ధర్మశాల; పనివాండ్రకు పాళ్ళు; సన్యాసులకు మఠము; భక్తవరుల కునికిపట్టు; లలితకళలకు ప్రదర్శనశాల; ఇది యది యన నేల- ప్రజలకు జీవనాధారమై జ్ఞానదాయకమై సౌందర్యస్థానమై ఆనందాంబుధియై "దేవాలయము" విరాజిల్లుచుండెను. దానియందు సాంఘిక జీవనమంతయు పుంజీభూతమైయుండెను. సంఘశక్తుల కన్నిం టికి నది మచ్చుల చావిడి. పిన్నలు పెద్దలు విద్యావంతులు విద్యావిహీ నులు, నిరుపేదలు, ధనాఢ్యులు, లౌకికులు, భక్తులు — వీరు వారు అననేల సంఘమం దున్న అన్నితరగతులవారును అక్కడికి ఆకర్షింప బడి - తమతమ పరమార్థములను గుర్తెరుంగగలుగుచుండిరి. అట్టి మహోత్కృష్టమగు ప్రతిష్ఠాపన తనశక్తిని గోల్పోవుట మన దుర దృష్ట మనక తీరదు.

ఈ యాధునిక కాలమున ఈ స్థితిగతులు తారుమారైన స్థితి యందు, దేశమునందు జ్ఞానాభివృద్ధిని గలుగజేసి మనుజుని జీవయాత్ర పవిత్రముగను పురుషార్థప్రాప్తి సాధకముగను నడుపుటకు తోడ్పడి - సేవారంగమై, వ్యాయామశాలయై, కళాక్షేత్రమై, సుందర మందిరమై, భాషానిలయమై, విద్యాలయమై, నాటకరంగమై, ధర్మరక్షణ సాధనమై, వేయేల దేశాభివృద్ధికరములగు యుద్యమము లన్నింటికిని కేంద్ర స్థానముగ పరిణమించదగిన సంస్థ సరస్వతీదేవి ఆలయమే.

అందుచేత గ్రామోద్ధరణకు పునాది సరస్వతీదేవి ఆలయము. దీనినే ధర్మగ్రంథాలయ మందురు. జనసామాన్యమంతయు గూడ విద్యావంతులును, జ్ఞానవంతులునై యుండవలయును. భావికాలమున నుదయింపబోవు మహాపురుషు లందరియొక్క జ్ఞాన బీజములును నీకాల మందలి జనసామాన్యమునందు అంతర్గర్భితములై యున్నవి. అను వగు దోహదము నిచ్చితిమా- ఆ బీజములు మొలకలెత్తి క్రమముగ మహావృక్షములై పరోపకార నిలయములగును. మునుపొకకాలమున నాగరికాగ్రగణ్యమై తన విజ్ఞాన తేజస్సుచేత ప్రపంచమునంతను

ప్రజ్వలింపచేసిన పవిత్రమైన ఈ దేశముమీద విద్యాధిదేవతకు నేడు దయతప్పినది. ఆ దేవతయొక్క దయ సంపూర్ణముగ లభించినకాని మనకు పురోభివృద్ధిలేదు. ఆమె దయను సంపాదించుటకు మన మిప్పుడు ఘోరతపస్సు జేయవలసియున్నది. ఈ తపస్సును జేయుటకు మనము వనాంతరములకుగాని నిర్జనప్రదేశములకుగాని - కొండగుహలకుగాని పోనక్కరలేదు. మన మున్న గ్రామము లయం దెల్ల సరస్వతీ దేవి ఆలయములను నిర్మించికొన్న జాలును.

ప్రపంచమునందలి దేశము లన్నింటికంటెను మన దేశమునందు ఎక్కువగ అజ్ఞానదేవత తాండవమాడుచున్నది. మూర్ఖతకు, అపరిశుభ్రతకు, దారిద్ర్యమునకు, పారతంత్ర్యమునకు మన దేశము నిలయమైనది. సౌఖ్యముగ తిని దేహయాత్రను గడుపుటయే జీవితోద్దేశ మను తలంపులు ప్రబలుచున్నవి. "జీవిత ధర్మమేమి" యను నాలోచన పూర్తిగ అంతరించుచున్నది. దీనికి కారణమేమి? మన దేశమునందు - విద్యాధికుల సంఖ్య స్వల్పము. ఈ స్వల్పసంఖ్యాకులయినను విశేష భాగము జ్ఞానసమన్వితులుగారు. అట్టి స్వల్పసంఖ్యాకులు జనసామాన్యముయొక్క గతులను నడుపవలసిన వారుగా నున్నారు. జనసామాన్యమునకు సంబంధించిన సకలవిషయములను అట్టి కొందరు మాత్రము నిర్ణయించవలసిన వారుగా నున్నారు. వీరి భావనా ప్రపంచమునకును నిజమైన స్థితిగతులకును సంబంధమే లేదు. దేశములోనున్న జనులందరును తమవలెనే సౌఖ్యవంతులై ఆనందము ననుభవించుచున్నారని వీరి భావన. నిజమగు స్థితిగతులను గనుగొనుటకుగాని ఒకవేళ కనుగొన్నను వానికి తగిన ప్రతిక్రియ చేయుటకుగాని వీరికి తగిన సామర్థ్యములేదు. ఇట్టి స్థితి దుర్భరము. కావున మనమిపు డాలోచించ వలసిన దేమనగా జనసామాన్య మంతయు విద్యాధికులును జ్ఞానవంతులు అగుట ఎట్లు? ధర్మగ్రంథాలయ స్థాపనమే దీనికి తారకము.

ఒండొరులు కలిసికొని తమ భావములను బ్రకటించుకొని, యన్యోన్య లాభము పొందుటకును, ప్రజాసామాన్యమునందు జ్ఞాన

మును వ్యాపింపజేయుటకును నేడు పుస్తకాలయములే ముఖ్య సాధన ములు.

## ధర్మగ్రంథాలయమన నేమి?

గ్రంథాలయమనగా గ్రంథముల నన్నింటిని ఒక చోట చేర్చి పెట్టునట్టి గృహమనియు, అట్టి గృహమునందున్న గ్రంథముల నన్నింటిని దాచి జాగ్రత్తగ కావలికాయునట్టివాడే గ్రంథభాండాగారి యనియు,గ్రంథాలయోద్యమముతో సంబంధములేని సామాన్యజనుల యభిప్రాయమైయున్నది. పండితులు మాత్రమే అట్టి గ్రంథాలయము లకు బోయి వాని నుపయోగింప నర్హులని గూడ వారియభిప్రాయము. మధ్యకాలమునందలి గ్రంథాలయములును, ప్రస్తుతము మనదేశమున దొరతనమువారిచే నిర్వహింపబడుచున్న గ్రంథాలయములును అట్టివే. కాని నవీన నాగరికతయందు ఆవిర్భవించిన గ్రంథాలయములు అట్టివి గావు. వివిధ శాస్త్రవేత్తలచే వ్రాయబడిన గ్రంథముల నొకచో సేక రించియుంచుట మాత్రమే గ్రంథాలయములయొక్క పనిగాదు.పాశ్చా త్యదేశములందు పుస్తకముల నమ్ము పెద్దదుకాణములన్నింటి యందు గూడ, అక్కడికి వచ్చు జనులెల్లరు ఉచితముగ జదువుకొనుటకుగాను కొన్ని గ్రంథముల బీరువాలు ప్రత్యేకముగ నేర్పరుపబడియుండును. ఇంతేల - మిఠాయి దుకాణములయందు గూడ, ఆయా దేశముల యందు ప్రకటింపబడు సుప్రసిద్ధ వార్తాపత్రికలుండును. ఆయా సరకు లను కొనుటకు బోవువారెల్ల కొంచెము కాలమక్కడ విశ్రమించి, వానిని జదువుకొనుచుందురు. అట్లయిన గ్రంథాలయ నిర్వాహకులు పాశ్చాత్యదేశములయందలి దుకాణదారులకన్న ఎక్కువ జేయు చున్నదేమి ?

ఆధునిక గ్రంథాలయములు సార్వజనిక విశ్వవిద్యాలయములు. జనసామాన్యమందలి ప్రతివ్యక్తికిని జ్ఞానదానమొసంగునదియే ఆధునిక గ్రంథాలయము. దీనివలన లాభమును బొందుటకు దానిదగ్గరకు పోయి తీరవలసిన పనిలేదు. గ్రంథాలయమునకు పోలేని వారిదగ్గరకు

గ్రంధాలయమే ఎదురేగి వారి నాహ్వానించును. మఱియు గ్రంధాలయమువలన కలిగెడు లాభము కేవలము గ్రంధములను పఠించుట వలన అలవడునట్టి బుద్ధివికాసము మాత్రమేగాదు. సంపూర్ణమనుష్యత్వమును వికసింపజేయుటకు తగిన సాధనములనన్నింటిని సమకూర్చి దానిని సిద్ధింపజేయుటకుగాను కృషిసలుపుటయు గ్రంధాలయము యొక్క ధర్మమే. అందుచేత ప్రతి గ్రంధాలయమందును పుస్తకములేగాక, పఠనమందిరమును గూడ ఏర్పరుపవలెను. ఇదియుగాక శక్తిసామర్థ్యములను బట్టి బాలశాఖ, స్త్రీశాఖ, క్రీడాశాఖ, సంచార పేటికా శాఖలను గూడ ఏర్పరుపవచ్చును. సంఘమునందలి వ్యక్తులయొక్క జీవితమును పవిత్రవంతముగను, పురుషార్థసాధకముగను చేయుటయే నేటి గ్రంధాలయము యొక్క ఆదర్శము.

## గ్రంధాలయముయొక్క ఉపయోగ మెవ్వరికి?

గ్రంధాలయము పరీక్షపట్టాలను బొందగోరువారికిగాదు. అది సామాన్యజనుల యొక్క సర్వకళాశాలయై యున్నది. కాబట్టి మన ధర్మగ్రంధాలయములను ఎవరికి ఉపయోగపడునటుల జేయవలెను!

ధనాఢ్యులును, విద్యాధికులును అగువారు తమకు కావలసిన గ్రంధములను ద్రవ్యమును వెచ్చించి తెప్పించుకొనగలరు. లేక ఎవరి యొద్దకైనబోయి సంపాదించుకొనగలరు. చదువుకొన నాసక్తి గల మనుజుడు యెన్నివిధములనైన శ్రమపడి వాడవాడల దిరిగి తనకు గావలసిన గ్రంథములను సేకరించుకొని వానియుపయోగమును బొందును. గ్రంధాలయములు ఇట్టివారికి గూడ ఉపయోగపడునప్పటికిని, వీరి విషయమై మనము విశేషమైన శ్రద్ధను వహింపవలసిన యావశ్యకత లేదు. ఏలయన వారు తమంతట తామే గ్రంధాలయమునకు వచ్చి దాని లాభమును బొందెదరు.

అట్లయిన ఇంకెవరికొరకు మనము శ్రద్ధ బూనవలసియున్నది? ప్రతిదేశమునందుగూడ గ్రంథాలయముల యొక్క లాభములను బొందవలెనని తమంతట తామే ప్రయత్నించువారి సంఖ్య బహు స్వల్పముగ గనబడుచున్నది. ఇది స్వాభావికమైన విషయము. మన దేశమునం దీ స్వభావము అన్ని దేశములకన్న ఎక్కువ తీవ్రముగ ప్రబలియున్నది. చదువుకొనగలిగియు గ్రంథములను చదువ నపేక్షింపని జనులు మన దేశమునందు అనేకులు గలరు. ఇట్టి వారికి చదువుకొను నభిలాషను జనింపజేయుట మన ప్రధాన కర్తవ్యము. మన గ్రంథాలయమునందున్న ప్రతి గ్రంథమునకు అర్థము నొక చదువరినైన మనము సంపాదించవలెను; లేదా తయారు చేయవలెను. ప్రతి చదువరికి గావలసిన ఒక పుస్తకమునైన సంపాదించి పెట్టవలయును.

సంఘ సముద్ధరణభారమంతయు ఈకాలమున గ్రంథాలయము మీదనే ఆధారపడియున్నది. సంఘమునకు గావలసిన నీతి విషయక వ్యాసంగమును, రసజ్ఞతా వ్యవసాయమును, సహానుభవాభివృద్ధిని, జ్ఞానసముపార్జనమును – ఇంతయేల, ఈశతాబ్దమున సంఘమును కలంచివైచుచున్న సకలసమస్యలను గూర్చి అనుభవసిద్ధముగ నుండు విశదీకరణమంతయు గ్రంథాలయమందే జరుగవలసి యున్నది.ఇట్టి సాంఘిక సేవానిరతి నెట్లు జరుపనగునో కొంచెము విచారింతము.

పిల్లలే సంఘమునకు జీవమని జెప్పదగును. వారియందు అనంతమైన శక్తులు గర్భితములై యున్నవి. ఈశక్తులను ప్రథమమున పాఠశాలయందు వర్ధిల్లజేయవలసియున్నను, సంకుచితములగు నిర్బంధపాఠ్యపుస్తకములను పఠించుటయందే వారిశక్తులను క్షీణింపజేయుక ఆ శక్తులు వికాసమునొంది విశాలములగుటకు గావలసిన దోహదమునంతను మనము చేయవలసియున్నది. పిల్లలయొక్క మనస్సులు అతి కోమలములు. కావున అట్టి సమయముననే వారిని మంచి దారుల యందు బెటుట మిక్కిలి యావశ్యకము. అట్లు చేయగలిగితిమేని,

వారికి సంపూర్ణ ధైర్యసాహసములు అలవడుననుట కెంతమాత్రమును సందేహములేదు. ఈ దినమున పిల్లలుగ నుండువారు రేపటి దినమున పౌరులగుదురు. అందుచేత పిల్లలకు సన్మార్గ మలవడునటుల జేసితిమేని మనజాతి ఔన్నత్యము నొందుట కేమియు సందియములేదు. కావున వారికి ఉపయోగకరములగు ప్రత్యేక పుస్తకములను సేకరించి వేరుగ నుంచవలెను. అవి విశేషముగా బొమ్మలు గలిగినవై యుండవలెను. గోడలయందు వస్తుపార్యబోధకములగు పటములనుబెట్టి వానిని గురించి బాలురకు బోధించుచు అందుకు సంబంధించిన పుస్తకములను వారు చదువునటుల అభిరుచిని గల్పింపవలెను. మఱియు సుబోధకములును, నీతిబోధకములును నగు కథలను జెప్పి, వారి మనస్సుల నాకర్షించి గ్రంథపఠనమునకు వారిని బ్రోత్సహించవలెను.

స్త్రీలవిషయమున గూడ మనము మూకీభావమును వహించుటకు వీలులేదు. పాశ్చాత్యదేశముల యందు ప్రత్యేకముగ చదువుకొనుటకు వలయు సౌకర్యములనెల్ల స్త్రీలకు గలిగించుచున్నారు; అక్కడ స్త్రీలు భాండాగారిణులుగ గూడ పనిచేయుచున్నారు; ప్రారంభదశయందట్టి ప్రయత్నములకు మనము బూనుకొనక పోయినను గృహములకు పుస్తకములను బంపి, స్త్రీలు విశేషముగ జదువునటుల జేయవచ్చును. పురుషులకంటె స్త్రీలయందు విద్యావిహీను లెక్కువమంది గలరు. అందుచేత విద్యావతులగు స్త్రీల నేర్పరచి, చదువుకొనజాలని స్త్రీల గృహములకు బోయి వారు కోరిన విషయములు గల గ్రంథములనెల్ల వారికి చదివి వినిపించునటుల జేయవలయును.

గ్రంథములను చదువుకొన గుతూహలము గలిగిన వారికి వానినందించుట పురుషులకు మనము జేయదగిన మొదటిపని. గ్రంథములను చదువుకొనుటకు శక్తిగలిగి, వానిని పఠింప నిచ్ఛలేని వారలకు అట్టి యిచ్ఛను గలుగ జేయుట మనము జేయదగిన రెండవ పని. పుస్తకముల యోగ్యతలనుబట్టి జనులు, వారి అధికారమును

బట్టి పుస్తకములు అమరియుండ వలెను. పరస్పరము ఎవరు తగి యుండక పోయినను మనము జేయుపని యంతయు వ్యర్థము. సామాన్యజనులు పుస్తకములకు తగియుండరనుట నిజముకాదు. ఏల యన వారికి తగిన పుస్తకములనే మనము సమకూర్చవలెను.

మన శ్రద్ధనంతను నాకర్షించదగు ఇంకొకతరగతి జనులున్నారు. వారే "విద్యావిహీను"లని బిలువబడువారు. విద్యావిహీనులనగా చదువను వ్రాయను జేతకాని వారనుటయే నాయభిప్రాయము. ఈ విద్యావిహీనులను విద్యావంతులనుగా జేయుట, అనగా చదువను వ్రాయనుగలవారినిగా జేయుట దుస్సాధ్యము కావచ్చును; కాని, వారిని జ్ఞానవంతులుగా నైన జేయుట మన విధ్యుక్తధర్మము; విద్యను వ్యాపింపజేయుటకు అక్షరము లొక సాధనముగాని, అది యొక్కటి మాత్రమే సాధనముగాదు. కావున అక్షరములను నేర్పకుండ గనే,మానవుని జ్ఞానవంతునిగ జేయవచ్చును.విద్యయొక్క పరమార్థము మానవుని యందు అంతర్గర్భితము లయియున్న శక్తుల నుజ్జీవింప జేయుట. దానికి పుస్తకము లొక సాధనము. తదితర సాధనములు అనంతములుగ గలవు. చదువుకొన్న వారికి గూడ విద్య సంపూర్ణ ముగ పాఠశాలలందు అలవడదు; అక్కడ అభిరుచి మాత్రము గలు గును; ఆ యభిరుచి గ్రంథాలయములందే ప్రవర్థమాన మగును. కావున చదువుకొననివారి విషయమై మనము అధైర్యమును బొంద వలసినపనిలేదు. మనుజుని పరివేష్టించియున్న వాతావరణము నంతను ఒక పెద్దపాఠశాలగా రూపొందించవలెను. పారిశ్రామికములు శాస్త్రీయములు – ఆదిగాగల విషయములను గూర్చి వారికి ఉపన్యా సములిచ్చి వారిబుద్ధికి వికాసమును గలుగజేయవలయును; మహాగ్రంథ ముల నెల్ల వారికి జదివి వినిపించి బోధించవలయును. ఇంకను వీలగు నేని, మాజిక్కులాంతరునుగాని సినిమోటాగ్రపును గాని, సంపా దించి, వాని మూలమున పలువిషయములను ప్రదర్శించుచు బోధన లను జేయవలయును; అట్టివి ఎక్కువ హృదయ రంజకముగను, చిత్త

సంస్కారకముగను ఉండును. ఇంకను ఎన్నియోమార్గముల జ్ఞానాభి వృద్ధిని జేయవచ్చును.

ఎవరికి మనము సహాయము చేయవలసియున్నదో వారినిగూర్చి ప్రథమమున చక్కగా విచారించవలయును. భేషజవేషముల నన్నింటిని విడచి, వారు మనలను తమ తోడివారుగా భావించుకొనునటుల వారి దగ్గరకుబోయి, వారేమికోరుదురో అడిగి తెలుసుకొనవలెను, పిమ్మట వారి వాంఛలను గ్రహింపవలెను ఈ కార్యము వేసవి కాలపు శెలవులలోగాని, శీతాకాలపు శెలవులలోగాని చేసిన పూర్తి యగునదిగాదు. ఇది జీవితమునంతను ధారబోసి చేయవలసిన మహత్కార్యము.

కొందరు వివిధ దేశవార్తలను మాత్రము వినగోరెదరు; వారికట్టి వార్తలనే చదివి వినిపించవలెను. క్రమముగవారు ఇతర విషయములనుగూర్చి కూడ తెలిసికొన నిచ్ఛగించెదరు, కొందరు పుస్తకములను వినగోరెదరు; అట్టివారికి పుస్తకములనే చదివి వినిపించవలెను; ఆ పుస్తకములు వారికి తగియుండునని మనము మాత్రము తలంచునవిమైయుండగూడదు; వారు కోరినవియు, వారి రుచుల కనుగుణ్యముగ నుండునవియు నై యుండవలయును.

## గ్రంధాలయమును ఆకర్షకముగను, జనరంజకముగను జేయుటెట్లు?

జనసామాన్యము యొక్క సామాన్య వాంఛలకును, గ్రంధాలయము చేయు కృషికిని, అన్యోన్య సంబంధముండినగాని, సర్వజనాకర్షకము కాజాలదు. హరికథలను, జంగమకథలను చెప్పించుట, రాత్రిపారశాలలను స్థాపించుట, పురాణ శ్రవణమును జేయించుట, వీధి నాటకములను, తోలుబొమ్మలను ఆడించుట, సేవాసమితులను స్థాపించి ప్రజాసేవను జేయుట, పోటీ పరీక్షల నేర్పరచి బహుమాన

ముల నిచ్చుట, ఆటల నాడించుట, బహుమతుల నొసంగుట, జాతీయోత్సవములనుజరుపుట,మహాపురుషులయొక్కయు,అవతారపురుషుల యొక్కయు వర్ధంత్యుత్సవములను జరుపుట - మొదలగు వానివలన గ్రంథాలయము జనరంజకమగును.ఇవియన్నియు సంతోష జనకములు మాత్రమేగాక జ్ఞాన ప్రదాయకములు గూడ నగుచునున్నవి; వీని యందు జనుల నందఱ నొకచో గూర్చి, ఒక పరమార్థచింతయందు వారి నానాత్వములను మరచిపోవునటుల చేయజాలు శక్తి గర్భితమై బీజ రూపమున నున్నది. పూర్వపద్ధతులను నూతన భావముల కనుగుణ్యముగమార్చి వానిని పునరుజ్జీవింపజేసినచో - అవి జనుల అభివృద్ధికి అనేక విధముల దోడ్పడును.

ఆంధ్రమందుగాని, గీర్వాణమందుగాని ప్రవేశముగల పండితునకు స్వదేశపద్ధతులేగాని,పరదేశ సంప్రదాయము లేమియు తెలియవు; కాని తెలిసికొన వలయునను నిచ్ఛమాత్రము కలదు; కావున ఆంగ్ల భాషా జ్ఞానముకలవారాతనికి వార్తాపత్రికలుచదివి, జలాంతర్గాములు-ఆకాశవిమానములు మొదలైన యీనాటి యద్భుత నిర్మాణములను గురించియు, నిత్యము నుపయోగపడు పట్టణ పారిశుద్ధ్య పారిశ్రామికాది విషయములను గురించియు' చెప్పుచుండవలయును. పండితుడన్ననో,ఆతడు జనసామాన్యమునకు మన పూర్వ సంప్రదాయములను గురించి బోధయొనర్చుచుండవలెను. ఈవిధముగ పండితుడును ఆంగ్లేయవిద్య నభ్యసించినవారును, ఒకే గ్రంథాలయమునందు కలియుటవలన,అన్యోన్యము సహాయము జేసికొని జ్ఞానాభివృద్ధియొనర్చుకొనవచ్చును. విద్యావిహీనులయ్యు అమూల్యమైన లౌకికజ్ఞానముగల రైతులు మొదలైనవారు తమ విజ్ఞాన విశేషముచేత, సాంఘికుల కెంతయు ఉపకరింపగలరు.

ప్రతిదినము ను ప్రజాహిత జీవనమునకు దోహదకరముగ నుండునటుల గ్రంథాలయమందు సంభాషణలను,చర్చలను, వాద ప్రతివాద

ములను జరుపుచుండిన యెడల జనసామాన్యమునందు ఉన్నతాదర్శ ములు మొలకలెత్తును. కాలక్రమేణ సత్సంకల్పములు కార్యరూపముగ పరిణామము జెందవచ్చును. ఈరీతిగా ఒక గ్రామమునందు గాని పట్టణమందుగాని గ్రంధాలయమే ప్రజాహిత జీవనమునకు దోహద మొసంగగలదు. దేశాభ్యుదయకరములగు యుద్యమము లన్నింటికిని కేంద్రస్థానమై వెలయగలదు.

అమెరికా దేశమందున్న "హాబర్టు" గ్రంధాలయము వారు తమ గ్రంధాలయమును ఆకర్షవంతముగ జేయుటకు అవలంబించిన పద్ధతులను గురించి వారు వివరించిన విషయములను ఆంధ్రుల యుప యోగమునకై ఈ క్రింద పొందుపరచుచున్నాను.

"మా పేరమునకెట్టి పేరగాండ్రు గావలయునో మొదట యోచించితిమి. మా పురమునందు పాఠశాలలలో జదువుకొను చున్న బాలురును యువకులును అనేకులు గలరు. వారిని ఆకర్షిం చుట కెట్టి గ్రంథములు కావలయునో అట్టివానినే మేము వందలకొలది కొంటిమి. తదనంతరము మా గ్రంథములను వారికెటుల చదువుట కీయవలయునో యోచించితిమి. దీనికిగాను మా గ్రంధభాండాగారియు నితర సభ్యులును కలిసి, పురములోని ప్రతి విద్యాలయమునకును అనేక గ్రంథములను వెంటదీసికొనిపోయి, బాలురకు ఆ గ్రంథములలో నుండు విషయములను సంగ్రహముగ జెప్పి, గ్రంథములు చదువుచుండి నచో గలుగు లాభములను వివరించి, యాగ్రంథములను చదువుటకు మా గ్రంధాలయమునకు ఆహ్వానించితిమి. ఏ గ్రంధమెవ్వరికి గావల యునో మాకు తెలియుటకు కొన్ని దరఖాస్తు నమూనాలను బాలురకిచ్చి తమకు గావలసిన గ్రంథములను అందు ఉదహరించి, తమ పోషకుల సంతకములను చేయించి వానిని మాకుపంప కోరితిమి. కాని మేమి చ్చిన దరఖాస్తు ఫారములలో ఒక్కటియైన సరిగ పూరింపబడి మాకు

చేరలేదు. కొందరు పోషకుల సంతకములను చేయించలేదు. మరి కొందరు తమ జనకుల సంతకములను దీసికొనుటకు అయిష్టమును సూచించిరి. అనేకులు అటుల సంతములు కోరట మంచిదికాదనిరి. కొందరు పోషకులు తమ బిడ్డల దరఖాస్తుఫారములలో సంతకములు చేయ నొల్లకుండిరి. అంతట సంతకముల నిర్బంధమును దొలగించి, బాలురందరి యొద్దను వారిపేరు, చదువు తరగతి, పాఠశాల, – ఈ వివరములు మాత్రము దీసికొని గ్రంథముల నిచ్చుచుండుట కేర్పాటు గావించితిమి. ఈ విషయమును బాలురకు దెలుపుటకుగాను, విద్యాలయములకు బోయి, వారికి నచ్చచెప్పి,వివరములకుగాను తిరుగ దరఖాస్తుఫారములను ఇచ్చితిమి. ఆ మరుదినమునుండియు వేలకొలది బాలురు మా గ్రంథాలయమునకువచ్చి గ్రంథముల నడుగసాగిరి. మూడవనాడు గ్రంథాలయములో ఒక్క పుస్తకమైన లేనందున, మరి కొన్ని వందల గ్రంథములను కొనవలసివచ్చినది. పుస్తకములను కొనుటకు వెంటనే కొందరు ఉదారులు ద్రవ్యసహాయమును జేసిరి. గ్రంథాలయములు ప్రజల నాకర్షించుటకు ఇటుల పనులను జేసిన యెడల, ధనము ప్రోగగుటకు ఏమియు సందియములేదు. "ఇటులనే పన్నులు చెల్లించువాని, కార్మికుని, వర్తకుని, – గృహములకుబోయి దరఖాస్తు నమోనాలనిచ్చితిమి. వారును వందలకొలదిగ వచ్చి గ్రంథములను తీసికొని పోవుచున్నారు.

"ప్రజలు గ్రంథములను దొంగిలించెదరని మేమెన్నటికిని నమ్మజాలము. ఇంతవరకు మా నిలయములో ఒక పుస్తకమైనను పోలేదు. జాగరూకతతో పనిజేసిన ప్రతిచోట ఇటులనే యుండగలదని మేము నమ్మెదము. బాలురకు గూడ, వారి పోషకుల సంతకములు లేకనే గ్రంథముల నిచ్చెదము. వారియందు మనకు నమ్మకముండిన జాలును. పరస్పర నమ్మకముతో ఎంతటి ఘనకార్యమయినను చేయ వచ్చును.

ఇంతియేగాక అమెరికాయందున్న "బుఫెలో" సార్వజనిక గ్రంధాలయము వారు తమ గ్రంథాలయమును జనరంజకముగా జేయుటకు ఈ క్రిందిరీతిని ప్రకటన గావించిరి:—

"మీకు గావలసినదెల్ల గ్రంథాలయమునందు లభ్యమగు చున్నదా? ఈపట్టణమందున్న సర్వజనులచేతను ఈ గ్రంథాలయము పోషింపబడు చున్నది. సాధ్యమైనంతమంది జనులకు విశేషముగ ఉప కారము చేయవలెనని దీని కోరికయై యున్నది. దీని యుపయోగము ఇంకను వృద్ధిజేయుటకు తగుసలహాల నియ్యవలెనని ప్రజలను కోరు చున్నాము. మీకు గావలసిన పుస్తకములన్నియు గ్రంథాలయమందు లభ్యములగుచున్నవా? ఇంకను గ్రంథాలయము ఏరీతిని మీకు సహాకారి కాగలదు?" ఈవిధములైన ప్రశ్నపరంపరలచే జనుల నాకర్షించి, గ్రంథాలయము ప్రజోపయోగకరముగ నొనర్చిరి.

గ్రంథాలయమును జనరంజకముగ చేయుట యందు చిత్రపట ప్రదర్శనముగూడ మిక్కిలి దోడ్పడగలదు. ఈవిషయమై మనదేశ మందలి "బరోడా" కేంద్రగ్రంథాలయమువారు వ్రాసిన దానిని ఉదహరించుచున్నాను:—

"మా గ్రంథాలయమందున్న చిత్రప్రదర్శనశాఖను దర్శించి నప్పుడు గొప్పవారే ఒకరు ఇట్లనిరి. "బొమ్మలు చూపు నాటక శాలతో సమానమైన స్థితికి దిగజారుట గ్రంథాలయమునకు దగినపని గాదు. గ్రంథములను, పత్రికలను సంపాదించి జనులు చదువుకొనుట కియ్యవలసిన గ్రంథాలయము జనులను ఆనందపరచుటకు ప్రయ త్నించుటయా? కేంద్రగ్రంథాలయము వారికి పిచ్చియెత్తియున్నగాని చిత్రపట ప్రదర్శన శాఖను ప్రారంభించియుండరు." దానికి గ్రంథ భాండాగారి ఇట్లు సమాధానమిచ్చెను. "అయ్యా! దయచేసి కొంచెము శాంతము వహింపుడు. నేను చెప్పిన సంగతులను వినకుండ నన్ను నిందించకుడు" దానికి గూడ ఆ గొప్పవారిట్లనిరి :— "వెంటనే

మీ ప్రత్యుత్తరమా! ఇట్టి నిరుపయోగమైన పనినిగూడ సమర్థింప బూనిన ప్రయోజనమేమి?" దానికి గ్రంథభాండాగారి శాంతముతో ఇట్లు చెప్పిరి :— "చదువురాక, జ్ఞానములేక, భావములులేక, ఉన్నత స్థితిని పొందవలయుననెడి కోరికలులేక, జీవితమునం దానందములేక, అసహాయులై — నిర్భాగ్యులైయున్న జనులకొరకు ఈ చిత్రపట శాఖను ప్రారంభించితిమి. నిత్యజీవనమునందు వారి కనుభవసిద్ధముగ నుండదగిన అనేక విషయములను గూర్చిన చిత్రపటములను వారికి జూపి బోధింతుము. ప్రకృతిశాస్త్రము, మానవశరీరము, ఆరోగ్యము, లలితకళలు, పరిశ్రమలు — మున్నగు అనేక విషయములను గూర్చిన పటములను వారికి జూపి — జ్ఞానవంతులుగ జేసెదము. నాటకములు, చరిత్రలు, కథలు, మున్నగునవి చెప్పుచు, దానికి సంబంధించిన బొమ్మలను జూపుచు, వారి కానందమును కలుగజేసెదము. భూగోళశాస్త్ర విషయములను పటములతో బోధించి, వారికి ఈ ప్రపంచ స్వరూపమును — విశాలత్వమును — గోచరింపజేతుము. వివిధ దేశములందలి జనుల నడవడికలు, గొప్ప యాత్రాస్థలములు — మున్నగు వానిని జూపి వారికి జిజ్ఞాస గల్పింతుము. ఇంతేగాక ఇంకను అనేకసంగతులు వారికి ప్రస్ఫుటముగను, హృద్గతమగునట్లును బోధింతుము. సినిమెటోగ్రాఫ్ ప్రదర్శనములలో ప్రదర్శకుడు ఊరక నిలువబడియుండులాగున మేము నిలువబడియుండము; ఒక బొమ్మను జూపుటకు పూర్వమును చూపుచున్నప్పుడును — చూపుట ముగించిన తరువాత గూడ— మేము మాట్లాడుచునే యుండి, ఆ బొమ్మను గూర్చి వివరించుచు దానివలన నేర్చుకొనవలసిన సంగతులను వారికి చెప్పెదము. ఈ బొమ్మల ప్రదర్శనమునకు అందరును రావచ్చును; ఎవరును సొమ్మేమియు నియ్యనక్కరలేదు. రాజ్యమునందు వారు మూలల నుండుటచే "సినిమెటోగ్రాఫ్" ఎప్పుడోగాని పోజాలనట్టి కుగ్రామములకు గూడ మా "సినిమెటోగ్రాఫ్" బట్టునంపి, సర్వజనులకు ఆనందమును — దానితోబాటు మనోవికాసమును గలిగింతుము" అని చెప్పితిమి. అంతట ఆ గొప్పవ్యక్తి తన యభిప్రాయమును మార్చుకొని, మేము చేయుచున్న పనినిగూర్చి మెచ్చుకొనిరి.

## బా ల శా ఖ

పిల్లలే దేశమునకు పునాదివంటివారు; అందుచేత వారి విషయమై అశ్రద్ధవహించుటకు వీలులేదు. వారు పెద్దవారైన పిమ్మట, గొప్పవారు కావలయునని కోరినచో, వారికి చిన్నప్పటి నుండియు మంచి తరిబీతు నియ్యవలెను. వారికి బాల్యమునందు కలిగిన యనుభవములే జీవితాంతమువరకు నిలచియుండును. కావున వారికి మనము కలుగజేయు అభిప్రాయములు హేతుయుక్తముగను, నీతివంతముగను, నుండునట్లు చూడవలయును. పాఠశాలలు బోధనచేయు యంత్రములు మాత్రమే. అచట వారు చదువను వ్రాయను మాత్రమే నేర్చుకొందురు. అట్లు చదువుకొన నేర్చుకొనిన వారికి చదువుకొనుటకై మంచి గ్రంథముల నిచ్చుట మన విధి. ఒక శిశువు ఎనిమిది వత్సరముల ప్రాయముననే పుస్తకములను చదివి లాభము పొందవచ్చును. మరియొకడు 13 లేక 14 సంవత్సరములవయస్సు వచ్చినను గ్రంథములనుచదువుటకు అభిలాషను గలిగియుండకపోవచ్చును. వారికి గ్రంథపఠనము వలన గలిగెడి యానందరసాస్వాదనాశక్తిని శుద్ధిపరచి యభివృద్ధిని పొందింపవలెను. వారు చదువుకొను గ్రంథములను ప్రత్యేకముగ నుంచవలయును. గ్రంథములు చదువుటయందు విచక్షణముగల్గి, చెడు పుస్తకములను విసర్జించి మంచి పుస్తకములను మాత్రమే చదువుటకు ఇచ్ఛజనించునటుల చేయవలెను.

బాలబాలికలలో పలువురు ప్రియిమరీ విద్యతోడనే పాఠశాలను వదలెదరు. కావున వారు సంపాదించు జ్ఞానము, పాఠశాలను వదలినపిమ్మట వారు అభ్యసించు నిగ్రహపై నాధారపడియుండును. జ్ఞానముఎక్కువభాగము పుస్తకములవలన సంపాదించవలసినదిగానున్నది. కనుక మంచి పుస్తకములను మంచి మార్గమున నుపయోగించుకొనదగిన విచక్షణజ్ఞానము పసితనముననే యలవడ జేయవలయును. జ్ఞానము సంపాదించుకొనదగిన యుపకరణములు శిశువు నెదుటబెట్టుటతోడనే గ్రంథభాండాగారియొక్క విధి పూర్తికాలేదు. ఆయుపకరణ

ములను సరియైన మార్గమున నుపయోగించునట్లు బోధించుట కూడ ఆయన విధి. ఇంతేగాక మతమునందుగాని, చరిత్రయందుగాని, భౌతికశాస్త్రమునందుగాని, కళలయందుగాని, వాఙ్మయమందుగాని, తత్త్వమెచ్చటెచట నున్నదో—దానిని వెదకి,ఆతత్త్వమును గ్రహించి, తనాత్మలమున గలిగెడి యానందము ననుభవించుశక్తి విద్యార్థికి అల వడునటుల చేయవలయును. అంతేగాక సర్వకాలములయందు, సకల దేశములందు నుద్భవించెడి జ్ఞాననిధులగు మహాత్ముల గ్రంథముల నన్వేషించవలెను; నిరంతరాసక్తి విద్యార్థియం దుద్భవించునట్లు చేయుట నేటికాలపు ఉపాధ్యాయుల విధి. ఉపాధ్యాయు లా విధిని నెరవేర్చినను, నెరవేర్చకున్నను, విద్యార్థి బడియందు ఇంకను చదువు కొనుచుండగనే - గ్రంథభాండాగారి సహాయముతో విచక్షణతో గ్రంథములు చదువుకొనుటకు తగిన విమర్శనాశక్తిని సంపాదించు కొని, గ్రంథాలయమందలి పుస్తకములను గ్రంథముల పట్టికలు మొద లగు వానిని మంచి యుపయోగమునకు తెచ్చుకొనుటకు తగిన సామ ర్థ్యమును పొందునటుల జేయవలెను.

శిశుశాఖాధికారులగు గ్రంథభాండాగారులును ఉపాధ్యాయు లును శిశుశిక్షణయందు అన్యోన్య సహాయకులుగా నుందురు. పాఠ శాల గ్రంథాలయమందు పుస్తకములు సమృద్ధిగ నుండవచ్చును. అయితే ఆ పుస్తకములు సామాన్యముగా పాఠశాలలో చదివెడు గ్రంథములకు సంబంధించినవిగనే యుండును. ఇతర గ్రంథములు కావలయునన్న ఇతర గ్రంథాలయములందు మాత్రమే లభింపగలవు. పాఠశాలలకు గ్రంథాలయముల యందలి పుస్తకములను దీసికొని పోయి, విద్యార్థులకు పాఠములు బోధించు సమయమున ఆ గ్రంథము లను గూర్చి చెప్పునట్లు ఉపాధ్యాయులను గ్రంథాలయాధికారులు అప్పుడప్పుడు పురికొల్పవలయును. అటుల జేసినచో ఉపాధ్యాయులు తమ బాలురను గ్రంథాలయమునకు దోడుకొనివచ్చి అచట పాఠము లను బోధించు సదుపాయములను గల్పింపగలరు.

కొన్నిదినములయందు పిల్లల నొక్కచో జేర్చి గ్రంథాలయ మందుకథలను చెప్పెదరు. అట్టి దినములయందు పిల్లలు అత్యంత ప్రీతితో చనుదెంతురు, ఈ కథలు ఒక్క వినోదజనకములే గావు. వీని వలన శిశువుయొక్క మేధాశక్తి వికసించును. సద్గ్రంథములయందు అభి రుచి హెచ్చును. గ్రంథాలయమందు ప్రీతి జనించును. అందుచే గ్రంథభాండాగారి చెప్పు మాటలయందు విశ్వాసము గలిగి ఆయన సహాయమును తరచు కోరుటకు వెనుదీయరు. అయితే కథలుచెప్పుట యందు మాత్రము ఎక్కువ జాగరూకతను చూపవలయును. లేనిచో అందువలన కొన్ని యనర్థములు వాటిల్లగలవు. సద్వర్తనము కలిగి నట్టియు, మంచి జ్ఞానము కలిగినట్టియు- వారు మాత్రమే ఈ పనికి పూనుకొనిన యెడల పసిపిల్లలకు జ్ఞానోపదేశము చేయుటయందు కథలు చెప్పుట మిక్కిలి ఉపయోగకారి కాగలదు. దీనిఫలితముగ పిల్లలు వారిలోవారు కథలు చెప్పుకొనుటకు ప్రారంభింతురు. అప్పుడు పెద్దలెవరైనయుండి వారలను అదుపులో నుంచవలెను. పిల్ల లెప్పు డును కథలను బహు రమ్యముగా - కొత్త కల్పనలతో చెప్పు కొందురు.

బాలురు చదువుటకు తీసికొన్న ప్రతిగ్రంథమును వారిప్రవర్త నను సన్మార్గమునకు త్రిప్పుటకును, వారి ప్రాప్యములను పరిశుద్ధ మొన రించుటకును, వారి యలవాట్లను మార్చుటకును, కొలదిగనో గొప్ప గనో సాయపడవలెను. అమెరికా దేశమందలి గ్రంథాలయములలో ప్రతిసంవత్సరమును కోట్లకొలది గ్రంథములను బాలురే ఉపయో గించుచున్నారని చెప్పినయెడల, ఇందలి యదార్థము బోధపడగలదు. 1911వ సంవత్సరమున న్యూయార్కు గ్రంథాలయములోనే 24,59,888 గ్రంథములను - 1912 వ సంవత్సరమున 29,56,044 గ్రంథములను బాలబాలికలు మాత్రమే చదివిరి. 1191-1912 సంవత్సరములయం దా గ్రంథాలయమునందు చదువబడిన మొత్తము గ్రంథములలో మూడవవంతు బాలబాలికలు మాత్రమే చదివిరి.

బాలురకు ఎక్కువ ఉపయోగకరమైన దేదియో కనుగొను టయేగాక, వారు వాంఛించున దేదియో కనుగొనుటకూడ ఆవశ్యకము. బాలుడు తాను చదువు పుస్తకమును గూర్చి ఎట్టి అభిప్రాయమును కలిగియున్నాడో తెలిసికొనకుండ, గ్రంథభాండాగారి "ఈ పుస్తకమును చదువుము" "ఆ పుస్తకమును చదువుము" అని బాలునకు సలహా నిచ్చుచు పోయినచో, కొంతకాలమునకు గ్రంథభాండాగారియందు నమ్మకము చెడి, ఆతడు గ్రంథాలయ విముఖుడు గావచ్చును. కావున గ్రంథభాండాగారి శిశువుయొక్క అభిప్రాయములను కనుగొనుచు అవసరమైనచో వానిని సవరించవలయును. అంతేగాని ఎప్పటికిని వాని యభిప్రాయములను నిరాదరణ చేయరాదు.

ఎన్ని ప్రయత్నములు చేసినను కొందరు బాలురు గ్రంథాలయమునకు రానేరారు. అట్టివారిలో చాలమంది బీదవారు. అందుచే వారికి వచ్చుటకు తీరదు. అట్టిచో వారిగతియేమి ? వారు అజ్ఞానకూపమున మునిగియుండవలసినదేనా ? లేకున్న గ్రంథాలయమునుండి సద్గ్రంథములు వారికి చేరుటెట్లు ? వారి నట్టి యజ్ఞానాంధకారమున వదలుట నాగరికుల లక్షణముగాదు. వారు గ్రంథాలయమునకు రానిచో, వారిచెంతకే గ్రంథములు పోవలెను. గ్రంథాలయమునుండి వారమున కొకసారి ఈ నిరుపేదలతో ఆటలాడుకొనుటకును, వారలకు కథలు చెప్పుటకును, వారందరికి పుస్తకములను పంచిపెట్టుటకును, గ్రంథభాండాగారియే పోవుచుండవలయును.

గ్రంథాలయములయందు బాలురకు ఆటలను గూడ ఏర్పరుపవలెను. అభివృద్ధిమార్గములను సరియైన దృక్కులతో చూడజాలనివారికీ విషయము వింతగొల్పవచ్చును. "గ్రంథాలయములు చదువుటకా ? ఆటలాడుటకా ? గ్రంథాలయములకు పోవు పిల్లలు ఆటలమరిగి చెడిపోరా ? వారి కాలము వృథాకాదా !" అని అట్టివారు ప్రశ్నింతురు. ఈ కాలమునందు గ్రంథాలయము పెద్దవారలకు

మాత్రమే గాదు; బాల్యము నుండియు గ్రంథాలయముల రుచి చూచినవారే పెద్దవారైన పిమ్మట వాని పోషకు లగుదురు. అందు చేత పెద్దలకంటె పిల్లలకు కావలసిన విషయములందే ఈ కాలము నందు గ్రంథాలయములు విశేషశ్రద్ధను వహించవలెను. ఆటలకంటె పిల్లలకు హృదయరంజకములగు విషయము లెవ్వి! గ్రంథాలయము నకు అనుబంధముగనున్న బాలశాఖయందు ఆటల నాడుకొనుట వలన పిల్లలెందుకు చెడిపోయెదరు? ఆనందముగా నుండుట లాభకరము గాదా! వివేచనాశక్తి మందముగా నుండు కాలము బాల్యమనియు, ఆటలయందు వినియోగించు కాలము వృధాయగుటకు బదులు మనో వికాస హేతుభూత మనియు దెలిసికొనుడు. బాలశాఖను నడుపునట్టి భాండాగారి యెడల క్రమముగ పిల్లలకు గలుగు నమ్మకము, వాని యెడల వారు చూపు గౌరవములను గమనించినవారెవ్వరును అక్కడివారు ఆడునట్టి ఆటలు అనావశ్యకములనియు, అసంగతము లనియు, వారి గుణములను చెరచుననియు చెప్పజాలరు. బాల్యము నందు గ్రంథాలయమును వలలో దగుల్కొనజేసి గ్రంథపఠనాభిలా షను కలిగించిన యెడల, పెద్దవారగునప్పటికి (అనగా వారి వివేచనా శక్తి మందముగా నుండుటమాని జాగరూకతను పొందుకాల మాపన్నమగు సరికి) ఆ గ్రంథాలయము యొక్క ఆశ్రయు లగుదురు. •

ఇట్టి మహా తరమైన బాలశాఖను నడుపుటకు గ్రంథభాండా గారికి ప్రత్యేకశిక్షణ మిక్కిలి యావశ్యకము. పిల్లలకు స్త్రీల కడ చనువు మెండు. స్త్రీలకు పిల్లలను లాలనచేయు నేర్పుగలదు. కావున బాలశాఖకు స్త్రీని పరిపాలకురాలుగా నేర్పరచుట మంచిది.

## సంచార గ్రంథాలయములు

సంచార గ్రంథాలయము లనగా- ప్రత్యేకముగా స్థిరమగు గ్రంథాలయములను స్థాపించుటకు తగిన వసతులు లేని గ్రామములం

---

• ఈ గ్రంథమునందే వేరొకచో ప్రకటింపబడిన "చదువదు ఆటను ఎట్లు ఆడుకొనవలెను" అను వ్యాసమును చదువవలెను.

దును, పట్టణ భాగములందును, జనసామాన్యమునకు ఉపయుక్తముగా నుండుటకై—ఇతర స్థలములనుండి పంపబడు పుస్తక సముదాయములు. పాశ్చాత్య దేశములందు వీనిని మోటారులమీద గూడ తీసికొని పోయెదరు. కర్రతో చేయబడిన ఒక చిన్నపెట్టెయందు కొన్ని గ్రంథముల నుంచెదరు. అట్టి పెట్టెకే "సంచార గ్రంథాలయ పేటిక" యని పేరు. ఆ పెట్టె ద్వారా గ్రంథములను ఒక గ్రామమునకు బంపినపుడు, ఆ గ్రామమునందలి జనులకు గ్రంథపఠనాభిలాష గలిగి కొంతకాలమగునప్పటికి తామే స్వయముగ గ్రంథాలయమును స్థాపించుకొందమను కోరికగలిగి గ్రంథాలయ స్థాపనకు మార్గమేర్పడును.

ఒక పెద్ద గ్రామమువారు తమకు చుట్టుపక్కలనున్న చిన్న గ్రామస్థులకు ఈ సంచార గ్రంథాలయ పేటికల వలన అమితమగు ఉపకారము చేయవచ్చును. ప్రజాసామాన్యమునకు సాధారణముగా ఇష్టముగల గ్రంథములను కొన్నిటిని ఒకపెట్టెలో పెట్టి, ఆ పెట్టె నొక సేవకుని కిచ్చి—ఆ పెట్టెయందున్న గ్రంథముల పట్టికలతో గూడ గ్రామములకు పంపుదురు. ఆ పట్టికలను సేవకుడు గ్రామస్థు లందరి కిని పంచిపెట్టి తన గ్రంథముల పెట్టెతో గూడ, ఒకచోట విశ్రమిం చును. ప్రజలందరు తమకు పంచిపెట్టబడిన పట్టికనుండి గ్రంథముల పేర్లను తెలుసుకొని ఆ సేవకుడు విశ్రమించిన చోటికివచ్చి తమకు కావలసిన గ్రంథములను తీసికొని చదువుదురు. ఇట్లు తాను తెచ్చిన గ్రంథములను ఆ యూర చదువదలచుకొన్నవా రందరు చదివిన పిమ్మట, సేవకుడు ఈ గ్రంథపేటికను దీసికొని మరియొక గ్రామమున కరుగును. లేదా, సంచార గ్రంథ పేటికయందలి గ్రంథములను ఆయూరి వారికందరికి ఎరువిచ్చి, వారు చదువుకొనిన పిమ్మట తిరిగి పంపివేయుటకు బాధ్యులైన ఒక గ్రామస్థుడెవరైన ఆ గ్రామమునం

---

• ఈ సంపుటము వేరొకచో ప్రకటింపబడిన "నా బరోడా యాత్ర" అను వ్యాసమును జదువవగును.

మున్నచో, వారికి ఈ గ్రంథపేటిక నప్పగించును; తాలూకా బోర్డు వారుగాని, జిల్లాబోర్డువారుగాని ఈపనికి బూనుకొనినచో, వారి పాఠశాలల ఉపాధ్యాయుల ద్వారా ఈ సంచార పేటికల యందలి గ్రంథములను వివిధ గ్రామస్తుల కందజేయవచ్చును. ప్రత్యేకముగా గ్రంథాలయములు స్థాపించుటకు సావకాశములు లేనిచోట్ల, ఈ సంచార గ్రంథపేటికల మూలమున జ్ఞానాభివృద్ధి గలుగుచుండును. మ్యాజిక్కు లాంతరు సినిమాటోగ్రాఫులను గూడ పైవిధముననే వివిధ గ్రామములకు బంపవచ్చును. సంచారగ్రంథాలయ పేటికలను బంపునపుడు వానితోగూడ సమర్థుడగు ఉపన్యాసకుని బంపినయెడల ఇంకను ఎక్కువ ఉపయోగముగ నుండును. అతడా పెట్టెయందలి గ్రంథములను గూర్చియు, ఇంకను గ్రామస్థులకు అవసరమైన ఇతర విషయములను గూర్చియు ఉపన్యాసముల నిచ్చి ప్రజల నాకర్షింపగలడు. కర్రపెట్టెలు – అందులోని గ్రంథనిక్షేపము – అంతే – అవి వివిధ జనుల మనస్సులయందు నాగరికతా బీజములను నాటుచున్నవి. అనేక గృహములనవి సౌఖ్యవంతము చేయుచున్నవి. అనేక పాఠశాలల యందలి పిల్లలకవి జ్ఞానబోధను గావించుచున్నవి; ఒంటరిగానుండు అనేకులకవి స్నేహితుల లోటును దీర్చుచున్నవి; అవి అద్భుతములను జేయుచున్నవి; అయినప్పటికిని వాని ఖరీదు స్వల్పము.

## గ్రంథభాండాగారి

సరస్వతీ ఆలయములే గ్రంథాలయములని జెప్పియుంటినిగదా! గ్రంథభాండాగారియే ఈ ఆలయమునకు పూజారి; ఈపూజారియొక్క చాకచక్యముమీదనే గ్రంథాలయము యొక్క విజయమంతయు ఆధారపడియున్నది.

"చదువుటయందు రుచిని ఎట్లు కలిగింతును? ఎక్కువమంది జిజ్ఞాసుల నెట్లు ఆకర్షింతును? వారి కొరతల నెట్లు తెలిసికొందును?

ఆ కొరతల నెట్లు పూరింతును? చదువరుల మనములకు గోచరింపకుండ, వారి రుచులను ఎట్లు తెలిసికొందును? నిష్ప్రయోజన గ్రంథముల నుండి ప్రయోజనకరములైన గ్రంథముల మీదికి వారి మనసులను ఎట్లు మరలింతును? చదువజాలని జనుల నెట్లు స్వాధీనపరచు కొందును? బాలుర నెట్లు మోహింపజేతును? ఉపాధ్యాయులు సంఘసేవకులు మొదలగు వారి ప్రీతిని, తోడ్పాటును ఎట్లు పొందె దను? గ్రంథాలయము సాంఘిక సంక్షేమకేంద్రముగ నుండునట్లు ఎట్లు రూపొందింపగలను? దానిని జ్ఞానశోధనకు నిలయమగునట్లు చేయుటెట్లు? — అను చింతనలే గ్రంథభాండాగారిని ఎల్లప్పుడును కలతబెట్టుచుండవలెను.

గ్రంథభాండాగారి శాంతస్వభావుడై యుండవలెను. ఎవరు, ఏకాలమునందు, ఏ గ్రంథమును చదువగోరినను విసుగుకొనక దానిని వారికి అందజేయవలయును. గొప్పవారు కొద్దివారు అను తేడా లేకుండా, సరస్వతీదేవి ప్రసాదమునకు అందరిని సమానహక్కుగల వారినిగా భావింపవలెను. అతనికి అన్నివిషయములును తెలిసియుండ వలెను. ప్రాచీన కవిపుంగవులను గూర్చి యైనను, నవీన భావ కవిత్వమును గూర్చియైనను, దేశనాయకుల వీరకార్యములను గురించి యైనను, వివిధ దేశముల రాజ్యాంగ పద్ధతులను గురించి యైనను, శాస్త్రపరిశోధనలను గురించియైనను — మరి యే యితర విషయము లను గురించి యైనను, అతడు చెప్పగలిగి యుండవలయును. ఏయే విషయములయందు జ్ఞానము సంపాదించుటకు ఏయే గ్రంథ ములను చదువవలయునో — ఆతడు సూచింపగలిగి యుండవలెను. ఎవరైన "నాకు ఆంధ్రభాషయందు పాండిత్యమెట్లలవడునని యడిగిన యెడల, దానికి ఏయే గ్రంథములను జదువవలయునో సూచించ వలెను. మరియొకరు, ఒకానొక విషయమును గూర్చి వ్యాసము వ్రాయవలెనన్నచో — వానికి ఉపయోగించు గ్రంథములను జూప వలెను. మరియెవరైన దేశసేవగాని, సంఘసేవగాని, చేయవలెనని

కుతూహలము జూపినయెడల — వానికి తగిన గ్రంథములను జూప వలెను. పండితుడు, విద్యావిహీనుడు, అను భేదము లేకుండ ఎవరే విషయమును గురించి యడిగినను— విసిగికొనక, కసరికొనక, నమ్రతతో జవాబు నియ్యవలెను.

ఒకరు అడిగిన గ్రంథము లేనియెడల అందులకు ప్రతిగాగల ఇంకొక గ్రంథమును సూచించవలెను. లేదా ఆ గ్రంథమును తెప్పించుటకు ప్రయత్నింతునని చెప్పవలయును. గ్రంథాలయమందు ఏవిషయమును జూచుటకు వచ్చిన వానికైన — లేక తమాషాకు చూచుటకు వచ్చిన వానికైన — గ్రంథ పఠనాభిలాషను కలిగింప వలెను.

భాషయందు ప్రచురింపబడుచున్న సద్గ్రంథములు ఎందెదు ప్రచురింపబడుచున్నవో తెలిసికొని వానిని ఆకర్షించుటకై గ్రంథ భాండాగారి ప్రయత్నించవలయును. గ్రంథాలయమునకు వచ్చిన గ్రంథ ముల నన్నింటిని జదువుటకై ప్రయత్నించవలెను; అధమము వాని యందున్న విషయములనైన బాగుగ గ్రాహ్యము జేసికొనవలయును. తాను జదివిన విషయములను ఇతరులకు జెప్పుచుండవలయును; దీనిని ఉపన్యాసముల మూలముననను, గ్రంథపఠన మూలకముగను చేయ వచ్చును. సమర్థులగువారిచేత అప్పుడప్పుడు వివిధ విషయములను గూర్చి చర్చలను గోష్ఠులను ఏర్పాటు చేయవలెను. తాను ఆదర్శ ప్రాయుడుగా నుండవలెను.

తఱచుగా శాస్త్ర గ్రంథములకంటె, నవలలు మొదలగు— విశేష బుద్ధి పరిశ్రమకు అగత్యములేని — సులభ గ్రంథములనే విరివిగ చదు వుట సహాజమైయున్నది. అందుచేత ఆయా గ్రంథముల యందలి విషయములను గూర్చియు, వాని యుపయోగమును గూర్చియు గ్రంథభాండాగారులు తఱచుగా ఉపన్యాసములనిచ్చుచు బోధింపుచు ఆ గ్రంథముల యెడల అభిరుచిని గలిగింపవలెను. శాస్త్ర గ్రంథ

ములు మొదలగు కఠిన గ్రంథములను అందరును చదువునటుల జేయు టకు ఇంతకంటె మంచిపద్ధతి లేదు. ఇందుకు దృష్టాంతరము: "విజ్ఞాన చంద్రికామండలి" వారిచే ప్రకటింపబడిన వ్యవసాయశాస్త్రము, అర్థికశాస్త్రము, రాయచూరు యుద్ధము, విజయనగర సామ్రాజ్యము అను గ్రంథములను ఎంతమంది చదివియున్నారో— ఏగ్రంథాలయము యొక్కగాని, పుస్తకములను ఇండ్లకు దీసికొనిపోవు పట్టికను దీసి చూడుడు. రాయచూరు యుద్ధము, విజయనగర సామ్రాజ్యము, అను గ్రంథములను నూఱుమంది జదివియున్న యెడల — ఒక్కరైన "అర్థికశాస్త్రము" అను గ్రంథమును జదివియుండరు. "వ్యవసాయ శాస్త్రము"ను ఒకరిద్దరు చదివియుండిన, చదివియుండవచ్చును.

ఇట్టిస్థితియందు గ్రంథభాండాగారి చేయదగినదేమి? వ్యవసాయ శాస్త్రము అను గ్రంథమునందు ఏయే విషయములు వివరింపబడి యున్నవో, ఆ విషయములను పఠించుటవలన గలుగు లాభము లెవ్వియో, అప్పుడప్పుడు ఉపన్యాసముల మూలమున జెప్పుచు, ఆ గ్రంథమునందలి కొన్ని భాగములను జదివి బోధించుచుండవలెను. ఇటుల బోధించుచుండిన యెడల, కొంతకాలమునకు గాక పోయిన మరికొంతకాలమునకైన ఆ గ్రంథమునం దాసక్తి జనియింపకపోదు. ఈవిధముగ గ్రంథభాండాగారి గ్రంథాలయమునందలి పుస్తకములను గూర్చి తఱచుగా జెప్పుచు జనుల నాకర్షించి, వారి యభ్యుదయ పరంపరకు గారణభూతుడై తనరవలెను. బాలశాఖాభాండాగారి వలెనే ఈతడుగూడ ప్రత్యేకశిక్షణను బొందుట అత్యంతావశ్యకము.

## గ్రామచరిత్ర

దేశ చరిత్రలను వ్రాయుటకు ఈకాలము నందలి చరిత్ర కారులు సాధన సామగ్రులు దొరకక అగచాట్లు పడుచున్నారు. ప్రాచీనకాలమునందు చరిత్రలు వ్రాసియుంచని కారణముచేత, శాసనములు, నాణెములు, పురాణములు, కథలు మొదలయినవి మాత్రము చరిత్ర పరిశోధకులకు ప్రధానాధారములై యున్నవి. కొని

సంస్థానములందు పాతరికార్డుదొరికినచో అవి మిక్కిలిఉపయోగకరము లగుచున్నవి. ఇదిగాక శిలాశాసనములు, రాగిశాసనములు, తాటియాకు గ్రంథములు మొదలైన వానిని జాగ్రత్త చేయువారు లేక పోవుటచే ప్రతి సంవత్సరము అనేకములుగా శిథిలములై పోవుచున్నవి. కొందరు శిలా శాసనములను గోడలు కట్టుట కుపయోగించుచున్నారు. మరి కొందరు తామ్రశాసనములను కరిగించి పాత్రలుచేయించుచున్నారు. ఇంకా కొందరు తాటియాకు గ్రంథములను చలిమంటలలో వేయు చున్నారు. అందుచేత ప్రతి గ్రంథాలయమును తమ గ్రామము నందును చుట్టుప్రక్కల గ్రామములయందును ఉన్న శిలాశాసనము లను, ప్రాచీన విగ్రహములను, తామ్రశాసనములను తాటియాకు గ్రంథములను ప్రోగుజేసి భద్రపరుపవలెను. ఇదిగాక తమగ్రామము యొక్క చరిత్రను కూడ ఎప్పటికప్పుడు వ్రాసి యుంచవలయును. స్వకులగోత్రములు తెలియనివాడు గౌరవార్హుడుగాడు. అట్లే స్వగ్రామ చరిత్ర తెలియని గ్రామవాసులు కూడ గౌరవపాత్రులుకారు గ్రామ చరిత్ర సేకరణలో ముఖ్యముగా ఈ క్రింది విషయములకు ప్రాధాన్య మీయవలెను.

1. గ్రామ పూర్వచరిత్ర - దానికి సంబంధించిన కథలు, గాథలు గ్రామములో పెద్దలవలన విని, వినినవి విన్నట్లే వ్రాయ వలెను.

2. గ్రామము నిర్మాణమై ఎంతకాలమైనది? నిర్మించినవా రెవరు? అప్పటి సందర్భములు, ధరవరలు, వాటి వివరములు దాని వృద్ధి ఎట్లయినది? వృద్ధికి తోడ్పడినవారి చరిత్రలు ప్రథమమున గ్రామమందు చేరినవంశములవారు ఇప్పుడున్నారా? క్రొత్తవా రెవ్వ రైన చేరినారా? ప్రాముఖ్యము గాంచినవా రెవ్వరు? వారెట్లు ప్రాముఖ్యమును సంపాదించిరి? క్షామములు, చోరులు, దోపిడిగాండ్రు మొదలైన వారివలన అపాయము లెప్పుడు కలిగినవి? గ్రామమందు కలిగిన కలహములు, ఉమ్మడి సాముదాయకమైన కార్యములు,

౩. ఇవిగాక ప్రస్తుత చరిత్ర:- గ్రామమందు జరుగు దినచర్య ఒక బైండుపుస్తకములో వ్రాయుచుండవలెను.

## సే వా ధ ర్మ ము

గ్రంథాలయములు చేయవలసిన విధులలో సేవావ్రతము ఉత్తమోత్తమమైనది. కావున దానినిగూర్చి కొంత చెప్పెదను.

"కెలకులనున్న తంగేటి జున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థితార్థ పేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుఁడు
దొడ్డిబెట్టిన వేల్పు గిడ్డికాపు
కడలేని యమృతంపు నడబావి సంసారి
సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశ పథమధ్య మప్రపకులపతి
యాఁకటి కొదవు సస్యము కుటుంబి

బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజకాతిథి క్షపణ కావ
ధూత కాపాలికాద్యనాథులకు గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె" —మనుచరిత్ర.

ఇట్టి అత్యుత్తమంబులగు ధర్మములచే నొప్పారునది కనుక గృహస్థాశ్రమంబునకు సరియగు నాశ్రమము లేదని మనపెద్దలువచించి యున్నారు. అట్లని మన శాస్త్రములు ఘోషింపుచున్నవి. ప్రాచీన కాలమునుండియు, మన సంప్రదాయ మారీతిగ నున్నది. ఈ రీతిగా ప్రతి గృహస్థుడునుగూడ సంఘమునకు సేవకుడైయున్నాడు. చెవిటి వారు, కుంటివారు, గుడ్డివారు మొదలగు వికలాంగులకును - బ్రహ్మ చారులు, వానప్రస్థులు, సన్యాసులు ఆదిగాగల అనాథులకునుగూడ ప్రతిగృహమును ఆశ్రయస్థానముగ నున్నది. అట్టివారికి గృహస్థు అందుబాటులో నున్న "తేనెపెర" వంటివాడట, తొడపై నుండెడు

రూకల పెట్టెవంటి వాడట. పెరటివొడ్డి యందలి కల్పవృక్షమువంటి వాడట. దారి ఏర్పరచినట్టి అంతములేని అమృతపు బావియట; సమీపమునందున్న మేరుపర్వతమట; నీరులేని ప్రదేశమందుండు చలి పందిలివంటి వాడట; ఆకలివేసిన వేళకు ఉపయోగించు పైరువంటి వాడట, ఈ ధర్మబీజము లన్నియు ప్రజల హృదయసీమలయందు నాటియుండుటచేతనే భారతవర్షమున భైక్షుకగృహ నిర్మాణావశ్యకత కనుపింపలేదు.

ఘూమశకటములును అయోమార్గములును లేనికాలమునందు మహారణ్యములను ఛేదించి ప్రశస్తమైన రహదారులను చెట్లవరుస లతో నిర్మించి మధ్యమధ్యను బాటసారుల యుపయోగార్థమై బావు లను విశ్రాంతిగృహములను యేర్పరచి బీదలకు ఉచితముగ సదా వర్తుల నొసంగుచు సంఘసేవను జేయుచుండెడివారు మనవారు. అడ వులలో కట్టెలు, పుడకలు, గడ్డి నేరుకొనుచు నెత్తిమోపులతో, నేకా కులై యలసివచ్చు శ్రామికజీవులకు నెత్తిమోపులను దింపుకొను టకు ఎత్తైన అడ్డ నిలువు రాళ్ళను ఆయా మార్గములయందు అక్క డక్కడ నిలుపుచుండువారు. కొల్లేరు వంటి మహామశకావృతమైన స్థలములలో మనుష్యులకే గాక, పశువులకుగూడ "కండూతి" నివా రణార్థమై నిలువురాళ్ళు పాతించి, యుపకరింప జేయుచుండువారు. తటాకములను దిగుడుబావులను నిర్మించి - మానవులకే గాక, పశు పక్షి మృగంబులకుకూడ జీవనము కల్పించిరి. "ఇంటికొక పుష్పమైన ఈశ్వరునకు ఒక మాల" యను సామెత మనకు అనుభవముచం దున్నదియే గదా! వైద్యులందరును బీదలకుచితముగ వైద్యసహాయ మును జేయుచుండెడివారు గదా! మండువేసవి కాలమున పాంథులకు తలదాచుకొనుటకు నీడ, త్రాగుటకు చల్లని మంచినీరును ధర్మముగా నొసంగు నేర్పాటులు కలవుగదా! పాము, తేలు మొదలగు విష జంతువుల కాట్లకు మందుల నిచ్చువారు, మంత్రములను వేయువారు ప్రతిఫలము నపేక్షింపకూడదు గదా!

"అన్నము లేదు, కొన్ని మధురాంబువు లున్నవి త్రావుమన్న" అను కరుణారసము లొలుకు "రంతిదేవుని" వాక్యములు చండాలుడు విప్రుడు అను భేదములేక ఎల్లరకు సేవచేయుటకు మార్గదర్శకముగ నున్నది.

"వండనలయదు వేవురు వచ్చిరేని
అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి"
—మనుచరిత్ర,

అను వాక్యము భారతవర్ష సతీమతల్లులయొక్క గుణవర్తనమును చక్కగ ప్రదర్శింపు చున్నది. పురిటిబాలింత స్నానముచేయు నాడు తలకొక బిందె వేడినీళ్ళు తెచ్చిపోయు నాచారము నేటికిని కొన్ని గ్రామములలో కలదు. ఆనాడు పెద్దకాగుపెట్టి మోపెడు పుడకలతో నీళ్ళు కాచికొన నవకాశములేని పేదయిల్లాండ్ర కీ పద్ధతి యెంతయో సహాయభూతముగ నుండెను. అనాథప్రేత సంస్కారము పుణ్యప్రదమని మన మందరమును భావించుట సామాన్యమే గదా! ప్రతి ఇంటికిని దారినిపోవు బాటసారులు విశ్రమించుటకై అరుగు లుండుట ఇప్పటికిని కొన్నిచోట్ల కలదు.

## ఇప్పటి పరిణామము

ఈ విషయము లన్నియు అందరికిని తెలియనివికావు. కాని పాశ్చాత్య సంప్రదాయములు మనదేశమున ప్రాకినకొలదిని, పాశ్చాత్యాదర్శములు మనహృదయములందు అలముకొనినకొలదిని, మన దేహముయొక్క ప్రతి అణువునందును నిండి నిబిడీకృతములై యున్న ఈ ధర్మబీజములు ఒక్కొక్కటిగా నశింపజొచ్చినవి. దేశాభివృద్ధి గోర్చుచువా రందరును మహాధర్మ విప్లవ సమయమున యోచింపవలసిన విషయమేమి? ఈ ధర్మబీజము లెంతవరకు నశించినదియు గ్రహించి, తిరిగి వానిని మొలకలెత్తించుటకు కావలసిన మార్గము లను అన్వేషించుటయే మనము చేయవలసిన పని. ఇంకను కొంత కాలము ఇటులనే ఈ ధర్మవిప్లవమునందు పడి మనము కొట్టుకొని

పోయిన యెడల, భారతజాతి నశించుననియే ఘంటాపథముగ జెప్ప వగును. నశించుట యనగా- మనశరీరములుగాదు నశించునవి. ఒకరు నశించిన మరియొకరు ఎప్పుడును ఏదేశమునందైనను జన్మించుచునే యుందురు. కాని అట్లు నశించునది భారతవర్షముయొక్క ఆత్మయై యున్నది. భారతవర్షముయొక్క జీవితపరమార్థములు, సంఘసంప్రదాయములు, ధర్మచింతనలు, ఇవియన్నియు నశించినయెడల, దాని యొక్క ఆత్మనశించినట్లు కాదా? ఆత్మనశించిన జాతికి మోక్ష మెక్కడిది? ప్రపంచము నంతను వెలిగింపగలిగిన విజ్ఞానముతో నిండి యుండిన ఈ భారతవర్షము నశించినయెడల ప్రపంచమున కొక గొప్ప లోటు వాటిల్లదా? అట్లు వాటిల్లిన దానివలన కలిగెడి పాపము మనలను జుట్టుకొనదా?

## సంఘసేవా విధానము

కావున సోదరులారా! "పరోపకారార్థ మిదంశరీరమ్" అను పవిత్ర వాక్యము తిరిగి భారతీయుల హృదయఫలకములయందు నాటు నటుల జేయుటకై దీక్షను గైకొనుడు. స్థూలముగా సంఘసేవ రెండు విధములు, నిత్యము-నైమిత్తికము. దినదినము ప్రతిగృహమునను-కాన రాకుండ ధర్మాభిప్రాయాను సారముగా జరుగునది యొకటి-నైమిత్తికముగా అగ్నిభయములు, సాంక్రామిక వ్యాధులు, ఆకస్మిక అపాయములు, చోరభయము, జలప్రళయములు, తీర్థములు, జాతరలు మొదలగువానియందు - ఆయా నిమిత్తమునకు అనుగుణముగా తాత్కాలికమైన సేవ చేయుట మరియొకటి. నిత్యసేవకు ప్రజలలో నుత్సాహము కలుగునట్లు ధర్మాభిప్రాయప్రకటనము- వ్యాపనము- అత్యంతావశ్యకములై యున్నవి. అదిగాక నైమిత్తిక సేవజేయుటకు, సేవకులు భక్తిగలిగి వినయాది గుణసంపన్నులగుటకుగాను సంఘసేవా మార్గములందు క్రమమైన శిక్షణము నొసంగవలెను. ఈదుట-ప్రాణమును కాపాడుట - మంటల నార్పుట - నావలను నడుపుట- ప్రథమ వైద్యసహాయము నొసంగుట - సాంక్రామిక వ్యాధులయందు ఉపచారము జేయుట - మున్నగు కార్యములయందు వారికి అనుభవ

పూర్వకమైన శిక్షణను ఒసంగవలెను. ఉపద్రవములు చెప్పిరావు. కావున సంఘములయందు వార్తతెలియగనే సేవావ్రతులైన తగిన వారిని పంపు అవకాశము లుండవలయును.

ఇట్టి సంఘసేవ గ్రంథాలయముయొక్క అత్యుత్తమ ధర్మము. దీనిని నిర్వహించుటకు యుక్తమైన మార్గమేది? పాశ్చాత్యాదర్శములవలన మన సంఘజీవనమున గలిగిన ఈ ధర్మవిప్లవమును, ఆ పాశ్చాత్య నాగరికతవలన మనము నేర్చిన మార్గముల నవలంబించియే సరిదిద్దవలసి యున్నది.

పాశ్చాత్య నాగరికతవలన మనకబ్బిన సేవావిధానములలో బాలభటోద్యమము ప్రధానమైనది. పైన వివరించిన సాంఘికసేవ నంతను ఒకవ్రతముగ అనుష్ఠించునదే భటోద్యమము. ఈభటోద్యమమునే ప్రాచీన సంప్రదాయముతో మేళవించినయెడల అది "రామదండు" అగును. 1916 వ సంవత్సరమున ఈసేవావ్రతమును అనుష్ఠించుటయందు ఆరితేరిన ప్రతినిధులు కొందరు కొల్లేరునకు కృష్ణానదికి వచ్చిన వరదల సందర్భమున, అసమానమగు సేవను గావించిరి. అట్టి సేవచేయుటకు తరిబీతు బొంది ఎల్లప్పుడును సిద్ధముగానుండుట గ్రంథాలయ సోదరుల ధర్మము.

## గ్రంథాలయ పాలనము

గ్రంథాలయముయొక్క పాలనమునకు అలంకారప్రాయముగా నుండువారిని కార్యనిర్వాహక సంఘమునకు ఎన్నుకొనుటచే అసలు పనిచేయువారికి వారు నిరోధము గల్పించుట తప్ప వేరుప్రయోజనము సిద్ధింపదు. గ్రంథాలయ నిత్యవ్యవహారమును నిర్ణయించుట ఆదాయవ్యయములను పాలించుట, అవసరములగు నిర్ణయములను చేయుట, మొదలగునవి కార్యనిర్వాహక సంఘమువారి ముఖ్యవిధులు. కార్యనిర్వాహక సంఘమునకు తరిబీతు పొందిన గ్రంథభాండాగారినే కార్యదర్శిగా ఏర్పాటు చేయుట మంచిది.

సాధారణముగా గ్రంథాలయము లన్నింటికిని ఉండదగిన ప్రధానమగు ఉద్దేశములను నిబంధనలను ఈ క్రింద సూచించుచున్నాను.

## ఉ ద్దే శ ము లు

1. సంఘము నందలి వ్యక్తుల జీవితములను పవిత్రవంతము గను, చతుర్విధ పురుషార్థసాధకములుగను అగుటకు దోహద మొనర్చుట.

2. ఆంధ్రభాషయందున్న గ్రంథముల నన్నింటిని సాధ్యమైనంత వరకు సంస్కృతాంగ్లేయభాషా గ్రంథములను-సంపాదించుట, తాళపత్ర గ్రంథములు, శాసనములు, నాణెములు మొదలగు వానిని సంపాదించి భద్రపరచుట,

3. వార్తాపత్రికలను మాసపత్రికలను తెప్పించుట.

4. గ్రంథములను పత్రికలను గ్రంథాలయమునకు వచ్చువా రందరికి ఉచితముగా చదువుకొన నిచ్చుట, చదివి వినిపించుట, గ్రంథాలయమునకు రాజాలని వారియందు జ్ఞానవ్యాపనమునకై తగిన ఏర్పాటులను జేయుట.

5. గ్రంథాలయమునందలి గ్రంథములను ఇండ్లకు తీసికొని పోఁగోరువారి యొద్ద చందా ధనమును గైకొని, తన్మూలమున గ్రంథాలయము నభివృద్ధి పరచుట. గ్రంథములను ఇండ్లకు ఉచితముగా నిచ్చుటకుగూడ ఏర్పాటు చేయుట శ్రేష్ఠము.

6. జ్ఞానదాయకములును దేశాభివృద్ధి కరములును అగు ఉపన్యాసముల నిప్పించుట, హరికథలు, జంగమకథలు, మొదలగు వానిని చెప్పించుట: మహాపురుషుల యొక్కయు, ప్రవక్తలయొక్కయు వర్ధంతులను ఏర్పాటుచేయుట; జాతీయపండుగులను సలుపుట; వ్యాయామములను లలితకళలను ప్రోత్సాహపరచుట; ఇంకను జ్ఞానదాయకములగు కార్యముల నెల్ల చేయుట.

## ప రి పా ల న

ప్రతి గ్రంథాలయమును సాధారణ సంఘము, కార్యనిర్వాహక సంఘము, అను రెండు సంఘములచే పరిపాలింపబడును.

సాధారణ సంఘము:— గ్రంథాలయమున చేరు ప్రతి చందాదారుడును లేక ప్రతివ్యక్తియును సాధారణ సంఘమున సభ్యుడుగా

నుండును. గ్రంథాలయనిబంధనలలో గ్రంథాలయమును ఎత్తివేయుట తప్ప, ఇతరములైన వాటిని మార్చుటకు, చేర్చుటకును సాధారణ సంఘ సభ్యుల కధికారముండవలయును. ఒక పర్యాయము చేసిన నిబంధనలు తిరిగి మూడు మాసముల పర్యంతము విమర్శింపగూడదు. గ్రంథాలయమును ఎత్తివేయుటకు ఏసంఘమునకును ఎప్పుడును ఎట్టి అధికారమును ఉండరాదు, కాని అవసరమైనప్పుడు ఇతరసంఘము లతో కలియువచ్చును.

కార్యనిర్వాహక సంఘము:- సాధారణసంఘమునుండి సంవత్సర మునకు ఒకమారు ఎన్నుకొనబడిన నియమిత సంఖ్యగల సభ్యులుగలిగిన కార్యనిర్వాహక సంఘము పరిపాలన నిమిత్తమై ఎన్నుకొనబడవలెను; అట్లు ఎన్నుకొనబడిన సభ్యులలోనే అధ్యక్షుడు, కార్యదర్శి, గ్రంథ భాండాగారియు నుందురు, ఈ కార్యనిర్వాహక సంఘము గ్రంథా లయము యొక్క ఆస్తినంతను తన వశమునందు ఉంచుకొని ఆదాయ వ్యయములను పాలించుటయు, సేవకులను నియమించుటయు, తొల గించుటయును- అవసరమైన సామానులు, వార్తాపత్రికలు, గ్రంథ ములు మున్నగు వానిని కొనుటయును, అనవసరమైన వానిని విక్ర యించుటయును, గ్రంథాలయ మందిరము సామానులు మున్నగు వానిని మరమ్మతు చేయుటయును, గ్రంథాలయముయొక్క ఉద్దేశము లను అమలులో పెట్టుటకు అవసరమైన కార్యములనెల్ల చేయుటయును- ఈ సంఘము నిర్వహించవలసిన పనులు.

అధ్యక్షుడు:- ఈతడు గ్రంథాలయమును సదాపరిపాలించుచు, లెక్కలను అప్పుడప్పుడు పరీక్షించుచు, లోపములున్నయెడల కార్య నిర్వాహకసంఘమువారి యాలోచనకు తెచ్చుట.

కార్యదర్శి:- గ్రంథాలయముయొక్క అభివృద్ధికి కావలసిన సకలమైన కార్యములను, కార్యనిర్వాహక సంఘమువారి యాజ్ఞలకు లోబడి నిర్వహించును. గ్రంథాలయము యొక్క యావత్తు వ్యవహార ములను నడపును.

గ్రంథభాండాగారి:- ఈతడు గ్రంథాలయము నెల్లప్పుడును కనిపెట్టుకొనియుండి, చదువరుల కెల్లప్పుడును తోడ్పడుచు, గ్రంథ

ములను ఇండ్లకిచ్చుట తిరిగి పుచ్చుకొనుట, గ్రంథాలయమందు చదు వరులకిచ్చుట పుచ్చుకొనుట - మొదలగు నిత్యవ్యవహారములను జేయుచు, గ్రంథాలయోద్దేశములను ఆచరణలో పెట్టుచుండవలెను. జీతమునిచ్చి గ్రంథభాండాగారిని నియమించుట ఉత్తమము.

## ప ట్టి క లు

ప్రతి గ్రంథాలయము ఈక్రింది పట్టికలను (పుస్తకములను) నిర్వహించవలెను:-

(1) చందాదారుల పట్టిక.- ఇందు ఈ క్రింది విభాగములు ముఖ్యముగా నుండవలెను. 1 చందాదారునిపేరు 2 నెలచందా 3 పాతబాకి 4 మొత్తం బాకీ చందా 5 చెల్లించిన ధనము 6 చెల్లించు వారి సంతకము 7 చెల్లించిన తేదీ 8 కార్యదర్శి సంతకం: తేదీ.

(2) జమా ఖర్చు పుస్తకం:- 1 తేదీ, సంవత్సరం 2 ఆవర్జా పుట సంఖ్య 3 బాపతులు 4 జమ 5 ఖర్చు.

(3) బాపతు వారి ఆవర్జా:- 1 తేదీ, సంవత్సరం 2 చిఠాపుట సంఖ్య 3 బాపతు వివరము 4 జమ 5 ఖర్చు.

(4) ఆస్థి వివరములను తెలియజేయు పట్టిక: 1 వరుససంఖ్య 2 తేదీ 3 ఆస్థి వివరము 4 ఎట్లు సంపాదించినది 5 షరా.

(5) ధర్మముల పట్టిక.- ఇందు ధర్మముగా వచ్చు సామాను లు గాని పుస్తకములుగాని, వాని వివరము లుండవలెను.

(6) గ్రంథ వివరణ పట్టిక:- 1. వరుస సంఖ్య 2 ఓచరుసంఖ్య 3. గ్రంథ విభజన సంఖ్య 4 గ్రంథనామము 5. ఎట్లు సంపాదించి నది 6. సంపాదన తేది 7. విలువ

(7) పుస్తకముల పట్టిక.- అన్ని పుస్తకములను, విషయములను బట్టి వర్గీకరించి, ఏ భాష కాభాషకు ప్రత్యేకముగా వ్రాయవలెను. గ్రంథములు ఎక్కువగా నున్నపుడు, గ్రంథముల నామములనుబట్టియు గ్రంథకర్తల నామములనుబట్టియు ప్రత్యేకముగా పట్టికలను ఏర్పరుప వగును. పట్టికలనుంచు ఆచారమును క్రమముగా తగ్గించుచు, కార్డుల మీాద గ్రంథముల నామములు మొదలగు విషయములను వ్రాయుచు,

పేటికలలో పుస్తకాల క్యాటలాగును పెట్టుపద్ధతి ఇపుడు అమలులోనికి వచ్చుచున్నది.

(8) గ్రంథముల నెరువిచ్చు పట్టిక:— 1. వరుస సంఖ్య 2. గ్రంథ విభజన సంఖ్య 3. గ్రంథనామము 4 తీసుకొన్నవారి పేరు 5. తేది 6. తిరిగి యిచ్చిన తేది 7. గ్రంథభాండాగారి సంతకము.

(9) చదువరుల పట్టిక:— 1. తేది 2. పుస్తకముల నంబరు 3. పుస్తకము లేక పత్రిక పేరు 4. చదివి తిరిగి యిచ్చినపుడు పాలకుని సంతకము.

(10) ఉత్తరముల నకళ్ళు.

(11) తీర్మానముల పుస్తకము:— ఇందు ఆయా తేదీలయందు కార్యనిర్వాహక సంఘముగాని, సాధారణ సంఘముగాని సభ చేసినపుడు తీర్మానములను వ్రాయవలయును. సభ్యుల సంతకములను ప్రారంభమునగాని, చివరగాని చేయించవలయును. ప్రారంభమున సంతకములు చేయించినచో చివర అధ్యక్షుని సంతకము ఉండవలెను.

(12) అభిప్రాయములను వ్రాయు పుస్తకము.

## వి వి ధ వి ష య ము లు

స్వంతభవనము:- శారదాదేవికి స్థిరత్వ మేర్పడుటకు గాను ప్రతి గ్రంథాలయమునకును స్వంతభవనమును నిర్మింపవలెను. గ్రామమున పాఠశాలయందుగాని దేవాలయమునందుగాని పెట్టుటకంటె, ప్రత్యేక గృహమునందుంచుట అత్యంతావశ్యకము. దేవాలయార్చకులకువలె గ్రంథభాండాగారికి జీతబత్తెములుగాని మడిమాన్యములుగాని కల్పించిన ప్రయోజనకరము. దేవాలయము లేని గ్రామమున తీర్థము పుచ్చుకొనగూడదని మనపెద్దలు ఎట్టి కట్టడిని చేసిరో, అట్లే గ్రంథాలయమును, పాఠశాలయును లేని గ్రామము నివాసార్హము కాదను యభినివేశము ప్రజలయందు బాగుగ నాటినయెడల, వీనిని స్థాపించుట ఒక ఘనకార్యము కాదు.

ధనము:—ఏ ప్రజాహిత కార్యమునకైనను ధనము గావలసి వచ్చినచో చందాలను వసూలు చేయుట మనకు అలవాటై యున్నది; కాని

ఇది ఆదర్శమైన పద్ధతిగాదు. అట్లయినచో సొమ్ము వచ్చుట యెట్లు? మన పూర్వులు ప్రతి గ్రామమునందును సామునాయకపు ఆస్తులను నిర్మాణము జేసి యున్నారు. అట్టి ఆస్తులపాలన ఇప్పుడు సక్రమముగా జరుగుట లేదు. కావున కొంత ప్రయత్నించినచో ఈ ధర్మాదాయముల నుండి వచ్చు రాబడిలో కొంతవరకైన గ్రంథాలయమునకు మరల్చ వచ్చును. కొలగారపు పాటలమీద వచ్చు ద్రవ్యమును, గ్రామము లోని కాలువ కట్టలవలన పాటలమీదవచ్చు సొమ్మును, దీనికై కొంత వినియోగింపజేయ వచ్చును. ఇదియుగాక గ్రామములయందు ధర్మము ద్రవ్యరూపమున గాక వస్తురూపమున సంపాదించుట సులభము. పంట కళ్ళసమయమున ప్రయత్నించిన యెడల గ్రంథాలయమునకు సంవత్సర వ్యయమునకు గావలసిన ద్రవ్యమంతయు సులభముగా వస్తురూపమున వసూలు కాగలదు. అప్పుడు గ్రామస్థులందరికి ఉచిత ముగా గ్రంథసేవ చేయనగును.

రిజిస్ట్రేషను:- గ్రంథాలయమును ట్రస్టు ఆక్టుక్రిందనో, లేక 1860 సం. 21 నెం. చట్టమును అనుసరించియో, రిజిష్టరు చేయించ వచ్చును. రిజిష్టరు చేయించనిదే ప్రభుత్వమువారును, ఇతర లోకలు బోర్డులును గ్రాంటులనిచ్చుట లేదు.

గ్రంథముల వర్గీకరణము:- ఒక భాషయందలి గ్రంథములను వర్గీకరణము చేసినగాని ఆ భాషయందు చేర్చవలసిన గ్రంథముల యావశ్యకత బోధపడదు. అదియుగాక గ్రంథాలయములందలి గ్రంథ ములు అభివృద్ధి జెందినకొలదిని గ్రంథములకు వేయుసంఖ్య మార్పు జెందకుండ నుండవలెను. అట్లనుటచే "ఆంధ్రుల చరిత్ర"ను గూర్చిన గ్రంథములు పలుతావులయం దుంచగూడదు. ఒకదాని ప్రక్క మరి యొకటి ఉంచవలెను. పాశ్చాత్య దేశములయందు గ్రంథవర్గీకరణము ప్రత్యేకశాస్త్రమై అభివృద్ధి గాంచినది. గ్రంథవర్గీకరణమును గూర్చి ఈ సంపుటమునందే వేరొకచోట ప్రచురించిన వ్యాసమును జదువ నగును.

ప్రపంచపటములు, మహాపురుషుల చిత్రపటములు, భాషాపోషకుల యొక్కయు కవివరేణ్యుల యొక్కయు, వీరులయొక్కయు చిత్రపటములను, భూగోళ విషయములను శరీరశాస్త్రము ఆదిగాగల ఇతరశాస్త్రీయ విషయములను బోధించు చిత్రపటములను, దేశపటము లను తప్పక ప్రతి గ్రంథాలయమునందును ప్రదర్శించవలెను.

(ది 15-5-29 నుండి 5-6-29 వరకు పశ్చిమగోదావరి జిల్లా తాడేపల్లిగూడెము తాలూకా బోర్డువారి పక్షమున శ్రీ శనివారపు సుబ్బారావు గారిచే "ఉపాధ్యాయ వసంతబుతు విద్యాలయ" మను పేర జరిగిన గ్రామ పునర్నిర్మాణపు తరగతుల ఉపన్యాసములలో 31-5-29 వ తేదీన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు ఇచ్చిన ఉపన్యాస సారము. 1929 లో శ్రీ శనివారపు సుబ్బారావుగారు ప్రకటించిన "గ్రామ పునర్నిర్మాణపు తరగతుల ఉపన్యాసముల" నుండి సేకరింపబడినది.

---

# సార్వజనిక పుస్తకాలయములు

## విద్యయొక్క గౌరవము

"సర్వకళాశాలలయందలి విద్య యుత్కృష్టమైనది. కాని పుస్తకాలయముల యందలి విద్య మహోత్కృష్టమైనది. అందుచే గ్రంథాలయములను విరివిగా నెల్లదేశములయందును నెలకొల్పవలయును" అని 'లవెల్' దొరగారు చెప్పియున్నారు. విచారించి చూడగా నీ వాక్యమునందెంతయో యర్థముకలదు. మన దేశమున కళాశాల యొక్కటియే విద్యాప్రదాయిక భవనమని జనులకు దృఢమైన యభిప్రాయము కలిగినది. ఎవరైనను విద్యావంతుఁడని మనముచెప్పినచో బి. యే., పరీక్షయందుఁ గృతార్థుఁడయ్యెనా లేక యమ్. ఏ., పరీక్షయందుఁ గృతార్థుఁడయ్యెనా యని యడుగుదుము. విశ్వవిద్యాలయము వారి పరీక్షలే విద్యా పరిమాణమునకుఁ గొలకర్రలైనవి. ఎంతటి విద్వాంసుఁడైనను పరీక్షలయందు జయముపొంది బిరుదములను సంపాదించకున్నంతవరకును వాని విద్యను గణించువారులేరు. ఇట్టి

సామాన్యమున వానికిఁ గౌరవమును లేదు. దీనికేమి కారణము? కళాశాలవినా విద్యార్జనోపాయము మరియొకటి లేదను మన మూఢవిశ్వాసమే. ఇతర దేశములయందు దొరతనమువారికి సంబంధించని యనేక విద్యాశాఖలు కలవు. వాస్తు శాస్త్రజ్ఞుల సంఘముకలదు. గణక విద్వాంసుల సంఘముకలదు. ఇటులనే యనేకములున్నవి. ఆ సంఘము నందు సభ్యులని చెప్పుకొనుట యొక గొప్పగౌరవనీయమగు పదవిగా వారు పరిగణించుచున్నారు. మనవారు బి. యే., యం. ఏ., బిరుదములను తమనామముల తుదిని గౌరవార్థముగా ధరించుచున్నట్లుగనే, వారు వారికి ప్రవేశముగల విద్యాశాఖయందలి సంఘసభ్యతను సూచించు బిరుదములను తమ నామముల తుదిని జేర్చుకొనుట గౌరవమని తలంచుచున్నారు. దొరతనము వారి శిల్పకళాశాఖ యందలి యుద్యోగస్తులు కళాశాలలయందే యే పరీక్షలయం దుత్తీర్ణులై యేయే బిరుదము లార్జించిరో తెలియదు; కాని వారు తమ నామముల తుదిని ఏ. యమ్., ఐ. సి. యి., యమ్. ఐ. సి. యి., మొదలగు సంఘ సభ్యతను సూచించు బిరుదములను వాడుకొనుటయే యొక గొప్ప గౌరవముగా గణించుచున్నారు. ఇటులనే యితర విద్యాశాఖలయందును జరుగుచున్నది. మన హిందువులట్టి విద్యల నేల మన్నించి గౌరవించరాదు?

## కళాశాలా విద్య

మనుష్యుని జీవితకాలములో కళాశాలయందు విద్య నేర్చు భాగమత్యల్పము. విషయగ్రహణశక్తి నలవరచి, విమర్శనా జ్ఞానమును వృద్ధిజేయుటకు మాత్రమే కళాశాలయందలి శిక్ష తోడ్పడును; గాని అనంతమగు భాషా ప్రపంచమును తరుచుట కవకాశములేదు. అనేకమంది జనులు తాము విద్యను ప్రారంభించినది మొదలు ముగించు వరకును ఒక్క పరీక్షయందును తప్పలేదని మిక్కిలి గర్వముతో జెప్పుకొనెదరు. కాని పరిశీలించి చూడగా వారికంటె ప్రతి పరీక్ష యందును నొకటి రెండు సారులు తప్పుచు వచ్చినవారే బహు గ్రంథశోధన కవకాశము కలిగినవారై, విశేషభాషాపరిచయము గల

వారుగా గన్పట్టుచున్నారు. ఇందుచే ననేక గ్రంథములను పఠించు టకుగల యవకాశమును తత్ఫలమును,సూచించుచుంటిమేగాని విద్యార్థులు పరీక్షలయందు పలుమారు లపజయమును బొందవలయుననియు, వారి ధనమును కాలమును తన్మూలమున వృథాగా వ్యయపరుపవలయు ననియు మాయుద్దేశముకాదు.

## విద్య అనంతము

అంతియగాక అగాధమగు నీ విద్యా మహార్ణవమందు, దినదిన మును నమూల్యరత్నములు కొల్లలుగాఁ గనుఁగొనఁ బడుచున్నవి.తన కాలమునాటి విద్యా విషయములను దెలిసికొనుట ప్రతి నాగరిక పురుషునకు నగత్యమైనపని. అట్టి పరిజ్ఞానములేనివాడు కాలముతోఁ బాటు తాను వృద్ధిబొందుటలేదని మనము నిశ్చయముగాఁ జెప్ప వచ్చును. ముప్పది సంవత్సరములక్రిందట బి. యే., పరీక్షయందు కృతార్థుడైన వానిని– ఈ మధ్యకాలములో ప్రపంచకమున జరిగిన మార్పులను తెలిసికొననిచో, నిప్పటి బి. యే., పరీక్షాబద్ధునితో సమానునిగా నెంచుట కెంతమాత్రమును అవకాశములేదు. ప్రతిదిన మును సర్వశాస్త్రములయందును క్రొత్త క్రొత్త సిద్ధాంతములు కనుంగొనబడుచున్నవి. ప్రాతవిషయములు పూర్వపక్షములగు చున్నవి. ప్రభుత్వమువారు సైతము తమ పాలనా శాఖల యందలి యుద్యోగస్తుల యుపయోగార్థము, క్రొత్త క్రొత్త విషయముల జర్చించు గ్రంథములను పత్రికలను వారి వారి శాఖలకు సంబంధించినవి ప్రదినమును ఉచితముగాఁ బంపి తమ యుద్యోగస్థులను నవనాగరికు లను జేయుచున్నారు. ఆ యుద్యోగస్తులు తమ పాఠశాలలో జదివిన విద్య పరిపూర్ణమైనదియే యైనచో, ప్రభుత్వమువారిట్టి వ్యయ ప్రయాసములకు పాలయి, పత్రికలను గ్రంథములను దెప్పించి యిచ్చు టకు గల యగత్యమేమి! జనులేల యందలి రహస్యమును గ్రహించ రాదు? మానవుడు జీవించియున్నంతవరకును నేర్చుకొనవలసిన క్రొత్త విషయములుండియే యుండును. ఇంతటితో విద్య పరిసమాప్తమైన దని యెన్నటికిని చెప్పుటకు వీలులేదు. అయితే, జీవించియున్నంత

కాలమును పాఠశాలలో విద్యార్జనముఁ జేయుచుండవలసిదేనా యని యడుగవచ్చును. అక్కఱలేదు. ప్రాపంచక విషయములకు భంగము లేకుండ నిర్దిష్టకార్యముల నెఱవేర్చుకొనుచు, విద్యాసంపాదనమును జేయుటకు తగిన యవకాశము కలదు. అది సార్వజనిక పుస్తకాలయములను సర్వత్ర స్థాపించుటచే లభించును. ఏనాడు సార్వజనిక పుస్తకాలయములు దేశమునందంతట వ్యాపించి జనాదరమును బడయునో ఆనాడే విద్యయనునది కళాశాలైకముఖమైనదను మూఢవిశ్వాసము మన మనస్సుల నుండి తొలఁగిపోయి, కళాశాల వినా విద్యకలదని మన జ్ఞాననేత్రమునకు గోచరించి యదార్థమగు విద్యయందును, విద్యావిధులయందును మన కాదర భావము కలుగును.

## సార్వజనిక పుస్తకాలయముయొక్క స్వభావము

సార్వజనిక పుస్తకాలయమనఁగా, సకలజనులకును సులభసాధ్యమైన ధర్మపుస్తక భాండాగారము. ఎచ్చోట కవికులాగ్రగణ్యులు తమ సహజ మృదుమధురలలితతర కవితామృత ధారల నవరసంబులం జిలికి పాఠకుల నానందవార్ధి నోలలాడింతురో, ఎచ్చట వీరాగ్రేసరులు తమ నిరుపమాన సాహసిక కథాప్రదర్శనములచే నెల్ల మానవుల యుల్లంబులనుండి యధైర్యపిశాచమును నిర్మూలించి, సత్కార్యాచరణమున నభినివేశము గలిగించు గ్రంధరాజములుండునో, ఎందు తత్త్వవేత్తలు ప్రాపంచక విషయముల యందలి అయదార్థజ్ఞానమును నశింపఁజేసి తమ సిద్ధాంతములచే సత్యమును బ్రకటింతురో, ఏ నెలవున శాస్త్రజ్ఞులు ప్రభుసమ్మితోపదేశములచే ధర్మంబును నాలుగుపాదముల నడపింతురో- ఏ మందిరమున బాలురును, యువకులును, వృద్ధులును, నేకరీతి విద్యాపరిశ్రమఁ జేయుట కవకాశముకలదో-అదియే సార్వజనిక పుస్తకాలయము; అదియే బాలురకు విహారస్థలము; చింతా క్రాంత చిత్తుల కూరడింపు నింపుతావు; గర్వోద్రిక్తులకు మహాంకుశము, అదియే విద్వాంసులుసమావేశమగు భవనము. అచ్చటవిద్యాగంధము వెదజల్లఁబడియున్నది. ఆ సుగంధము నొకసారి ఆఘ్రాణించిన వారు పమోహితులగుచున్నారు; వారి హృదయము లాకర్షింపఁబడు

చున్నవి. వారి చిత్తములు గ్రంథాలయము నుండి మరలించినను మరలకున్నవి. సారస్వతమునందే వారి హృదయతాపములు శాంతిని గనుచున్నవి. విద్యయందనురక్తి, తదితరముల విరక్తి, మైమరపు, ఆనందము–అంతయు వారిదే. గ్రంథాలయ ప్రభావము నేమని వర్ణింప వచ్చును!

## గ్రంథాలయ నిర్మాణము

గ్రంథాలయము బాలురును, యువకులును, వృద్ధులును, బీద సాదలును, పండితులును పామరులును, సర్వజనులును– ఉత్సాహ ముతో ననుదినమును సమావేశమయి, వినోదించు మందిరముగా నుండవలయునేగాని, గుడికి వేటపోతులను తోలినట్లు బలవంత పెట్టఁ బడి వచ్చు నల్పసంఖ్యాకుల సభ్యుల సంఖ్యను గలిగి,యెన్నటికిని నుండ రాదు. ఏ గ్రంథాలయ మనేక మంది సభ్యుల నాకర్షించునో, అదియే మంచి యారోగ్యదశయందున్నదని చెప్పవచ్చును.పుస్తకనిలయములు జనుల యుల్లంబుల నెటుల పల్లవింపఁజేయఁగలవు? దాని కనేక మార్గ ములు కలవు. సాధారణముగా బాలురకు పటములను జూచుటయం దును, క్రీడల యందును నాదరము మెండు. యువకులకు నవరసభరి తములగు కావ్యములయం దభిలాష. ప్రౌఢులకు శాస్త్ర పరిశ్రమ యందు సంతసము. కావున గ్రంథాలయమునం దిన్ని తరగతుల వారికి నుపయోగములగు పుస్తకము లుండవలయును. విద్యాగంధము లేని వారిని సైతము గ్రంథాలయమున కాకర్షించి క్రమముగా విద్యా గోష్ఠియం దాసక్తిని గరపుటకుఁ గ్రీడలు సమ్మోహనాస్త్రములు. కూర్చుండి యాడుకొను బుద్ధికుశలతయే ప్రధానముగాఁగల కొన్ని క్రీడలకు ప్రతిగ్రంథాలయమునందు నవకాశము గలిగించవలయును. ఒక మాటలో చెప్పవలెనన్న గ్రంథసామగ్రియొక్క– ఔచిత్యము గ్రంథనిలయము యొక్క– అభివృద్ధికి మూలకారణమని వచింప వచ్చును. బాలుర వినోదింపఁ జేయుటకు వస్తుసారబోధకము లగు ననేక చిత్రపటములు కావలయును. ప్రతి గ్రంథాలయము నందును సామాన్యజనులు సులభముగా కొని సంపాదింపఁజాలని విశేష

మూల్యముగల, నిఘంటువులు, విజ్ఞానసర్వస్వములు మొదలగునవితప్పక యుండవలయును; విద్యార్జనా జిజ్ఞాసువులు వాని నిమిత్తమైనను గ్రంథాలయమునకు రాకతప్పదు. ఈగ్రంథసామగ్రినంతయు తరగతుల వరుసగా గ్రంథాలయములయం దమర్చవలయును. ఇట్టి గ్రంథాలయములు ప్రతి పట్టణమందును ప్రతి పల్లెయందును నుండవలయును రాజధాని పట్టణమునందిట్టి యున్నమగు సార్వజనిక పుస్తకాలయ మొకటుండవలయును. కించి దూనములగు గ్రంథనిలయములు ప్రతి మండలము నందును, ప్రధాన పట్టణముల యందును నెలకొల్పవలయును. మండల గ్రంథాలయముల యాజమాన్యముక్రింద బ్రతి తాలూకా పట్టణమునందును నొక గ్రంథాలయ ముండవలయును. నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వములు మొదలగు గొప్ప గ్రంథములను జూచి విశేషవిషయముల గ్రహింపవలసిన యవసరము వచ్చినప్పు డొకతాలూకాలోని జనులు విశేషవ్యయప్రయాసములకు లోనై మరియొక తాలూకా పట్టణమునకుఁ బోనక్కర లేకుండ, ప్రతి తాలూకాయందును నెలకొల్పఁబడు గ్రంథాలయము సమగ్రమైనదిగా నుండవలయును. తాలూకా గ్రంథాలయము యొక్క యాజమాన్యముక్రింద ప్రతిగ్రామమునందును తగుపాటి పుస్తకనిలయమును స్థాపించవలయును. తుదకు రాజధాని యంతటను కొలదిదియో గొప్పదియో యొక గ్రంథాలయములేని యొక్క పల్లెయైన నుండరాదు. గ్రంథాలయము లిట్లు దేశము నందంతటను నల్లిబిల్లిగ నల్లుకొనిపోవలెను. మండల గ్రంథాలయచంద్రబింబమునకు, ప్రతి తాలూకా గ్రంథాలయము నొక్క కళగాఁ దలంచవలయును. గ్రామ గ్రంథనిలయములు, తాలూకా గ్రంథ నిలయములవారి యాజ్ఞకు బద్ధులైయుండవలయును. తాలూకా గ్రంథనిలయములు మండల గ్రంథనిలయములవారి యాజ్ఞానుసారముగ బ్రవర్తించుచుండవలయును. మండల గ్రంథాలయములు రాష్ట్రగ్రంథాలయము వారియాజ్ఞకు బద్ధములై యుండవలయును. రాజధానిలో గల సర్వగ్రంథాలయములకు నొక్కటే శరీరమనియు, మండల గ్రంథాలయములన్నియును దానికి వేర్వేరు అంగములనియు

దలంప వలయునేగాని. ప్రతి పట్టణమునందును ప్రతి పల్లెయందును గల గ్రంథాలయము లొకదానితో నొకటి సంబంధములేని స్వతంత్ర నిలయములుగా దలంపరాదు.

## క్రొత్త పుస్తకములు

"క్రొత్త యొక వింత ప్రాతయొక రోత" యను సామెతను మనము వినియున్నాముగదా! ఈసామెత గ్రంథాలయముల విషయమై బాగుగా వర్తించును. క్రొత్తపుస్తకములను కొనినప్పుడు మొదట నాలుగురోజులుత్సాహముతో జరుపుటయు, పిమ్మట వాని నేమూలనో పడవైచి వాని మొగమైన జూడకుండుటయు మనలో నసేకుల కనుభవములోనిదే. గ్రంథాలయములయందును క్రొత్త పుస్తకములను గొనినప్పుడు చదువరుల కుత్సాహముగా నుండును. తరువాత నేడు చూచిన పుస్తకములే ప్రతిదినమును జూచుచు వచ్చినయెడల వారికి గ్రంథాలయమునం దాదరము తగ్గును. క్రమక్రమముగా నచ్చటి కెవ్వరును పోరనియే చెప్పవచ్చును. అందుచే గ్రంథాలయములయందలి పుస్తకములు తరుచు తరుచుగా మార్చుచుండుట మిక్కిలి యగత్యమైన పనియని మనకు ధృవపడుచున్నది. నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వములు మినహాగా, ప్రతి గ్రంథాలయమునందును తదితర గ్రంథములు సంవత్సరమున కొక్కసారినైనను మారుచుండవలయును. ప్రతి గ్రంథాలయమువారును బ్రతి సంవత్సరమును దమగ్రంథముల నమ్మివేసి క్రొత్తగ్రంథములఁగొనుట కెంతయో కొంత ద్రవ్యము కావలయును. సార్వజనిక పుస్తకాలయము లుచిత గ్రంథ భాండాగారములు గదా! ద్రవ్యమెక్కడనుండి వచ్చును? ఈసమస్యను పూర్తి జేయుట కిష్టసాధ్యమే. పైన నుదహరించిన గ్రంథాలయ నిర్మాణ కౌశలమువలన నిట్టి లోపమును నివారించవచ్చును. ఒక రాష్ట్రమునందు ఇరువది మండలము లున్నవనుకొనుడు. రాష్ట్రగ్రంథాలయాధికారు లీ సంవత్సర మొక మండలములోనున్న గ్రంథములను మరుచటి సంవత్సర మింకొక మండలమునకు మార్చవచ్చును. ఇట్లు మార్పులను జేయుటచే, ప్రతి మండలమునందును ఈ సంవత్సరము వచ్చిన పుస్తకములు మరల

ఇరువది సంవత్సరములకు వచ్చుటకు మాత్రమే యవకాశముగలు గును. ప్రతిసంవత్సరమును క్రొత్తపుస్తకములను జనువరులు బడయ గలుగుదురు. ఈ సంవత్సరము వచ్చిన పుస్తకములు మరల ఇరువది సంవత్సరములకు వచ్చినను అప్పటికి జనువరులు విశేషముగా మారు దురు. కావున, దానివలన నంతగాఁ గీడు గాన్పించదు. రాష్ట్ర గ్రంథాలయమువారును ప్రతిసంవత్సరమును ఆదాయముల ననుసరించి కొన్ని క్రొత్త పుస్తకములను కొనుచుండవచ్చును. ధనవ్యయ మవస రములేకయే ప్రతిసంవత్సరమును నిన్ని క్రొత్త గ్రంథముల నార్జించు టకు వేరేదైన సులభసాధ్యమగు మార్గమున్నదా? వీనికే సంచార గ్రంథాలయములని చెప్పవచ్చును. ఏలయన ప్రతిరాష్ట్రమునందును ఒక మండలమునుండి మరియొక్క మండలమునకును, ప్రతిమండలము నందును ఒక తాలూకా నుండి మరియొక తాలూకాకును, ప్రతి తాలూకాలోను ఒక గ్రామమునుండి మరియొక గ్రామమునకును, నిత్యమును విరామములేకయే గ్రంథములు సంచారము చేయు చుండును. ఇట్లు గ్రంథములు ప్రతిగృహస్తుని యింటి ముంగిటకును దెచ్చియిచ్చుట కవకాశము కలుగును.

## గ్రంథాలయాధ్యక్షుడు

గ్రంథాలయముల కార్యనిర్వాహక క్రమమునుగూర్చి పైన ముచ్చటించితిమి. ఇఁక గ్రంథాలయాధ్యక్షు లెట్లుండవలయునో యించుక సూచించెదము. గ్రంథాలయాధ్యక్షుఁడనఁగా గ్రంథాలయ మున నిత్యమును జనువరులకు సహాయముఁజేయుచుండు నధికారి. గ్రంథసామగ్రి నంతయు నీతని యధీనములో నుండును. ఈతనికి గ్రంథాలయముల లాభనష్టములతోఁబనిలేదు. కార్యనిర్వాహక సంఘ సభ్యులచే నీతఁడు నియమింపఁబడును. వేతనమునకుగాని లేక గౌరవార్థముగాఁగాని యీ యుద్యోగపదవి నీతండలంకరింపవచ్చును. ఇతఁడే యనుదినమును చదువరులకుఁ బ్రసన్నతతో బ్రత్యక్ష మగు చుండువాడు. చదువరుల కేగ్రంథములు కావలసినను నేవిషయములఁ దెలిసికొనవలసి వచ్చినను ఈతనినే యడుగవలసి యుండును. గ్రంథా

లయాధ్యక్షుఁడనఁగా గ్రంథములఁ దన యధీనములోనుంచుకొని, యడి గినవారికిచ్చుచు మరలఁ దీసికొని జాగ్రతపరచు వాఁడు మాత్రమే కాదు. గ్రంథాలయాధ్యక్షుఁడనఁగా, గ్రంథములన్నిటిని తాను స్వయముగాఁ జదివినవాఁడై, యే చదువరుల కేసందియములు వచ్చినను దాను తీర్పఁగలుగుటయేగాక, బాలురకును యువకులకును ఏయే గ్రంథములఁ జదువవలెనో సూచించుచు, నిఘంటువులు, విజ్ఞానసర్వస్వములను నెట్లుపయోగించవలెనో బోధించుచు, ఏయె పుస్తకముల నేయేవిషయములుగలవో యుపన్యసించుచు, చదువరులకు సర్వదాఁ గొత్త గ్రంథములఁ జదువుటయం దభినివేశముఁ గలిగించుచుండు వాఁడుగా నుండవలయును. చదువరులయందు గొందరు స్త్రీలుందురు గావునను, అంతెగాక బాలుర లాలించి విద్యఁగరపుటకుఁ బురుషుల కన్న స్త్రీల కెక్కువ సామర్థ్యముగలదు కావునను, అధ్యక్షపదవి యందుఁ గొందరు స్త్రీలనుగూడ నవసరమును బట్టి యేర్పరచుటయు యుపయోగకరము. అధ్యక్షుఁడెల్లప్పుడును శాంతస్వభావము కలవాఁడుగా నుండవలయును. ప్రియమైనవాక్కు గలిగియుండవలెను. కాని చదువరులతో వివాదపడువాఁడుగా నుండుచో గ్రంథాలయమున కెవ్వరునుఁ జదువరులు చేరరు. చదువరులయం దాదరము కలవాఁడుగాను, వారి విద్యాభివృద్ధికై సదా చింతించుచుండువాఁడుగాను నుండవలయును. అతడు మాటలయందు మాధుర్యమును సరళత్వమును గలిగియుండవలెను గాని పరుషత్వము బనికిరాదు. ఆతని ముఖవర్చస్సును జూచినతోడనే, చదువరులకాతఁడేమో గొప్ప విద్యావంతుఁడనియు, నందరును నాతనినే యుదాహరణముగాఁ గ్రహించి, పరిశ్రమఁజేసి విద్యనార్జించవల యుననియు, తోపింపఁజేయువాఁడుగా నుండవలయును. తాను మాట్లాడు ప్రతివిషయమునందును నేకోమొక్క గ్రంథమున నుదాహరణము లిచ్చుచుఁ జదువరుల నా గ్రంథములఁ జదువుడని ప్రోత్సహించుచుండవలయును. ఈ గుణములే యధ్యక్ష పదవిని వహించిన స్త్రీల యందును వర్తించవలయును. గ్రంథాలయముల యుపయోగమును నధ్యక్షుల సామర్థ్యముల ననుసరించియే

యుండును. కావునఁ బ్రతి గ్రంథమందిరమును గ్రంథసామగ్రిని సమకూర్చుటకంటె, తగిన యధ్యక్షుని సంపాదించుటయందు నెక్కువ శ్రద్ధ తీసికొన వలయును. గ్రంథాలయాధ్యక్షుఁడు స్థానిక విద్యాశాఖవారితో పరిచయముఁగలిగి, వారి మూలమున విద్యార్థులకు దనగ్రంథములఁ జదువుకొన నిచ్చుచు, వారల దన గ్రంథాలయమునకు రప్పించుకొనుచు, వారల కుపన్యాసములిచ్చుచు, గ్రంథపఠనమునందు వారికభిరుచిని గలిగించవలెను. తీరిక యైనప్పుడెల్ల విద్యార్థులను తన గ్రంథాలయమునకు దీసికొనివచ్చి వారికి పాఠముల జెప్పుటకును, ఉపన్యాసముల నిచ్చుటకును ఉపాధ్యాయులను బ్రోత్సహించ వలెను. ఇట్లు విద్యార్థిసంఘమునకు సేవజేయుట పవిత్రకార్యముగా గ్రంథాలయాధికారి తలంచవలెను.

## శాస్త్రీయ గ్రంథములు

సార్వజనిక పుస్తకాలయమనగా నేవో కొన్ని నాటకాలంకార గ్రంథములుగల నిలయముగాఁ దలంపరాదు ఒక కృషీవలుఁడు వ్యవసాయ విషయములఁ దెలిసికొనఁగోరును. ఒక వర్తకుఁడు వాణిజ్య సౌలభ్యముల నెఱుంగఁగోరును. ఒక యాత్రికుఁడు విదేశ గమన మార్గముల నభిలషించును. ఒక శిల్పి గృహోపకరణముల గూర్చి వివిధవిషయముల నెఱుంగ గోరును. వేయేల? ఎవరేవిషయముల దెలిసికొన గోరినను తాము గ్రంథాలయమున కరిగినచోఁ దెలిసికొన గలమనుకొను నట్లుండవలయును. గ్రంథాలయముల యందు ఎచ్చట నేవస్తువులు దొరకునో చూపు వివరణపట్టీలను జాగ్రతపరచియుంచ వలయును. అవసరమైనవారికెల్ల ఆయావిషయములగూర్చి గ్రంథాలయాధ్యక్షుఁడు తగిన సలహాల నిచ్చుచుండవలెను. కృషి, వాణిజ్యము, శిల్పము, మొదలగు ప్రత్యేక విషయములను గూర్చిన గ్రంథములు గ్రంథాలయములో నుంచవలయును. ఏగ్రంథములనైనను— అడిగినప్పుడు లేవనినచో, చదువరులకు నిరుత్సాహము కలుగును. గ్రంథాలయాధ్యక్షుఁడు పాఠకుల కెన్నఁడును ఉత్సాహభంగమును గూర్చరాదు.

## పత్రికా ప్రకటనము

గ్రంథాలయముల యభివృద్ధి గ్రంథ సామాగ్రియొక్క ఔచిత్యముననుసరించి యుండునని ముందు వచియించి యుంటిమిగదా! ప్రతిదినమును బ్రచురింపఁ బడుచున్న గ్రంథములను విమర్శించి, యందుచితమైన వానిని చదువరులకు దెలియబరచి దుష్టకావ్యముల ఖండించి, సద్గ్రంథవ్యాపనమునందు గ్రంథకర్తలకు దోడ్పడుటయు కుకవుల దలనెత్తనీకుండుటయు, గ్రంథాలయాధికారియొక్క పవిత్ర ధర్మము. గ్రంథములను దనకుఁబంపిననే విమర్శింపవలయునని గ్రంథాలయాధికారికి నియమములేదు. ఎచ్చట నే గ్రంథము ప్రచురింపఁబడినను, తన స్వంతద్రవ్యమును వెచ్చించియైనను దెప్పించి, దానిపైఁ దన నిష్పక్షపాతమగు నభిప్రాయమును బ్రకటించి పాఠకలోకమునకు మహోపకారమును జేయుట గ్రంథాలయాధ్యక్షునికి విధాయకమైన కృత్యము. ఇట్లు గ్రంథవిమర్శనము జేయుటకును, గ్రంథాలయముల ప్రస్తుతాభివృద్ధినిఁ బ్రచురించుటకును, బురోభివృద్ధికరములగు విషయములఁ జర్చించుటకును సర్వ సార్వజనిక గ్రంథాలయముల పక్షమున నొక పత్రికాప్రకటన మావశ్యకము.

---

1914 వ సంవత్సరమున ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ పక్షమున ప్రచురింపబడిన చిఱుపుస్తక సారాంశ మిందు ప్రచురితము.



# ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమస్రవంతి - స్వరూప స్వభావములు



## ఆంధ్ర గ్రంథాలయోద్యమము - సింహావలోకనము

### ఉపక్రమము

గంజాము - విశాఖ పట్టణ మండలముల గ్రంథాలయ మహాసభకు నన్ను అధ్యక్షతవహింపుమని యడుగుటతోడనే నా కాశ్చర్యము గలిగినది. ఇది నాయకు లాక్రమింపవలసిన స్థానము కాని నాబోటి గ్రంథాలయ సేవకు డాక్రమించ వలసినది కాదు.

అయితే, ఈ మండలముల అగ్రసేవకుడగు శ్రీ తిత్తి బలరామయ్యగారు ఈ అధ్యక్షపదవిని వహించుటకు తనబోటి సేవకునే సూచించుట, తన సేవయందు వారికిగల గాఢాభిమానమునే సూచించుచున్నది. నే నెల్లప్పుడును సేవకులలో నెల్ల అగ్రసేవకుడనై యుండుటకే వాంఛించుచుందును. అట్టి అగ్రసేవకునకు మీ యందరికంటె ఉన్నతాసన మొసంగుట భావ్యముగాదు. కాని ఈ గౌరవము నాకు వ్యక్తిగతముగా గాక నే సేవజేయు గ్రంథాలయోద్యమమున కొసంగబడినదని పరిగణించి మీ యాహ్వానమును శిరసావహించితిని. కావున నే జెప్పు విషయములయందు గల లోపములను మన్నించి యొప్పులనే స్వీకరించెదరని దోసిలొగ్గి ప్రార్థించుచున్నాను.

### ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము స్వయంభువు

వ్రతములలో నెల్ల నేది ఉత్తమము అని నిరంతరము వాగ్వివాదములు జరుగుచుండును. ఇపుడు మన మాలోచించవలసినది ఉద్య

మములలోనికెల్ల నేది ఉత్తమము అను విషయము. ఏవ్రత మాచరించి నను మోక్షమును బొందుట కేమియు అభ్యంతరములేదు. కాని ఆయా వ్రతములయందు తారతమ్యము లుండును. అందులో పిల్లవ్రతము లుండును; తల్లి వ్రతము లుండును. తల్లివ్రతములలో పిల్లవ్రతములన్నిం టికిని ప్రాతిపదిక లుండును. అదేరీతిని ఉద్యమములలో కెల్ల మూలకంద ముగనున్నది– ఉద్యమము లన్నిటికిని జీవదాయకమైనది– ఉద్యమము లన్నిటికంటె జ్ఞానదాయకమైనది– గ్రంథాలయోద్యమము.

ఇన్ని గర్భితశక్తులుగల ఈ మహోద్యమము ఆంధ్రదేశమునం దెట్లు ఉద్భవ మందినది ! ఎప్పుడు ఉద్భవ మందినది ! అను విషయ మును పరిశీలించ వలయును.

అభివృద్ధిదాయకములగు విషయము లన్నియు పాశ్చాత్య సంసర్గము కలిగిన పిమ్మటనే మనదేశమందు ఆవిర్భవించినవని మనలోచాలమంది యొక్క భావము. దానియొక్క సత్యాసత్యములను చర్చించుటకు నే నిప్పుడు పూనుకొనలేదు. అయితే– గ్రంథాలయో ద్యమమునకు మాత్రము ఈ భావము జాతిగా అన్వయించదని ఘంటాపథముగ జెప్పగలను.

ఆంగ్లేయ భాషాసంసర్గము – ఆంగ్లేయ సంప్రదాయ సంసర్గము ఏమాత్రమును లేని వ్యగ్రోత్సాహులగు యువకుల వలననే ఈ యుద్య మము ఆంధ్రదేశమున జన్మించి వ్యాపించినది. అందువలన ఈ యుద్య మము "స్వయంభువు" అని చెప్ప సాహసించుచున్నాను. స్వయంభువు అనగా ఇతరులచేత ప్రారంభింపబడినది గాదు. తనకు తానే ఆవిర్భవించినది.

## ఆంధ్ర గ్రంథాలయోద్యమాదర్శము

ఆంధ్రదేశమున ప్రారంభింపబడిన ఈ వందలకొలది ధర్మ గ్రంథాలయములను స్థాపింపవలెనని ఎవరుపదేశము చేసిరి? ఈ సంఘ ములను స్థాపించినవారలెవరు ? దొరతనమువారివలన బిరుదులను సంపాదించు ఆశయా వీరికి ఈ యుద్యమమందు అభిరుచిని గల్పించి నది! ధనవంతుల మన్ననలవలననా ఈ యుద్యమము బయలుదేరినది!

లేక దరిద్రుల యొక్క ద్రవ్యాభిలాషయా ఈ యుద్యమమునకు గారణము! ఈ గ్రంథాలయ స్థాపకులను సంరక్షకులను ఈ యుద్యమ విషయమై పూనుకొనుటకు బ్రేరేపించిన మహాశక్తి యెద్ది? ఇందుకు ప్రతిఫలముగ ఈ యుద్యమ సేవకులు బడయగోరు మన్నన యెద్ది? వీరు వాంఛించు ఫలమేమి!

ఈ యంశములను గూర్చి కొంచె మాలోచించిన యెడల ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము యొక్క స్వరూప స్వభావములు కొంతవరకు బోధపడగలవు.

## స్వయం తీర్ణః పరాం స్తారయతి

ఈ యుద్యమమునకు ప్రేరణము-తాము బాగై తమతోడివారలను బాగుచేయవలెనను మనుష్య స్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛయే. ఈ యుద్యమ ప్రచారకులు కోరు ఫలము తమకును తమతోటి వారికిని గలుగు జ్ఞానాభివృద్ధివలన పొందెడు ఆనందమే. ఈ యుద్యమమును పురికొల్పు మహాశక్తి-ప్రపంచాభివృద్ధి కొరకు అప్పుడప్పుడు ఆవిర్భవించు మహోద్యమములను పాదుకొల్పి వానికి జవసత్వములను గల్పించు - ఈశ్వరప్రేరిత శక్తియే. ఈ యుద్యమ ప్రచారకులు తాము ఈశ్వర ప్రేరితులమనియు ఈశ్వరోద్దిష్ట కార్యములను తాము నెరవేర్చుచున్నామనియును దృఢతరభక్తి పూరితులై యున్నారు.

ఈ యుద్యమము ఇతర ఉద్యమములవలె మూడునాళ్ళ ముచ్చటతో బోవునదిగాదు. ఇది నాయకుల యధీనమునందున్న యుద్యమమునుగాదు. గ్రంధాలయములు తాత్కాలికముగ ప్రారంభింపబడి స్వల్పకాలము నిర్వహింపబడి మూయబడునవి కావు. వానియందు సంవత్సరము పొడుగునను పనిజరుగుచునే యుండును. నవోత్సాహ పూరితులైన యువకులే ఈ యుద్యమమునకు మూలకారకులై యున్నారు.

## ఉద్యమమునకు ఆదర్శమే ప్రాణము

ఏ యుద్యమమైనను సరియైన మార్గముల నవలంబించి, అందు

లకు నిర్ణీతమగు పనిని నిర్వర్తించవలెనన్న - ఆ యుద్యమావలంబకు లకు అందలి ప్రాప్యముల స్వరూప స్వభావములును ఆ యుద్యమము నకును తోటి యుద్యమములకునుగల యన్యోన్యసంబంధ విజ్ఞానమును దృఢముగ నుండి తీరవలయును.

ఏ యుద్యమమునకైన ఆదర్శమే ప్రాణము. ఆదర్శములేని యుద్యమముప్రాణములేని రూపము. ఆదర్శములేని యుద్యమములు వృద్ధి బొంద వలెనన్నచో తమయందు స్వాభావికముగానున్న జవసత్వ ముల మీదయాధారపడక, సతతము పరాపేక్షను బొందియుండును. పైనుండి వచ్చు సహాయము ఎప్పుడు తగ్గునో, అట్టి యుద్యమ మప్పుడే భగ్నమైపోవును. అట్లుగాక ఆదర్శముతోగూడిన యుద్యమము ఈశ్వర దత్తమగు సంపూర్ణ స్వాస్థ్యముతో గూడిన జీవికవలె దినదినాభివృద్ధి గాంచును.

ఆదర్శము యొక్క శక్తి వర్ణింపదరముగాదు. అది మహత్తమము. ఆదర్శము నేకాగ్రచిత్తతతో ధ్యానము చేయుచుండినయెడల కార్యాచరణయందు వచ్చిన కష్టములన్నియు సుఖములుగా పరిణమించి కార్యదీక్షను ప్రజ్వలింపజేయును. కావున ఈ యుద్యమము యొక్క ఆదర్శమును బాగుగా గుర్తెరుంగవలెను.

## ఆదర్శ నిర్వచనము

ఇతర దేశముల యందలి గ్రంథాలయోద్యమము లన్నియు మనుజుని మేధాశక్తిని వృద్ధి నొందించుటకే ప్రయత్నము లొనర్చుచుండ, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము మనుజుని సంపూర్ణ మనుష్యత్వమును వ్యక్తీకరించుటకు తగిన సాధన సామగ్రి నంతయుసమకూర్చుకొని యున్నది. మన యొసంగు జ్ఞానము నిద్రాణమైయున్న ఆత్మ నుద్దీపింపజేసి, పౌరునికి గావలసిన సన్మార్గజీవనమునకుగొని పోవునదిగ నుండవలయును. కావుననే మన యుద్యమము యొక్క ఆదర్శము దేశమునందు జ్ఞానాభివృద్ధిని గలుగజేసి, మనుజుని జీవయాత్ర పవిత్ర వంతముగను చతుర్విధ పురుషార్థ సాధకముగను చేయుటయే యై యున్నది.

ఈ ఆదర్శమును ఎల్లప్పుడును దృక్పథమునందుంచుకొని, ఈ యుద్యమ పక్షమున జరుగు ప్రతి పనియును ఈ ఆదర్శమును కార్య రూపమున బెట్టుటకు తోడ్పడుచున్నదియు లేనిదియు తెలిసికొన వలెను. ఈ ఆదర్శము కార్యరూపము దాల్చవలెనన్నచో, మనము అవలంబించవలసిన మార్గములు కేవలము అనుకరణ రూపమున నుండ గూడదు.

పాశ్చాత్యదేశముల యందలి ఉద్యమములను- ఉన్నవి యున్నట్లు మనదేశమున నాటుటకు ప్రయత్నించినయెడల, మనదేశ మునం దవి వృద్ధిచెందనేరవు. కావున మన సంప్రదాయములను బట్టియు, మనదేశీయుల యలవాట్లను బట్టియు, ఇతర పరిస్థితులను బట్టియు, ఇచటి యుద్యమము లు ప్రచలితమగుచుండవలయును. అవి సజాతీయములుగ నుండవలెను. విజాతీయములుగ నుండరాదు. అట్లని పాశ్చాత్యదేశములయొక్క అనుభవములను మనము దీసికొన రాదను వారుండరు; కాని అట్టి యనుభవములకు మనము దాసులమై మన రూపు మారరాదు, ఆ యనుభవములే మనకు దాస్యము వహించి మన యుద్యమముయొక్క సౌష్ఠవమునకు, సౌందర్యమునకు దోహదదాయకములై యుండవలయును.

## దేవాలయములు - భుక్తి ముక్తి దాయకములు

మనుజునియొక్క సంపూర్ణ మనుష్యత్వమును వ్యక్తీకరించుటకు మన పూర్వులు దేవాలయములు- గ్రామసంఘములు - ఉత్సవములు పండుగలు - తీర్థయాత్రలు - భజనలు-హరికథలు - జంగమకథలు- తోలుబొమ్మలు- మున్నగు అసంఖ్యాకములగు ప్రతిష్ఠాపనలను నెల కొల్పి యున్నారు.

ఇట్టి ప్రతిష్ఠాపనల యందెల్ల అగ్రగణ్యమైనది దేవాలయము. అది కళలకు కాణాచి; శిల్పములకు నెలవు; నాట్యమునకు నిలయము; భక్తులకును వేదాంతులకును నివాసభూమి; గ్రామప్రజలకు పెండ్లిపందిరి; భారతీయ సర్వసంస్కృతీ సంవర్ధక సంస్థానము. అచ్చోటికి ఆకర్షింప

బడుచు అందరు జనులును భుక్తియు ముక్తియు సాధించెదరు. సర్వ జాతీయ ప్రతిష్ఠాపనలకును సంగమస్థానము దేవాలయము.

దైవీ సంపత్తిని నిత్యనైమిత్తిక ప్రజా జీవితములోనికి స్వాభావికమైన మార్గమున, చొచ్చుకొనిపోవునటుల యెల్ల వేళలయందు ప్రసారముచేయు "రేడియో స్టేషనులే" మన దేవాలయములు; భారతీయసంప్రదాయములో ఆధ్యాత్మికము, భౌతికము, అను రెండు విభాగములు ప్రత్యేకముగా లేవు; ఒకదానిలో మరియొకటి ఇమిడియే యున్నది. భౌతికమునందు ఆధ్యాత్మికత మేళవించి సమశ్రుతిలో ఒడుదుడుకులు లేకుండగ నడపుటయే, భారతీయమైన, ప్రజాసామాన్యముయొక్క నిత్యజీవిత స్రవంతియై యున్నది.

## గ్రామ సంఘములు

గ్రామ సంఘములుగూడ మనదేశ చరిత్రయందు మిక్కిలి ప్రముఖమైన స్థానమును వహించి యున్నవి. ప్రాచీనకాలమునుండియు గ్రామముయొక్క సమస్యలెల్ల, ఈ గ్రామ సంఘములచేతనే పరిష్కరింపబడు చుండెను. ప్రస్తుతము ప్రచారమందున్న పురపాలక సంఘములవలెనే, గ్రామముయొక్క పాలన విధానమును గ్రామసంఘములే నిర్వహించుచుండెను.

కాలక్రమేణ దేవాలయమును గ్రామసంఘములునుగూడ తమ పటుత్వమును గోల్పోయినవి; ఇప్పుడు ధర్మగ్రంథాలయములు — ఈ కాలమునకు అనుగుణ్యముగ, ఈ ద్వివిధములైనప్రాచీన ప్రతిష్ఠాపనలయొక్క స్థానమును ఆక్రమించవలయును.

ఇంతవరకును ఆంధ్రగ్రంథాలయోద్యమ సిద్ధాంతములను గురించి ముచ్చటించితిని. గ్రంథాలయోద్యమ చరిత్రను గొంతవరకు దెలిసికొందము.

## ఆంధ్రదేశమున ధర్మగ్రంథాలయ ప్రాదుర్భావము

ఆంధ్రభాషకు అచ్చుఅక్షరములు 1806 వ సంవత్సరమున

తయారు చేయబడినవి. 1834 వ సంవత్సరమునందు ఆంధ్ర గ్రంథములు విరివిగ అచ్చుపడుట ప్రారంభమైనది ♦ చరిత్ర పరిశోధన వలన మనకు తెలిసినంతవరకు ఆంధ్రదేశమున ప్రారంభింపబడిన మొట్ట మొదటి సార్వజనిక గ్రంథాలయము 1886 వ సంవత్సరమున విశాఖపట్టణమున స్థాపితమైన "సరస్వతీ నిలయము". ఈ గ్రంథాలయము అంతకుపూర్వము కొన్ని సంవత్సరముల క్రిందటనే స్థాపింపబడి యున్నను, ఆ సంవత్సరమునందు మాత్రమే అది సార్వజనికమై యొప్పినది. గ్రంథాలయ మన్నను, అందును సార్వజనిక గ్రంథాలయ మన్నను, బొత్తిగా తెలియని ఆ దినములందు ఆంధ్రదేశమందు సార్వజనిక గ్రంథాలయ స్థాపన మొనర్చిన మహామహుని నామము ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖియింపబడు ననుట కెంతమాత్రమును సందియము లేదు. ఆ మహామహుడు గొప్ప ధనవంతుడా? కాదు! గొప్ప విద్యావంతుడా? కాదు! సామాన్యమైన బీద ఉపాధ్యాయుడు. కాని గొప్ప ధనవంతులు కాని, విద్యావంతులుగాని చేయజాలని మహాత్కార్యమును ఈ మహానుభావుడు సాధించి ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు పునాదిని వేసినాడు. వీరి నామధేయము శ్రీ మంతెన ఆదినారాయణమూర్తి.

పిమ్మట కడప జిల్లా పులివెందులలో "సరస్వతీ గ్రంథాలయము" స్థాపింపబడినది. ఆంధ్రదేశమున బయలుదేరిన మొదటి రెండు గ్రంథాలయములకును "సరస్వతీదేవి" పేరున నామకరణ మగుట ఆంధ్రుల ప్రతిభావిశేషమునకు వన్నెదెచ్చుచున్నది. తరువాత 1890 వ సంవత్సరమున గుంటూరుజిల్లా వంగోలులో సి. వి. యన్. లైబ్రరీ స్థాపింపబడినది, పిమ్మట 1894 వ సంవత్సరమున విజయనగరమున "సింహాచలపతిరావు" లైబ్రరీ వెలసినది. 1895 వ సంవత్సరమున భీమవరం తాలూకా "ఉండి" గ్రామమున "నారోజీక్లబ్బు" ను, 1897 వ సంవత్సరమున ఆ తాలూకాయందలి "కుముదవల్లి" అను

♦1827వ సంవత్సరమున తెలుగులిపిలో అచ్చయిన ప్రథమగ్రంథము 'శబ్దమంజరి.'

గ్రామమున "వీరేశలింగ సమాజ" మును స్థాపింపబడినవి. •
1899 వ సంవత్సరమున తెనాలి తాలూకా "కొల్లూరు" గ్రామమున "రీడింగు క్లబ్బు" నెలకొల్పబడినది. 1900 వ సంవత్సరమున గుంటూరు పట్టణమునందు యువకులు "సాహితీ సంఘమును" "ఎంగుమెన్సు లిటరరీ అసోసియేషను"ను స్థాపించిరి. ఆ సంవత్సరముననే రాజమహేంద్రవరమున "వీరేశలింగ పుస్తక భాండాగారము"ను వెలసినది. 1901 వ సంవత్సరమున నైజాము రాష్ట్రమునందలి హైద్రాబాదు పట్టణమున "కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము" స్థాపింపబడినది. పిమ్మట యావదాంధ్ర దేశమందును సార్వజనిక గ్రంథాలయములు పొడసూపసాగినవి. 1911 వ సంవత్సరమున కృష్ణాజిల్లాలో బెజవాడ పట్టణమున శ్రీరామమోహన గ్రంథాలయము స్థాపింపబడినది. 1913 వ సంవత్సరమున ప్రథమ "ఆంధ్ర మహాసభ" బాపట్లయందు జరిగినది మొదలు ఆంధ్రులయందు నూతన తేజము వికసింపసాగినది. అప్పటినుండియు గ్రంథాలయములును పఠనమందిరములును గూడ విరివిగా స్థాపింపబడసాగినవి.

## ఉద్యమ విస్తరణము

ఇట్లు స్థాపింపబడిన గ్రంథాలయములలో కొన్ని స్త్రీల యుపయోగమునకై ప్రత్యేకముగ స్త్రీలచే స్థాపింపబడినవియు గలవు. పెక్కు గ్రంథాలయములందు పురుషులును, స్త్రీలునుగూడ సామాజికులుగనున్నారు. ఈ గ్రంథాలయము లన్నిటియందును జనసామాన్యమునకందరికిని ఉచితముగ గ్రంథములను వార్తాపత్రికలను ఉపయోగించు అధికారముగలదు. కొన్నింటికి స్వంతభవనములు గలవు. కొన్ని గ్రంథాలయములు రాత్రిపాఠశాలలను నిర్వహించుచున్నవి. వివిధ

---

• 1898 వ సంవత్సరమున రాజా భుజంగరావు బహద్దర్ జమీందారువారు తమ పట్టాభిషేక సమయమున "శారదా విలాస" మను గ్రంథభాండాగారము నేర్పరచెను. (నందిరాజు చలపతిరావు - అయ్యంకివారి సన్మాన సంచిక 129.వ పేజీ)

విషయములను గూర్చి జనులకు సుబోధకములగు రీతిని ఉపన్యాసము లిచ్చుట అన్ని గ్రంథాలయములకును సర్వసామాన్య విషయము. ఇదియునుగాక చదువుకొనజాలనట్టియు, చదువునందు వాంఛలేనట్టియు, జనుల ఉపయోగమునకై పురాణపఠనము. జంగము కథలు, భాగవత ప్రదర్శనములు- మొదలగు పలువిధములైన పూర్వ సంప్రదాయ సిద్ధములైన మార్గములు అవలంబింపబడుచున్నవి. మరియు గ్రామ పారిశుద్ధ్య ప్రయత్నములు ప్రదర్శనములు, బహుమతి పరీక్షలు, గ్రంథముల కరపత్రముల ప్రకటనము - ఇత్యాది ప్రయత్నములుగూడ జరిగినవి.

## ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము-
## అది సాధించిన కార్యములు

ఆంధ్రదేశమునందు ఇట్లు బయలుదేరుచున్న వివిధ గ్రంథాలయముల యందు సోదర భావమును గలుగజేయుటకును, పరస్పర సహకారమును నెరపుటకును, ధర్మగ్రంథాలయ మహావృక్షము ఆంధ్రదేశమునం దెల్లెడల తన వేరులను బాదుకొని యూడలను ప్రసారింపచేయుటకుగాను-1914వ సంవత్సరమున బెజవాడ యందున్న శ్రీ రామమోహన ధర్మగ్రంథాలయ నిర్వాహకులు ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభను సమావేశపరచినారు. ఆ సభకు సుప్రసిద్ధులగు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు అధ్యక్షత వహించినారు. కృష్ణా - గోదావరి - గుంటూరు - విశాఖపట్నము - గంజాం - నెల్లూరు - కడప - కర్నూలు - బళ్ళారి జిల్లాల నుండియు, నైజాము రాష్ట్రము యొక్క- ఆంధ్ర భాగము నుండియు ♦ అరవై గ్రంథాలయముల నుండి రెండు వందల మంది

---

♦ నైజామునుండి వచ్చిన ఈ దిగువ వారిని సంఘ సభ్యులుగా ఎన్నుకొనిరి. 1. శ్రీరామకోటీశ్వరరావు. వరంగల్. 2 శ్రీ భాగి సుబ్రహ్మణ్యం. సికింద్రాబాదు 3. శ్రీ ఆలూరి గురురాజారావు. హనుమకొండ (ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్ర 1915)

ప్రతినిధులు ఆ సభకువిచ్చేసిరి. అందు ధర్మగ్రంథాలయోద్యమము యొక్క వివిధదశలను గూర్చి సమర్థులగు వారిచే అనుభవపూర్వకము లగు ఉపన్యాసము లియ్యబడెను. ఈ సభయొక్క ఫలితముగ గ్రంథాలయోద్యమమును గూర్చి ప్రజలలో గాఢాభిమానము గలిగినది.

## సభలు - సమావేశములు

ఈ సభయందే, ఆంధ్రదేశమునం దంతటను గ్రంథాలయములను నెలకొల్పుటకును, నెలకొల్పిన వానిని పెంపొందింప జేయుటకు తగిన ఉత్సాహము నిచ్చుటకును "ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ"మను పేరున శాశ్వత సంఘము నొకదానిని ఏర్పాటుజేసిరి. ఆ సంఘమునకు ప్రథమ అధ్యక్షులు దివాన్ బహద్దరు మోచర్ల రామచంద్రరావు పంతులుగారు. ప్రథమ సభను గలుపుకొని అప్పటి నుండి నేటివరకు పదునాలుగు ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభలు వివిధ జిల్లాలయందు జరిగినవి. ఈసభలయొక్క ఆహ్వాన సంఘాధ్యక్షులుగను అధ్యక్షులుగను శ్రీరాజా పానుగంటి వేంకట రామారాయణింగారు, కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణా రావు బహద్దరుగారు, శ్రీరాజా విక్రమదేవ-వర్మగార్ల వంటి రాజ్యాధిపతులును- ఏ. పి. పాత్రో, భూపతిరాజు వెంకటపతిరాజు, స్వామి వెంకటాచలం శ్రేష్ఠిగార్లవంటి శాసన నిర్మాణ సభా సభ్యులును- దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, వేమవరపు రామదాసు పంతులు, గద్దె రంగయ్య నాయుడు, మాగంటి బాపినీడు గార్ల వంటి దేశనాయకులును- శ్రీయుతులు బాచు నరసింహారావు, చెంగయ్యపంతులు, దేశరాజు హనుమంతరావుగార్లవంటి సుప్రసిద్ధ న్యాయవాదులును- శ్రీయుతులు చిలకమర్తి లక్ష్మీనరసింహాం, చిలుకూరి వీరభద్రరావు, చెన్నాప్రగడ భానుమూర్తి, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, డాక్టరు బుర్రా శేషగిరి రావు, జనమంచి శేషాద్రిశాస్త్రిగార్లవంటి కవిశేఖరులును- శ్రీయుతులు సూరివేంకటనరసింహశాస్త్రి, బెల్లంకొండ రాఘవరావు, పురాణం సూరిశాస్త్రిగార్లవంటి గ్రంథాలయోద్యమ సేవకులును

గలరు. ఇట్టి మహామహుల ఆదరాభిమానముల వలనను మార్గదర్శ కత్వము వలనను గ్రంథాలయోద్యమ మొక ఒడుదుడుకులు లేకుండ ఇంతవరకు తన యాత్రను నిర్విఘ్నముగ కొనసాగించుచు వచ్చినది.

## గ్రంథాలయ శాస్త్ర శిక్షణ తరగతులు

కొంతకాలమైన పిమ్మట ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము 1860 సంవత్సరము 21 నెంబరు ఆక్టుక్రింద రిజిష్టరు చేయబడినది. పిమ్మట గ్రంథాలయ పరిచారకులను తయారుజేయుటకై ఒకమాసము దినములు తాత్కాలిక పాఠశాలను నిర్వహించితిమి. ♦ పల్లెటూళ్ళ సమస్యలును, గ్రంథాలయ పరిపాలనకును సంబంధించిన వివిధ విషయములనుగూర్చియు ఆయా విషయములందు పరిశ్రమ జేసిన సమర్థుల చే అనుభవపూర్వకములైన ఉపన్యాసము లియ్యబడినవి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపక్షమున అనేక యువకులు ఆంధ్ర దేశమందంతటను సంచారము జేసి, నూతనగ్రంథాలయములను స్థాపించుటకును, ఉన్న వానిని ఉత్తేజింప జేయుటకును పలువిధముల పాటుబడియున్నారు. వీరికి జీతములు లేవుగదా, బత్తెములుగూడ లేవు. 1914-వ సంవత్స రమునుండియు ఆంధ్రదేశమునందున్న అట్టి సోదర సేవకులయొక్క పరి శ్రమ ఫలితముగ 1914-వ సంవత్సరమునందున్న 163 ఆంధ్ర గ్రంథాలయములును నేడు 600 కంటె ఎక్కువ సంఖ్యగలవి యైనవి. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ నిర్మాతలు అనేకవందలమంది గలరు. అట్టి వారిలో నాకు జ్ఞాపకమున్నవారి పేర్లు నిట వివరింతును.

## గ్రంథాలయ సేవావ్రతులు

గంజాం జిల్లా - శ్రీయుతులు తిత్తి బలరామయ్య, జగన్నాథ పాడీ ఖడంగ, వ్యాపతి నారాయణమూర్తి, సింహాచలం, టంకాల సాంబమూర్తి, పోటూర్నారి స్వామి గారు

---

♦ ఈ సంపుటమునందే వేరొకచో "గ్రంథాలయశాస్త్ర శిక్షణతరగతులు" అను వ్యాసమున వివరములను చూడగలరు.

విశాఖపట్నం జిల్లా:- శ్రీయుతులు మారేపల్లి రామచంద్ర శాస్త్రి, ప్రిభల లక్ష్మీనరసింహాం, ముద్దా సోమప్పశాస్త్రి, వసంతరావు బుచ్చి సుందరరావు, శ్రీమతులు ఉప్పల నారాయణాంబ, తూర్పాటి సన్యాసమ్మ.

తూర్పుగోదావరిజిల్లా:- శ్రీయుతులు కళా వెంకట్రావు, యాతగిరి లక్ష్మీవేంకటరమణ, చింతపంటి వెంకటరమణయ్య, ఉద్దంకి సత్యనారాయణశర్మ, నాళం కృష్ణారావు, పులవర్తి భీమలింగమూర్తి, బిక్కాని వెంకటరత్నం, దంటు కృష్ణమూర్తి, యర్రమిల్లి జగ్గన్నశాస్త్రి, అడవి శంకరరావు, గాడేపల్లి సూర్యనారాయణ శర్మ, కావ్యనిధి చెలికాని లచ్చారావు, చెలికాని సూర్యారావు, వంగూరి సుబ్బారావు, మల్యాల వేణుగోపాలరావు, వేష్లూరి వేణుగోపాలదాసు, కొత్త బుచ్చిరాజు, కంభంపాటి సోమయాజులు, కోడేటి రంగాచార్యులు, శ్రీమతి బాలాంత్రపు శేషమ్మ.

పశ్చిమగోదావరిజిల్లా:- శ్రీయుతులు మాగంటి బాపినీడు, మంగిపూడి వెంకటశర్మ, పురుషోత్తమశర్మ సోదరులు, భూపతిరాజు తిరుపతిరాజు, మద్దుల వెంకటచిన్నంరాజు శ్రేష్ఠి. శనివారపు సుబ్బారావు, సిడదవోలు వెంకట్రావు, ఆత్మకూరు గోవిందాచార్యులు, తాడిమేటి కుటుంబశాస్త్రి, కాళ్ళకూరి నరసింహము, నిడమర్తి లక్ష్మీనారాయణ, పోడూరి పెరారాజు, అన్నదేవర నాగభూషణరావు.

కృష్ణాజిల్లా.- శ్రీయుతులు ఆరెకపూడి రామశాస్త్రులు, దుగ్గిరాల వేంకటసుబ్బయ్య, వల్లభనేని వేంకట్రావు, సాధు రామకృష్ణయ్య, గంపలగూడెం కుమారరాజా, పేట బాపయ్య, కొడాలి ఆంజనేయులు, గొట్టిపాటి బ్రహ్మయ్య, నోరి వెంకటేశ్వర్లు, గోపరాజు బ్రహ్మానందం, సూరి వెంకటనరసింహశాస్త్రి, అయ్యదేవర కాళేశ్వరరావు, మోటుపల్లి రాజాబాయమ్మ, చెరుకువాడ వెంకటనరసింహం, భోగరాజు పట్టాభి సీతారామయ్య, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, గుత్తా వీరయ్య అట్లూరి వీరయ్య, రాయప్రోలు సుబ్బారావు, కొడాలి శివరామకృష్ణారావు.

గుంటూరుజిల్లా - తాడంకి వెంకయ్య, పున్నయ్య, పులిపాక వెంకటరామారావు, అంచె శివయ్య, కుప్పా శ్రీరామశర్మ, కోలవెన్ను రామకోటీశ్వరరావు, పత్రి అనంతరావు వావిలాల గోపాలకృష్ణయ్య, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, చట్టి నరసింహారావు, బెల్లం కొండ రాఘవరావు, చెరువు సుబ్రహ్మణ్యం, శరణు రామస్వామి, చింతమనేని భావయ్య, బాలకవి తుమ్మల సీతారామమూర్తి, రామరాజు వీరేశ్వరరావు, అక్కిరాజు వాసుదేవరావు, మద్దుల గిరిరావు, గుంటూరు నరసింహారావు.

నెల్లూరుజిల్లా.-శ్రీయుతులు పొణకా పట్టాభిరామరెడ్డి, మన్నె పల్లి రామకృష్ణారావు, నెల్లూరు నగరాజారావు.

చిత్తూరుజిల్లా:- శ్రీయుతులు సి. వి. రంగం శెట్టి, బూసాకు రామానుజులురెడ్డి, శ్రీనివాసాచార్యులు.

అనంతపురముజిల్లా:- శ్రీయుతులు హట్టి శంకరరావు కలచవీడు వెంకటరమణాచార్యులు, యం. సన్నప్పనాయుడు, బెల్లాం రామదాసు నాయుడు, సిరిపి ఆంజనేయులు, కల్లూరు వెంకటసుబ్బారావు, పప్పూరు రామాచార్యులు.

కర్నూలు:- శ్రీయుతులు గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, కె. నరసింగరావు దేశపాండ్య సుబ్బారావు, కైప సుబ్రహ్మణ్యశర్మ, వావిలాల పరబ్రహ్మశాస్త్రి

కడప:- శ్రీయుతులు వేదము వెంకటకృష్ణశర్మ, భద్రి సీతారామయ్య, కె. గుండురావు, విరూరు పిచ్చయ్య, వెల్లాల రామకృష్ణ శాస్త్రి, గళ్లపల్లి పున్నయ్యశాస్త్రి

మద్రాసు:-శ్రీయుతులు కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు, టంగుటూరి ప్రకాశం పంతులు, వేమవరపు రామదాసు పంతులు, వి ఎల్. శాస్త్రి, వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రి, గోనుగుంట్ల వెంకట సుబ్రహ్మణ్యం, ఎన్. ఎస్ రాయను, చల్లా శేషగిరిరావు, పింజల సుబ్రహ్మణ్య శెట్టి, గద్దె రంగయ్య నాయుడు.

నైజాం:- శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, ఆలూరు గిరిరాజారావు, ఆదిరాజు వీరభద్రరావు, పింగళి వెంకటామారెడ్డి, మునగాల రాజా.

## గ్రంధాలయ సర్వస్వము - ఇతర ప్రచురణములు

ఈ సంఘపక్షమున గ్రంథాలయ సర్వస్వము అను పేరున కొన్ని సంవత్సరముల కాలము పత్రిక యొకటి ప్రకటింపబడినది. ఈ పత్రిక ఉద్యమ నిర్వాహకులకు అమితసహాయము మొనర్చినది. ఈ పత్రికకు ప్రతి సంవత్సరమును నష్టము వచ్చినను మానక పట్టుదలతో నిర్వహించితిని. దీనిమూలమున నవీన గ్రంథాలయోద్యమ తత్వమును ఉచ్చైస్వరముతో ఆంధ్రదేశమునందంతటను జాటి వ్యాపింపజేయ గల్గితిమి. ఇదిగాక కాకినాడ వాస్తవ్యులును గ్రంథాలయోద్యమము నందు నిరంతరమగ్నమానసులును నగు శ్రీ యాతగిరి లక్ష్మీవేంకట రమణగారు ధర్మగ్రంథాలయ పత్రికను విశేష వ్యయప్రయాసలతో కొంతకాలము నడిపి గ్రంథాలయోద్యమమందు వారికిగల గాఢాభిమానమును సువ్యక్తపరచిరి. మరియు వీరిచే రచింపబడిన "గ్రంథాలయోద్యమము" అను గ్రంథము ఆంధ్ర దేశ గ్రంథాలయసంఘముచే ప్రకటింపబడెను. (1 2 3) ఈ సంఘకార్యనిర్వాహక సంఘాధ్యక్షులైన శ్రీ సూరి వెంకట నరసింహశాస్త్రిగారు గ్రంథాలయోద్యమమును గూర్చిన ఉత్తమగ్రంథము నొకదానిని ఆంగ్లమున వ్రాసిరి.

ఆ గ్రంథమువలన ఆంధ్రగ్రంథాలయోద్యమ సిద్ధాంతమును, మన యుద్యమముయొక్క ప్రాశస్త్యమును భారతవర్షమునగల ఇతర రాష్ట్రములవారికి జాటగలుగుటయేగాక కొన్ని రాష్ట్రములందు ఈ యుద్యమబీజములనుగూడ నాటగలిగితిమి. ఇవియేగాక మరి కొన్ని గ్రంథములును కరపత్రములుకూడ ఈ సంఘముచే ప్రకటింపబడినవి.

---

1. సార్వజనిక పుస్తకాలయములు — 1914. 2. ఆంధ్రదేశ గ్రంథ భాండాగార ప్రతినిధుల మహాసభావృత్తాంతము — 10-4-1944. 3. ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్ర — 1944 వ సంవత్సర వృత్తాంతము — 1915.

## ఆంధ్రగ్రంథనామ చంద్రిక

ఆంధ్రమునందున్న గ్రంథము లన్నిటియొక్క గ్రంథనామ చంద్రికను తయారుచేయుటకై ఈ సంఘపక్షమున శ్రీ వెలిదండ్ల శ్రీనివాసరావు పంతులుగారు విశేషశ్రమను జేసి గ్రంథవిభజనపద్ధతిని ఒకదానిని తయారుచేసి షుమారు 3000 గ్రంథములను వర్గీకరణము చేసిరి. వీరు అంతవరకు జేసినపనిని ఇంకను ఎక్కువ సమర్థతతో నిర్వహించుటకై, శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు పూనుకొని విశేషవ్యయప్రయాసలతో దానిని పూర్తిచేసి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయిరి. కాని ఈ గ్రంథమందు అవలంబింపబడిన వర్గీకరణపద్ధతి నవీన గ్రంథాలయ శాస్త్రపద్ధతులకు అనుగుణ్యముగాలేదు. ఒక భాషయందలి గ్రంథములకు చక్కని శాస్త్రసిద్ధమైన వర్గీకరణ పద్ధతి యుండినగాని, ఆ భాషాగ్రంథములయొక్క సౌష్ఠవము, ఆభాష యందుండవలసిన గ్రంథముల ఆవశ్యకత బోధపడదు. అదిగాక గ్రంథాలయములందలి గ్రంథములు అభివృద్ధి జెందినకొలది గ్రంథములకు వేయుసంఖ్య మార్పు జెందక నుండవలెను. మరియు ఒకే విషయమునందున్న గ్రంథము లన్నియు ఒకచోటనే చేరునటుల కూడ చూడవలయును. అందులకై ఆంధ్రగ్రంథములకు అనువుగ నుండునటుల గ్రంథవర్గీకరణ పద్ధతిని ఒకదానిని సమకూర్చి బెజవాడ యందున్న రామమోహన ధర్మగ్రంథాలయము నందు కొన్ని వత్సరములనుండి అమలులో పెట్టి పరిశీలించితిని. ఆ పద్ధతి

---

4. ఆంధ్రదేశగ్రంథాలయ చరిత్ర – 1915 వ సంవత్సర వృత్తాంతము – 1916. 5. ధర్మగ్రంథాలయములు – 1918. 6. గ్రంథాలయోద్యమము – ఆంధ్రుల సిద్ధాంతము – 1918. 7. గ్రంథాలయోద్యమము – 1923. 8. మృగశీర్ష-లేక వేదకాల నిర్ణయము – 1923. 9 ఆంధ్రభాషా గ్రంథముల వర్గీకరణ పద్ధతి – 1934. 10 గ్రంథాలయ సర్వస్వము – 1915 నుండి 1937 వరకు 11 సంపుటములు ప్రచురింపబడినవి. 11. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘనివేదిక 12 భీమవరము తాలూకా గ్రంథాలయయాత్ర. 13 తాడేపల్లి గూడెము తాలూకా గ్రంథాలయ యాత్ర కార్యదర్శి సంచారకార్యక్రమము – 1936. 14. రేపల్లె తాలూకా గ్రంథాలయ యాత్ర – 1936

మిక్కిలి యనుకూలముగ నున్నది. అది బరోడా కేంద్రగ్రంథాలయము వా రవలంబించిన మాదిరి ననుసరించి తయారు చేయబడినది.

## స్థానిక సంస్థల ప్రోత్సాహము

1914 వ సంవత్సరమునకు పూర్వము గ్రంథాలయములను స్థాపించుటయు, పోషించుటయు స్థానిక స్వపరిపాలక సంఘములయొక్క విధులలోనిది కాదని ప్రభుత్వ వైఖరి సూచించుచుండెను. కొన్ని గ్రంథాలయములకు స్థానికసంస్థలు మంజూరుచేసిన విరాళములను ప్రభుత్వమువారు రద్దుపరచుటగూడ జరిగినది. అట్టి సమయమున బెజవాడ రామమోహన ధర్మగ్రంథాలయమువారు అప్పటి మద్రాసు ప్రభుత్వమునందు కార్యనిర్వాహక సభాసభ్యులుగా నున్న సర్ వి. యస్. శివస్వామి అయ్యరుగారికి ఈ సమస్యను గూర్చి విన్నవింపగా, వారు రామమోహన గ్రంథాలయ నూతన భవనమునకు పునాదిరాయిని వేయుచు గ్రంథాలయములను నిర్వహించుటయు, పోషించుటయును గూడ- స్థానికసంస్థలయొక్క- విధులలోనిదేయని విస్పష్టముగా చెప్పివైచిరి. అంతటితో ఆ యడ్డంకి తీరిపోయినది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముయొక్క- ఆందోళనా ఫలితముగ పెక్కు- స్థానికసంస్థలు గ్రంథాలయములను ధారాళముగ పోషింప సాగినవి. బెజవాడ, గుంటూరు పురపాలక సంఘములు స్వంత గ్రంథాలయములనే స్థాపించినవి. తాడేపల్లిగూడెం తాలూకాబోర్డు వారు గ్రామపునర్నిర్మాణ తరగతులను నిర్వహించి అందు గ్రంథాలయోద్యమమును గూర్చి కూడ ఉపన్యాసముల నిప్పించుటయేగాక స్వంత గ్రంథాలయమును స్వంతభవనములోనే స్థాపించిరి. గోదావరి జిల్లాబోర్డు, కృష్ణాజిల్లా బోర్డులవారు గ్రంథాలయ భవనములకై విరాళముల నొసంగిరి. ఈ రీతిగా ఆంధ్రదేశమునం దంతటను స్థానిక సంస్థలు గ్రంథాలయములకు తోడ్పడుచున్నవి.

## శాసనసభా తీర్మానము

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారి ప్రచార ఫలితముగ ఈ రాజధానియందలి గ్రంథాలయముల కొరకు కొంత ద్రవ్యమును

ప్రత్యేకించవలెనని శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారిచే మద్రాసు శాసననిర్మాణసభయందు ప్రవేశపెట్టబడిన తీర్మానము తుదకు అంగీకరింపబడి, తత్ఫలితముగ అప్పటినుండి ప్రతి సంవత్సర మును ప్రభుత్వమువారిచే గ్రంథాలయములకు కొంతసొమ్ము విరాళ ముగ ఇయ్యబడుచున్నది.

## గ్రంథాలయ చరిత్ర ప్రచురణము

ఆంధ్రదేశమునందున్న గ్రంథాలయము లన్నింటియొక్క చరిత్రము తయారు చేయుటకై ప్రశ్నావళి నొకదానిని తయారుజేసి గ్రంథాలయముల కన్నింటికిని బంపి. జవాబులు తెప్పించి, ఆంధ్ర దేశమునందున్న గ్రంథాలయముల చరిత్ర తయారుజేసి ప్రకటించి తిమి. ఈ రీతిగా రెండుసారులు చేయుటవలన ఆంధ్రగ్రంథాలయముల అభివృద్ధినిగూర్చి సర్వాలు తెలుసుకొనుటకు వీలుకలిగినది.

## ప్రచారకుల ప్రచారము

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ ప్రతినిధులు కర్నూలు, కడప, చిత్తూరు మున్నగు మండలములయందు జరిగిన మండలసభలకును వివిధ ప్రదేశములకునుబోయి, గ్రంథాలయముల స్థాపనావశ్యకమును గూర్చి ఉపన్యాసముల నిచ్చి, తీర్మానములను జేయించి ఉద్యమ ప్రచారము సాగించిరి.

## యుద్ధభటులకు గ్రంథాలయ సేవ

దక్షిణాఫ్రికాయందు యుద్ధముజేసిన ఆంధ్ర సోదరులు విశ్రాంతి సమయములందు జదువుకొనుటకై పత్రికలును గ్రంథము లును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముచే ప్రోగుచేయబడి, వారికి పంపబడినవి.

## సంచార గ్రంథాలయ పేటికలు

ఆంధ్రదేశమునగల కొన్ని గ్రంథాలయములయొక్క ఆదరణ క్రింద సంచారగ్రంథాలయపేటికలు చుట్టుప్రక్కల గ్రంథాలయ

ములులేని గ్రామములకు పంపబడుచున్నవి. ప్రత్యేకముగా గ్రంథాలయములను నిర్వహింపలేనట్టియు నిర్వహించుటకు వాంఛలేనట్టియు గ్రామములకు సంచార గ్రంథాలయ పేటికలు మిక్కిలి ఉపయోగకరములుగ నున్నవి.

## మండల - తాలూకా - సంఘముల స్థాపన

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముయొక్క ప్రచారము మూలమున పౌరగ్రంథాలయములను గూర్చిన పరిజ్ఞానము ఆంధ్రదేశమునందంతటను విరివిగ వ్యాపించినది. పెక్కు మండలములయందు మండల గ్రంథాలయసభలు ఏర్పాటుచేయబడుటచే, ఆయా మండలయముల యందు గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటకై మండల గ్రంథాలయసంఘములు స్థాపింపబడినవి. ఇదేరీతిని తాలూకా గ్రంథాలయ సభలును, తాలూకా గ్రంథాలయ సంఘములును స్థాపింపబడినవి. అక్కడక్కడ పట్టణ గ్రంథాలయ సంఘములుకూడ స్థాపింపబడినవి. గుంటూరు మండల గ్రంథాలయ సంఘమువారు జ్ఞానదాయకములగు పలు విషయములనుగూర్చి సమర్థులగు వారిచేత సులభశైలిని వ్రాయించి కరపత్రములను ప్రకటించి, వేలకొలది ప్రతులను వారి మండలము నందేగాక, ఆంధ్రదేశమునం దంతటను విరివిగా పంచిపెట్టిరి.

## కేంద్ర గ్రంథాలయము

విశాఖపట్నమునందు జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభయందు బెజవాడ యందున్న రామమోహన గ్రంథాలయమును ఆంధ్రదేశమునకు కేంద్ర గ్రంథాలయముగ పరిగణించుటకు తీర్మానించిరి. ఈ కేంద్ర గ్రంథాలయమునకు శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సువారు తమచే ప్రకటింపబడిన గ్రంథముల నన్నింటిని ఉచితముగా నిచ్చి ప్రోత్సహించిరి.

ఈ రీతిగా తాలూకా గ్రంథాలయ సంఘములు, మండల గ్రంథాలయ సంఘములు కేంద్ర గ్రంథా

లయము ఏర్పడి, పల్లెటూళ్ళయందున్న గ్రామ గ్రంథాలయముల పనిని సమీకరణము జేయుచు, జనులకు ఇంకను ఎక్కువ ఉపయోగవంతము లగుటకై నిరంతర ప్రచారమును జేయుచున్నవి. ఇట్టి నిర్మాణము ప్రభుత్వముయొక్క సహాయముచే బరోడా రాష్ట్రమున ఆచరణయోగ్యమై యొప్పినది. ఆంధ్రదేశమునందు ఈ ఏర్పాటు స్వశక్తిచేతనే కొంతవరకు కొనసాగినదని చెప్పవచ్చును.

మండల కేంద్రగ్రంథాలయము లన్నింటికిని శ్రీ వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రులుగారును, ఇంకను కొందరు ప్రకాశకులును గూడ తమచే ప్రకటింపబడిన గ్రంథముల నన్నింటిని ఉచితముగా నొసంగెదమని వాగ్దానము జేసి, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు గొప్ప చేయూతనొసంగినారు. ఇట్టిమహోదాతల యనుగ్రహమువలన గాని గ్రంథాలయోద్యమము తీవ్రవ్యాప్తిని గాంచజాలదు.

## నా బరోడా యాత్ర *

భారతవర్ష నవీన గ్రంథాలయోద్యమమునకు "బరోడా" రాష్ట్రము ఆదర్శమని చెప్పవచ్చును. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము యొక్క ఆకారమును నిర్మించుటయందు "బరోడా" రాజ్య గ్రంథాలయోద్యమము అమితముగా తోడ్పడినది. ఈ యుద్యమాభివృద్ధికి గావలసిన సలహాల నిచ్చుటయందు "బరోడా" కేంద్ర గ్రంథాలయాధికారులయొక్క సహాయము మరువదగినది కాదు. "బరోడా" రాజ్యమందలి గ్రంథాలయోద్యమమును జూచి వచ్చుటకై ఆంధ్రదేశ గ్రంథాలయ కార్యదర్శిగా నేను పోయియుంటిని. ఉత్తరప్రత్యుత్తరముల మూలమునకంటె అచట కొకసారి పోయివచ్చుటవలన గ్రంథాలయోద్యమ పద్ధతులయందు అమితముగ అనుభవము కలిగినది. ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభలలోను, అఖిలభారత గ్రంథాలయ సభలలోను ఏర్పాటుచేసిన

---

* ఈ సంపుటమున వేరొకచో నా బరోడా యాత్ర వ్యాసమును చదువనగును

ప్రదర్శనములు "బరోడా" యాత్రయొక్క ఫలితములే వైయున్నవి. భారతవర్షమున "బరోడా" వారి తరువాత గ్రంథాలయోద్యమ విష యమై కృషి ప్రారంభించినది ఆంధ్రులే.

## అఖిలభారత గ్రంథాలయోద్యమము—ఆంధ్రుల పాత్ర

1918 సంవత్సరమున లాహోరు నగరమున అఖిలభారత గ్రంథ భాండాగారుల సమావేశ మొకటి ప్రభుత్వమువారిచే సమావేశము చేయబడినది. ఆ సభకు ప్రతినిధులను బంపుటకై ఆంధ్రదేశ గ్రంథా లయసంఘమువారు వాంఛింపగ, సభ్యుల సంఖ్య అగివరకే ఎక్కువగా నుండి యుండుటచేత, స్థలమునుండినచో ప్రేక్షకునిగా మాత్ర మంగీక రించెదమని తెలిపిరి. విశేష వ్యయప్రయాసలకులకు లోనై ఆంధ్ర దేశము నుండి "లాహోరు" పట్టణ మేగినను, సభయందు ప్రేక్షకుడుగ నైన స్థలము దొరకునో లేదో తెలియకపోవుట యటుండ—ఈ గ్రంథ భాండాగారుల సభవలన మన "సార్వజనిక గ్రంథాలయోద్యమమున" కే విధమైన ఉత్సాహ ప్రోత్సాహములును లేవని గ్రహించి,ఆసభకు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము నుండి ప్రతినిధుల నెవ్వరిని బంపి యుండలేదు. తుదకు ఫలితము గూడ ఊహించినట్లే వైనది.

## ప్రథమ అఖిలభారత గ్రంథాలయ సభ

పిమ్మట 1919 సంవత్సరమున మద్రాసులో జరుపబడిన ఆరవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభతో బాటుగ,ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము యొక్క ప్రోద్బలమున, ప్రథమ అఖిలభారత గ్రంథాలయసభ సమకూర్చబడినది. దానికి బరోడారాజ్య గ్రంథా లయ శాఖకు అధ్యక్షులగు జే. యస్. కుడల్కారుగారు అధ్యక్షత వహించిరి. మరియు ఇప్పాడు మహారాజప్రతినిధిగ నున్న విల్లింగు డను ప్రభువుగారు ఆ సభతో బాటు జరిగిన అఖిలభారత గ్రంథాలయ ప్రదర్శనమును ఆవిష్కరించిరి. ఈ ప్రథమసభయందే అఖిలభారత గ్రంథాలయసంఘము కూడ ఏర్పరుపబడినది. ఆంధ్రదేశ గ్రంథా

లయ సంఘముయొక్క కార్యదర్శి శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య
యే అఖిలభారత గ్రంథాలయ సంఘమునకు గూడ కార్యదర్శిగ
నుండి, రెండవ అఖిలభారత గ్రంథాలయ సభను
"కాకినాడ" యందును, మూడవసభను "బెల్గాం"
నందును, నాల్గవ సభను "మద్రాసు" నందును, ఐదవసభను "కల
కత్తా" యందును, ఆరవసభను "లాహోరు" నందును సమావేశ
పరచిరి. అఖిలభారత గ్రంథాలయోద్యమ ఫలితముగ ఇంతవరకు
మహారాష్ట్రము, వంగదేశము, కర్నాటకదేశము, మద్రాసు
రాష్ట్రము, పంజాబు దేశములందును, పుదుక్కోట సంస్థానము
నందును రాష్ట్రీయగ్రంథాలయ సంఘము లేర్పరుపబడినవి. ప్రథమ
కర్నాటక రాష్ట్రీయ గ్రంథాలయ మహాసభకు ఆంధ్ర దేశ
గ్రంథాలయ సంఘకార్యనిర్వాహక సంఘాధ్యక్షులగు శ్రీ సూరి
వేంకట నరసింహశాస్త్రిగారు అధ్యక్షతవహించిరి. అఖిలభారత
గ్రంథాలయ సభలతోను, కర్నాటక గ్రంథాలయ సభతోను జరుప
బడిన గ్రంథాలయ ప్రదర్శనములకు ఆంధ్రదేశ గ్రంథాలయ
సంఘమువారు ప్రదర్శన వస్తువులను విరివిగా బంపి, వాని విజయము
నకు దోడ్పడిరి.

## పత్రికా ప్రచురణము

"అఖిలభారత గ్రంథాలయ సంఘము" పక్షమున ప్రకటింప
బడిన ఇండియన్ లైబ్రరీ జర్నలు అను పత్రికకు గూడ ఆంధ్రదేశ
గ్రంథాలయసంఘమువారు అనేక విధముల దోడ్పడిరి.

అఖిలభారత గ్రంథాలయ సంఘము వారిచే కొన్ని కరపత్ర
ములు గూడ ప్రకటింపబడినవి.

## మదరాసు గ్రంథాలయ సంఘ స్థాపనము

1927 సంవత్సరము డిశంబరు నెలయందు మద్రాసు నగరమున
కాంగ్రెసు మహాసభ జరిగినప్పుడు, అఖిలభారత గ్రంథాలయ సభను
గూడ సమావేశము చేయవలసినదని మద్రాసు రాజధానియందలి
వివిధ భాగముల నుండి పెక్కుమందియేగాక వంగదేశమునుండి కూడ

కొందరు ఉత్తరములను వ్రాసిరి. అందుమీద, అఖిలభారత గ్రంథాలయ సభను సమావేశము జేయుటకు ఏర్పాటులను జేయవలసినదని పలువురు మిత్రులకు నేనే స్వయముగా ఉత్తరములను వ్రాసితిని. పుదుక్కోట గ్రంథాలయసంఘ కార్యదర్శియగు ఏ. యస్. ముద్దుకృష్ణన్ గారు కూడ మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు గ్రంథభాండాగారియగు యస్. ఆర్. రంగానాధన్ గారికి వ్రాసిరి. వారును సభను జరుపుటకు బొత్తిగా వీలులేదని ప్రత్యుత్తరమిచ్చిరి. అంతట ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శియు, అఖిలభారత గ్రంథాలయ సంఘ కార్యదర్శియునగు నేనే మద్రాసునకు ముందుగాబోయి, అఖిలభారత గ్రంథాలయసభను, శ్రీరంగనాధనుగారి తోడ్పాటుతో ప్రదర్శనమును ఏర్పాటు జేసితిని. ఆసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు ఇప్పుడు మద్రాసు గ్రంథాలయ సంఘాధ్యక్షులగు కే. వి కృష్ణస్వామి అయ్యరుగారు ఆసభను జరిపిన పిమ్మట మద్రాసునందు గ్రంథాలయోద్యమాభిమానుల సభ నొకదానిని శ్రీకృష్ణస్వామి అయ్యరుగారి ఇంటియందు ప్రప్రథమముగ నేనే సమావేశపరచితిని. ఆ సమావేశము నందు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునుగూర్చియు బరోడా గ్రంథాలయోద్యమమును గూర్చియు జెప్పితిని. ఆసభయందే మద్రాసునందు గ్రంథాలయసంఘమును ఏర్పరచుటకై తాత్కాలిక సంఘము ఏర్పరుపబడినది. అదియే పిమ్మట ప్రస్తుత మద్రాసు గ్రంథాలయసంఘముగ పెరిగినది.

ఈ రీతిగా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము ఆంధ్రదేశమునందలి గ్రంథాలయోద్యమ వ్యాప్తికేగాక, అఖిలభారత గ్రంథాలయోద్యమ వ్యాప్తికి గూడ తనశక్తికొలది పాటుపడి, సత్ఫలితములను జూపినది.

## మన యుద్యమ ప్రాశస్త్యము-
## అమెరికా గ్రంథాలయ పత్రికా ప్రశంస

గుంటూరునందు జరిగిన "ఆంధ్రదేశ గ్రంథాలయ" ప్రతినిధుల మహాసభ యొక్క వృత్తాంతమును ప్రకటించుచు, "అమెరికా దేశము

నందు ప్రకటింపబడుచున్న గ్రంథాలయపత్రిక (**Library journal for October 15th 1928**) తమ సంపాదకీయమునందు మన యుద్యమమును గూర్చి ఇట్లు వ్రాసియున్నది:-

“బరోడా మహారాజుగారు తన సంస్థానమునందు గ్రంథాలయ విధానమును పెంపొందింపజేయుటకు తగిన అవకాశమును కల్పించిన సమయమున బోర్డనుదొరవారు విత్తనమును నాటకమునుపే, హిందూ దేశము నందును స్వశక్తిచేతనే యదృచ్ఛముగ ఫలప్రదము గాంచిన ధర్మగ్రంథాలయోద్యమము ప్రారంభమయినది. అఖిలభారత గ్రంథాలయసంఘమునకు చేరి జిల్లాసంఘములు విశేషముగా పౌర గ్రంథాలయములు గలవు. గ్రంథాలయముయొక్క విధానములను పెంపుచేసి, గ్రంథాలయోద్యమమును సర్వవిధముల ఆధునిక పద్ధతుల ననుసరించి అభివృద్ధి చేయుటయే అట్టి గ్రంథాలయములయొక్క ఆశయము. ఇట్టి అఖిలభారత గ్రంథాలయసంఘ మేర్పడుటకు జాతీయ భావము కూడ కొంతవరకు కారణమే. కొద్ది కాలముక్రిందనే జరిగిన సభలో చెప్పబడిన ఉపన్యాసములు ఈ దేశములో (అమెరికాలో) ఈమాదిరి ఇతర సభలలో చెప్పబడిన ఉపన్యాసములకు మిక్కిలి సన్నిహితముగా నున్నవనియే చెప్పనగును. అట్టి ఉపన్యాసములు హిందూ దేశ నివాసులచే చెప్పబడిన వనుట చాలాగొప్పవిషయము. అమెరికా దేశమును ఆదర్శముగాగొని చీనాదేశము చాలవరకు అభివృద్ధి జెందినది. జపాను దేశము యీవిషయమైన అభివృద్ధి జెందుటకై స్వశక్తి మీదనే ఆధారపడి యుండెను. బోర్డనుగారు బరోడాయందు కృషి జేసిరి. ఇండియా ప్రభుత్వము వారికిగాను పంజాబు గ్రంథాలయములను “డికెన్‌సన్”గారు చక్కబెట్టిరి. ఇంతకుతప్ప హిందూదేశము అమెరికా దేశామునుండి చీనా పొందిన రీతిగా సహాయమును పొందలేదు. హిందూదేశమున జరిగిన అభివృద్ధియంతయు జపానుదేశమునందు వలెనే విశేషభాగము దేశీయమైయున్నది. ఈ మూడు దేశముల యందలి గ్రంథాలయోద్యమాభివృద్ధి మార్గములు, అమెరికా దేశ పద్ధతులకును ఆదర్శములకును సమానముగాను భిన్నముగాను కూడ నున్నవని కాననగును.”

(10)

## మద్రాసు గ్రంథాలయ సంఘాధ్యక్షుని ప్రశంస

మద్రాసునందు జరిగిన అఖిలభారత గ్రంథాలయసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులును, ప్రస్తుతము మద్రాసు గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షులును అగు కే. వి. కృష్ణస్వామి అయ్యరుగారు తమ ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసమునందు ఆంధ్ర గ్రంథాలయోద్యమమును గూర్చి ఇట్లు జెప్పియున్నారు:-

"ఈవిషయములో ఆంధ్రదేశము చాలా అభివృద్ధిగాంచి, ముందంజవేసి, యితరులకు మార్గదర్శకమై యున్నదని జెప్పుటకు మిక్కిలి తృప్తికరముగానున్నది. పేరెన్నికగన్న దేశసేవకుల అలయిక లేని ప్రయత్నములవల్ల ఆంధ్రదేశమునందు ధర్మ పౌరగ్రంథాలయములు జయప్రదముగా నిర్మింపబడినవి; జాతీయభావమును బట్టి జూచినను, స్వభాషాభిమానమునుబట్టి జూచినను, దాని యభివృద్ధిని బట్టి జూచినను, ఈ సంఘములు ఎట్లు సత్ఫలితముల నొసంగినదియు బోధపడగలదు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రార్హతయు, స్వరాజ్యార్హతయు కలదని చెప్పుటకు వారు సమర్థతతో నిర్వహించిన గ్రంథాలయోద్యమాభివృద్ధియే తార్కాణము. తమిళసోదరులును ఇతరులును ఆంధ్రులవిధానమును గ్రహించి, వారివలెనే ఈయుద్యమాభివృద్ధి గావించెదరుగాక."

## మద్రాసు గ్రంథాలయసంఘమువారి అన్యాయ ప్రచారము

ఇటీవల మద్రాసు గ్రంథాలయ సంఘముయొక్క కార్యదర్శిగారగు యస్. ఆర్. రంగనాథన్‌గారిచే వ్రాయబడిన "గ్రంథాలయ శాస్త్రముయొక్క అయిదు సూత్రములు" అను గ్రంథమును మద్రాసు గ్రంథాలయ సంఘమువారే ప్రకటించిరి. అఖిలభారత గ్రంథాలయోద్యమముగాని ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమముగాని ఈ గ్రంథకర్తగారి దృష్టి నాకర్షింపకపోవుట మిక్కిలి శోచనీయము. వారిదృష్టి నాకర్షించిన ఆంధ్రదేశమును గూర్చి యిట్లు వ్రాసిరి:-

"ఇంకను దక్షిణమునకు పోయిన ఆంధ్రదేశమందు కడచిన పది సంవత్సరముల ఆఖరున గ్రంధాలయము లను సుభిక్షమైన పంట పండినది. కాని కొంతవరకు రాజకీయ ఉద్యమమునందు కలసిపోయి దానియొక్క విపర్యయమువలన అణగిపోయి నశించుచున్న కొన్ని శకలములను మాత్రము మనము చూచుచున్నాము."

వీరు వ్రాసిన వాక్యములు కొన్ని గ్రంధాలయములనుగూర్చి ప్రత్యేకముగా వ్రాయబడినవిగాక, ఆంధ్రదేశము నంతను గూర్చి వ్రాయబడిన మిక్కిలి అన్యాయమగు వ్రాతలై యున్నవి. ఒక విషయమును గురించిగాని, ఒక దేశమునుగూర్చిగాని వ్రాయుటకు ముందుగా వానినిగురించి దెలిసికొనుటకు కొంచెమైన ప్రయత్నించ వలయును. అమెరికా దేశమునందు ప్రబలియున్న నవీన గ్రంథాలయ పద్ధతులనుగూడ ఆంధ్రదేశ గ్రంధాలయోద్యమమునందు ఇతరులు జూచుట సంభవమైయుండ- (అమెరికా దేశ గ్రంధాలయ పత్రికనుండి ప్రకటితమైన వాక్యములను జూడుడు) ఇరుగుపొరుగున నున్న ఆంధ్ర దేశ గ్రంధాలయోద్యమమును, ఆంధ్రదేశమందు ప్రబలియున్న వందలకొలదిగాగల గ్రామ గంధాలయములను, ఈ మద్రాసు గ్రంధాలయసంఘ కార్యదర్శిగారు చూడలేకుండుట మిక్కిలి శోచనీయము. ఈ గ్రంథము మదరాసు గ్రంధాలయ సంఘముచే ప్రకటింపబడినది. ఈ మద్రాసు గ్రంధాలయ సంఘాధ్యక్షులు 1927 వ సంవత్సరము డిశంబరు నెలయందు అఖిలభారత గ్రంధాలయ సభ యొక్క ఆహ్వానసంఘాధ్యక్షులుగా ఆంధ్రదేశ గ్రంధాలయోద్యమమునుగూర్చి చెప్పిన సంగతులను పైన గమనించితిరిగదా! అప్పుడు వీరు చెప్పిన అభిప్రాయములను ఇప్పుడు మార్చుకొనిరా? మార్చుకొననియెడల తాము అధ్యక్షులుగానున్న సంఘముయొక్క కార్యదర్శిగారు విచారించక, తెలిసికొనక వ్రాసిన వ్రాతను వీరైన సవరించియుండవలసినది! బాధ్యతగల సంఘపక్షమున ప్రకటింపబడు గ్రంథములయం దిట్టి అపనిందలుండుట మర్యాదగాదు. ఈ గ్రంథకర్తగారు వ్రాసిన అన్యాయపు వ్రాతను ఇపుడైన సవరించుకొనవలెనని కోరెదను.

## గ్రంథాలయోద్యమ వ్యాపనము భాషా ప్రయుక్తముగా నుండవలెను.

ఏకభాషను మాట్లాడు జనులందరును ఏకరాష్ట్రముగా ఏర్పడి యుండవలెననుసిద్ధాంతము సర్వజనాంగీకృతమై యుండుటచేత దానిని నేనిప్పుడు నిరూపింపవలసినది లేదు. ఈ సిద్ధాంతముననుసరించియే ఇది వరకు కాంగ్రెసునందేమి, తదితర యుద్యమములయందేమి కార్యక్రమము భాషాప్రయుక్తముగ జరుగుచున్నది. 1919 సంవత్సరము నందు ఏర్పడిన అఖిలభారత గ్రంథాలయసంఘముయొక్క నిబంధనల యందు, బ్రిటిషు రాజ్యములో ఒకభాషను మాట్లాడు దేశమంతయు ఒక రాష్ట్రీయ గ్రంథాలయ సంఘముగ ఏర్పడవలెనను నియమము గలదు. ఈ సంప్రదాయమునకు, ఈనిబంధనలకు విరుద్ధముగ మద్రాసు గ్రంథాలయ సంఘమువారు వర్తింపుచుండుట మిక్కిలి విచారింప దగిన యంశమై యున్నది. ఈ సంఘమువారు తమయొక్క నిర్మాణ మును ఒక భాషాప్రయుక్త విభాగమునకు చెందినదిగా ఏర్పరచి యుండిన యెడల న్యాయముగ నుండియుండెడిది. లేదా ఈ రాజ ధానియందున్న వివిధభాషలకు వివిధరాష్ట్రీయ సంఘము లేర్పడు టకు అవకాశ మిచ్చి, వివిధ భాషాప్రయుక్త సంఘముల కొక సంయుక్త సంఘమును నిర్మాణము గావించినను బాగుగా నుండె డిది. ఈ మద్రాసు గ్రంథాలయ సంఘము వారు ఈ రెండు పద్ధతు లలో దేనినిగూడ నభిలషింపక, తమ బాహువులను మద్రాసు రాష్ట్రము నందున్న అన్ని భాషాప్రయుక్త ప్రదేశములకు చాచుటకై ప్రయత్నించిరిగాని వారి ప్రయత్నము జయప్రదమైనట్లు గాన్పింపదు.

మద్రాసు గ్రంథాలయ సంఘముయొక్క తృతీయ సంవత్సర కార్యక్రమమును ప్రారంభించుచు మద్రాసు గవర్నరుగారగు సర్ జార్జి ఫెడరిక్కుస్టాన్లీగారు ఏమని చెప్పిరో చిత్తగింపుడు.

## మద్రాసు గవర్నరు జార్జి ఫెడరిక్కు

"ప్రారంభముననందే కొన్ని కష్టములను ఎదుర్కొనవలసి యున్న దనియు; ముఖ్యముగా భాషావిషయకమైన కష్టము కలదనియు, మీ నివేదికనుబట్టి గ్రహించితిని. ఈ రాజధాని మిక్కిలి విశాలమైనది. 4 ½ లక్షలు జనసంఖ్యను గలిగి యున్నది. ఇచట నాలుగు ముఖ్య మైన దేశభాష లున్నవి. ఈ రాజధానియందున్నవి కొద్ది గ్రంథా లయములైనను పెక్కుమంది వచ్చి చదువుకొనుటకు అందు బాటులో లేవు."

"అదియునుగాక, ఒక్కొక్క భాషయందు మంచి గ్రంథా లయ మొకటియైన యున్నదని చెప్పుటకు వీలులేదు. ఆంగ్లేయభాష అనుకూలమగు వాహకమని నాకు తెలియును. కాని వివిధ దేశభాష లలో వ్రాయబడిన వాఙ్మయమును చింతనచేయుటకు సమపాయము లున్నగాని, ఈ దేశముయొక్క దేశీయవిజ్ఞానము పూర్తిగా వికసించు టకు సావకాశ ముండదు. మీరు నిర్వహింపవలసిన కార్యము మహా భారమైనది. ఏలయనగా, ఇంతమంది ప్రజలకు గ్రంథాలయములలో ఆంగ్లేయ గ్రంథముల నుంచుటయే గాక, అరవవారికి అరవగ్రంథ ములు, తెలుగువారికి తెలుగు గ్రంథములు, కన్నడ దేశస్థులకు కన్నడ గ్రంథములు, బహుశః హిందూస్థానీ భాష మాట్లాడువారికి హిందూ స్థానీ గ్రంథములు సమకూర్చవలసి యుండును. మీపని ఒకరోజులో పూర్తియగునదిగాదు. మీరు స్థాపించు ప్రతిగ్రంథాలయమును కొంతవరకు ఈ పనికి దోడ్పడుచుండును. ఇంకను బహిర్గతము గాని గొప్పవిషయము లనేకములు దక్షిణ ఇండియా వాఙ్మయమున గల వని మనము తరుచుగా వినుచుందుము. అట్టి వాఙ్మయమును ప్రాము ఖ్యమునకు దీసికొని రావలెనన్నచో ఇట్టి యుద్యమమే తోడ్ప డును..."

శ్రీ గవర్నరుగారు చెప్పిన పై విషయములను మనము పరిశీలన చేసినయెడల, ఈ యుద్యమము భాషాప్రయుక్తముగ నుండుట యొక్క ఆవశ్యకత ఇంకను స్ఫుటముగ గోచరింపగలదు. ఇంత విశాల

హైన రాష్ట్రమున ఇన్ని ముఖ్యమగు భాషలు వ్యాపించియున్న రాష్ట్రమున-దేశభాషలలో దేశీయ విజ్ఞానము, దేశీయ వాఙ్మయము పెంపొందవలసిన అవసరమున భాషాప్రయుక్త సిద్ధాంతమును త్రోసి రాజని, ఈ రాజధానినంతను ఒక సంఘము ఆవరింపబూనుట అతి సాహసమని చెప్పక తప్పదు.

## మద్రాసు గ్రంథాలయ చట్టము

పాశ్చాత్యదేశములందు గ్రంథాలయ ఉద్యమమును స్థానిక సంస్థలు నడుపుటకుగాను ప్రత్యేకముగా పన్నునువిధించుకొనవచ్చును. అట్టి పన్నును విధించుటకు ప్రత్యేకముగ చట్టముగూడ గలదు. అదేరీతి మద్రాసు రాజధానియందుగూడ గ్రంథాలయోద్యమమును స్థానిక సంస్థలు నడుపుటకై చట్టము నొకదానిని మద్రాసు గ్రంథాలయ సంఘమువారు తయారుచేసినారు; ఆ చట్టమును అప్పుడే కొందరు చట్టనిర్మాణసభయందు గూడ బెట్టుటకు బూనుకొనుచున్నారు. నిర్బంధోచిత ప్రారంభ విద్యాచట్టము చాలకాలమునుండి అమలులో నున్నను మనరాజధానియం దది ఆచరణలోనికి రాలేదు. గ్రంథాలయ చట్టముగూడ అదేవిధముగ గాకుండ జూడవలయును. ఇంకొక విషయమునుగూడ మనము పర్యాలోచించవలసియున్నది. పల్లెటూళ్ళ యందేగాక, పట్టణములయందు మునిసిపల్ పన్నులుకూడ హెచ్చుగా నున్నవని ఘోషగనున్నది. దీనికితోడు ఆర్థిక విపర్యాసములవలన దేశమంతయు అల్లకల్లోలముగ నున్నది. ఇట్టి సమయమున, స్వతంత్ర పాశ్చాత్య దేశములయొక్క దృష్టాంతరముల గైకొని, క్రొత్త పన్నును విధించు ఇట్టి చట్టమును- ఈ విపరీతకాలమున పెట్టబూనుట దూరదృష్టి నెంతమాత్రమును జూపుటలేదు. ఇట్టి చట్టము హిందూ దేశమునం దెక్కడనులేదు. ఇట్టి చట్టనిర్మాణమునకు ఇదే ప్రారంభ మగుటచేత, అనుకూలపరిస్థితులయందు ప్రారంభింపజేయుటమంచిది. ఇట్టి చట్టమును ప్రస్తుత పరిస్థితులయందు చేయుటయే యుక్తమని పెద్దలు దలంచునెడల, అది యీ రాజధానియందున్న వివిధభాషల

యొక్క వివిధరకములైన జనులయొక్క వికాసమునకు దోహదము నిచ్చునదియై యుండవలయును అట్టి దోహదచిహ్నము లేమియు, ఈ చిత్తుచట్టమునందు గన్పించుట లేదు. కావున చట్టనిర్మాతలు బాగుగా యోచింతురు గాక!

## ముందుచేయవలసిన కార్యక్రమము

సోదరులారా! సోదరీమణులారా! ముందు మనము గ్రంధాలయోద్యమాభివృద్ధికిగాను చేయవలసిన కార్యక్రమముయొక్క ప్రాతిపదికయంతయు, యింతవరకు జరిగిన అల్పారంభములయందే గలదు. మీ మండల గ్రంధాలయ సంఘము ఇంకను ఎక్కువశక్తివంతమైనదిగా చేయవలయును. తాలూకా గ్రంధాలయ సంఘములు పట్టణ గ్రంధాలయసంఘములను స్థాపించవలెను. ఇంతవరకు గ్రంధాలయోద్యమమునందు ప్రచారభాగము నెక్కువ జరిపితిమి. ఇక ముందు కొన్ని కొన్ని ప్రదేశములందు ఈ యుద్యమము యొక్క వివిధాంతరములను ఆచరణయందు జూపి, ఉద్యమ ప్రాశస్త్యమునకు దోడ్పడవలయును. ఇందుకై గ్రంధాలయోద్యమ సోదరులకు, మీ జిల్లా యందు తాత్కాలిక తరిబీతు పాఠశాల నొకదానిని ఒక నెలదినములకు తక్కువలేని కాలము ఏర్పరచవలెనని కోరెదను. ముఖ్యముగా గ్రామములందుండు గ్రంధాలయములు గ్రామమునందుండు జనులందరికిని అందుబాటులో నుండవలెను. వానిలోని గ్రంథములు గ్రామములోని జనులందరికి — చందా ఇచ్చినవారికి ఇవ్వనివారికి గూడ — అందుబాటులో నుండవలయును. జ్ఞానమునకును మానవునకు మధ్య ద్రవ్యమువచ్చి ప్రవేశింపకూడదు. గ్రంధాలయమునకు చందాలు—ముఖ్యముగా పల్లెటూళ్ళయందు—ద్రవ్యరూపమున వసూలు చేయరాదు. వస్తురూపమున, అనగా ఎవరికే పంట పండునో అద్దానిరూపముననే వసూలుపరుపవలెను. ఇంకను గ్రామ ధర్మాదాయనిధులు — వర్తకుల ధర్మఖాతాలు — సహకార సంఘములు — అన్నియు గ్రంధాలయోద్యమమునకు చేయూత యొసంగు

నటుల చేయవలయును. ముఖ్యముగా తాలూకా బోర్డులును, మునిసి పాలిటీలును,తమచే పరిపాలింపబడు ఉపాధ్యాయుల మూలమున ఈయు ద్యమమును బాగుగా వ్యాపింప చేయవచ్చును. తమ పాఠశాలా గ్రంథాలయములను బాలురకేగాక యింకను ఆ గ్రామమందలి జను లకు గూడ అందుబాటులో నుంచునటుల చేయవలయును. అట్లు చేయవలెనన్నచో పాఠశాలాగ్రంథాలయములను బాగుగా అభివృద్ధి చేయవలయును. మరియు, వానికి వార్తాపత్రికలనుగూడ దెప్పింప వలయును. ప్రతి తాలూకా బోర్డును కొన్ని సంచార గ్రంథాలయ పేటికలను సేకరించి,ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల మూలమున గ్రామస్థులచేత చదివింప జేయవచ్చును. ఈ యుపాధ్యాయులు అప్పుడప్పుడు సెంటరుక్లాసులందు కలిసికొను చుండెదరు. అప్పుడు వివిధ గ్రామములందలి యుపాధ్యాయులు అదివరకు తమ గ్రామస్థులు చదివివేసిన పెట్టెలను, అచటికి తీసికొనివచ్చి, క్రొత్తపెట్టెలను తిరిగి తమ గ్రామములకు తీసికొనిపోవచ్చును. ఈపని నిమిత్తమై ఒక్కొక్క తాలూకా బోర్డువారు సంవత్సరమునకు రు 1000 ల నైన వ్యయపరచు టకు అంగీకరించు నెడల, కొంతపనిని జేసి జూపవచ్చును. మీ జిల్లా యందు రెండువేలకంటె తక్కువ జనాభాలేని గ్రామమందెల్ల ధర్మ గ్రంథాలయములు వెలయవలయును.

## ము గిం పు

గ్రంథాలయోద్యమము ఆంధ్రదేశమున ఏయే పరిస్థితులయం దభివృద్ధిగాంచుచున్నదో అట్టిది ఇతర దేశములయందెచటను గానరాదు. బరోడా రాజ్యమునందైనను, ప్రభువుల తోడ్పాటు తోడనే, గ్రంథాలయములు స్థాపింపబడి పోషింపబడుచున్నవి.

మనదేశమున కార్నెజీ మహాశయునివంటి దాతల దాతృత్వ మింకను ఈ యుద్యమము వైపునకు తిరుగలేదు ప్రభువుల తోడ్పాటు సముద్రములోని నీటిబిందువువలె నున్నది. నేను ఇదివరకే తమకు సూచించిన రీతిని, ఉత్సాహవంతులగు యువకుల తీవ్రకష్ట పరంపరల వలననే ఈ యుద్యమము నిర్వహింపబడుచున్నది.

గ్రంథాలయ నిర్వాహకులీ యాటంకములను కష్టములను పరకుజేయక తమ వజ్రసంకల్పము సఫలమగుదాక, మిక్కిలి ఉత్సాహముతో తమ ధర్మములను నిర్వర్తింతురుగాక.

సీ. అక్షరాస్యునకు, నిరక్షరాస్యునకు
విద్య బోధమై వెలయవలయు
ధనమున్న లేకున్న తగినగ్రంథము జూడ
నభిలాషగల యప్పు డమరవలయు
పదుగు రొక్కెడ జేరి భాషించుకడ వాణి
భువనమోహిని యాచు బొదలవలయు
వీనులచే నైన వీక్షణంబులనైన
మంచిచెడ్డలవృష్టి మనుపవలయు
గీ॥ దేశమెల్లడ విజ్ఞాన దీపవితతి
వలయునది యెల్ల గనుపింప వెలుగవలయు
భుక్తియును ముక్తియు మహానురక్తి మెలగ
గ్రంథభాండారములు భువి గ్రాలవలయు"

గంజాం — విశాఖపట్టణ మండలముల గ్రంథాలయ మహాసభాధ్యక్ష ప్రారంభోపన్యాసము — బరంపురము — జనవరి 1934. "గ్రంథాలయ సర్వస్వము" సంపుటము 9, సంచిక-1- 1934.

---

# ఆంధ్రదేశ గ్రంథాలయ జనకుడు శ్రీ వీరేశలింగము పంతులు

## సంకల్పము

ఆన "1879 వ సంవత్సరమునందు వితంతు వివాహవిషయమున నియ్యదలచుకొన్న కొన్ని యుపన్యాసములకు తా వొకపట్టున లభింపకపోయినప్పటినుండియు- సర్వజనులకు నుపయోగపడెడి యుపన్యాస సభాభవన మొకటి పట్టణమున నుండిన బాగుండునుగదా యన్న

సంకల్పముతో తత్సిద్ధి యెట్లు కలుగునా" యని శ్రీ వీరేశలింగం పంతులుగారు ఆలోచింపసాగిరి.

ఆ యాలోచనమే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు పునాది యైనది.

ఆనాడు పాఠశాలలకెల్ల విద్యా విచారణకర్తగానున్న కర్నల్ మక్డనాల్డుగారిపేర పురమందిరమును కట్టింపవలెనని 1880 వ సంవత్సరమునను, విక్టోరియారాజ్ఞిగారి జ్యూబిలీ మహోత్సవ సందర్భమున పురమందిరమును కట్టింపవలెనని 1887 వ సంవత్సరమునను శ్రీ వీరేశలింగం పంతులుగారు ఇతరులతోగూడి చేసిన ప్రయత్నములు ఫలోన్ముఖము గాలేదు.

పిమ్మట 26-3-1889 వ తేదీన, శ్రీ పంతులుగారే స్వయముగా ధర్మగ్రంథాలయముతో గూడిన పురమందిరమును కట్టించుటకు సంకల్పించి, దాని నిర్మాణమును పూర్తి జేసి, 23—10— 890 తేదీన అందు ప్రవేశమహోత్సవమును జేయించిరి. అందులోనే వీరేశలింగం పంతులుగారి ఆస్తిక గ్రంథాలయముకూడ స్థాపింపబడి నేటికిని యథాతథముగా నిర్వహింపబడుచున్నది. ఈ సంస్థ జాతి-మత-కుల-భేదములతో నిమిత్తము లేకుండ సర్వజనులకు ఉపయోగ మగునటుల శాశ్వతముగ నిర్వహింపబడుటకు కావలసిన యేర్పాట్లను గూడజేసి, పంతులుగారే నిక్షేప పత్రము [Trust deed] ను గూడ వ్రాసి యిచ్చిరి.

ఇంతకు పూర్వమే 1886 వ సంవత్సరమున విశాఖపట్టణమునందు సరస్వతీనిలయమను నామమున సార్వజనిక గ్రంథాలయ మొకటి మంతెన ఆదినారాయణమూర్తి యను వీధి బడిపంతులు స్థాపించినప్పటికిని,స్థిరత్వములేక కొద్ది సంవత్సరములలోనే అది యంతరించినది.

పిమ్మట పరంపరగ అనేక సార్వజనిక గ్రంథాలయములు ఆంధ్రదేశమునందంతటను ఏర్పడినవి.

## శ్రీ పంతులుగారి పేరుతో వెలసినవి

ఆనాడే శ్రీ వీరేశలింగం పంతులుగారి త్యాగము — సేవా

నిరతి – సచ్ఛీలము – మొదలగువానిని దేశీయు లందరును గుర్తించి అభినందించిరి. ఏ తత్ఫలితముగా, శ్రీ వీరేశలింగం పంతులుగారి పేరున, వారి భార్య రాజ్యలక్ష్మిగారి పేరున, అనేక గ్రంథాలయములు ఆంధ్రదేశమునం దంతటను స్థాపింపబడినవి. అట్లు నెలకొల్పబడిన వానిలో పేరెన్నికగన్నది 22–6–1‧97 వ తేదీన, పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకా "కుముదవల్లి" యను గ్రామమున "శ్రీ వీరేశలింగ కవిసమాజ" మను పేరున స్థాపింపబడినది. "గ్రంథాలయోద్యమ భీష్మ" లని తరువాత ప్రఖ్యాతి గాంచిన భూపతిరాజు తిరుపతిరాజుగారను యువకులు దానిని ఆనాడుస్థాపించిరి. స్వంతభవనము-నిత్యావసరములకు భూవసతియు గలిగి, దినదినాభివృద్ధి నొందుచు, ఆ గ్రంథాలయము గ్రామ మంతటికిని తలమానికమై ఇప్పటికిని ప్రజాసేవ జేయుచు తన ధ్యేయమును నిర్వర్తించు చున్నది.

ఈ కుముదవల్లి గ్రంథాలయము ♦ యొక్క పదియవ వార్షికోత్సవమునకు 9–10–1907 వ తేదీన శ్రీ పంతులుగారు ఆ గ్రామమునకుబోయి అధ్యక్షత వహించిరి. అప్పటికే ఆయన రావుబహద్దరు బిరుదమును పొందియుండిరి. ఆ వార్షికోత్సవమునకు భీమవరం, నరసాపురం, తణుకు తాలూకాలలోని 24 గ్రామములనుండి గ్రంథాలయ ప్రతినిధులు విచ్చేసిరి. చుట్టుప్రక్కల గ్రామములనుండి రెండు వేలమంది ప్రేక్షకులును విచ్చేసిరి. స్వదేశోద్యమ ప్రచారకులగు అవటపల్లి నారాయణరావు, బోడి నారాయణరావు, కోన శీతారామారావు గారలు మచిలీపట్నమునుండి విచ్చేసిరి. సుప్రసిద్ధ "వందేమాతరం" కవియగు మంగిపూడి వేంకటశర్మగారు "పిప్పర" నుండి విచ్చేసిరి. బ్రహ్మసమాజ ప్రచారకులు పాలావర్ఝుల లక్ష్మీనారాయణగారు భీమవరంనుండియు, బుద్ధిరాజు పానకేశ్వరరావు గారు నరసాపురంనుండియు విచ్చేసిరి.

---

♦ 1915 వ సంవత్సరమున శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య గారు ఈ గ్రంథాలయ 18 వ వార్షికోత్సవమున కధ్యక్షత వహించిరి. అధ్యక్షోపన్యాసమును చిత్రపటమును గూడ వేరొకచోట ఈ సంపుటమున జూడనగును.

ఆ వార్షికోత్సవమునకు అధ్యక్షులుగానున్న శ్రీ పంతులుగారు తమ అంత్యోపన్యాసమునందు, మన దేశము అభివృద్ధికి రావలెనన్న మత సాంఘిక రాజకీయ విషయములలో నొక్కసారిగా సంస్కరణములను చేసుకొనవలసినదనియు, ఇందు ఒక్క విషయమునందు మాత్రమే అభివృద్ధిని పొందినయెడల అది అభివృద్ధియే కాదనియు, మన మందరము వాక్శూరులమేగాక కార్యశూరులముగా కూడ నుండవలయుననియు, మన దేశము యొక్క అభివృద్ధికొరకు మన అర్థమును శరీరమును అవసరమైనయెడల ప్రాణమును సహితము అర్పించుటకు సిద్ధముగా నుండవలెననియు— మనము సులభముగా నెరవేర్చుకొనగల సంఘసంస్కరణమును ముఖ్యముగా ప్రథమమున చేయవలయుననియు సెలవిచ్చిరి.

ఆదినముననే పంతులుగారు ఈ సమాజమును గూర్చి తమ అభిప్రాయమును వారి స్వదస్తూరితో ఈ క్రింది విధముగా వ్రాసిన దానిని కార్యకర్తలు ఇప్పటికిని భద్రముగా దాచిపెట్టిరి.

"ఈ క్లబ్ వారు చేయుచున్న పనికి నా కత్యంతానంద మగుచున్నది. వీరు సమస్త విషయములలోను జనుల కభివృద్ధి కలిగించుటకయి పాటుపడుచున్నారు.

"ప్రార్థన సమాజముద్వారా జనులలో పరిశుద్ధాస్తిక మత సిద్ధాంతమును వ్యాపింపజేయుటకై కృషి జేయుచున్నారు. రాత్రి పాఠశాలను బెట్టి పగలు పనిచేయుచు చదువుకొనుట కవకాశములేని బీదవారిలో విద్యాభివృద్ధి చేయుటకు ప్రయత్నించుచున్నారు. సాంఘిక విషయము లందును, రాజ్యాంగ విషయములందును, ప్రజల నుద్బోధించి తమ స్వాతంత్ర్య పౌరహక్కులను వారికి బోధించి వారి యభివృద్ధికి దోడ్పడు చున్నారు. సంపూర్ణ దేశాభిమానులయి సమస్త విధముల దేశాభివృద్ధికయి నిరంతర కృషి చేయుచున్న యీ సమాజమువారు, తమ సమాజమునకు నా పేరు పెట్టుట నా కత్యంత గౌరవావహమని భావించి సంతోషించుచున్నాను. భక్తాభీష్ట ప్రదాతయైన పరమేశ్వరుడు వీరి సదుద్యమముల

నెల్ల సఫలము చేయుచు ఈ సమాజమును చిరకాలము వర్ధిల్ల జేసి, దీనివలన దేశమునకు శ్రేయోభివృద్ధిని కలిగించుగాక !"

"స్వయంతీర్ణః పరాంస్తారయతి"—తాను బాగుపడి తోటివారలను బాగుచేయవలెననెడి తీవ్రవాంఛ మనుష్య స్వభావమున నిగూఢముగా నున్నది. ఏ కాలమందైనను ఏ దేశమునందైనను — మానవకోటి ఉద్ధరణకుగాని దేశసౌభాగ్యమునకుగాని పాటుబడిన మహనీయులందరు అట్టి వాంఛచేత ప్రేరితులైనవారే అట్టి మహనీయుల కోవకు జెందినవారే శ్రీ వీరేశలింగము పంతులుగారు.

## ఆంధ్ర గ్రంథాలయోద్యమ స్వరూప స్వభావములు

ఆంధ్రాభ్యుదయమునకు దోహద మొనర్చి, ఆంధ్ర సంస్కృతికి ఉత్తేజము నొసంగిన మహోద్యమముల కెల్ల గ్రంథాలయోద్యమము మూలకందము. ఇతర దేశము లందలి విజ్ఞానోద్యమము లన్నియు మనుజుని మేధాశక్తిని మాత్రము వృద్ధినొందించుటకే ప్రయత్నము లొనర్చుచుండ ఆంధ్ర గ్రంథాలయోద్యమము మనుజుని సంపూర్ణమానవత్వమును వ్యక్తీకరించుటకు తగిన సాధనసామగ్రి నంతయు సమకూర్చుకొన్నది. దేశము నలుమూలల జ్ఞాన బీజముల నిక్షేపించి మానవుని ఆధ్యాత్మిక శక్తుల నుత్తేజింపజేసి యాతని జీవితయాత్ర పవిత్రముగను పురుషార్థ సాధకముగను నొనరించుట మన యుద్యమము యొక్క పరమాశయము.

ఇదియే ఆంధ్ర గ్రంథాలయోద్యమము యొక్క స్వరూపము—స్వభావము.

ఇట్టి మహోన్నతమైన ఆశయములచే ప్రేరితులై జ్ఞానజ్యోతిని వెలిగించి శ్రీ వీరేశలింగము పంతులుగారు తన జీవితమును దేశమున కంకితము గావించిరి.

అజ్ఞానములో, అమాయకత్వములో, శవిత సంస్కారమే లేని ప్రజాసామాన్యులకు— విద్య, విజ్ఞానము, సంస్కారము, సమానత్వము లను ప్రసాదించుటకై — సాంఘికముగ రాజకీయముగ జరుగుచున్న

అన్యాయములను ధైర్యముతోను స్థైర్యముతోను ఎదుర్కొని ఉత్తేజమును జనులయందు కలిగించుటకై-శ్రీ పంతులుగారు సర్వవిధముల తన జీవితము నంతను ధారబోసిరి.

## నూతన శక కర్త

1870 వ సంవత్సరము మొదలు 1900 సంవత్సరము వరకు గల మూడు దశాబ్దులు ఆంధ్రదేశములో గ్రంథాలయశక ప్రథమ దశ యని చెప్పవచ్చును.నవ్యాంధ్ర జాతీయవికాసమునకు అభ్యుదయమునకు అది యొక విశిష్టమైన కాలము. పందొమ్మిదవ శతాబ్దాంతమున,ఇరువదియవ శతాబ్ది ప్రారంభమున, ఆంధ్రదేశమునందు ఆవిర్భవించిన అభ్యుదయోద్యమము లన్నింటికిని శ్రీ వీరేశలింగం పంతులుగారే పునాదులు వేసినారు.

ఈనాడు ఆంధ్రదేశమునందు జరుగుచున్న వైజ్ఞానిక-సారస్వత రాజకీయ- ఆర్థిక- సాంఘిక విప్లవము లన్నింటికి శ్రీ పంతులుగారే నాందిని పలికినారు.

ఆంధ్ర ప్రజయొక్క సర్వతోముఖ వికాసమునకు పంతులుగారి కృషి అనన్యము, అసామాన్యమునై, నూతన చైతన్యమునకు దోహదకారియైనది.

ఆ గ్రంథాలయ శక ప్రథమదశయందు దేశము ఆర్థికముగ హీన స్థితిలో నున్నదనియు-విదేశీయుల యంత్రముల పోటీకి ఆగలేక గృహపరిశ్రమలు నశించినవనియు-విదేశీయులనుండి వస్తువులను దిగుమతి చేసికొనుటవలన మన దేశములో దారిద్ర్యము తాండవించుచున్నదనియు-మనకు అవసరమైనవస్తువులు మన దేశములో మనమే తయారు చేసికొనుటకు ధనవంతులు పూనుకొనవలెననియు- ఆయన శంఖారవమొనరించినారు.

మన దేశములో కరువు తిష్ఠవేసికొన్నది - వ్యవసాయము చేయదగిన భూమి చాలాభాగము బంజరుగా నుండిపోయినది- వ్యవసాయ

పద్ధతులు శాస్త్రీయముగ రూపొందించి పంటల నభివృద్ధిపరచి కరువుల నుండి దేశమును రక్షింపనగును - అని వారు ప్రబోధము చేసినారు.

ప్రభుత్వోద్యోగులలో ప్రబలిపోవుచున్న లంచగొండితనమును రూపుమాపినగాని, దేశమును నైతిక పతనమునుండి రక్షింపలేమని కనిపెట్టి,అందుకై స్వయముగ అనేక కష్టములకు పాల్పడినను పంతులు గారు ప్రబోధమును మానలేదు.

దేశములో గొప్ప ఉద్యోగములను దేశీయులకు ఇచ్చినగాని, స్వపరిపాలనాభిలాష పెంపొందజాలదని నిర్భయముగ వాదించినారు.

జాతి మత ద్వేషములు లేకుండ, ఐకమత్యము - నిష్పాక్షిక దృష్టి - ఏర్పడినయెడల జాతీయ సమైక్యము సులభసాధ్యమని నిరూపించినారు.

ఇండియన్ నేషనలు కాంగ్రెసునకు, అది స్థాపించిన మూడవ సంవత్సరము (1887) లోనే ఆయన ప్రతినిధిగ బోయి, కాంగ్రెసు మహోద్యమమును బలపరచి ప్రచారము చేసినారు.

దేశము కోసము తమ కాలమును — ధనమును-ప్రాణములను సైతము- పూర్తిగ త్యాగముచేసి పనిచేయు దేశసేవకులు కావలెనని ప్రబోధించినారు.

దేశస్థితి బాగుపడవలెనన్నచో—జనులయందు ఉత్తేజము కలగ వలెనన్న - అందుకై జనసామాన్యమునందు విజ్ఞానము వ్యాపించవలె ననియు, ఆ విజ్ఞానము వ్యాపించుటకు విద్యా ప్రచారము అత్యంతా వశ్యకమనియు,పంతులుగారుకనిపెట్టినారు.అందుకై పగటిపాఠశాలలను, వయోజనులకై ప్రత్యేకముగ రాత్రి పాఠశాలలను పెట్టించినారు.ఇండ్లు వదలలేని గృహిణులకై ప్రత్యేక తరగతులను గూడ నడిపించినారు. మరియు ఇట్టి సేవాకార్యములను నడుపుటకై జనులు తరుచు కలియుట కొరకు - ఆయా విషయములనుగూర్చి ఆలోచించుట చర్చించుట మొదలగు కార్యములను ఆచరించుటకు - సంఘములను, సమాజము లను, గ్రంథాలయములను స్థాపించినారు.

## నవచైతన్య దోహద గ్రంథముల కొరత

ఆ కాలమున ఆంధ్రభాషయందు పురాణములు, ప్రబంధ ములు, మొదలైన ప్రాచీన సాంస్కృతిక గ్రంథములేగాని, జనసామాన్యము అవగాహన చేసికోదగిన నూతనములైన గ్రంథములు సులభశైలిలో లభ్యముగాకుండెను.

చిన్నయసూరి నీతిచంద్రిక — విక్రమార్కుని కథలు-పంచ తంత్రము - ఇవియే అప్పటికి తెలుగులోనున్న వచనగ్రంథములు. అందుచే స్త్రీలు, బాలురు, సామాన్య జనులు చదువు కొనుటకును అర్థముజేసికొనుటకును పంతులుగారు వచన వాఙ్మయమును సృష్టించినారు.

నవీన కాలానుకూలముగ జన్యములైన సమస్యలను, నూతన దృక్పథములనుగూర్చిన గ్రంథములు—జనుల జీవిత సమస్యలనుపరిష్క రింపజాలు గ్రంథములు-బొత్తిగాలేవు. జనులయందు విజ్ఞాన తృష్ణను పెంపొందించి గ్రంథాలయములను స్థాపించినారు; పిమ్మట, వానికి తగిన గ్రంథములను కూడ సమకూర్చవలెనని పంతులుగారు తలపెట్టినారు.

జనుల అభివృద్ధికి విజ్ఞానము ఆవశ్యకము; విజ్ఞానమునకు విద్య ఆవశ్యకము— విద్యకు గ్రంథములు ఆవశ్యకము.అన్ని గ్రంథములును అందరకు అందుబాటులో నుండుటకు గ్రంథాలయములు ఆవశ్యకము. ఇటుల ఇవి యన్నియును అవినాభావ సంబంధమును గలిగియున్నవి.

అందుచేత వీరేశలింగం పంతులుగారి దృష్టి ఆంధ్ర వాఙ్మ యము వైపునకు మరలినది; దేశమును ఉరూత్రిత లూగించుచున్న సమస్య లన్నియు పంతులుగారి దృష్టిముందర తాండవింపజొచ్చినవి. ఆంధ్ర వాఙ్మయమును విషయములనుబట్టి వర్గీకరణముజేసి జూచిరి. పూరించవలసిన కొరతలేమో తేలినవి.

ఇట్టి దశయందు ఆధునిక ఆంధ్ర వికాసమునకు అగత్యములగు గ్రంథము లన్నింటిని రచించుటకు - ఆంగ్లేయ, సంస్కృత భాషల

నుండి అనుకరించుటకును, భాషాంతరీకరించుటకును పంతులుగారు పూనుకొనిరి.

ఒకవంక పండితులుగూడ మెచ్చురీతి పాండిత్యమును వైదుష్యమును ప్రకటించు పద్యకావ్యములను వ్రాసినారు; మరియొకవంక జనసామాన్యమునకు గూడ అర్థమగురీతిని దేశచరిత్రలు – జీవిత చరిత్రలు – ప్రహసనములు – కథలు — నవలలు — నాటకములు వ్రాసినారు. సంస్కృతభాష యందున్న వేదాంతము మొదలగు నిగూఢ శాస్త్ర విషయములనుగూడ, సులభశైలిని, సర్వులకు అర్థమగు శైలిని వ్రాసి అందరికిని అందించినారు. స్త్రీల యుపయోగమునకై ప్రత్యేకముగ గ్రంథములనువ్రాసినారు. బాలుర అవసరములను గూడ వారు మరచిపోలేదు.

వారు వినోదమునకై వ్రాసిన గ్రంథములందు సయితము విజ్ఞానమును పరమార్థమును సమ్మిళితము చేసినారు.

మొత్తము నూట ఇరువది గ్రంథములకుపైగ వ్రాసి, గ్రంథాలయములకు జ్ఞాననిధులను పంతులుగారు సమకూర్చినారు.

శ్రీవారు వ్రాసిన గ్రంథములవలన ఆంధ్రజాతీయ జీవనమునందు నూతన శకము ఆవిర్భవించినది.

పంతులుగారు స్పృశించి అలంకరింపని విజ్ఞానశాఖ లేదనియే చెప్పవచ్చును. వారి గ్రంథము లన్నియు కలిసి ఒక విజ్ఞానకోశము [Encyclopaedia] కాగలదు.

నాడు మొదలు నేటివరకు, ఆంధ్రదేశమున వారి గ్రంథసంచయములేని సార్వజనిక గ్రంథాలయమే లేదు.

## ప త్రి కా ప్ర చు ర ణ ము

గ్రంథాలయములకు పుస్తకములు ప్రధానములే; అయినను పత్రికలు అంతకంటె ఎక్కువ ప్రధానములు– నిత్యజీవిత సమస్యలను పత్రికలలో వ్యాసముల రూపమున ప్రముఖులు చర్చించుచుందురు. ఆ చర్చలను చదువుటవలన, పాఠకులు తమ సమస్యలను పరిష్క-

రించుకొనుటకు—తమ ఊహాపోహాలకు దోహద మొసగగల విషయము లను సంపాదించుకొన్నవా రగుదురు. ఇదియుగాక, పత్రికలలోని వ్యాస పరంపరలలో నూతన పరిశోధనలు – నూతన సమస్యలు — నూతన దృక్పథము – నూతన పరిష్కారములు · నిత్య నూతనముగ అవగత మగుచుండును. అట్టివి గ్రంథస్థము లగుటకు చాలకాలము పట్ట వచ్చును; మరియు అట్టివి కొన్ని గ్రంథస్థములు కాకుండ విస్మృతము లగుటయు గూడ సంభవింపవచ్చును.

జనుల నిత్యజీవిత ప్రయోజనమునకు పత్రికలు చేయగల సహాయ ప్రాముఖ్యమును గనిపెట్టి పంతులుగారు వివేకవర్ధని, సతీహిత బోధిని, హాస్యసంజీవిని, చింతామణి, అను మాసపత్రికలను; సత్యవాదిని యను వారపత్రికను ప్రచురించినారు. తన యుద్యమములకు ప్రతిపక్షులైన వారి వాదములను ఖండించుటకు తన అభిప్రాయములను, అభిమతము లను నిర్భయముగా వెలడించుటకు పత్రికలు వారికి ఎంతయు నుపయో గించినవి.

ఈ రీతిగా కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర గ్రంధాలయోద్యమ జనకులై వెలయుట మన భాగ్యవిశేషము.

## వీరేశలింగముగారి గ్రంథములు

శ్రీ వీరేశలింగం పంతులుగారు రచించిన ప్రముఖ గ్రంథ ములలో కొన్నిటిని ఇచట ఉదహరించుచున్నాను.

### ప్రహసనములు

అభాగ్యోపాఖ్యానము
సరస్వతీ నారద విలాసము
బ్రాహ్మ వివాహము
తిర్యగ్విద్వన్మహాసభ
మహారణ్య పురాధిపత్యము
మహామహోపాధ్యాయ ప్రహసనము
యోగ నిద్రా ప్రహసనము
మహావంచక ప్రహసనము
అసహాయ శూర ప్రహసనము
కలిపురుష శనైశ్చర్య విలాసము
వేశ్యా ప్రియ ప్రహసనము
యోగాభ్యాసము

## నవలలు

రాజశేఖర చరిత్ర
సత్యరాజు పూర్వ దేశయాత్రలు
మొదలగునవి.

## పద్య కావ్యములు

శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధము
శుద్ధాంధ్ర భారత సంగ్రహము
శుద్ధాంధ్రోత్తర రామాయణము
అభాగ్యోపాఖ్యానము
పథిక విలాసము
రసిక మనోరంజనము
జాన్ గిల్పిన్

## స్త్రీల గ్రంథములు

సత్యవతీ చరిత్ర
చంద్రమతీ చరిత్ర
సత్య సంజీవని
నీతి కథామంజరి
దేహారోగ్య బోధిని
పత్నీహిత సూచని
పతీహిత బోధిని
స్త్రీ నీతి దీపిక
సత్యా ద్రౌపదీ సంవాదము
చమత్కార రత్నావళి

## నాటకములు

అభిజ్ఞాన శాకుంతలము
మాళవికాగ్నిమిత్రము
ప్రబోధ చంద్రోదయము
రత్నావళి
ప్రహ్లాద
వివేకదీపిక
దక్షిణ గోగ్రహణము
సత్యహరిశ్చంద్ర
కళ్యాణ కల్పవల్లి
కామెడీ ఆఫ్ ఎర్రర్స్

## చరిత్రలు

ఆంధ్ర కవుల చరిత్ర
స్వదేశ సంస్థానముల చరిత్ర
జీససు చరిత్ర
విక్టోరియారాణి
ఉత్తమ స్త్రీలచరిత్రలు
శంకరాచార్య చరిత్రము
స్వీయ చరిత్రము

## ఉపన్యాసములు

సత్యవాదిని
వివేకవర్ధని
ఉపన్యాస మంజరి
దేశీయ మహాసభ – దాని యుద్దేశములు

## మతము

అద్వైత మత సంగ్రహము
ద్వైత మత సంగ్రహము
విశిష్టాద్వైత మత సంగ్రహము

నీతి గ్రంథములు

విగ్రహము
సంధి

శాస్త్ర గ్రంథములు

ఆంధ్ర వ్యాకరణము
కావ్యసంగ్రహము
ఆంధ్ర తర్క సంగ్రహము
పదార్థ వివేచకశాస్త్రము
శారీర శాస్త్రము
జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము
జంతు స్వభావచరిత్ర
భౌతిక భూగోళ శాస్త్రము
ఖగోళ శాస్త్రము

శ్రీ కందుకూరి వీరేశలింగం స్మారకోత్సవముల సంఘం - హైదరాబాదు వారు ప్రచురించిన "యుగపురుషుడు - వీరేశలింగం" అను శీర్షికగల వ్యాససంపుటి నుండి సేకరింపబడినది.

---

# ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ ప్రగతి - గ్రంథాలయచట్టమునజేయవలసినమార్పులు

---

## నాటి దేవాలయమే నేటి గ్రంథాలయము

పూర్వము దేవాలయ ధర్మకర్తలును, పూజారులును జీవితాదర్శసిద్ధికొరకు- ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములను సాధించుటకు-తద్ద్వారా దేశశాంతి కళ్యాణ ప్రాప్తికొరకును- దేవాలయముల ప్రతిష్ఠించి, దేవతల నారాధించి జ్ఞానజ్యోతిని వెలిగించి అజ్ఞాన తిమిరమును బాపుకొని తరించిరి.

దేవాలయమునకును గ్రంథాలయమునకును భేదము లేదు. దేవాలయములన్నియు గ్రంథాలయములే. గ్రంథాలయములన్నియు వాగ్దేవియొక్క ఆలయములే. భారతీ సదనములే. ఈ రెండింటికిని గల ద్వైతభావమును విస్మరించి నేడు అద్వైత భావమును సాధించవలెను.

ఆనాడు దేవాలయములను ప్రతిష్ఠింపజేసినవారు ధర్మకర్తలు. ఈనాటి సరస్వత్యాలయ ప్రతిష్ఠాపకులు ప్రభుత్వము. ఆనాటి దేవాలయ పూజారులే నేటి సరస్వత్యాలయ భాండాగారులు. ఉభయులు ధర్మ ప్రతిష్ఠాపకులై వారి విధ్యుక్త ధర్మమును - త్యాగమూర్తులై, ప్రతిష్ఠాపనల పరమ ప్రయోజనములను విస్మరించక - నిర్వహించినచో ప్రజా హృదయమున ప్రజ్ఞాన జ్యోతి వెలిగి అజ్ఞాన తిమిరము పటాపంచలై వారు పురుషార్థసాధనకు పురోగమించగలరు.

అపుడు గ్రంథాలయము ప్రజా విశ్వ విద్యాలయమై నిరక్షరాస్యతను నిర్మూలించును. దేశ కళ్యాణమునకు విజ్ఞాన జ్యోతుల వెలిగించి నిత్యకళ్యాణము పచ్చతోరణముగ నొనర్చగలదు.

## ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్రను మనము పరిశీలించినచో అది యొక సజీవ స్రవంతిగ-ప్రజోత్సాహ ప్రోత్సాహములతోడి వెల్లువగ- ఆంధ్రదేశమున నలుమూలల ప్రవహించి పునీతము జేసి అనేకములైన ఇతర ఉద్యమ బీజములను మొలకెత్తించి, వానికి దోహదము జేసి దేశాభ్యుదయమునకు కారణభూతమైనటుల మనకు విస్పష్టమగును.

గ్రంథాలయోద్యమము మన దేశ స్వాతంత్ర్యోద్యమ వీరులను సమకూర్చినది. గ్రంథాలయ ప్రాంగణమె వరి ప్రావ్యమునకు ప్రధానాధారభూతమైనది. వయోజన విద్యా వ్యాసంగమువలన విజ్ఞాన భిక్షను బెట్టినది. ఇంతయేల? దేశమునందలి సర్వ సంక్షేమ కార్యకలాపములకు రంగస్థలమై గ్రంథాలయము అందరి ఆదరాభిమానములను అందుకొన్నది.

ఆంధ్రదేశమున నవీన గ్రంథాలయోద్యమమునకు బీజములు 1886వ సంవత్సరముననే అంకురించినవి. అప్పటినుండియు క్రమాభివృద్ధి నొందుచు 1914వ సంవత్సరమున "ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము" స్థాపింపబడిన నాటినుండియు అదియొక యుద్యమ రూపము

నొంది పలు మార్గముల పలు విధముల దేశసేవ జేసినది. 1913వ సంవత్సరమున జరిగిన ఆంధ్ర మహాసభాఫలితముగు "ఆంధ్రోద్యమము"నకు గ్రంథాలయములన్నియు ప్రచారశాఖలై బహుళ ప్రయోజనమును సాధించినవి. అంతియేగాక 1917 వ సంవత్సరమున ఆనీ బిసెంటుగారి "హోంరూలు" ఉద్యమమునకు ఉనికిపట్టులై ఉత్తమమైన సేవ జేసినవి. 1923 వ సంవత్సరమున గాంధీ మహాత్ముని అసహాయోద్యమమునకు ఆటపట్టులై అచంచలమైన దీక్షతో అసహాయోద్యమ వీరులను తయారు జేసినవి.

దేశమున నలుమూలల ప్రజలు చైతన్య పూరితులైనారు. జ్ఞానతృష్ణ, విజ్ఞానపిపాస అధికము గాజొచ్చినది. వివిధ విషయములను గురించిన గ్రంథములు తెలుగున వ్యాఖ్యములను విషయము స్మరణకు వచ్చినది. ప్రచార ప్రయోజనము సర్వవిధముల ఆశించిన కార్యమును సాధించిన తరువాత గ్రంథాలయ నిర్వహణము, పరిపాలనయు గూడ శాస్త్రీయ దృక్పథముతో సమీకరణము చేయవలసిన పరిస్థితు లేర్పడినవి. అందువలన 1920 వ సంవత్సరము నుండియు "ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘమును" "ఆంధ్ర దేశ గ్రంథాలయ సేవక సంఘము"నుగూడ పలుప్రదేశములందు శిబిరముల నేర్పాటు జేసి విద్యార్థులకు తగు గ్రంథాలయ శాస్త్ర శిక్షణ నిచ్చినవి.

## ప్రభుత్వ సహాయము

ప్రజోద్యమముగ గ్రంథాలయోద్యమ మెంత విజయవంతమైనను ప్రభుత్వ సహాయము కూడ ప్రజోత్సాహమున కనుగుణముగ నుండిన గాని-విదేశములందువలె సర్వతోముఖమైన కృషిజరుగుట కవకాశము గనుపించదయ్యె! ఈ భావమును పురస్కరించుకొనియే దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు మద్రాసు శాసన నిర్మాణ సభయందు సభ్యులుగ నున్నపుడు కృషి జేసి ప్రభుత్వమునుండి ప్రతి సంవత్సరమును గ్రంథాలయములకు కొంత సహాయము లభించునటుల జేసిరి. అయినప్పటికిని ఆ సహాయము లవగింజలో అరభాగమైన గాకుండెను.

## మద్రాసు రాష్ట్ర గ్రంథాలయ చట్టము

అట్టి పరిస్థితులలో మన దేశమునందుగూడ విదేశములందువలె గ్రంథాలయోద్యమ పరిపాలనకొక ప్రత్యేకమైన శాసన ముండిన యెడల ఉద్యమము ప్రగతి నొందగలదని భావించి తగు ప్రయత్నముల జేసితిమి. ప్రయత్నములు 1933 వ సంవత్సరమున ప్రారంభమైనను అది కార్యరూపము నొందునప్పటికి 1948 వ సంవత్సరము వచ్చినది. తుదకు ఆ ప్రయత్న ఫలితముగ ఆ సంవత్సరమున "మద్రాసు రాష్ట్ర గ్రంథాలయ చట్టము" ఆవిర్భవించినది. ఈవిధముగ ఆంధ్రదేశమున ప్రాదుర్భావము నొందిన గ్రంథాలయోద్యమ నిర్విరామ కృషి ఫలితముగ గ్రంథాలయ శాసన నిర్మాణ గౌరవము ప్రప్రథమముగ యావద్భారత దేశమునందును మద్రాసు రాష్ట్రమునకే దక్కినది. అందులకు సంతోషించినను మనుమింట్లు ఆనాడే దానిలో ఉన్న లోపములను నిష్కర్షగ విమర్శించి ప్రభుత్వమునకును, శాసన నిర్మాణ సభాసభ్యులకును ప్రజలకును స్మరణకు దెచ్చితిమి.

అప్పటికే అర్ధశతాబ్దినుండియు అఖిలాంధ్రదేశమునందు సార్వజనిక గ్రంథాలయములు ప్రజల స్వయంశక్తియుక్తుల ఫలితముగ అల్లిబిల్లిగ నల్లుకొని ప్రజా చైతన్యమునకు ప్రజోద్యమ పటిష్ఠతకు నిదర్శనభూతములై యొప్పినవి. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము ఆదర్శవంతముగ పనిజేసి అఖిల భారత గ్రంథాలయోద్యమమునకు కారణభూతమైనది. అట్టి ప్రజోద్యమ పటిష్ఠతను గుర్తించకపోగా విస్మరించి దాని యనుభవమును, పల్లీ పట్టణ ప్రాంగణముల సాంఘిక సంక్షేమ కేంద్రములై విలసిల్లినధర్మగ్రంథాలయముల యునికిని, అనుభవమును, ప్రాతిపదికగ దీసికొనకుండ గ్రంథాలయ శాసన నిర్మాణమును జేసిరి. సుప్రసిద్ధ విజ్ఞానవేత్త, సహకారోద్యమ నాయకులైన శ్రీ॥ శ్రీ॥ వేమవరపు రామదాసు పంతులుగారు కూడ ఆనాడే ఈ చట్టమువలన గలుగగల మేలుకన్న కీడు ఎక్కువగ నున్నదని చాటిరి.

పిమ్మట ఆంధ్రరాష్ట్ర నిర్మాణానంతరము కూడ మద్రాసు గ్రంథాలయ శాసనమే మనకు అనుసరణ యోగ్యమైనది.

అంతకు పూర్వము హైదరాబాదుస్టేటువారు వారికొరకై "హైద్రాబాదు పౌర గ్రంథాలయ శాసనము" నొకదానిని రూపొందించిరి. ప్రప్రథమములో నేర్పడిన "మదరాసు పౌరగ్రంథాలయ శాసనము" లోనున్న కొన్ని లోపముల నా శాసనము సవరించినను అదియుగ్రంథాలయప్రజోద్యమమున కాదర్శప్రాయముగా లేదు.

## కొత్త గ్రంథాలయ చట్టము

తరువాత రాష్ట్ర పునర్విభజన సమయమున మద్రాసు రాష్ట్రము నుండి విభజించిన ఆంధ్రరాష్ట్రము, హైదరాబాదు రాష్ట్రము నందలి తెలంగాణము కలిసి యేర్పడిన ఆంధ్రప్రదేశ్ అవతరించినది. అందుచేత పూర్వమున్న "మద్రాసు పౌర గ్రంథాలయ శాసనము" "హైదరాబాద్ పౌర గ్రంథాలయ శాసనము"-రెండింటిని పూర్వానుభవములను పురస్కరించుకొని సమన్వయపరచి వేరొక సమగ్రమైన క్రొత్తశాసనము చేయునవసర మేర్పడినది. ఒక క్రొత్తచట్టమును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 1960 వ సంవత్సరమున రూపొందించిరి.

ఇది వరకు అమలులోనున్న రెండు శాసనములలోను ప్రజల స్వయంశక్తియుక్తులతో నిర్మింపబడి వారి కృషిచే నిర్వహింపబడుచున్న గ్రంథాలయములకు తగిన స్థానము నిందీయలేదు.

1960 వ సంవత్సరమున రూపొందించిన నూతన "ఆంధ్రపదేశ్ గ్రంథాలయ పౌర శాసనము" నందు పూర్వము మేర్పడిన రెండు శాసనముల దృష్ట్యా అనేకములైన మార్పులను జేసిరి కాని అసలు ప్రధానములైన లోపములను సవరణము చేయనేలేదు.

## గ్రంథాలయ కార్యకర్తలకు సముచితస్థానము

ప్రస్తుతము చట్టములోని నిబంధనల ననుసరించి గ్రంథాలయోద్యమములో నింతకు పూర్వమును, ఇప్పుడును కృషి జేయు కార్యకర్తలు ఎన్నికలలో పాల్గొని విజయము సాధించుట సుసాధ్యముగాదు.

సర్వ సాధారణముగ ఎన్నికల వ్యవహారములలో అవలంబించవలసిన అనర్థకరములైన పద్ధతు లవలంబించినగాని కృతకృత్యులు గాజాలరు.

ప్రస్తుతము "లోకల్ లైబ్రరీ అధారిటీ"లకు ఎన్నుకొనబడు సభ్యులనేకులు గ్రంథాలయ నిర్వహణముతోగాని, గ్రంథాలయోద్యమముతోగాని సంబంధము లేనివారలే.

ఇక ప్రభుత్వమువారు నియమించు (నామినేటు చేయు)లోకల్ లైబ్రరీ అధారిటీ సభ్యులుగూడ గ్రంథాలయ కార్యనిర్వహణ నిపుణులుగారు. కడచిన పర్యాయము 21 జిల్లాలలో లోకల్ లైబ్రరీఅధారిటీలలో నియమింపబడిన 84 నామినేటెడ్ స్థానములలోను సరాసరి గ్రంథాలయ పరిపాలనతో సంబంధము గలవారు పదిమందికూడ లేరని చెప్పిన నతిశయోక్తి కాదు. రాజకీయ వాతావరణ మిందు ప్రవేశించినదని వినికిడి !

ఇట్టి పరిస్థితులు మారవలెను. సార్వజనిక ధర్మ గ్రంథాలయ పరిపాలనతో సన్నిహిత సంబంధమును, అనుభవము ఉత్సాహమును గలవారు మాత్రమే లోకల్ లైబ్రరీ అధారిటీలలో సభ్యులగుటకు సంపూర్ణావకాశము గలుగజేయవలెను. అట్టి పరిస్థితులలోనే గ్రంథాలయములు గ్రామ సేవా కేంద్రములుగ నిర్వహింపబడగలవు. లేకపోయినచో గ్రంథాలయోద్యమ స్రవంతి అవ్యవహితముగ, అవిచ్ఛిన్నముగ, అఖండముగ ప్రవహించజాలదు.

## గ్రంథ భాండాగారులు

గ్రంథాలయములో పనిజేయు గ్రంథ భాండాగారుల యోగ్యతల ననుసరించియే గ్రంథాలయము సద్వినియోగము కాగలదు. సేవ అను పదమునకు మూర్తి వహించిన వారుగ గ్రంథ భాండాగారు లుండవలెను. గ్రంథాలయ శాస్త్ర శిక్షణతోబాటు సేవా కార్యక్రమమునగూడ తరిబీతు బొందిన వారుగనుండవలెను. గ్రంథాలయ మొక సార్వజనిక విశ్వవిద్యాలయము. అచటికి నానావిధములైన మనో ప్రవృత్తిగల చదువరు లరుదెంతురు. గ్రంథముల పఠింప నిచ్ఛగించువారితోబాటు, వారి వారికి ప్రత్యేకమైన పరిస్థితులు,

సమస్యలు, గ్రంథ భాండాగారితో చర్చించి ఆ సమస్యా పరిష్కార మునకు మార్గదర్శిగాగలడను భావముతో కొందరు గ్రంథాలయ ముల కేగెదరు. అట్టి వారికి భాండాగారి తగు సలహాలను సంప్రదింపు లను ప్రసాదించ సమర్థుడై యుండవలెను. అట్టి సమర్థతయు, సేవా కార్యక్రమ నిర్వహణాసక్తియు గలవారినే భాండాగారిగ నియమించ వలెను. సమయాసమయములను పరిగణించకయే తన విశ్వాసములతో చదువరులను బాధించక, వారి ఆసక్తి కనుగుణముగ గ్రంథముల సంతరించి వారికి బంధువుగ, మిత్రుడుగ, గురువుగా గ్రంథభాండా గారి వ్యవహరించవలెను.

ఇట్టి మహత్తరమైన బాధ్యత గ్రంథ భాండాగారి వహించ గలడాయని ఆశ్చర్యపడనక్కర లేదు. ఉదాహరణకు ఒక ఆఖ్యాయిక నిట వివరించెదను. అమెరికా దేశమున "బెర్నార్డుమేక్ ఫెడర్" అను సుప్రసిద్ధ వ్యాయామశాస్త్ర వేత్త యొకడుండెను. వ్యాయామము వలనను, ఆహార విహార నియమముల వలనను ఎట్టి వ్యాధినైనను — మందులు మాకులు లేకుండగనే— నివారింపజేసికొనవచ్చునని ఆతడు పరిశోధనల వలనను ప్రయోగములవలనను ఋజువు చేసినాడు. ఈనాడు ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన ఆతడు— ఒకనాడు రోగి, బల హీనుడు, విద్యావిహీనుడు, దరిద్రుడు. అట్టిస్థితియందు వీధుల లో తినుటకు తిండియు, కట్టుటకు బట్టయు లేక నిరాశ్రయుడై తిరుగుచుండ యాదృచ్ఛికముగా — ఒక సార్వజనిక గ్రంథాలయమునకు బోయి అక్కడనున్న గ్రంథ భాండాగారిణిని సమీపించగా, నామె యాతని దీనస్థితిని బరికించి ఓదార్చి యాతని గురించిన వివరములనన్నిటిని అడిగి తెలిసికొనెను. అటుల తెలిసికొని ఆ గ్రంథ భాండాగారిణి—అమృత స్వరూపిణి— ఏమి చేసినది! ఆరోగ్య విషయికమైన సూత్రములను కొన్నిటిని— అట్టి స్థితిలో ఆత డాచరించగలవానిని — బోధపరచినది. విద్యాదానమొసగు నొక ప్రాథమిక పాఠశాలను పరిచయము జేసినది. ఈ విధముగ ఆ గ్రంథభాండాగారిణి యొసగిన సలహా సంప్రదింపుల వలన కాలక్రమమున నాతడు ఆరోగ్యభాగ్యమును బొంది, విద్యా

వంతుడై ప్రపంచ విఖ్యాతినొందిన వ్యాయామశాస్త్రవేత్తయై, ఒక దినపత్రిక, కొన్ని వారపత్రికలు, మాసపత్రికలకు సంపాదకుడై, అనేకములైన ఆరోగ్యవిషయిక గ్రంథములకు కర్తయై ఖ్యాతి గాంచినాడు.

ఉత్సాహము, ఇతరుల వర్ధముజేసికొను శక్తి యుక్తులు, సేవా తత్పరత, వైదుష్యము గల గ్రంథభాండాగారియైనచో పాఠకులను తీర్చిదిద్ది వారి జీవితమును ఆదర్శప్రాయముగ జేయగలడు. అందు వలననే గ్రంథభాండాగారి చదువరి, నేర్పరి, తీర్పరి యైయున్నచో గ్రంథాలయ సౌధమును గగన వీధులలోనికి దీసికొనిపోయి విహాయస పథమునందు ప్రతిష్ఠించగలడు.

అందుచే గ్రంథభాండాగారుల నియమించునపుడు తగు జాగ్రత వహించవలెను. గ్రంథాలయశాస్త్ర శిక్షణా తరగతులం దాతనికి కేవల గ్రంథ వర్గీకరణ విషయమేగాక సాహిత్యము, శాస్త్రవిజ్ఞానము, మానసిక శాస్త్రాధ్యయనము మొదలగు ననేక విషయములతోబాటు లోకజ్ఞానము(General knowledge) పాఠ్య విషయముగ నుండవలెను. అనుభవము సంపాదించుటకు పెద్దలై యనుభవజ్ఞులగు భాండాగారులవద్ద కొంతకాలము పనిజేసి యుండ వలెను. ఈ విధములైన యోగ్యతలు గలవారినే భాండాగారులుగ నియమించవలెను. గ్రంథాలయోద్యమ సౌధమునకు గ్రంథభాండా గారి పునాదిరాయి వంటివాడు.

## లోకల్ లైబ్రరీ అధారిటీలు

నేటి "ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయచట్టము" ననుసరించి జిల్లాకొక లైబ్రరీ అధారిటీ — ఒక కేంద్ర గ్రంథాలయము, కొన్ని బుక్ డెలివరీ స్టేషన్లు ఏర్పాటైనవి.

ఉదాహరణకు గుంటూరుజిల్లాను గైకొందము. ఈ జిల్లా యందు సుమారు ఒక వెయ్యి గ్రామములు (పట్టణములతోకూడ) గలవు. ఆంధ్రదేశమునందు ఎక్కువ ఆదాయముగల "లైబ్రరీ అధారిటీ" లలో నొకటి యగు ఈ జిల్లాలోననే చాల గ్రంథాలయ

ములు, బుక్ డెలివరీ స్టేషన్లు కలిపి మొత్తము నూటికి తక్కువగనే యున్నవి.

ఈ శాఖా గ్రంథాలయ నిర్వహణమునందుగాని, వాని పరిపాలన బాధ్యతయందుగాని గ్రామస్థులకు సరాసరి యెట్టి సంబంధమును లేదు. అధమము వాని నిర్వహణమునకు గ్రామస్థులతో గూడిన సలహా సంఘములుగూడ లేవు. అధమము సహకారసంఘ పరిపాలనా నిర్వహణ స్థాయిలోనైన గ్రామస్థులకు గ్రంథాలయములకు సంబంధముండుట అత్యంతావశ్యకము. లేకున్నచో నవి కేవలము ప్రభుత్వ సంస్థలుగనుండి ప్రజలతో నెట్టి సంబంధమును లేక కాలక్రమమున నిర్జీవములై, చైతన్య విరహితములై, జీవచ్ఛవములగును.

పైన వివరించినటుల — ఇపుడున్న పరిస్థితి ననుసరించి ఒక నూరు గ్రామములకు మాత్రము శాఖాగ్రంథాలయములు — బుక్ డెలివరీ స్టేషన్లు కలసి గుంటూరుజిల్లాలో గ్రంథాలయ సేవను జేయుచున్నవి. తక్కిన సుమారు 900 గ్రామముల గతియేమి ?

ప్రతి శాఖాగ్రంథాలయమును ఒక భాండాగారి, అటెండరు, వాచ్ మన్ - కొన్నిటికి ప్రత్యేకము వేరొక సేవకుడు- సిబ్బంది కలిగి యున్నది. ప్రతి గ్రంథాలయమునకు సంవత్సరమునకు సుమారు 3,000 రూపాయలు వ్యయమగుచున్నది గదా! ఈ రీతిగ గ్రంథాలయములను స్థాపించుకొనుచు పోయినచో గుంటూరు "లోకల్ లైబ్రరీ అథారిటీ" వారు - ప్రస్తుతమున్న ఆర్థికస్తోమతు ననుసరించి రాబోవు పాతిక సంవత్సరములలో గూడ జిల్లాయందున సర్వగ్రామములకు గ్రంథాలయసేవ నమర్చలేరుగదా !

గుంటూరుజిల్లా లోకల్ లైబ్రిరీ అథారిటీవారు "కమిటీ" స్థాయిలో నిర్వహింపబడుచున్న వేటపాలెం"సారస్వతనికేతనము"నకు సంవత్సరమునకు ఒక వెయ్యి రూపాయల విరాళము నిచ్చి ప్రోత్సహించు చున్నారు; ఈ రీతిగా కమిటీ గ్రంథాలయములకు సహాయము చేయవలసిన కర్తవ్యమును గుర్తించుట ముదావహము.

# శ్రీ శారదా గ్రంథాలయము - అనకాపల్లి



ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘ పక్షమున గ్రంథాలయ శిక్షణ పాఠశాలను
ఈ గ్రంథాలయమున 1947 మే నెలలో

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య

గార్లచే నిర్వహింపబడినది.

పుట 322

## కృష్ణాజిల్లాలో గ్రామ గ్రామమునకు ఒక గ్రంథాలయము

### లోకల్ లైబ్రరీ అధారిటీ వారి కృషి

అధ్యక్షులు:

శ్రీ కలపాల సూర్యప్రకాశరావు

కార్యదర్శి:

శ్రీ వేములపల్లి చంద్రశేఖరరావు, బి.ఏ;డి.యల్;యస్ సి.

## కృష్ణాజిల్లాలో గ్రామగ్రామమునకు ఒక గ్రంథాలయము

ఆంధ్రదేశమునగల "లోకల్ లైబ్రరీ అథారిటీ" ల లోని కెల్ల "కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ" వారికి ఆదాయము ఎక్కువ. దీని కధ్యక్షులైన శ్రీ కలపాల సూర్యప్రకాశరావుగారు ఉత్సాహవంతులు. గాన 1953 వ సంవత్సరమున "కృష్ణాజిల్లా ప్రథమ గ్రంథాలయ సదస్సు" ను విజయవాడయందు ఏర్పాటుజేసి అనుభవజ్ఞుల యుపన్యాసములను గోష్ఠులను ఏర్పాటుజేసిరి. ఆ సదస్సు ఫలితముగ సూర్యప్రకాశరావుగారు కృష్ణాజిల్లాలోని ప్రతి గ్రామమునకు నొక గ్రంథాలయమును స్థాపించవలెనను ఉద్దేశముతో "లోకల్ లైబ్రరీ అథారిటీ" భావి కార్యక్రమమును రూపొందించవలెనని సంకల్పించిరి.

కృష్ణాజిల్లాలో 24 పంచాయితీ సమితు లున్నవి. ప్రతి సమితి యొక్క కేంద్రస్థానములో ఒక ప్రధాన శాఖాగ్రంథాలయమును, దానికి అనుబంధముగ ప్రతి సమితిలోను రెండు ఉపశాఖా గ్రంథాలయములను స్థాపించవలెననియు, అట్లు జేసినచో మొత్తముజిల్లాలో 24 ప్రధాన శాఖాగ్రంథాలయములును, 48 ఉపశాఖా గ్రంథాలయములును ఏర్పడగలవని నిర్ణయించిరి. ప్రతి సమితి క్రిందను 40 పంచాయతు లున్నవి. కాలక్రమేణ పంచాయతు లన్నియు గ్రంథాలయములను స్థాపించి నిర్వహించవలసిన బాధ్యత గలదు. ప్రతి సమితిలోనుగల మొత్తము 3 శాఖా గ్రంథాలయములును 40 పంచాయితి గ్రంథాలయములకు పుస్తకములను అందించుచుండును, గ్రామ పంచాయితీ గ్రంథాలయములు వాని వాని సరిహద్దులలో గ్రంథసేవ జేయుచుండును మొత్తం ప్రణాళికా స్వరూపము ఇది.

ప్రస్తుతము సమితులు ప్రతి గ్రామములోనను పంచాయితీ ద్వారా పఠనమందిరముల నేర్పాటు చేయుచున్నవి. వానికి కొంత గ్రాంటునుకూడ నిచ్చుచున్నారు. అట్టి పంచాయితీలలో "లోకల్ లైబ్రరీ అథారిటీ" నుండి పుస్తకసేవను అనుసంధానము చేయ వచ్చును. ఈ విధముగ పరస్పర సహకార సమాజీవన పద్ధతితో కృష్ణా

జిల్లాలో ప్రతి గ్రామమునందును గ్రంథాలయము స్థాపించు నాశయమును నిర్ణయించుకొని కార్యక్రమము ప్రారంభింపబడినది.

ఉయ్యూరు సమితిని ప్రాతిపదికగ బెట్టుకొని 1963 లోననే ఈ కార్యక్రమము ప్రారంభింపబడినది. ఆ సమితిలో నంతకుపూర్వమేగల రెండు శాఖాగ్రంథాలయములలోగల ఉద్యోగులతోడనే, మూడవ శాఖా గ్రంథాలయమునుగూడ స్థాపించి రెండు సంవత్సరములు కార్యక్రమము జయప్రదముగ నిర్వహింపబడినది. ఈ సమితిలో పొందిన అనుభవము, జయమును పురస్కరించుకొని మరికొన్ని సమితులలోగూడ పైన వివరించిన గ్రంథాలయ విస్తరణ కార్యక్రమము అమలులో పెట్టబడినది. ఇట్టి కార్యక్రమ మవలంబించుటచే అయిదు సంవత్సరములకు పూర్వము కృష్ణాజిల్లాలో 40 శాఖా గ్రంథాలయములు మాత్రమే యుండగా నేడు 70 శాఖా గ్రంథాలయములు వెలసి పనిచేయుచున్నవి.

వ్యగ్రోత్సాహమును, కార్యదీక్ష, నిర్మాణకౌశలమును, చాకచక్యమును గల శ్రీ కలపాల సూర్యప్రకాశరావువంటివారు అధ్యక్షులుగను, నిరంతర పరిశ్రమతో వారికి తోడునీడగనుండు శ్రీ వేములపల్లి చంద్రశేఖరరావు వంటి కార్యదర్శియును గలిగిన – ఆంధ్రప్రదేశమందలి యితర లోకల్ లైబ్రరీ అథారిటీలు గూడ ఇట్టి కార్యక్రమమును అనుసరింపనగును.

అపుడు గ్రంథాలయోద్యమ స్రవంతి అవిచ్ఛిన్నముగ ప్రవహించి దేశము నంతను పునీతముచేసి జ్ఞాన బీజాంకురముల మొలకలెత్తించి విజ్ఞానవంతముగ జేయును.

## కమిటీ గ్రంథాలయములు- వాని దీనస్థితి-

స్వయముగ ప్రజలచే వారిశక్తియుక్తుల సంఘటిత పరచి – స్థాపింపబడిన గ్రంథాలయములకు "కమిటీ" గ్రంథాలయములని "ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము" నందు పేరు.

కడచిన సుమారు నూరు సంవత్సరములనుండియు ప్రజా గ్రంథాలయములు ప్రజల స్వయంశక్తిచేత స్థాపింపబడి దేశసౌభాగ్య

మునకును గ్రామపునరుద్ధరణకును పునాదుల నిర్మించినవి. తరువాత సాంఘికసంస్కరణ, సాంస్కృతిక రాజకీయోద్యమాది సకలాభ్యుదయోద్యమము లకు నిలయములై చేదోడువాదోడుగ పనిచేసినవి. దేశస్వాతంత్ర్య సముపార్జనమునకు ప్రజల ధన-మన-ప్రాణములను సయితము సంఘటిత మొనర్చినవి. సకలదేశ సంక్షేమ కార్యక్రమములకును నిలయములై విజ్ఞానోత్తేజమును కలిగించి ప్రజలను చైతన్యపూరితులను జేసినవి. 1924లో ఆంధ్రదేశ గ్రంథాలయ సభ కధ్యక్షత వహించి ఆంధ్రరత్న శ్రీదుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు "ప్రతిగ్రామగ్రంథాలయమాధ్యక్షుడును కార్యదర్శియు మహాత్మ గాంధి రాజ్యమునందు మునసబులు గాను కరణములుగాను పనిచేసి దేశస్వాతంత్ర్య సంపాగనోద్యమమునకు అసమానమైన సేవ జేసిరి" అని చెప్పిరి.

దేశకళ్యాణమునకు నిట్టి మహత్తమమైన సేవచేసినట్టియు, ఇపుడు చేయుచున్నట్టియు ఇకముందు చేయనున్నట్టియు "కమిటీ" పరిపాలనలో నున్న వేలకొలది గ్రామ పట్టణ గ్రంథాలయములకు- "లోకల్ లైబ్రరీ అధారిటీల"కును సంబంధము లేకున్నది. వానికి సంబంధించిన శాఖాగ్రంథాలయములకు ప్రజలకును సరాసరి పరిపాలనలోగాని, నిర్వాహణలో గాని, ద్రవ్యసహాయములో గాని భాగము లేకపోవుట అన్యాయముగాదా!

ఉదహారణకు ఒక విషయ మిచట మనవిచేయుచున్నాను. గుంటూరు పట్టణములో అనేక ధర్మగ్రంథాలయము లున్నవి. అందులో ప్రముఖమైనవి - పురపాలక సంఘ గ్రంథాలయము, సరస్వతీ గ్రంథాలయము, తిక్కన గ్రంథాలయము, దివ్యజ్ఞానసమాజ గ్రంథాలయము, శ్రీరామమందిర గ్రంథాలయము, స్త్రీల గ్రంథాలయము — వీనిలో నెక్కువ గ్రంథాలయములకు స్వంతభవనము లున్నవి. పెక్కుసంవత్సరములనుండియు విజ్ఞానసేవ జేయుచున్నవి. అనేకామూల్యములైన గ్రంథములు గలిగియున్నవి. ఈకమిటీ గ్రంథాలయములతో_ లోకల్ లైబ్రరీ అధారిటీకి - గ్రంథముల నిచ్చిపుచ్చు

కొను సహకారములో నేమాత్రమును సంబంధము లేకుండుట ఆశ్చర్యము గాదా!

కమిటీ గ్రంథాలయములలో కొన్నిటికి మాత్రము ప్రభుత్వము తమ–పాత–మామూలు ధోరణిలో, అవి చావకుండ– బ్రతకకుండ – స్వల్ప "మనోవృత్తు"లను మాత్రి మిచ్చుచున్నారు.

ప్రజాప్రభుత్వ పథకము ననుసరించి ఏర్పాటైన గ్రంథాలయములకును కమిటీ గ్రంథాలయములకును సంబంధబాంధవ్యములు పటిష్టముగ నుండకపోవుట శోచనీయము. ప్రజాగ్రంథాలయము లనేకములు అనేక సంవత్సరములనుండి అమూల్యమగు గ్రంథసేవ జేయుచు తేనెటీగలు తేనెపట్టు సమకూర్చినటులుగ అమూల్య గ్రంథ సముదాయమును సంతరించి విజ్ఞానభిక్షను బెట్టుచుండ–అందు భాగము పంచుకొనకుండుట ప్రజాప్రభుత్వ పథకము నందలి లోపమును స్పష్టముగ చూపుచున్నది

ఇంకొక ముఖ్యవిషయ మేమనగా "కమిటీ" గ్రంథాలయములు నేడు ప్రభుత్వ సహాయ సహకారములను పొందజాలకున్నవి. ప్రజా సహకారము గూడ లభ్యమగుటలేదు. ద్రవ్యసహాయము జేయు దాతలుగూడ – గ్రంథాలయాభివృద్ధికిని, పరిపాలనకును ప్రత్యేక "పౌరగ్రంథాలయ శాసన" మేర్పడి గ్రంథాలయపు పన్నును ప్రత్యేకముగ వసూలు చేయుచుండగా, నిక ముందు మే మెందులకు విరాళము లివ్వవలెనని ప్రశ్నించుచున్నారు. అందుచే నేడు "కమిటీ" గ్రంథాలయము లనబడు ప్రజాగ్రంథాలయముల గతి "రెంటికి చెడ్డ రేవడి" అను సామెత ననుసరించుచు జీవచ్ఛవములవలె నున్నవి.

## ఇకముందు జరగవలసిన కార్యక్రమము

(1) "లోకల్ లైబ్రరీ అథారిటీ"లు శాఖాగ్రంథాలయముల నిర్మాణముతోపాటు "కమిటీ" గ్రంథాలయముల సేవను, సహకారమును తమలో నిముడ్చుకొనవలెను. ఇట్టి సహకార ప్రయత్నము నందు 'కమిటీ' గ్రంథాలయముల యొక్క వ్యక్తిత్వమును నిలుపు

విషయమున లోకల్ లైబ్రరీ అథారిటీ" వారు సదా ఏమరియుండ రాదు. తమ శాఖాగ్రంథాలయముల సంఖ్యనభివృద్ధిపరచుటయందుగల శ్రద్ధకంటె, "కమిటీ" గ్రంథాలయము లున్న ప్రదేశములందు- వాని సేవను సంఘటితపరచుటయందే ఎక్కువ జాగరూకతను జూపవలెను. అంతకుపూర్వ మున్నవానిని విస్మరించి - క్రొత్త శాఖాగ్రంథాలయముల నభివృద్ధిపరచు తాపత్రయమువలన గ్రంథాలయ ప్రజోద్యమమునకు "లోకల్ లైబ్రరీ అథారిటీలు" దూరము కాగలవు.

శాఖాగ్రంథాలయము లున్న స్థలములందుగూడ - అచటి ప్రజాసన్నిహిత సహకారములను పొందు నవకాశములు గల్పించుకొనవలెను. ప్రభుత్వమువారికిని ప్రజలకును మధ్యగల అంతరువే - ప్రస్తుతము శాఖాగ్రంథాలయమునకును - ఆ యూరియందలి గ్రామస్థులకును గలదు. ఈ స్థితి దుస్థితి. గ్రామస్థుల సాంఘిక సమిష్టి జీవితమునందు శాఖాగ్రంథాలయము గూడ చొచ్చుకొనిపోయి పెనవేసికొని - పడుగు పేకలవలె నల్లుకొని వారి హృదయములందు తిష్ఠవేసికొనవలెను.

అపుడే అది గ్రామ విశ్వవిద్యాలయ స్థాయి నందుకొనును.

(2) "లోకల్ లైబ్రరీ అథారిటీలు" - పైన వివరించినటుల కమిటీగ్రంథాలయములతోను పంచాయితీలతోడను సన్నిహితమైన సంబంధమును పెట్టుకొనవలెను. ప్రతి పంచాయితీయు తమ స్వంత గ్రంథాలయమును స్థాపించుటకు కృషిచేయవలెను. "బ్లాకు" లు సాంఘిక సంక్షేమ కార్యకలాపములకై జేయు ద్రవ్య సహాయము వలనను, ఇతర విధముల ప్రభుత్వమిచ్చు ప్రత్యేక వార్షికవిరాళ ద్రవ్య సహాయముతోడను, ప్రతి పంచాయితీయును తమ స్వంత గ్రంథాలయమును స్థాపించునటుల లోకల్ లైబ్రరీ అథారిటీవారు ప్రోత్సహించవలెను.

ప్రతిపంచాయితీయును స్వంతగ్రంథాలయము స్థాపించుకొనిన యెడల "లోకల్ లైబ్రరీ అథారిటీవారు" ప్రత్యేకముగ శాఖాగ్రంథాలయముల నభివృద్ధిజేసికొనవలసిన అనవసరపు బెడద తప్పును. అపుడు

జిల్లా కొక కేంద్రగ్రంథాలయమును, "బ్లాకు"న కొక ఉపకేంద్ర గ్రంథాలయమును "లోకల్ లైబ్రరీ అథారిటీ" వారు నిర్వహించిన చాలును. "కమిటీ" గ్రంథాలయములును, పంచాయితీ గ్రంథాలయములును "లైబ్రరీ అథారిటీ"కి "బుక్ డెలివరీ స్టేషను"లుగా కార్యక్రమమును నిపుణతగా నిర్వహించగలవు. "లైబ్రరీ అథారిటీ" వారు సమయానుకూలముగ "కమిటీ" గ్రంథాలయము- పంచాయతీ గ్రంథాలయముల సిబ్బందికి ఆయా "బ్లాకుల"లో "శిక్షణసభస్సు"లు ఏర్పాటు జేసినచో గ్రామగ్రంథాలయ సేవా కార్యక్రమ నిర్వహణము పటిష్ఠ మగును. అపుడు మన యుద్యమము పూర్వపు ప్రజోద్యమస్థాయి నందుకొని దినదిన ప్రవర్ధమానముగ ప్రజా సాన్నిహిత్యముతో ప్రగతి సాధించగలదు.

(3) కమిటీ గ్రంథాలయములకు — చిన్నవానికి- పెద్దవానికి వాని తాహతు ననుసరించి ప్రతి సంవత్సరము గ్రాంటుల నివ్వవలెను. గుంటూరు జిల్లాలోనున్న వేటపాలెము నందలి "సారస్వత నికేతనము" వంటి గ్రంథాలయములతో సహకారమును పొందుటకు ప్రత్యేక పథకములను రూపొందించవలెను.

(4) ఆయా జిల్లాలలోనున్న జిల్లా కేంద్రగ్రంథాలయము "బ్లాకు" కేంద్రగ్రంథాలయములు అవసరము ననుసరించి గ్రామ గ్రంథాలయములకు గ్రంథములను సరఫరా చేయవలెను.

(5) ఆంధ్రప్రదేశ్ లోనున్న ఇరువది యొక్క జిల్లాలలోను ప్రతిజిల్లా యందలి అభివృద్ధి కార్యక్రమములను గురించిన వివరములను మూడు మాసముల కొకసారి "స్టేట్ లైబ్రరీ కమిటీ" స్థాయిలో సమీక్ష జేసి - ఆ నివేదికను ప్రతిజిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులకు బంపుచుండవలెను. అట్టి సమీక్షను పరిశీలించి ఆయాజిల్లాలలో అభివృద్ధి కార్యక్రమములను అధికారులు అమలులో బెట్టవలెను.

(6) ఈ పైని వివరించిన సూచనల కనువుగ "ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ పౌర శాసనము" ను రూపొందించవలెను.

## భరత వాక్యము

ప్రతి జిల్లాయందును గ్రంథాలయ సేవను వ్యాప్తిజేయుటకు "జిల్లాలైబ్రరీ అథారిటీ" వారు విస్తరణ కార్యక్రమమును పంచవర్ష ప్రణాళికను వేసికొని పని ప్రారంభించవలెను. రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తియగుసరికి ఆశించిన ప్రయోజనము పరిపూర్ణము గావలెను.

ఈ విధముగ జేసినచో ఆంధ్ర గ్రంథాలయోద్యమము నిర్వహించిన సేవా కార్యక్రమ ఫలితములు, "కమిటీ" "పంచాయితీ" గ్రంథాలయములద్వారా, ఈ పది సంవత్సరముల కాలములో ఆంధ్ర దేశమునం దంతటను పడుగు - పేకగ - నల్లిబిల్లిగ నల్లుకొనిపోయి విజ్ఞానజ్యోతి అఖండముగ వెలయగలదు.

ఆనాడు, ఆంధ్రదేశము భారతవర్షము నంతకును గ్రంథాలయ సేవయందు మార్గదర్శకమైనదన్న ఖ్యాతిని నిలుపుకొనగలదు. అపుడే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ స్రవంతి సజీవమై అవిచ్ఛిన్నముగ, అఖండముగ బ్రవహించి దేశీయుల విజ్ఞానపు వెల్లువల ముంచెత్తగలదు.

గుంటూరుజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మన్ శ్రీ కొత్తపల్లి ఉమామహేశ్వరరావుగారిచే 1964 ఏప్రిల్ 18-19 వ తేదీలలో తెనాలియందు జరిగిన పౌర గ్రంథాలయ సదస్సునకు శ్రీ వేంకటరమణయ్యగారు పంపిన సందేశము.

---

# పశ్చిమ గోదావరి జిల్లా గ్రంథాలయ సేవావ్రతులు

గ్రంథాలయ సేవయందు మన యాంధ్రదేశమున పశ్చిమ గోదావరి మండలము పెక్కు సంవత్సరములనుండి ప్రధాన స్థానము వహించినది.

దేశ భాషాపత్రికలు అసలే ప్రారంభింపబడక ఆంగ్లేయ పత్రికలు గూడ బహు స్వల్పముగనున్న ఏబది సంవత్సరములకు పూర్వముననే, ఈ జిల్లా యందలి భీమవరము తాలూకాయందు దేశ సౌభాగ్యమునకు సేవజేయ ప్రారంభించిన మహనీయులు వెలసి యుండుట మన యదృష్టము.

అట్టివారిలో శ్రీ కాళ్ళకూరి నరసింహముగారు ప్రముఖులు. వారికి కుడిభుజమై, తోడు నీడయై, నేటికిని తన నిరుపమానమైన సేవా వ్రత దీక్షతో పడుచు కుర్రవాని ధార్ఢ్యముతో తన తేజస్సుతో–మెరయు వృద్ధభీష్మాచార్యులు భూపతిరాజు తిరుపతిరాజు తాతను మన మధ్యను జూడగలుగుట నిజముగా మన భాగ్యమే. వీరిరువ్వురును ఇంగ్లీషుభాషా పరిచయము ఏమాత్రమును లేనివారు. అయినను సేవాస్థాయియందు వీరిరువురును దాదాభాయి నౌరోజీ, హ్యూము, వెడ్డర్ బర్న్, రానడే, దత్తు, వీరేశలింగము – మున్నగు భారత జాతీయతా నిర్మాతలతో సమానముగ నెన్నదగినవారు. దేశసౌభాగ్యము మీదనే తమ దృష్టిని నిలిపి సేవావ్రతము నూతగా గొని తమ జీవితమును దేశ కళ్యాణమునకై ధారవోసిన మహనీయులు.

ఆంగ్లేయభాషా వ్యాసంగము ఏమాత్రమునులేని వీరికి దేశ సేవా నిరతి ఎట్లు కలిగినది? దానికి కావలసిన సామర్థ్యము ఎటుల అలవడినది? వీరిని కదలించిన మహాశక్తులేవి? శ్రీ కాళ్ళకూరి నరసింహముగారు ఎవరు? సంవత్సర సంవత్సరము వరవడి వ్రాసినట్లుగ లెక్కలను తయారుజేయునట్టి లేక – పగ్గమును ఒక రైతు పొలమునకు అడ్డముగా బెట్టి ఒక వరహాయును, ఇంకొక రైతుపొలమునకు నిలువుగా బెట్టి ఒకమాడయును వసూలుజేయు మామూలు పల్లెటూరి కరణముగాదు. గ్రామ కరణముగ కూడ అపూర్వమైన ప్రతిభను ద్యోతకము చేసినారని వేరుగ చెప్పబనిలేదు.

జ్ఞానపిపాస గలిగిన నరసింహముగారికి దేశమునకు సంబంధించిన వివిధ సమస్యలను అర్థము జేసికొనుటకు గ్రామ కరిణీకమే పునాది

# పశ్చిమ గోదావరి జిల్లా గ్రంథాలయోద్యమ సేవావ్రతులు



కాళ్లకూరి నరసింహము

"జ్ఞానపిపాస గలిగిన నరసింహంగారికి దేశమునకు సంబంధించిన వివిధ సమస్యలను అర్థముచేసికొనుటకు గ్రామ కరణీకమే పునాధి అయ్యేను."

"వీరి జిజ్ఞాసయే వీరిని మేధావులుగా జేసినది."

"కరణము దగ్గరనుండి బయలుదేరని సమస్యలు, కరణము తలచుకొనిన విడివడని దేశ సమస్యలు ఎందైనా కలవా"

పుట 109



నిడమర్తి
లక్ష్మీనారాయణ

జననం :
1878

మృతి :
1928

వీరు నిడమర్రు గ్రామంలో నిర్మించిన బృహద్గ్రంథాలయమే వీరి సేవకు సాక్షి.

గ్రంథాలయ వేదమునకు జనకులు

# శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము

"గ్రంథాలయ శాస్త్రము, గ్రంథాలయోద్యమము పతాకస్థాయి నందుకొన్న వివిధ నాగరిక ప్రపంచమునందంతటను ప్రచారమునునున్న గ్రంథాలయ సూక్తులలో - మణిమకుటాయమానమై, తలమానికమై శ్రీ చిలకమర్తి వారి "గ్రంథాలయవేదము" నేటికిని ప్రకాశించుచున్నది." పుట 273



శ్రీ వీరేశలింగకవి సమాజ గ్రంథాలయము, కుముదవల్లి - యొక్క ట్రస్టు దస్తావేజుయొక్క "భూమిక" యందు శ్రీ లక్ష్మీనరసింహంగారిట్లు వ్రాసిరి :-

"మహాపట్టణములయందు సయితము గ్రంథ భాండాగారము పేరైన వినబడని కాలమున, కాలవశమున నేలదున్నుకొని జీవించునట్టి రాచపుట్టతో నిండియున్న యొకపల్లియందు గ్రంథ భాండాగారము బయలుదేరుట మిక్కిలి యక్కజము. దానికొక పెంకుటి మందిరము నిర్మింపబడుటయు, లేఖ్యారూఢ మగుటయు నక్కజములలో నక్కజము" 20-8-1916.

యయ్యెను. వీరి జిజ్ఞాస యే వీరిని మేధావులుగా జేసినది. కరణము దగ్గఱనుండి బయలుదేరని సమస్యలు, కరణము తలచుకొనిన విడివడని దేశసమస్యలు ఎందైనగలవా!

ప్రభుత్వము వారు ఆంధ్రమున ప్రచురించిన చట్టములు, అనేక విషయములను గురించిన కరపత్రములు వీరికి మొదటి గురువులు. పిమ్మట జిజ్ఞాసచే, తెలిసినవారి నడిగి గ్రహించిన శ్రుత పాండిత్యము—పుస్తకవ్యాసంగము— ఇవన్నియు క్రమక్రమముగ సహాయపడెను. తోడి గ్రామోద్యోగులకు, రైతులకు సంబంధించిన సమస్యలను పరిష్కరింప వలసిరాగా, అనాడు మద్రాసు చట్టనిర్మాణసభయందు సభ్యులుగా నున్న గంజాం వెంకటరత్నము పంతులు గారు, కృత్తివెంటి పేర్రాజు పంతులుగార్లతో సాహచర్యము జేసిరి. వారు చట్టనిర్మాణసభలో చేయుపని కంతటికిని తగిన సంభారమును వీరు సంపాదించి యిచ్చుటకు ప్రారంభించిరి. ఈవిధముగ చేయగా, వారిరువురును శాసనసభ యందు నడించిన ప్రతిభకు, శ్రీ నరసింహముగారు సంకలనముజేసిన అంకెల సహాయమే కారణమని వారంగీకరించిన సందర్భము లనేకములు గలవు.

ఆంధ్ర దేశమున చాలకాలము నుండియు గ్రంథాలయములను స్థాపించినవారు, నడపుచున్నవారు అనేకులు గలరు. అయితే, దాని నొక యుద్యమముగ రూపొందించి ఊరూరదిరిగి గ్రంథాలయ ప్రచారము చేసినవారిలో మన నాయకు లిరువురు నీ తాలూకా యందు ప్రథములని జెప్పవచ్చును. వారుస్థాపించిన "నౌరోజీగ్రంథాలయము" "హ్యూముక్లబ్బు" "వీరేశలింగ గ్రంథాలయము"లను మన మిప్పటి కిని (1936) దినదినాభివృద్ధిగాంచుట జూడవచ్చును. వీరిలో శ్రీ నరసింహముగారు దివంగతులైనప్పటికిని, తిరుపతిరాజుగారు నేటికిని గ్రంథాలయ సేవయం దప్రమత్తులైయున్నారు.

వీరికి బిమ్మట గ్రంథాలయ సేవలో నీ జిల్లాయందు పేర్కొన దగిన వారు నిడమర్తి లక్ష్మీనారాయణగారు. వీరి యొక్క సేవకు సాక్షి, వీరు తమ స్వగ్రామమందు నిర్మించిన బృహద్గ్రంథాలయమే.

అంతేగాక ఈజిల్లాలో గ్రంథాలయోద్యమ వ్యాప్తికిని వీరు చాలకృషి జేసిరి. మరియు ఆత్మకూరి గోవిందాచార్యులుగారు, పాలకోడేటి వెంకట్రామశర్మగారు ఈజిల్లాలో గ్రంథాలయోద్యమ వ్యాప్తి అమోఘమైన సేవ జేసినవారిలో గణనీయులు. ఏ యుద్యమమైనను — అందును — ముఖ్యముగ గ్రంథాలయోద్యమము ఒకరిద్దరి సేవతో జరుగు కార్యముగాదు. పై జెప్పిన వారుగాక, వారికింకను పెక్కండ్రు సేవావ్రత పరాయణు లగు యువకుల కార్యదీక్షారూపమగు అండదండ లుండుటచేతనే ఆజిల్లాలోని యుద్యమమింత సత్వరాభివృద్ధి నొందుటకు వీలయ్యెను.

## తాలూకా సంఘములు

ఇపుడు పశ్చిమగోదావరి జిల్లాయందు భీమవరము, ఏలూరు, నర్సాపురము, తణుకు, తాడేపల్లిగూడెము తాలూకాలకు గ్రంథాలయ సంఘము లేర్పడినవి. కాని భీమవరము, తాడేపల్లిగూడెము తాలూకా సంఘములు మాత్రమే సక్రమాభివృద్ధి గాంచుచున్నవి. ఈరెండు తాలూకాల యందలి కార్యక్రమములుగూడ సంతృప్తికరమైన ఫలితములనే ప్రసాదించినది.

ఈరెండు తాలూకాలలోను కార్యదర్శులగు డాక్టరు పాలకోడేటి సత్యనారాయణ శర్మగారు, డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు — వీరి యొక్క నిరంతర పరిశ్రమ కార్యదీక్షలవలననే ఇట్టి సత్ఫలితములు గలుగుటకు అవకాశము లభ్యమయ్యెను. వారిరువురు డాక్టరు వృత్తియందుండియు, ఎక్కువ తీరుబడిలేక పోయినను — ఏమాత్రము అవకాశమున్నను — ఒకప్పుడు తీరుబడి లేకపోయినను — బలవంతముగ కలుగజేసికొని ఈ యుద్యమవ్యాప్తికై వారి యావచ్ఛక్తిని వినియోగించుచున్నారు.

ఇంకను వేగేశిన సూరపరాజుగారు, కొత్తపల్లి నారాయణ రాజుగారు, కొండేపూడి చలపతిరావుగారు, కలిదిండి సూర్యనారాయణరాజుగారు, వద్దిపర్తి రాజారావుగారు, నంబూరి సుబ్బరాజుగారు,

భీమవరము తాలూకాలోను - దద్దనాల లక్ష్మీసత్యనారాయణ గారు, తల్లాప్రగడ భీమేశ్వరరావుగారు, పుట్టా సుబ్బారావుగారు, పెనుమత్స సూర్యనారాయణరాజుగారు, నిడమర్తి అశ్వనీకుమార దత్తుగారు, పెమ్మరాజు వీర్రాజుగారు, ఉదయగిరి శేషగిరిరావుగారు, తోట సూరయ్యగారు, కలిదిండి చినగంగరాజుగారు, అడివికొలను సూరయ్యగారు, కామిశెట్టి వెంకటనరసయ్యగారు, చింతలపాటి సూరపరాజుగారు — తాడేపల్లిగూడెము తాలూకాలోను - ఆయా తాలూకాల గ్రంథాలయోద్యమాభివృద్ధికై విశేషముగ పాటుబడి ప్రజలలో నూతన చైతన్యమును గలుగ జేసినారు

నర్సాపురము తాలూకా యందు రుద్రరాజు నరసింహరాజు గారును; తణుకు తాలూకాయందు పోతాప్రగడ సరసింహముగారును; ఏలూరు తాలూకా యందు మాగంటి బాపినీడుగారు, సామవేదము సత్యనారాయణగారును; కొవ్వూరు తాలూకాయందు ఏలూరి పాటి రామభద్ర చయనులుగారు, తాడిమేటి కుటుంబశాస్త్రిగారు, శనివారపు సుబ్బారావుగారును— గ్రంథాలయోద్యమాభివృద్ధికై కృషి జేసియుండిరి.

ఈ సందర్భమున ఏలూరు "హిందూ యువజన సంఘము" యొక్క ట్రస్టుబోర్డు కార్యదర్శి మద్దుల వెంకట చినరాజుగారియొక్క పట్టుదలను ప్రశంసింపకుండ ఉండజాలను. వీరియొక్క కార్యదీక్షవల ననే ఆ గ్రంథాలయమునకు విశేష మొత్తము శాశ్వత నిధిగ వసూలయినది. ఏలూరు పురమునకు ఎవరైన భాగ్యవంతుడు వచ్చుట తడవుగ చినరాజుగారు వారియొద్దకు తెక్కలుగట్టుకొని వ్రాలివారే! గ్రంథాలయమునకో, అన్నదాన సమాజమునకో, గోసంరక్షణసంఘమునకో - లేక యూడింటికినో - విరాళములను స్వీకరించినవారే!!!

## జిల్లాబోర్డువారు చేసినపని

కలిదిండి గంగరాజుగారు తమ తాలూకాబోర్డు అధ్యక్షపదవి యందు తాడేపల్లిగూడెమునందు ఒక చక్కని గ్రంథాలయమును

నిర్మించినారు. తణుకు తాలూకా బోర్డు అధ్యక్షులు ముళ్ళపూడి తిమ్మ రాజుగారు బోర్డు గ్రంథాలయము నేర్పాటుజేసి మంచి గ్రంథముల పెక్కింటిని సమకూర్చిరి. అట్లే శ్రీ బడేటి వెంకటాామయ్యగారు జిల్లాబోర్డు అధ్యక్షులుగనుండి కొవ్వూరు, భీమవరములందు గ్రంథాలయములను నెలకొల్పుటేగాక, మాధవరము, చేబ్రోలు, కైకరము గ్రామములయందు గ్రంథాలయముల నిర్మాణమునకుదోడ్పడి వానిని బోర్డు పరిపాలనలోనికి దీసికొని అభివృద్ధిబరచిరి.

## జరుగవలసిన పని : గ్రంథాలయ యాత్రలు

ఈ జిల్లాయందు ఇదివరకు జరిగిన సేవతో సంతుష్టిపడిన లాభములేదు. జరుగవలసిన కార్యక్రమము అనంతముగ నున్నది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు మీ జిల్లాయందు తమ కార్యక్రమమును కేంద్రీకరించి, ఆదర్శములుగ నెంచుచున్న కార్యములను అనుభవ పురస్సరములుగా చూప సంకల్పించుచున్నారు. భీమవరము, తాడేపల్లిగూడెము తాలూకాలలో ఉన్న గ్రామములలో సగము కంటె ఎక్కువ గ్రామములలో గ్రంథాలయము లున్నవి. వాని నన్నిటిని పరికించి పనిచేయుచున్న వానికిని, పనిజేయనివానికిని ప్రోత్సాహ ప్రోద్బలములు కల్పించుటకు గ్రంథాలయ యాత్రలను ఏర్పాటు జేసితిమి. ఈ క్రింద వివరించిన విషయముల దృష్ట్యా ఈ రెండు తాలూకాలలోను కొంత పనిజేయుటకు బూనుకొంటిమి. అందుకు మీ సహకార మత్యావశ్యకము.

1. గ్రంథ పఠనాభిలాష నెక్కువ జేయుట.
2. గ్రంథముల సంయుక్త పట్టికను తయారుజేసి అన్ని గ్రంథాలయము లందుంచుట.
3. గ్రంథములను పరస్పరము ఎరువిచ్చు నేర్పాట్లుజేయుట
4. బాలశాఖలను నిర్వహించుట
5. చదువుకొనజాలని జనులకు చదివి వినిపించుట
6. గ్రంథాలయములు లేని గ్రామములకు సంచార గ్రంథాలయ పేటికలద్వారా గ్రంథముల నందజేయుట.

సేవావ్రతులగు గ్రంథాలయ సోదరుల సహాయము వలనను, ఈ జిల్లాకు ప్రభువర్యులుగ దయచేసిన శ్రీ దండు నారాయణరాజు గారి అమృత హృదయమువలనను ఈ జిల్లా యందలి గ్రంథాలయ సేవ ఆంధ్ర దేశమునకేగాక భారతవర్షమున కంతటికిని మార్గదర్శకమై వెలయుగాక!

ఈ జిల్లాలోని వివిధ తాలూకాలలో నున్న ప్రస్తుత పరిస్థితిని తెల్పు పట్టిక నీ క్రింద నిచ్చుచున్నాము.

| తాలూకా | గ్రంథాలయముల సంఖ్య | అందు బాగాపని చేయువాని సంఖ్య |
|---|---|---|
| 1. భీమవరము | 56 | 32 |
| 2. తాడేపల్లిగూడెం | 56 | 30 |
| 3. నర్సాపురము | 25 | 15 |
| 4. తణుకు | 25 | 15 |
| 5. కొవ్వూరు | 7 | 5 |
| 6. చింతలపూడి | 2 | 2 |
| 7. ఏలూరు | 25 | 15 |
| మొత్తము | 196 | 114 |

* పశ్చిమ గోదావరిజిల్లా గ్రంథాలయ సభలో శ్రీ వేంకటరమణయ్యగా రిచ్చిన యుపన్యాససారము – గ్రంథాలయ సర్వస్వము– సంపుటము – 10 – సంచిక 3 - జూన్– 1936 సం॥ము.

# గ్రామ గ్రంథాలయములు

## గ్రామసీమల్లో గ్రంథాలయాలు- వాని నిర్వహణలో ప్రజల కృషి

ఆనాడు - అనగా - స్వదేశీ దినాలలో - గ్రంథాలయాలు వయోజన విద్యాలయాలుగా, జాతీయ విద్యాకేంద్రాలుగా రాజకీయ పాఠశాలలుగా, సాంఘిక సంక్షేమ కార్యకలాప సంస్థలుగా, దేశంలో నాల్గుమూలల అల్లుకుపోయి - దేశ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న సత్యాగ్రహ సమర వీరులను సంపాదించి పెట్టినాయి.

ఈనాడు దేశంలో పంచాయతీరాజ్యం ఏర్పడింది. చాలవరకు గ్రామపంచాయతీలు గ్రంథాలయాలను ఏర్పాటుచేసి, గ్రామాభివృద్ధికి తోడ్పడం చేస్తున్నాయి. ఈ గ్రామగ్రంథాలయాలను సద్వినియోగం చేసికోవడం అందరికీ విధ్యుక్తధర్మం.

గ్రంథాలయోద్యమం తీవ్రంగా ముందడుగు వెయ్యాలంటే కేవలం ప్రభుత్వ అధికారుల వలననే సాధ్యంకాదు; ముఖ్యంగా నిరక్షరాస్యులు - అలసులు — ఉదాసీనులు — ఎక్కువగా ఉన్న మన దేశంలో- ఇది ఒక సేవా కార్యంగా సాగినప్పుడే గ్రామ జీవనంలో గ్రంథాలయతత్త్వం పెనవేసుకొని పోతుంది.

ప్రభుత్వ సహాయం సంపూర్ణంగా రాణించాలంటే ప్రజల సహకారాలు అవసరంగా కావాలి. ఇది ప్రజాస్వామ్యానికి ప్రధానమైన లక్షణం.

గ్రామసీమల్లో అందరూ అక్షరాస్యులు అయితేగాని గ్రంథాలయం పూర్తిగా వినియోగంకాదు — అందుచేత గ్రంథాలయాలు వయోజన విద్యాకేంద్రాలుగా కూడ వర్థిల్లాలి.

"మామూలు తెలివి తేటలు గలవాడు అక్షరాలూ గుణింతము నేర్చుకోవడానికి వారం - పదిరోజులుకన్నా ఎక్కువకాలం పట్టదు - ఎప్పుడయితే అక్షరాలూ, గుణింతం వచ్చాయో, అక్కడ నుంచి వ్యావహారిక భాషలో అచ్చు అయిన కరపత్రాలు, గ్రంథాలు చదువగలుగుతాడు." అని శ్రీ గిడుగురామమూర్తి పంతులుగారు ఎన్నడో చెప్పిరి.

గ్రామసీమల్లో జనులు పగలంతా పనిచేసికొని రాత్రిసమయాల్లో తీరికగా వుంటారుగనుక గ్రంథాలయంలో రాత్రి పాఠశాలను ఏర్పాటుచేసి, వారిని అక్షరాస్యులుగాను, విద్యావంతులుగాను చెయ్యాలి - గ్రామానికి గ్రంథాలయం చేయగలిగిన సేవలో ఇది ప్రధానమైన భాగం.

పూర్వకాలంలో — దేవాలయం భక్తికీ, వినోదానికీ విజ్ఞానానికీ, కాలక్షేపాలకూ, సమావేశ రంగస్థలంగా ఉండేది. దేవాలయంలోఉన్నది దేవి అయితే గ్రంథాలయంలో ఉన్నది సరస్వతీదేవి.

పూర్వందేవాలయం వినోదానికీ విజ్ఞానానికీ స్థానం అయితే, నేటి గ్రంథాలయం ఆ స్థానాన్ని పొందింది. గ్రంథభాండాగారియే ఇక్కడి పౌరాణికుడు; పండుగులకు, పబ్బాలకు, వేడుకలకు,ఉత్సవాలకు,ఊరేగింపులకు, పెళ్ళిళ్ళకు నేటి సరస్వతీ ఆలయం ప్రధాన స్థానంకావాలి.

"తల్లీ నిన్నుదలంచి పుస్తకముచేతం బూనితిన్" అనిసరస్వతీ ప్రార్థనచేసి పుస్తకాన్ని చదవడానికి మొదలుపెట్టడం ప్రాచీనసంప్రదాయం — వినాయక చవితికీ విజయదశమికీ పిల్లలు తాము చదువుకునే పుస్తకాలకి పూజచేస్తారు. దీనివలన పిల్లలకి పుస్తకాలంటే — చదువంటే భక్తి శ్రద్ధలు కలుగుతాయి - ఇదే చదువుల్లో ఉన్న మర్మము - ఆదరము,అభిమానము,గౌరవము,మర్యాద,భక్తి, శ్రద్ధ - అనే వానిని మరచిపోయిన ఈరోజుల్లో ఇట్టి వానిని తిరిగి జ్ఞాపకం చేయడం చాలా ముఖ్యంకదా!

గ్రామస్థులంతా గ్రామ గ్రంథాలయోద్ధరణకై సహకారము, సహాయం చేయాలి. సహాయ సహకారాలు ఎంతముఖ్యమో గ్రంథా

లయంలోని పుస్తకాలను గ్రామస్థులందరూ చదవడం కూడ అంత ముఖ్యమే. పుస్తకాలను పత్రికలను చదివినగాని విజ్ఞానం లభ్యం కాదు — విజ్ఞానం వల్లగాని జనులు ప్రాజ్ఞులుకావడం సంభవంకాదు. జనులంతా ప్రాజ్ఞులైనప్పుడే గ్రామమంతా తేజోవంతమై దేశసౌభాగ్యానికి దోహదం చేయగలదు.

గ్రామ గ్రంథాలయంలో రైతుకీ — కార్మికునికీ — కర్షకునికి — అన్నివర్గాల వారికీ కావలసిన సమాచారం, సలహో, సంపద లభ్యం అవుతాయి.

రైతుకీ కావలసిన పంటలు పైరులు మొదలగు సమస్తవిషయములను గురించిన భోగట్టా సిద్ధంగా ఉంటుంది. లేకపోతే — అందుకు తగిన అధికారులను సంప్రదించి అందజేస్తారు.

ప్రభుత్వం ఎరువులకిచ్చే అరువులు — బావులకిచ్చే సబ్సిడీలు ప్రజలకు కల్పించే విద్యా విధానాలు — ఇతర సౌకర్యాలు — ఆర్థిక సహాయాలు— అన్నింటిని గురించిన భోగటా అంతా అక్కడ దొరుకుతుంది.

గ్రంథాలయంలో సమాచారాన్ని స్వీకరించి — గ్రామసీమలోని ప్రజలు వారి భవిష్యత్తును తీర్చిదిద్దుకోవచ్చు.

గ్రామసీమల్లో అక్షరాస్యులైన స్త్రీలు గ్రంథాలయానికివచ్చి పుస్తకాలు చదవడం సాధ్యంకాదు; అందువల్ల వారికి కావలసిన గ్రంథాలు, వారికి అనువైన గ్రంథాలు వారి ఇండ్లకు పోయి అందజేయాలి.

ప్రతిరోజు సాయంత్రం తమ పిల్లలు గ్రంథాలయంలో గడపునట్లు తలిదండ్రులు చేయాలి.

పిల్లలకు వినోదంతోబాటుగా వికాసం కలిగేటట్టుచేసి — మళ్ళీ రోజూ వచ్చేటట్టు చూచుకొనే బాధ్యత గ్రంథభాండాగారిది.

గ్రామంలోని పెద్దలు అగ్రామంయొక్క చరిత్రను సేకరించి గ్రంథాలయంలో ఉంచాలి; ఆ గ్రామ విశేషాలు, వారి వారి చిన్ననాటి ముచ్చటలు — సంప్రదాయాలు — పెత్తందార్లు మొదలగు పెద్దల చరిత్రలు — అన్నింటినీ వ్రాసియుంచాలి.

గ్రామంలో అనేక రకాలైన ప్రజ్ఞలు కలవారుంటారు; భజన పరులు - సంగీత విద్వాంసులు - భాగవతులు- పౌరాణికులు బొమ్మలను. పాత్రలను విగ్రహాలను, తయారుచేసే కళాకారులు ఉంటారు. ముగ్గులు తీర్చడంలో - పాటలు పాడడంలో - శిశుపోషణలో - అనేక విషయాల్లో ప్రవేశంకల స్త్రీలుంటారు. వీరందరు తమ ప్రజ్ఞా విశేషాలను ఇతరులకు అలవడజేయడంలో గ్రంథాలయం సహాకరించాలి, పండుగలకు,పబ్బములకు అట్టి వారిచేత ఉమ్మడికార్యక్రమాలు ఏర్పాటు చేసి గ్రంథాలయంలో ప్రదర్శింపచేయాలి.

గ్రామ గ్రంథాలయంలో వార్షికోత్సవము - ఇతరఉత్సవాలు జరిగినప్పుడు పందిళ్ళు వేసి కార్మికులుశ్రమదానంచేయాలి- అలకటం- ముగ్గులు వేయడం - అలంకరణ చేయ్యడం - తోరణాలు కట్టడం మొదలైనవన్నీ స్త్రీలు చేయాలి - పందిళ్ళకు, పాకలకు కావలసిన తాటాకు మొదలైన సామగ్రిని రైతులు సప్లయిచేసి తోడ్పడాలి, ఉత్సవాలకు వచ్చే ఉపన్యాసకులు, నటకులు, గాయకులు మొదలైన వారికి తగిన బసలు, ఆతిధ్యాలు ఇచ్చి - సంపన్న గృహస్థులు తోడ్పడాలి.

ఈవిధంగా గ్రామస్తులంతా గ్రంథాలయానికి వస్తురూపంగా గాని - ధనరూపంగాగాని, శ్రమరూపంగాగాని తోడ్పడాలి. తమ మాట సహాయం - తమ పలుకుబడి సహాయం చేసి కూడా తోడ్పడ వచ్చును.

ఈరీతిగా గ్రామ గ్రంథాలయం గ్రామస్థుల సహజీవనమునకు - సామరస్యమునకు - ఐకమత్యానికి తోడ్పడుతుంది.

గ్రామసీమల్లో గ్రంథాలయానికి ఊళ్లో అందరూ సహాయాన్ని, సహకారాన్ని చెయ్యడమేగాక,అందరూకూడా ఆగ్రంథాలయం యొక్క సహాయాన్ని, సహకారాన్ని పొందుతూ ఉండాల.

గ్రంథాలయం అన్నది కొద్దిమంది యొక్క సంపదగాదు. ఉమ్మడి సంపద - ఊరందరిసొత్తు.

వయస్సు — విద్య - అనే తేడాలుగాని, కుల మత స్త్రీ పురుష వివక్షతగాని, సాంఘిక స్థాయీ భావాలుగాని లేకుండా - గ్రామ గ్రంథాలయం అందరికీ అందుబాటులో ఉంటుంది.

అందరికీ అది సేవచేస్తుంది.

గ్రామస్తులందరి యొక్క సాంఘిక సంక్షేమ కార్యకలాపాలకు అది సంగమస్థానం.

ఆకాశవాణి విజయవాడ నుండి శ్రీఅయ్యంకివారిచే ప్రసారితమైన ఉపన్యాసము— 1966

---

# గ్రంథాలయములే గ్రామాలయములు

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునందు మీ భీమవరము తాలూకా ప్రథమమునఁ బేర్కొనవలసియున్నదని తెలుపుట కెంతయు సంతసిల్లుచున్నాఁడను. దేశమునందు గ్రంథపఠనాభిలాషగాని, వార్తా పత్రికా గ్రహణాసక్తిగాని విశేషముగ కలుగనప్పుడే, రాజకీయాందోళనావశ్యకతను పట్టణములయందు సహితము జనులు బాగుగ గ్రహించి యుండనపుడే, మీ తాలూకాయందు "ఉండి" గ్రామము నను, మీ గ్రామమున గూడ సమాజముల నేర్పఱచుకొని స్వాభివృద్ధిని గలుగఁజేసికొనవలయునని వాంఛజనించుట మిక్కిలి ప్రశంసనీయము.

## నౌరోజీ క్లబ్బు

భరత ఖండ పితామహులగు దాదాబాయి నౌరోజీగారి యొక్కయు, ఆంధ్రదేశ పితామహులగు రావుబహాదరు కందుకూరి వీరేశలింగము పంతులుగారి యొక్కయు,పవిత్ర నామములతో మీరు

రెండు సమాజములను ప్రారంభించుట మిక్కిలి యానందమును గొల్పు చున్నది. తన నిరుపమాన దేశాభిమానముచేతను, స్వార్థత్యాగము చేతను, కార్యనిర్వహణదీక్షచేతను భరతఖండమునందంతట పూజ్య భావముతో వెలుంగుచున్న శ్రీ దాదాభాయి నౌరోజీగారి యొక్క గొప్పతనమును గ్రహించి నేటి కిరువది సంవత్సరములకుఁ బూర్వమే (1896) మీ తాలూకా యందున్న "ఉండి" గ్రామమున వారినామముతో "నౌరోజీ క్లబ్బు నేర్పఱచుటయు, నవీనాంధ్ర వాఙ్మయమున కంతకును మార్గదర్శియు,సంఘమునందు ప్రబలియున్న దురాచారములను నిర్మూలింప తన యావజ్జీవితమును ధారవోయఁ గంకణము గట్టుకొనిన మహనీయుఁడును, నిరుపమాన స్వార్థత్యాగియునగు శ్రీ వీరేశలింగము పంతులుగారి యెడల మీకుఁగల కృతజ్ఞతను జూపుటకై నేఁటికి పదునెనిమిది సంవత్సరములకుఁ బూర్వమే (22-6-1897) మీరు శ్రీ వీరేశలింగకవి సమాజము నేర్పఱచుటయు మిక్కిలి గొప్ప విషయములని నాయభిప్రాయము.

## అజ్ఞాన దేవత

ప్రాచీనకాలమున మన భారతఖండమునంగల గ్రంథాలయములను గూర్చి కాని, నవీన కాలమున పాశ్చాత్య దేశముల యందలి గ్రంథాలయోద్యమమును గూర్చి జరుగుచున్న ప్రయత్నములను గురించిగాని నే నిచటఁ జెప్పఁబూనుకొనలేదు.నవీనకాలమున గ్రంథాలయముల యావశ్యకతయు, అవి ఆంధ్రదేశమునందలి జనులయొక్క స్థితిగతుల నభివృద్ధిచేయుటకుఁగాను ఏయే ముఖముల పనిచేయవలసి యున్నదియు కొంచెము చెప్పెదను.

ప్రపంచమునందలి దేశములన్నిటికంటెను మనదేశము నందె క్కువగ అజ్ఞానదేవత తాండవమాడుచున్నది. సౌఖ్యముగ తిని దేహయాత్రఁగడపుటయే జీవితోద్దేశమను తలంపులు ప్రబలుచున్నవి. కాని జీవిత ధర్మమేమి? అనునాలోచన తోఁచుటలేదు.

దీనికి కారణమేమి? మన దేశమునందు విద్యాధికుల సంఖ్య స్వల్పము. విద్య నార్జించుటకు కొందఱు మాత్రమే మగ్నులు. ఈ స్వల్ప

సంఖ్యాకులైనను విశేషభాగము జ్ఞాన సమన్వితులుగారు. అట్టి స్వల్ప సంఖ్యాకులు జనసామాన్యము యొక్క గతులను నడుపవలసినవారుగా నున్నారు. జనసామాన్యమునకు సంబంధించిన సకల విషయములను అట్టి కొందఱు మాత్రము నిర్ణయించ వలసినవారుగా నున్నారు. వీరి భావనా ప్రపంచమునకును నిజమగు స్థితిగతులకును సంబంధమే లేదు. దేశములోనున్న జనులందరును తమవలెనే సౌఖ్యవంతులై ఆనందము ననుభవించుచున్నారని వీరి భావన. నిజమగు స్థితిగతులను కనుఁగొనుటకుఁగాని, ఒకవేళ కనుఁగొన్నను వానికి తగిన ప్రతిక్రియ చేయుటకుఁగాని వీరికి సామర్థ్యముఁలేదు. ఇట్టిస్థితి దుర్భరము. కావున మన మిప్పుడాలోచింపవలసిన సంగతి ఏమనగా — విద్యాధికులును, జ్ఞానవంతులును కొందఱు మాత్రమే ఉండదగునా? లేక అందరును విద్యాధికులును, జ్ఞానవంతులునునై యుండవచ్చునా?

## విద్యోపాసన

స్త్రీలైనను, పురుషులైనను— జనసామాన్యమంతయును విద్యావంతులును జ్ఞానవంతులునునై యుండవలెను. భావికాలమునం దుదయింపఁబోవు మహాపురుషులందఱి శక్తులు బీజభూతములై, వర్తమాన కాలమునందలి జనసామాన్యమునందంతర్గర్భితములైయుండును. వాని కనువగు దోహదమిచ్చితిమా ఆ బీజములు మొలకలెత్తి, అభివృద్ధినొంది క్రమముగ తరువులై, మహావృక్షములై పరోపకార పరతంత్రములగును. మున్నొకకాలమున నాగరికాగ్రగణ్యాతన విజ్ఞాన తేజస్సుచే ప్రపంచమునంతను ప్రజ్వరిల్లఁజేసి పవిత్రమైన దేశము మీద విద్యాధిదేవతకు నేఁడు దయతప్పినది; ఆదేవత యొక్క దయ సంపూర్ణముగ నబ్బినఁగాని మనకు పురోభివృద్ధిలేదు. ఆమె దయను సంపాదించుటకు మనమిప్పుడు ఘోరమైన తపస్సు చేయవలసి యున్నది.

## గ్రామాలయము

ఈ తపస్సును చేయుటకు మనము వనాంతరములకుఁగాని నిర్జన ప్రదేశములకుఁగాని, కొండగుహలకుఁగాని వెళ్ళనక్కఱలేదు. మనము

నివాసము చేయు గ్రామములయందే ఆలయ నిర్మాణము చేసికొనిన చాలును. "ఇదివఱకే ప్రతిగ్రామమునందును దేవాలయములు గలవే! వానిని నిర్వహించుటయే కష్టతరముగానున్నది! తిరిగి ఆలయ నిర్మాణము చేయుట ఎందుల"కని మీరు ప్రశ్నించవచ్చును. కాని మనమిప్పుడు చేయవలసినది దేవాలయ నిర్మాణముకాదు. గ్రంథాలయ నిర్మాణము.

## ఐహికాముష్మిక ఫలప్రదము

దేవాలయ నిర్మాణమువలన ఆముష్మికములను మాత్రము సాధించవచ్చును. నేఁడు ప్రపంచమునందు ఉన్నతస్థితిని బొందవలె నన్న ఆముష్మికముగ ఔన్నత్యమును సంపాదించిన చాలదు; ఒక మనుజుని యాత్మ జ్ఞాన ప్రపూరితమై యుండవచ్చును; కాని యాతని దేహముకూడ ఆరోగ్యవంతమై యుండవలెను. ఈరెండును సమాన స్థాయిలోనున్నఁగాని మనుజుఁడభివృద్ధి నొందుట యసంభవము. ఇదే విధముగ ఒకజాతి ఆముష్మికముగ ఔన్నత్యమును జెందియున్నను, ఐహికముగ గూడ ఉన్నతస్థితిలోనున్నగాని అది సమగ్రముగుఅభివృద్ధి నొందుటకు వీలులేదు. కావున మనమిప్పుడు నిర్మింపబోవు ఆలయములు ఐహికాముష్మికములకు రెండింటికినిగూడ సహకారులగునవిగ ఉండ వలెను; ఇట్లు ఇహపరములకు రెండింటికిని సహకారులగు ఆలయము లకే గ్రంథాలయములని పేరు; ఈ ఆలయములకు జనులు అందరునుగూడ వెళ్ళలేకపోవచ్చును. అంతమాత్రముచేత అట్లు పోలేని జనులకు గ్రంథాలయముల వలనఁ గలుగవలసిన పుణ్యము లభింపక పోవలసినదేనా ? ఎంతమాత్రమును కాదు. ఆ యాలయము నకు వెడలగలిగిన వారందరును తాము సంపాదించిన పుణ్యమునందు కొంతభాగమును వెడలలేని వారికి నిత్యమును ధారవోయుచుండుట ధర్మమైయున్నది.

## తరగదు - పెరుగును

దేవాలయములకుఁ బోవుటవలనఁ గలుగు పుణ్యమును ధార వోయుట వలన తరిగిపోవచ్చునేమో కాని, గ్రంథాలయములకుఁ

బోవుటవలన గలుగుపుణ్యము ఇతరులకు ధారవోసిన కొలదిని తరుగుటకు మారుగ పెరుగుచునే యుండును. ఇదియే దీనియందలి ఆధిక్యము.

## పరస్పర సంబంధము

మనము గ్రంథాలయమునకు బోయి జ్ఞాన సముపార్జనము చేయవచ్చును. కాని ఆలయమునకు రాజాలనివారును, వచ్చి దాని యుపయోగమును బొందజాలనివారును మనదేశమునం దెందరో కలరు. అట్టివారిని జ్ఞానవంతులుగ జేయుట ఎట్లు? ఒకవైపున జ్ఞానదాయకములగు గ్రంథాలయములు వెలయుచున్నవి; మరియొకవైపున అజ్ఞానతిమిర బాధితులగు మూఢజను లున్నారు. మనమో— మధ్యనున్నారము. కాన మనము వారికిని వీరికిని పరస్పర సంబంధము కలిగింపవలెను. ఈ మహత్తరమైన కార్యమును నెరవేర్చుట యెట్లు? పుస్తకములకును, సామాన్య జనులకును పరస్పర సంబంధము కలుగజేయ వలయునుగదా?

అట్టిస్థితి కలుగుటకు పరస్పరము తగియుండవలెను. అనగా పుస్తకములకు జనులు తగియుండవలెను. జనులకు పుస్తకములు తగియుండవలెను. పరస్పరముగా తగియుండక పోయినయెడల మనము చేయు పని యంతయును వ్యర్థమే. బూడిదలోపోసిన పన్నీరే! సామాన్య జనులు పుస్తకములకు తగియుండరనుట వ్యర్థ ప్రసంగము; ఏలయన వారికి తగిన పుస్తకములనే మనము సమకూర్పవలెను. ఒకవేళ తగిన పుస్తకములు లభ్యముకానియెడల వారికి తగినటుల బోధించవలెను.

## విద్యాసేవ

సామాన్య జనులకు తగిన గ్రంథములను సమకూర్చుటలోగాని, వారికి జ్ఞానమును గలుగజేయుటలోగాని ప్రథమ ప్రయత్నములందు మన మపజయము పొందవచ్చును. అంతమాత్రముచేత మనము ప్రయత్న పరాఙ్ముఖులము గానక్కరలేదు. ఒక మార్గము

పరిపడనియెడల మరియొక మార్గమున పోవలసియుండును. ఒకసారి కార్యముగానియెడల మరియొకసారి తిరిగి ప్రయత్నించవలసియుండును. అంతే, ఇటుల మన విధ్యుక్త ధర్మమును విడువక తోడివారిని-వారి పిల్లలను అజ్ఞాన తిమిరగహ్వరమునుండి వెడలించి ఔన్నత్య శిఖరము నధిష్టించునటుల చేయుటకు సదా పాటుపడుచుండవలెను.

ఎవరికి మనము సహాయము చేయవలసి యున్నదో వారిని గూర్చి ప్రథమమున చక్కగా విచారించవలయును. భేషజ వేషముల నన్నిటిని విడిచి, వారు మనలను తమ తోడివారుగా భావించుకొను నటుల వారి దగ్గరకుబోయి వారేమి కోరుదురో అడిగి తెలిసికొనవలెను. వారి కొరతలను తీర్చవలెను. కొన్ని సమయములందు వారి కొరతలు మన భావములకు భిన్నములై యుండును. అయినను, మొదట వారేమి కోరుదురో తెలిసికొనవలెను. పిమ్మట వారి వాంఛలు నెరవేర్చవలెను. ఈ కార్యము వేసవి సెలవులలోగాని శీత కాలపు సెలవులలోగాని చేయదగినదికాదు. ఇది జీవితము నంతను ధారవోసి చేయవలసిన మహాత్కార్యము.

## చదివి వినిపించుట

కొందరు వివిధ దేశములయొక్క వార్తలను మాత్రము విన గోరెదరు. వారికట్టి వార్తలను మాత్రమే చదివి వినిపించవలెను. క్రమముగ వారు ఇతర విషయములనుగూర్చి కూడ దెలిసికొన నిచ్ఛగించెదరు. కొందరు పుస్తకములను వినగోరెదరు. వారికి పుస్తకములనే చదివి వినిపించవలెను; ఆ పుస్తకములు వారికి తగియుండునని మీరు మాత్రము తలంచునవిమై యుండగూడదు. వారు కోరునవియు వారి రుచుల కనుగుణ్యముగ నుండునవియునై యుండవలెను.

## ఆ క ర్ష ణ ము

ఇంతవరకును, విశేషముగ, చదువుకొనజాలని జనుల నెటుల ఆకర్షించి జ్ఞానవంతులుగ జేయవలయునో చెప్పితిని. ఇకముందు

బోవుటవలన గలుగుపుణ్యము ఇతరులకు ధారవోసిన కొలదిని తరుగు టకు మారుగ పెరుగుచునే యుండును. ఇదియే దీనియందలి ఆధిక్యము.

## పరస్పర సంబంధము

మనము గ్రంథాలయమునకు బోయి జ్ఞాన సముపార్జనము చేయవచ్చును. కాని ఆలయమునకు రాజాలనివారును, వచ్చి దాని యుపయోగమును బొందజాలనివారును మనదేశమునం దెందరో కలరు. అట్టివారిని జ్ఞానవంతులుగ జేయుట ఎట్లు? ఒకవైపున జ్ఞాన దాయకములగు గ్రంథాలయములు వెలయుచున్నవి; మరియొక వైపున అజ్ఞానతిమిర బాధితులగు మూఢజను లున్నారు. మనమో— మధ్యనున్నారము. కాన మనము వారికిని వీరికిని పరస్పర సంబంధము కలిగింపవలెను. ఈ మహత్తరమైన కార్యమును నెరవేర్చుట యెట్లు? పుస్తకములకును, సామాన్య జనులకును పరస్పర సంబంధము కలుగ జేయ వలయునుగదా?

అట్టిస్థితి కలుగుటకు పరస్పరము తగియుండవలెను. అనగా పుస్తకములకు జనులు తగియుండవలెను. జనులకు పుస్తకములు తగి యుండవలెను. పరస్పరముగా తగియుండక పోయినయెడల మనము చేయు పని యంతయును వ్యర్థమే. బూడిదలోపోసిన పన్నీరే! సామాన్య జనులు పుస్తకములకు తగియుండరనుట వ్యర్థ ప్రసంగము; ఏలయన వారికి తగిన పుస్తకములనే మనము సమకూర్పవలెను. ఒక వేళ తగిన పుస్తకములు లభ్యముకానియెడల వారికి తగినటుల బోధించవలెను.

## వి ద్యా సే వ

సామాన్య జనులకు తగిన గ్రంథములను సమకూర్చుటలో గాని, వారికి జ్ఞానమును గలుగజేయుటలోగాని ప్రథమ ప్రయత్నము లందు మన మపజయము పొందవచ్చును. అంతమాత్రముచేత మనము ప్రయత్న పరాఙ్ముఖులము గానక్కరలేదు. ఒక మార్గము

పరిపడనియెడల మరియొక మార్గమున పోవలసియుండును. ఒకసారి కార్యముగానియెడల మరియొకసారి తిరిగి ప్రయత్నించవలసియుండును. అంతే, ఇటుల మన విధ్యుక్త ధర్మమును విడువక తోడివారిని-వారి పిల్లలను అజ్ఞాన తిమిరగహ్వరమునుండి వెడలించి ఔన్నత్య శిఖరము నధిష్టించునటుల చేయుటకు సదా పాటుపడుచుండవలెను.

ఎవరికి మనము సహాయము చేయవలసి యున్నదో వారిని గూర్చి ప్రథమమున చక్కగా విచారించవలయును. భేషజ వేషముల నన్నిటిని విడిచి, వారు మనలను తమ తోడివారుగా భావించుకొను నటుల వారి దగ్గరకుబోయి వారేమి కోరుదురో అడిగి తెలిసికొన వలెను. వారి కొరతలను తీర్చవలెను. కొన్ని సమయములందు వారి కొరతలు మన భావములకు భిన్నములై యుండును. అయినను, మొదట వారేమి కోరుదురో తెలిసికొనవలెను. పిమ్మట వారి వాంఛలు నెరవేర్చవలెను. ఈ కార్యము వేసవి సెలవులలోగాని శీత కాలపు సెలవులలోగాని చేయదగినదికాదు. ఇది జీవితము నంతను ధారవోసి చేయవలసిన మహాత్కార్యము.

## చదివి వినిపించుట

కొందరు వివిధ దేశములయొక్క వార్తలను మాత్రము విన గోరెదరు. వారికట్టి వార్తలను మాత్రమే చదివి వినిపించవలెను. క్రమముగ వారు ఇతర విషయములనుగూర్చి కూడ దెలిసికొన నిచ్ఛగించెదరు. కొందరు పుస్తకములను విన గోరెదరు. వారికి పుస్తకములనే చదివి వినిపించవలెను; ఆ పుస్తకములు వారికి తగియుండునని మీరు మాత్రము తలంచునవిమై యుండగూడదు. వారు కోరునవియు వారి రుచుల కనుగుణ్యముగ నుండునవియునై యుండవలెను.

## ఆ క ర్ష ణ ము

ఇంతవరకును, విశేషముగ, చదువుకొనజాలని జనుల నెటుల ఆకర్షించి జ్ఞానవంతులుగ జేయవలయునో చెప్పితిని. ఇకముందు

చదువుకొనిన జనుల నెటుల ఆకర్షించవలెనో తెలిసికొన బ్రియత్నింతము. గ్రంథాలయమునందు కొన్ని బీరువాలనిండ పుస్తకముల నుంచుట మాత్రము చాలదు. వానియందలి గ్రంథములను ఎల్లప్పుడును జనులు చదువుచుండవలెను. చదువుకొన నలవాటును కలుగ జేయుట మన విధి. ఈ యలవాటును ఒక దినమునగాని ఒక సంవత్సరమునగాని కలుగజేయజాలము. కావున ప్రథమ దశలయందు జనులెక్కువగ గ్రంథముల నుపయోగింపని యెడల గ్రంథాలయ సాహకులు దిగులుపడవలసిన యవసరములేదు.

## ప్రాణాధార త్రయము లు

(1) గ్రంథములు (2) గ్రంథభాండాగారి (3) భవనము. అను నీ మూడును గ్రంథాలయమునకు ప్రాణధారములు.

1. గ్రంథములు:— మొదటిదగు గ్రంథములనుగురించి యోచింతము. గ్రంథాలయములయందు తరచుగ శాస్త్ర గ్రంథములకంటె నవలలు, కథలు, మొదలగు విశేష బుద్ధిబలము నుపయోగింప నగత్యములేని సులభ గ్రంథములనే పాఠకులు విరివిగ జదువుట సహాజమై యున్నది. అందుచేత సద్గ్రంథ పఠనమునందు జనులకు ఆసక్తి గలుగు నటుల చేయవలసి యున్నది. అందుకు తగుమార్గముల నన్వేషింపవలెను.

2. గ్రంథభాండాగారి.— ఎవరైనను ఏ విషయమునైన దెలిసికొన వలెననికాని, ఫలానా గ్రంథము కావలెననిగాని గ్రంథాలయమునకు జనుదెంచినచో, భాండాగారి తనకా విషయము తెలియదనియు తన భాండాగారము చిన్నదనియు చెప్పరాదు. ఆ విషయమును గూర్చి తనకు దెలియకున్నను, ఆ పుస్తకము తన భాండాగారమునందు లేకున్నను తన గ్రామమునకు దగ్గరనున్న పట్టణములోని భాండాగారములకుగాని, పెద్దలయొద్దకుగాని వెళ్లి ఆ విషయమును తెలిసికొనవలెను. ఆ గ్రంథమును సంపాదింపవలెను. ఎక్కడను దొరకనియెడల ఏ భాండాగారమైన కొనునటుల చేయవలెను.

గ్రంథాల యోద్యమ భీష్ములు, యాత్రాదళములకు వెన్నెముక



**శ్రీ భూపతిరాజు తిరుపతిరాజు**

**కుముదవల్లి**

గ్రంథాలయమును స్థాపించి, అకుంఠిత దీక్షతో ఏబదినాలుగు సంవత్సరములు కాలము తీర్చి - దిద్ది - సర్వతోభివృద్ధి గావించిరి.

జననం : 11-5-1867 - మరణం : 20-9-1951



శ్రీ వీరేశలింగకవి సమాజ గ్రంథాలయం - కుముదవల్లి
పదునెనిమిదవ వార్షికోత్సవం - 18_10_1915
అధ్యక్షులు : శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య (మధ్యను కూర్చున్నారు)

పుట 124

ఈ గ్రంథాలయమును ప్రోత్సహించి 12_3_1916న ట్రస్టు దస్తావేజును వ్రాయించి, రిజిష్టరు చేయించి, అచ్చువేయించిరి.

ఇతర గ్రంథాలయము లన్నింటికి, మార్గదర్శకముగ నుండుటకై "గ్రంథాలయ సర్వస్వ" పత్రికకు అనుబంధముగ బంపిరి.

---

అధ్యక్షకోపన్యాసము :
"గ్రంథాలయములే
గ్రామాలయములు"

పుట 118

అడిగినవారికి ఆ విషయ పరిజ్ఞానము కలుగజేయవలెను. అడిగిన గ్రంథము తెప్పించి అందుబాటులో నుంచవలెను. పల్లెయందుగాని, పట్టణమందుగాని నివసించియుండు ప్రతి పురుషుడును, స్త్రీయును ఏ యే గ్రంథములను జదువ నిచ్ఛ గలిగియుండిన, ఆయా గ్రంథములన్నెల్ల సంపాదించి వారి కందజేయవలెను. చందాదారుడైనను కాకపోయినను ఈ సౌకర్యమును గలిగించుట మంచిది. గ్రంథ భాండాగారి పుస్తకముల కాపరి మాత్రమై యుండబోక, చదువరులకు గావలసిన పుస్తకములను, పుస్తకములకు గావలసిన చదువరులను సమకూర్చువాడుగా నుండవలెను. అతడు గ్రంథాలయమును జ్ఞానమునకును, సన్మార్గమునకును దోహద ప్రదేశముగ నుండునటుల చేయవలెను. అటుల గానిచో సమర్థుడైన భాండాగారిలేని గ్రంథాలయము ఉపధ్యాయుడులేని పాఠశాలవలె నిరర్థక మగును.

౮. భవనము.- గ్రంధాలయమునకు స్వంత భవన ముండుట మిక్కిలి యావశ్యకము. గ్రామమునం దొక పాఠశాలయందుగాని దేవాలయమునందుగాని సత్రమునందుగాని గ్రంధాలయమును స్థాపించుటకంటె, ప్రత్యేక భవనమునందుంచుట మిక్కిలి యాకర్షకముగ నుండును. ఈ యావశ్యకతను గ్రహించి మీ రిదివరకే భవన నిర్మాణమును జేసియుండు టెంతయు ప్రశంసనీయము.

## జ్ఞానము - అనుభవము

పాఠశాలయందు మనము విద్యాభ్యాసమును జేయుట ఎట్లో నేర్చుకొందుము. గ్రంధాలయమునందా విద్యను అభ్యసించి జ్ఞాననేత్రమును వికసింప జేసికొందుము. జ్ఞాన సముపార్జనముతో మాత్రము తృప్తినిజెంది ఊరకుండిన, విద్యవలన గలుగవలసిన లాభములను మనము సంపూర్ణముగ బొందజాలము. విద్యవలన గలిగిన జ్ఞానమును మనము జీవితమునం దనుభవసిద్ధము గా దానినిగ నొనర్పవలెను. చాలమంది ఈ విషయమును మరచి తమజ్ఞానమును వ్యర్థము జేయుచున్నారు. అందుచేత వారు ప్రపంచమునకు వ్యర్థులగుటయే గాక తమ యంతరాత్మలకు గూడ వ్యర్థులగుచున్నారు. చదువుకొన్న

విద్యవలన మాత్రమే మనము గొప్పదనమును సంపాదింపజాలము. నిర్వహించిన సత్కార్యముల వలననే మన జీవితము వికాసముపొంది యశోవంతము కాగలదు.

కావున సోదరులారా! సంపాదించిన ఎంత అల్పజ్ఞానమునైనను మన నిత్యజీవితమునం దనుభవసిద్ధమగునటుల చేసిననే కాని. మనజాతి యొక్క భావిస్థితి తృప్తికరముగ నుండదను సంగతిని ఎల్లప్పుడును జ్ఞప్తియందుంచుకొనుడు.

## ఆకాంక్ష

సోదరులారా ! మీ గ్రామమునందు గ్రంథాలయమును స్థాపించి ఉపయోగకరములగు అనేక గ్రంథములను జేర్చుచున్నారు. అట్లు గ్రంథములను సేకరించుట తోడనే మీ ధర్మము పూర్తి కాలేదు. మీకు గ్రంథాలయ మున్నందుకు ఫలముగా మీ గ్రామము ఉన్నత స్థితిలోనికి రావలెను; ప్రపంచమునం దిప్పుడు జరుగుచున్న అభివృద్ధియందు మీ గ్రామమున నివసించు ప్రతి పురుషుడును, స్త్రీయును, పిల్లవాడునుగూడ పాలుపంచుకొనవలెను. మీ గ్రామ మిట్టి ఉన్నతస్థితికి వచ్చుటకు మీరు తదేక నిష్ఠతో అనేక సంవత్సరములు ఎడతెగక కష్టపడి పనిచేయవలసి యున్నది.

1915 లో భీమవరము తాలూకా "కుముదవల్లి" యందలి "శ్రీ వీరేశ లింగకవి సమాజము" యొక్క 18 వ వార్షికోత్సవ సభాధ్యక్ష పీఠమునుండి అయ్యంకివారి ఉపన్యాస సారము: గ్రంథాలయ సర్వస్వము – సంపుటము 1; సంచిక 2, 1915–16

---

# గ్రంథాలయములు – వాని నిర్వహణము

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునందు సువర్ణాక్షరములతో లిఖింప దగిన చరిత్రగలిగినట్టి ఈ భీమవరము తాలూకా ప్రథమ

గ్రంథాలయమహాసభకు నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొని గౌరవించి నందులకు మీ కెల్లరకును అంజలి ఘటించి మ్రొక్కెదను.

## జంటనాయకులు

ఆంధ్రదేశమునందే కాక, మొత్తము దేశమునందెల్లడల రాజకీయసంచలన మన్న నేమియో యెరుంగకమునుపే, మీ తాలూకాయందు దేశసేవాతత్పరులగు మహనీయులు బయలుదేరి ప్రజాహితజీవనమునకు బునాదిని వైచిరి. శ్రీ కాళ్ళకూరి నరసింహం పంతులుగారును శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారును అట్టి మహనీయులలో ప్రథమమున బేర్కొనదగినవారు. ఇప్పటికి నలువది సంవత్సరములకు బూర్వము దేశముయొక్క స్థితి యెట్లుండెనో ఒక్కసారి స్మృతిపథమునకు దెచ్చుకొనుడు. చారిత్రిక-రాజకీయాది విషయములను గూర్చిన పరిజ్ఞానము నిచ్చెడి గ్రంథములుగాని తదితరసాధనములుగాని ఆ కాలమునందు బొత్తిగా లేవు. కృష్ణారాయని కృష్ణాపత్రికగాని, నాగేశ్వరాయని ఆంధ్రపత్రికగాని అసలే లేదు. పోని, ఆంగ్లేయభాషాపరిజ్ఞాన మేమైన వీరికి గలదాయని యోచించిన అట్టిది కొంచెమైన లేదు. ఇట్టి పరిస్థితులయందు ఆ కాలమున దేశసేవానురక్తి వీరి కెటుల గలిగినది!

తాము బాగై తమతోటివారలను బాగుచేయవలెనను మనుష్యస్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛయే ఈ జంటనాయకులనుగూడ ప్రేరేపించినది. ఈశ్వరశక్తియే వీరికి జవసత్వముల నిచ్చినది. ఈశ్వరప్రేరితుల మనియు ఈశ్వరాదిష్టకార్యములను తాము నెరవేర్చుచున్నామనియు ఈ వీరులు దృఢతరభక్తిపూరితులై యున్నారు.

అల్లదిగో! చూడుడు. ఆ జంటనాయకులలో నొకరగు శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారిని దిలకింపుడు. ఆయన యొక్క సేవానురక్తి — నమ్రత — కార్యదీక్ష, అవి మనకందరకును అనుకరణీయములు. నలువది సంవత్సరములనుండియు దేశసేవానురక్తిచే చేవదీరి

యున్న నో వీరశిఖామణీ! నీ దర్శనముచేయుభాగ్య మబ్బినందులకు నా జన్మము ధన్యము.

## తాలూకా గ్రంథాలయముల ప్రారంభము.

ఈ జంటనాయకుల ఉద్బోధనలవలననే ఈ తాలూకాయందు గ్రంథాలయములు స్థాపింపబడినవి. వీరికి పిమ్మట మీా తాలూకా గ్రంథాలయోద్యమమందు పేర్కొనదగినవారు నిడమర్తి లక్ష్మి నారాయణగారు. మీా తాలూకాయందు ప్రథమ గ్రంథాలయము 1895 వ సంవత్సరమున ఈ "ఉండి" గ్రామమందే దేశసేవాతత్పరు లగు శ్రీ దాదాభాయి నౌరోజీగారి పవిత్రనామమున స్థాపింపబడినది. పిమ్మట 1897 వ సంవత్సరమున "కుముదవల్లి" గ్రామమున అభినవాంధ్ర దేశోదయప్రాప్తికి మూలపురుషుడగు కందుకూరి వీరేశలింగం పంతులుగారి పేరున రెండవ గ్రంథాలయము స్థాపింపబడి, యిప్పటివరకును నిర్విఘ్నముగ సాగుచున్నది. ఆంధ్రదేశమునందెల్ల ఇప్పటివరకు జీవించియున్న గ్రంథాలయములలోకెల్ల ఇదియే ప్రథమమున స్థాపింపబడియున్నదని చెప్పనగును. ముప్పది యూరు సంవత్సరములనుండి నిరంతరాయముగ కొనసాగుచున్న ఈ గ్రంథాలయము శ్రీ తిరుపతిరాజుగారియొక్క కార్యదీక్షకు సాక్షీభూతము.

## తాలూకా గ్రంథాలయముల అభివృద్ధి.

ఈ తాలూకాయందు యిప్పటికి 35 గ్రంథాలయము లున్నవని విను టెంతయు సంతోషావహముగ నున్నది. అందు క్రైస్తవ గ్రంథాలయ మొకటియు, మహమ్మదీయుల గ్రంథాలయ మొకటియు గూడ నుండుట గమనింపదగినది. 614 జనాభాగలిగిన నేలపోగుల గ్రామమునందు గ్రంథాలయ ముండుట మెచ్చుకొనదగినదే; కాని ,9839 జనాభా గలిగి ఆంగ్లేయ విద్యావేత్తలచే ఘనతకెక్కిన భీమవరపట్టణమునందలి నన్నయ గ్రంథాలయము కీర్తిశేషమైపోవుట మిక్కిలి విచారకరమని మనవిజేసినందులకు క్షమింపవలెను. మరియు,

మూడు వేలకంటె నెక్కువ జనాభా గలిగిన మహాదేవపట్నము, తోలేరు, యేలూరుపాడు, లోసరిగుట్లపాడు గ్రామము లందును - రెండు వేలకంటె ఎక్కువ జనాభా గలిగిన అయిభీమవరం, బొండాడ, గరగపర్రు, వేండ్రము, పెదకాపవరము, పెన్నాడ అగ్రహారం, రాయలం గ్రామములందును - గ్రంథాలయము లింతవరకును స్థాపింపకుండుట శోచనీయము. ఒక వెయ్యికంటె ఎక్కువ జనాభాగలిగిన పీసలి, యనమదుర్రు; బావాయపాలెం, చినకాపవరం, గుమ్మలూరు, కోళ్ళపర్రు, కుప్పనపూడి, మాదివాడ, దుంపగడప, ఉణుదుర్రు, నవ్వుదుర్రు, మడుగుపోలవరం, కొండేపాడు, కొమరాడ, కాళ్ళకూరు, కాలనపూడి, గొరగనమూడి, దొడ్డనపూడి, దిరుసుమర్రు, బేతపూడి గ్రామములందుకూడ గ్రంథాలయములను స్థాపించుట అత్యంతావశ్యకము.

## గ్రంథాలయ త్రయము

గ్రంథాలయములు మూడురకములు. మొదటివి చారిత్రిక గ్రంథాలయములు. అనగా దేశభాషా చరిత్రను దెలుపునట్టి ప్రాచీన గ్రంథములను తదితర సాధనములను స్వీకరించి పెట్టునవి; "ఆంధ్ర పరిశోధక మహామండలి" "ఆంధ్రసాహిత్య పరిషత్తు" మున్నగునవి యిట్టివి. మొదటిరకపు గ్రంథాలయములందలి విషయములను గూర్చిన నవీన గ్రంథములను సేకరించి పెట్టునట్టిగాని, కళాశాలలు, విశ్వవిద్యాలయములు పారిశ్రామికశాలలు మున్నగువానికి సంబంధించిన గ్రంథములు గలిగినట్టిగాని పట్టణములకు సంబంధించినట్టిగాని పరిశోధక గ్రంథాలయములు రెండవ రకము. జనసామాన్యమునకు ఎడతెగక పుస్తకములందజేయు ప్రచారక గ్రంథాలయములు, మూడవరకము. ఇతర గ్రంథాలయములందు ఉన్న గ్రంథములకంటె ఎక్కువ ప్రాచీన కాలమునాటి గ్రంథములను గలిగియుండుట ఒక విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు గాని ఒక పట్టణగ్రంథాలయమునకుగాని గొప్ప; కాని ప్రచార గ్రంథాలయమునకు ఎప్పటికప్పుడు వెలువడుచుండు నవీన గ్రంథములను గల్గియుండుట గొప్ప. అచ్చువేసిన సిరా

ఆరకమునుపే నవీన గ్రంథములు ఇట్టి గ్రంథాలయమును చేరవలెను. పరిశోధక గ్రంథాలయమునకును (అది పుస్తకముల నెరువిచ్చునదిగా కూడ ఉన్నను) ప్రచారక గ్రంథాలయమునకును గల భేదమిదే.

## గ్రంథాలయ వైశిష్ట్యము

గ్రామ గ్రంథాలయమును గూర్చి యోచించుకొనునప్పుడు ఈ తేడాలను ముఖ్యముగా గమనింపవలెను. అవసరమునుబట్టి కొంత పరిశోధక శాఖ పెట్టుకొన్నప్పటికిని, గ్రామగ్రంథాలయము ప్రచార గ్రంథాలయమేగాని పరిశోధక గ్రంథాలయము గాజాలదు. గ్రామము నందలి చదువరుల అభిరుచులనుబట్టి వారికి నిరంతరము గ్రంథముల నందచేయునది గ్రామ గ్రంథాలయము.

గ్రామ మందలి జనులు తమ తమ పనులు చేసికొని విశ్రాంతి తీసికొను సమయమున చదువుకొనుటకు గ్రంథములు కావలసియుం డుటచేత, కథలు – నవలలు - పురాణములు – ఇట్టి గ్రంథములనే విశే షముగా కోరుదురు. వారికి కావలసిన గ్రంథముల నిచ్చినగాని గ్రంథాలయమును ఎక్కువమంది ఉపయోగింపరు. విద్యావిషయిక మైన గ్రంథములు ఎక్కువమందికి కావలసినచో, వానినే అందజేయ వలయును. అంతేగాని పరిశోధనకు పనికివచ్చు పాతగ్రంథములకొరకు గ్రామగ్రంథాలయములు తంటాలుపడి, తమధనమును కాలమును అందుకై విశేషముగా వ్యయముచేయనక్కరలేదు. గ్రంథాలయమందు ఎక్కువ గ్రంథములను చేర్చుటయందే దృష్టిని నిలుపక, అట్లు చేర్చిన గ్రంథములనెల్ల ఆ గ్రామస్థులచే ఉపయోగింపజేయవలెను. గ్రామ ములో తీరికసమయములలో—చీట్లాట, జూదము, వృథావాగ్వ్యయము, కల్లుదుకాణములకు పోవుట – మొదలగు కార్యములందు నిమగ్నులై యుండు జనమును ఆకర్షించుటకు తగిన గ్రంథములు గ్రంథాలయ మందుండవలెను. అట్లని చదువరుల అభిరుచులను మార్చరాదని చెప్పను. ఇతర దుర్వృత్తులనుండి మరల్చి గ్రంథాలయ దృష్టిని [illegible] కలవరచినపిమ్మట వారి అభిరుచులను మార్చుటకై ప్రయత్నింపవలెను.

## అవినాభావ సంబంధము

గ్రంథాలయము గ్రామజీవితమందొక ముఖ్యమైన భాగముగ, తప్పనిసరి విషయముగ, ఏర్పడిపోవలెను. గ్రామస్థుల జీవితమునందు ప్రతిదశకును దానితో సంబంధము కలిగియుండవలెను. గ్రామములోని వివిధ సమస్యలను పరిష్కరించు కేంద్రస్థానమై వెలయవలయును. మరియు గ్రామస్థులకెల్ల ఏదో యొకవిధమున దానిపాలనయందు జోక్యము ఏర్పడియుండవలెను. గ్రామస్థు లందరిని సంవత్సరమున కొకసారి సమావేశపరచి నూతనవత్సరమునకు పరిపాలనావర్గము నెన్నుకొనుటవలన ఇది ఏర్పడగలదు. గ్రంథములను ఎక్కువగా ఉపయోగించునట్టియు, పలుకుబడిగలిగినట్టియు, పనిజేయ నభిలషించునట్టియు, గ్రామస్థులనే పరిపాలకవర్గమున నెన్నుకోవలెను. ఒకేమనిషికి సంబంధించిన కార్యముగా ప్రారంభమైనను క్రమముగా గ్రామస్థులందరికి అందు జోక్యము కలుగవలెను. ముఖ్యముగా పాఠశాలోపాధ్యాయుల యొక్కయు గ్రామమందలి ఉద్యోగులయొక్కయు పెత్తనదారుల యొక్కయు తోడ్పాటును పొందవలెను.

## గ్రామ గ్రంథాలయమును స్థాపించుటెట్లు ?

గ్రామగ్రంథాలయమును ఎందుకు స్థాపింపవలయునో తెలిసికొంటిమి. దాని నెట్లు స్థాపింపవలెను? ముందుగా ఒక గ్రామమునకు బోయి గ్రంథాలయముల ఉపయోగమునుగూర్చి బోధింపుము. ఎంత స్వల్పవ్యయముతో దానిని స్థాపింపవచ్చునో ఎట్టిపుస్తకములను కలిగియుండవలెనో ఎటుల పరిపాలింపవలెనో తెలియజెప్పుము. అప్పటికిని అందరును ఆమోదసూచకముగ తలలూపెదరుగాని కార్యమునకు దిగరు. "ఇప్పటికే ఖర్చు లెక్కువయ్యెను. గ్రంథాలయమునకు ఏమియు ఇయ్యజాల"ముందురు. కొందరు "మా ఇంటిలో చాల పుస్తకము లున్న"వని బూజుపట్టినకొన్ని గ్రంథములను జూపెదరు. అయితే కొంత ప్రయత్నము చేయగా ఒక యువకుడుగాని,ఒక తాతగాని కార్యరంగమున దుముకకమానడు. మరికొంతమందిని చేర్చి ఒక కార్యనిర్వాహకసంఘము నేర్పరుపుము. ఒక్కరే ఎక్కువసొమ్ము

నిచ్చుటకంటె ఎక్కువమందినుండి-స్వల్పమొత్తములనైనసరే వసూలు చేయుటమంచిది. అదియే జయమునకు అత్యంతావశ్యకము. నవలలు కథలు, పురాణములు మొదలుగాగల గ్రంథములు వయోజనులకు పనికివచ్చువానిని నూరింటిని, పిల్లలకు పనికివచ్చు కథలపుస్తకములు ఏబదింటిని, సంపాదించి గ్రంథాలయమును ప్రారంభింపుము. ఒకటి రెండు పత్రికలనుగూడ తెప్పించుట ఉపయోగకరము. ఒక వంద రూపాయలతో ఒక చిన్న గ్రామగ్రంథాలయమును ప్రారంభింప వచ్చును. ఊరకే వచ్చినవని చెత్తపుస్తకముల నన్నింటిని చేర్చి గ్రంథాలయమం దుంచకుము; క్రొత్త పుస్తకములను ఎప్పటికప్పుడు తెప్పింపకుండ పాతచెత్త పుస్తకములతో కాలక్షేపము చేయుచుండు గ్రంథాలయము త్వరలోనే నశించకమానదు.

అట్లు పుస్తకములను సేకరించి, గ్రామస్థుల నందరిని చేర్చి ఆ గ్రంథములనెల్ల చూపుము. అప్పుడే నిబంధనలను చదివి వినిపింపుము. మొదటి కార్యనిర్వాహక సంఘముయొక్కయు ఉద్యోగుల యొక్కయు ఎన్నికలను జరుపుము.

## గ్రంథముల నేర్చుట - కూర్చుట

గ్రామగ్రంథాలయమునకు గ్రంథములను ఏర్చుట మిక్కిలికష్టమైన పని. ఆ గ్రామస్థులయొక్క అభిరుచులు, ఇష్టములను, ద్వేషము త్తములమీద తెలిసికొనినగాని ఈ పనిని చేయజాలము. మొదట పురాణములు, (వచనములు) సుప్రసిద్ధులనవలలు, వీనితో ప్రారంభింప వచ్చును, పిమ్మట కథలుగానుండు చరిత్రలు, వినోదవిషయములను చేర్చవచ్చును. ఈ రీతిగా పాఠకులయొక్క అభిరుచులనుబట్టి గ్రంథములను చేర్చుచుండవలెను.

నెల కొకసారి కార్యనిర్వాహక సంఘమును సమావేశపరచి, క్రొత్తగ్రంథములను తెప్పించుటకు సలహాలను గైకొనవలెను. మరియు సంవత్సరమున కొకసారి గ్రామస్థులనుచేర్చి వారి అభిరుచులను తెలిసికొనవలెను. ఇదిగాక సంవత్సరము పొడుగునను ఇతరమార్గములనుగూడ గ్రామస్థులే పుస్తకములను కోరుదురో తెలిసికొనవలెను.

గ్రామస్థుల అభిరుచులుగూడ క్రమముగా మారుచుండును. సద్గ్రంథపఠనము వైపునకు అభిరుచులు మారునట్లుగా చూడవలయును. గ్రామగ్రంథాలయములు ప్రచారగ్రంథాలయములేగాని పరిశోధక గ్రంథాలయములు గావని ఇదివరకే చెప్పియుంటిని. అందుచేత బొత్తిగా చదువని గ్రంథములను గ్రామగ్రంథాలయమునుండి తీసివేయుటయు మంచిది. అట్లు తీసివేయుటవలన బీరువాలలో క్రొత్త గ్రంథములకు స్థలము కలిసివచ్చును.

## గ్రంథముల నెట్లుంచవలెను ?

గ్రంథాలయమును ఇతరులు కాపురముండు యిండ్లయందుంచుటకంటె అందరును బాహాటముగా రాదగిన ప్రదేశమందుంచుట అత్యంతావశ్యకము. గ్రామచావడి, సత్రము, దేవాలయము, పాఠశాలాభవనము, రామభజనాలయము-ఇవి గ్రంథాలయముంచుటకు తగిన స్థలములు. స్వాంతభవన ముండిన సర్వశ్రేష్ఠము.

గ్రంథములను గోడ అలమారులయందుంచుటకంటె టేకికర్రతో చేసిన అలమారులయందుంచుట మంచిది. మట్టిగాని సున్నముగాని తగిలినయెడల గ్రంథములు చెడిపోవును. స్వాంత భవనములను కట్టునప్పుడు చెక్కలనే గోడలయందు బిగించి అలమరాల నేర్పరుపవచ్చును. బీరువా 7 అడుగులకంటె ఎక్కువ పొడుగు ఉండరాదు. బీరువాకును భూమికిని మధ్యను 9 అంగుళముల స్థలమైన ఉండవలయును. అలమారులకు తలుపులులేకుండ తయారుచేయించుట నవీనపద్ధతి. అందువలన చదువరులు పుస్తకములను స్వయముగా చూచుకొని ఏరుకొనుటకు అనువుగా నుండును. స్వేచ్ఛోపలబ్ధికి అవకాశముండును. ఒకవేళ- అవసరమైన- అల్లికతీగెతో తలుపులు చేసిన యెడల పుస్తకములకు గాలి తగులుటకును, అందరును చూచుటకును కూడా వీలుగానుండును.

## వర్గీకరణము

గ్రంథములయొక్క వర్గీకరణము కూడ చాలముఖ్యమైనది. ఇప్పుడు అవలంబింపబడుచున్న పద్ధతి మిక్కిలి లోపభూయిష్టమైనది.

విషయములనుబట్టి అకారాదిగా ఒక గ్రంథముల పట్టికయును, గ్రంథముల పేర్లనుబట్టి అకారాదిగా ఒక గ్రంథముల పట్టికయును, గ్రంథకర్తల నామములనుబట్టి అకారాదిగా వేరొక గ్రంథముల పట్టికయును ఉండుట అత్యంతావశ్యకము, గ్రామగ్రంథాలయము మొదలు గొప్ప పట్టణ గ్రంథాలయమువరకు అన్నింటికి అనువుగానుండు పద్ధతి నొక దానిని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు తయారుచేయుచున్నారు. అనతికాలములోనే బయలువెడలగలదు.

పుస్తకములకు పురుగులు పట్టకుండ అప్పుడప్పుడు దులుపుచుండవలయును.

## గ్రామగ్రంథాలయ కార్యనిర్వహణము

గ్రంథాలయ కార్యనిర్వాహకవర్గము పనిచేయునదిగా నుండవలయును. అందరును పనిచేసి, గ్రామస్థు లందరియొక్క అభిప్రాయములను పాలించని యెడల గ్రంథాలయ నిర్వహణమున కొక నిర్వహణసంఘ ముండిన ప్రయోజనమేమి? నిర్వహణ సంఘసభ్యులు నెలకొకసారి సభకు వచ్చువారుగామాత్ర ముండగూడదు. వారమునకొకసారియైన గ్రంథాలయమునకు వచ్చి తగు సహాయమును-పుస్తకములు బాగుచేయుట మొదలైన పనులయందుగూడ సహాయమును చేయగలవారుగా నుండవలెను. అనేక గ్రంథాలయములందు కార్యనిర్వాహక సంఘసమావేశములు, నియమితసంఖ్యగల సభ్యులు రాకపోవుటచే జరుపుటకు వీలులేక ఆగిపోవుచుండును. అట్లు రాని వారిని ఎన్నుకొనిన ప్రయోజన ముండదు. గ్రంథాలయోద్యోగులతోబాటు నిర్వాహక సంఘసభ్యులుకూడ తగినంత శ్రద్ధతీసుకొనిన గాని గ్రంథాలయాభివృద్ధి సక్రమముగా జరుగదు. అట్లు శ్రద్ధలేని సభ్యులు నిర్వాహక సంఘమం దుండి పనిచేయువారికి సహాయపడుటకు మారుగ అడ్డుతగులుచుందురు. వారు పనిచేయక పనిచేయు

* "ఆంధ్రభాషా గ్రంథముల వర్గీకరణము"- అను గ్రంథము శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు తరువాత రచించి ప్రచురించిరి. దానిని ఈ సంపుటమునందే చూడనగును.

వారికి తమ అవకతవక సలహాల నిచ్చుచుందురు. పనిచేయువారు వానిని నిర్వహించనియెడల వారితో పోట్లాడుచు గ్రామములో కొత్తచీలికలకు తోడ్పడుచుందురు. అట్లుచేయక నిర్వాహక సభ్యులందరు కలిసిపనిచేయుచున్న యెడల (పని అనగా ఆలోచనమాత్రమే గాదు; శరీరపరిశ్రమగూడ) కష్టసాధ్యమైన ప్రణాళికలను వేసికొనక వారు పనిచేయగలిగిన కార్యక్రమమునే యోచించుకొని గ్రంథాలయ నిర్వాహణమును సక్రమముగా కొనసాగింపగలరు.

## గ్రంథభాండాగారాధికారి

గ్రంథాలయముయొక్క జయమంతయు ఈతనిమీద ఎక్కువగా ఆధారపడియుండును. అతడు మేధావియును, శాంతుడును, సమర్థతగలవాడునునై యుండవలెను. సద్గ్రంథపఠనమందు గ్రామస్థులకభిరుచి కలుగజేయదగినవాడుగా నుండవలెను. అడిగినవారి సందేహముల నెల్ల దీర్చుటకు తగినవాడుగా నుండవలెను. ఈ పనులయందు గ్రంథభాండాధికారికి తదితర నిర్వాహక సంఘసభ్యులుగూడ తోడ్పడుచుండవలెను.

## ద్రవ్యమును సేకరించుటెట్లు ?

గ్రామములందు నెలసరి చందాపద్ధతి బొత్తిగా పనిచేయదు. ప్రతి నెలకును చందానిచ్చుట నెలసరి ఆదాయముగల ఉద్యోగస్థులకు అనువుగనుండునుగాని సంవత్సరమున కొక్కసారిగాని, రెండుసారులుగాని పంటపండు రైతునకు అనువుగ నుండదు.

## వస్తుమార్పిడి విధానము

అసలు చందాలను ద్రవ్యరూపమునగాక వస్తురూపముననే వసూలుజేయుట సులభము. పాలేరునకు, వడ్రంగికి, చాకలికి, కుమ్మరికి, చెప్పులు కుట్టువానికి ఇచ్చునటులనే గ్రంథాలయమునకు గూడా వస్తురూపమున చందా నిచ్చుట గ్రామస్థులకు సులభమైనమార్గము. పంటపండు రైతు వస్తువు నిచ్చును. పనివారలు తమకు చేతనైనపనిని జేసిపెట్టుదురు. కూలివారు తమశక్తి నిచ్చెదరు.

## ఉమ్మడి ఆదాయములు

ఇటుల గ్రామస్థుల నందరియొద్దనుండి చందాను గైకొని గ్రామస్థు లందరికిని దానిని ఉపయోగపరచవలెను.

మరియు గ్రామ ధర్మాదాయమునుండియు, వర్తలకు ధర్మనిధుల నుండియు, సహకారసంఘముల ధర్మనిధులనుండియు, కోలగారపు పాటలు కాల్వపాటల మొత్తములనుండియు, శుభాశుభ కార్యముల కట్నముల నుండియుయింకను ఎన్నియో విధముల, కార్యనిర్వాహకసంఘమువారు తగుశ్రద్ధవహించినద్రవ్యమును సేకరించవచ్చును. మనకు నిత్యనైమిత్తిక కర్మలన్నియు ఏదోయొక విధముగ జరిగిపోవుచుండ—ఇదియు అందొక భాగమై విలసిల్లిన, దీని నిర్వహణ మొక లెక్కయా!

## గ్రామగ్రంథాలయోపయోగ మెవ్వరికి ?

మొదటి తరగతివారు:— చదువుకొన శక్తికలిగి చదువుకొన వలెననెడి తృష్ణగూడ కలవారు. వీరికి భాండాగారాధికారి సద్గ్రంథ సమీకరణమునందు తోడ్పడవలయును. ఇట్టివారికి తమ గ్రంథాలయ మునలేని గ్రంథములను కేంద్ర గ్రంథాలయమునుండి తెప్పించి యియ్యవచ్చును.

రెండవ తరగతివారు:— చదువుకొనగలిగి చదువుకొనవలయు ననెడి వాంఛ లేనివారు, వీరికి చదువునందు అభిరుచిని బుట్టించుటకు విశేషముగా పాటుబడవలయును. ఇందుకొరకై తరుచుగా గ్రంథ విశదీకరణములను ఉపన్యాసములను ఏర్పరచి వారి నాకర్షించి, ఎవ్వరెవ్వరి కేయే గ్రంథము లనువుగనుండునో, అట్టివారి కట్టి గ్రంథములనే అందజేయుచుండవలెను. పుస్తకముల యోగ్యతలనుబట్టి జనులు వారి అధికారముల ననుసరించి పుస్తకము లమరియుండవలెను. సామాన్యజనులు పుస్తకములకు తగియుండరనుట యథార్థముగాదు. ఏలయనగా వారికి తగిన పుస్తకములనే మనము సమకూర్చవలెను. గ్రంథాలయమందున్న ప్రతి గ్రంథమునకు ఒక చదువరిని, ప్రతి చదువరికి ఒక గ్రంథమును సమకూర్పవలెను.

మూడవ తరగతివారు:— వీరు నూటికి తొంబదికంటె ఎక్కువగాగల జదువుకొనజాలని జనులు. వీరిని విద్యావంతులుగా జేయుట

దుస్సాధ్యము గావచ్చును. కాని వీరిని జ్ఞానవంతులుగానైన జేయుట మన కర్తవ్యము. చక్షురక్షుర సంయోగమువలననే గాక శ్రవణమూలమునను చిత్రపటముల మూలమునను జ్ఞానాభివృద్ధి జేయనగును. ప్రాచీనార్యుల కాలమునుండియు, లిపి వ్యాపకమునకు బూర్వము నుండియు గూడ భారతవర్షమున జ్ఞానము గ్రంథముల మూలముననే గాక శ్రుతిమూలముగ గూడ వ్యాపించుచుండెను. శ్రుతిమూలకమగు జ్ఞానము పూర్వకాలమునందేగాక, నేటికిని ధారణాశక్తి సహాయముతో వ్యాపింపజేయుట అత్యంతావశ్యకమై యున్నది. హరికథలు, పురాణశ్రవణములు, భాగవతములు, జంగమకథలు, మున్నగు అనేక మార్గములు జనసామాన్యము యొక్క జ్ఞానాభివృద్ధి కేర్పడినవి. అక్షరజ్ఞానములేని పాటకపు జనులచే రచియింపబడి, తరతరముల నుండి ముఖాముఖిని ప్రచారమగుచున్న గాథలను జూచిన మనజాతి యొక్క అద్భుతమగు ఆధ్యాత్మికౌన్నత్యము గోచరించును. తోలు బొమ్మలాటకూడ పామరజనుల హృదయమునకు ఉద్బోధకముగ నుండును. అయితే నవీనయంత్రసహాయమువలన ఇప్పుడీపని ఎక్కువ సౌలభ్యముతో బాహుళ్యముగ చేయుటకు మార్గము లేర్పడినవి.

వివిధ విషయములనుగూర్చి సుబోధకములగునటుల వారికి ఉపన్యాసములిచ్చి, వారి బుద్ధికి వికాసమును గలుగజేయవలెను. మహాగ్రంథముల నెల్లవారికి జదివి వినిపింపవలెను. వారిని మనమున్నచోటికి రమ్మన్నచో రారు. మనమే వారున్న స్థలమునకు బోవలెను. మన వేషభేషజముల నన్నిటిని వదలిపేయవలెను. వారియం దొకనిగ భావించునటుల బోయి వారేమి కోరుదురో అడిగి తెలిసికొనవలెను. కోరబడుదానినుండియే వారికోరంతలను బూరింపవలెను.

నాల్గవతరగతివారు పిల్లలు:— పిల్లలే సంఘమునకు జీవము. వారియందు అనంతమైన శక్తులు గర్భితములై యున్నవి. ఈ శక్తులను ప్రథమమున పాఠశాలలందే వర్ధిల జేయవలసియున్నను, సంకుచితములగు నిర్బంధపాఠ్యపుస్తకములను పఠించుటయందే వానిని అణగ

దా్రిక్క-క ఆర్థిక శక్తులు వికాసము నొంది విశాలములగుటకు కావలసిన తోహదమునంతను మన మీాయువలసియున్నది. పిల్లలయొక్క- మన స్సులు అతికోమలములు. కావున అట్టిసమయమున నే వారిని మంచి దారులయందు బెట్టుట మిక్కి-లి యావశ్యకము. కాబట్టి వారి ఉపయోగ మునకై ప్రత్యేక పుస్తకములను, పటములను, ఆటలను, సేకరించి వేరుగ నుంచవలయును. అవి విశేషముగా బొమ్మలు కలిగినవై యుండవల యును. గోడలయందు వస్తుపాఠబోధకములగు పటములనుబెట్టి వానిని గురించి బాలురకు బోధించుచు, అందుకు సంబంధించిన పుస్తకము లను వారు చదువునటుల అభిరుచిని గల్పింపవలెను. మరియు సుబో ధకములును నీతిబోధకములును అగు కధలనుజెప్పి వారి మనస్సుల నాకర్షించి గ్రంధపఠనమునకు వారిని ప్రోత్సహించవలెను.

అయిదవ తరగతివారు స్త్రీలు:— స్త్రీలుగూడ నిజముగ పైన వివరించిన నాలుగు తరగతులలోనికి వచ్చెదరు. కాని మనదేశపరిస్థితు లను బట్టి వారికి ప్రత్యేక సౌకర్యములను కలుగజేయవలసి యున్నది. గృహములకు గ్రంథముల నంపి వారు విశేషముగ చదువునటుల చేయవలయును. చదివిన దానిని వినునటుల చేయవలయును. పురా ణము లన్నను, ఉత్సవము లన్నను, పండుగ లన్నను స్త్రీలకు ప్రీతి మెండు. అట్టివాని నేర్పరచి వారిని గ్రంధాలయమునకు వచ్చునటుల జేసి జ్ఞానవతులగునట్లు చేయవలెను.

ఇతర ఆకర్షక విషయములు

గ్రామస్థులను అందరిని ఆకర్షించుటకు సంవత్సరాది, దసరా, శ్రీరామనవమి, శ్రీకృష్ణాష్టమి, మొదలగు పండుగలను గ్రంధాల యమువారు నిర్వహించ వలయును. ప్రతి పండుగకును గ్రంథాలయ మందు నేదియో యొక యుత్సవము జరుగుచునే యుండవలెను. కాని ఈ యుత్సవములు గ్రంథాలయమునకు జనుల నాకర్షించునంతవరకే ఉపయోగపడవలెను; కాని గ్రంథాలయముయొక్క- ఆదాయ మంతయు మ్రింగుట కేర్పడగూడదు. అట్టి ఉత్సవములందు సొమ్ము ఖర్చు భాగము స్వల్పముగను, జ్ఞానప్రదానభాగ మెక్కు-వగ నుండవలెను.

అంగలూరు గ్రంథాలయమువారు ఆ గ్రామపు లెక్కలకు నకళ్ళను సంపాదించిరి. గ్రామస్థులకు కావలసినప్పుడెల్ల వారి భూముల నెంబర్లు - విస్తీర్ణము — అందుకు చెల్లించవలసిన పన్నులు మొదలగు విషయములనుగూడ వివరముగా చెప్పెదరు. ఈ విషయమున ఆ గ్రామ వాసులు శ్రీ ఆరెకపూడి రామశాస్త్రిగారు ప్రత్యేకమైన శ్రద్ధ వహించి పాటుబడుచున్నారు. మరియు పొలముల మశాకత్తునుగూడ జేసి పెట్టెదరు. అందువలన గ్రామోద్యోగులకు వారి నిత్యావసరములందు తోడ్పడిన వారుకూడ నయ్యెదరు.

## దేశ సౌభాగ్యము

దేశసౌభాగ్యమునకు గ్రామములే మూలకందములు. ప్రాచీన కాలమున గ్రామ పరిపాలనయొక్క సౌష్ఠవము వలననే-ఎన్ని యిక్కట్టులు సంభవించినను దేశశాంతి కెంతమాత్రమును భంగము గలుగకుండెను. సకల సంపదల కాలవాలమైన గ్రామములను వదలి జనులు పట్టణముల కెగబ్రాకుట పరిపాటియై పోయినది. గ్రామములను తిరిగి తమతొల్లింటి ఔన్నత్యస్థితికి కొంపోవ జాలినవి గ్రంథాలయములే యను సంగతిని మరువక, ఆపమార్గసిద్ధికై కృషిసల్పుడు.

## మరువబోకుడు

1. గ్రంథాలయము గ్రామస్థులందరికిని జెందినదై యున్నది. అందుచేత చదువరు లందరికిని కావలసిన గ్రంథముల నేర్చుకొనవలయునేగాని, ఒకరిద్దరియొక్క ఉపయోగమునకు మాత్రము పనికి వచ్చునవి మాత్రముగాదు. పాఠకులకు ఉల్లాసమును వినోదమును కలుగజేయు గ్రంథములు ముఖ్యముగా సేకరించ వలయును.

2. కార్యనిర్వాహకసంఘమువారు అందరును కలిసి గ్రంథాలయమునెడల శ్రద్ధవహించుట అత్యంతావశ్యకము. అట్లుగాక ఒక్క మనిషిమాత్రమే గ్రంథాలయ పాలనమందు శ్రద్ధవహించుచున్న యెడల ఆతడు ఏకారణముచేతనైనను ఆ గ్రామము వదలివెళ్ళునెడల, ఆ గ్రంథాలయముగూడ క్షీణించును. అందుచేత ఏ గ్రంథాలయమైనను ఒక్క మనిషిమీద ఆధారపడి యుండరాదు.

3. గ్రంథాలయముకొఱకై ఎప్పుడును ద్రవ్యమును అప్పు చేయరాదు.

4. కార్యనిర్వాహకసభలుగాని, సాంవత్సరిక సమావేశములు గాని జరిగినప్పుడు ఆ సభలలో గ్రంథాలయమునకు సంబంధించని ఇతర విషయముల ప్రసంగములతో కాలవ్యయము చేయరాదు.

5. గ్రంథాలయ వ్యవహారములయందు 'ముందకొడిగ' నుండుట ఎంతమాత్రము పనికిరాదు.

6. గ్రామ గ్రంథాలయములు వేగముగా పుట్టుచుండుటయు గిట్టుచుండుటయు పరిపాటియైపోయినది. గ్రామములో ఎక్కువమంది గ్రంథాలయ వ్యవహారములందు జోక్యము పుచ్చుకొనునటుల చేసిన యెడల ఆ గ్రంథాలయము త్వరలో గిట్టదు. గ్రామస్థులు ఎంత ఎక్కువ మంది శ్రద్ధవహింతురో అంత ఎక్కువకాల మది జీవించియుండును. గ్రామములోని కక్షలను గ్రంథాలయ పరిపాలనయందు చొరనియ్య రాదు. గ్రంథాలయ పరిపాలకులు గ్రామ కక్షలయం దెంతమాత్రము జోక్యమును కలుగజేసికొనరాదు.

తాలూకా గ్రంథాలయసంఘము:- మీ తాలూకాయందు ఇపుడున్న గ్రంథాలయముల పనిని సమీకరణము జేయుటకును, ఇంకను చేయవలసిన కార్యములను నిర్వహించుటకుగాను, తాలూకా గ్రంథాలయ సంఘము నొకదానిని స్థాపింపవలయును. వీరు నిర్వ హింపవలసిన పనులలో కొన్నిటి నిట వివరింతును.

కేంద్రగ్రంథాలయము :- తాలూకాలోనున్న ప్రతి గ్రంథా లయము అన్ని గ్రంథములను కొనజాలదు. అదియుగాక పరిశోధక (Reference) గ్రంథములను కొనుటగూడ అనవసరము. తాలూకా కంతకును కేంద్రగ్రంథాలయము నొకదానిని స్థాపించి ముఖ్యముగా పరిశోధక గ్రంథములను, ఇతర భాషా గ్రంథములను అక్కడ సేక రించిపెట్టినయెడల, గ్రామగ్రంథాలయము లన్నింటికిని అవసరమైనపు డెల్ల వానిని పంపుచుండవచ్చును. మాజిక్కులాంతరునుగాని చిన్న బయోస్కోపునుగాని సంపాదించి వివిధ గ్రామములకు బంపి ఉద్బో ధన చేయవచ్చును. నూతన గ్రంథాలయస్థాపనకును ఇపుడున్న వాని

యందు ఉత్తేజమును కలుగజేయుటకును ఇవి మిక్కిలి ఉపయోగకరములు. మరియు గ్రంథాలయోద్యమ వ్యాప్తికి కరపత్రములు మొదలగు వానిని ప్రకటించుట — నూతన గ్రంథములను తాలూకా మొత్తమునిమీద గ్రంథాలయము లన్నింటికిని గలిపి తెప్పించుట- ఇత్యాది ఉమ్మడి కార్యక్రమములవలన సొమ్ము కలిసివచ్చును.

సంచారగ్రంథాలయ పేటికలు:-షుమారు 15 గాని 20 గాని గ్రంథములను ఒక చిన్న పెట్టెయందు పెట్టి గ్రంథాలయములేని గ్రామమునకు పంపినయెడల, ఆ గ్రామస్థులు ఆ గ్రంథములను చదువుకొని, దానిని తిరిగి పంపివేసి, క్రొత్తపెట్టెను తెప్పించుకొందురు. గ్రంథాలయములున్న గ్రామములు కూడ తమయొద్దలేని గ్రంథములను కేంద్రగ్రంథాలయమునుండి వీనిద్వారా తెప్పించుకొందురు. గ్రంథములయం దభిరుచిని గల్గించుటకు ఇవి మిక్కిలి ఉపయుక్తములై యున్నవి.

ఉపన్యాసకులు, ప్రదర్శనములు:- గ్రామస్థుల కత్యంతావసరమగు విషయములనుగూర్చి ఆయావిషయములం దారితేరిన వేత్తలను రావించి కేంద్రగ్రంథాలయమువారు ఉపన్యాస సంచారములను, ప్రదర్శనములను ఏర్పరుపవచ్చును.

ముగింపు

సేవావ్రతులగు నా సోదరులారా!

నా కొద్ది అనుభవమునుబట్టి నాకు తోచిన సంగతులను మనవిజేసితిని. రాబోవు వత్సరమున చేయదగు కార్య ప్రణాళికను ఈ సభయం దాలోచించి నిర్ణయింతురని కోరుచు విరమించుచున్నాను.

సీ॥ అఖల కాలములఁ బ్రఖ్యాతిగన్న మహాత్మ
మంజు లాలాప సంపద యనంగ
సర్వదేశములఁ బ్రశస్తి జాటిన ధీర
శేముషీ విభవ విశేష మనఁగ
కర్ణేంద్రియ ప్రీతిఁగావించు కవిరాజ
సత్కార్య కల్పనాసార మనఁగ

షట్ఛాత్ర నిర్మాణచయమైన పండిత
పరిజ్ఞాతిశయ విజృంభణమనంగ
గీ॥ రాశిఁ జేసిన జ్ఞాన సర్వస్వమనఁగ
ధర్మపుస్తక నిలయంబుతన రుచుండు
నుచిత గతి దాని నెవ డుపయోగపరచు
నతఁడె వెలలేక విజ్ఞానమందువాడు॥
ఉ॥ దీని నిజంబెఱింగి మన దేశమునంగల పట్టణంబులన్
జానపదంబులన్ సులభసాధ్యములై తగ గ్రంథమందిరాల్
మానుగ నిల్పి సర్వజనమండలి విద్యల నేర్వఁకున్న స
న్మాన మొనర్తురే మనలనాగరికాగ్రిణులంచు నన్యులున్

12-3-1933 తేదీన ఉండి గ్రామమున శ్రీ అయ్యంకి వారొసగిన ప్రథమ భీమవరం తాలూకా గ్రంథాలయ మహాసభాధ్యక్షోపన్యాసము.

---

# విజ్ఞానవ్యాప్తికి గ్రంథాలయములే సాధనములు

## గుంటూరు మండలము

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునందు గుంటూరు మండలము అనాదినుండియు అగ్రస్థానము వహించియున్నదని చెప్పుటకు మిక్కిలి సంతసముగ నున్నది. గ్రంథాలయములుగాని, పఠనమందిరములుగాని బొత్తిగా వ్యాప్తిలోలేని 1890 వ సంవత్సరమునందే మీ మండలాంతర్గతమగు ఒంగోలునందు సి. వి. యస్. గ్రంథాలయమును స్థాపించిరి. పిమ్మట 1899 వ సంవత్సరమున కొల్లూరు గ్రామమున పఠనమందిరమును స్థాపించిరి. తరువాత 1900 సంవత్సరమున గుంటూరు పురమున యువకులు "సాహితీసంఘము"ను స్థాపించి చేసినసేవ అపారము. అప్పటినుండియు దినదినాభివృద్ధిని గాంచుచు గ్రంథాలయోద్యమమందు మీ మండలము అగ్రస్థానము వహించియున్నది.

## గ్రంథాలయ సంఘములు

మీ మండలమందు 1914 వ సంవత్సరమున 25 గ్రంథాలయములుండగ నేడు (1934) చక్కగా పనిచేయుచున్న గ్రంథాలయములు 205 గలవు. మీ మండలమందు, మండల గ్రంథాలయసంఘమేర్పడి చక్కగా పనిచేయుచుండుటయే గాక, రేపల్లె, తెనాలి, గుంటూరు, బాపట్ల, సత్తెనపల్లె, తాలూకాలకు గూడ తాలూకా సంఘము లేర్పడి చక్కగా పనిచేయుచున్నవి.

## గ్రామములు

అయితే మీ మండలమందు 936 గ్రామము లున్నవి. అందు రమారమి పందొమ్మిది లక్షల జానపదులున్నారు. ఈ గ్రామములను జనాభానుబట్టి ఈ క్రిందివిధముగ వర్గీకరణము చేయవచ్చును.

500 కంటె తక్కువ జనాభా గలిగినవి 105.

500 కంటె ఎక్కువ 1000 కంటె తక్కువగలవి 157.

1000 కంటె ఎక్కువ 2000 కంటె తక్కువగలవి 302

2000 కంటె ఎక్కువ 5000 కంటె తక్కువగలవి 336.

5000 కంటె ఎక్కువ 10000 కంటె తక్కువగలవి 36.

ఇవిగాక పది వేలకంటె ఎక్కువ జనాభా గలిగిన పట్టణములు 10 గలవు.

## గ్రామమునకొక గ్రంథాలయము

936 గ్రామములలో 1000 కంటె తక్కువ జనాభా గలిగిన 262 గ్రామములు తగ్గించిన, మిగిలిన 674 గ్రామములోనైన గ్రంథాలయములుగాని అధమము పఠనమందిరములుగాని ఉండుట అత్యంతావశ్యకమను సంగతి మీకు నేను చెప్పనక్కరలేదు. ఈ గ్రామములన్నింటియందును గ్రంథాలయములను వెంటనే స్థాపించుట కష్టసాధ్యమైనను ఒక కార్యక్రమము నేర్పరుచుకొని, తీవ్రమైన యత్నము జేసినయెడల, 2000 కంటె యెక్కువయు 10000 కంటె తక్కువయు జనాభా గలిగిన 372 గ్రామములందైన గ్రంథాలయములను వెంటనే స్థాపించుట కష్టసాధ్యముగాదు. ఈ కార్యమునకు ఒక్కొక్క గ్రామ

గ్రంథాలయమునకు రు 150 లు చొప్పునఇప్పుడున్న 205 గ్రంథాలయములుపోను మిగిలిన 167 గ్రామములందును గ్రంథాలయములను స్థాపించుటకు గావలసిన సొమ్మును సేకరింపవలయును. మొత్తముగా జూచిన ఇది పెద్దదిగా గన్పట్టినను నాయకులు తలపెట్టిన యెడల ఒక్కొక్క గ్రామమునందు రు 150 లు వసూలుజేసి గ్రంథాలయమును స్థాపించుట మిక్కిలి సుకరము.

## వస్తురూప దానము

ఇక దాని పోషణకన్ననో గ్రామమునందలి కుమ్మరికి-చాకలికి మంగలికి-దేవునకు- కుప్పకట్టలనిచ్చు జానపదులు సరస్వతీదేవిని పస్తుపరుండ నివ్వరని రూఢిగ జెప్పవచ్చును. అయితే పల్లెటూళ్ళయందు బస్తీలోవలె చందాలను ద్రవ్యరూపమునగాక, ఎవరి కేయే పంటపండిన - ఆ వస్తురూపమున గ్రంథాలయభిక్షమును సంపాదింపవలయును. పొలములులేని వారియొద్దనుండి కూలి రూపముననే చందాను గ్రహింపవలయును. గ్రంథాలయమునకు భవనములు కట్టుట మొదలగు పనులు చేయుట, మరమ్మతులు చేయుట ఉత్సవములకు పందిళ్లు పాకలువేయుట- మొదలగు పనులరూపమున వారియొద్దనుండి చందాలను గ్రహింపనగును.

## సంచార గ్రంథాలయ పేటికలు

1000 కంటె ఎక్కువయు, 2000 కంటె తక్కువయు జనాభాగలిగిన మిగిలిన గ్రామములకెల్ల సంచారగ్రంథాలయ పేటికలనుగాని, సంచార గ్రంథాలయ శకటములుగాని ఏర్పాటుచేసి పుస్తకము లందుబాటు చేయవలయును.

## యువకుల స్వయంసహాయము

ఇంతవరకు చేసినపనికి ప్రభుత్వ సహాయముగాని, జమీందారుల సహాయముగాని విశేషముగా లేనప్పటికిని సేవానిరతులగు యువకుల స్వయంసహాయమువలనను త్యాగమువలననే ఈ యుద్యమమింతవరకైన అభివృద్ధి జెందుటకు అవకాశము కలిగినది. పదునైదు సంవత్సరములకు బూర్వము ప్రభుత్వమువారు గ్రంథాలయములకు

విరాళములిచ్చుట లేదుగదా, స్థానికసంస్థలు విరాళముల నిచ్చు చున్నను గూడ వానిని రద్దుజేయుచుండిరి. అట్టి స్థితియందు మీ మండల వాస్తవ్యులగు శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు గారి పట్టుదల, కార్యదీక్షలవలన మద్రాసు శాసన నిర్మాణసభ యందు గ్రంథాలయములకు ప్రభుత్వమువారు సహాయము చేయ వలయునను తీర్మాన మామోదింపబడి, అప్పటినుండియు ఆ సహాయము — ఎంత స్వల్పమైనను లభించుచున్నది.

## సర్వులకు అందుబాటు

అయితే మనమేమో "ఉప్పులేక ముప్పందుము తాగినా"మని తలంపవద్దు. చేసినపని స్వల్పము. చేయవలసినపని హిమాలయ పర్వతమంత గలదు. అసలు గ్రంథాలయోద్యమముయొక్క స్వరూప స్వభావములెవ్వి? దానియొక్క ఉపయోగ మెవ్వరికి? సర్వజనులకు విజ్ఞానవ్యాప్తిని గలుగజేసి, వారి జీవయాత్ర పవిత్రవంతముగను పురుషార్థ సాధకముగను చేయుటయే ఈ యుద్యమముయొక్క పరమార్థము. ఇట్టి మహత్తరమైన ఆదర్శము గలిగియున్న గ్రంథాలయముయొక్క ఉపయోగమును జనులందరును పొందునటులు జూడ వలయును.

## విజ్ఞానవ్యాప్తి

దురదృష్ట వశమున మనదేశమందున్న జనసంఖ్యయందు నూటికి తొంబదికంటె ఎక్కువమంది నిరక్షరకుక్షులు. ఇట్టివారికి గ్రంథాలయము లేమిజేయును? గ్రంథములు చదువుకొనగలిగిన జనులకైనను వానిని అందిచ్చుటతోడనే గ్రంథాలయముల ధర్మము నిర్వర్తింపబడినదా? లేదు. గ్రంథములను చదువుకొనలేని వారికిగూడ విజ్ఞాన వ్యాప్తిని గలుగజేయుటయే గ్రంథాలయముల కర్తవ్యము.

## గ్రంథాలయముయొక్క ఉన్నతి

అందుచేతనే ఒక గ్రంథాలయముయొక్క గొప్పతనము అందుండు గ్రంథముల సంఖ్యనుబట్టిగాక, ఆ గ్రంథాలయమునందలి గ్రంథములను ఎంతమంది ఉపయోగించుచున్నారు? ఆ గ్రంథా

లయము ఎంతమందికి విజ్ఞానవ్యాప్తిని కలుగజేయుచున్నది? అను విషయములనుబట్టి నిర్ణయింపవలసి యుండును.

## చక్షుశ్శ్రోత్రేంద్రియములు

గ్రంథములను, పత్రికలనుచదువుట మూలముననే గాక, కంటితో చూచుటవలనను, చెవితో వినుటవలననుగూడ చదువురాని జనులకు జ్ఞానవ్యాప్తిని గావించవచ్చును. మనదేశమున ప్రాచీన కాలము నుండియు శ్రుత పాండిత్యముయొక్క మహత్తు బాగుగా వ్యాపించి యున్నది. ఆ కాలముననేగాక, పాశ్చాత్య నాగరికత వ్యాపించిన ఈ కాలమునగూడ, శ్రుతి మూలకముగ జ్ఞానమును వ్యాపింపజేయవలసిన ఆవశ్యకత ఆవంతయైన తగ్గలేదు. ఇట్టిస్థితి మిక్కిలి శోచనీయమేయైనను మనకు గత్యంతరములేదు. ఎందుచేతననగా, నూటికి తొంబదికంటె ఎక్కువమందికి జ్ఞానమును వ్యాపింపజేయుటకు మార్గమదియొక్కటే.

పల్లెటూరునందుండనీ, బస్తీయందుండనీ, కొండయందుండనీ, గుట్టయందుండనీ, అడవియందుండనీ బయలు ప్రదేశమందుండనీ— పురుషులైనను సరే స్త్రీలైననుసరే- పిల్లలైనను, పెద్దలైనను-మానవులందరికి ఎవరికి తగినట్లు వారికి విజ్ఞానము కలుగుటకు తగిన అవకాశముండవలయును.

## గ్రంథాలయ విధి

ఇట్టి మహత్తరమైన కార్యమును నిర్వహించుటెట్లు? ఈ కార్య నిర్వహణకు గ్రంథాలయము లేమిజేయవలయును? పత్రికలు—కరపత్రములు - చదువవలయుననెడి కుతూహలమును కలుగజేయవలయును. ఒక వ్యక్తియొక్క ఇంటియందుండు గ్రంథాలయముగాని, ఒక పాఠశాలయందుండు గ్రంథాలయముగాని అందుండు పిల్లలకును, పెద్దలకును, చదువవలయుననెడి ప్రేరేపణను కలిగించునప్పటికిని, వారియొక్క తృషను సంతృప్తి పరుపజాలదు. అందుచేత గ్రామమందుగాని, పట్టణమందుగాని ఉన్న సార్వజనిక గ్రంథాలయమునందలి గ్రంథసముదాయము పాఠకునకు గావలసిన గ్రంథముల నొసంగగలదు.

## మొదలు తుదిలేని పాఠశాల

చదువవలయుననెడి అత్యాశ గలవారికి గ్రంథాలయము ఎడతెరిపిలేని, మొదతుదిలేని, పాఠశాల; గ్రంథాలయము పాఠకునకు దినదినము నూతన దృష్టుల నొసంగుచుండును. చదువుకొనలేని జనులకీ యుపయోగము లన్నియు చదివి వినిపించుటవలన గలుగును.

## పాశ్చాత్య దేశములు

పాశ్చాత్యదేశములందు పెద్దపట్టణములందెల్ల గ్రంథాలయము లున్నవి; పట్టణమునందున్న జనులందరి యొద్దనుండి గ్రంథాలయ నిర్వాహణమునకు పన్ను వసూలుచేయబడును. దరహామమీద ఒక్క మనిషికి ఒక్క గ్రంథమును కొనుటకు అగుఖర్చుకంటె తక్కువపన్నే వసూలుచేయుదురు. అంత స్వల్పమగు పన్నుల్ను వసూలుచేసినప్పటికిని, అట్లు వసూలగు సొమ్మంతయు చేర్చి గ్రంథములను కొనుచుండుటవలన, ఆ పట్టణవాసులకు గావలసిన వివిధ రకముల గ్రంథ సముదాయమంతయు చేకూరుచుండును. ఇంకను ఏవైన కోరవడిన గ్రంథములు అవసరమైనపుడు ప్రభుత్వమువారిచే నిర్వహింపబడుచుండు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునుండి తెప్పించుకొనుచుందురు.

## జిల్లా గ్రంథాలయ సహకారము

ఇక పల్లెటూళ్ళయం దక్కడక్కడ గ్రంథాలయములు గలవు. ఒక జిల్లా కంతకును జిల్లా కేంద్రగ్రంథాలయ ముండును. దానికి జిల్లాయందున్న జనులందరి యొద్దనుండి పన్ను వసూలుచేయబడును. జిల్లాయందు ఏ మారుమూలనున్న జనులకైనను చదువుకొనుటకై కావలసిన గ్రంథసంచయ మంతయు ఆ జిల్లా గ్రంథాలయమునుండియే పంపబడును. ముఖ్యమగు స్థలములయందెల్ల శాఖాగ్రంథాలయము లనుగూడ ఏర్పరచెదరు. ఆ శాఖలయందు 50 కి తక్కువకాని గ్రంథముల నుంచెదరు. వారమున కొకసారి జిల్లా గ్రంథాలయము నుండి క్రొత్త గ్రంథములు శాఖాగ్రంథాలయమునకు వచ్చుచుండును. జిల్లాయందున్న పాఠశాలలుకూడ వేరేతమ స్వంత గ్రంథాలయము

నేర్పరచుకొనక, జిల్లా గ్రంథాలయమునకే శాఖలుగచేరి, తాము గ్రంథములకై వినియోగించు సొమ్మును వారికే యిచ్చెదరు. వారు పాఠశాలలలోని బాలురు చదువుకొనుటకు కావలసిన గ్రంథములను పాఠశాలకు కావలసిన దేశపటములు మున్నగు సామగ్రినికూడ సప్లయి చేసెదరు, చౌకబారు పుస్తకములను మాత్రమేగాక యెక్కువ ఖరీదు గలిగియుండు పుస్తకములను గూడ చదువరులకు అందజేయుదురు.

## సంచార గ్రంథాలయ శకటములు

శాఖా గ్రంథాలయములుగాక సంచార గ్రంథాలయ శకటములు (మోటారుబండ్లు) కూడగలవు. ఆ బండినిండ కొన్నివేల గ్రంథములను వేసికొని శాఖాగ్రంథాలయములున్న గ్రామములకేగాక అవిలేనిగ్రామములకును,మారుమూల ప్రదేశములందుండు ఒంటరి ఇండ్లకు కూడ గ్రంథభాండాగారి గ్రంథములను గొనిపోయి పెద్దలకు గావలసిన గ్రంథములను పెద్దలకును — స్త్రీలకు గావలసిన గ్రంథములు స్త్రీలకును - బాలురకు గావలసిన గ్రంథములు బాలురకును- యువకులకు కావలసిన గ్రంథములు యువకులకును- ఈ రీతిగా ఏ వయస్సువారికి అనుగుణ్యములగు గ్రంథములు ఆ వయసు వారికి, ఏ వృత్తియందుండు వారికి ఆ వృత్తియందు సహాయభూతములగు గ్రంథములను సరఫరా చేయుచుండును. బండ్లుపోవుటకు దారులు లేని అడవి ప్రదేశములందుండు జనులకు — కొండలయందుండు జనులకు — గ్రంథము లందజేయుటకు గ్రంథభాండాగారి గుర్రములనెక్కి బోవును.

## పోస్టుద్వారా గ్రంథములు

ఈ పద్ధతినిగాక, పోష్టుద్వారా కూడ గ్రంథములను తెప్పించుకొనవచ్చును. ఒక ఉత్తరమును జిల్లా గ్రంథాలయాధికారికి వ్రాసిన ఝాలును; తనకు కావలసిన నిర్దిష్టగ్రంథముగాని, లేక తనకు కావలసిన విషయములనుగూర్చిన కొన్ని గ్రంథముల సముదాయముగాని వెంటనేవచ్చి చేరును. ఆ పుస్తకములను కొన్ని వారములుగాని లేక ఒకనెల దినములుగాని ఉంచుకొని తిరిగి పంపివేయవచ్చును.

సామాన్యోపయోగమునకు పనికివచ్చు గ్రంథములనేగాక, విశేషోప యోగమునకు పనికివచ్చు ఎక్కువ విలువగల గ్రంథములనుగూడ పంపుచుండెదరు.

గ్రామగ్రంథాలయము లేవియైన, తమయొద్దలేని గ్రంథము లను జిల్లా గ్రంథాలయమునుండి తెప్పించి చదువరుల కియ్యవచ్చును. జిల్లా గ్రంథాలయములు తమయొద్దలేని గ్రంథములను యితర జిల్లా గ్రంథాలయమునుండిగాని లేక రాష్ట్రగ్రంథాలయమునుండి గాని తెప్పించి గ్రామగ్రంథాలయమునకు పంపెదరు.

## ప్రత్యేక ప్రయోజనములు

పల్లెటూరు రైతులు తమకు వ్యవసాయాభివృద్ధికి ఆవశ్యకము లగు వివిధరకములయిన పంటలు, పైరులు, తోటలు, మున్నగు వానిని గూర్చి అనుభవజ్ఞులగు గ్రంథకర్తలు వ్రాసిన గ్రంథములను తెప్పించుకొందురు. వివిధపరిశ్రమలను జేయువారు తమ పరిశ్రమాభి వృద్ధులకు ఆవశ్యకములగు గ్రంథములను తెప్పించుకొందురు. స్త్రీలు చొక్కాలు, గౌనులు, మున్నగువానిని తయారుచేయుటకు కావల సిన కుట్టుపనిని గూర్చిన గ్రంథములు, గృహనిర్వాహణమును గూర్చిన గ్రంథములు, పిల్లల పెంపకమునుగూర్చిన గ్రంథములు, ఇంటియొక్క అలంకారమును గూర్చిన గ్రంథములు, పూలమొక్క లను పెంచుటనుగూర్చిన గ్రంథములు, తమపిల్లలు చదువుకొనుటకు, చూచి ఆనందించుటకు బొమ్మల పుస్తకములు–గుడ్డలమీదనే అచ్చు వేసిన చిరుపొత్తములు, ఈ రీతిగా తమకు కావలసిన గ్రంథములను తెప్పించుకొనుచుందురు.

మరియు వయోజన విద్యకు కావలసిన గ్రంథములు, మానవుని నిత్యజీవితమునకును సాంఘిక పరిణామమునకు గావలసిన సకల గ్రంథములను, అనుభవపూర్వకమైన శాస్త్రగ్రంథములు, చారిత్రిక గ్రంథములు–జీవితచరిత్రలు–అవియు ఇవియు అననేల– సకలగ్రంథము లను జ్ఞానపిపాసులగు చదువరులకు తలచినంతనే ప్రత్యక్షము చేయు టకు ఆ జిల్లా గ్రంథాలయములు కంకణము గట్టుకొన్నవి.

## గ్రంథపఠనము - కావలసినదెల్ల చూపును.

సద్గ్రంథము లున్న యెడల రైళ్ళప్రయాణము- ఆయాసము లేకుండగనే అనేకవేల మైళ్ళదూర ప్రయాణము — జేయవచ్చును; లేదా కృష్ణదేవరాయల కాలమునాడు ఆ తుంగభద్రానదీ స్రవంతుల నున్న విజయనగర సామ్రాజ్యవైభవమును కన్నులారగాంచవచ్చును. లేదా రాజరాజ నరేంద్రుని ఆస్థానమున నన్నయభట్టు భారతమహా గ్రంథమును చదివి వినిపించు నాటి వైభవము ననుభవించవచ్చును సద్గ్రంథతతియున్నచో కాలము లేదు; దూరము లేదు. మనకు కరతలా మలకముగాని విజ్ఞానము లేదు. స్నేహితులలోని కెల్ల అత్యుత్తమము లగు స్నేహితులు గ్రంథములు, అవి అడిగినపుడు కావలసినదాని నెల్ల ఇచ్చుచుండుటయే కాని మనయొద్దనుండి ఏవంతయైన ప్రతిఫలము నపేక్షింపవు.

## గ్రంథభాండాగారి జనులకు తలలోని నాలుక

అట్టి సద్గ్రంథ సముదాయము జనులకు పరిచితమగుటకు గ్రంథ భాండాగారి యొక్క సామర్థ్యమే మూలకందము. గ్రంథభాండాగారికి జిల్లా గ్రంథాలయమందలి గ్రంథముల పరిచయమేగాక, జిల్లాయొక్క చరిత్ర-భౌగోళికవిజ్ఞానము లేగాక జిల్లాయందున్న జనులందరియొక్క పరిజ్ఞానముకూడ అత్యావశ్యకము. ఆమె (పాశ్చాత్య దేశములలో గ్రంథ భాండాగారులు ఎక్కువగా స్త్రీలే) అనగా గ్రంథభాండాగారిణి- జిల్లా అంతటను ముందుగా సంచారము చేసి జనులయొక్క వృత్తులు-పరిశ్రమలు - పండించు పంటలు— స్థితిగతులు మొదలగు సకలవిషయము లను గురించిన వివరములను సేకరించును. ఉపాధ్యాయులతోడను, పల్లెటూళ్ళయందుండు పెత్తనదారులతోడ మాట్లాడును. వేయేల? జిల్లాయందలి జనులకెల్ల తలలోని నాలుకవలె మెలంగు చుండి వారలకు సేవకురాలై వారికి ఉపయోగకరమైనట్టియు, వారల నాకర్షించునట్టియు, గ్రంథములను సంపాదించి అందజేయుచుండును. వారలకు తోడ్పడుటకు క్రొత్తమార్గముల నెల్లపుడును అన్వేషించు చుండును. జనుల ఆరోగ్యమెట్లు బాగుపడునా యని యోచించును;

రైతు తక్కువ ఖర్చుతో యెక్కువ పంట పండించుట యెట్లోయని యోచించును; పండినపంటకు తగిన ఖరీదు ఎట్లు వచ్చునోయని యోచించును. ఈ రీతిగా జనుల ఆర్థిక సాంఘిక నైతికాభివృద్ధియగుటకు కావలసిన విజ్ఞానమును వెదజల్లుటయం దెల్లపుడు అప్రమత్తు రాలై యుండును.

కాని వానిని మన దేశపరిస్థితులతో పోల్చి జూచికొని మనము "లొట్టలు" వేయునలసినదే; అట్టి మహోన్నతస్థితికి మన మెన్నడైన బోవుటకు నోచుకొన్నామా?

## మాతృభాషలో గ్రంథలోపము

మన దేశభాషలలో ముఖ్యముగా ఆంధ్రభాషయందు జనులందరికి గావలసిన వివిధ విషయములను గూర్చిన గ్రంథములు బొత్తిగా లేవు. గ్రంథాలయము యొక్క యుపయోగమును జనులందరికిని వ్యాపింపజేయుటకు ముఖ్యముగా రెండు ఆటంకములు కలవు. ఒకటి అన్ని విషయము లందును ఉపయుక్తములగు గ్రంథములు మాతృభాషలో లేకపోవుట; రెండవది జనులలో నూటికి తొంబదికంటే ఎక్కువమంది చదువుకొన జాలకుండుట -

## నిస్పృహ జెందవలసినపని లేదు.

నిస్పృహ చెందవలసిన పనిలేదు. 1914 సంవత్సరమున ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభను స్థాపించినప్పుడు "గ్రంథాలయముల కొక సభయా?" "పుస్తకములు చదువుకొనుటకుగూడ ఒక సభ కావలెనా?" అని చాలమంది విద్యాధికులే హేళన జేసిరి. 1914 సంవత్సరమున నున్న 60 గ్రంథాలయములు- తాత్కాలికముగ పుట్టిపోయినట్టివియు కేవల పఠనమందిరములును గాక-స్థిరమైన గ్రంథాలయములు నేటికి (1934) 600సంఖ్యకు పెరిగినవి. ఈ అభివృద్ధి స్వల్పమేమైనను ప్రభుత్వము యొక్క సహాయముగాని, జమీందారుల యొక్క సహాయముగాని విశేషముగా లేనప్పటికిని పూర్తిగా సామాన్యజనులయొక్క స్వయంశక్తిమీదనే ఈ యభివృద్ధి యంతయు గలిగినదని గుర్తించిన యెడల ఇది ఘనకార్యము గాకపోదు.

## పౌర గ్రంథాలయ చట్టము

ఇటీవల మద్రాసు చట్టనిర్మాణ సభయందు గ్రంథాలయచట్ట మొకటి ప్రవేశపెట్టబడినది. ఆ చట్టము ఉపసంఘమువారికి పంపబడి ఉపసంఘమువారి నివేదికగూడ బయలుపడినది. ఈ ఉపసంఘమువారు చట్టమునందు స్వల్పమగు మార్పులను సూచించినప్పటికిని, చట్టము నందలి అనర్థదాయకములగు లోపములలో ఆవంతయైన మార్పును చేయకపోవుట మిక్కిలి శోచనీయము.

తాటికాయ ఎప్పుడు పడినను మూలిగేనక్కమీదనే పడునని సామెతగలదు. ఆ రీతిగనే ఈ చట్టమువలన పన్నులభారముచే కుంగి కూలిపోవుటకు సిద్ధముగానున్న రైతుమీదనే గ్రంథాలయపు పన్నొకటి వచ్చి క్రొత్తగా పడగలదు. మన రాజధానియందు పట్నవాసములందైనను పన్నులభారముచే జనులు యిదివరకే పీకెవరకు మునిగి పోయియున్నారు. రైతులపన్నును తగ్గించవలెనని చట్టనిర్మాణసభ యందు ఇటీవలనేగదా తీర్మానింపబడినది! ఒకవైపున పన్నులు తగ్గించు ప్రయత్నమా! వేరొక వైపున క్రొత్తపన్నులను వేయుటయా? ఎంత ఆశ్చర్యకరము !!

ప్రభుత్వమువారును స్థానిక స్వపరిపాలనా సంస్థలును గ్రంథాలయములకు సహాయముచేయవచ్చునను నిబంధన ఈ చట్టమునం దున్నప్పటికి సహాయముచేసి తీరవలెనను నిర్బంధములేదు. అట్టి నిర్బంధము లేనంతవరకు ఈ చట్టమువలన దేశస్థితి ఎక్కువ బాగు పడునను ఆశలేదు. ఉచిత నిర్బంధవిద్యను వ్యాపింపజేయవలెనన్న ఈ రోజులలో జనసామాన్యమందు జ్ఞానాభివృద్ధిని కలుగజేయుట కేర్పడిన గ్రంథాలయముల కొరకు క్రొత్తపన్నును వేయబూనుట కంటె శోచనీయమైన స్థితి వేరొకటిలేదు. బస్తీలలో పెద్దజీతములు తెచ్చుకొనుచు పెద్ద ఆదాయలను సంపాదించుకొనుచుండుమహనీయులకు పల్లెటూరురైతు కష్టమెట్లు తెలియగలదు? మరియు దేశజనులలో నూటికి తొంబదికంటె ఎక్కువమంది చదువుకొనజాలనివా రున్నంతవరకు ఈ గ్రంథాలయ చట్టమువలన రైతుకు ఎక్కువలాభము కలుగునని తలం

చుటకు వీలులేదు. ఈ చట్టముయొక్క ముఖ్యమైన అభిప్రాయము "అజ్ఞానమును పోగొట్టుట" అని సూచించబడినది. అట్టి చదువురాని జనులకు అజ్ఞానమును పోగొట్టుటకు ఈ చట్టముక్రింద అవలంబింపబడు కొన్ని పద్ధతులను చట్టమునందు సూచించియుండిన బాగుగ నుండెడిది.

ఉపసంఘమువారు తయారుచేసిన నివేదికలో "రాష్ట్రగ్రంథాలయ పరిమితియందు" మద్రాసు విశ్వవిద్యాలయమువారి గ్రంథ భాండాగారిని కూడ ఒక సభ్యునుగా చేర్చిరి. కాని "అన్నామలే విశ్వవిద్యాలయము" "ఆంధ్ర విశ్వవిద్యాలయము"ల యొక్క గ్రంథ భాండాగారులను ఏల చేర్చలేదో ఊహింప శక్యముగాకున్నది. మరియు అడిగినప్పుడు సలహా నిచ్చుటకై భాషాసంఘముల నేర్పరచిరి. ఈ సంఘములు భాషలకుగాక ఆయా భాషల ప్రాతిపదికమీద పరిపాలింపబడు భాషా ప్రయుక్తభాగములకై కొన్ని స్వతంత్రాధికారములతో ఏర్పరచిన యుక్తముగ నుండెడిది.

## అడుగులోనే హంసపాదు

మరియు ఈ చట్టమునుగూర్చి ప్రచారము చేయుచు - చట్ట నిర్మాతలు కొంతమంది పన్నులేనిదే గ్రంథాలయము లెట్లు అభివృద్ధి చెందుననియు, చట్టము ఇపుడు లోపములతోకూడి యున్నను క్రమముగా అభివృద్ధి చెందగలదనియు,ఒక్కసారిగా ఆదర్శకరమైన చట్టము ఎట్లు వచ్చుననియు, మిట్టవేదాంతములను బలుకుచున్నారు. మాట్లాడితే విదేశముల అనుభవములను చెప్పెదరు. అడుగులోనే హంసపాదనునట్లు, ప్రయత్నమునకు ఆదియందే "మాకు యింతేచాలునన్న" తత్వము నాకు నచ్చదు. బాధాకరమైనదానిని త్వరపడి తెచ్చుకొనుటకన్న,అలస్యముగానైన మంచిదానిని సంపాదించుట క్షేమకరము.

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభాధ్యక్షులుగ శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు సూచించినటుల మొత్తముమీద ఈ చట్టమునుగూర్చి యోచించిన దీనివలన గలుగు లాభముకన్న నష్టములును, ఉత్తనష్టములేగాక అనర్థములును ఎక్కువగా నున్నవి. ఈ చట్టము

చట్టనిర్మాణ సభయెదుటకు వచ్చినపుడు శాసననిర్మాతలు ఈ లోపములన్నింటిని సవరించెదరని నమ్ముచున్నాను.

18-2-1934 వ తేదీన తెనాలి తాలూకా పెదపాలెమునందు జరిగిన 9-వ గుంటూరు జిల్లా గ్రంథాలయ మహాసభాధ్యక్ష పీఠమునుండి శ్రీ అయ్యంకి వారొసగిన ఉపన్యాస సంగ్రహము - ఆంధ్రపత్రికనుండి గ్రహింపబడినది.

---

# గ్రంథాలయముల ధ్యేయము-వాని యభివృద్ధికి సూచనలు

## గ్రంథాలయ ధ్యేయము

గ్రంథాలయము గ్రామ విశ్వవిద్యాలయముగాన- గ్రామీణులకు వారికి సంబంధించిన అన్ని విషయములలోను విజ్ఞానము నందజేసి, వారి జీవితములను ఉన్నతస్థాయికి తీసికొనిపోవుటయు, ఉత్తమ సంస్కారము నలవడజేయుటయు, గ్రంథాలయముల - ముఖ్యముగా గ్రామ గ్రంథాలయముల ధ్యేయమై యున్నది.

## గ్రంథభాండాగారి బాధ్యత

చదువరుల నాకర్షించి వారి కోర్కెలకు అనుగుణ్యమైన గ్రంథములను వారికి సులభముగా అందించి, క్రమేణ వారి పఠనాభిలాషను దినదినాభివృద్ధి గావించి, వారి స్థాయిని పెంపొందించుట గ్రంథభాండాగారి ప్రధానకర్తవ్యము.

## పాఠకులను ఆకర్షించుటకు గ్రంథభాండాగారి ఆచరించవలసిన విధులు

1. గ్రంథభాండాగారి తా నుత్సాహవంతుడై, ఇతరుల నుత్సాహపరచుచు నుండవలెను. 2. ఇతరులయెడ సహనముతో మెలగవలెను. 3. గ్రామమునందును సంఘ కార్యకలాపములలోను, గ్రంథాలయాధికారి ఉచితపాత్ర నిర్వహించవలెను. 4. పుస్తకముల

కోరకు పాఠకులు వచ్చినప్పుడు పుస్తకము లిచ్చుటకు వాయిదా వేయ రాదు. 5. పాఠకుడు కోరిన గ్రంధము లేనియెడల ఆ గ్రంథ విష యమునకు సన్నిహితమైన మరియొక గ్రంథమును సూచించవలెను. 6. పాఠకులకు కావలసినగ్రంథములు లేనియెడల సమీపగ్రంథాలయము నుండియు, కేంద్ర గ్రంధాలయము నుండియు తెప్పించి ఇవ్వవలెను. గ్రామస్థులతో — ముఖ్యముగా — పాఠకులయెడ గ్రంథభాండాగారి ఆదరాభిమానములతో మెలగవలెను.

7. తనకంటె వయస్సులో పెద్దలైనవారియెడల— వారు నిరక్షరాస్యులైనను — వినయముగా మెలగవలెను. చిన్నలయెడ ప్రేమ, ఆదరములను ప్రదర్శించవలెను.

8. చదువరులలోగల బిడియమును పోగొట్టి వారిలో ఉత్సాహము కలుగునట్లు ప్రవర్తించవలెను.

9. చదువరుల అభిరుచులను, కోర్కెలను గ్రహించుచు క్రమముగా వారి మనస్తత్వమును గ్రంథభాండాగారి అర్థము చేసి కొనుటకు ప్రయత్నించవలెను. వారి అభిరుచులకు అనుగుణ్యమైన పుస్తకములను అందించుచు, క్రమేణా వారి అభిరుచిని ఉన్నత స్థాయికి తీసికొనిపోవలెను.

10. చదువరి ప్రశాంతముగా చదువుకొనుటకు గ్రంథాలయములో తగు ఏర్పాట్లు చేయవలెను.

11. పాఠకుల దృష్టి నాకర్షించు పటములు, చార్టులు, ప్రదర్శనములు ఏర్పాటు చేయవలెను.

12. నిర్ణీత సమయములందు రేడియోలద్వారా వార్తలను ఇతర ముఖ్యవిషయములను వినిపించునట్లు చేయవలెను. ప్రతి గ్రంథాలయములోను ఆ గ్రామము, జిల్లా, రాష్ట్రము, దేశములకు సంబంధించిన పటము లుంచవలెను. ప్రతి గ్రంథాలయములోను ముఖ్యమైన దేశనాయకుల పటములనుగూడ నుంచవలెను.

## సలహా సమితులు

గ్రంథాలయాభివృద్ధికి దోహదముచేయు సలహాల నిచ్చుటకును, పాఠకుల అభిరుచులను పరిశీలించి గ్రంథ వరణములో తోడ్పడుటకును, గ్రంథాలయమునకు ఒక సలహాసంఘ ముండవలెను.

## గ్రంథాలయములు - సాంస్కృతిక కార్యకలాపములు

ప్రజా సామాన్యములో విజ్ఞానవ్యాప్తి జరుగుటకును వారి సాంస్కృతికస్థాయిని పెంపొందించుటకును - ప్రజలలో పరంపరానుగతముగా వచ్చుచున్న సుసంప్రదాయములను ఆధారముగా చేసుకొనుట యవసరము. కాబట్టి గ్రామములలో సంప్రదాయసిద్ధముగా అనుసరిస్తున్న, పండుగలకు పబ్బములకు గ్రామస్థుల సహాకారముతో- ఉపన్యాసములు, చర్చలు, సాంస్కృతిక వైజ్ఞానిక కార్యకలాపములు యేర్పాటుచేయవలెను. వీనితో బాటు జాతీయైక్యతకు తోడ్పడు ఇతర ఉత్సవములుకూడ జరుపవలెను.

## నిరక్షరాస్యులకు పుస్తకముల జదివి వినిపించుట

చదువురానివారికి వారి పఠనాభిలాషను గమనించి వారికి పుస్తకములను చదివి వినిపించి వారి సంస్కారస్థాయిని ఉన్నతికి కొనిపోవుటకు గ్రంథభాండాగారి తోడ్పడవలెను. ప్రజల జీవిత సమస్యలను పరిష్కరించుకొనుటలోను, వృత్తి విజ్ఞానములను పెంపొందించుకొనుటకును, గ్రామీణులకు కావలసిన సలహాలను గ్రంథభాండాగారి రిచ్చుచుండవలెను. గ్రామపంచాయతి సహాకారముతో నిరక్షరాస్యతను నిర్మూలించుటకు గ్రంథభాండాగారి ప్రయత్నించవలెను.

## వార్షికోత్సవములు - కార్యక్రమములు

గ్రామీణులలో పఠనాభిలాషను పెంపొందించుటకును, గ్రామీణుల దృష్టిని గ్రంథాలయము వైపు మరల్చుటకును ప్రతి గ్రంథాలయమునకును వార్షికోత్సవ మవసరము. వార్షికోత్సవ కార్యక్రమము ఈ దిగువ పద్ధతులపై ఏర్పడుట ఉచితము:-

(ఎ) సంవత్సరమంతయును గ్రంథాలయము నిర్వర్తించి సాధించిన కార్యక్రమ మంతటియొక్క అభివృద్ధియు ప్రజల దృష్టిని ఆకర్షించునట్లు ఏర్పాటు చేయవలెను.

(బి) గ్రంథాలయములలోగల పుస్తక సంచయము గ్రామస్థుల అభివృద్ధికి ఎట్లు ఉపయోగపడినదో. ఇంకనూ ఉపయోగపడుటకు అవకాశము ఎట్లున్నదో ఈ వార్షికోత్సవ సందర్భమున గ్రామస్థులకు తెలుపవలెను.

(సి) సంవత్సర మంతటిలోను అధిక సంఖ్యలో గ్రంథములను చదివినవారివి-ఉత్తమ గ్రంథములను చదివినవారివి- గ్రంథాలయాభివృద్ధికి మిక్కిలిగా తోడ్పడినవారివి నామములను పేర్కొని తద్వారా గ్రామీణులలో స్ఫూర్తిని కల్గించుటకు ప్రయత్నించవలెను.

(డి) గ్రామీణుల దృష్టిలో వార్షికోత్సవము పర్వదినమను భావనను కలిగించుటకు అనుగుణ్యమైన సమిష్టి కార్యక్రమమును రూపొందించవలెను. ముఖ్యముగా బాలబాలికలకు గ్రంథాలయోద్యమమునెడ ఉత్సాహము కలిగించు ఏర్పాట్లు చేయవలెను. ఉదా: వివిధ రకముల పోటీలను ఏర్పరచి వార్షికోత్సవము నాడు బహుమతుల నియ్యవలెను.

## ప్రణాళికా నిర్వహణలో తోడ్పాటు

ప్రణాళికా కార్యకలాపములకు సంబంధించిన భోగట్టాను గ్రంథాలయములు తెప్పించి గ్రామస్థులకు అందించవలెను. ప్రతి గ్రామ గ్రంథాలయము ఆ గ్రామ స్థాయిని సమాచార కేంద్రముగా ఉపయోగపడవలెను.ప్రభుత్వమువారు- మధ్య అంతరాలు లేకుండా- నేరుగా గ్రంథాలయాలకు ప్రణాళికోద్యమ సాహిత్యమును అందించునట్లు చూడవలెను. ప్రణాళికా ప్రచారములకు ఉపయోగించు అన్ని దృశ్య శ్రవ్య సాధనములను గ్రంథాలయము ద్వారా ప్రజలకు అందించుటకు ప్రభుత్వమును కోరవలెను.

గ్రంథాలయముగల గ్రామములలోను పరిసరగ్రామములలోను ప్రణాళికా కార్యక్రమములు ఏ విధముగా అమలుజరిగినదియును,

ఇంకనూ ఆ గ్రామము యొక్కయు పరిసర గ్రామముల యొక్కయు అభివృద్ధికి ఏ విధముగా దోహదముచేయు అవకాశమున్నది యను వివరించగల పోస్టర్లను వ్రాసి గ్రంథాలయములో అంటించవలెను. అందుకు ప్రజలు నిర్వర్తించ వలసిన బాధ్యతలుకూడా వివరించ వలెను.

## స్థానిక చరిత్ర

ప్రతి గ్రంథాలయములోను ఆ గ్రామచరిత్రను వ్రాయించి పెట్టవలెను. ప్రతి సంవత్సరము ఆ గ్రామ చరిత్రగతియందు జరిగిన ముఖ్యఘట్టములను అందులో వ్రాయవలెను. ఇట్టి లిఖిత పుస్తకమును ఆచూకీపుస్తకముల శాఖలో [Reference Section] చేర్చవలెను. ఆ గ్రామాభివృద్ధికి తోడ్పడిన వ్యక్తుల జీవితములను అందులో పొందు పర్చవలెను. అట్లే పేరుప్రతిష్ఠల నార్జించి గొప్పవారైన గ్రామస్థుల జీవితములను ఆ పుస్తకములో వ్రాయించవలెను.

## ధరావతు పద్ధతిలో మార్పు

డిపాజిట్టు మొదట ఒక్కరూపాయితో ప్రారంభించవలెను. ఒక క్రమపద్ధతిని దానిని పెంచుచు ఐదు రూపాయలవరకు ఆ డిపా జిట్టును హెచ్చించవలెను. 5/- రూపాయల డిపాజిట్టు వచ్చువరకూ డిపాజిటు ధనములకు మించిన విలువగల పుస్తకముల నీయరాదు.

కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీవారు జరిపిన సదస్సులో శ్రీ వేంకట రమణయ్యగారు అధ్యక్షులుగ నున్న ఉపసంఘము చేసిన సూచనలు — ఆగస్టు—1963.

---

# గ్రామ జీవనమునకు కేంద్రము గ్రంథాలయమే!

ఆంధ్రదేశమున జాతీయ ప్రబోధము ముఖ్యముగా గ్రంథా లయముల మూలముననే జరిగినది. ఈ ప్రబోధోద్రేకము కేవలము

పాలమీది పొంగువలె వెంటనే సమసిపోకుండుటకై దినదినప్రవర్ధమానమై జాతికి పుష్టినిచ్చుటకు గ్రంథాలయములు చిరస్థాయిగా నుండి తమ విధులను నిర్వర్తించుచుండవలెను. ఇందుకు గ్రంథాలయములకు భవననిర్మాణము ముఖ్యము.

ఏ యుద్యమమైనను శాశ్వతముగా నుండవలెనన్న దానికి శాశ్వతమగు సాధనములు కొన్నియుండవలెను. గ్రంథాలయమునకు భవన మట్టి సాధనము; ఇందుకొరకై మన యాంధ్రదేశమున కొంత కాలముక్రిందట తీవ్రమగు ప్రయత్నములు జరిగినవి. కొన్ని సంఘములు స్వంతభవనములను నిర్మాణము చేసికొన్నవి. కొన్నిచోట్ల చందాపట్టీలు ప్రారంభించగా, కొంతసొమ్ము వసూలై ఏ గ్రామపెద్దల యొద్దనో నిలువయుండుచు నున్నది. మరికొన్నిచోట్ల భవన నిర్మాణము ప్రారంభమై, కొంతవరకు పనిజరిగి కారణాంతరములచే పని నిలిచిపోయి, అసంపూర్తియగు భవనములు గ్రామమునకు దిష్టిబొమ్మలుగా నిలిచియున్నవి. ఈ యసంపూర్తి ప్రయత్నములను తిరిగి చేపట్టి భవననిర్మాణములను పూర్తిచేయుట ముఖ్యముగా చేయవలసినపని.

దీనినిగూర్చి తగిన ఉత్సాహము ప్రజలలో కలుగవలసి యున్నది. గ్రంథాలయములయొక్క ఆవశ్యకములను గూర్చి మొదటినుండియు మేము సూచించుచునేయున్నాము. ఆంధ్రలోకమునకు ఈ యంశమునుగూర్చి తిరిగి నొక్కి చెప్పినచో అది యాంధ్రులను అగౌరవము చేయుటయే; కావున అట్టిపనికి ఇక్కడ పూనుకొనుటలేదు. అయితే ఒక యంశమును మాత్రము మేమిచట చెప్పవలసియున్నది. మనదేశమం దిప్పుడు రాజకీయ జీవనమున అనేక కక్షలు బయలుదేరి ప్రజలను చీకాకు పరచుచున్నవి. ఈ కారణములచే ప్రజలయందు అంతఃకలహము లేర్పడి యున్నవి. ఇందుచే అనేక ప్రదేశములందు ప్రజలకు ఐక్యభావము కుదరక ప్రజాసామాన్యమునకు సంబంధించిన పనులేమియు జరుగుటలేదు. అందుచేత దేశాభివృద్ధికి ప్రజలయం దుండవలసిన సామరస్యమునకు గొప్ప కీడు వాటిల్లు

చున్నది. ఇట్టితరి మనము ముఖ్యముగా కొన్ని సంగతులను స్మృతికి తెచ్చుకొనుట యావశ్యకము.

మనదేశ దురదృష్టమేమియో కాని, ఇద్దరు పురుషులు పదియంశములయందు ఏకప్రయోజనము గలిగియుండియు, ఒక్కయంశమున మాత్రమైనను విరుద్ధప్రయోజన మున్నచో- విరుద్ధ ప్రయోజనాంశమునే పట్టి పల్లార్చి, తన్మూలమున ఉభయుల మధ్యను శాశ్వతమగు వైషమ్యమును పెంపొందించుకొందురు. కాని ఐక్యప్రయోజనములనాధారము చేసుకొని స్నేహ భావమును వృద్ధిపరచుకొనరు. కేవలము ఇందులకు ప్రజలమీదనే నేరముపెట్ట నవసరములేదు; మన దేశమునం దేర్పడిన విషమ పరిస్థితులే ఇందుకు కారణము. అట్లయ్యును, మనదేశము శాశ్వతముగ నిట్టి దురవస్థయం దుండవలసినదేనా ? దీనినుండి విముక్తి ఎప్పుడైన నున్నదా ! దేశమున విద్య వ్యాపించిన కొలదిని ప్రజలు తమ బాగోగులను గుర్తెరుగుదురుగదా ? "పోరునష్టము" 'పొందులాభము" అను నార్యోక్తి మనము చిన్ననాటి నుండియు నెరిగినదేగదా ! అట్టిచో విరోధముగల విషయమునకు మాత్రమే అట్టి భావమును పరిమిత మొనర్చి ఏకాభిప్రాయముగల విషయములన్నింటియందును మన వారందరును ఐక్యకంఠముగా కృషి చేసి, సల అభ్యుదయమును పొందగూడదు ?

పూర్వము మన దేవాలయములును, గ్రామసంఘములును ప్రజలయందు ఐక్యభావమును వృద్ధిపరచుచుండెను. ఇందులో మొదటి దాని యందు విద్యాగంధము కలవారమని చెప్పుకొను వారిలో చాలామంది కిపుడు నమ్మకములేదు. రెండవది రూపుమాసినది. ఇప్పుడు ప్రజలందరు ఏకత్ర సమావేశమగుట ఎక్కడ? తమ కంద రకు కావలసిన విషయములను చర్చించి నిర్ణయించుకొనుటకు అవకాశమేది? ప్రజలయందు ఆత్మగౌరవమును ఆత్మశక్తిని విజృంభింప జేసుకొను మార్గమెద్ది? ఇట్టి సద్గుణములు ప్రజలయందు సుస్థాపితములైనపుడుగదా! "జస్టిసు"పార్టీ వారును "లిబరల్" పార్టీ వారును చెప్పునట్లు తగిన ప్రతినిధులను ప్రజలు ఎన్నుకొనుటయు తమ ప్రతి

నిధులను తమ కుత్తరవాదులుగా చేసికొను శక్తి ప్రజలయం దుద్భవించుటయు సంభవించునది? కాంగ్రెసుపార్టీ వారు కోరునట్లు ప్రతి గ్రామమందును కాంగ్రెసు సంఘము లేర్పడి వాని నిర్మాణ కార్యక్రమమును దేశమునందు సాగించుటయును జరుగునది - ప్రజలయందు సామరస్యభావము కలిగినప్పుడు కదా !

అందుచేత అన్నిపక్షముల వారును — గ్రామమందలి ప్రజలందరును ఏకత్రి సమావేశమై జ్ఞానమును సంపాదించుకొనుటకును, తమకు కావలసిన ఉమ్మడి విషయములను గూర్చి చర్చించుకొని తీర్మానములు చేసికొనుటకును గ్రామస్థు లందరికిని హక్కుగల భవనమొకటి యుండవలెను. నాగరికతగల ప్రతిదేశమందును ఇట్టి కూడలి స్థలము (భవనము) గ్రామజీవనమునందు ప్రముఖస్థానము నాక్రమించి యున్నది.

కావున ఓ జస్టిసు పక్షనాయకులారా! మీ కున్నదని చెప్పబడుచున్న బలమును వినియోగించి ప్రతి పల్లెయందును పట్టణమునందును గ్రంథాలయ భవనములను నిర్మాణము చేయింపుడు.

ఓ కాంగ్రెసు నాయకులారా! ప్రజలు మీతో నున్నారని గదా మీరు చెప్పుచున్నారు. అట్టిచో ఈ భవనములను నిర్మాణము జేసి, తన్మూలమున మీ యుద్యమమును స్థిరపరచుకొనుడు.

గ్రంథాలయ సర్వస్వము, సంపాదకీయము — సంపుటము 6 ; సంచిక 2; 1928 సం.

# గ్రామ గ్రంథభాండాగారియొక్క ధర్మములు

"లండను" నగరమునందు జరిగిన పల్లెటూళ్ళ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభయందు "కలనల్ మిటో చెల్" అను ప్రతినిధినుడివిన సుభాషితములు :

పురుషుడైనను, స్త్రీయైనను గ్రంథభాండాగారిగా నుండు వాడీ క్రింద వివరించిన యోగ్యతలు గలిగి యుండవలెను:

1. తాను చేయుపనియొక్క ఉత్కృష్టతను గ్రహించినవాడై విద్యావంతుడై యుండవలయును.

2. అతడు గ్రంథాలయ శాస్త్రమును కొంతవరకైనను అభ్య సించి యుండవలెను.

3. వీటి యన్నిటికంటెను ముఖ్యమైనది గ్రామస్థుల విశ్వాస మును పొందినవాడై యుండి, అర్హతనుబట్టి మనిషికి ఏ గ్రంథము కావలయునో ఆ మనిషి కా గ్రంథమును అందజేయుటకు సాధ్య మైనంత శ్రమను తీసుకొనువాడై యుండవలెను.

4. విద్యాశాఖ ఉద్యోగులు, ఇతర సంఘములు, మొదలగు వానితో యెక్కువ సంబంధమును గలిగియుండ వలెను.

5. గ్రామస్థుల యొక్క సాంఘిక అవసరములను జ్ఞాన సము పార్జనావసరములను గ్రహించి యుండవలయును.

6. అక్కడి వర్తకములను, పరిశ్రమలను అతడు పరిశీలించి, ఉద్యోగముచేయువారికి, పౌరులకు – మొత్తముమీద అందరికిని ఉప యోగపడునట్లుగా, ద్రవ్యమున్నంత వరకు గ్రంథములను తెప్పించి అందజేయవలయును.

7. అతడు వెనుకటి కాలపు గ్రంథభాండాగారికి యుండు ఆచారములను పూర్తిగా వదలివేసి – అవసరమైన గ్రంథములకు ఎక్కువ ప్రతుల నుంచుచు, అరలయందుండు ఏ గ్రంథముగాని వృథాగా పడియుండ కుండునటుల జూడవలెను.

8. ముఖ్యముగా ప్రారంభ సంవత్సరములందు అతడు తన గ్రామమంతయు తిరుగుచుండవలయును.

9. పగటి గంటలు తక్కువగా నుండునట్టియు, ప్రయాణము చేయుటకు కష్టముగా నుండునట్టియు శీతకాలమునందు ఉపాధ్యాయులను కలుసుకొని ఉపన్యాసముల నిప్పింపవలయును.

10. ప్రయాణ సౌకర్యము చౌక అగునటుల చేయవలయును.

11. రుచినిబట్టి స్వాభివృద్ధిని జేసికొనుటకై చదువు నెడల ప్రేమను బుట్టించుటకుగాను, యే విధముగానైన సహాయము చేయగలవారి తోడ్పాటును తీసికొనవలెను.

12. "డ్యూయీ" గారి "డెసిమల్" వర్గీకరణ పద్ధతినిగాని, "కట్టరు" గారి గ్రంథవిభజన పద్ధతినిగాని – దేవాలయమందలి దేవుని వలె పూజించు గ్రంథభాండాగారి వలన యెంతమాత్రము ప్రయోజనములేదు.

గ్రంథభాండాగారికి గ్రంథాలయమందు గల ప్రయోజనము ముఖ్యముగా స్వార్థమగుటచే, అతడు స్వల్పజీతమునే తీసికొనవచ్చును. గడ్డి సమృద్ధిగా గలిగిన బీడునం దుండియు మేయజాలని ఆవువలె అట్టివాడు నిరర్థకుడు. రెండు వందల గ్రామాదులు తిరిగి బోధకుని వలె పనిచేయవలసియుండి – 14 మొదలు 30 సంవత్సరముల వరకును వయస్సుగల జనుల అవసరములను తెలిసికొన గలిగిన చురుకైన వానికి అల్పజీతము నిచ్చుట అవివేకము.

సాధారణముగ అనేక భాండాగారములలో గ్రంథ భాండాగారికి సహాయకుడు గూడ నుండుట ఆవశ్యకము. ఇద్దరున్నప్పుడు వంతులు వేసికొని గ్రామములను చుట్టివత్తురు; సహాయకుని జీతమెంతయో నిర్ణయించుటకు ఇంత త్వరగా వీలులేదు. ముందు ఒక పద్ధతి ఏర్పడిన కొలదియును, దాని అంతట అదియే నిర్ధారణ కాగలదు.

— గ్రంథాలయ సర్వస్వము : సంపుటము 6, సంచిక – 9, మే, 1925

---

• అనగా గ్రంథాలయము శాస్త్రీయ విషయములందుకంటె, జనులకు ఎట్లు ఉపయోగించునను విషయమునసే ఎక్కువ శ్రద్ధవహింపవలెనని వీరి అభిప్రాయమైయున్నది.

# గ్రామ గ్రంథాలయము

## గ్రామస్థుల సాముదాయక సమావేశ ప్రదేశము

"వర్జీనియా" దేశములోని "బాన్ ఎయిర్" అను చిన్న గ్రామమందు ఆ గ్రామమందలి దేవాలయము (church) నందు పూజారిగానున్న "హెజనా" అను పరోపకార పారీణుని కార్యదీక్ష వలన- 1901 వ సంవత్సరమున సార్వజనిక గ్రంథాలయము ఒకటి స్థాపింపబడినది. ఆ గ్రంథాలయమునకు ఆయనయే ప్రథమాధ్యక్షుడుగా నుండెను. 1902 వ సంవత్సరమునం దాయన చనిపోగా ఆయన జ్ఞాపకార్థ మా గ్రంథాలయమునకు గ్రామస్థులు స్వంత భవనమును కట్టి 1903 వ సంవత్సరమున ప్రవేశమహోత్సవమును జేసిరి. ప్రవేశ మహోత్సవమునకు వచ్చిన వారందరును ఒక్కొక్క పుస్తకమును దానము జేసిరి.

గ్రంథాలయమునకు పుస్తకములను కొనుటకు నిల్వసొమ్మేమియును లేదు. అందుచేత అప్పుడప్పుడు అనేక వేడుకలను ఏర్పాటు జేసి గ్రంథాలయాధికారులు సొమ్మును సంపాదించుచుండెడివారు. గ్రంథాలయమునకు స్థిరమైన ఆదా సభ్యత్వపు చందా మాత్రమే. సభ్యుల చందా సంవత్సరమునకు ఒక డాలరు [రు 2-8-0 లు] ; అట్టి చందానిచ్చు సభ్యులు 27 గురు మాత్రము కలరు. వీరివలన సంవత్సరమునకు 27 డాలర్లు [రు 67-8-0 లు] మాత్రము వసూలగును. ఈ సొమ్ములోనుండియే పత్రికలు తెప్పించుటకు చందాలు, వంట చెరుకు [ఆ దేశమునందు చలి విస్తారముగా నుండుటచే, ప్రతి ఇంటి యందు వెచ్చగ నుండుటకై ఎల్లప్పుడు నిప్పు రాజుచునే యుండును) కొనుటకు, మరమ్మతులు చేయుటకు కావలసిన సొమ్ము ఖర్చుపెట్ట వలసియుండును. అందుచేత క్రొత్త పుస్తకములు కొనుటకు సొమ్మేమియు అందుండి మిగలదు.

ఆ గ్రామస్థు లందరికిని పుస్తకములు ప్రతి మంగళవారము నాడు సాయంకాలము నాలుగు గంటలు మొదలు, అయిదు గంటల వరకు నిచ్చెదరు. ఆ పుస్తకములను తిరిగి మరుసటి మంగళవారము నాడు వాపసు జేయవలయును. అట్లు వాపసు జేయునివారు తిరిగి ఆ గ్రంథమునే ఎరువు తీసికొనవలయును. వాపసు జేయకను, తిరిగి ఎరువు తీసుకొనకను ఉండువారు జుల్మానా ఇయ్యవలసియుండును. తీరిక సమయముల యందెల్ల ఆ గ్రామస్థులు గ్రంథాలయమునందే చేరి యుండెదరు గ్రామస్థు లందరికి గ్రంథాలయము సాముదాయక సమావేశ ప్రదేశముగ నేర్పడినది. మంగళవారమునాడు మాత్రము గ్రంథాలయమునకు వచ్చు వారందరికి "తేయాకునీరు" ను అల్పాహారములును సప్లయి చేయబడును. పళ్ళెము (ప్లేటు1కి అయిదుసెంట్లు పన్నెండున్నర పైసలు) ఖరీదు.ఆనాడు గ్రంథాలయమునకు చాల మందివచ్చెదరు. ఔదార్యవంతులగు అనేకులుగ్రంథకర్తలును ప్రకాశకులును తమ గ్రంథములను గ్రంథాలయమునకు దయతో నొసంగు చుండిరి. గ్రంథాలయమునందు 3500 గ్రంథములు గలవు.

గ్రంథభాండాగారి యగు "ఫాంచెన్ విథర్సు" అను నామె 1906 సంవత్సరము నుండియు గ్రంథాలయమునకు ఉచిత సేవను చేయుచున్నారు.

గ్రంథాలయ సర్వస్వము సంపుటం 9, సంచిక 2: 1934 సంవత్సరము



# వయోజన విద్య

## ఈడు ముదిరిన వారి విద్యాభివృద్ధి మార్గములు

### వయోజన విద్య

ఈకాలమున మన దేశమందు సామాన్యముగ విద్యాదానము చేయు సంస్థలు పాఠశాలలే. వీనివలన కోమలమైన వయస్సునందున్నవారే విద్యను పొందగలరు. వయస్సు మీరిన వారు, ఈడు ముదిరినవారు విద్యాభివృద్ధి నొందించుకొను మార్గములు మన దేశమున నేమియు లేవనియే సామాన్యముగ జెప్పవచ్చును. పూర్వకాలమున మన దేశపు స్థితిగతులు యిట్లుండెడివిగావు.

ఇప్పటి కాలమున స్వరాజ్య మనుభవించుచు ఆధునిక నాగరికత యందు వన్నెకెక్కిన పాశ్చాత్య దేశముల యందును, జపాను, చీనా మున్నగు ప్రాచ్య దేశముల యందునుకూడ నిట్లుగాదు.

మన దేశము నిపుడు చీకాకు పరచుచున్న సమస్యలను తృప్తికరముగ పరిష్కరించుటకు ముఖ్యముగను, అత్యవసరముగను మనము పూనుకొనవలసిన పని "ఈడు ముదిరిన వారి విద్యాభివృద్ధి"ని గురించినది. ఈపనికి మన మెంతకాలము పూనుకొనక యుపేక్షించెదమో- ఆపనికి తగినంత ప్రాధాన్యముతోను, సమర్థతతోను, దానిని నిర్వహించమో -అంతకాలము మన దేశము దురవస్థయందుండవలసినదే. మరియొక విషయము.ఇందును గూర్చి ప్రభుత్వమువారు పూనుకొనరు. ప్రజలే ఈ కార్యభారము వహించి సాధన విధానములను నిర్ణయించుకొనవలసియున్నది. ఈ నిర్ణయమందు — ఆధునిక నాగరి

కత్య, దేశముల స్థితిగతులు, మాత్రమేగాక మన దేశమందలి పూర్వ సంస్థలు కూడ మనకు సహాయపడగలవు.

పాఠశాలకు బోయి విద్యాభ్యాసము జేయుటకు ఈడు ముదిరిన వారు మన దేశమున ఎన్ని తరగతులవారున్నారో మనము పరికించి చూచెదముగాక. పల్లెటూరు పాఠశాలలలో ప్రాథమిక విద్యను మాత్ర మభ్యసించి తమకు నిర్ణయమైన వ్యవసాయమో, పల్లెటూరి చేతిపను లనో అవలంబించి తన్మూలమున జీవయాత్ర గడుపువారు మొదటి తరగతివారు. పల్లెటూరి యందే నివాసముకలిగి విద్యాగంధమేమియూ లేనివారు రెండవ తరగతివారు. కేవల సంస్కృతాంధ్రములను పూర్వకాల పద్ధతి నభ్యసించి పల్లెటూరునందలి పూర్వార్జితమగు భూములపై నాధారపడియున్నవారు మరియొక తరగతివారు. ఏ "స్కూలుఫైనలు" వరకో అంతకు లోపుగనో లేక పైగానో — ఏ పట్టణమందో విద్యాభ్యాసము జేసి భగ్నమనోరథులై పూర్వార్జిత మైన ఆస్తి నపేక్షించి తిరిగి పల్లెటూరునకు జేరి అక్కడే జీవయాత్ర గడుపుచుండువారు మరియొక తరగతివారు. నిశ్చితముగ ఏవృత్తియు లేక ఎలుకమీద పిల్లిని, పిల్లిమీద ఎలుకను— ఎక్కించుచు తమ జీవనమునకు కేవలము ఇతరులపై నాధారపడియుండి పల్లెటూర్లను చీకాకు పరచుచున్న "జ్ఞాన లవ దుర్విదగ్ధులు" మరికొందరు. వీరొక ప్రత్యేక తరగతిగ పరిగణింప తగియున్నారు. పైన చెప్పిన తరగతుల వారందరును పల్లెటూరుల నాశ్రయించి యున్నవారే.

ఇక బస్తీలలోనున్న ఈడు ముదిరిన వారిని గురించి విచారించె దము. ఇందు ముఖ్యముగ పరిగణింప దగినవారు - పాశ్చాత్యవిద్యల నభ్యసించి అందు ప్రావీణ్యమునుబొంది తన్మూలమున జీవనాధారము నేర్పరచుకొన్నవారు అగ్రగణ్యులు. ఉద్యోగముల నపేక్షించక వర్త కము మొదలగు ముఖ్యమగు వృత్తుల నవలంబించి ఐశ్వర్యములో తులతూగుచున్నవారు మరియొక తరగతివారు. అంత ఐశ్వర్యవంతులు గాకపోయినను స్వతంత్రవృత్తి నవలంబించి మర్యాదగా జీవనము

గడుపుచున్నవారు ఇంకొక తరగతి వారు. కేవలము "కలము-బలము" వలన జీవనముచేయు వర్తకుల గుమాస్తాలు, న్యాయవాదుల గుమాస్తాలు మొదలగు వారందరును ఒక ప్రత్యేక తరగతిగ నెన్నదగిన వారు. అందరికన్న నెక్కువ సంఖ్య గలిగినట్టియు, ప్రాముఖ్యము వహించునట్టియు వారు నిరక్షరకుక్షులైన పాటకపు జనులు. పై జెప్పిన వారందరికి అతీతులై నిర్దిష్టమగు వృత్తి యేదియులేక పరులను దుర దృష్టము లపాలు జేయుటయే తమ జీవనాధారముగ కలవారు; ఆధునిక కాలమున ఈ తరగతివారి సంఖ్య దినదినాభివృద్ధి నొందుచున్నట్లు మనము చూచుచున్నాము. ఈ తరగతివారిలో ముఖ్యముగ విద్యాభి వృద్ధి కలుగవలెను.

విద్య అనంతము. సర్వకాల సర్వావస్థలయందునను సేవించి సంపాదింపదగినది. ఇప్పటి కాలమున మన దేశమున విద్య కేవల జీవ నాధారముగ పరిగణింపబడుచున్నది. అసలు తత్త్వమిది కాదు. విద్యను నేటి కాలము ననుసరించి నాలుగు సామాన్య విభాగములుగ విభజించవచ్చును. ఒకటి వృత్తికి సాధనభూతమైనది. రెండవది పౌరసత్వపు హక్కు బాధ్యతల నలవడ జేయునది. ఆత్మవికాస మునకును, మనోవికాసమునకును నుపకరించి మనుజుని యానంద నిమగ్ననిగ జేయగల్గినది మూడవది. ఆత్మసంరక్షణ కొరకు వినియోగ పడి పారలౌకికమైన విద్య నాల్గవ తరగతిది. నేటికాలముననుసరించి ఈ నాలుగు విధములగు విద్యలును ప్రతివ్యక్తికిని కొలదిగనో గొప్ప గనో యుండి తీరవలసినదే.

ఏదియో విద్యయందు ఇదివరకే ప్రావీణ్యముజెంది తమంతట తాము పుస్తక సహాయమున విద్యాభివృద్ధి స్వయముగ జేసికొనగల వారికి జ్ఞానాభివృద్ధికి ముఖ్యసాధనములు పౌరగ్రంధాలయములు. గ్రంథాలయముల సంఖ్య మనదేశమున హెచ్చయి ప్రతి పల్లెయం దును, బస్తీయందును ఈ సంస్థలు వెలసి దినదినాభివృద్ధి నొందినగాని ప్రజల పరిజ్ఞాన మభివృద్ధి జెందనేరదు.

కేవల వృత్తిసాధకము మాత్రమగు విద్య వ్యక్తికి ఆనందమును సమకూర్పనేరదు. సంపూర్ణ మానవానందము నీయజాలదు.

కావున ఈడు ముదిరినవారి విద్యాభివృద్ధికి సాధనమగు సంస్థలలో అగ్రగణ్యమైనది పౌరగ్రంథాలయమే.

రెండవది సంచార గ్రంథాలయము. గ్రంధపేటికల మూలమున పల్లెపల్లెలయందును చదువరులకు వారి వారి అవసరములను బట్టియు అభిరుచులను బట్టియు గ్రంధముల నందజేయవలెను. సంచార గ్రంధాలయముల మూలమున పాశ్చాత్యదేశములయందు జరుగుచున్న విద్యాప్రచారము వర్ణనాతీతము. ఆదేశమందలి శ్రీమంతులు ఈ సంస్థ కొఱకై మితిలేని ద్రవ్యమును వెచ్చించి దేశోద్ధారకులగుచున్నారు. మన దేశమునందు గూడ దేవళములను, సత్రములను ప్రతిష్ఠించి దేశోపకారము జేయుచున్న లక్ష్మీపుత్రులు "అన్ని దానములలో విద్యాదానము ప్రశస్త"మను నార్యోక్తి ననుసరించి విద్యాదానము జేయగడంగుటకు ప్రార్థితులు.

గ్రంథాలయములు- పుస్తకముల మూలమున విద్యాభివృద్ధిని తమంతట తాము పొందగల వారికే యుపకరించును. కాని మనదేశమున నిరక్షరకుక్షుల సంఖ్య అగ్రగణ్యము. కేవలము చదువుట, వ్రాయుట మాత్రమే తెలిసినవారు చదువు వచ్చిన వారిలో లెక్కకు వచ్చినను, స్వయముగ పుస్తకములు చదివి తమకు కావలసిన జ్ఞానమును సంపాదించుటకు తగిన సామర్థ్యములేని వారైయున్నారు; ఈ పై జెప్పిన తరగతివారు మనదేశమున ఎందరోయున్నారు. వీరందరికి ముందు చెప్పబడిన నాలుగు విధములగు విద్యను అలవడజేయు మార్గములను మనదేశస్థితిగతుల ననుసరించి మనము వెంటనే నిర్ణయించి ఆచరణలోనికి తెచ్చుట అవశ్య కర్తవ్యము.

పూర్వకాలమున మనదేశమందు పల్లెటూరివారు దినమంతయు శ్రమపడి ఇంటికివచ్చిన పిదప విశ్రాంతి కొరకును, జ్ఞానాభివృద్ధి జేసి

కొనుటకు ఏ తటాక ప్రాంతమునకో లేక తరుచ్ఛాయకో చేరుచుండెడివారు. గ్రామమందలి పెద్దలు అచటికివిచ్చేసి లోకానుభవమును జ్ఞానమును ఇతరులకు అబ్బునట్లు బోధ జేసెడివారు. పాదచారులై దేశమంతటను దిరుగుచు లోక కళ్యాణమే తమ శ్రేయస్సుగ నెంచుకొనెడి సాధువులు ఈ సమావేశములకు విచ్చేసి తమ యమూల్య పరిజ్ఞానమును జానపదుల కందజేసి, వారల ధన్యుల జేసెడివారు. ఆ కాలము వేరు. ఈ కాలమువేరు. అప్పటి స్థితిగతులు పూర్తిగ మారినవి. ఇట్టిసమావేశములవలన, ఈడు ముదిరినవారు జ్ఞానాభివృద్ధిని జేసికొను పూర్వపు టవకాశము లన్నియు, ఇపుడు సంపూర్ణముగ నశించినవి– వాని స్థానమున నూతన సంస్థ లేవియు నిర్మాణము కాలేదు. ఈ లోపమును మనము వెంటనే పరిపూర్తి చేయవలసియున్నది.

పూర్వమున్న సంస్థలలో దేవాలయము మరియొక సంస్థ. మన దేవాలయములు పరమేశ్వరారాధనకు ఏర్పడిన పూజాస్థానములు మాత్రమేగావు. వివాహములకు, విద్యారంభములకు ధర్మశాస్త్ర చర్చలకు, కళలకు, సన్యాసులకు, పౌరాణికులకు సర్వమునకు సర్వులకూ సంగమ స్థానము. మనుజుడు జీవయాత్రియం దలవడ జేసికొనవలసిన సద్గుణము లన్నింటికిని శిక్షాస్థానములుగను, సర్వ విధములగు విద్యల బోధించెడి పాఠశాలలుగను మన దేవాలయములు అభివృద్ధి గాంచియున్నవి. అన్ని అంతరములనుండు ప్రజలును అచట సమావేశమై అన్యోన్య స్నేహముచే — ఏక లక్ష్యమున మనసు లగ్నము చేసికొన్న కారణమున — సంపూర్ణ సోదరభావమును తన్మూలమున నలవడ జేసికొను చుండిరి. దేవళము లందలి శిల్ప చిత్రలేఖనములు మిక్కిలి మనోరంజకములై చిత్తశుద్ధిని గావించి ఈశ్వరుని అనంతకళ్యాణ గుణానుభవమునకొలది కాలమైనను మనుజునికి సమకూర్చుటకు సమర్థములై యున్నవి.

పురాణకాలక్షేపములును, హరికథా కాలక్షేపములును మన

దేశమున నెక్కువ ప్రసిద్ధిగాంచి ప్రాజ్ఞులకును, పామరులకును కూడ తారకములై వెలయుచుండెను.

ఈ కాలమున హరికథా కాలక్షేపములు పూర్వముకన్న నెక్కుడు విరివిగా జరుగుచున్నను, పూర్వమువలె విధ్యుక్త ధర్మము లను నెరవేర్చునవిగా నుండక వేరుగ పరిణమించుచున్నవి. హరికథా కాలక్షేపము నందేమి, పురాణ కాలక్షేపము నందేమి, ప్రధానాంశము కథకుని యోగ్యతయు, పాండిత్యమును, రంజకత్వమును అయి యున్నవి. ఇప్పటి కథకులలో నిట్టి యోగ్యత గలవారు తక్కువగా నున్నారు.

శ్రోతలుగూడ కథకుని సంగీత విద్యాపాండిత్యమును బట్టియు, కంఠశ్రావ్యతనుబట్టియు వారి యోగ్యతను నిర్ణయించుటకు ప్రయత్నింతురేగాని- కథయందలి యంశముల ప్రాశస్త్యమును బట్టియు, ప్రజల మనములను ఆహ్లాదపరచి ఆకర్షించగల శక్తి ననుసరించియు నిర్ణయింపరు.

ఈపై జెప్పిన రెండు సంస్థలును విధ్యుక్త ధర్మములను కాలానుగుణముగ నిర్వర్తించు విధమున దేశమంతటను మరల వ్యాపించి నచో నిందుమూలమున జనసామాన్యమునకు గలిగెడి జ్ఞానాభివృద్ధి కడు మెండు. ఏకకాలమున — వివిధాంతరములు గలిగినట్టియు, వివిధాభిరుచులు అభిప్రాయములు గలిగినట్టియు సభ్యుల నాహ్లాదపరచి, వారి కవసరమైనట్టియు అభివృద్ధి కరములైనట్టియు. వివిధ విషయములనుగూర్చి వారికి హృద్యముగ నుండునట్లును, సులభముగ గ్రహించుటకు వీలుగ నుండునట్లును, జ్ఞానబోధ చేయుటయందు కడు సమర్థములై యుండుటయే వీనియందలి యాత్కృష్ట్యము.

మన దేశమున నీ రెండు సంస్థలను ప్రథమమున హిందూ సంస్థలేయైనను నవీనముగ నితర మతస్థులుగూడ వీని మూలమున జనసామాన్యమునకు జ్ఞానాభివృద్ధి జేయుటకు ఎక్కువ అవకాశములను గమనించి వానిని గ్రహించుచున్నారు.

గ్రంథాలయ సర్వస్వము: సంపుటము 8; సంచిక-2 మే - 1925

# గ్రంథాలయములు - సమాజసేవ

విద్యాభివృద్ధికిఁ బాఠశాలలు మాత్రము చాలవు. ఇతర సాధనము లావశ్యకములు. సంఘమును సంస్కరించుటకు సంఘీభావమేర్పడుటకును సాధనములనెల్ల మనము సమకూర్చవలెను.

## సర్వసేవ్యమైన సాంఘిక ప్రతిష్ఠాపనలు

జనులందరును సంఘీభావము కలిగి యుండుటకును అన్యోన్య పరిచయభాగ్యము నభివృద్ధిచేసికొనుటకును—సర్వసమత్వమును సంపూర్ణముగ కలుగజేయు ధర్మషరన మందిరములు, గ్రంధాలయములు, వస్తుప్రదర్శన శాలలు మొదలగు వివిధ సంస్థలను—ఇందుకు సాధనములుగ—దేశమునందెల్లెడలను విరివిగ స్థాపించవలెను. సకలజనులు ఎచ్చోటికి వివక్షత లేకుండగ పోగలుగుదురో అట్టిస్థలమే సార్వజనిక గ్రంధాలయము. విద్యాధిదేవతయగు సరస్వతీదేవికి జాతి, మత వివక్షతగాని గొప్పతనము, బీదతనము అనుభేదబుద్ధిగాని ఎంత మాత్రమును లేదు. న్యాయవాది కానిండు. ఉపాధ్యాయుడు కానిండు. జాగీర్దారు కానిండు. వర్తకుడు కానిండు. ఇంకను ఎవరైన కానిండు. ఆమె పాదపద్మముల సన్నిధిని మోకరించి జ్ఞానామృతమును దనివిదీరఁ గ్రోలవచ్చును. విజ్ఞాన పిపాసను దీర్చుకొను నుద్దేశముతో చనుదెంచు బీదవానితో సరిసమానముగ కూర్చుండి చదువుకొనినచో తనకు పరువు తక్కువయగునని భాగ్యవంతు డెంతమాత్రమును భావింపరాదు.

ఈవిశాలాద్దోశములకు దోహదముచేసి కార్యసాధనకుఅనువగు సామర్థ్యమును గలిగియుండునటుల సంస్థలను తగినంత గట్టిపునాది గలవిగ నిర్మింపవలెను.

జనుల సాంఘిక జీవనమునం దేకభాజనముగ పనిచేయవలెనని తలంచు సంస్థలు సార్థకమగుటకు ఈపై విషయములందు నిష్పాక్షికముగ నుండవలెను. ఈ విధముగ ధర్మగ్రంధాలయములును పఠన

మందిరములును, ఒక గ్రామముయొక్కగాని, పట్టణముయొక్కగాని సర్వజనులకును ఉపయోగించు సాంఘిక ప్రతిష్ఠాపనలై వెలయవలెను.

## ప్రాశస్త్యము

జనులందరును ఇట్లు ఒకచోట సమావేశమై పరస్పరము భావములను వెల్లడించుకొను నవకాశముయొక్క ప్రాముఖ్యము గణుతింప శక్యముకానిది. ఇట్లు సమావేశ మగుటవలన మానవజీవితమును, నడకను, సంస్కరించుకొనుట కెంతయు విలుగలుగును.

## స్థలము రంజకమై యుండవలెను.

గ్రంథాలయము లుంచు స్థలములు మిక్కిలి రంజకములై హృదయాకర్షకములుగ నుండవలెను. సర్వసాధారణముగ జనులు పగలంతయు తమ తమ వ్యాపారములను జూచుకొని సాయంసమయము నందు గ్రంథాలయమునకుగాని పఠనమందిరమునకుగాని విచ్చేయుదురు. అందుచే అది బహిరంగ ప్రదేశమునందు గాలి విరివిగా వచ్చుట కనుకూలముగ నుండవలెను. దానిచుట్టును చెట్లను పెంచిన జనప్రియముగ నుండును.

## భాండాగారి గ్రంథాలయమునకు ప్రాణము

భాండాగారి గ్రంథము లందరికిని సులభముగ లభించునట్లు చేయవలెను. అతడు చదువరుల రుచులను కనిపెట్టి ఎవరికి తగిన గ్రంథములను వారి కందజేయుచుండవలెను. అతడు ఉల్లాసవంతుడై మిక్కిలి రసజ్ఞుడుగ నుండవలెను. గ్రంథాలయమున కాతడు ప్రాణము. దానియొక్క సఫలతకు అతడే మూలము

## వయోజన విద్యాసేవ

చదువుకొన గలిగినవారికి గ్రంథముల నిచ్చునంతమాత్రముననే గ్రంథాలయముయొక్క ధర్మము పూర్తికాలేదు దురదృష్టవశముచే మనదేశమునందు చదువుకొనజాలని వారు పురుషులయందే అనేకులు

కలరు. అట్టివారిలో వయసుమీరినవారికి చదువుచెప్పుట మిక్కిలి కష్టమగు కార్యముగదా! కాని వారిని జ్ఞానవంతులుగ జేయుట మనకు చేతనైన పనియు ధర్మమునై యున్నది. గ్రంథాలయములందేగాక వారు నివసించుచుండెడి గుడిసెలకు సయితము పోయి గ్రంథములను పత్రికలను జదివి బోధించి వారి జ్ఞాననేత్రము వికసించునట్లు చేయవలెను. అపుడే గ్రంథాలయముయొక్క ధర్మము పూర్ణముగ నెరవేరినదని చెప్పవచ్చును.

## గ్రంథములను గృహముల కందించుట

స్త్రీలకును పిల్లలకును కావలసిన ఏర్పాటులు మన గ్రంథాలయములందు లేవు. స్త్రీలు సాంఘికులుగ జేరుటకు మాత్ర ముభ్యంతరము లేదు. కాని వారికి కావలసిన ప్రత్యేకమగు ఏర్పాట్లులేనిది లాభ మేమి? స్త్రీ మన గృహాధిదేవతగదా! అర్ధాంగలక్ష్మి కదా! ఈ లక్ష్మీదేవతలను మనము నిరసింపదగునా? కావున, వారుగూడ అభివృద్ధి నొందుటకు కావలసిన ఏర్పాటులను జేయు టత్యంతావశ్యకము. మనము చేయవలసిన దేమనగ- చందాలేమియు తీసికొనకుండగ గ్రంథములను పత్రికలను వారి గృహములకు పంపు నేర్పాటులను ప్రతి గ్రంథాలయమును, ప్రతి పఠనమందిరమును చేయుటయే! ఈ విషయమున ఆంధ్రదేశమున గల కొన్ని గ్రంథాలయములవారు పరిశ్రమ చేయుచుండుట ప్రశంసనీయము. కావలసిన గ్రంథములను, పత్రికలను, ప్రతిదినమును వారికి అందజేయుచుండవలెను. విద్యావంతులగు కొందరు స్త్రీల నేర్పాటుజేసి వారిని గృహములకు పంపి, చదువుకొనజాలని స్త్రీలకు వారు చదివి వినిపించు నేర్పాటు చేయవలెను.

## పిల్లలకు ప్రత్యేక సదుపాయములు

పిల్లలుకూడ వచ్చుటకు మన గ్రంథాలయములయందు జాత్తిగ ఆకర్షక సాధనములు లేవు. స్వాభావికముగ, జిజ్ఞాసను సంతృప్తిపరచుకొనుటకును, జ్ఞాన పిపాసను దీర్చుకొనుటకును పెద్దలకువలె పిల్లలకును

గ్రంథములును పత్రికలును అత్యంతావశ్యకములు. పాశ్చాత్య దేశములయందెల్ల, అందును ముఖ్యముగ అమెరికా దేశమునందు పిల్లలకు ప్రత్యేక గ్రంథములును, పత్రికలునుగూడ విశేషముగ గలవు. గ్రంథాలయములందు వారు చదువుకొనుటకు ప్రత్యేక మందిరములును, వారికి బోధించుటకు సుశిక్షితులైన ప్రత్యేక భాండాగారులునుకూడ గలరు. ఆ దేశములయం దున్న గ్రంథాలయములలో పిల్లలు చదువుకొనుటకు ఎన్ని సౌకర్యములు కలవో యూహించుటకైన మనకు సాధ్యముగాదు. అట్టి సౌకర్యములు మన దేశమున పెద్దలకుకూడ లేవు.

పై జెప్పిన రీతిని జనసామాన్యమునం దంతటను విద్య వ్యాపింపజేయుటయే గ్రంథాలయముయొక్క పరమావధి. కావున పాఠశాలల వలన జనులందరికి విద్య యబ్బుట కవకాశము లేకపోయినను గ్రంథాలయోద్యమ వ్యాప్తివలన విద్యాభివృద్ధి కవకాశ మున్నది.

నైజాము రాష్ట్రమందుగల "హనుమకొండ" లోని "శ్రీ రాజరాజ నరేంద్రాంధ్ర భాషా నిలయము" ఏకోనవింశద్వార్షికోత్సవ అధ్యక్షపీఠము నుండి అయ్యంకివారిచ్చిన ఉపన్యాససారము–గ్రంథాలయ సర్వస్వము– సంపుటము8– సంచిక–5 1924 సంవత్సరము.



# చిన్న పిల్లలకు సేవ

## విూవయస్సులో నేను చదివినవి

### నాయనమ్మ : సుందరమ్మ

మొట్టమొదటి చదువు మానాయనమ్మ సుందరమ్మగారి యొద్ద ప్రారంభమైంది. ఆమె దగ్గిర కూర్చుండి — పండుకొని — పాటలు వినేవాడిని—పురాణాల గాథలలో నుండి కథలు చెప్పేది ఆమె.

రాత్రి పరుండబోయే ముందర — జోలపాటలు — లాలి పాటలు పాడి నిద్రపుచ్చేది — తిరిగి తెల్లవారుఝామున మేలు కొలుపులు — భగవంతుని స్తోత్రాలు — భక్తికలుగజేసే పద్యాలు పాడి నిద్రనుంచి మేలు కొలిపేది.

నాయనమ్మ పాడిన పాటలలో

"గుమ్మడే డే కన్న తల్లి
గుమ్మడేడే గోపిదేవి
గుమ్మడేడే నను కన్న
తల్లి గోపెమ్మ యశోదమ్మా!
అమ్మా గుమ్మడేడే — ,,

### దశావతారాలు

ఈ పాటలో కృష్ణుడు దశావతారాలు ఎత్తినట్లు, తనకు ఏ అవతారంలోను ఆ "గుమ్మడు" కనుబడలేదని — ఆ గుమ్మడిని తనకు అప్పుడే చూపమని తల్లిని అడుగుతాడు — ఆ పిచ్చి యశోదమ్మ — "ఏదో — లోకంలో తల్లులవలె నేనూ అన్నాను — నీవు లోకాలకు

అన్నింటికీ అధిపతివి కనుక నిన్ను భయపెట్టడానికి వీలుకాలేదు. లోకంలో సామాన్యపు పిల్లలను "గుమ్మడి" పేరుతో భయపెట్టు తున్నాము - అసలు గుమ్మడే లేడు -" అంటుంది.

ఈవిధంగా భగవంతుని అవతారాల కథలు - భగవంతుని భక్తుల కథలు మా నాయనమ్మ ఎక్కువ ఓపికతో చెప్పేది.

## మొదటి పుస్తకాలు

కొంచెం చదువుకోడానికి శక్తి కలిగిన తర్వాత నేను చదివిన పుస్తకాలు సుమతిశతకం - వేమనశతకం - కథారత్నావళి - కాశీ మజిలీ కథలూ - పంచతంత్రం - మొదలైనవి.

నాకిప్పుడు 70 సంవత్సరాల వయస్సు-నిండింది. ఇప్పుడు నేను చెప్పే విషయాలు మీ వయస్సు నాకు ఉన్నప్పటివి. అనగా 60 సంవత్సరాల క్రిందటివి.

## మి స్స మ్మ లు

మా నాన్నగారు "శెట్టిపేట" అనే ఊళ్ళో ఉండేవారు. ఆ ఊళ్ళో ఉన్న క్రైస్తవ 'మిస్సమ్మలు' మా ఇంటికి వచ్చి మతబోధ చేసి - పెద్ద పెద్ద బొమ్మల పుస్తకాలు నాకు ఇస్తూ ఉండేవారు — వారి మతబోధ నాకు అంటలేదు -కాని వారుఇచ్చిన పుస్తకాలలోని బొమ్మలు నామనస్సుకు ఉత్తేజాన్ని కలిగించి - "చదువు అనేది కూడా మనము ఆడుకొనే ఆటలలో గొప్పది" అనే విషయాన్ని బోధ పరిచాయి.

మా నాయనమ్మ వద్ద విన్న పాటలు, కథలతోబాటు - మావూళ్లో పురాణాలు, హరికథలు చెప్పుతూంటే వినేవాడిని - తోలుబొమ్మలాటలు కూడ చూచేవాడిని — వీటి అన్నింటివల్ల కృష్ణుడనా - రాముడనా -నాకు పరిచయం అయిన, ఆట స్నేహి

తులకు మల్లే కనపడేవాళ్ళు - మిస్సమ్మలు ఇచ్చిన క్రీస్తు బొమ్మల పుస్తకాలవల్ల క్రీస్తుకూడ పరిచయం అయినాడు.

## నీ తి శ త కా లు

నా జీవితానికి మెరుగులు దిద్దిన చిన్ని పుస్తకాలలో సుమతి శతకము ప్రధానమైనది.

శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరాయనగా
ధారాళమైన నీతులు
నోరూరగ జవ్వులు పుట్ట నుడివెద సుమతీ.

అని కవి ప్రతిజ్ఞ చేశాడు.

ప్రతి రోజూ మనము చేసే పనులలో - నడిచే నడవడికలో - మంచి దారిని చూపే నీతులన్నీ ఈ శతకంలో ఉన్నవి.

ఇక వేమన శతకం- చెప్పనక్కరలేదు - అందులో ఒక్కొక్క చిన్నపద్యంలో - ఎంతో కాలందాకా జ్ఞాపకంఉంచుకొని, జీవితాంతము దాకా ఆచరించవలసిన విషయాలున్నాయి - మనము ప్రతి దినం చేసే పనులలో ఏది వివేకము ఏది అవివేకము- అనే తేడాలు మనకు బోధిస్తాయి.

చూడండి :

ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండుఁ
జూడఁజూడ రుచుల జాడవేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా
విశ్వదాభిరామ వినుర వేమ !

ఉప్పు, కర్పూరము - రెండూ తెల్లగానే ఉంటవి. అయితే యేం - ఉప్పురుచి వేరు - కర్పూరం రుచివేరు - వాసనకూడ వేరే -

ఆవిధంగానే మనుష్యులలో గూడా మంచివాళ్ళూ చెడ్డవాళ్లూ - చూడడానికి పైకి ఒకే మోస్తరుగాఉన్నా — మెవరిగుణం వారిదే.

ఈ రెండు శతకాలూ - అడుగడుగునకు వెంట ఉండి మన నడవడికను తీర్చిదిద్దే స్నేహితులవలె అనుసరిస్తాయి- మనకు యేసంశయము కలిగినా విడదీసి తోవజూపుతాయి.

## కుచేలుని కథ

తర్వాత కుచేలోపాఖ్యానం నాకు బాగా నచ్చింది. అనేకసార్లు అదేపనిగా చదివినాను- పూర్వకాలంలో కుచేలుడను బ్రాహ్మణుడు ఉండేవాడు. అన్ని చదువులూ చదివినవాడు. దేవునిమీద గొప్ప భక్తికలవాడు — అందరినీ ప్రేమించేవాడు — కోపం అంటే ఏమిటో ఎన్నడూ ఎరుగడు - ఎన్నికష్టాలు వచ్చినా ఓర్చుకొనే వాడు — అయితే మిక్కిలి బీదవాడు — అన్ని మంచి గుణములు కలిగిన ఆయనకు 27 గురు పిల్లలు అయినప్పటికీ, తన తిండికై ఇతరులను యాచించి — పీడించక — తనకు లభించిన దానితోనే కలో గంజో కాచుకొని తిని, తన కుటుంబాన్ని ఎట్లాగో పోషించుకొంటూ ఉండేవాడు. పిల్లలు ఎక్కువ అయిన కొద్దీ, అతనికి దొరికినదానితో వాళ్ళ ఆకలి తీరేదికాదు - అందువల్ల కుచేలుని భార్యను పిల్లలు అన్నంకోసం అడుగుతూఉంటే ఆమె ఏమీచేసేది లేకపోయింది.

అందుచేత కుచేలునితో భార్య ఇట్లా అంది! "చిన్నతనంలో కృష్ణుడు మీకు సహవాసిగదా ! ఆయన చాలా దయగల వాడు గదా! ఆయన ఇప్పుడు ద్వారకానగరంలో ఉన్నాడుగదా ! మీరు పోయి మన బీదతనం చెప్పి ఏదైనా సహాయం పొందిరండి" అని.

కుచేలుడు ఆమె సలహాకి సంతోషించి, ద్వారకా నగరానికి ప్రయాణం అయ్యాడు - అంత గొప్ప వానిని చూడబోయేటప్పుడు ఏదైనా కానుక తీసికొనివెళ్ళాలిగాని ఉత్త చేతులతో పోరాదుగదా!

కాని ఏమీ లేదు - అందుచేత ఆయన భార్య తమయొద్ద ఉన్న కొద్ది అటుకులను అయన ధరించిన చింకిరి గుడ్డకు మూటకట్టి యిచ్చింది.

కృష్ణుడు దేవుడు — ఆయనకు కావలసినంత ధనం- ధాన్యం. పాడి — పంట - పశువులు - గుర్రాలు - ఏనుగులు - రథాలు — అన్నీ ఉన్నాయి; రాజ్యం కూడా ఉంది - అంత గొప్ప ప్రభువు గదా-ఆయన దర్శనం తనకు అసలు అవుతుందా లేదాయని కుచేలుడు సంశయంతో ద్వారకా నగరం చేరినాడు.

చింపిరి గుడ్డలు కట్టుకొన్న ఆ పేద వానిని చూడగానే కృష్ణుడు తన సింహాసనం మీదనుంచి దిగి ఎదురుగాపోయి, కౌగలించుకొని, ప్రేమపూర్వకంగా తన ప్రక్కను కూర్చుండబెట్టుకొని ఆదరించాడు. కుచేలుని పాదాలను బంగారు చెంబులోని నీటితో కడిగి, ఆ కడిగిన నీటిని కృష్ణుడు తన శిరస్సుమీద చల్లుకొన్నాడు - ఇంకా ప్రయాణం వల్ల కలిగిన దేహశ్రమ పోవునట్లు - కస్తూరి - పచ్చకర్పూరంకలిపిన మంచిగంధం ఆతని దేహమునకు పులిమి విసనకర్రతో విసిరి ఆతని శ్రమను తీర్చాడు. తరువాత తలంటిపోసి, రుచికరమైన ఆహారములతో విందులు చేసినాడు - మెత్తని పరుపులు గలిగిన తన మంచముమీద పరుండబెట్టి కృష్ణుడూ-ఆయన భార్య — కుచేలునికి ఉపచారాలు చేశారు. నిద్రలేచిన తర్వాత తామిరువురు చిన్నప్పుడు సాందీపుడు అనే మేష్టారు వద్ద చదువుకొనేటప్పుడు, గురువుకు దర్భలు, సమిధలు తెచ్చుటకై అరణ్యానికి పోవడం - వానలో తడియడం - బడికి తిరిగి చేరలేక పోవడం - గురువే స్వయంగా అడివికి వచ్చి తమరిని తీసి కొని పోవడం - ఇట్లాంటి వాటిని చిన్ననాటి సంగతులను అన్నిం టినీ చెప్పుకొన్నారు.

చిన్ననాటి స్నేహితుణ్ణిగదా! నాకు ఏమైనా కానుక తెచ్చి నావా? యని కృష్ణుడే కుచేలుణ్ణి అడిగాడు. కుచేలుడు తాను తెచ్చినటు వంటి సాధారణ వస్తువుని కృష్ణునకు కానుకగా ఇవ్వడానికిసిగ్గుపడ్డాడు- కృష్ణుడు ఈ సంగతిని గ్రహించి, ఆతని చింకిరిగుడ్డలో ఉన్నమూటను

విప్పి, గుప్పెడు అటుకులను తిన్నాడు - రెండవ గుప్పెడుతినబోగా, భార్య అడ్డుపడింది- కుచేలునకు ఎంత గొప్ప సంపద అయినా ఇవ్వ డానికి తిన్న ఆ ఒక్క గుప్పెడు అటుకులే చాలునని చెప్పింది.

మర్నాడు కుచేలునికి ఏమీా ధనంగాని ధాన్యంగాని ఇవ్వ కుండానే పంపివేసినాడు- కుచేలుడు అడిగిందీలేదు- కృష్ణుడు ఇచ్చిందీలేదు.

తనకు ఏమీా ఇయ్యకపోవడం కృష్ణునకు దయలేకకాదు. ధనం - ధాన్యం ఇస్తే-ఆ సంపద చేత - కన్నుగానక - భగవం తుని మీాద ఉన్న ప్రేమ నశించి, తాను చెడిపోతానేమో అనే భయంచేతనే తనకు ఏమీాఇయ్యలేదని కుచేలుడు, తృప్తిపడ్డాడు.

అయితే - కుచేలునిభార్య- ధనం - ధాన్యం కోరిందిగదా - కృష్ణుడు ద్వారకానగరంలో కుచేలుడు తెచ్చిన గుప్పెడు అటుకులు తినగానే, అక్కడ కుచేలుని స్వగ్రామంలో - కుచేలుని పూరికొంప గొప్ప బంగారుమేడ అయింది; ఉద్యానవనాలు — అందులో చెరు వులు - నౌకర్లు - కావలసినంత ధనం - ధాన్యం — సకలమైన సంప దలు - అన్నీ ఏర్పడినాయి. ఓహో! ఇక లోటు ఏమీాలేదు.

కుచేలుడు ఇంటికి తిరిగి వచ్చేసరికి - ఇల్లే కాకుండా పెళ్ళాం— బిడ్డలు - ఎవ్వరూ ఆనమాలు కట్టేటట్లుగాలేను - ఇల్లు ధనం ధాన్యాలతోను, పాడిపశువులతోను- పెళ్ళాంబిడ్డలు విలువగలబట్టలు నగలతోను కలకలలాడారు.

ఈ కథవల్ల నేను నేర్చుకొన్నది ఏమంటే! దేవుడు దయా మయుడు- ప్రేమస్వరూపుడు. మనంఆయన వైపు మనస్సుమళ్ళించి, ఎంతస్వల్ప మయినది అయినా, ఇవ్వగలిగినది అంతా ఇచ్చినట్లయితే మనము అడగ కుండానే మనకు కావలసినదంతా, ఆయన మనకు ఇస్తాడు. ఈవిషయం బాగా గ్రహించినవారు ఈ లోకంలోనూ పర

లోకంలోను కూడా శాంతి - సౌఖ్యము - ఆనందములతో తులదూగుతూ ఉంటారు.

## ప్రకృతి దేవుని ప్రతికృతి

మేము శెట్టిపేటలో ఉన్నామని చెప్పానుగాదూ? మా ఇంటికి ముందే గోదావరినుండి నీళ్ళు పారే పెద్ద కాలువ ఉన్నది — ఆకాలువ నీళ్ళల్లో సూర్యచంద్రుల బింబాలు ప్రతిఫలిస్తూ ఉండేవి-కాలువగట్టున ఉన్న పెద్ద పెద్ద చెట్ల నీడలుకూడ - నీళ్ళల్లో అగుపడుతూ ఉండేవి. ఆకాశంలో ఉండే మబ్బులు మెల్లిగా కదులుతూ ఉండడం కూడ ఆ నీళ్ళలో అగుపడేది. ఆ కాలువలోచూస్తూ, సూర్య చంద్రుల్ని గురించి ఆలోచించే వాడిని. పురాణాలలో వర్ణించిన మహానదులు నాకుఎంతో ఉత్తేజాన్ని కలిగించేవి.ఈనీటి కాలువనే ఆ మహానదులతో పోల్చుకొనేవాడిని- పురాణాలలో వర్ణించివ వనాలు నాకు ఎంతో ఆనందాన్ని కలింగిచేవి. ఆ వనాలలో వర్ణించిన చెట్లు - నీటి కాలువ గట్టుమీద ఉన్న పెద్దపెద్ద చెట్లవంటివేగదా అనుకునే వాడిని.

ఆకాశం అంత ఎత్తున పెరిగి, వంకరటింకరగా వయ్యారాన్ని వెదజల్లుతూ ఉండేవి మఱ్ఱిచెట్లు — జడలు భూమిపైకి విరియబోసుకొని విశాలంగా చలువపందిరిలాగావుండేవి. ఆకాలువగట్టుమీద చెట్లు ఆ కాలువగట్టుమీద ఈ విచిత్రాలను అన్నింటినీ చూస్తూ గంటల కొలది ఎంతోదూరం సాగిపోతూ కాలక్షేపం చేసేవాడిని.

## పుస్తకాలలోని ప్రేమతత్వం జీవితంలో అనుభవానికి రావాలి

ఇవన్నీ ప్రకృతిలో మనకు కనబడే సౌందర్యాలు. పుస్తకాలు చదవడంవల్లకూడా ఆనందానుభూతి కలుగుతుంది. ఊరికే పుస్తకాలు చదివినంతమాత్రంచేత లాభంలేదు— ఆ పుస్తకాలలోని విషయాలు కొంతవరకైనా మన జీవితంలో అనుభవంలో పెట్టాలి - అప్పుడే నిజమైన ఆనందం కలుగుతుంది.

మీ వయస్సులో నేను చదివిన పుస్తకాలవల్ల - విన్న పాటలు - కథలు మొదలైన వాటివల్ల నేను నేర్చుకొన్న విషయాల

సారం మీకు చెప్పానుమరి! పర్వతాలు— చెట్లు— చేపలు – పక్షులు— జంతువులు – మనుష్యులు – అన్నింటిలోను — దేవుడు నిండియు న్నాడు. ఆయన శక్తి — మహిమ – అన్నింటిలోను ఉన్నాయి. అందుచేత వీటి అన్నింటినీ దయతోనూ ప్రేమతోనూ చూడడం నేర్చుకొన్నాను – చెట్లను నిర్దయతో నరుకుతాము – వాటికి ప్రాణం ఉన్నది– అవీ మనకుమల్లేనే బాధపడతాయి– జంతువులను క్రూరంగా చూస్తాము — వాటిని దయతో చూస్తే మనకు ఎంతోసేవ చేస్తాయి. తోటి మనుష్యులను నీచంగా చూస్తాము. ఇతరులను మనమునీచంగా చూస్తే — వాళ్ళు మనలను నీచంగానే చూస్తారు. ఇతరులను మనము ప్రేమగా చూస్తే — వాళ్ళు కూడా మనలను ప్రేమగానే చూస్తారు. అంటే – ఒక్క మాటలో చెబుతాను. ఇతరులకు మనము ఏమి ఇస్తే, అదే ఎన్నోరెట్లుగా పెరిగి మనకు తిరిగి వస్తుంది – ఇదే ప్రేమ తత్వం – దేవుని స్వభావం.

11–3–1955 న "బాలుర నుద్దేశించి" విజయవాడ "ఆలిండియా రేడియో" నుండి అయ్యంకి వెంకటరమణయ్యగారిచే ప్రసారితమైన ఉపన్యాసము.

---

# చదువు అనే ఆట ఎట్లా ఆడుకోవాలి

మనమంతా చిన్నప్పుడు ఆటలు ఆడుకొన్నవాళ్లమే! ఇప్పటికీ పెద్దవాళ్లమైన మనకు ఆటల సరదా తీరిందా! "లేదు" అని ఘంటా పథంగా చెప్పగలను. అయితే చిన్నతనంలో ఆడుకొనే ఆటలు ఒక రకంగా ఉంటాయి; ఇప్పుడు ఆడుకొనే ఆటలు మరొక రకంగాఉండి ఉన్నతస్థాయిలో ఉంటాయి. కాని అప్పుడు ఆడుకొనేవాటికి, ఇప్పుడు ఆడుకొనేవాటికి పరమార్థం ఒక్కటే.

## ఏమిటా పరమార్థం

మనకు— ఉత్తేజం, విజ్ఞానం, ఆనందం కలుగజేయుడమే ఆ పరమార్థం. కాని ఆ ఆనందం, ఉత్తేజం తాత్కాలికమైనవిగా ఉండ

రాదు. వానిపర్యవసానం విజ్ఞానంగారూపొందాలి; అవి స్థిరమైనవిగా ఉండాలి. అవిభౌతికస్థాయినిపా్రరంభించి ఆధ్యాత్మికస్థాయికి, ఉన్నతికి, తీసుకొని పోయేవిగా ఉండాలి.

చూడండి – చిన్నతనంలోనే ఆటలకెల్ల గొప్పదైన ఆటను నేను నేర్చుకొన్నాను. అదే "చదువు" అనే ఆట. ఈమాట వినగానే "ఛీ!" చదువుకూడా ఒక ఆటేనా? చదువుకోకపోతే చిన్నప్పుడు మేష్టారు కొట్టేవారు. మా నాన్న చెవులు ఎక్కదీసేవారు. ఇటువంటి ఆట 'మా కొద్దు" అని మీకు వెంటనే గోచరిస్తుంది, అది మానవ సహజ స్వభావం. అయితే, మీరుచెప్పినదీ కాదనడానికి వీలులేదు, చదువు అన్నా, పాఠశాల అన్నాభయపడేటట్లు చేశారు– యిటీవల మన పెద్దలు.

కాని నా అనుభవంవేరు. చదువుఅనే ఆట చిన్నవారికైనా, పెద్దవారికైనా అలవాటు అయిందాకానేగాని, ఒకసారి అలవాటు అయింకా – యిక దానిని విడిచిపెట్టలేము. చదువుఅనే ఆట ఎంతో మజాగా వుంటుంది.

## పుస్తకాలమీద రుచి

నా చిన్నతనంలో మా యింటిలో చాలా పుస్తకాలు ఉండేవి. కొన్ని పత్రికలుకూడా వచ్చేవి. వాటిలో కొన్నిటిలో బొమ్మలుకూడా ఉండేవి. నా తండ్రిగారు "శెట్టిపేట" అనే గ్రామములో "డెల్టా సూపరింటెండెంటు"గావుండేవారు.ఆ వూళ్ళో క్రైస్తవ మిషనరీలు - ముఖ్యంగా స్త్రీలు ఉండేవారు. వారు తీరిక సమయాలలో మా యింటికి, నాన్నగారు లేనిసమయములో, వచ్చి పాటలు పాడేవారు. కథలుచెప్పేవారు. ఆ చుట్టుపక్కల యిండ్లవారువచ్చి, వినేవారు. వారితోబాటు నేనూ వినేవాడిని. ఆ క్రైస్తవమిషనరీలను "మిస్సమ్మలు" అని పిలచేవారు. వారు మాయింటికి వచ్చినప్పుడల్లా నన్ను యెంతో ఆకర్షించేవారు. వారూ నన్ను యెంతో

ఆదరంగా చూచేవారు. పర్యవసానంగా నేను ఆ "మిస్సమ్మల" యింటికి తరచు వెడుతూండేవాడిని. వారు నాకు పెద్ద పెద్ద బొమ్మల పుస్తకాలను చూపడమేకాకుండా, ఉచితంగాకూడా యిస్తూండేవారు. ఒకసారి ఏసుక్రీస్తు జీవితాన్ని చిత్రించిన పెద్దబొమ్మల పుస్తకాన్ని యిచ్చారు. బొమ్మలను చూడడమంటే చాలా సరదాగావుండేది. నాకు. గంటలకొలది ఆ పుస్తకాలలోవుండే బొమ్మలతో మాట్లాడుతూ వుండేవాడిని.

## అంతకుపూర్వం సంస్కృతి

అప్పటికి నా వయస్సు పది సంవత్సరాలు. నాయనమ్మ సుందరమ్మగారియొద్ద రాత్రిళ్ళు పడుకొనేవాడిని. ఆమెకు యెన్నో వందలు పాటలువచ్చును. అన్నివేళలా అన్నిపాటలూపాడేది. పరుండబోయేముందర పాడి నిద్రబుచ్చేది. తెల్లవారగట్ల మేలుకొలుపులు-స్తోత్రాలు పాడేది. ఏదిపాడినా ఆమె యశోదగా నన్ను చిన్నికృష్ణునిగా భావించుకొని పాడుతూండేది. అందుచేతఒక్కొక్కసారి నాకును తన్మయత్వంకలిగి నేను కృష్ణత్వాన్ని అనుభవించేవాడిని. ఇట్టి పూర్వపుసంస్కృతివలన, అపూర్వానుభూతివలన ఏసుక్రీస్తుబొమ్మలు చూస్తూవుండేవాడినే గాని, అవి చిన్నికృష్ణుని పరంగానే నా కళ్ళ ద్వారా నా మనస్సునందు హత్తుకొనేవి.

## "చదువు" అనే "ఆట"కు ప్రారంభం

నాన్నకు కొన్ని ఇంగ్లీషుపత్రికలు వచ్చేవి. కొన్ని తెలుగు పత్రికలూ వచ్చేవి. పుస్తకములు యింట్లో ఉండనేయున్నవి. పుస్తకాలలోని, పత్రికలలోని పేజీలు ఊరికేతిరగ వేస్తుంటే, బొమ్మలు చూస్తూంటే - ఇంకా యింకా చూడాలనిపించేది. ఎంత చదివినా తనివి తీరేదికాదు. "దేశోపకారి", "జనరంజని", "సత్యవాదిని", "ప్రబుద్ధభారతి"- యీ రీతిగా అనేక పత్రికలను చూచేవాడిని.

వాటిలో మంచికథలు, వినోదాలు యింకా ఏమేమో వుండేవి. వీటిని అన్నింటినీ తిరగవేస్తూంటే, చదువుతూవుంటే, మామూలుగా ఆటలు ఆడితే కలిగే సంతోషంకంటే ఎక్కువగానే ఆనందం కలిగేది. ఈ రీతిగా చదువు అనే ఆటయందుగల రుచిని నా చిన్నతనంలోనే చూడగలిగినాను.

## పాఠశాలల్లో పుస్తకాలు

మన మామూలు పాఠశాలలలో 'పాఠాలుగా' చదువుకొనే పుస్తకాలు కొన్ని ఉంటాయి. ఆ పుస్తకాలను బలవంతంగా చదివిస్తారు. ఒకపూట వంట్లో బద్ధకంగావుండో లేక యితరవ్యాపృత్తి వల్లనో చదవకపోతే స్కూలులో మేష్టారూ, యింటియొద్ద తల్లిదండ్రిలూ కఠినంగా శిక్షిస్తారు. అందుచేత చదువు అంటే ఒక పెద్ద "దెయ్యమో", "భూతమో" అయిపోయినది. కాని అట్టిచదువునందు బుద్ధిచొరబడి, రుచి కలిగిందా, యిక విడిచిపెట్టడానికి బుద్ధి పుట్టదు.

## జంతువులు చదువుకున్నాయా ?

జంతువులు—వానికితోచినట్లు పనులు చేసుకొని పోవడమేగాని, ఆలోచించే విచక్షణాజ్ఞానం వానికిలేదు. జంతువులకులేని అద్భుతమైన శక్తులు మానవులకు ప్రకృతిసిద్ధముగ లభించినాయి. అవే ఆలోచించేశక్తి- తెలివితేటలు—విచక్షణ—ఈ శక్తులన్నీమానవులలో అణగి మణగి ఉన్నాయి. ఆ అణగియున్న శక్తులను మనము చదువుచేత మేల్కొల్పాలి. అనగా విజృంభింపజేయాలి.

## జ్ఞానం

అందుకు జ్ఞాన మవసరం. జ్ఞానం అనంతంగా వున్నది. జ్ఞానాన్ని అంతనీ మనము పరిశోధనలుచేసి, తెలిసికోవాలి అని అంటే దానికి ఒక జన్మచాలదు. అనాదికాలంనుండి పండితులు, ఋషులు—త్రికాలవేదులు—అయినట్టి పరమపురుషులు, వారివారి పరిశోధనలు

చేతను, అనుభవాలచేతను సంపాదించిన జ్ఞానాన్ని గ్రంథస్థంచేసి, వారి అపారకరుణచే మనకు ఇచ్చారు.

## "తాహతు"ను బట్టి పుస్తకాలు

అన్నిపుస్తకాలు అందరికీ అవసరంలేదు. జ్ఞానం అనంతంగా యున్నది అని చెప్పానుకాదూ! అనేక శాస్త్రాలు ఉన్నవి. అనేక దేశాలు ఉన్నవి. అనేక వృత్తులు వున్నవి. అనేక పరిధు లున్నవి అంతేగాక గ్రంథసంచయం అనంతంగా ఉన్నది.

కాబట్టి మనకుండే తాహతునుబట్టి, అవసరాలనుబట్టి—గ్రహించుటకు మనకుగల శక్తినిబట్టి—పుస్తకాలను ఏరుకోవాలి. పుస్తకాలను చదివి మనలో అణగియున్న తెలివితేటలను, దైవశక్తులను అభివృద్ధి చేసుకోవాలి.

## ఏ విషయాలు తెలుసుకోవాలి?

గొప్ప భక్తులయొక్క చరిత్రలు, శాస్త్రవేత్తలయొక్క పరిశోధనలు, లలితకళలయొక్క సౌందర్యాతిశయములు, పరిశ్రమల యొక్క విన్నాణములు, రాజ్యాంగముయొక్క లోతుపాతులు—ఆ విషయం, ఈ విషయం అనే తేడాలు లేకుండా —ఈ రీతిగా మనిషి తెలివితేటలు అభివృద్ధి కావడానికి కావలసిన అన్నివిషయాలను ఆకళింపు చేసుకోవాలి.

## ఎందుకు తెలుసుకోవాలి?

అట్లు మనకు కావలసిన అగత్యమైన అన్నివిషయాలను గురించిన జ్ఞానమును సంపాదించి, లోకవ్యవహారమునకు ఎల్లప్పుడు సిద్ధముగా ఉండాలి. అట్లు తెలుసుకొనకపోతే తోడి మనుష్యులకంటె వెనుకబడిపోతాము. ఏదైనా ఒక కార్యమును తలపెట్టిన యెడల, దానికి కావలసిన విషయాలను తెలిసికోలేకపోతాము. ఇతర దేశాల ప్రజలకంటె మనం వెనకబడి పోతాము.

మనం చదువుకొనే క్లాసులో ఒక తెలివితక్కువ పిల్లవాడు ఉన్నాడనుకోండి. లేక మనము వ్యవహరించే సంఘములో ఒక తెలివి తక్కువ మనిషి ఉన్నాడనుకోండి. వారి తెలివి తక్కువను చూచి తోడివాళ్లు వెక్కిరిస్తారా! లోకువ చేస్తారా! హేళనచేస్తారా? అత నంటే గౌరవం లేకుండా పోతుందా! మరి!

## మా ర్గ ద ర్శ కు లు

మనము జ్ఞానాన్ని సంపాదించుకోవాలని, తద్వారా తెలివి తేటలు సంపాదించుకొని గొప్పవాళ్ళం కావాలని అనుకొంటే- ఆవిధంగామహాపురుషులు అయినవారి చరిత్రలు, వారి అనుభవాలతో సహితంగాపుస్తకాలలో మనకు సిద్ధంచేసిపెట్టారు గదా!

శ్రీరామచంద్రుడు, గోపాలకృష్ణుడు, నటరాజు, ఏసుక్రీస్తు, మహమ్మదు మొదలయిన దేవుళ్ళయొక్కయు - హనుమంతుడు, ప్రహ్లాదుడు, కబీరు, కుమ్మరి మొల్లమొదలగు మహాభక్తుల యొక్కయు-త్యాగరాజు, క్షేత్రయ్యమొదలయినకళాకారుల యొక్క యు - కృష్ణదేవరాయలు, శివాజీ, అక్బరు మొదలయిన చక్రవర్తుల యొక్కయు- పరదేశీయుల పాలనలోనుంచి మన దేశాన్ని విడిపించ డానికి పోరాడిన ఝూన్సీలక్ష్మిభాయి, నానాఫడ్నవీసు, తాంతియా తోపి, కుదీరాంబోసు, సుభాస్‌చంద్రబోసు మున్నగు విప్లవవీరుల యొక్కయు- దాదాభాయి నౌరోజీ, గోపాలకృష్ణగోఖలే, బాలగంగా ధరతిలక్, లాలాలజపతిరాయి, ఆనీబిసెంటమ్మ మున్నగు రాజకీయ వేత్తలయొక్కయు మోతీలాలునెహ్రూ,వల్లభాయిపటేలు,మహాత్మా గాంధి, కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, పొట్టి శ్రీరాములు మొదలగు దేశనాయకులయొక్క యు- కందుకూరి వీరేశ లింగం పంతులు, గురజాడ అప్పారావు, భండారు అచ్చమాంబ మున్నగు సారస్వత సేవకులయొక్కయు- చరిత్రలను తెలుసుకోవాలి. వారి అనుభవాలను మనస్సులకు పట్టించుకోవాలి. ఇట్లా అన్ని

తెలుసుకొంటేనే మనము విజ్ఞానవంతులమై గొప్పవాళ్ళము అవుతాము.

అబ్బో! ఎంతపని ఉన్నది! ఇంతటి ఘనకార్యం మనము చేయగలమా! అని సందేహించ నక్కరలేదు. దీని అంతటికీ కీలకపూస, "చదువు అనే ఆట"ను అలవరచుకోవాలి.

## ఎన్నాళ్ళు చదవాలి ?

అయితే జ్ఞానవంతులు కావడానికి తెలివితేటలు సంపాదించుకోవడానికి పుస్తకాలు చదవాలి అని తెలుసుకొన్నాము. కాని ఎన్నాళ్ళు చదవాలి? "చచ్చేదాక" చదవాలని మనపెద్దలు చెబుతారు. అంటే చిన్నప్పుడు పాఠశాలలో చదువు నేర్చుకొంటే చాలదు. క్రొత్తపరిశోధనలు, క్రొత్తచరిత్రలు, క్రొత్తలోకాలు, క్రొత్త శక్తులు—ఈ రీతిగా మానవుని విజ్ఞానం అనంతంగా పెరిగిపోతున్నది. అందుచేత వయస్సుమీరి పెద్దలు అయినకొలదీ విజ్ఞానాన్ని కూడా చదువు అనే ఆటద్వారా పెంపొందించుకొంటూ పోవాలి.

పెద్ద అయినతర్వాత పుస్తకాలద్వారా — పత్రికలద్వారా — బాల్యంలో చదువుకొన్న ఆ చదువును బూజుపట్టకుండా, నిరంతరం కొనసాగిస్తూ ఉండాలి. లేకపోతే అంతవరకు చదువుకొన్న చదువు బూడిదలో పోసిన పన్నీటివలె నిరర్థకం అవుతుంది. కత్తికి వాయి నిలచి ఉండాలంటే అప్పుడప్పుడు దానికిపదునుపెడుతూఉండాలి కదా! లేకపోతే అది బండబారిపోతుంది గదా! అదేరీతిగా చదువుతోబాటు మనస్సునకు కూడా ఉత్తేజం కలిగించుతూ, ఆలోచనాశక్తిని నిరంతరం పెంపొందించుకొంటూ ఉండాలి. లేకపోతే మనస్సు మందగతిని పొందుతుంది. తెలివితేటలు మొద్దుబారి పోతాయి.

## అబ్బో! ఎన్ని పుస్తకాలు ?

విజ్ఞానాన్ని వికసింపజేసే పుస్తకాలు అన్నివిషయాలమీదా — అన్నిభాషలలోను అనంతంగా బయలుదేరుతున్నాయి. ఈ కాలంలో

అచ్చు సౌకర్యం మూలాన్ని ప్రయాణసౌకర్యం మూలాన్ని పుస్త కాలు అన్నీ చాలా తక్కువ ఖరీదుకు దొరుకుతున్నాయి. ఎట్టి కఠిన మైన విషయం అయినప్పటికీ, ఎంతక్లిష్టమైన సమస్య అయినప్పటికీ పెద్దవాళ్ల కేగాక చిన్నపిల్లలకు గూడా సులభంగా అర్థంకావడానికి గాను ప్రత్యేకంగా కథల రూపంగాకూడా పుస్తకాలు ఉన్నాయి.

భాగ్యవంతుడైనవాడు ఒక వందపుస్తకాలు కొని చదువుతా డనుకోండి. అంతటితో తీరిపోలేదే - ప్రతిసంవత్సరం విజ్ఞానవేత్తలు సరికొత్త పుస్తకాలను వ్రాసి వేలకువేలు అచ్చువేయిస్తున్నారు. అందుచేత కొన్నాళ్లు అయ్యేటప్పటికి మంచిపుస్తకాలతో బాటు చెత్తపుస్తకాలుకూడా అసంఖ్యాకంగా పెరిగిపోతున్నాయి. అట్లు పెరిగిపోతున్న ఎన్నోపుస్తకాలలోనుంచి మంచిపుస్తకాలను ఏరు కోవడంకూడా అవసరం అవుతూన్నది.

ప్రతిసంవత్సరం బయలుదేరే లెక్కలేనన్ని పుస్తకాల నన్నిం టిని ఎంతటి భాగ్యవంతుడైనా కొనలేడు. ఒకవేళ అట్లు కొనగలి గినా వాటిని జాగ్రత్తపెట్టడానికి బీరువాలు— ఆ బీరువాలను పెట్టు టకు పెద్ద భవంతి - కావాలిగదా! ఒకవేళ ఏ భాగ్యవంతుడైనా ఎన్నో కావలసినన్ని బీరువాలను సంపాదించి పెద్ద భవంతిని కట్టించి అన్నిపుస్తకాలను దానిలో పెట్టించినాడని అనుకోండి. ఈ రీతిగా కొన్నివేల పుస్తకాలు చేరేటప్పటికి అందులోనుండి మనకు కావల సిన విషయాన్ని గురించి, మనము కోరిన గ్రంథకర్త వ్రాసిన పుస్త కాన్ని ఏరుకోవడం సులభమయిన పనిగాదు.

ఇంకోకష్టంకూడా ఉన్నది పుస్తకాలను బీరువాలలో పెట్టి వానికేసి చూడకపోతే, వాటికి పురుగులుపట్టి చిమ్మెటలుకొట్టి చెడి పోతాయి. అందుచేత బీరువాలను, పుస్తకాలను, దుమ్ముదులుతూ ఉండాలి. అయితే మనలోమాట - అన్నిపుస్తకాలను అందరూ కొను క్కొనగలిగియుండరు గదా! అన్ని పుస్తకాలను ఒక వేపునుండి ఇంకొక వేపుదాకా చదవాలంటే మాత్రం ఎట్లా కొనసాగుతుంది?

## ధర్మ గ్రంథాలయాలు

పుస్తకాలను పత్రికలను జనసామాన్యానికి అందరికీ అందు బాటులో ఉండేలాగున చేయడానికై పట్టణాలలోను పెద్ద పల్లెలలోను ధర్మ గ్రంథాలయములనీ, పఠనమందిరాలనీ స్థాపిస్తున్నారు. అవి కూడా చదువుకొనడానికి పాఠశాలలవంటి వన్నమాట. అయితే కొద్దిసంవత్స రాలుమాత్రమే కాకుండా జీవితమంతా మన చదువును కొనసాగించే పాఠశాలలు అవి. ఈ పాఠశాలలో మొఖం జేవురించుకొని బెత్తం చేత బుచ్చుకొని నడిపించే ఉపాధ్యాయు లుండరు. అక్కడ వుండే ఉపాధ్యాయునికి "గ్రంథభాండాగారి" అని పేరు. ఆయన మిక్కిలి శాంతమూర్తి. దయామయుడు. ఆయన ముఖం కలకలలాడుతూ చిరునవ్వులు ఒలకబోస్తూ వుంటుంది, మీకు కావలసిన విషయానికి సంబంధించిన పుస్తకాన్ని వెదికి యిస్తారు. విసుగుకొనరు. అట్టి ధర్మ గ్రంథాలయాన్ని అందరికీ అందుబాటులోవుండే స్థలంలో స్థాపిస్తు న్నారు. మంచిపుస్తకాలేవో చెత్త పుస్తకాలేవో పరిశీలించి మంచి పుస్తకాలనే ఆ గ్రంథాలయాలలో పెడతారు.

### పుస్తకాల వర్గీకరణం

పుస్తకాలు అన్నింటినీ — చరిత్రలు, నవలలు, నాటకములు' పురాణములు, కథలు, శాస్త్రములు, కళలు, పరిశ్రమలు ఈ రీతిగా ఆయా పుస్తకాలలో ఉండే విషయాలనుబట్టి, వానిని విభాగంచేసి, ఆ ప్రకారమే గ్రంథవివరణ పట్టికను తయారుచేస్తారు. అట్టిపట్టికలో మీకు కావలసిన విషయాన్నిగూర్చిన గ్రంథాలను చూచుకొని, ఆ ప్రకారం బీరువాలయొద్దకు బోయి, అందులో మీకు కావలసిన పుస్తకాలను పరిశీలించి ఏరుకొని తీసుకొనవచ్చును. ఇదేరీతిని పుస్త కాల పేర్లనుబట్టి, పుస్తకాలను వ్రాసిన గ్రంథకర్తలను బట్టికూడా అకారాదిగా గ్రంథాలపట్టికలు వుంటాయి అయితే బీరువాలలో మాత్రం విషయాలనుబట్టి విభాగంచేసి పుస్తకాలను ఉంచుతారు.

గ్రంథాలయంలో పుస్తకాలేగాక పటాలు, మ్యాపులు సంపాదించి పెడతారు. వానినిబట్టి పలువిషయాలను కంటితో చూచి నేర్చుకొనవచ్చును. పాఠశాలలో చదివే చదువును సుఖవంతం అయ్యేలాగున గ్రంథభాండాగారి చేస్తారు. అప్పుడే చదువు అనే ఆట ఎట్లా వుంటుందో తెలుస్తుంది.

## వార్తాపత్రికలు

ఈ ప్రపంచం అంతా ఎంతో విశాలం అయినది; దీనిలో ఎన్నో దేశాలు ఉన్నాయి. వాటిలో ఎన్నో భాషలు మాట్లాడుతారు. ఇది అంతా వేలకువేలు మైళ్ళు దూరంకలది. ఇంత గొప్పప్రపంచములో జరిగే వార్తలను ఏగంటకాగంట, ఏరోజుకారోజు, ఏవారానికావారం, తెప్పించి మనకు అతిచౌక అయిన ఖరీదునకు అచ్చువేసి అందజేస్తారు. వీటినే దినపత్రికలు, వారపత్రికలు అంటారు. అవీగాక ఆయా దేశాలలోని జ్ఞానులు, వేత్తలు, అనేక విషయాలలో పరిశోధనలుచేసి వ్రాసేవ్యాసాలను- వివిధ రాజ్యాలలోగల మనుష్యులను గూర్చి, ఆచారాలనుగూర్చి, ప్రకృతి విచిత్రాలనుగూర్చి, పరిశ్రమలనుగూర్చి, వ్యాసాలను-కథలను తాజాగా ఏ నెలకానెల అచ్చువేసి, మాసపత్రికలను తయారుచేస్తారు. ఈ దినపత్రికలను, వారపత్రికలను మాసపత్రికలనుకూడా తెప్పించి ప్రతి గ్రంథాలయానికి అనుబంధముగా పఠనమందిరాన్ని కూడా ఏర్పాటుచేస్తారు.

## పరిశోధన విషయాలు

విజ్ఞానవేత్తలుచేసిన పరిశోధనవిషయాలు ముందుగాపత్రికలలో ప్రకటిస్తారు. పత్రికలలో ఆ యా విషయాలనుగూర్చి చర్చలు జరిగిన తర్వాతగాని, పరస్పరము అనుభవాలను సరిచూచుకొన్నతర్వాత కొన్ని సంవత్సరాలకుగాని, ఆయా విషయాలనుగూర్చిన పరిశోధనల విజ్ఞానం పుస్తకాలలోకి ఎక్కించరు. అసలు కొన్ని చర్చలు పుస్తకాలలోనికి ఎక్కకుండానే పోవచ్చును. అందుచేత ఒక్కపుస్తకాలను

మాత్రమే చదివి ఊరుకుంటే చాలదు. తాజాగా దిన, వార, మాస పత్రికలను కూడా చదువుతూనే వుండాలి. లేకపోతేవిజ్ఞానం తాజాగా సంపాదించడంలో తెలివితేటలలో మనము వెనకబడిపోతాము. కాబట్టి గ్రంథాలయం ఎంత అవసరమో పఠనమందిరము కూడఅంత అవసరమే.

## చదువుయొక్క పరమార్థం ఏమిటి?

అక్షరాలు వచ్చినవారికి రానివారికి కూడా పుస్తకాలు చదవడంవల్లా చదివి వినిపించుకొనడంవల్లా, విజ్ఞానం– తెలివితేటలు అబ్బుతాయి. డబ్బు ఉన్నవారైనాసరే– లేనివారైనాసరే– భాగ్యవంతులకు, బీదవారలకుకూడా సమానంగా చదవడానికి అభిలాష కలిగినప్పుడెల్ల, తగినపుస్తకాలు గ్రంథాలయములో అమరుతాయి. పదిమందీ అక్కడచేరి తమతమ అనుభవాలకు క్రొత్తమెరుగులు పెట్టుకొనడానికి అవకాశం వుంటుంది. ఆయా విషయాలనుగూర్చి విజ్ఞానులు, వేత్తలు, వ్రాసిన పుస్తకాలను చదవడంవల్ల మన నిత్యజీవితంలో జరిగే సంగతులు సందర్భాలు, ఎదుర్కొనే సమస్యలు అన్నింటినీ– ఇదిమంచి; ఇదిచెడ్డ అని తెల్సుకొనే విచక్షణాజ్ఞానం కలుగుతుంది.

మనిషి అయి పుట్టినతర్వాత జ్ఞానవిహీనతచే యిబ్బంది కలుగరాదు. వాయువు ఎల్లవారికి యెట్లు స్వాధీనమై ఉందో జ్ఞానముకూడా అట్లు స్వాధీనముకావాలి. ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై వుండునో జ్ఞానముకూడ అట్లు సేవ్యమై ఉండాలి. సూర్య చంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి యెట్లు సౌఖ్యప్రదముగా వుందో జ్ఞానముకూడ అట్లు సౌఖ్యప్రదముగా ఉండాలి. అంతేగాని జ్ఞానం అందుబాటులో లేనికారణంచేత ఏ మనిషీ వెనకబడరాదు. దానికై గ్రంథాలయములోని పుస్తకాలు, పఠనమందిరంలోని పత్రికలు, యెట్టి రుసుములేకుండా గ్రంథాలయ ఆవరణలో కూర్చుండి

చదువుకొనవచ్చును. వారివారి యిండ్లకు తీసుకొనిపోవుటకు మాత్రం స్వల్పంగా చందాలను యివ్వాలి.

## గ్రంథాలయంలో మన ప్రవర్తన

అయితే గ్రంథాలయానికిగాని, పఠనమందిరానికిగాని, పోయి నప్పుడు చాలా మర్యాదగల పెద్దమనిషిగా ప్రవర్తించాలి. అంటే అక్కడ నిశ్శబ్దంగా ఉండాలి. అక్కడ మనకుమల్లేనే అనేకమంది చదువుకుంటూ ఉంటారుగదా! వారందరికీ మనమాటల ధోరణి వల్ల ప్రశాంతతకు భంగం కలుగకూడదు. ఒకరిని త్రోసుకొని ఇంకొకరు వెళ్ళరాదు. పత్రికలను, పుస్తకాలను చదువుకొన్నపిమ్మట యెక్కడ తీసినవానిని తిరిగి అక్కడనే పెట్టివెయ్యాలి. పత్రికలను పుస్తకాలను చదువుతూన్నప్పుడు వానిని మడతలుగా ముందుకు వెనుకకు మడచివేయరాదు. అట్లుచేయుటవల్ల అతిత్వరగా పాతపడి పోతాయి; అట్టలు నలిగిపోతాయి, చినిగిపోతాయి; ఊడిపోతాయి; మనచేతులు శుభ్రముగా ఉంచుకోవాలి; లేకపోతే అవి మురికి అయి పోతాయి. పటములమీద బొమ్మల మీద చేతులు ఆనించి చూడ రాదు. వేళ్ళతో తడిపి చూడరాదు; అందువల్ల అవి మాసిపోతాయి; నలిగిపోతాయి, మరకలు పడిపోతాయి.

## పిల్లల కొరకు ప్రత్యేక శ్రద్ధ

పిల్లలే సంఘానికి జీవం; వారియందు అనంతమైన శక్తులు దాగుకొని యున్నాయి. ఈ శక్తులను పాఠశాలలయందే వర్ధిల్లజేయ వలసియున్నది. అయినప్పటికీ సంకుచితములగు పాఠశాలపుస్తకాలను నిర్బంధముగా పఠియించుటయందే పిల్లలయందున్న అనంతమైన శక్తులను అణగద్రొక్కివేయుచున్నారు. అందుచేత పిల్లలలోనున్న శక్తులకు దోహదమిచ్చి వికాసమునొందించి విశాలములగుటకుగాను ప్రత్యేకముగా గ్రంథాలయములందు అవకాశలను గలుగజేయు చున్నారు. కోమలములైనట్టియు పరిశుద్ధమైనట్టియు మనస్సులు గలిగినట్టి

బాల్యదశయందే వారికిమంచి రుచులు కలిగేటటువంటి. మంచిదారులు కనబరచేటటువంటి, పుస్తకాలను అందించి చదివించుటకు గ్రంథాలయాలు విశేషంగా తోడ్పడుతున్నాయి.

## ప్రత్యేక గ్రంథాలయాలే!

ఇందునిమిత్తం పిల్లలకొరకై ప్రత్యేకం గ్రంథాలయాలు స్థాపిస్తున్నారు. అట్టి అవకాశంలేనిచోట్ల పెద్దల గ్రంథాలయాలలోనే "బాలశాఖలు" స్థాపించి అందుకై ప్రత్యేకమైన స్థలమును ఏర్పాటు చేస్తున్నారు. పిల్లలకొరకై ప్రత్యేకమైన పుస్తకాలను, పటాలను, బొమ్మలను, ఆటలను అందిస్తున్నారు. పిల్లలకు అర్థమయ్యేలాగున సులభశైలిలో యెక్కువ బొమ్మలతో ప్రత్యేకం పుస్తకాలను, పత్రికలను తయారుజేస్తున్నారు. వాటిలో ముద్దులు మూటగట్టే బొమ్మలు – మనసునకు ఉల్లాసాన్ని ఉత్తేజాన్ని కలుగజేసే కథలు ఉంటాయి. బొమ్మల సహాయంతోనే చదువు అన్నమాట! బొమ్మలతోనేఆటలుఅన్నమాట! యింకొకసంగతి, గ్రంథాలయంలో గోడల మీద పలువిషయాలనుగూర్చి బోధించే పటాలనుపెట్టి, ఆయా విషయాలను గూర్చి పిల్లలకు విపులంగా చెపుతారు. అంతేగాదు సుబోధకాలు, నీతిబోధకాలు, అయినకథలనుచెప్పి పిల్లల మనస్సులను ఆకర్షించి పుస్తకాలను చదవడానికి వారికి రుచిని కలుగజేస్తారు. పాఠశాలల్లో చదువువల్ల వారికి కలిగిన విసుగుదలను తగ్గించి, చదువుకూడా ఆటఅనే అంశాన్ని వాళ్లు గ్రహించేలాగున చేస్తారు.

## ఆటలు ఎప్పుడు ప్రారంభించాలి?

చిన్నతనంలోనే ఆటలంటే చాలా అభిరుచి వుంటుందని తెలిసికొన్నారుగదా! అందుచేత చదువుకూడా ముఖ్యమైన ఆటగా ఆ వయస్సులోనే హత్తుకొనిపోతే జవితం అంతా సుసంపన్నం అవుతుందిగదా! బిడ్డ పుట్టుకతోనే చదువుప్రారంభిస్తాడు. అలాధ్యానులు!

అక్షరాలు! మాటలు-భాష-నేరుస్తాడు. ఆ వయస్సులోనే పరిశీలనా శక్తికూడా అలవడుతుంది. పిల్లలకు ఏడు సంవత్సరముల వయస్సు లోపుననే వారి భావిజీవితముయొక్క పునాదులన్నియు ఏర్పడవలసి యున్నది. ఆ వయస్సులోనే వారు భగవంతునియొక్క ప్రత్యక్ష స్వరూపులని, బాలల తత్వవేత్తఅగు "మేడంమాంటుసోరీ" చెప్పింది. అందుచేత ఆ వయస్సులోనే ఏర్పడిన-పొందిన—తరిబీతే, వారి భావి జీవిత సౌభాగ్యానికంతటికీ పునాదిగా ఏర్పడుతుంది. అందుచేత చిన్నతనమందే వారికి సన్మార్గాన్ని-సృజనాత్మకశక్తినీ- అలవాటు చేయటానికి "చదువనే ఆటతో" సమానమైన శక్తివంతమైన విషయం మరియొకటి లేదు.

## "చదువనే ఆట" ఎట్లా ఆడుకోవాలి?

చదువనే ఆటను వినోదాలతో రూపొందించాలి. ఎట్లా!

## భూగోళం ఆట

మనకు వైకుంఠపాళీ ఆటవున్నది. చదరంగపు గళ్ళలో నిచ్చెనలు పటములు, పాముల పటములూ, గీసి ఉంటాయి. నలుగురు లేక అయిదుగురు- గింజలు లేక కాయలుతో ఆడుకొంటారు. నిచ్చెన వున్నగడికి గింజ లేక కాయవెడితే అది నిచ్చెనపైన వున్న గడికి ఎగబాకిపోతుంది. పాముశిరస్సు వున్నగడికి మన గింజవెడితే పాము కరచి దాని తోకవున్న గడికి- క్రిందకు దిగజారుతుంది.

ఈ రీతిగా బరోడా కేంద్రగ్రంథాలయంవారు "భారతపాళీ" అను ఆటనుకూడా ఏర్పరచారు. చదరంగపుగళ్ళ అట్టమీద భారత దేశపటం గీసినారు. అందులో నదులను వాని జన్మస్థలాలనుండి సముద్రంలో పడేదాకా చూపినారు. ఒక్కొక్కచోట పర్వతాన్ని కూడా అక్కడక్కడ గళ్ళల్లో వేసినారు. రైళ్ళకూడలి స్థలాలన్నూ, రామేశ్వరం, కాశీరోడ్డును, ఆ రోడ్డుమీదవుండే ప్రముఖమైన పుణ్యా

స్థలాలను వేసినారు. నదీజన్మస్థలం వున్నగడికి మనకాయ వెడితే, అది నదిలోపడి సముద్రంలోకి జారిపోతుంది పర్వతం వున్నగడికి మనకాయవెడితే పర్వతం యెక్కటకై, ఒకవరస ఆటలో పాల్గొనకుండా ఆగి (మిస్) పోవాలి. రామేశ్వరం, కాశీబాట వున్నగడికి వెడితేకూడ పైఊరు వున్నగడికి పోతుంది. ఈ రీతిగా భారత దేశపు భూగోళాన్ని- పిల్లలు ఆటలు రూపంగా ఆడుకొని- నేర్చుకొంటారు.

అదేపద్ధతిని ప్రపంచపటం వేయనచ్చును. ఏ దేశపటమైనా లేక ఆఖరికి ఏ ఊరి పటమైనావేసి, ఆ ఊరి భూగోళాన్ని ఆటల రూపంగా నేర్పవచ్చును. ఒక ఊరి పటాన్ని తీసుకొన్నప్పుడు ఆ ఊరిలోవున్న చెరువులు, బావులు - దేవాలయాలు - పాఠశాలలు- పంచాయతీ ఆఫీసు- ఈ రీతిగా ఆ ఊరిలోవున్న ప్రముఖమైన స్థలాల నన్నింటిని వేయనగును.

## చరిత్ర

అదేరీతిని చరిత్రను ఆటలరూపంగా నేర్పవచ్చును. శివాజీ మహారాజు చరిత్రను తీసుకోండి. శివాజీ చరిత్రలో ప్రముఖమైన వివిధ ఘట్టాలను చదరంగపు గళ్లలో అక్కడక్కడ చిత్రించాలి. ఆ ఘట్టాలలో శివాజీకి అభివృద్ధికరమైన ఘట్టాలు, అనగా ఆయన కోటలను పట్టుకొనుట మొదలైనవి వున్నగళ్లకు గింజవెడితే గళ్లలో ముందుకువెళ్ళుట జరుగుతుంది. శివాజీకి నిరోధకరమైనఘట్టాలుఅనగా శత్రువులకు ఆయన పట్టుబడిపోవుట మున్నగునవి ఉన్నగళ్ళకు గింజ వెళ్ళినప్పుడు ఆటగళ్ళలో అది మొదటికి పోవుట జరుగుతుంది. ఈ రీతిగా ఒక వ్యక్తి చరిత్రను, లేక ఒక గాథను. లేక ఒక కథను, ఆ చదరంగపు గళ్ళల్లో చిత్రించి ఆడించవచ్చును.

## శాస్త్రము

ఒక ఆకాశవిమానం ఆటను ఆడించడం యెట్లాగో చెబుతాను. ఆకాశవిమాన ప్రయాణంలో జరిగే ఘట్టాలు, అనగా పెట్రోలు బంకు; వాయువు యెక్కువగావీచుట, వాయువు సాఫీగా వుండడం

వల్ల అనుకూలపరిస్థితి, తుఫాను, వర్షం, మేఘాలు. కొండ తగులుట మొదలైనవాటిని- ఆయా ఘట్టాలను చదరంగపు గళ్ళల్లో చిత్రించవలెను. ఆకాశయానమునకు అనుకూలపరిస్థితి ఏర్పడిన గడికి వెళ్ళినపుడు, ఆ గళ్ళల్లో ముందుకుపోవుట- నిరోధకపరిస్థితి ఏర్పడిన గడికి వెళ్ళినప్పుడు ఆ గళ్ళల్లో వెనుకకుపోవుట, ఈ రీతిగా ఆటజరుగుతుంది

అదేరీతిని రైలు, మోటారు, సైకిలు, రెండెడ్లబండి మొదలయిన వానినేగాక మరేశాస్త్రవిషయమునైన ఆటలలోనికి దింపనగును.

## ఈరీతి ఆటలలో నా అనుభవం

ఆకాశ విమానం ఆట, రైలుఆట, రాబిన్‌సన్ క్రూసో ఆట, ఈరీతిగా విదేశాలలో ప్రచురితమైన ఆటలు కొన్ని నాయొద్దనున్నవి. మనదేశీయమైన వాటినిగూడ వానిననుసరించి కొన్ని వ్రాయించాను. విజయవాడలోనున్న రామమోహన ధర్మగ్రంథాలయములో బాలశాఖను పదిసంవత్సరముల పై కాలము నిర్వహించినప్పుడు పిల్లలచే యిట్టి ఆటలను ఆడించి చూచినాము. అవి చాల ఉత్తేజకరముగను ఉపయోగకరముగను ఉన్నవి. ద్రవ్యాభావమువలన వానిని ప్రచురింప జాలమైతిమి.

పుస్తకాలు చదువుట ప్రారంభం అయినప్పటినుండి చదువు అనే - అసలు ఆట- ప్రారంభం అవుతుంది. చదివినకొద్దీ ఈ ఆటలో పరిపూర్ణులు అవుతారు.

## ప్రపంచం అనే రంగస్థలం

ప్రపంచం అనే రంగస్థలంలో మనమంతా ఆటగాళ్ళమే. జగన్నాటక సూత్రధారి అయిన ఆ పరమేశ్వరుడు ప్రథమంలో నటరాజుగా ఆవిర్భవించి, తాను నాట్యంతో ఈ క్రీడాప్రపంచాన్ని

సృష్టించి తన ఢమరుకతో ఓంకార శబ్దాన్ని ధ్వనింపజేసి-లోకానికి జ్ఞానభిక్ష పెట్టినాడు. అట్టి స్థానాన్ని సంపాదించి తరించడానికే, ఈ చదువుతో తాండవిద్దాము.

( తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం "కో-ఆపరేటివ్ గ్రంధాలయ భవన ప్రారంభోత్సవ సంచిక "యందలి శ్రీ అయ్యంకివారి వ్యాసము - 1963)



# కార్మికసమస్య - గ్రంథాలయములు

## గ్రంథాలయములు - కార్మికులు

భగవంతుని సృష్టిలో ముందుగా ఖనిజాలు, పిమ్మట లతలు; చెట్లు; తర్వాత జంతువులు, ఆఖరికి మనుష్యులు పుట్టిరి.

అయితే జంతువులకులేని అద్భుతమైన శక్తులు - ఆలోచించి స్వతంత్రంగా వ్యవహరించే శక్తి, యుక్తి తెలివితేటలు, మనుష్యునకు, ప్రత్యేకంగ ఉన్నాయి. ఇవి అన్నీ పుట్టుకతోవచ్చినా, మనలో అణగి మణగి ఉన్నాయి. వాటిని అభివృద్ధిచేసికోవటానికి మనిషికి "దోహదం" కావాలి.

ప్రశ్న:- అయితే సరే! ఏమిదోహదం కావాలండీ? దానిని ఎట్లా చేయాలండీ?

ప్రత్యుత్తరం:- ప్రతివిషయాన్ని గురించి ప్రత్యక్షంగా మనం చూచి, పరిశోధించి, నిర్ణయానికివచ్చి- దానినిగూర్చిన విజ్ఞానాన్ని పొందడం సాధ్యంకాదు. మహానుభావులైన మేధావులు మునిశ్రేష్ఠులు తపస్సుచేసి పరిశోధనచేసి, స్వంత అనుభవాలవలన పొందిన జ్ఞానాన్ని- ముందుతరాలవారికై - దానిని అంతా పుస్తకాలలో ఇమిడ్చి భద్రపరచారు.

మానవుడిలో అణగియున్న శక్తులను విజృంభింప జేసికోవడానికి గ్రంథాలను చదవాలి. ఒక గ్రంథాన్ని చదివినప్పుడు- ఆ పుస్తకంలోవున్న విషయాలనుగూర్చి - మనయందు అదివరకే బీజరూపంగా వున్న జ్ఞానం పైకి ఉబుకుతుంది. మనసులోవున్న జ్ఞానం

అట్లు ఉబికినప్పుడే మనము ఆనందంయొక్క అనుభవాన్ని పొందు తాము.

ప్రశ్న:— చూడండీ! పుస్తకాలు లెక్కలేనన్ని ఉన్నాయి కదండీ! వాటిని అన్నింటినీ కొనడం సాధ్యమాండీ!

ప్రత్యుత్తరం:- క్రొత్త పరిశోధనలను చేస్తున్నకొద్దీ - విజ్ఞానం అభివృద్ధి అయి, పాతపుస్తకాలకుతోడు- క్రొత్త క్రొత్త పుస్తకాలు కూడా బయలుదేరుతున్నాయి. ప్రతి సంవత్సరం బయలుదేరే వేల కొలదిపుస్తకాలను అన్నింటినీ, ఎంతటి భాగ్యవంతుడైనా కొనలేడు. అన్నింటినీ కొనవలసిన అవసరమున్నూ లేదు. ఒకవేళ కొనగలిగి కొన్నా వాటిని జాగ్రత్తగా పెట్టడానికి ఎన్నో బీరువాలు కావాలి; వాటికి చెదలు పట్టకుండా వాటిమీద దుమ్ముపడకుండా కాపాడాలి.

ఒక భాగ్యవంతుడు ఎన్నో బీరువాలు సంపాదించి ఎంతో డబ్బు ఖర్చుచేసి పుస్తకాలను అన్నింటినీ భద్రపరచాడు అని అను కోండి. ఆ రీతిగా వేలకొలది పుస్తకాలు చేరేటప్పటికి - అందులో నుంచి మనకు కావలసిన విషయాలనుగురించి మనము కోరిన గ్రంథ కర్త వ్రాసిన పుస్తకాన్ని ఏరుకోవడం సులభమైన పనికాదు. అదిన్ని గాక మంచిపుస్తకాలతో బాటుగా- చెత్తపుస్తకాలు చేరకుండా చూడాలి.

ప్రశ్న:- అయితే ఇంత కష్టమైనపని ఎట్లా సాధ్యం అవుతుందండీ!

ప్రత్యుత్తరం:- ఎంత కష్టమైనపని అయినప్పటికీ సంఘంమీద చేస్తే సులభమవుతుంది. అందుచేత ఉమ్మడిమీద అందరికీ సుల భంగా పుస్తకాలు అందుబాటులో ఉండడానికై గ్రంథాలయాలను ప్రతి పట్టణంలోను- పల్లెలలోను— పాఠశాలలోను- ఫ్యాక్టరీలలోను అవి అందరికీఅందుబాటులో వుండే స్థలాల్లోనూ ఏర్పాటు చేస్తే

న్నారు. పుస్తకాలలో మంచిపుస్తకాలేవో- పరిశీలించి మంచివాటినే కొంటున్నారు.

ప్రశ్న:- అన్నిపుస్తకాలలో మనకు కావలసినదాన్ని-నచ్చిన దాన్ని ఏరుకోవడం ఎట్లాగండీ !

ప్రత్యుత్తరం:- పుస్తకాలు అన్నింటినీ - చరిత్రలు, నవలలు, నాటకాలు, పురాణాలు, విజ్ఞానశాస్త్రాలు, కళలు, కార్మికసమస్యలు- ఈ రీతిగా పుస్తకాలలోవుండే విషయాలనుబట్టి వాటిని విభజించి, ఆ ప్రకారమే బీరువాలలో సర్దుతారు. గ్రంథాలపేర్లనుబట్టి వాటి లోని విషయాలనుబట్టి, గ్రంథకర్తల పేర్లనుబట్టి- ప్రత్యేక ప్రత్యేకంగా పట్టికలు తయారుచేసి వుంచుతారు. మనకు కావలసిన పుస్తకాన్ని దానిలోనుండి సులభంగా ఏరుకొన వచ్చును.

ఇంతేగాదు- ఆరోగ్య సమస్యలు, ఆర్థిక సమస్యలు, కార్మిక సమస్యలు, కూలీలసమస్యలు. పారిశ్రామిక సమస్యలు, వ్యవసాయ సమస్యలు, వర్తక సమస్యలు- ఉద్యోగ సమస్యలు- ఈరీతిగా ఏ సమస్యలనుగూర్చి అయినా, అవసరమైన భోగట్టాలను అందుకోవచ్చును. సలహాలను పొందవచ్చును- సంప్రదింపులను చేయవచ్చును- ఈ విషయాలు అన్నింటిలో గూడా గ్రంథాలయంలో ఉండే గ్రంథ భాండాగారి మనకు సహాయము చేస్తాడు.

ప్రశ్న:- పాఠశాలలలో వుండే చదువుకు- గ్రంథాలయాల్లో లభ్యమయ్యే జ్ఞానానికీ తేడా ఏమిటండీ !

ప్రత్యుత్తరము:- చిన్నచదువులు చిన్న పాఠశాలల్లోను- పెద్ద చదువులు కాలేజీలు- విశ్వవిద్యాలయాల్లోను చదువుకొంటారు. అయితే ఆ చదువులు- ముఖ్యంగా పెద్దచదువులు- కొద్దిమందికి మాత్రమే అందుబాటులో ఉంటాయి. పెద్దచదువులు చిన్నచదువులు అనే తేడా లేకుండా- అన్నిచదువులూ అందరికీ అందుబాటులో

వుండేది ఒక్క గ్రంథాలయంలోనే— జీవితంలో కొద్ది సంవత్సరాలు మాత్రమే కాకుండా— జీవితం అంతా— పూర్తిగా— చదువును కొన సాగించే— విశ్వవిద్యాలయాలే గ్రంథాలయాలు— వీటిలో చదువుకి సామ్ము ఇయ్యనక్కరలేదు— డిగ్రీలు పొందనక్కరలేదు. పై తరగతి చదువు చదువుకోవడానికి క్రింది తరగతి ప్యాసయినట్టు సర్టిఫికెట్టు పొందనవసరంలేదు. పుస్తకాలు వుపయోగించుకోవడానికి నీవుస్వశక్తి చేత అర్హతసంపాదించుకొంటే చాలును.మరియేఅర్హతఅవసరంలేదు,

గ్రంథాలయమందుండే ఉపాధ్యాయుని పేరు "గ్రంథభాండా. గారి" .ఆయనమిక్కిలి శాంతమూర్తి,దయామయుడు, ప్రేమస్వరూపుడు అయి ఉంటాడు. ఆయన, లేక ఆమె ముఖం కళకళ లాడుతూ వుంటుంది. ఆయన విజ్ఞానంలోనిధి – పుస్తకాలు ఉపయోగించుకోవడానికి మీకు కావలసిన సహాయం అంతా చేస్తాడు.

ప్రశ్న:- అసలు పుస్తకాలంటేనే కొంతమందికి ఇష్టం ఉండదండీ!

ప్రత్యుత్తరం:- స్వతహాగా పుస్తకాలను చదవాలనే ఆసక్తి అందరికీ ఉండదు. అట్టివారికి గ్రంథాలయంలో ఉన్న పుస్తకాలను గురించి, అందులోని విషయాలను గురించి విశదించిచెప్పి వారికి రుచిని కలిగిస్తారు. భాండాగారి ఎవరికి ఎట్టి గ్రంథాలు చదివితే అనువుగా ఉంటుందో యోచించి, వారి వారికి తగిన పుస్తకాలనే అందజేస్తారు. చదివేవారి అధికారాలనుబట్టి పుస్తకాలు అమరి ఉండే లాగున చూస్తారు.

చూడండి- ఒక వైద్యుడు అందరు రోగులకు ఒకే రకమైన మందు ఇయ్యడు. ఒక ఉపాధ్యాయుడు అందరు విద్యార్థులకు ఒకే రకమైన విద్యను చెప్పడు. అదేరీతిగా గ్రంథాలయానికి వచ్చే జనులందరినీ- వారి వారి ప్రవృత్తులనుబట్టి విభజించి, గ్రంథభాండాగారి వారి సేవ చేస్తాడు.

ప్రశ్న:- వినోదాన్ని కలుగజేసే పుస్తకాలు అయితేనే నాకు నచ్చుతాయండీ!

ప్రత్యుత్తరం:- పుస్తకాలను చదువుకోవడం విజ్ఞాన వికాసాలకేగాక, వినోదానికిగూడా అయివున్నది అన్నం తినేటప్పుడు నంచుకోవడానికి పచ్చళ్లు అవసరమే - అయితే అన్నాన్నిమించి పచ్చళ్ళు వుండరాదు. అందుచేత విజ్ఞాన వికాసాలమధ్యను వినోదం నంచుకొనేదిగా ఉండాలి. అంతేకాని విజ్ఞాన వికాసాన్ని మించింది కారాదు.

ఇంతేగాక, వినోదానికి చదివే గ్రంథాలు మనస్సుకి నిజమైన ఆనందాన్ని గలుగ్గజేసేవిగా ఉండాలి, యథార్థమైన ఉత్సాహాన్ని కలుగజేసేవిగా వుండాలి; సరియైన ఉత్తేజాన్ని కలుగజేసేవిగా ఉండాలి; అంతేగాని తాత్కాలికమైన— నిరర్థకమైన, కోరికలను రెచ్చగొట్టి, ఉద్రేకాన్ని పుట్టించేవిగా ఉండరాదు.

మనుష్యులకు దేవతల గుణాలను సమకూర్చేవి కొన్ని పుస్తకాలు. రాక్షసుల గుణాలను సమకూర్చేవి మరికొన్ని పుస్తకాలు - ఈ దేవతా గుణాల- రాక్షసగుణాల మధ్య యుద్ధం - మనుష్యుల బుద్ధులను బట్టి-నిరంతరం జరుగుతూనే ఉంది. ఈ భూమి మీద రాక్షసత్వం నశింపజేసి, దేవత్వాన్ని మనస్సులకు కలిగించే పుస్తకాలనే చదవాలి. గ్రంథపఠనం సహజీవనాన్ని ప్రోత్సహించాలి.

ప్రశ్న:- అయితే పత్రికలు చదవనక్కరలేదాండి?

ప్రత్యుత్తరం:- ఈ కాలంలో విజ్ఞానం, పుస్తకాల మూలానేగాక, పత్రికల మూలాన్నికూడ వ్యాపిస్తోంది. పత్రికలలో వార్తలు- వింతలు — విశేషాలేగాక, తాజాగా ప్రపంచంలో జరుగుతూ ఉండే పరిశోధనలనుగూర్చి- నూతన దృక్పథాలనుగూర్చి- అనేక వ్యాసాలు సమర్థులు వ్రాస్తున్నారు. అందుచేత-మనం ఇదివరలో సంపాదించిన విజ్ఞానం బూజుపట్టిపోకుండా- ఎప్పటికప్పుడు నవనవలాడుతూ ఉండడానికి పత్రికలనుకూడా చదువుతూ ఉండాలి.

ప్రశ్న:- సరే — పుస్తకాలను ఎంతకాలం చదవాలండీ ?

ప్రత్యుత్తరం:- విజ్ఞానం మనుష్యుని నాగరీకునిగా చేస్తుంది. సంస్కరిస్తుంది, సకలసంపదలను ఇస్తుంది. అయితే-ఒక జీవనదియొక్క-ప్రవాహానికి మల్లేనే — విజ్ఞానం ఒక స్థాయిలో నిలిచిపోయేది కాదు. ప్రతిదినం - కొత్తదివచ్చి చేరుతుంది— అభివృద్ధిని పొందుతుంది.

అప్పుడప్పుడు సానబెడుతూ వుంటేగాని కత్తియొక్క- పదును నిలిచియుండదుగదా ! అదేరీతిగామనస్సునకు- పుస్తకాలు చదువుట వల్ల నిరంతరం పదునుపెడుతూ — ఉత్తేజాన్ని కలిగిస్తే - స్వతంత్రమైన ఆలోచనాశక్తి నిరంతరం పెరుగుతూ ఉంటుంది లేకపోతే మన మనస్సు బండబారిపోతుంది. అందుచేత - చచ్చేవరకు యావజ్జీవితమూచదవాలి.

ప్రశ్న:- ఏమో-ఏమో-డొంకతిరుగుడుగా చెబుతున్నారు ! మా కార్మికులకు గ్రంథాలయాల ప్రయోజనాలనుగూర్చి — సూటిగా చెప్పండి.

ప్రత్యుత్తరం:- ఒక ఫ్యాక్టరీలో కొన్ని సంవత్సరాలక్రితం- నీవు కూలీగా ప్రవేశించావు - అప్పటికి నీ సమర్థత అంతే; తర్వాత పెద్దవాడవు అయినావు- పెళ్ళి చేసుకొన్నావు- పిల్లలు పుట్టినారు నీ జీతం చాలటంలేదు.

అప్పుడు ఏం చెయ్యాలి ? నీవుచేసే కూలిపనికి పై అంతరువు అయిన మేస్త్రీ పనిని సంపాదించుకోవడానికి ప్రయత్నంచేయాలి. అదెట్లాగ ? గ్రంథాలయానికి వెళ్ళి, మేస్త్రీ పనిని చేయడానికి తగిన యోగ్యతలు సంపాదించుకోవడానికి- గ్రంథాలయంలోని పుస్తకాలు ఉపయోగించుకొని అభివృద్ధి పొందాలి.

అయితే "మేస్త్రీ"వి అయినావు; నీ జీతం ఎక్కువ అయింది; పిల్లలు చదువుకు వచ్చారు; అందుచేత నీ జీతం చాలటంలేదు. అప్పుడు "ఇంజనీరు" పదవికి కావలసిన యోగ్యతలు సంపాదించు

కోవడానికై ప్రయత్నించు. దానికికూడ గ్రంథాలయముయొక్క గ్రంథభాండాగారి యొక్క తోడ్పాటు పొందు.

ఈ సందర్భంలో నిజంగా జరిగినసంగతి ఒకటి చెబుతాను వినండి. బందరు జాతీయకళాశాలలో ఆఖరి తరగతిలో చదువుకు ప్రవేశించిన శ్రీగంగిరెడ్డికృష్ణమూర్తి అనేసామాన్యుడు-కళాశాలగ్రంథాలయాన్ని ఉపయోగించుకొని తన సమర్థతచేత - గొప్ప ఇంజనీరుగా తయారై గొప్ప సృజనాత్మకమైన శక్తిని సంపాదించుకొన్నారు. తరువాత ఆయన విదేశాలకుకూడ వెళ్లి గొప్ప అనుభవాలు సంపాదించారు. పెద్దపరీక్షలు ప్యాసయిన ఇంజనీర్లుకూడ ఆయన సామర్థ్యమును మెచ్చుకొని, మన్ననల నిచ్చారు. పెద్దసంస్థలకు సలహాదారుడుగా పనిజేసి ఇప్పుడువయస్సులో పెద్దవారై, ఉపకారవేతనముసుపొందుతున్నారు.

ఇంకోవిషయం - విజయవాడ రామమోహనలైబ్రరీలో-చదువురానట్టి శ్రీ మరడాన కృష్ణమ్మ అనే కుర్రవాడు ఒకడు - ఆ రోజులలో రు 4 ల బంట్రోతుగిరిలో ప్రవేశించి-గ్రంథాలయంలోనే చదువు,సమర్థతలుసంపాదించి,రు 60 ల మునిసిపల్ మేస్త్రీఅయినాడు.

మరోవిషయం- రాజమండ్రి గౌతమీ లైబ్రరీలో - ఆ రోజులలో— బంట్రోతుగా ప్రవేశించిన శ్రీ రంధి అప్పలస్వామి - చదువును అభివృద్ధి చేసుకొని, తర్వాత చిన్న వర్తకుడై- పెద్ద సాహుకారై - తుదకు కందుకూరి వీరేశలింగంగారిచే స్థాపించబడిన హితకారిణీ సమాజమునకు కార్యదర్శియై; ప్రజాసేవకుడై గొప్ప గౌరవాన్ని సంపాదించు కొన్నారు.

ఇవి మన ఆంధ్రదేశంలో నాకండ్లయెదుట-జరిగినవిషయాలు.

అమెరికాదేశపు స్వాతంత్ర్యయోధుడు - అబ్రహాం లింకన్ ప్రథమంలో సామాన్య కార్మికుడే-పుస్తకాల ఉపయోగంతో గొప్ప ప్రెసిడెంటు పదవిని పొందాడు.

1960 సం॥లో చైనా దేశంలో ఒక ఫౌండ్రీలో మామూలు కూలీగా ప్రవేశించిన "చియాంగు యన్" అనే ఆయన తన సామ

ర్ధ్యాన్ని పుస్తకాల సహాయంతో పెంపొందించుకొని "ఇంజనీరు" పదవిని పొందారు.

సరిగా ఆలోచిస్తే – మనమంతా కార్మికులమే. శరీర కష్టం చేయు కార్మికులు కొందరు — బుద్ధిబలంచేత కష్టంచేయు కార్మికులు మరికొందరు.

అందుచేత శరీరబలంతో కష్టంచేసే కార్మికులుగా బయలు దేరిన మీరంతా మీమీ విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొంటే, ఎంత పెద్ద పదవికైనా పొందటానికి సమర్థులు అవుతారు.

విజయవాడ, ఆలిండియా రేడియో, కార్మికులకార్యక్రమంలో 21-6-1961న ప్రసారితమైన శ్రీ అయ్యంకివారి ఉపన్యాసము.

---

# గ్రంథాలయములు వృత్తియందు మార్గదర్శకములు!

## ఉపక్రమము:-

జనసామాన్యమునకు, గ్రంథాలయములు సేవజేయుటయందు ముఖ్యముగా అమెరికా దేశమునందు అనంతములైన మార్గముల నవలంబించు చున్నారు. ప్రధానముగా దేశమునందలి యువకులు తమ చదువు పూర్తియయిన వెంటనేగాని లేక తాము చదువుకొను చున్నప్పుడుగాని, వారి జీవితములందు ఎన్నుకొనవలసిన వృత్తిని సూచించుటకు మార్గదర్శకత్వమును వహించుటయందు గ్రంథాలయములు దక్షతను జూపుచున్నవి. ఈ విషయమునగూడ ఆ దేశము ముందంజ వేయుచుండుట గమనించదగును. అచట నీ విషయమున జరుగుచున్న కృషియొక్క స్వరూప స్వభావములను ఈ వ్యాసమున జూపదలచినాను.

ఇట్టి సేవను చేయుచున్నత స్థితిని మనదేశమందలి గ్రంథాలయములు శీఘ్రముగ పొందినయెడల — దేశమునందు నిరుద్యోగ సమస్య సులభముగా పరిష్కారము కాగలదు.

## గ్రంథభాండాగారి మార్గదర్శకుడు

దేశమునందలి యువకుల నడవడికను గ్రంథభాండాగారి తీర్చి దిద్దుటయందు మంచి సామర్థ్యమును గలిగియున్నాడు. వృత్తులను గురించియు, వృత్తులయందు ప్రవేశించిన పిమ్మట అందలి అవసరములను గురించియు, అమూల్యములైన సలహాలను గ్రంథాలయాధికారి సూచించగలడు. "వృత్తులయందు గ్రంథాలయము లెట్లు సహాయము చేయగలవు?" అని అనేకులకు సందేహ ముండుట సహజము. అందుచే ప్రజాసామాన్యమునకు వృత్తులను నిర్ణయించుకొనుటలో గ్రంథాలయము లెట్లు తోడ్పడునో వివరించెదను.

## వృత్తినెన్నుకొనుటలో సహకారము

వృత్తియందు సహకారము— అనగా సామాన్యుడగు మనుజునకు ఆతడు తన జీవనోపాధిని నిర్ణయించుకొనుటయందు తోడ్పడుటయే! ప్రయోజనకరమగు పనులయందు నియోగమైయున్న వారందరును తమ తమ వృత్తులయందు ప్రవేశించినట్లే యగును. అందువలన ఒక మానవుడు అవలంబించుటకు యోగ్యమైన పనిని ఆతడు నిర్ణయించుకొనుటకు తోడ్పడుటయు, ఆ పనికి కావలసిన మంచి శిక్షణను బొందునట్లు చేయుటయు, ఆతడు తగిన శిక్షణను బొందిన తర్వాత దానికి తగినవృత్తిని సంపాదింప జేయుటయు, ఆతడు ఎంచుకొనిన వృత్తియందు పురోగమించుటయే యగునుగదా! ఇది యంతయువృత్తినిర్ణయ మార్గమును జూపుటయే యగుచున్నదిగదా.

## విద్యా ప్రణాళిక

క్రమప్రకారముగ శాస్త్రోక్తమగు మార్గమును జూపుటకు చేయు ప్రయత్నము విద్యాప్రణాళికా విషయము నందొక క్రొత్త పోకడయే! అమెరికా విద్యాప్రవీణు డొకడు సమాజ వివేకముతో

ఈ మార్గమును జూపు పద్ధతిని మొట్టమొదట పాఠశాలలయందు ప్రవేశబెట్టెను. ఆ విద్యాప్రవీణుడు ఈ మార్గమును అనుసరించు పద్ధతిని ఆరు ప్రముఖములగు సోపానములుగ" గురించి సమగ్రముగ తీర్చి దిద్దినాడు.

## ఆరు సోపానములు.

ప్రథమ సోపానము :— ఎవరికి వారు వారికి గావలసిన దానిని తెలిసికొనుట: ఇట్లనుట వింతగా కన్పించవచ్చును. కాని ప్రతి వానికిని స్వశక్తిమీద విశ్వాస ముండుట అత్యంతావశ్యకము. అట్టి విశ్వాస మున్నగాని, ఒక కార్యమును తాను చేయగలనని నిష్కర్షగ ఇతరులకుగాని తన యజమానికిగాని చెప్పజాలడు. తన ప్రయోజనములను, సామర్థ్యములను, జ్ఞానమును, నైపుణ్యమును, అభిరుచులను, అన్నింటిని ప్రేరేపించ గలిగిన అనుభవముల నాతడు పొందియుండవలెను. ఈ మేరకు— ఆతనికి స్వానుభవమువలన దెలిసిన గాని— ఆతడు తన భావి జీవిత సమరమును నిర్వహించుకొనుటకు గావలసిన సరంజామును సేకరించుకొని — కృతకృత్యుడు కానేరడు.

ఈ విషయమున అమెరికాదేశము నందలి పాఠశాలలు అమూల్యమైన కార్యక్రమమును నిర్వహించుచున్నవి. తన ప్రయోజనములను, సామర్థ్యములను, అభిరుచులను విద్యార్థి స్వయముగ తెలిసినవాడై — తన్మూలమున తన్ను తాను తెలిసికొని తన వృత్తిలో ప్రవేశించిన తరువాతి జీవితమున సామరస్యము గలిగించు కొనుటకై— అత్యంతావశ్యకమగు తన సామర్థ్యమునందు ఆత్మవిశ్వాస మేర్పరుచు కొనుటకు ఆ దేశమునందలి పాఠశాలలు అమూల్యమైన దోహదమును చేయుచున్నవి.

## అవకాశ నిర్ణయము.

ద్వితీయ సోపానము :— ఏయే వృత్తులను చేయుటకు అవకాశము లేమేమి గలవో తెలిసికొనుట: ఒక వ్యక్తి తనకు గల ప్రయోజనములను, సామర్థ్యములను, నైపుణ్యమును, మొదలైన వానిని మాత్రము తెలిసికొని యుండినంత మాత్రమున జీవనోపాధిని సంపాదించుకొనుటకు సమర్థుడు కాజాలడు. అందుచేత తన సామర్థ్యమును వినియో

గించి తనకు తగిన వృత్తులను చేయు అవకాశము లేమియు గలవో, ఎట్టివిగలవో ఆతడు అన్వేషించుకొనవలెను.

## ప్రత్యేక శిక్షణము.

నూటికి తొంబదిమందికంటె ఎక్కువమంది జనులు తమ జీవనోపాధికై ఏదియో నొక వృత్తిని అవలంబించవలసిన వారై యున్నారు. అందుచేత దాదాపుగా అందరికిని గూడ వృత్తులను గూర్చిన యదార్థమైన వృత్తాంతము దెలియుటకు తగిన సదుపాయము లను కలుగ జేయవలయును. అట్లు కలుగుటవలన తమకు యుక్తమైన వృత్తులను ఎవరికివారు నిర్ణయించుకొనుటకు వారికి అవకాశ ముండును. వృత్తుల విషయమై ప్రత్యేకమైన శిక్షణ తరగతులను ఏర్పాటుచేసి పాఠశాలయందు అందులను గూర్చి బోధించుటద్వారా అమెరికాదేశమందీ కార్యమును విజయవంతముగ నిర్వర్తించు చున్నారు.

## తెలియదగిన ప్రధాన విషయములు.

ఎవరైనను ఒక వృత్తిలో ప్రవేశించక పూర్వము దానిని గూర్చి తెలిసికొనవలసిన ప్రధానమైన విషయములు కొన్ని గలవు. మొదటిది: ఆ వృత్తిని జేయుటకు యెట్టి నైపుణ్యము కావలెను? రెండవది: ఆ నైపుణ్యమును విచక్షణతో నిర్వహించుటకు ఆవశ్య మైన సాంకేతిక జ్ఞానమెద్ది? మూడవది: ఆ వృత్తియందు జయమును పొందుటకుగాను అలవరచుకొనవలసిన అసామాన్యములైనసామర్థ్యము లెవ్వి? నాలుగవది: జయమును పొందుటకుగాను ఆ పని యందు గల అసాధారణ - ప్రత్యేకవిషయము లేవి? ఈ నాలుగు విషయము లను పరిపూర్ణముగ ప్రథమమున గమనించవలెను.

పట్టణమునందు నివసించు బాలుడు పారిశ్రామిక వృత్తులను గూర్చి మాత్రమే తెలిసికొనిన సరిపోదు; పల్లెటూరు పిల్లవాడు వ్యవసాయము గూర్చి మాత్రమే తెలిసికొనిన చాలదు; అందుచేత అనేకావకాశములుగల వివిధ వృత్తులను గురించి విద్యార్థులు తెలిసి కొనుటకు తగిన సదుపాయము లుండవలెను.

పరిశ్రమ, వ్యవసాయము, గృహనిర్మాణము, వర్తకము, మొదలైన విషయములలో ఒకటి రెండు వృత్తులను విద్యార్థి నిర్ణయించుకొను నవకాశము గల్పించి, దానికి తోడుగా వివిధ వ్యాపార విషయములను గూడ సమ్మిళితము జేసినయెడల, ఆతడు ఒక వృత్తియందు ప్రవేశించిన పిమ్మట తన జీవితమును యథాసంభవముగా పరిదిద్దుకొన సమర్థుడగును.

## ప్రవీణుని సలహా.

తృతీయసోపానము:- ఆయావృత్తులలో విశేషానుభవమును ప్రావీణ్యమును గలిగిన "ప్రవీణుని" సలహాను బొందుట; అట్టివానికే "సలహాదారుడ"ని పేరు; అతడు చాల యనుభవము గలవాడును, ఉపదేశము నిచ్చు విద్యయందు శిక్షణను పొందినవాడుగను, తాను వృత్తిని ఎన్నుటకు తగినంత సామర్థ్యము కలవాడగను ఉండవలెను. విద్యార్థి తన సామర్థ్యమునుగూర్చియు, నైపుణ్యమునుగూర్చియు, విజ్ఞానమును గూర్చియు యను-సరియగు జ్ఞానమును కలిగియున్నాడో లేదో యనువిషయమును తాత్కాలికముగ నొక వృత్తియందు ప్రవేశించి పనిచేయదగిన అవకాశములనుగురించి — సమగ్రమైన పరిజ్ఞానమును గలిగియున్నాడో లేదో యనువిషయమును- తెలిసికొనియుండవలసిన బాధ్యత "సలహాదారు" నిదై యున్నది. ఏడవతరగతి మొదలు పన్నెండవ తరగతి వరకు గల 500 మంది పిల్లలకు ఒక "సలహాదారుడు" తన కాలమునంతను వినియోగించవలసియుండునని పరిశోధనల వలన దేలినది. బాలురకు పురుషుడును బాలికలకు స్త్రీయును "సలహాదారులు" గా నుండుటయే శ్రేష్ఠమని అనుభవపూర్వకముగ దేలినవిషయము.

## సాంకేతిక పరిజ్ఞానము.

చతుర్థ సోపానము:- వృత్తివిద్య: విద్యార్థి తాత్కాలికముగ తన వృత్తిని నిర్ణయించుకొన్న పిమ్మట అతనిని ఎదుర్కొను సమస్యలలో కొన్నిటి నిచట పేర్కొనుచున్నాను. "నాకు అభిరుచిగల వృత్తిలో మంచి సాంకేతిక శిక్షణము ఎక్కడ లభించును? దానికి ఎంతకాలము ఎట్టి శిక్షణ కావలెను? దానికి ద్రవ్య మెంత కావలయును? నేను వినియోగించ దగిన కాలము

నకును భరించదగిన ద్రవ్యమునకును తగిన మంచి శిక్షణము ఎక్కడలభించును ? ఇట్టి శిక్షణముగల అవకాశములను గురించి తెలిసి కొనుటకు "సలహాదారుడు" మిక్కిలి యుపయోగకారి.

## శిక్షణ త్రితయము

ఈ శిక్షణ మూడు విభాగములుగ నుండును. మొదటిది: నైపుణ్యమునందు శిక్షణము; రెండవది: వృత్తివిద్యకు సంబంధించినట్టియు సాంకేతికమైనట్టియు విజ్ఞానమునందు శిక్షణము; మూడవది: ఇరుగు పొరుగువారితో జేయు సహవాసేచ్ఛయందలి విజ్ఞానము. మొదటి రెంటి యందును శ్రద్ధవహించి, మూడవ దానిని నిర్లక్ష్యము జేయకూడదు.

అమెరికా దేశములో తమ వృత్తులను పోగొట్టుకున్న 4 300 మదిని గురించి ఆరాతీయగా ఇట్లు తేలినది:-అందులో నూటికి 34 మంది తగిన నైపుణ్యము లేకపోవుట వలనను, 62 మంది తమ తోడివారితో కలసి మెలసి యుండజాలక పోవుటవలనను, తమ యుద్యోగములను పోగొట్టుకొనిరి.

ఎక్కువమందికి ఉద్యోగములు పోవుటకు ఇంత స్వల్పవిషయములు నిజముగా ప్రధాన కారణములైనచో, పాఠశాలను విడువక పూర్వమే ఈలోపములను సరిజేయుట సులభతరము, తప్పనిసరియు నగునుగదా !

## ఉద్యోగ సంపాదనము

పంచమసోపానము:- ఉద్యోగమును సంపాదించుట:

ఒకవృత్తికై శిక్షణము బొందిన విద్యార్థికి - అతని శిక్షణము జయప్రదముగా సంపూర్ణమైన పిమ్మట- తగిన ఉద్యోగము లభింప వలెను గదా! విద్యార్థులకు శిక్షణము నిచ్చుటకు ప్రజల ద్రవ్యము అమితముగా ప్రభుత్వము వారివలన వినియోగింప బడుచున్నది; విద్యార్థులు తమ స్వంత ద్రవ్యమునుగూడ వ్యయపరచు చున్నారు. ఇట్టి స్థితియందు విద్యార్థుల శిక్షణ పూర్తియైన పిమ్మట వారికి తగిన యుద్యోగము లభింపజేయుని యెడల వ్యయపరుపబడిన ద్రవ్యమంతయు వృథాగా వ్యయ పరచినట్లే యగును.

షష్ఠమసోపానము:– విద్యార్థిదశ పూర్తియైన పిమ్మట ఒకవ్యక్తి తన వృత్తియందు అభివృద్ధిపొందుట: విద్యార్థిదశపూర్తియైన పిమ్మట ఒకవ్యక్తి తన వృత్తియందుఅభివృద్ధినిపొందుటకు: విద్యార్థులు పాఠశాలనువిడచి పెట్టుటతో పాఠశాలలు వారిని విడచిపెట్టక, వారు కాలక్రమేణ తమ వృత్తియందు అభివృద్ధిని సాధించుటను పరికించు చుండవలెను. ఇందువలన పాఠశాలలలో విద్యార్థులకిచ్చుచున్న విద్యాశిక్షణము నందలి లోపములను–వృత్తుల నవలంబించుచున్న వారియొక్క అనుభవములను అనుసరించి– సరిజేసి– శిక్షణవిధానము నభివృద్ధిజేయుట కవకాశములభించును.

## గ్రంథభాండాగారి సహాయము

ఈ ఆరుసోపానముల యందును గూడ గ్రంథభాండాగారి అమూల్యమైన సహాయమును చేయగలడు. ఆ యా వృత్తులకు సంబంధించిన క్రొత్తగ్రంథములను పరిచయము చేయుటవలనను, వ్యక్తి యొక్క అవసరములనుబట్టి వృత్తులను గూర్చిన విషయములకు సంబంధించిన వ్యాసములు గల మాసపత్రికలను, వారపత్రికలను, దినపత్రికలను, పరిచయము చేయుటవలనను అమితమైన సహాయమును ఆతడు విద్యార్థులకు ప్రతి అంతరువు నందును చేయవచ్చును.

వివిధ విశ్వ విద్యాలయముల యొక్కయు, కళాశాలల యొక్కయు, ఇతర వృత్తి పాఠశాలల యొక్కయు, నవీనమైన గ్రంథముల యొక్క క్యాటలాగులను సంపాదించి – గ్రంథాలయము నందు భద్రపరచి, కావలసినవారికి అందలివిషయములను గ్రంథభాండాగారి విశదముగ వివరించి చెప్పుచుండవలెను. ఇంతేగాక ఆ యా వృత్తులకు దేశములోగల అవకాశములను గురించిన భోగట్టాను సేకరించి విద్యార్థులకు సలహాల నిచ్చుచుండవలెను.

ప్రథమమునందు వృత్తిలో ప్రవేశించదలచువారికిఉద్యోగము ఎట్లు దొరుకునను విషయము అనేకులకు గొప్పసమస్య– ఈవిషయము మీద వ్రాయబడు వ్యాసములను ప్రతిసంవత్సరమును పాఠకుల దృష్టి నాకర్షించునటుల గ్రంథభాండాగారి చేయువలయును. ఒక వృత్తియ చే

దున్నవాడు ఆవృత్తియందు సంపాదన అభివృద్ధికావలయునని తలంచుట—అనగా అతడు తన వృత్తియందు లేక ఉద్యోగమునందు ఇంకను ఎక్కువ ప్రావీణ్యమును సంపాదింప వలయునన్నమాట. ఇట్టి ప్రావీణ్యమును సంపాదించుట యందు ఉపన్యాసతరగతులు — ఉత్తరప్రత్యుత్తరముల మూలమున శిక్షణము—విరామసమయములందు శిక్షణ తరగతులు—ఇట్టివి ఎన్నియో ఏర్పాటయి యుండును. వీని నన్నింటిని గురించిన వివరములనన్నింటిని సంపాదించి గ్రంథాలయము నందుంచి, కావలసినవారి కావిషయముల నన్నింటిని గ్రంథభాండాగారి అందించవలెను.

## సింహావలోకనము

పైన వివరించిన ఆరు సోపానములు, క్రమముగ, ఒకవ్యక్తి తనకు యోగ్యమైన వృత్తి నవలంబించుటకు తగిన సాధనములు — ముందుగ తనయొద్ద ఏ సాధనము సిద్ధముగనున్నదియో, ప్రతివ్యక్తియు పరిగణము చేసికొనవలెను. తనయొద్దనున్న సామర్థ్యమును వినియోగించుటకుపూర్వము, పరిస్థితులనుగూర్చి అవగాహనము జేసికొనవలయును. తన సామర్థ్యమును వినియోగించు విధానమునుగూర్చి ఒక "ప్రవీణుని"తో సంప్రదించవలెను. ఒక వృత్తియందు ప్రవేశించనిర్ణయించుకొన్న పిమ్మట, తానువినియోగించ గలిగినంత కాలమును, శక్తిని, ఆ కార్యమునకై తగిన శిక్షణమును పొందుటయందు వినియోగించవలెను.

అగత్యమైన శిక్షణను పొందినపిమ్మట, తాను శిక్షణపొందిన పనియందు ప్రవేశించవలెను. అట్లు ప్రవేశించి, ఆ పనియందు తగినంత యభివృద్ధిని పొందుటకై ఒళ్ళువంచి పని చేయువలయును.

అన్ని విషయములందును గ్రంథభాండాగారి సదా తోడుపడ గలడు.

—గ్రంథాలయ సర్వస్వము: సంపుటము 8: సంచిక 2; 1929 ఆగస్టు.

# బరోడా రాజ్యము

# నా బరోడా యాత్ర

## శాయజీ గాయక్వార్ మహారాజు
## హిందూదేశ గ్రంథభాండాగారోద్యమమునకు కల్పతరువు

శా. రాజన్నన్ బ్రజలన్న నెట్టులభువిన్ రాణింపనోనన్న వి
భ్రాజత్కీర్తి దిగంతరుండు బరోడా -రాజన్యునిన్ శాయజీ
రాజనామకు డెందమున్ దలపగా - రాదే సమాధాన మ
ట్లే జేయంగన రాజులెల్లఁ బ్రజల - ట్లే సౌఖ్యమున్ జెందరే.

సీ. వ్రాలెఱుంగని వాఁడు రాజ్యమందుండగా
రాదటంచనగ నే రాజు కౌను
గ్రంథాలయములేని గ్రామంబు కుగ్రామ
మది లేని రాజ్యమే యధిపుడేలు
భూప్రదక్షిణము నే భూపుండు పలుమారు
సలిపి రాజ్యముల పసలనుగాంచె
ఉన్నది చెడకుండ నుపరి మంచివిమెంచి
రాజ్యాన నిల్పె నే రాజవాళి

గీ. అతడు "లండను టైమ్సా" ది వితత పత్రి
కాగ్ర సంస్తూయమాన విఖ్యాతయశుడు
శేష భారత రాజ్య విభూషణంబు
ఆశలకు తావు మనకు శాయాజిరావు.

దంటు సుబ్బావధాని–"గ్రంథాలయ సర్వస్వము"సంపుటము–1;సంచిక–1,

## ఆహ్వానము

బరోడా సంస్థానమునందు జరుగు గ్రంథాలయ పరిదర్శనము నకు బోవుటకై శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రిగారు తలంచిరి.

కాని వారి న్యాయవాది వృత్తియందుండునట్టి జవాబుదారీనిబట్టియు, ఇతర పనుల తొందరను బట్టియు, అట్లు చేయజాలకపోయిరి. శ్రీ • గోపరాజు బ్రహ్మానందముగారును పోవలెయునని తలంచిరి; కాని గృహకృత్య సంబంధమైన ఇబ్బందులవలన పోజాలక పోయిరి.

అందుచేత-బరోడానుండివచ్చిన యాహ్వానమును—నాకు చేరుటకై అమలాపురమునకు బంపిరి; కాని నేను అక్కడక్కడ తిరుగుచుండుటచేత ఆ ఉత్తరము నాకందలేదు. ఇంతలో డిశంబరు 30వ తారీఖువచ్చినది, నేను ప్రయాణమును ముగించుకొని ఇంటికివచ్చితిని; వచ్చునప్పటికి విశేషముగ పడిశభారముగ నున్నది. కొంచెము దగ్గు కూడ వచ్చుచున్నది. కాలిమీద ఒక పెద్ద కురుపు లేచినది. పాదము యొక్క ఒక వ్రేలికి ఎదురుదెబ్బతగిలి విశేషముగ బాధపెట్టుచున్నది. ఇట్టి స్థితియందు బరోడా ప్రయాణమును గూర్చి చెప్పిరి. ఇంతేగాక అచటికి వెళ్ళుటకు ఖర్చులకుగాను నలువది రూప్యములనుగూడ శ్రీ సూరి వెంకట నరసింహంగారు తెచ్చియిచ్చిరి. అట్టి స్థితియందు వెళ్ళకుండుటకు నాకు తోచకపోయినది. అందుచేత దైవముమీద భారము వైచి, జనవరి 2వ తేదీ రాత్రి బయలుదేరి 4వ తేదీ ఉదయమునకు బొంబాయి చేరితిని. బొంబాయినుండి ఆ రాత్రియే బయలుదేరి 5వ తారీఖు ఉదయమునకు బరోడా స్టేషనునకు చేరితిని; నన్ను స్టేషనులో కలియుటకు "లైబ్రరీ మిసలేని" అను పత్రికా సహాయ సంపాదకులును, బరోడా కేంద్ర గ్రంథాలయ గ్రంథభాండాగారులలో నొకరును, అగు బి. యం. దాదాచాంజీగారిని రైలుస్టేషనునకు పంపిరి. వారితోగూడ బయలుదేరి నా కొరకు ఏర్పరుపబడిన బసయందు సామానులను బెట్టి ప్రదర్శనమునకు బోతిని.

## బరోడా ప్రదర్శనము

పది ఎకరముల వైశాల్యముగలిగిన గొప్ప మైదానమునందు ప్రదర్శనము ఏర్పరుపబడినది. ఈ స్థలమునకు చుట్టును ప్రదర్శనశాల

• విజయవాడ రామమోహన గ్రంథాలయ కార్యకర్తలలో ప్రధానులు; గ్రంథాలయకార్యకలాపములలో చేదోడు వాదోడుగా దోడ్పడిన ప్రముఖులు.

లను గట్టి, మధ్యభాగమువంతను పలువిధములగు జలయంత్రముల తోడను, వివిధములగు దీప స్తంభములతోడను, వింతలను గొలుపు చుండు రాతిబొమ్మలతోను అలంకరించిరి. దీపముల వేళ యగుసరికి ప్రదర్శనాస్థలమంతయు రెండువేల విద్యుద్దీపములతో దేదీప్యమాన ముగ వెలుంగుచు ఎంతయు దర్శనీయమై యొప్పుచుండెను.

ప్రదర్శనమంతయు– వ్యవసాయము, అడవిసంపద, పరిశ్రమలు, విద్య, పుస్తకాలయములు–అని ఐదు విభాగములుగ విభజింపబడినది.

## గ్రంథాలయ ప్రదర్శన శాఖ

బాలశాఖ :– ఈ శాఖయందు ప్రథమమున పేర్కొనదగినది బాలశాఖ. పిల్లలయొక్క బుద్ధిని వికసింపజేసి, వారిలో నూతన భావ ములను రేకెత్తింపగలిగిన అటతెన్నియో ఇందు ప్రదర్శింపబడినవి.

గ్రంథములు :- మఱియు గుడ్డలమీద బొమ్మలతో అచ్చు వేయబడి, ఆరు సంవత్సరముల వయస్సుగల పిల్లలకు హృదయాకర్ష ముగ నుండు పుస్తకములు ఒకచో జూపబడినవి. ఇట్లే పది సంవత్సర ముల వయస్సు మొదలు పదునారు సంవత్సరములలోపు వయస్సు కలిగిన పిల్లలకు ప్రయోజనకరములైన పుస్తకములను ప్రత్యేకముగ ప్రదర్శించిరి.

చిత్రపట ప్రదర్శనము:–పిల్లల మనస్సులను రంజింప జేయగలి గిన బొమ్మలు, పెద్దపెద్ద పటములు, వర్ణింప నలవికాననిన్నింటిని చుట్టును వ్రేలాడ గట్టిరి. మట్టితో పిల్లలచే చేయబడిన బొమ్మలు వేరొకచో ప్రదర్శింప బడినవి.

"మెకానో" ప్రదర్శనము:– ఒక బల్లమీద– ఒక పెట్టెలో– ఇనుముతో జేయబడిన అనేక వస్తువుల విడిభాగము లున్నవి. ఆ పెట్టెకు "మెకానో" యని పేరు. ఆ విడిభాగములనుండి రైలుబండ్లు– ఓడలు – విమానములు మొదలగు 120 రకముల "యంత్రము" లను పిల్లలు సులభముగా నిర్మించుకొనగలరు. దీనివలన బాలుర యందు యోచనాశక్తియు, నిర్మాణశక్తియు అభివృద్ధి నొందునని వేరుగ చెప్పనక్కఱలేదు. ఈ బాలశాఖా ప్రదర్శన మధ్యభాగమందు గ్రంథ

భాండాగారి నిలచి తాళములు వాయించుచు, లలిత పదములతో గూడిన మృదు మధురమగు కీర్తనలను బాడుచు, పిల్లలనేగాక పెద్ద లనుగూడ నాకర్షించుచుండెను.

## గ్రామ గ్రంథాలయములకు సహాయము

క్రొత్తగ్రంథాలయములను స్థాపించుకొనుటకై ఇరువదియైదు రూప్యములను మాత్రము సంపాదించుకొనగల గ్రామములకెల్ల బరోడా మహారాజు శ్రీ గయక్వారుగారు ఉచితముగా నిచ్చు నూరు రూపాయల విలువగల గ్రంథములను ఒక అలమారునందు బెట్టి బాలశాఖకు ప్రక్కనే ప్రదర్శించిరి. పిల్లలకు కావలసిన గ్రంథములు, వ్యవసాయదారులకు కావలసిన గ్రంథములు, కలాసాగా చదువుకొన గోరువారికి గావలసిన గ్రంథములు, ఉపాధ్యాయులకు, స్త్రీలకు-ఇట్లు- ఏ తరగతివారికి కావలసిన గ్రంథముల నాయా తరగతులుగ విభజించి ప్రత్యేకముగా చిన్నచిన్న పెట్టెలయందు, పెట్టె యొకటికి 25 గ్రంథముల చొప్పున నుంచి, ప్రజలకు గ్రంథసేవజేయ, గ్రంథా లయములు లేని గ్రామముల కెట్లు సరఫరా చేయుచున్నారో వేరొక చోట ప్రదర్శించిరి. బరోడా యందున్న నాలుగు జిల్లాలయొక్క పెద్దపటములను వేరొకచోట వ్రేలాడగట్టిరి. అందు ఆయా జిల్లాల యందున్న వివిధ తరగతుల గ్రంథాలయములు గల గ్రామము లను వివిధ రంగుల సూదులచే నిర్ణయించి జూపిరి. బరోడా రాజ్యము నందు గ్రంథాలయోద్యమమును ప్రారంభించిన పిమ్మట గ్రంథాల యముల అభివృద్ధి ఎట్లున్నదో, అంతకుపూర్వ మెట్లున్నదో చూపు పెద్ద పటము నొకదానిని అందరకును బాగుగ గనపడునట్లు స్థలము నందు వ్రేలాడగట్టిరి. దీనికి ప్రక్కనే పిల్లలచే తయారుచేయబడిన చిన్న "వనము" నొకదానిని ప్రదర్శించిరి.

## ప్రసిద్ధ పాశ్చాత్య గ్రంథాలయములు

వేరొక స్థలమునందు, అమెరికా దేశము నందును, యూరోపు దేశమునందును, ఇటలీ దేశమునందును, జపాను దేశమునందునుగల

వివిధములగు జాతీయ గ్రంథాలయములయొక్కయు - సార్వజనిక గ్రంథాలయముల యొక్కయు - పెద్ద పెద్ద పటములను వ్రేలాడ గట్టిరి. అమెరికా, ఐరోపా దేశములయందలి గొప్ప గ్రంథాలయ ముల భవనములయొక్క "ప్లాను" లనుగూడ తయారుజేసి వ్రేలాడ గట్టినారు మిక్కిలి ప్రాచీనమైనట్టి గ్రంథాలయములయొక్క పటము లనుగూడ సంపాదించి చూపినారు. ఇట్లు ప్రదర్శింపబడినవానిలో పాశ్చాత్య దేశములయందెల్ల ప్రసిద్ధికెక్కిన వాషింగ్‌టను, న్యూయార్కు, బర్కులీన్, బోష్టను, సెంటులూయిసు, మ్యాన్ చెష్టరు, లివర్పూలు, గ్రంథాలయములయొక్క పటములు-ప్రదర్శింప బడిన వానిలో మిక్కిలి సుందరతరములై యున్నవి. ఇట్లు చూపిన గ్రంథాలయములయొక్క పటములన్నిటి మొత్తముసంఖ్య 324.

మరియు బరోడా రాజ్యమందున్న కేంద్రగ్రంథాలయమునకు నిర్మింపబోవు నూతన భవనముయొక్క ఆకారమును జూపు "ప్లాను"ల పటములు కూడ కొన్ని ప్రదర్శింపబడినవి. బరోడారాజు గయక్వాడు గారి సహాయము పొందుచున్న గ్రంథాలయముల భవనముల పను వాలుగు పటములను, పట్టణ గ్రంథాలయముల కుండవలసిన భవన ముల యాకారములనుజూపు అయిదు "ప్లాను"ల పటములనుగూడ ప్రదర్శించిరి.

## గ్రంథాలయ పరికరములు

మరియొక స్థలమునందు గ్రంథాలయమునం దుండవలసిన సాధన సామగ్రిలను జూపినారు. బల్లలు, కుర్చీలు, బీరువాలు— పత్రికలను పెట్టి ప్రదర్శించుట కనుకూలముగనుండు అలమరలు; క్రొత్తరకపు గ్రంథముల పట్టికలు; పెద్ద గ్రంథాలయముల యందు పుస్తకములను ఒక స్థలమునుండి మరియొక చోటికి దీసికొనిపోవుట కుపయోగపడు చిన్నచిన్న తోపుడుబండ్లు - మొదలగువాని నెన్నిం టినో ప్రదర్శించిరి. ఇంతేగాక ఉక్కుబీరువాలలో పలు విధములగు వానిని ప్రదర్శించి వాని ఆధిక్యతను గూర్చి బోధించిరి. పిల్లలు

కూర్చుండుటకు అనుకూలముగ నుండునటుల ఎత్తు తక్కువగనున్న కుర్చీలు, కుర్చీలమీద కూర్చుండి చదువుకొనుచు వ్రాసికొనుటకు అనుకూలముగ నుండునటుల ప్రత్యేకముగ తయారుచేయబడిన బల్లలు - మొదలగువానిని కూడ ప్రదర్శించిరి.

గొప్ప గ్రంథాలయములలో నిత్య వ్యవహారము జరుగుటకు అగత్యములగు అనేక సాధనములను విరివిగ వేరొకచోట ప్రదర్శించిరి. ఇంతేగాక, సిరాబుడ్లు - అద్దుడు కాగితముల దిమ్మలు - గుండు సూదుల గుచ్చుకొని బల్లమీద పెట్టుకొను దిమ్మలు - కలములు - పలు విధములగు సిరాలు- రబ్బరు స్టాంపులు-తారీఖులను ముద్రించు స్టాంపులు- మొదలగు - ఆఫీసునందు- ఉపయోగకరములగు వస్తువు లను విశేషముగ ప్రదర్శించిరి.

"బైండింగు" ప్రదర్శనము: ఇంతేగాక, అనేక విధముల పుస్తకముల బైండింగులను - పదునారు పదునేడు శతాబ్దముల యందు జేసిన బైడింగుల నమోనాలను - ఈ కాలమున చేయు చున్న బైండింగుల నమోనాలను జూపిరి. మరియు తోలు,క్యాలికో, వివిధములగు కాగితములు, జిగురు, మొదలగు "బైడింగు" సామాను లనుగూడ పెక్కింటిని ప్రదర్శించిరి.

తాళపత్ర గ్రంథములు: మిక్కిలి ప్రాచీనములును,అపూర్వము లును అగు తాళపత్ర గ్రంథము లనేకములనుగూడ ప్రదర్శించిరి. భూర్జపత్రములమీద వ్రాయబడిన మహాగాయత్రీ భాష్యము, దేవీ సూక్తభాష్యము, మొదలైనవాని వ్రాతప్రతులు ప్రదర్శింపబడినవి.

ముద్రితగ్రంథములు:- మరియు అరంగుళము పొడవు, పాతిక అంగుళము వెడల్పుగలిగిన చిన్న గ్రంథములుగముద్రింపబడినభగవ ద్గీత-ఖురాను- షేక్స్పియరునాటకములు-మొదలగు గ్రంథములుఅనేక ములు ప్రదర్శింపబడినవి.

## ప్రత్యేక శాస్త్రీయ విజ్ఞానప్రదర్శనము

వ్యవసాయము - పరిశ్రమలు - కళలు- మొదలగు వివిధ శాస్త్ర విషయములను గూర్చిన 600 గ్రంథములు ప్రదర్శింపబడినవి.

ఆయా విషయములను గూర్చి వివిధ దేశములయందు ప్రకటింపబడు పలువిధములగు ప్రత్యేక పత్రికలనుగూడ ప్రదర్శించిరి.

ప్రదర్శన యంత్రములు: బొమ్మలను జూపు "క్లోక్" అను చిన్న సినిమా యంత్రమును - ఒక మ్యాజిక్కు లాంతరును — మామూలు పటము లన్నింటిని తెరమీద పెద్దవిగా జేసి జూపించునట్టి "రేడియో ఆప్టికన్" అను యంత్రమును, పెద్ద "స్టెరియో స్కోపును" "స్టెరియో గ్రాఫులను" మొత్తము ఇరువదింటిని ప్రదర్శించిరి.

అచ్చుయంత్రములు: గ్రంథాలయములయందు అచ్చుపనులను అతి సులభముగా చేసికొనుటకు అనుకూలముగ నుండునట్టి "రెంప్రింటర్" అను యంత్రమును గూడ ప్రదర్శించిరి. ఈయంత్రము వలన అతి స్వల్పకాలములో వేలకొలది ప్రతులను ముద్రింప వీల గును. ఇన్ని విధములుగనున్న గ్రంథాలయ ప్రదర్శనాభాగము మొత్తము ప్రదర్శనమున కంతకును రాజై యొప్పినదని చెప్ప వచ్చును.

చలన చిత్రములు: ఈ ప్రదర్శనమునందు ప్రతిదినమునను రాత్రి 7 గంటలు మొదలు 9 గంటల వరకును సినిమెటాగ్రాఫు ప్రదర్శనముగూడ ఉచితముగా జూపబడినది; ఈ యంత్రము ఖరీదు పదివేల రూపాయలు. ఇదియెల్లప్పుడును బరోడా రాజ్యమందు సంచరించుచు జనులను జ్ఞానవంతులుగ జేయుచుండును. ఇందు జూపబడు బొమ్మలతో బాటుగ వానికి సంబంధించిన విషయములనుగూర్చి ఉపన్యాసములనుగూడ నిచ్చి, జనుల నుద్బోధించు చుందురు. ఈ "సినిమోటాగ్రాఫు" ప్రదర్శనమును జూచుటకై నిత్యమును అనేక వేలమంది పురుషులును, స్త్రీలును, బాలురును, గూడవిచ్చేసి యానంద మునందోలలాడు చుండిరి.

## గ్రంథాలయోద్యమము - బరోడా

బరోడా సంస్థానాధీశులగు శ్రీ శాయాజీ గాయక్వార్ గారు ఆధునిక కాలమున భరతఖండమందు గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటయందు మార్గదర్శకులు. 1910 వ సంవత్సరమునందు

ఈ యుద్యమము నూరాజ్యము నందు ప్రారంభమైనది. అమెరికా దేశమునందు విశేషమైన యనుభవమును గలిగిన "బోర్డన్" అనువారిని శ్రీవారు ఆ సంవత్సరమందు పిలిపించి, "కేంద్ర గ్రంథాలయము"ను బరోడా పట్టణము నందు స్థాపించిరి. గ్రంథాలయోద్యమము సరియైన మార్గముల నడచునట్లు చేయుటకును, అందు బాటులోనున్న గ్రంథాలయము లన్నియు, అన్యోన్యాశ్రయములుగా నుండునటుల జేయుటకును, ఈ కేంద్రగ్రంథాలయము ప్రతిష్ఠాపనము చేయబడినది. శ్రీవారు స్వయముగా చదువుకొనుటకై వివిధ విషయములను గూర్చిన అమూల్య గ్రంథములను 20,000 లను సేకరించి స్వంత గ్రంథభాండాగారమున నిక్షేపించిరి. ఈ గ్రంథముల నన్నిటిని కేంద్ర గ్రంథాలయమునకు దానము జేసిరి. ఇప్పుడా గ్రంథాలయమున ఆంగ్లము, గుజరాతి, మహారాష్ట్రీ భాషాగ్రంథములు 70,000 ల వరకు గలవు. ఈ గ్రంథములందు అపూర్వములు, అమూల్యములు నగు గ్రంథము లనేకములు గలవు. గ్రంథముల నన్నిటిని నవీన శాస్త్ర పద్ధతుల ప్రకారము వర్గీకరణముచేసి మంచిస్థితియం దుంచిరి.

ఈగ్రంథభాండారమునకు ఉన్నతాధికారిగ జె. యస్. కడాల్ కారుగారు • నియమింపబడిరి. వీరు అమెరికా, ఐరోపా, జపాను, మొదలగు విదేశములకు బోయి పదునారు మాసముల కాలమును గడిపి-ప్రపంచమునందున్న గొప్ప గ్రంథాగారము లన్నింటిని దర్శించి వచ్చిరి. ఈ యుద్యమమునందు ఆయా దేశములందెల్ల ఎట్లు అభివృద్ధి మార్గములను ద్రొక్కుచున్నారో వారు స్వయముగా జూచివచ్చి, ఆయాపద్ధతులనన్నిటిని ఇచట ఆచరణయందు బెట్టుటకై ప్రయత్నించుచున్నారు. వీరికి జీతము నెల 1 కి రు 250 లు; వీరికి సహాయము చేయుటకై సహాయాధికారి యొకడు గలడు. వీరిపేరు శ్రీ యం.ఎస్. అమీను; బరోడామహారాజుగారు గ్రంథాలయోద్యమమును ప్రారంభించుటకు పూర్వమే వీరు అక్కడక్కడ గ్రంథాలయములను స్థాపించి

---

• వీరు 1919 వ సంవత్సరమున మద్రాసులో జరిగిన ప్రథమ "ఆలిండియా పబ్లికు లైబ్రిరీసు కాన్ఫరెన్సు" నకు అధ్యక్షత వహించిరి.

పనిచేసి యున్నారు. వీరికిజీతము నెల 1కి రు 150 లు; ఇంతేగాక ఉన్నత గ్రంథభాండాగారి యొకడు గలడు; వీరికి జీతము నెల 1 కి రు 350 లు; సహాయ గ్రంథభాండాగారులు ఆరుగురు గలరు. వీరికి నెల 1 కిజీతముఒక్కొక్కరికిరు75లు; ఇద్దరుగ్రంథభాండాగారిణులుగలరు; వీరికి నెల 1 కి రు 50 ల నిచ్చెదరు. మరియొక సహాయ గ్రంథభాండాగారిణిగూడ గలదు. ఆమెకు నెలకు 20 రూపాయల నిచ్చెదరు. గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన పనులను నిర్వర్తించుటకై పదునైదుమంది గుమాస్తాలు గలరు. వీరికి పదునేను రూపాయలు మొదలు నలుబది రూపాయలవరకును జీతముల నిచ్చెదరు బంట్రోతులును చిల్లరపనులు చేయువారును కలసి ముప్పదిమంది గలరు. వీరికి ఆరు మొదలు పది రూపాయలవరకు జీత మిచ్చెదరు.

## కేంద్ర గ్రంథాలయము

కేంద్రగ్రంథాలయమును ఇప్పుడు నాలుగు అంతస్థులుగల భవనమునం దుంచినారు. ఈ భవనము బరోడా మహారాజు గారిదే. గ్రంథాలయమునకు ప్రత్యేక స్వంతభవన నిర్మాణమునకై ప్రయత్నములు జరుగుచున్నవి. అచిర కాలములోనే ఆరులక్షల రూప్యములు విలువగలిగినట్టి సుందర మందిరమును నిర్మించి, అందే కేంద్రగ్రంథాలయము నుంచెదరు. ఈ గ్రంథాలయ శాఖకు నెల 1కి రు. 2,500 లు వ్యయమగును. దీనికి మించి పదునైదు వేల రూప్యముల విలువగల నూతన గ్రంథములను ప్రతి వత్సరమును గ్రంథాలయమునకు సమకూర్చుచుండెదరు. ఈ గ్రంథాలయమందు నిత్యమును 500 మంది పాఠకు లరుదెంచి గ్రంథములను పత్రికలను చదువుచుండెదరు. నిత్యమును 200 మంది గ్రంథముల నిండ్లకు దీసుకొనిపోవుచుందురు.

ప్రత్యేక బాలశాఖ:ఈ గ్రంథాగారమునందు పిల్లలకు ప్రత్యేక శాఖ కలదు. ఈ శాఖయందు పిల్లలు చదువుకొనుటకును చూచుకొనుటకును బొమ్మల పుస్తకములున్నవి. గోడల నన్నిటినిబొమ్మలతో అలంకరించియున్నారు.ఇంతేగాక పిల్లలు ఆడుకొనుటకుపలువిధములగు

చక్కని ఆటలును గలవు. పిల్లలకు కథలు చెప్పుట, వివిధ గ్రంథము యందలి బొమ్మలను చూపించి బోధించుట, మంచి సంగతులనుచదివి చెప్పుట మొదలగు పనులన్నింటిని స్త్రీ గ్రంథభాండాగారిణులే నెరవే ర్చెదరు.

స్త్రీలకు ఉచిత గ్రంథసేవ: ఇంతేగాక బరోడా పట్టణమునగల స్త్రీ సమాజములకు గూడ గ్రంథముల నంపెదరు. ఈ గ్రంథాలయము నుండి గ్రంథములను తీసికొని పోగోరు వారెవ్వరును ద్రవ్యమెంత మాత్ర మియ్యనక్కరలేదు. ముప్పది రూప్యముల జీతమునకు మించి నట్టి ఉద్యోగస్థుడుగాని, వృత్తిపన్ను నిచ్చువారుగాని, భూమిపన్ను నిచ్చువారుగాని, లేక న్యాయవాదివృత్తి నవలంబించిన వారు గాని జవాబుదారిగానున్న యెడల-అట్టివారికెల్ల గ్రంథముల నెరువిచ్చెదరు. గ్రంథములను పదునైదు దినములు తమయొద్ద ఉంచుకొనవచ్చును.

## గ్రంథాలయ సేవా పథకము

ఉచిత గ్రంథాలయముయొక్క ప్రయోజనములను ఒక్క బరోడా పట్టణమునకేగాక, రాజ్యము నంతకును గూడ కలుగజేయవలెనని శ్రీ గాయక్వారుగారు ఈ యుద్యమమును ప్రారంభించినారు. ప్రథమమున బరోడా రాష్ట్రమందున్న నగరముల యొక్కయు, పట్టణముల యొక్కయు చిన్నపల్లెల యొక్కయు సంఖ్యను, వానియందున్న జన సంఖ్యను, చదువగలిగిన వారి సంఖ్యను, దెలిసికొనిరి. బరోడా నగరముతో గలుపుకొని నాలుగు నగరములును, 39 పట్ట ణములును, 426 పెద్దపల్లెలును, 2,633 చిన్నపల్లెలును ఆ రాజ్యము నందు ఉన్నట్లు లెక్క తేలినది

## సేవా నిర్వహణ రీతి

బరోడా నగరమునందు కేంద్రగ్రంథాలయమును స్థాపించి నారు గనుక, మిగిలిన మూడు నగరములందును, ఆ నగరములు ముఖ్యపట్టణములుగా గల జిల్లాయందలి గ్రంథాలయము లన్నింటికిని అందుబాటులో నుండునట్లుగా 20,000 పుస్తకములుగల గ్రంథాలయ ములుండునట్లును - 39 పట్టణములలోను ఒక్కొక్కచోట 5,000

పుస్తకములు గల గ్రంథాలయములను స్థాపించుటకును,-426 పెద్దపల్లెల లోను ఒకొక్కచోట 500 గ్రంథములు గల గ్రంథాలయముల నేర్పర చుటకును, మిగిలిన చిన్నపల్లెల యందొక్కొక్కచోట 200 గ్రంథములు గల గ్రంథాలయముల నేర్పరచు టకును తీర్మానించి, కార్యక్రమము నారంభించిరి,

## ప్రత్యేక గ్రంథాలయ పాలనా శాఖ

అంతట కేంద్ర గ్రంథాలయము యొక్క అధికారము క్రింద గ్రంథాలయోద్యమము ప్రభుత్వమువారి పరిపాలన యందొక ప్రత్యేక శాఖగ నేర్పాటు జేయబడినది. గ్రంథాలయములు పైన జెప్పబడిన ప్రకారము బరోడా రాజ్యమందంతటను వ్యాపించి, వాని వలన ప్రజలు నిజముగా నభివృద్ధిని బొందవలెనన్నచో, ప్రజలకు ముందుగా వానియందు అభిమానము గలుగవలెను. ఉచితముగా లభ్యమైన వస్తువునందు ప్రజల కంతగా ఆదరణ ముండకపోవచ్చును; సొమ్మంతయు ప్రజలే ఖర్చుపెట్టి గ్రంథాలయములను స్థాపించుకొనవలయునని రాజు శాసించినచో, ప్రజలయందు ఉత్సాహము లేక పోవుటచేతను, దారిద్ర్యము వలనను అట్టిపని ఆచరణ యోగ్యము గాక పోవచ్చును. కావున ప్రజలయందు ఈ యుద్యమము పట్ల ఉత్సాహమును ఆదరణమును కలుగ జేయుటకును, గ్రంథాలయములు స్థాపించిన వారికి పుష్కలముగ సొమ్ము లభించుటకును శ్రీ శాయాజీ మహారాజుగారు కొన్ని నియమములను ఏర్పరచిరి.

## గ్రంథాలయ స్థాపన ప్రణాళిక

(1) గ్రామ గ్రంథాలయస్థాపన పథకము :— ఏ గ్రామ వాసులైనను ఏబది రూపాయలను గాని, అంతకుమించిన మొత్తమును గాని తమ గ్రామమునందు నూతన గ్రంథాలయమును స్థాపించుటకు గాను వసూలుజేసి, కేంద్ర గ్రంథాలయము వారికి దెలియపరచిన యెడల "పంచాయతీ" నుండి ఏబది రూప్యముల నిప్పించి, తా మేబదిరూపాయల నిచ్చెదరు. అనగా నూతన గ్రంథాలయమును స్థాపించు కొనుటకై ఏ గ్రామవాసులైనను ఏబది రూపాయల విరాళమును వసూలు

జేసుకొనిన మాత్రిన, మరి నూరు రూపాయలు విరాళము లభించును. ఇంతేగాక, ఇరువదియైదు రూపాయలు వెచ్చించినచో నూరు రూపాయలు విలువగల దేశభాషా గ్రంథములను కేంద్ర గ్రంథాలయము వారా గ్రంథాలయమునకు బహుమతిగా నిచ్చెదరు. దివాను గారిచే నియమింపబడిన ముగ్గురు పెద్దలుగల సంఘమువారు ఈబహుమతి గ్రంథములను నిర్ణయింతురు. ఆ గ్రంథములను ఆయా గ్రంథాలయము లందలి జనులెల్లరు చదువుకొనుటకు హక్కుకలిగి యుందురు; ఇతర నిబంధనలను ఆయా గ్రంథాలయములవారే ఏర్పరచు కొనవచ్చును. కేంద్ర గ్రంథాలయమునుండి పంపబడు సంచార గ్రంథాలయ పేటిక లనుగూడ ఈ గ్రామ గ్రంథాలయములు తెప్పించుకొనవచ్చును. ఇట్టి గ్రంథాలయమునకు "గ్రామ గ్రంథాలయ"మని పేరు – దేశభాషా గ్రంథములు గలిగిన "పెట్టెల"ను మాత్రమే ఈ గ్రామ గ్రంథాలయముల కంపెదరు.

(2) పట్టణ గ్రంథాలయములు :– నాలుగు వేలకంటె ఎక్కువ జనాభా గలిగిన గ్రామస్థులు రు 300 లనుగాని అంతకంటె తక్కువ సొమ్మునుగాని ప్రతి సంవత్సరమును వసూలు చేసికొనినచో, "పంచాయతీ" గాని "మునిసిపాలిటీ" గాని సంవత్సరమునకు రు 300 లను, కేంద్ర గ్రంథాలయ శాఖవారు సంవత్సరమునకు మరియొక రు 300 లను ఒసంగెదరు. ఇట్టి గ్రంథాలయములకు "పట్టణ గ్రంథాలయము" లని పేరు. ఆంగ్లేయ భాషాగ్రంథములు గలిగిన "సంచార గ్రంథాలయ పేటిక"లనుగూడ ఈ పట్టణ గ్రంథాలయముల కంపెదరు. ఇట్టి పట్టణ గ్రంథాలయము దానికి దగ్గరనున్న గ్రామ గ్రంథాలయమునకు సంబంధించిన వ్యవహారములను తనిఖీ చేయుచు ఆయా గ్రామములకు "సంచార గ్రంథాలయ పేటిక" ల నందుబాటు చేయుచుండవలెను. ఒక గ్రామమునందుగాని పట్టణమునందుగాని ఒకటికంటె నెక్కువ గ్రంథాలయములను స్థాపింపవలసిన యావశ్యకతనుగూర్చి కేంద్ర గ్రంథాలయము వారే యోచించెదరు.

(6) జిల్లా కేంద్ర గ్రంథాలయము భవనములు:- ఏ జిల్లా వారయినను ఆజిల్లా ముఖ్యపట్టణమునందు "జిల్లా కేంద్ర గ్రంథాలయ"మును స్థాపింప దలచి, సంవత్సరమునకు రు 700 లను వసూలు చేయ గలిగినయెడల, "పంచాయతీలుగాని "మునిసిపాలిటీ"లుగాని సంవత్సరమునకు రు 700 లను, కేంద్ర గ్రంథాలయ శాఖవారు మరియొక రు 700 లను విరాళముగ నిచ్చెదరు. జిల్లా కేంద్ర గ్రంథాలయము ఆ జిల్లాయందున్న గ్రంథాలయము లన్నింటి మీదను అధికారమును గలిగియుండును. ప్రభుత్వమువారి సహాయమును పొందుచుండు గ్రంథాలయము లన్నియు కేంద్ర గ్రంథాలయ పరిపాలనకు లోబడి యుండును. ఏ గ్రంథాలయమైనను స్వంతభవనమును నిర్మించ దలచుకొని అందుకు కావలసిన సొమ్ములో మూడవ వంతును వసూలు జేసికొనినయెడల, మిగిలిన రెండువంతులలో ఒకవంతు సొమ్మును "పంచాయితీ" యును మరియొకవంతు సొమ్మును కేంద్రగ్రంథాలయమువారును ఇచ్చెదరు. అట్టి భవనములయొక్క 'ప్లాను'లను మాత్రము కేంద్రగ్రంథాలయమువా రంగీకరింపవలెను.

గ్రామ గ్రంథాలయములను వారమున కధమము పదునాలుగు గంటలైన తెరచియుంచవలెను. శలవు దినములయందును రెండుగంటల కంటె ఎక్కువ కాలమే తెరచియుంచవలెను. పట్టణ గ్రంథాలయమును జిల్లా గ్రంథాలయమును ప్రతిదినము 6 గంటల కాలమునకు తక్కువ గాకుండ తెరచియుంచవలెను.

## గ్రంథాలయ నివేదికలు

గ్రామ గ్రంథాలయము-పట్టణగ్రంథాలయమునకు మూడు మాసముల కొకసారి - దాని కార్యక్రమమును దెలియజేయు నట్టి "రిపోర్టు" పంపవలెను. పట్టణ గ్రంథాలయము దానియొక్క అభివృద్ధియు, గ్రామ గ్రంథాలయములకార్యక్రమమును తెలియజేయునట్టి 'రిపోర్టు'నుమూడు మాసముల కొకసారి జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు పంపవలెను. అదియు దాని యొక్క కార్యక్రమమును-దానిక్రిందనున్న గ్రామపట్టణ గ్రంథాలయములకార్యక్రమమును తెలియజేయునట్టి 'రిపోర్టు'ను మూడు

మాసముల కొకసారి రాష్ట్రకేంద్ర గ్రంథాలయమున కంపవలెను. ఒక జిల్లాయందు పట్టణ గ్రంథాలయములు లేనప్పుడు, గ్రామ గ్రంథాలయములు జిల్లా గ్రంథాలయములతోనే ఉత్తర ప్రత్యుత్తరములను జరుపుకొనవచ్చును. ఒక జిల్లాయందు జిల్లాగ్రంథాలయము కూడ లేనపుడు కేంద్ర గ్రంథాలయముతోనే ఉత్తర ప్రత్యుత్తరములను జరుపుకొనవచ్చును.

ప్రభుత్వమువారి సహాయమును పొందుచుండు గ్రంథాలయము లన్నియువాని ఆదాయమును ఈ క్రిందివిధముగ వ్యయపరుపవలయును.

| | |
|---|---|
| గ్రంథముల కొనుటకు | నూటికి 25 వంతులు |
| పత్రికల కొరకు | నూటికి 30 వంతులు |
| అద్దెలు, సామానులు | నూటికి 20 వంతులు |
| ఇతర ఖర్చులు | నూటికి 25 వంతులు |

అనగా ఒక గ్రంథాలయమునకు సంవత్సరమునకు రు 100లు ఆదాయము వచ్చుచుండినయెడల పైన వివరించిన వంతుల ప్రకారము ఖర్చుపెట్టుకొనవలెను.

గ్రంథాలయ కార్యకర్తలు :- గ్రామ గ్రంథాలయములు పల్లెయందుండు ఉపాధ్యాయుని స్వాధీనమందుగాని, ఇతర గ్రామ పెద్దల స్వాధీనమందుగాని యుండును. పట్టణ గ్రంథాలయము ఒక భాండాగారికని, ఇతర ఉద్యోగులను ఏర్పరచుకొనును; గ్రంథాలయ మంతయు భాండాగారి స్వాధీన మందే యుండును. దాని పరిపాలన కంతకును అతడే బాధ్యుడై యుండును. జిల్లా గ్రంథాలయమునకు ఇతర నౌకరులేగాక, కొందరు గుమాస్తాలుకూడ నుందురు. అవసరమునుబట్టి ఒకరుగాని అంతకంటె ఎక్కువ మందిగాని భాండాగారులు ఉండెదరు. ప్రధాన భాండాగారి గ్రంథాలయముల పరిపాలనకు బాధ్యుడుగ నుండును.

జిల్లా, పట్టణ, గ్రామ గ్రంథాలయము లన్నిటినిగూడ, ముగ్గురు కంటె తక్కువయు, తొమ్మండుగురుకంటె మించని సంఖ్యగల ప్రాముఖ్యులు కార్యనిర్వాహక సంఘముగ నేర్పడి పరిపాలింతురు.

ఎన్నికలు:- ఆయా గ్రంథాలయములయొక్క చందాదారులు - ఆయా గ్రంథాలయములకు ప్రతి సంవత్సరమును- కార్యనిర్వాహక సంఘము నెన్నుకొనెదరు. క్రొత్త సంఘమును ఎన్నుకొను వరకును ప్రాత సంఘమే పనిజేయు చుండును. సంవత్సర మధ్యకాలమందు కార్యనిర్వాహక సంఘమునందు గలుగు "ఖాళీ"లన్నియు, ఆ సంఘము వారే భర్తీ చేసికొనెదరు. ప్రతి గ్రంథాలయమును దాని పరిపాలనకు కావలసిన నిబంధనలనన్నిటిని అదియే నిర్మించుకొనవచ్చును. అట్లు నిర్మించుకొన్న నింధనల నకలును గ్రంథాలయ శాఖాధ్యక్షునకు పంప వలయును.

పనిచేయని గ్రంథాలయములు:- ప్రభుత్వము వారి సహాయ మును పొందుచున్న గ్రంథాలయముల నన్నిటిని జాతి - మత -కుల విచక్షణ లేకుండ సర్వజనులు ఉపయోగించుకొను నధికారము గలదు. ఒక పట్టణమందుగాని పల్లెయందుగాని ఒక గ్రంథాలయమునకు మాత్రమే ప్రభుత్వము వారు సహాయము చేసెదరు. ఏ గ్రంథాలయ మైన సరిగ పనిచేయుటలేదని తోచినప్పుడు, అట్టి గ్రంథాలయము నకు చేయు సహాయమును విరమించెదమని ప్రభుత్వము వారు ఒక సంవత్సరమునకు ముందుగా, ఆ గ్రంథాలయమునకు తెలియబరచెదరు. ఆ సంవత్సరమందు ఆ గ్రంథాలయము తిరిగి మంచిస్థితికి వచ్చిన యెడల, ప్రభుత్వమువారి సహాయము యథాప్రకారముగ లభ్యమగును. ఇట్లు సహాయమును పొందు గ్రంథాలయము లన్నియు ప్రభుత్వము వారి అధికారమునకు లోబడియే యుండును.

గ్రంథాలయము - పన్నులు :- ఏ జిల్లా పంచాయతీ యైనను గ్రంథాలయములకు సంబంధించిన పన్నులను ప్రజలమీద విధింప దలచిన యెడల, ప్రభుత్వమువారు అచటి స్థితిగతుల నాలోచించి అనుజ్ఞ నొసంగెదరు. అట్టి పన్నును 'చదువను' 'వ్రాయను' సమర్థత గలిగిన మనుజులందరి మీదను, ఒక్కొక్కనికి ఒక అణా లేక రెండు అణాలు చొప్పున విధించెదరు.

ఈ పద్ధతుల ననుసరించి ఇప్పటివరకు (1916 వరకు) బరోడా లో కేంద్ర గ్రంథాలయముగాక 400 గ్రామ గ్రంథాలయములును, 39 పట్టణ గ్రంథాలయములను 3 జిల్లా గ్రంథాలయములును స్థాపింపబడినవి. ఆ రాజ్యమునందు 4000 కన్న నెక్కువ జనసంఖ్యగల పట్టణములు 39 మాత్రముగలవు. 1,000 కన్న నెక్కువ జనసంఖ్య గల గ్రామములు 4 6. బరోడా రాజ్యముయొక్క మొత్తము జన సంఖ్య 1916 సంవత్సరమునకు 20 లక్షలు మాత్రమే.

## సంచార గ్రంథాలయములు

గ్రంథాలయములు లేని గ్రామము లందలి ప్రజలును, చిన్న గ్రంథాలయములవారును, పుస్తకములుకావలెనను వాంఛను తెలియ జేసినయెడల "సంచార గ్రంధపేటిక"లను ఆయా గ్రామముల కంపె దరు. ఒక్కొక్క పెట్టెయందు 15 మొదలు 30 వరకు గ్రంథముల నుంచెదరు. ఉపాధ్యాయులు, వ్యవసాయదారులు, పిల్లలు, స్త్రీలు, మొదలుగాగల వారికి వారి అభిరుచుల కనుగుణ్యములగు గ్రంథము లను జాగ్రత్తగ నాలోచించి ప్రత్యేకముగ పెట్టెలయందుంచి, కట్టు దిట్టముగ గట్టి, ఆయా గ్రామముల కంపెదరు. ఆ పుస్తకములు మూడు మాసములవరకు ఒక గ్రామమునం దుండవచ్చును. అటు పిమ్మట తమ గ్రామమునందున్న కాలమున ఎన్ని గ్రంథములు గ్రామస్థుల కొసంగబడినవో,ఏవిధములగుగ్రంథములనువారుజదివిరో, ఎంతమంది చదివిరో – ఈ విషయములను తెలియజేయు నివేదికతో కేంద్ర గ్రంథాలయాధికారికి ఆ గ్రంథముల పెట్టెను తిరిగి పంపివేయ వలెను; ఉపయోగింపబడిన గ్రంథముల ననుసరించి, తిరిగి గ్రామస్థు లకు వారి అభిరుచుల కనుగుణములైన గ్రంథముల పెట్టెలను ఆ గ్రామములకు పంపుచుండెదరు.

గ్రంథాలయములుచక్షురక్షరసంయోగముచేయగలిగిన వారికేగాక నిరక్షర కుక్షులకుగూడ జ్ఞానదాయకము... నుండవలయును. జ్ఞాన మును ఆహ్లాదముతో ప్రజలు సంపాదించుకొనుటకు దగిన సదుపా యము లుండవలెను; ఈయుద్దేశముతోడనే "సినిమెటోగ్రాఫు"లను,

"స్టిరియోస్కోపు"లను- శ్రీశాయాజిగ్రా క్వాడ్ గారు కేంద్రగ్రంథాలయశాఖకు దానమొసంగిరి. ఈ శాఖోద్యోగులు ఈ యంత్రములను తీసుకొని ఆ రాజ్యమందలి గ్రామములకెల్ల బోయి, వీనిమూలమున దేశీయులందరికిని జ్ఞానమును వెదజల్లు చున్నారు.

### గ్రంథాలయ నిర్వాహణ మొక ప్రత్యేక శాస్త్రము

గ్రంథాలయములను పరిపాలనచేయుటకు తగిన జ్ఞానము ప్రత్యేకమైన అభ్యాసమువలనగాని యలవడదు. పాశ్చాత్యదేశముల యందది యొక ప్రత్యేకశాస్త్రమై విరాజిల్లుచున్నది. అనుభవమును మిళితముజేసి ఈ శాస్త్రమునందు బోధించవలసిన విషయము లనంత ములుగ గలవు. అందుచేత బరోడా కేంద్రగ్రంథాలయ సంస్థాపన కనుబంధముగ "గ్రంథాలయ సంఘము" నొకదానిని 1913 సంవత్సరము ఏప్రియలు నెలయందు స్థాపించిరి. ఇందు భాండాగారులు తరుచుగ సమావేశమై తమ యనుభవములను పరస్పరము దెలుపుకొను చుండెదరు. గ్రంథ పరిశోధనాంశములనుగూడ చర్చింతురు. గ్రంథాలయ నిర్వాహణము ప్రత్యేకశాస్త్రము. దాని నభ్యసింప జేయుటకు విద్యార్థి వేతనముల నిచ్చి ప్రత్యేకముగా ఒక పాఠశాల నేర్పరచి, కొంతమందిని ఆ శాస్త్రమునం దారితేరిన వారిని జేసిరి.

ఇట్లు బరోడా రాజ్యమందలి ప్రతి పట్టణమందును పల్లెల యందును, ప్రతి మనుజునకును జ్ఞానము దైవదత్తమగు వాయువు వలెను తేజమువలెను సమృద్ధిగను వెల లేకయే లభించుటకై, గ్రంథాలయములను వాని కంగములుగ-వివిధ శాఖలను ఆ మహారాజు స్థాపన జేసెను గదా !

అంతటితో తృప్తినొందక తన యనుభవములను తాము స్థాపించిన ప్రతిష్ఠాపనల యొక్క కార్యక్రమమును ఇతర రాష్ట్రముల వారలుకూడ నేర్చుకొని లాభము పొందుటకై తమ బొక్కసము నుండి విశేష ధన వ్యయమును జేసి, "లైబ్రరీమిసెలెనీ"యను సర్వాంగ సుందరమగు త్రైమాసిక పత్రికను మూడు భాషలయందు ప్రచురించు

నట్లు చేసినారు. ఆ పత్రిక బోధచేయుచున్న విషయములే మనదేశ మందిట్టి యుద్యమ స్థాపనకు మార్గదర్శకము లయినవి.

బరోడారాజ్యమున జరుగుచున్న పనిని జూచి సంతోషించి "అమెరికా సంయుక్తరాష్ట్ర గ్రంథాలయ సంఘము" వారు శ్రీ గాయక్వార్ గారిని, గ్రంథాలయ శాఖాధ్యక్షులగు "కుడ్వాల్కరు" గారిని, తమ సంఘమునందు గౌరవ సభ్యులుగా జేర్చుకొనిరి.

ముగింపు

బరోడా గ్రంథాలయ శాఖాధ్యక్షులగు శ్రీ కుడ్వాల్కరుగారికి ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమందు గల యభిమానము కడు మెండు. వారు మన యుద్యమమునుగూర్చి తరుచు జాబుల మూలమున సంజాయిషీని తెప్పించుకొని, దానిని వారి పత్రికయందు ముద్రించుచున్నారు. దూరమునుండి వారిచే జూపబడుచున్న ప్రేమతో తృప్తిని బొందక, స్వయముగా వారిని దర్శించి వచ్చితిని. నేను బరోడాయందున్న కాలమున "లైబ్రరీమిసలేనీ" సంపాదకులగు శ్రీ కడ్వాల్కరుగారును, సహాయసంపాదకులగు "దాదాఛాంజీ" గారును, ప్రదర్శనమును జూపుటయందేమి, కేంద్ర గ్రంథాలయమును దర్శింప చేయుటయందేమి - ఇంకను యితర విషయములయందేమి, అమితమగు సహాయమును చేసియుండిరి. అంతేగాక "కేంద్రగ్రంథాలయ సంచార గ్రంథభాండాగార శాఖాధ్యక్షు" లగు యన్. సి. దివాంజిగారు నా కాతిథ్యమిచ్చి, నేనక్కడున్న దినములు సుఖప్రదములును సంతోషదాయకములును నగునటుల జేసిరి. వారందరికిని కృతజ్ఞుడను.

రామమోహన ధర్మ పుస్తక భాండాగారము.

బరోడానుండి తిరిగివచ్చినప్పుడు బెజవాడ రామమోహన ధర్మ పుస్తక భాండాగారమునందు "బాలశాఖ" నేర్పాటుచేయుటకు కావలసిన బాలల పుస్తకములు * "ఆటల పరికరములు మొదలగువానినెల్ల

* ఈ "ఆటల" విధానములను "చదువు అనే ఆట" "ఎట్లా ఆడుకోవాలి" అను వ్యాసమున ఈ సంపుటమునందే చూతనగును. పేజీ 198.

బొంబాయినుండి తీసికొని వచ్చితిని. తీసికొని వచ్చుటయేగాక 17-2-17 తేదీన "బాలశాఖ"ను గూడ ఏర్పాటుచేసితిని.

గ్రంథాలయ సర్వస్వము – సంపుటి 1 – సంచిక – 1 – 1915–16.

"బరోడారాజ్యము – గ్రంథాలయములు" అను గ్రంథము "న్యూటన్ మోహన్‌దత్తు" గారిచే రచింపబడి 1928వ సంవత్సరమున "బరోడా కేంద్రగ్రంథాలయము"వారిచే ప్రచురింపబడినది. దానిలో మన ఆంధ్రగ్రంథాలయోద్యమమును గూర్చి–54వ పేజీలో– ఈ క్రింద విధముగ ప్రశంసించిరి.

"మద్రాసు రాజధానిలో తెలుగు మాట్లాడు ప్రాంతములందు గ్రంథాలయోద్యమ వ్యాప్తికై – ముఖ్యముగ – జిల్లా, తాలూకా, గ్రంథాలయసంఘములు– గ్రంథాలయముల స్థాపించు విషయమున ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము అద్భుతమైన కార్యక్రమమును నిర్వహించినది. ఈ కార్యక్రమ నిర్వహణమునకు వారు "లైబ్రరీ మిస్‌లెనీ" అను గ్రంథాలయ విషయికమైన పత్రికవలన బొందిన యుత్సాహమును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ స్థాపకులు హృదయపూర్వకముగ నంగీకరించు చున్నారు. ఇతర ప్రతిష్ఠాపనలతోబాటు – ప్రాచీన జాతీయ ప్రతిష్ఠాపనములైన– దేవాలయము, గ్రామసంఘములు–; నవీన సార్వజనిక గ్రంథాలయము– తమ వ్యవస్థయందు సమ్మేళన మొనరించి ఒక నూతనమైన గ్రంథాలయ విధానమును ఆంధ్రులు రూపొందించు చున్నటుల కాన నగును"

---

# జనార్దన కుడాల్కరు

## బరోడా గ్రంథాలయోద్యమోద్ధారకులు

బరోడా సంస్థానాధీశులు 1910 వ సంవత్సరమునందు ధర్మగ్రంథాలయోద్యమమును తన ప్రజల జ్ఞానాభివృద్ధికిగాను ప్రారంభించెను. తాను ప్రవేశపెట్టిన నిర్బంధోచిత ప్రారంభవిద్యకు తోడుగా తన రాష్ట్రమందంతటను గ్రంథాలయములను స్థాపించి, ఈ యుద్యమమును వ్యాపింపజేయుటకుగాను బరోడా మహారాజుగారు

అమెరికా దేశమునుండి గ్రంథాలయశాస్త్ర ప్రవీణుడైన "బోర్డను" అనువారిని ఆహ్వానించిరి. శ్రీ జనార్దన కుడాల్కారుగారు ఆయనకు సహాయకుడుగా నియమింపబడిరి. "బోర్డను" గారు తమ దేశమునకు తిరిగి పోయిన పిమ్మట, గ్రంథాలయశాఖాధ్యక్షునిగా శ్రీ కుడాల్కారు గారే నియమింపబడిరి. అప్పటినుండియు బరోడా గ్రంథాలయోద్యమాభివృద్ధికి ఆయన పట్టుగొమ్మయై అనేక విధముల పాటుబడెను.

ఆయన 1882 వ సంవత్సరమున జనన మందెను. ఆయనతండ్రి మిక్కిలి బీదవాడు; కులముచేత విశ్వబ్రాహ్మణులు. ఆయన జననమునకు పిమ్మట కొలది కాలమునకే తండ్రి చనిపోయెను. అయినను పట్టుదలతో కష్టపడి విద్యాభ్యాసము జేసి విద్యార్థి వేతనములను బొంది 1906 సంవత్సరమున ఏం. ఏ. పరీక్షయందు త్తీర్ణుడయ్యెను.

లాహోరునందలి దయానంద ఆంగ్లో - వేదకళాశాలయందు 1909 సంవత్సరము వరకు ఆయన సంస్కృతోపాధ్యాయులుగా పని జేసిరి. ఆ సంవత్సరమునందాయన బరోడా మహారాజుగారి రాజమందిర గ్రంథాలయమునకు గ్రంథభాండాగారిగా నియమింపబడిరి. పిమ్మట 1910 సంవత్సరమందు గ్రంథాలయోద్యమ వ్యాపనార్థమై అమెరికా దేశమునుండి "బోర్డను" దొరగారు రాగా, వారికి ప్రధాన సహాయకారినిగా నియమింపబడెను.

బరోడా రాజ్యమున, జనులకు ముందుగా చదువుకొనుట యందు అభిరుచిని గలిగింపవలెను. అందుకుగాను దోహదము చేయవలయును. ఆ ప్రయోజనము సిద్ధించుటకు ప్రధాన నగరముల యందును, పల్లెలయందును, పట్టణ, గ్రామ, గ్రంథాలయములనే గాక జిల్లాలలో నాలుగింటి యందును జిల్లా గ్రంథాలయములను గూడ స్థాపింపవలెను. ఇట్టి మహత్తరమైన పనియందు "బోర్డను" గారికి కుడాల్కరుగారు కుడిభుజముగనుండి విశేషముగ తోడ్పడినారు.

1913 సంవత్సరమునందు మహారాజుగారి ఆజ్ఞానుసారము కుడల్కరుగారు ఐరోపా - అమెరికా - జపాను దేశములను దర్శించి, ఆయా దేశములందు పనిచేయుచున్న గ్రంథాలయముల పద్ధతులను

విపులముగా నవగాహన మొనరించుకొని స్వదేశమునకు దిరిగివచ్చిరి. వారు ముఖ్యముగా తమ యాత్రలయందు విశేషకాలము అమెరికా దేశమందే గడపిరి. ఇతర దేశములయందుకన్న ఆ దేశమునందే గ్రంథాలయోద్యమ వ్యాపక విషయమైన సంగతులు విశేషముగా నేర్వవలసినవి కలవని వారు గ్రహించిరి.

వారు 1915 సంవత్సరమున బరోడాకు తిరిగివచ్చిన వెంటనే, "బోర్డను" దొరగారి స్థానమందు గ్రంథాలయశాఖకు అధిపతిగ నియమింపబడిరి; మహారాజుగారు వీరియం దుంచిన గౌరవమును వీరును సార్థక పరచిరి. వీరు ఈ యుద్యమమునకై చేసిన కృషివలన బరోడా సంస్థానముయొక్కయు, మహారాజుగారి యొక్కయు కీర్తి భారత వర్షమునం దేగాక, పాశ్చాత్య దేశములయందు గూడ వ్యాపించినది.

పాశ్చాత్యదేశములయందును, అందు ముఖ్యముగా అమెరికా దేశమందును గ్రంథాలయములు జనులను ఆకర్షించుటకు జేయు ప్రచార పద్ధతులయొక్క ఉపయోగమును గ్రహించినవారై కుడాల్కరుగారు వానిలో చాలభాగమును బరోడాయందు అనుసరించి మంచి ఫలితమును జూపెను.

శ్రీ కుడాల్కరుగారు ఉత్సాహవంతులును కార్యదీక్షగల వారును నగు యువకులు. పత్రికా ప్రదర్శనములను, గ్రంథ ప్రదర్శనములను, సంగీత ప్రదర్శనములను — ఎన్నింటినో ఏర్పరచి గ్రంథాలయోద్యమమందు జనులకు నెక్కువ ఉత్సాహము గలుగునటుల జేసిరి.

బరోడా కేంద్రగ్రంథాలయ పక్షమున ప్రాచీన సంస్కృత గ్రంథప్రకటనమునకు ఒక గ్రంథమాలనుగూడ ప్రారంభము జేసిరి. గ్రంథాలయశాస్త్ర విషయములను ప్రకటించుటకై "లైబ్రరి మిస లేని" అను పత్రికకు సంపాదకులై మిక్కిలి సమర్థతతో నిర్వహించిరి. ఇది భారత వర్షమందు అట్టి విషయములను గూర్చి ప్రకటింపబడిన ప్రథమత్రైమాసిక పత్రిక యొక్కటే. ఈ పత్రికయొక్క ఉత్కృష్టతనుగూర్చి ఐరోపా అమెరికా దేశము లందలి గ్రంథాలయ పత్రి

కలు గూడ ప్రశంసించినవి. భారత వర్షమునందు గ్రంథాలయోద్య మమును వ్యాపింపజేయుటకు ఈ పత్రిక మిక్కిలి సహకారి యయ్యెను.

కుడాల్కరుగారు మహారాష్ట్రభాషయందు కూడ పండితులు. ఆ భాషయందలి పత్రికలకు తరుచు వ్యాసములను వ్రాయుచుండెను. 1917 సంవత్సరమున ఇండోరు నగరమున జరిగిన తొమ్మిదవ "మహారాష్ట్ర సారస్వత మహాసభయందు"వీరు "బాలబాలికల సాహిత్యము" అను విషయమునుగూర్చి వ్యాసము నొకదానిని జదివిరి. అ వ్యాసము అందరి ప్రశంసలను బడసెను.

ఆ వ్యాసము విని ఆనందించి, ఆ సభకువచ్చిన వారిలో నొకరు దానిని తిరిగి ముద్రింపించి ఉచితముగా పంచిపెట్టించిరి. 1919 సంవత్సరమున పునహా నగరమున జరిగిన "ఓరియంటల్ కాన్ఫరెన్సు" నకు వీరు బరోడా రాజ్యపక్షమున ప్రతినిధిగా బోయిరి. 1919 సంవత్సరమున అప్పుడు వైస్రాయిగానుండిన లార్డ్ "ఛెమ్సుఫోర్డు" బరోడా సందర్శించు నప్పటికి "బరోడా గ్రంథాలయోద్యమము" అనుచక్కని గ్రంధమును రచించి ఆయన ప్రచురింపజేసిరి*

1918 సంవత్సరమున జనవరినెలలో లాహోరు నగరమున అఖిల భారత గ్రంథాలయసభ యొకటి ప్రభుత్వమువారి ఆధ్వర్యమున ప్రారంభింపబడినది. ఆ సభ కేవలము దొరతనమువారి నియమముల కే లోబడుటచే, ప్రజాసామాన్యమున కచట స్థానము లేకపోయెను.ఆసభకు ఆంధ్ర దేశగ్రంథాలయ సంఘముయొక్క ప్రతినిధులను పంపుటకై ప్రయత్నించితిమి. అందుకు ప్రభుత్వమువారు అంగీకరింప లేదు.ఆ సభ కేవలము శాస్త్రవేత్తలకు ఉపకరించునదిగా పరిణమించి

* 1924 వ సంవత్సరమున జులై నెలలో "ఇండియన్ లైబ్రరీజర్నలు" అను ఆంగ్ల త్రైమాసపత్రికను "అఖిలభారత గ్రంధాలయ సంఘ" పక్షమున కార్యదర్శియగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు ప్రచురించ ప్రారంభించిరి. తరువాత కొంతకాలమునకు మాసపత్రిక దానిని ప్రచురించిరి.

ఇది భారతదేశమున అఖిలభారత గ్రంథాలయోద్యమవ్యాప్తికి వినియోగపడిన ప్రప్రథమ ఆంగ్ల మాసపత్రిక.

నది. కాని గ్రంథాలయ సూత్రములలో రెంటిని మాత్రము వారంగీకరించిరి. గ్రంథాలయములు అన్యోన్యాశ్రయములుగా నుండవలె ♦ ననుట మొదటిది; శాస్త్రపరిశోధన చేయువారలకు తగిన పరికరములను సిద్ధపరచి అమర్చుట రాజ్యాంగము యొక్క విధి యను నది రెండవది. పల్లెటూరు గ్రంథాలయములను గూర్చిగాని, గ్రంథాలయోద్యమ వ్యాప్తిని గూర్చిగాని అందు ప్రసక్తిలేదు.

అందుచేత ప్రజల పక్షమున సార్వజనిక గ్రంథాలయోద్యమ వ్యాప్తికై అఖిలభారతసభ నొకదానిని సమావేశపరచవలెనని కృషి చేసి 1919 సంవత్సరము అఖిలభారత సార్వజనీన గ్రంథాలయ మహాసభను ♦♦ మదరాసునందు సమకూర్చితిని. శ్రీ కుడాల్కరుగారు గ్రంథాలయోద్యమమునకై చేసినకృషికి ఫలితముగ ఈ సభకు వారిని అధ్యక్షునిగా ఏర్పరచితిమి. వారు తమ అనుచర సిబ్బందితో మదరాసు విచ్చేసి ఆ సభను మిక్కిలి జయప్రదముగా నిర్వహించిరి. ఈ సభలో గ్రంథాలయోద్యమము "జాతీయోద్యమము" అగునా కాదా యనుసు దీర్ఘమగు చర్చ జరిగినది. అందుమీద సభాధ్యక్షులగు కుడాల్కరుగారు "కాస్టింగు" వోటు నిచ్చి ఇది జాతీయోద్యమమే

♦ ఈ సభయొక్క రెండవ సమావేశము జరుగలేదు. మొదటి సభతోనే దీని కార్యకలాపము లంతరించినవి.

♦♦ "మదరాసునందు 14-11-1919 తేదీన జరిగిన "ప్రథమ అలిండియా పబ్లికు లైబ్రరీ కాన్ఫరెన్సు" ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు ఏర్పాటుచేసినారు. మదరాసు రాజధానికి గవర్నరుగారగు వెల్లింగుటన్ ప్రభువు ఆదరణక్రింద ఆ సభ జరిగినది. ఆ సభకు బరోడా రాజ్య గ్రంథాలయాధికారియగు శ్రీ జె యస్. కుడాల్కరుగారు అధ్యక్షత వహించినారు. ఆ సభయందే "అలిండియా పబ్లికు లైబ్రరీ అసోసియేషన్" ఏర్పడినది. తరువాత భారతవర్షమున వివిధ రాష్ట్రముల యందు వార్షిక సభలను జరిపినది. "బరోడా రాజ్యము - గ్రంథాలయములు" కర్త: శ్రీ న్యూటను మోహనుదత్తు - 'బరోడా కేంద్ర గ్రంథాలయ ప్రచురణ పుట, 56 - 1928.

యని నిర్ణయించిరి. ఆ సభయందే అఖిల భారత సార్వజనిక గ్రంథాలయ సంఘమును ఏర్పరచితిమి.

శ్రీ కుడాల్కారుగారి ఉత్సాహమునకు అంతులేదు. గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటకు తగిన మార్గములను అన్వేషించుటకై వారు ఎల్లప్పుడును యోచించుచునే యుండిరి.

అట్టి శ్రీ జనార్దన కుడాల్కారుగారు 1921 వ సంవత్సరమున విషమజ్వరముచే పరమపదవిని బొందుటవలన బరోడా దేశమునకేగాక, భారతగ్రంథాలయోద్యమమునకు గూడ తీరని నష్టము వాటిల్లినది.

—గ్రంథాలయ సర్వస్వము - ఏప్రియలు 1925.



# ప్రాచీన భారతము
## గ్రంథాలయములు

### భారతీయైశ్వర్యము

అనేక శతాబ్దములనుండియు భారతవర్షము యొక్క వైశ్వర్య ముచే నితర దేశములవా రనేకు లాకర్షింప బడుచుండుట మన కంద రకును దెలిసిన విషయమే. సోమనాథ్, ఢిల్లీ మున్నగు పురముల నుండి అమితమగు ధనమును తమ దేశములకు గొనిపోయిన సుల్తాన్ మహమ్మద్ నాదిర్‌షాలను గూర్చియు, దక్షిణ హిందూదేశ దేవా లయములందు పాతిపెట్టబడియున్న మితిలేని ఐశ్వర్యమును గూర్చియు మనము వినుచున్నాము.

కాని భారతవర్షమునుండి సంస్కృత వ్రాతగ్రంథములను గొంపోయి అరబ్బీ భాషానువాదములు చేసి మన శాస్త్రములును, గాథలును ఐరోపాయందున్న జాతులయందు ప్రబలుటకు సహాయ భూతులైన "బాగ్దాదు" "ఖాలిఫ్"లను గూర్చిగాని అనేక అపూర్వ గ్రంథముల వ్రాతప్రతులచే నింపబడి మన పూర్వీకులచే ప్రతిష్ఠింప బడిన భారతీ భాండాగారములను గూర్చిగాని సరస్వతీ భాండాగార ములను గూర్చిగాని మనము వినుచుండుటలేదు.

### సంస్కృతీ సంపద

భారతవర్షము యొక్క వర్తకమును తమ స్వాధీనమం దుంచు కొనవలెనని పాశ్చాత్య దేశములు పెనగులాడుటకు కారణభూతము లైన బంగారు, వెండి, వజ్రవైఢూర్య, మరకత, మాణిక్యాదు లతోగాని, పట్టుసెల్లాలు, ఉన్నిశాలువలతోగాని, ఇతర సంబారము లతోగాని మన దేశముయొక్క ఐశ్వర్యము సంపూర్ణముగాదు. ముఖ్యముగ సారస్వతమందును, కళలయందును, ఆధ్యాత్మికజ్ఞానము నందును, మన వైశ్వర్యము సంపూర్ణముగ విజృంభించి యున్నది. ఈ యాధ్యాత్మికైశ్వర్యముచే గూడ దూరదేశస్థు లనేకు లాకర్షింప

బడి యుండిరి. అట్టివారి నామములు చరిత్రయందు మనకు లభింపక పోయినప్పటికిని భారతవర్షమునందు వారు సంపాదించిన అమూల్యము లైన జ్ఞానైశ్వర్యముచే ప్రపంచమునందలి చింతనలన్నియు ఐశ్వర్య వంతములయినవని జెప్పుట కెంతమాత్రమును సందియములేదు.

## లిఖిత గ్రంథములు

అచ్చువేయుటకు సౌకర్యములేని ప్రాచీనకాలమునందు గ్రంథ భాండాగారముల నేర్పరుచుటకు జనులెంత శ్రమపడి యుండిరో యూహించుటకైన నలవిగాదు. వాని నేర్పరచినవారికి విద్యాభివృద్ధి యందు గల ఆసక్తియు, భక్తియు వర్ణనాతీతములు. ఆరిందాయగు నొక ముసద్దీ, చిన్న గ్రంథమైనచో - కొన్ని నెలలును, పెద్ద గ్రంథ మైనచో - కొన్ని సంవత్సరములును తదేక నిష్ఠతో కష్టపడివ్రాసిన గాని తయారుగాదు. అట్టి స్థితియందు కొన్నివేల గ్రంథముల నొక చోట గూర్చుట కెంతమంది మనుష్యులు, యెన్ని సంవత్సరములు శ్రమపడవలసియుండునో యూహించుటకైన నలవిగాదు. ఇపు డన్ననో దివ్యమైన భవనము నొకదానిని సంపాదించి అందు కొన్ని వేల గ్రంథముల నొకసారియే కొనిపెట్టిన అది గొప్ప గ్రంథాగార మగుచున్నది. ఇతర ప్రతిష్ఠాపనల వలెనే గ్రంథాగారమును నిర్మిం చుట గూడ ఆ కాలమునందు కార్యపరతంత్రులగు మహాపురుషుల వలన మాత్రమే నెరవేరుచుండెడిది. లిఖితగ్రంథమునకు ప్రతిదాని చివరను "యద్దృష్టం తల్లిఖితమ్" అను వాక్యమును వ్రాసి గ్రంథమును ముగింపునకు దెచ్చుచుండిరి. అనగా "ఎట్లు చూచితి తినో అట్లే వ్రాసితి"నని యర్థము. ఇట్టి కష్టములకు లోనై మన పూర్వులు భారతవర్షమునం దంతటను ప్రతిష్ఠించిన గ్రంథాలయము లను గురించి కొంచెము తెలిసికొందము

## శ్రుతపాండిత్యము - సారస్వత సంరక్షణము

ప్రాచీనకాలమునందు విద్య నభ్యసించు పద్ధతి ఇప్పటివలె నుండెడిదికాదు. ఆ కాలమునందు గురుసన్నిధానమున గురుముఖ ముగ శిష్యులు పాఠములను కంఠపాఠము జేయుచుండిరి. అట్లు శ్రుత పాండిత్యమునే యెక్కువగ నభివృద్ధిపరచిరి. ఇందు చేత విద్యార్థికి

తాను జదివిన గ్రంథములెల్ల కంఠస్థములై పుస్తకాపేక్ష లేకయే ఎప్పుడే విషయము కావలసినను సిద్ధముగ జ్ఞప్తియందుండు చుండె డివి. పుస్తకములనువ్రాసి జాగ్రతపరచుకొనుట సామాన్యులకు సాధ్యము కానిపనియగుటచేగూడ నా కాలమునందు శ్రుతపాండిత్యమే యెక్కువ వ్యాప్తముగా నుండుట యొక కారణమై యుండ వచ్చును.

"ప్రాతి మోక్షము" ను కావ్యము బౌద్ధులకు మిక్కిలి పవిత్రమైన కావ్యము. దీనిని ప్రతి మఠమునందును నెలకొకసారి భిక్షువులు పునశ్చరణ చేసికొనవలెను. ఏ మఠమునందైనను దీనిని కంఠపాఠముగ వల్లింపగల భిక్షులు లేనియెడల తమకు సమీపముగనున్న మఠము నుండి దీనిని చింతనముజేసిన భిక్షువును బిలిపించి వల్లింపవలెను. అంతియేగాని గ్రంథప్రతిని దెప్పించుకొని చదువగూడదని నిర్ణయింపబడెను భిక్షువులు వర్షాకాలమందు ప్రయాణము జేయగూడదను నియమము గలదు. కాని యే భిక్షువైనను తన యవసానకాలమందు తా నెరిగియున్న సూత్రాంతముల నితరులకు జెప్పవలెనని వాంఛించినపుడు, వారీ నియమమును మీరవచ్చును. ఈ విషయములనుబట్టి ఆ కాలమందు శ్రుతపాండిత్యమున కెట్టి ప్రాధాన్యమీయబడెనో తెల్లము గాగలదు.

'పాహియాను' అను చీనాదేశ యాత్రికుడు క్రీ॥ శ॥ 5 వ శతాబ్ద ప్రారంభమున "వినయ" అను బౌద్ధమతగ్రంథ సంపాదనార్థమై భారతవర్షమునకు వచ్చినపు డాయన కా గ్రంథముయొక్క వ్రాత ప్రతు లెక్కడను దొరికియుండలేదు. గురువులు ముఖతః మాత్రము పాఠములను జెప్పుచుండిరట.

## ప్రాచీనకాలమున గ్రంథాలయములు

భారతవర్షమున ప్రథమమున గ్రంథ భాండాగారముల నేర్పరచినది బౌద్ధులని చెప్పవచ్చును. "పాహియాను" సంస్కృతభాషను చదువుటకును, గ్రంథముల ప్రతులను వ్రాసికొనుటను మూడు సంవత్సరముల కాలమును పాటలీపుత్రమందు గడిపియున్నాడు. మరియు

"మహాసాంఘికము" "సర్వాస్తి వాదము" "సంయుక్తాభి ధర్మ శాస్త్రము" "పరినిర్వాణవైపుల్య సూత్రము" "మహాసాంఘికాభి ధర్మము" అను గ్రంథములనుగూడ చూచెను. ఈ గ్రంథములకన్న ప్రాచీనములగు సంస్కృత గ్రంథముల వ్రాతప్రతులు మధ్యాసియా యందున్న బౌద్ధ విహారములయందు గానుపించినవి. కాని అయిదు, ఆరు, ఏడు శతాబ్దములయందు బౌద్ధవిహారములు మన దేశమునం దంతటను ప్రబలి విద్యావ్యాసంగమునకును వివిధములగు కళల యభి వృద్ధికిని కారణభూతము లయ్యెను. అప్పుడే మహాయాన పౌరాణిక బోధనలు ప్రాముఖ్యమునకు వచ్చి- శాస్త్రము, వేదాంతము, మతము మున్నగు విషయములను గూర్చిన గ్రంథములు విశేషముగ ప్రబలి నవి.

## దేవాలయ - మఠ - గ్రంధాలయములు

ఆసియా ఖండమునంతకును నలంద విశ్వవిద్యాలయము మాతృరాజమై వెలసినప్పటినుండియు, గ్రంథభాండాగారములకు ప్రత్యేకముగ గొప్ప భవనములు నిర్మింపబడుచుండెను. బౌద్ధ జైన మఠము † లాయా మతగ్రంథములకు నిలయములైన రీతినే, గుప్త వంశ చక్రవర్తుల కాలమున దేశమందలి దేవాలయము లన్నియు సనాతన ధర్మగ్రంథములకు నిలయము లయ్యెను. దేవాలయములు మున్నగువానికి గ్రంథదానము చేయుట పరమోత్కృష్టమగు కార్య మని "హేమాద్రి" తన "దానఖండము" నందు ♦ చెప్పియున్నాడు. హైందవ, పౌరాణిక, మతానుసారులేగాక బౌద్ధజైన మతావలంబకులు గూడ దీనిని ఘనకార్యము క్రింద పరిగణించిరి † ఈ కాలమునాటి శాసనములు గూడ గ్రంథములను దానమిచ్చుటయందు గల పాశస్త్యము నుద్ఘోషించుచున్నవి.

---

† వీనిని విహారములనియు, సంఘారామములనియు, ఉపాశ్రియములనియు, మఠములనియు పిలిచెదరు.

♦ Referred to in Buhler's Indian paleography P. 89.

† Crasastis of the old Manuscripts.

పశ్చిమ హిందూదేశమునేలిన "వలాభి" రాజులచే వ్రాయబడినట్టియు, క్రీ. శ. 568 సంవత్సరము నాటిదియు నగు నొక శాసనమునందు బౌద్ధభిక్షులదగు "దుద్ధ"మఠము యొక్క యుపయోగార్థమై సద్ధర్మ పుస్తకములను గొనుటకై విరాళము నొకరిచ్చినటుల చెప్పబడినది. ఇప్పటికినిగూడ జైనులలో ధనవంతులు గ్రంధప్రతులను వ్రాయించుటకును, పవిత్ర గ్రంథముల నభివృద్ధి పరచుటకును మఠాధికారులకు విశేష ద్రవ్యము నొసంగెదరు. అందుచేత పశ్చిమ హిందూదేశమున జైన గ్రంథాలయములయందు ఒకే గ్రంథమునకు వందల కొలది ప్రతులుగూడ నేర్పడినవి. "అహమ్మదాబాదు"నందున్న ఒక గ్రంథాగారమునందు "ఆవశ్యక సూత్రములు" అను జైన గ్రంథముయొక్క నాలుగువందల వ్రాతప్రతులు గలవు.

## గ్రం థా ల య త్రి య ము

బౌద్ధ, జైన మతములయందు గల గ్రంథాలయములను గూర్చియు, హిందువుల దేవాలయములయందు గల గ్రంథాలయములను గూర్చియు నింతవరకును జెప్పితిమి. ఈ రెండును ద్వివిధములగు పరిజ్ఞానములకు నిలయములై యొప్పినవి. కాని కాలక్రమమున చక్రవర్తుల పోషణచే లౌకికసారస్వతము అభివృద్ధియైనకొలదిని రాజభవనములును, సభామండపములును గూడ గ్రంథభాండారములకు నిలయము లయ్యెను. నేటికిని యీ త్రివిధములగు గ్రంథభాండారములకును దృష్టాంతములు నిలిచియే యున్నవి. ఇట్లు నిలిచియున్న వానిలో మొదటి తరగతివగు పశ్చిమ హిందూదేశమునందలి జైన భాండారములును, వివిధ మతములయందున్న గ్రంథాలయములును, తంజావూరు, కాశ్మీరము, నేపాలు, మైసూరు రాజభవనములయందున్న గ్రంథభాండారములును, రాజపుత్ర సభామండపములయందున్న గ్రంథభాండారములును ముఖ్యములై నవిగ నున్నవి.

## ప్రసిద్ధ బౌద్ధ గ్రంథాగారములు

నలంద:- బౌద్ధభిక్షులకు సంబంధించిన ప్రాచీన గ్రంథాలయములకెల్ల పెద్దదియు, ప్రఖ్యాతియైనదియు నగు గ్రంథాలయము

"నలంద" గ్రంథాగారమై యున్నది. భారతవర్షమున ప్రాచీనకాలమందుగల విశ్వవిద్యాలయములయందెల్ల ఈ గ్రంథాగారమే అగ్రస్థానము వహించియున్నది.

ఈ గ్రంథాలయము "ధర్మగంజ" అనిపేరు గల ప్రత్యేక ప్రదేశమునందు ఏర్పరుపబడి, "రత్నసాగర – "రత్నోదధి" – "రత్నరంజక" – అను నామములతో విరాజిల్లుచున్న మూడు భవనములయం దుంచబడినది. "రత్నరంజక" మనునది లలితకళలకు సంబంధించిన గ్రంథాలయమై యుండనోపును. మిగిలిన రెండును, వేదాంతమునకును మతమునకును సంబంధించిన గ్రంథాలయములై యుండనగును. ఈ మూడు గ్రంథాలయ భవనములలో రత్నసాగర మనునది తొమ్మిది యంతస్థులు గల గొప్ప గ్రంథాలయమై యున్నది. ★

ప్రాచీన భారతీయ వాఙ్మయమునగాని, శిలా శాసనములందుగాని; గ్రంథాలయములను గూర్చిగాని, గ్రంథాలయ శాస్త్రములను గురించిగాని సూటి వివరములు దొరకకపోయినను – గ్రంథముల వర్గీకరణ పద్ధతిని గురించియు, గ్రంథాలయ వర్గీకరణ శాస్త్రమును గురించియు మన పూర్వులు శ్రద్ధవహించియే యుండిరని తెలుసుకొనుటకు గర్వించుచున్నాము. విశ్వవిద్యాలయములయందు, దేవాలయములందు, పీఠములయందు, గల గ్రంథాలయము లందలి గ్రంథముల నన్నిటిని వర్గీకరణ పద్ధతి ననుసరించియే యుంచిరనుటకు సందియము లేదు. వంశపారంపర్యముగా పండితులకు సంక్రమించుచున్న స్వంతగ్రంథాలయము లందలి గ్రంథములుకూడ వర్గీకరింపబడియే యుండుటను మనము చూచుచున్నాము. ఇట్టి వంశీకులయొద్ద నున్న వ్రాత గ్రంథములు తరగతులను బట్టి విభజించియే కట్టలుగా కట్టబడి యున్నట్లు కూడ మనము తెలిసికొనుచున్నాము.

---

★ "Glimpses of Ancient India" by Radha Kumud Mookherji.

కాళిదాస కవి యొక్క "కుమారసంభవ"మును, కౌటిల్యుని అర్థశాస్త్రమును చదివిన యెడల, గ్రంథముల వర్గీకరణమును గూర్చిన సూచనలు వానిలో అగుపడుచునే యున్నవి. ★

నలంద యందలి రత్నసాగర గ్రంథాలయము

"బుద్ధగయ" యందు గల తొమ్మిది యంతస్థుల దేవాలయమునే ఇది పోలియుండును. ఈ గ్రంథాగారము "మహాయాన" "హీనయాన" బౌద్ధగ్రంథములకెల్ల రక్షకస్థలమని చెప్పవచ్చును. ఈ గ్రంథములయం దెల్ల 'ప్రజ్ఞాపరిమిత సూత్రము', 'సమాజ గుహ్య సూత్రము' అను తాంత్రిక గ్రంథములు ప్రధానములు. ఈ గ్రంథాగారము నందలి గ్రంథము లన్నియు ఏమయ్యెనో చెప్పుట కాధారము లేమియు లేవు. కాని ఈ మఠమునందున్న క్రొత్త శిష్యుడొకని వల అవమానింపబడి "తీర్థిక" భిక్షుకుడొకడు దీనిని దగులబెట్టెనని టిబెట్టు దేశమునందు ప్రచారమునందున్న ఒకకథవలన తెలియుచున్నది. ఏడవ శతాబ్దమునందు నలంద విశ్వవిద్యాలయము ఉచ్ఛదశయందున్నపుడు మనదేశమునకు చీనా దేశస్థుడగు "హ్యుయన్ త్సాంగు" అను యాత్రికుడు విచ్చేసెను. † ఆయన గ్రంథాలయముల యొక్క వ్రాత ప్రతులను, విలువగల యితర వస్తువుల ననేకముగ సంపాదించెను. కాని దొంగలు దోచుకొనుటచేతను, ప్రమాదవశము వలనను, అనేక పర్యాయములు వానిని గోలుపోయెను. అయినను తుదకు బుద్ధుని యస్థికలయొక్క ఏబది శకలములను, వెండిబంగారుల తోడను చందనము తోడను చేయుబడిన బుద్ధుని ప్రతిమలను, ఇరువది గుఱ్ఱములమీద వైచి 657 వ్రాతపుస్తకములతో గూడ, తన దేశమునకు గొనిపో గలిగెను. తన దేశమునకు పోయిన పిమ్మట ఆయన తన జీవితశేషము నంతను భాషాంతరీకరణమునందే గడపెను. అందుచేత 661 సంవత్స

---

★ Ancient view of Classification by S. C. Guha to the "Kane Commemoration Volume" Poona 1941 page 205.

† Early history of India by Mr. Vincent smith p' 3

రమునం దాయన తన సారస్వత పరిశ్రమను ముగించు నప్పటికి వివిధ విషయికములగు 75 గ్రంథములను చీనాభాషలోనికి అనువదించ గలిగెను. భారతవర్షము యొక్క విజ్ఞానైశ్వర్యమును చీనా, జపాను, కొరియా మున్నగు దేశములకు గొనిపోగలిగిన మహాత్ములయం దీయన యొకరు. ఈ కారణము చేతనే మహాయాన బౌద్ధసిద్ధాంతములను గూర్చిన ప్రాచీన సంస్కృత గ్రంథములనేకములు జన్మస్థలమగు భారత వర్షమున లభ్యముకాకున్నను, వాని భాషాంతరీకరణములు మాత్రము చీనా, జపాను దేశముల యందుగల దేవాలయ గ్రంథ భాండాగారముల యందు సురక్షితముగనున్నవి.

ఉదంతపురి: విక్రమశిల: నలంద విశ్వవిద్యాలయము యొక్క ప్రాముఖ్యము క్షీణించుటకు ప్రారంభించినపుడే మగధరాజ్యము నేలుచున్న "పల" రాజుల యాదరణక్రింద "ఉదంతపురి" యందును, "విక్రమశిల" యందును రెండు విశ్వవిద్యాలయములు బయలుదేరెను. ఈ రెండు విశ్వ విద్యాలయములకును అనుబంధముగా మిక్కిలి ప్రాముఖ్యము జెందిన రెండు గొప్పగ్రంథాలయములు గలవు. నలంద, ఉదంతపురి, విక్రమశిల గ్రంథాగారములనుండియే అసంఖ్యాకములగు గ్రంథరాజములను దీసికొనిపోయి తమ భాషను టిబెట్టు దేశీయులుఐశ్వర్యవంతముగ జేసికొనిరి. గ్రంథాగారముంచబడిన "ఉదంతపురి" విహారము "నలంద" "బుద్ధగయ"ల యందున్న విహారములకంటె మహాత్తరమైనదని చెప్పెదరు. ఈ ఉదంతపురి గ్రంథాలయమందు బౌద్ధమత సంబంధములును, సనాతన మత సంబంధములును నగు గ్రంథములు అసంఖ్యాకములుగ నుండెను. క్రీ. శ 1202 సం॥ నందు బీహారు దేశమును భక్తి - యారు - ఖిల్జీ జయించినప్పుడు వాని సేనాని "మహామ్మదు చిన్ సివి"చే నీ గొప్ప గ్రంథాగారమును తగుల బెట్టబడెను.

## సారస్వతైశ్వర్యము తరలుట

ఉత్తర హిందుస్థానమునందున్న విహారములలో చాలభాగము, ప్రథమమున మన దేశమునకు వచ్చిన మహమ్మదీయుల వలననే నిర్మూలము గావింపబడినవి. అందుచేత భిక్షులు తాము మోయగలి

గినన్ని మత గ్రంథములను దీసికొని "నేపాలు" దేశమునకు పారి పోయిరి. టిబెట్టు దేశమునను, హిందూదేశమున కంతను నేపాలు దేశమునందును మాత్రమే బౌద్ధమతమునకు సంబంధించిన సంస్కృత గ్రంథములలో కొన్నియైన దొరికినవి. ఈ భాగములను మిక్కిలి శ్రద్ధతో పరిశీలించిన, బౌద్ధమతమును గూర్చిన అమూల్యములగు విషయములను బోధింపగల అపూర్వ గ్రంథము లింకను బయలు వెడల వచ్చును. నేపాలు దేశమునకు భిక్షులచే గొనిపోబడిన అమూల్యములగు గ్రంథరాజములను కొన్నిటిని మన ప్రభుత్వమువారిచే నియోగితులగు మంత్రులు సంపాదించి ఇంగ్లాండునకు గొనిపోయిరి. ఇది చాలక ఆ దేశమునకు మంత్రియగు మహారాజచంద్ర షంషేరుజంగు బహద్దరు 1919 సంవత్సరమున ఆక్సుఫర్డునగరము నందలి "బోడ్లియను గ్రంథాలయము"నకు 6330 సంస్కృత గ్రంథములను ఉచితముగ నొసంగి మనదేశమునకు యదార్థమగు సారస్వతదారిద్ర్యమును తెచ్చెను. మన దేశమునకున్న యైశ్వర్యమే సారస్వతైశ్వర్యము. ఎంత వెండి పోయినను, బంగారమెంతపోయినను దిగులు పడవలసిన పనిలేదు. కాని యీ విజ్ఞానైశ్వర్యముయొక్క నష్టపరిమితియందు కొంత భాగమైన గూడదీయగల వారెవరును లేరు. ఖిలమయి పోవుచున్న యథర్వణవేదముయొక్క వ్రాతప్రతి నొకదానిని ఆస్ట్రియా దేశమునకు గొనిపోయి దాని పుటలన్నిటికిని ఫొటోగ్రాఫులను దీసి యుంచిరి. ఆ ఫొటోగ్రాఫులను మైసూరునందున్న గ్రంథాలయమునందు మన మిప్పటికిని చూడనగును.

## జైన గ్రంథాలయములు

బౌద్ధగ్రంథాలయములు నశించినప్పటికిని వాని స్థానమును జైన గ్రంథాలయము లాక్రమించుకొనినవి. బౌద్ధమతమువలెనే జైన మతమును భారతవర్షమునం దింకను జీవించియే యున్నది. రాజపుత్రస్థానము, గుజరాతు, పఠాన్, జఫల్మీరు, సూరతు, కాంబే, అహమ్మదాబాదు మున్నగు పట్టణములయందు అనేక జైనుల ఉపాశ్రయము లున్నవి. వీని యన్నిటియందును జైనులయొక్క మతము,

చరిత్రములను తెలియచేయునట్టి ముఖ్యగ్రంథములు కలిగిన గ్రంథాగారములు గలవు. వీనికి "భారతీ భాండారము" లని పేరు. జైన భాండారములయందు ప్రాముఖ్యములగునవన్నియు దక్షిణ హిందూస్థానమునందే గలవు. వీనిలో "పతాను" † అహమ్మదాబాదు, వద్వాను, సూరతు, కాంబే, తరాదు, జఫల్మీరు, భటీన్నరు నగరములయందు గల గ్రంథాలయములందు ప్రతిదానియందు పదివేల వ్రాతప్రతులు కలవు. పూర్వకాలమున 'అన్హిల్వాడ' అను పేరు గల "సిద్ధాపురపతాను" అనునది - పదునొకొండు పన్నెండు శతాబ్దములయందువలెనే - నేటికిని జైన మతమునకు ఆటపట్టయియున్నది. అచటి యుపాశ్రయములయందు "శ్రావకు"లని పిలువబడు యతులు చాలామంది నివసించెదరు. ప్రతి యుపాశ్రయమునందు మతగ్రంథముల వ్రాతప్రతులు కొన్ని భద్రపరుపబడి యుండును. కాలము జరిగినకొలదిని గ్రంథముల సంఖ్యయు, ప్రాముఖ్యమునుగూడ అధికమగుచుండెను. "పతాను" నగరమునందు పదికంటె నెక్కువ యుపాశ్రయములు గలవు వీనిలో కొన్ని చాళుక్య రాజుల కాలమునందు ప్రారంభింపబడినవై యున్నవి; అందుచేత 12, 13 శతాబ్దుల గ్రంథములు మన కచట లభ్యమగును. వీనియందు గ్రంథములు అట్టపెట్టెలయందు భద్రముచేయబడినవి. ఒక్కొక్క పెట్టెయందు పది మొదలు పదునైదువరకు వ్రాతగ్రంథము లుండును. వీనిని యతులు తరచుగా తీసి చదివి వినిపింతురు. అందుచే నివి గాలిపోసుకొని చెడిపోక నిలచియున్నవి. జైన మఠములయందెల్లడలను వ్రాతగ్రంథములను మిక్కిలి శ్రద్ధాభక్తులతో కాపాడుచుండిరి. జైన, బౌద్ధ, శైవ, వైష్ణవగ్రంథాలయము లన్నిటియందును గ్రంథముల ప్రతులను వ్రాయుపనులను యతులే నిర్వహించుచుందురు; దీనియందు వీరి

---

† ఇది బరోడారాజ్యమునందున్నది. ఈ గ్రంథాగారమునుండి అనేక అమూల్య గ్రంథరాజములను వ్రాయించి తెప్పించి బరోడా మహారాజుగారు కేంద్ర గ్రంథాలయ పక్షమున ప్రకటించు చున్నారు.

సామర్థ్యము నిరుపమానము. అందుచేత "నేపాలు" దేశ ప్రభువు యొక్క గ్రంథాగారమునకు వ్రాతప్రతులను తయారుచేయుటకై వీరినే నియోగించిరి.

పఠాను పట్టణము× నందున్న గ్రంథాలయములలోనికెల్ల నలుపది పెట్టెల వ్రాతప్రతులుగల "హేమచంద్ర భాండారము", 1000 ల వ్రాతప్రతులు గల "తథాగచ్ఛ భాండారము", 500 తాటియాకుల గ్రంథములు గల "సంఘ వినపాదన" గ్రంథాగారమును మిక్కిలి ప్రాముఖ్యములై యున్నవి. ఈ సంఘవినపాదన గ్రంథాగారమునందు జైనమతమునకు సంబంధించిన "చూర్ణికలు, వృత్తులు" సహితముగా గలవు. జైనమతమును సారస్వతమును గూర్చిన పరిశోధన చేయుటకును, గుజరాతు దేశ చరిత్రకు సంబంధించిన ఆధారములను సంపాదించుటకును, యీ గ్రంథము లమూల్యములై యున్నవి.

ఈ గ్రంథాగారమునకు పిమ్మట "జసల్ మీరు"నందున్న "పరశనాధ" దేవాలయమందలి భాండారము గొప్పది. దీని యందపూర్వములగు కొన్ని జైనమత గ్రంథములేగాక, పన్నెండు, పదమూడు, పదునాలుగు శతాబ్దములందు వ్రాయబడినట్టి సంస్కృత సాహిత్య కావ్యములును, వైదిక గ్రంథములును అనేకములు గలవు. బిల్హణ విరచితమగు "విక్రమాంక చరితము"ను • జలంధరు వాస్తవ్యులగు ఉపేంద్ర వార్ష పాలికుడు రచించిన "యశోవర్మ విజయము"ను † నిచటనే ప్రథమమున సంపాదింపబడినవి. ఈ సంగతులను బట్టి ఈ గ్రంథాగారములందు మతగ్రంథములే కాక, లౌకిక విషయములగు గ్రంథములనుగూడ స్వీకరించి పెట్టెడివారని స్పష్టమగుచున్నది.

× Catalague of Durbar Library of Nepal by Mahamahopadhyaya Haraprasad Sastri

• దక్కను దేశమును ఏలినట్టి చాళుక్య రాజగు విక్రమాంకుని చరిత్రము.

† వంగదేశము లేక గౌడదేశ ప్రభువుతో పోరి గెలిచినట్టి కనోజి రాజగు యశోవర్మ విజయము.

పశ్చిమ సముద్రతీరమందు కనరా జిల్లాలో "ముదబిద్రి" అను గ్రామమునందు జైనమఠము గలదు. అందు గొప్ప వ్రాత ప్రతుల భాండార మొకటి గలదు. అనేక అపూర్వగ్రంథము లిక్కడ దొరకినవి. మైసూరు సంస్థానమునందున్న "శ్రమణ్ బిల్ గోలా" అను ప్రదేశము జైనమతమునకు ఒక ప్రధానస్థానము. మౌర్య వంశుడగు చంద్రగుప్తుడీ గ్రంధాగారమును దర్శించెనని చెప్పు దురు. ఇచట గల కొండమీద 70 అడుగుల యెత్తుగల నల్లరాతి బండమీద చెక్కబడిన "గొంతీశ్వరు"ని విగ్రహ మొకటి గలదు; క్రీ. శ. 9 వ శతాబ్దమున "చాముండి రాజు"చే నిది నిర్మింపబడి యున్నది. ఈ కొండక్రింద నున్న జైనుల విహారమునందు మంచి స్థితియందున్న గొప్ప గ్రంధాగారము గలదు. ఈ గ్రంథములలో చాలాభాగము తాటియాకులమీద పాలి, సంస్కృతము, కన్నడము, అరవభాషలయందు వ్రాయబడి యున్నవి. మైసూరు రాజ్యమునం దున్న "హుంచ" జైనవిహారమునం దొక సామాన్యమైన గ్రంథా గారము గలదు. ఇంతేగాక విశేషముగ వ్రాతప్రతులు సంపాదించి భద్రముగ కాపాడుచున్న జైనపండితు లనేకు లిప్పటికిని పశ్చిమ హిందూదేశమునందు గలరు.

### సభామంటపములు - గ్రంధాగారములు

సన్యాసులకు నిలయములగు విహారములు, ఉపాశ్రయములు, మఠములతోబాటు రాజుల సభామంటపములుగూడ గ్రంథభాండార ముల కెట్లు నిలయములగుచున్నవో ఇదివరకే చెప్పబడినది. ఈ సభా మంటప గ్రంధాగారములయందు లౌకికవిషయములను గూర్చి నట్టియు, శిల్పకళలకు సంబంధించినట్టియు గ్రంథములు విశేషముగ సేకరింపబడుచుండెను. నాలుగవ శతాబ్దము నుండియు వ్రాయబడు చున్న శాసనము • లనుబట్టి చూచిన ఆ కాలమున + రాజులు కవులను, విద్వాంసులను విశేషముగ నాదరించినట్లు కన్పించును.

• వీనివి పశస్తు లనెదరు.

+ Bhuler's Indian Paleography. P. 99.

కాని పదునొకండవ శతాబ్దమందు దేలిన భోజమహారాజు యొక్క గ్రంథాగారమునకు † పూర్వముండిన సభామంటప గ్రంథాగారములను గూర్చిన ప్రశంస మన కెచ్చటను గానుపించుటలేదు. మధ్యకాలమునందు రాజులచే పోషింపబడిన గ్రంధభాండారముల కెల్ల నిదియే మేటియని చెప్పవచ్చును. 1140 సంవత్సర ప్రాంతమునందు "సిద్ధరాజ జయసింహుడు" మాళవదేశమును జయించి ఈ గ్రంథభాండారమును "అన్హిల్ వాడు"నకు తీసికొనిపోయి అచటనుండినట్టి చాళుక్య గ్రంథభాండారముతో కలిపివైచెను. చాళుక్యరాజుల భారతీ భాండారమునుండి † సంపాదింపబడిన నైషధీయ ప్రతికే విద్యాధరుడు ప్రథమముగ భాష్యమును రచియించెను. మరియు "కామసూత్రము" లనీ భాండారమునుండియే గైకొని, "యశోధరుడు" "జయమంగళ టీక"ను రచియించెను. పైన జెప్పబడిన చాళుక్యరాజుల భారతీభాండారమునందున్న రామాయణ ప్రతి నుండియే జర్మనీ దేశమునందు "బాన్" పట్టణమున గల విశ్వవిద్యాలయమువారు స్వీకరించిన రామాయణ ప్రతి వ్రాయబడినది.

మన ప్రభుత్వమువారు చేసిన వ్రాతప్రతుల పరిశోధనవలన అల్వారు, బికనీరు, జమ్ము, నేపాలు, మైసూరు, తంజావూరు లందు గల ఆస్థాన గ్రంధాగారములు బయలుపడి మిక్కిలి యుపయోగకారు లయ్యెను. ఉత్తర హిందూస్థానమందలి రాజులలో అనేకులను మహమ్మదీయులు వశపరుచుకొని యున్నను - రాజపుత్రస్థానము, నేపాలు, ఒరిస్సా దేశ ప్రభువులును, దక్షిణ హిందూస్థాన ప్రభువులును తమ స్వాతంత్ర్యమును నిలుపుకొని, భోజరాజువలె కవులను, పండితులను ఆదరించి మన విజ్ఞాన మడుగంటకుండ జేసిరి. రాజపుత్రస్థానము, నేపాలు, కాశ్మీరము, తంజావూరు ఆస్థానములయందుగల గ్రంథభాండారములలో సంస్కృతమునందును, యితర దేశభాష

† ఈ రాజుల పేర్లు :- విశాలదేవుడు, విశ్వమల్లుడు.

(క్రీ. శ. 1242 -1262 సం.)

లందును గల అనేక వ్రాతప్రతులను నేటికిని మనము చూచుచున్నాము. పదునెనిమిదవ శతాబ్ది ప్రారంభమునందు "అంబరు" రాజ్యము నధిష్ఠించిన "సవాయజయసింగు మహారాజు" విజ్ఞానవ్యాప్తికై మిక్కిలి పాటుపడెను. ఆయన జయపురమును నిర్మించి కళలను శాస్త్రములను బోషించెను. వీధులన్నియు నొకదానికొకటి సమకోణములయందు సమభాగములుగా భాగించునటుల సరియైనపద్ధతి ప్రకారము కట్టబడిన పట్టణము జయపురము దప్ప వేరొద్దియు లేదు. "విద్యాధరుడ"ను నామముగల వంగదేశజు డొక డీ రాజు దగ్గర నుండెను. రాజు చేయు శాస్త్రవిషయిక ఉద్యమము లన్నిటియందితడు సహాయకారియై సమర్థతతో నెరవేర్చుచుండెడివాడు. ఆయన సహాయముతో ఢిల్లీ, జయపూరు, ఉజ్జయినీ, వారణాసి, మధురా పట్టణములయం దీ రాజు, నక్షత్రములను చూచుటకు వలయు సాధనములతో నమర్చబడిన మందిరములను గట్టించెను. ఆ మందిరములయం దుపయోగింపబడిన పరికరము లన్నియు ఆయనచే స్వయముగ కనిపెట్టబడినవి. అందు చేయబడిన పరిశోధనలు గొప్ప పండితులకు గూడ ఆశ్చర్యమును గొల్పినవి. * ఆయన రేఖాగణితశాస్త్రమును త్రికోణశాస్త్రమును, సంవర్గమానమును సంస్కృతమునందు వ్రాయించెను. మన దేశ దురదృష్టవశముచేత విజయసింగు మహారాజు స్త్రీలోలుడై తన రాజ్యమును, గ్రంధభాండారమును గోల్పోయెను. మిగిలిన గ్రంధములు కొన్ని ఇప్పటికిని జయపురమునందు శ్రోత్రియ బ్రాహ్మణుల యధీనమునం దున్నవి.

జోధపురము, బికనీరు, ఆల్వారు మహారాజుల గ్రంధభాండారములుగూడ మిక్కిలి ప్రఖ్యాతములైనవి. 'జోధపురి' గ్రంధాగారమునందు 1800 సంస్కృత వ్రాతప్రతులును ముద్రితములగు సంస్కృత గ్రంధములును అనేకములును గలవు. ఇంతేగాక దేశభాషల

---

* See Tod's "Rajasthan" and "Account of the Astronomical labours of Jey Singh, Raja of Amber" by Dr. W. Hunter (Asiatic Research Vol. V. P. 177.)

యందు వ్రాయబడిన గ్రంధములు అనేక వందలు గలవు. ఈ గ్రంథాగారమునం దున్న వానిలో పురాణములు, మాహాత్మ్యములు, తాంత్రిక గ్రంధములు అనేకములు గలవు. బికనీరు మహారాజు యొక్క గ్రంథాగారమునందు 2000 సంస్కృత వ్రాతప్రతులు గలవు.

## కాశ్మీరు

అనేక శతాబ్దములనుండి కాశ్మీరదేశము విద్యాధిదేవతకు ప్రీతిగల స్థానమై యున్నది. ఆ దేశమునం దిప్పటికిని సరస్వతీ దేవి తన ప్రభుత్వమును నిరంకుశముగ సాగించుచున్నదని మన పండితుల నమ్మకము.

"రాజతరంగణి" యను సంస్కృత గ్రంధమునందు చెప్ప బడిన అనేకుల కాశ్మీరదేశ కవుల గ్రంధము లింకను కానరాకున్నవి. కావ్యములే గాక, శాస్త్రములు - అందు ముఖ్యముగా వ్యాకరణ శాస్త్రము, అలంకార శాస్త్రములు- ఈ దేశమునం దనేక వందల సంవత్సరముల నుండియు అభ్యసింపబడుచున్నవి. అధర్వణ వేదము నధ్యయనముచేసిన పండితు లిప్పటికిని యీ దేశమునందు మాత్రమే గలరు. చరిత్రాత్మకమగు "రాజతరంగిణి" యను సుప్రసిద్ధ గ్రంధ మిచ్చటనే లభించినది. ఈ దేశ ప్రభువులు మన సారస్వతైశ్వర్య మును గుర్తెరింగి నేటికిని దాని పోషణమునకై సర్వవిధముల తోడ్పడుచున్నారు. ఈ రాజు తన ఆస్థాన మండలి అనేక పండితు లను రప్పించి దేశము యొక్క పలు సంస్థలయందుగల సంస్కృత వ్రాతప్రతులను వ్రాయించి తెప్పించి తన గ్రంధాగారమునందుంచు చున్నాడు. ఈ రాజుయొక్క గ్రంధాగారము "జమ్మూ" పట్టణ మునం దున్నది.

ఈ రాజు వారణాసి పురమునందు కొందరు పండితులనుంచి, ప్రాచీనములగు వ్రాతప్రతులు అమ్మకమునకు వచ్చినయెడల- వానిని క్రయమునకు దీసికొని, ఇప్పటికిని తన భాండారమున నభివృద్ధిచేయు

చునే యున్నారు. * కాశ్మీర దేశమునందు వ్రాయబడిన వ్రాతప్రతులన్నియు మిక్కిలి సొంపుగనుండును. అవి పుష్పలతాదుల తోడను విపరీతములగు సంకేతాక్షరములతోడను అంచులయందు పట్టీల తోడను, చరిత్రాత్మకములగు బొమ్మలతోడను అలంకరింపబడి, తోలుతో బైండు చేయబడి ఎప్పటికిని చెడిపోనిస్థితియం దుండును.

## నేపాలు

ఉత్తర హిందూస్థానమునం దెల్ల ప్రాచీనత చేతనేమి, ప్రాముఖ్యము చేతనేమి, వన్నెకెక్కియున్న గ్రంథభాండారము నేపాలు దర్బారునందు గలదు. గుప్తప్రభువులనాటి వ్రాతప్రతులు గలవు. బౌద్ధమతమునకును వైదికమతమునకుగూడ నేపాలు దేశమునం దాశ్రయము గలదు. మహమ్మదీయులు దేవాలయములను, గ్రంథాగారములను తగులబెట్ట జొచ్చినప్పుడు జనులు చేతనైనంతవరకును అమూల్య గ్రంథములను ఈ దేశమునకు గొనిపోయిరి. అందుచేతనే అతి ప్రాచీనములగు అపూర్వ గ్రంథము లనేకములు ఈ దేశమునందు దొరికినవి. ఈ గ్రంథాగారమునందు కాగితముల మీదను, తాటియాకులమీదను వ్రాయబడిన 600 ల వ్రాతప్రతులు గలవు. ఈ రాజ్యము నేలిన ప్రభువులెల్ల దీని నభివృద్ధిపరచుటకు సదా పాటుబడుచున్నారు. ఈ దేశ శీతోష్ణస్థితి వ్రాతప్రతులు చెడిపోకుండ నుండుటకు మిక్కిలి సహాయభూతముగ నున్నది.

## తంజావూరు

తంజావూరు రాజుల గ్రంథ భాండారమును, మైసూరునందు గల సరస్వతీ భాండారమును దక్షిణ హిందూదేశమునగల వానిలో ముఖ్యములై యున్నవి. ఈ రెండింటియందు తంజావూరు గ్రంథాగారము మిక్కిలి ముఖ్యమైనది. ప్రపంచమునందంతటను తంజావూరు గ్రంథా

---

* 1925 సంవత్సరపు స్థితిగతులు, అవి; అప్పటి ప్రభువుల పరంపర పోయి రాజకీయ ఒడుదుడుకులయందు హిందూ దేశమునందొక భాగముగ కాశ్మీరు దేశము ఇపుడు పాలింపబడుచున్నది.

లయము గొప్పదియు ముఖ్యమైనదియు నని * బర్నెలు దొరగారు చెప్పియున్నారు. తంజావూరును తెలుగు నాయక ప్రభువు లేలు చున్నపుడు పదునారవ శతాబ్దాంత్యముననో, పదునేడవ శతాబ్ది ప్రారంభముననో ఈ గ్రంథాగారము ప్రారంభింపబడినది. ప్రథమ మునం దా రాజులు తెలుగు లిపియందు వ్రాయబడిన సంస్కృత గ్రంథములను సంపాదింప నారంభించిరి.

పదునెనిమిదవ శతాబ్దమునం దీ దేశమును మహారాష్ట్రులు జయించిరి. అప్పటినుండియు గ్రంథసంపాదనయందు శ్రద్ధప్రబలెను. ఇప్పుడు గ్రంథభాండారమునం దున్న సంస్కృత వ్రాతప్రతులలో చాలభాగము శరభోజ మహారాజు వారణాసీపురమునకు బోయి నప్పుడు (1828-30) సంపాదింపబడినవియై యున్నవి. దేవనాగరి, నందినాగరి, తెలుగు, కన్నడము, గ్రాంథి, మళయాళము, బంగాళము, పంజాబీ, కాశ్మీరము, ఓఢ్రము, అరవము- అను పదునొకండు భాషలలో వ్రాయబడిన 8 వేల గ్రంథము లీ భాండాగారమునందు గలవు. భారతవర్షము యొక్క అన్నిభాగములనుండియు సంపాదింపబడిన గ్రంథము లిందు గలవు. సంస్కృత గ్రంథముల యొక్క భిన్న పాఠాంతరము లీ గ్రంథాగారమునందు గలవు. ఈ విషయమునందు దీనితో సాటిరాదగినది యింకొకటి లేదు. తంజావూరు గ్రంథాగారమునందున్న గ్రంథములు సేకరించుటకు ఏడు లక్షల యేబదివేల రూపాయలైన వ్యయపడి యుండునని "బర్నెలు" దొరవారు అభిప్రాయపడుచున్నారు. అపూర్వములగు ఆంధ్రభాషాగ్రంథములు అనేకములు మనకీ గ్రంథాగారమునందే దొరికినవి. యింకను అముద్రితములగు ఆంధ్ర గ్రంథము లనేకములు ఈ గ్రంథాగారము నందు గలవు. వానికి వ్రాతప్రతులు వ్రాయించి ఆంధ్రదేశమధ్య భాగమునం దుండు ఏ గ్రంథాలయమునందైన భద్రపరచి ఆంధ్రులకు అందుబాటునం దుంచుట అత్యంత ఆవశ్యకము.

* Bürnell's letter to the chief Secretary Madras Government 1873, in Giugh',s papers

మైసూరునందున్న సరస్వతీ భాండాగారము పదునెనిమిది సంవత్సరముల క్రిందట అగ్నిదేవున కాహుతి యయ్యెను.

## మొగలాయి చక్రవర్తుల గ్రంథభాండాగారములు

ఆరు శతాబ్దముల కాలమును మనదేశమును మొగలాయి ప్రభువు లేలియుండిరిగదా! మహమ్మదీయులు దేవాలయములను మఠములను నాశనముచేసిన కాలదిని, మన విజ్ఞానైశ్వర్యము ఉత్తర హిందూదేశ పర్వత ప్రాంతముల కెట్లు పారిపోయి తలదాచుకొనిన దియు వినియుంటిమి. అదేరీతిని హిందూదేశ మధ్యభాగము నుండి దక్షిణ రాజ్యములకుబోయి విజయనగర చక్రవర్తుల వలన పోషింప బడినది. "ఖోటాన్" అను పట్టణమునందు డాక్టర్ "స్టీన్" దొర ఒక గ్రంథాగారమును భూమిని త్రవ్వి కనిపెట్టిరి. ఇందు ఏడు భాషలయందు వ్రాయబడిన 4000 వ్రాతప్రతులు గలవు. గ్రంథము లన్నియు కట్టలుగ గట్టబడి మంచిస్థితియందే యున్నవి. మహమ్మదీ యుల దురాగతములకు భయపడి ఈ గ్రంథభాండారమును భూమి యందు పాతిపెట్టి యుందురని పైన జెప్పబడిన 'స్టీన్' దొరగారు అభిప్రాయబడుచున్నారు.

కాని మహమ్మదీయు లెల్లరును యిట్టి దురాగతములను చేయువారుగారు. 'బాగ్దాదు' వాసులగు "ఖాలిఫు"నులు స్పెయిను దేశము నేలిన "మూరు"లును తాము పోయిన స్థలములయందెల్ల గల విజ్ఞానమును నాగరికతను ప్రోత్సాహపరచి వృద్ధిపొందింపజేసిరి. దేవా లయములను నాశనము చేయుటయు, గ్రంథములను తగులబెట్టుటయు మధ్య ఆసియా వాసులగు తురుష్కులకు నైజగుణముగ నుండెను. మహమ్మదీయులు హిందూదేశమున స్థిరనివాసమును ఏర్పరచుకొనిన పిమ్మట క్రమముగా ఆ యల్పబుద్ధియు, మూర్ఖతయు తగ్గ నారం భించెను. ఢిల్లీయందేలిన 'పఠాను' చక్రవర్తి యగు "ఫిరోజిషా తొగ్లా"కునకు జ్వాలాముఖి దేవాలయమున 4000 వ్రాతప్రతు లున్నవని తెలియవచ్చెను. వెంటనే వానిని ఢిల్లీకి దెప్పించి,

ఆ గ్రంధములయందుగల ముఖ్యవిషయము లన్నిటిని అరబ్బీ, ఫారసీ భాషలోనికి భాషాంతరీకరింపజేసెను.

అక్బరు :- మొగలాయి చక్రవర్తులలోకెల్ల అక్బరు పాదుషా కాలమునందు దేశమునందు గల వివిధములగు విజ్ఞానముల కెల్ల ప్రోత్సాహము గలిగెను. సుప్రసిద్ధులగు విద్వాంసులు, కవులు, గాయకులు, చిత్రకారులు వివిధ కళలయందును చేతిపనులయందును గూడ పారంగతు లయినవారు అనేకులు ఆయన ఆస్థానమందుండిరి. ఆయన గ్రంథాగారముతోడనే మనకిప్పుడు ప్రసక్తిగలదు. "†అక్బరుయొక్క గ్రంధాలయము అనేకభాగములుగ నుండెను. కొన్ని గ్రంథము లంతఃపురమునం దుంచబడెను. మిగిలిన వన్నియు సభాభవనమునందు బహిరంగముగా నుంచబడెను. వచనములు, పద్యకావ్యములు, హిందీయందు వ్రాయబడినవి, కాశ్మీరభాషయందు వ్రాయబడినవి "అరబ్బీ" భాషయందు వ్రాయ బడినవి- • అను-విభాగములుగ విభజింపబడి ప్రత్యేక ప్రత్యేకముగ నుంచబడెను.ఇదేవిధమున వానిని అధికారు లప్పుడప్పుడు తనిఖీ చేయు చుండిరి. అనుభవజ్ఞులగు పండితులచే ముఖ్యములగు గ్రంథములను జదివించి ప్రారంభమునుండి తుదివరకు చక్రవర్తి వినుచుండెను. ప్రతిదినమునను జదువుటయైన పిమ్మట, ఆ దినమున చదివిన చివరి పుటయందు చక్రవర్తి చేవ్రాలు చేయుచుండెను. గ్రంథము ముగి సిన పిమ్మట పుటల సంఖ్యనుబట్టి — వెండి, బంగారు నాణెములను చదివినవారికి బహుమాన మిచ్చుచుండెను. ముఖ్యములగు గ్రంథ ముల నన్నింటిని ఆయన చదివించుకొని వినియేయున్నాడు- అందు చేతనే చరిత్రాంశములుగాని, శాస్త్ర విశేషములుగాని, వేదాంత విషయములుగాని ఆయనకు దెలియని వెవ్వియు లేవు. మంచి గ్రంథ

† Rabindra Narayan Ghosh M. A. (Lecturer in Indian history) in 'Dawn' magazine.

• Ain-in-Akbari, Blochmann's translation Vol 1; P. 103

ముల నాయన రెండు మూడుసార్లు చదివి వినిపించుకొనుచుండెను. వినుటయం దెంతమాత్రమును ఆయనకు విసుగులేదు. హిందీ, గ్రీకు, అరబ్బీ, పార్సీ, భాషలనుండి గ్రంథముల నితరభాషలలోనికి అనువాదము చేయుటకు పండితులు నియమింపబడిరి. మహాభారతమును, రామాయణమును పార్సీభాషయందు వ్రాయించెను. "అధర్వవేదము", "లీలావతీ గణితము", "తేజకము" (జ్యోతిష గ్రంథము) "కాశ్మీర దేశచరిత్రము"(నాలుగువేల సంవత్సరముల చరిత్ర) "హరివంశము", "నలదమయంతుల చరిత్ర" మున్నగు సుప్రసిద్ధ గ్రంథముల నన్నిటినిగూడ పార్సీ భాషయందు ఆయన వ్రాయించెను. భాషాంతరీకరణములనేగాక, స్వతంత్ర గ్రంథములనుగూడ అనేకములుగ ఆయన ప్రోత్సహించి వ్రాయించెను.

ఔరంగజేబు:- అక్బరునకు పిమ్మట రాజ్యమునకువచ్చిన చక్రవర్తులుగూడ భాషాపోషణమును చేసియుండుటచేత, ఢిల్లీపట్టణము నందున్న యీ గ్రంథాలయము అపూర్వగ్రంథములకెల్ల నిలయమై విలసిల్లెను. పదునారు, పదునేడు శతాబ్దములయందున్న ముసద్దీవ్రాతకాండ్ర వ్రాతలన్నియు నీ గ్రంథాగారమునం దుండెనని చెప్పవచ్చును. గోలకొండ,హైదరాబాదులను ఔరంగజేబు నవాబు జయించి,అచటగల అనేక వ్రాతగ్రంథములను ఈ భాండాగారమునకు చేర్చెను. ఈ కాలమున మధ్య ఆసియా, పెరిష్యా, అరేబియా దేశములు యుద్ధ సంకీర్ణములై యుండ, ఔరంగజేబు పరిపాలనక్రింద భారతవర్షము మాత్రము శాంతముగ నుండెను. మొగలాయిల కాలమునందు యెనిమిది విధములగు వ్రాతలుండెను. వ్రాతప్రతులన్నిటియందును సుప్రసిద్ధ చిత్రకారులు చిత్రపటములను జేర్చి వాని యుపయోగమును ఎక్కువ జేసిరి. "యూసపు జులెయికా"యను గ్రంథము వ్రాసిన "నూరల్లీ" అను ముసద్దీకి, జహాంగీరుచక్రవర్తి 1000 బంగారు మొహరీలు బహుమానముగ నిచ్చెను. వ్రాతగ్రంథములేగాక, బొమ్మలపుస్తకములనుగూడ అనేకముగ సేకరించిరి..

## ఏషియాటిక్ సొసైటీ

ఇట్టి మహోన్నత దశ ననుభవించిన గొప్ప గ్రంథాగారము యొక్క నాశనము మిక్కిలి విషాదకరము. పదునెనిమిదవ శతాబ్దము నందు ఈ గ్రంథాలయము నందలి గ్రంథము లనేకములు అయోధ్య నవాబుల గ్రంథాగారమునకు గొనిపోబడెను. 1856 సంవత్సరమున సిపాయిల కలహముతోబాటు ఢిల్లీ, లక్నోలు నాశనములైనవి. 1856 సం॥న అయోధ్య అన్యాక్రాంతమైన పిమ్మట అచటి గ్రంథము లనేకములు కలకత్తాకు పంపబడెను. మిగిలినవి లక్నో నగరమునందే నాశనము చేయబడినవి. ముట్టడి సమయమునందీ గ్రంథములు కిటికి టీల కడ్డముగా బెట్టుటకు ఉపయోగింపబడెను. ముట్టడి ఆఖరయిన తరువాత విడిచిపెట్టబడిన గ్రంథములు సిపాయిల వశమయ్యెను. చాల గ్రంథములు వంటచెరకుగా నుపయోగించబడెను. కొద్ది గ్రంథము లను మాత్రము వేలంపాటవేసి అమ్మగా, వంగదేశమునందున్న "ఏషియాటిక్ సొసైటీ" వారు కొనిరి. రాంపురం సంస్థానము నందును, బ్యాంకిపూరు సంస్థానమునందును, పోగా మిగిలిన కొన్ని గ్రంథములు భద్రము గావింపబడియున్నవి. అయోధ్య నవాబు గ్రంథాలయము నందలివి కొన్ని వ్రాతప్రతులు లక్నోనగరమందున్న మ్యూజియమునకు చేర్చబడినవి. ఆ గ్రంథము లన్నిటిమీాదను అయోధ్యనవాబుయొక్క "సీలు" ముద్రింపబడి యున్నది.

## రాజమందిరములు - పార్సీ, అరబ్బీ గ్రంథములు

మైసూరునందు టిప్పుసుల్తాను 2,000 లు గ్రంథములను చేర్చెను. అరబ్బీ, పార్సీ భాషలయందు వ్రాయబడిన ఆ గ్రంథము లలో చాలభాగము ఇంగ్లాండునకు గొనిపోబడెను. అట్లు కొనిపోబడిన ఆ గ్రంథములపట్టిక "కేంబ్రిడ్జి" పట్టణమునందు 1809 సం॥నందు ప్రకటింపబడెను. ఆ గ్రంథములలో కొన్నిటిని ఇంగ్లాండు దేశము నందున్న గ్రంథాలయముల కిచ్చిరి. మరికొన్నిటిని "ఫోర్టు విలియం కాలేజి" కిచ్చిరి. అక్బరుచే పార్సీభాషయందు వ్రాయింపబడిన మహా భారతముయొక్క నాలుగు సంపుటము లిప్పుడు జయపుర గ్రంథా

గారము నందున్నవి. జయపుర గ్రంథాగారమునందు మొగలాయి చక్రవర్తులయొక్కయు, ఇతరుల యొక్కయు చిత్రపటము లనేకములుగలవు.

## ఆల్వారు

ఆల్వారు నందున్న గ్రంథాగారమునందు గూడ అనేక అపూర్వగ్రంథములు గలవు. ఇందున్న గ్రంథములలో చాలభాగము భానిసింగు మహారాజు వలన సంపాదింపబడినవి. పదునైదు దినముల కొక పుటచొప్పున పన్నెండు సంవత్సరములయందు అఘామీర్జా అను మునర్దిచే వ్రాయబడిన "గులిస్థాను" అను కావ్యముగూడ ఈ గ్రంథాగారమునం దున్నది; ఈ గ్రంథమునందు గొప్ప చిత్రకారు లనేకులు వ్రాసిన పటములు గలవు. ఈ గ్రంథమునందున్న పుటల యొక్క అంచులయందు చిత్రింపు బనులను గులాబ్ ఆలీఖాను, బలదేవు, అనువా రిరువురు చిత్రించిరి. ఈ గ్రంథము తయారగుటకు ఒక్క లక్ష రూప్యములైన వ్యయమైయుండును. మూడు వేల రూపాయలను ఖరీదుగను— మంచిదుస్తులను బహుమతిగ నిచ్చి, ఆల్వారు రాజు "కొరాను" యొక్క చక్కని ప్రతి నొకదానిని ఒక ప్రయాణీకుని యొద్ద కొనెను. ఈ గ్రంథము తయారుచేయుటకు పడిన శ్రమను గూర్చి యోచించిన ఈ క్రియధనము కారుచౌకగ నున్నదని "హెండ్లీ" అను దొర వక్కాణించి యున్నాడు. ఈ గ్రంథమున అరబ్బీభాషయందు, ముందు మూలము ఊదాసీరాతో వ్రాయబడి, దానిక్రింద టీక పారసీకభాషయందు ఎర్రసిరాతో వ్రాయబడి యున్నది. మూలమునందున్న ప్రతి యక్షరమునకు చుట్టును తెల్లని యంచు కట్టబడియున్నది. దీనిని జయపురమునందు జరిగిన ప్రదర్శనము నందు చూచుటకై దూరదేశములనుండి జనులు విచ్చేసిరి.

రాంపురము: రాంపూరు నవాబు శిపాయీలతిరుగుబాటుకాలమున సొమ్ము నిచ్చి అనేక పారసీ, అరబ్బీ భాషలలోని గ్రంథములను సేకరించి యున్నాడు. అతని భాండారమున 4467 అరబ్బీ గ్రంథములును 4353 పారసీ గ్రంథములును ఉన్నటుల తెలియుచున్నది.

గ్రంథాలయ సర్వస్వము సంపుటము. 6; సంచికలు 5, 6, 7, 8; 1925.

# గ్రంథాలయ ప్రచారము

## సంచార గ్రంథాలయములు

మానవాభ్యుదయానికి జ్ఞానోపార్జన ముఖ్యంగదా! జ్ఞానోపార్జనకు గురువు సాధనం; తరువాత ఉత్తమ గ్రంథం. ఈ రోజుల్లో గురువులకంటె ఉత్తమ గ్రంథపఠనము ఎక్కువగా తోడ్పడుతోంది. అదే మనవారిలో బాగా వ్యాపించాలి.

### ఆవశ్యకం

గ్రంథపఠనాభ్యాసం ప్రజలలో బాగా వ్యాపించేటట్లు చేయాలంటే సంచార గ్రంథాలయాలు చాలా ఆవశ్యకం. సంచార గ్రంథాలయాలు పట్టణవాసులకంటే పల్లెటూరి ప్రజలకే ఎక్కువగా ఉపయోగిస్తాయి; ధనవంతులకంటె బీదవాళ్ళకే ఎక్కువలాభం, ఆవశ్యకం కూడాను. బీదవాళ్ళకు పుస్తకాలు కావాలంటే గ్రంథాలయాలు తప్ప వేరే ఆధారం లేదు. పల్లెలలోను పట్టణాల్లోనుకూడ కొన్ని సందర్భాలలో గ్రంథాలయాలు వారికి అందుబాటులో ఉండవు. అటువంటివారి విజ్ఞాన దాహము సంచార గ్రంథాలయం తీరుస్తుంది. కొన్ని ఊళ్ళలో గ్రంథాలయాలు లేకపోవచ్చు; గ్రంథాలయాలు ఉన్నా కావలసిన గ్రంథాలు లేకపోవచ్చు, ఈ కొరత సంచార గ్రంథాలయం తీరుస్తుంది. మరికొన్ని ఊళ్ళలో ప్రజలు గ్రంథాలయాలకు వెళ్ళడం గ్రంథాలయాన్ని ఉపయోగించుకోవడం సంభవించదుగదా! విజ్ఞానం వెదజల్లాలంటే గ్రంథాలయాలే వాళ్ళ దగ్గరకు వెళ్లాలి; వాళ్ళలో చదువుపిచ్చి పుట్టించాలి. అపుడుగాని వాళ్ళకి గ్రంథాలయాల్ని ఉపయోగించుకోవడానికి శ్రద్ధపుట్టదు. ఈపని సంచార గ్రంథాలయంచేస్తుంది. సంచార గ్రంథాలయం చేసే ప్రచారంవల్ల గ్రామస్తులకు చదువంటేను, గ్రంథాలయం అంటేను

అభిరుచిపుడితే, తమ గ్రామంలో ఒక గ్రంథాలయాన్ని స్థాపించుకో వచ్చు - యీ విధంగా సంచార గ్రంథాలయ ప్రచారం గ్రామ గ్రంథాలయ స్థాపనకుకూడ ఉపయోగపడుతుంది.

నేటికి 30—40 సంవత్సరాలకిృతం (193·)అమెరికాలో మొట్ట మొదట 20 రాజ్యాలలో ప్రభుత్వము సంచార గ్రంథాలయ ప్రచా రానికి అనుజ్ఞ యిచ్చారు. "డూయీ" మహాశయుడు గ్రామ సీమల్లో వ్యాపించియున్న విద్యావిహీనతను చూచి శాసనసభల ద్వారాసంచార గ్రంథాలయాలకు సహాయం నిమిత్తం ఆందోళన చేశాడు. తత్ఫలితంగా వందల కొలది గ్రంథాలతో ఒక్కొక్క గ్రంథాలయ శకటాన్ని దేశంలో మూలమూలలకి పంపే వాళ్ళు. అవి ఆరు నెలలపాటు దేశంలో సంచారంచేసేవి. ఆ అవకా శాన్ని "స్టడీక్లబ్బులు"న్నూ చిన్నచిన్న గ్రంథాలయాలున్నూ ఎందరెందరో వ్యక్తులున్నూ ఉపయోగించుకొనేవాళ్ళు. మిగతా రాజ్యాలు కూడా కళ్ళు తెరిచి ఈ పద్ధతినే అనుకరించాయి.

## గ్రంథాలయ శకటం

ఈ సంచార గ్రంథాలయాన్ని గ్రామంలోకి తీసికొని పోవ డానికి ప్రత్యేకంగా నిర్మించిన గ్రంథాలయ శకటాన్ని ఉపయోగ పరుస్తారు. ఆ శకటాన్ని ఎద్దు లేక గుఱ్ఱమో లాగుతుంది. మోటారు ట్రక్కును కూడా ఈ పనికి ఉపయోగిస్తారు. మనుష్యులు సహితం పుస్తకాలు మోసుకుపోతారు.

సంచార గ్రంథాలయ శకటంతో సాధారణంగా ఒక గ్రంథ భాండాగారిణి ఉంటుంది. ఆమె జిల్లా యందుండే గ్రంథాలయా లతో గల గ్రంథపరిచయమే గాకుండా, ఆ జిల్లా చరిత్ర—నైసర్గిక పరి స్థితులు - ప్రజల పరిజ్ఞానం - తెలిసికొని ఉంటుంది. ఆమె ముందు జిల్లా అంతా సంచారం చేసి, జనుల వృత్తులు- పరిశ్రమలు — వాళ్లు పండించే పంటలు, వాళ్ళ స్థితిగతులు మొదలైన అన్ని విషయాలు తెలిసికొని ఉంటుంది. ఉపాధ్యాయులతో - పల్లెటూళ్ళ పెత్తన

డార్లతో సంప్రదిస్తుంది. ప్రజల ఆరోగ్యం ఎట్లా బాగుపడుతుందీ? రైతు తక్కువ ఖర్చుతో ఎక్కువ పంట పండించడం ఎట్లాగా? అని తగిన మార్గాలను అన్వేషించి, సలహాల నిచ్చి తగిన గ్రంథాలను వాళ్ళ కందిస్తూ ప్రజలకు సేవకురాలై వర్తిస్తుంది. ప్రజల ఆర్థిక సాంఘిక నైతికాభివృద్ధికి కావలసిన విజ్ఞానాన్ని వెదజల్లుతుంది.

విదేశాలలో యిట్టి సంచార గ్రంథాలయాల ద్వారా జరిగే ప్రచారం అద్భుతంగా ఉంటుంది. ముఖ్య స్థలాలలో నుండే కేంద్ర గ్రంథాలయాల నుండి, వందల కొలది గ్రంథాలను గ్రంథాలయ శకటంలో సేకరించి, గ్రామాల్లో ఉండే ప్రజలకు కావలసిన పుస్తకాలు అందజేస్తారు. ఏ రకం వాళ్ళకి కావలసిన గ్రంథాలు ఆరకం వాళ్ళకిస్తారు. ఎవరి అవసరాన్ని బట్టి వాళ్ళకి గ్రంథాలు ఎరువిస్తారు. దేశంలో ఏ మారు మూలయున్నా సరే - కొండల మీద ఉన్నా అడవులలో ఉన్నా, ఎక్కడ ఉన్నా సరే - ఎవరికి కావలసిన పుస్తకం ఏ విషయం మీదనైనా సరే, అడిగితే, సంచార గ్రంథాలయ శాఖ వారు వాయిదాల మీద అందజేస్తారు - బాలురకు కావలసినవి బాలురకు, స్త్రీలకు కావలసినవి స్త్రీలకు, రైతుకు కావలసినవి రైతుకి పండితునికి కావలసినవి పండితునికి, కార్మికునికి కావలసినవి కార్మికునికీ !

## కేంద్రాలు

ఆ సంచార గ్రంథాలయాలు ఆయా స్థలాలలో గ్రంథాలు అందించే విధానం చాలా చిత్రంగా ఉంటుంది. కొన్ని చోట్ల పచారి దుకాణాలు, మరికొన్ని చోట్ల పోస్టాఫీసులు, ఊళ్ళో పాఠశాలలు - గ్రంథాలు ఇచ్చిపుచ్చుకోవడానికి "అడితీ"లుగా ఏర్పాటు చేస్తారు. అటువంటి "అడితీలు" ఎక్కడెక్కడ ఏర్పాటు చేస్తారో- పటాల వల్లా, పత్రికలలో ప్రకటించడం వల్లా - ప్రజలకు తెలియజేస్తారు. ఆయా "అడితీ"ల దగ్గరకి వెళ్ళి గ్రామస్థులు వాళ్ళకి కావలసిన పుస్తకాల పేర్లు అందునిమిత్తమై ఏర్పరచబడ్డ చీటి మీద వ్రాసి అక్కడ పెట్టిపోతే, సంచార గ్రంథాలయ శకటం అక్కడకు వచ్చి

నప్పుడు, ఆ చీటి గ్రంథభాండాగారి తీసుకొని మళ్ళీ వచ్చేటప్పుడు ఆ పుస్తకాన్ని తీసికొనివచ్చి ఆయా అడితీలలో వారిపేరు వ్రాసి విడిచిపెడతారు. అప్పుడు ఎవరడిగిన పుస్తకం వాళ్లు ఆయా అడితీలకు వెళ్లి తీసికొంటారు.

## కర్తవ్యాలు

ఈ సంచార గ్రంథాలయాలు నిర్వహించవలసిన కర్తవ్యాలు రెండు. ఒకటి వ్యక్తులకు కావలసిన పుస్తకాలను వాళ్ళ వాళ్ళ అభిరుచులనుబట్టి సరఫరా చేయడము. రెండోది గ్రామాలలో ఉండే చిన్న గ్రంథాలయాలకు పుస్తకాలు అప్పుడప్పుడు సప్లయి చేయడం. ఇది కాకుండా ఉపన్యాసాలవల్లా, మ్యాజిక్ లాంతరు ప్రదర్శనాలవల్లా, సినిమిటో గ్రాఫులవల్ల, రేడియోద్వారా, పిల్లలకీ పెద్దలకీ—ఆబాలగోపాలానికి - విజ్ఞానాన్ని వెదజల్లుతాయి. ఈ విధంగా దేశంలో ఎక్కడ ఉన్నాసరే,కొండల్లో ఉన్నాసరే, కోనల్లో ఉన్నాసరే, అడవుల్లో ఉన్నాసరే, అబ్ధుల్లో ఉన్నాసరే — అడిగినంత మాత్రాన విజ్ఞానం వెల్లువలై పారుతుంది.

ఈ రీతిగా దేశంలో ఉచితంగా ఎవరికి కావలిస్తే వాళ్ళకి ఎప్పుడు కావలిస్తే అప్పుడు — అడిగినంత మాత్రాన గ్రంథాలు దొరుకుతూ — ప్రజలు తమ కాలమును వృథాపుచ్చకుండ జ్ఞానోపార్జనయందు గడిపి తమ యిక్కట్టులను లెక్కగొనక యిల్లు చక్కబెట్టుకొని ఆర్థికసంపదతో తులతూగుతూ ఆనందంగా కాలంగడపడానికి అనువగు విజ్ఞానాన్ని వెదజల్లుతూ ప్రజలను సంరక్షించే ప్రభుత్వం ఉంటే ఇంకేం కావాలి!

## మనదేశంలో సంచార గ్రంథాలయాలు

సరే! ఇదంతా బాగానే ఉంది! మనదేశంలో సంచార గ్రంథాలయ ప్రచారం ఏమైనా ఉన్నదా అంటారేమో! లేకేం! విదేశీయుల గ్రంథాలయాల లాగ కాక మన సంచారగ్రంథాలయాలు వాటంతట అవే నడుస్తాయి - మాట్లాడుతాయి - జవా

బులు చెబుతాయి - కాలానుకూలంగా విజ్ఞానాన్ని వెదజల్లుతాయి- మనవి సజీవ సంచార గ్రంథాలయాలు.

ఊరూర తిరిగి తమ పాండిత్యప్రకర్ష చేత గ్రామాల్లో ఉండే వారిని రంజింపజేసే పండితులూ, "వంకర పాగాలతో, వలెవాటుతో, తంబురాలతో" శ్రోతలను ఉర్రూతలూగిస్తూ కథలు చెప్పే బొబ్బిలి పాటగాళ్ళు; "జడకట్టు నెరులతో" జాబరావల్వాలతో పోతులూరి బ్రహ్మన్న బోధనలు బోధించే సన్యాసులు; ఊదుకొమ్ములతో, ఉరుము పంబలతో, జనుల దేహాలు పులకాయమానం అయేటట్లు గొల్లసుద్దులు పాడే పంబగాళ్ళు; "హరిహరీ నారాయణా ఆదినారా యణా కరుణించి మమ్మేలు కమలలోచనుడా" అను పల్లవితో జనుల హృదయాలలో వివిధ రసాల నుప్పతిల్లజేసే కథకులు; ఊరూర తిరిగి తోలుబొమ్మల ప్రదర్శనాలచే, పండితుల కేమిటి-పామరుల కేమిటి_ అందరికీ కూడా ఆనందం కలిగించే తోలుబొమ్మల ఆటగాళ్ళూ; వీధిభాగవతాలను ఆడే భాగవతులు; పురాణాలు చెప్పే పండితులు; హరిదాసులు - ఇవన్నీ సజీవ సంచార గ్రంథాలయాలుగావూ !! ఇట్టి సజీవ సంచార గ్రంథాలయాలు సంఘాభ్యుదయానికి, మానవ శ్రేయస్సుకీ చేసే సేవ అపారమని వేరే చెప్పాలా? అయితే ఇవన్నీ సాంప్రదాయ సిద్ధంగా అనాదినుండి మానవ భౌతిక ఆధ్యాత్మిక ఉత్తేజమునకు దోహదం చేస్తున్నవి. కాని యిప్పుడవి ఆరిపోవడానికి సిద్ధంగా ఉన్న విజ్ఞాన జ్యోతులు. ఆ విజ్ఞానజ్యోతు లారిపోకుండ సంరక్షించుకొనే బాధ్యత మనమీద ఉంది.

## బరోడా గ్రంథాలయములు

ఇంతేనా, లేక ఆధునిక పద్ధతుల ననుసరించిన సంచార గ్రంథాలయాలు మనదేశంలో ఏమైనా ఉన్నాయా అని సందేహం కలగ వచ్చు. బరోడా రాజ్యంలో గ్రంథాలయోద్యమాన్ని పరికించి చూడండి - గ్రంథాలయములు లేని గ్రామములందలి ప్రజలను, చిన్న చిన్న గ్రంథాలయముల వారును పుస్తకములు కావలెనని తెలియజేసిన ముఖ్య సంచార గ్రంథముల నుంచిన పెట్టెలను ఆయా

గ్రామములకు పంపెదరు. ఒక్కొక్క పెట్టెలో 15 మొదలు 30 వరకు గ్రంథా లుంటాయి. ఉపాధ్యాయులు, పిల్లలు, స్త్రీలు, వ్యవసాయదారులు మొదలగు వారికి - వారి వారి రుచులకు అనుగుణ్యములగు గ్రంథములను జాగ్రత్తగా ఆలోచించి, ప్రత్యేకముగ అందుకొరకు తయారుచేయబడిన పెట్టెలయందుంచి కట్టుదిట్టముగ కట్టి ఆయా గ్రామములకు పంపుదురు. పుస్తకాలు మూడు నెలలవరకు ఒక గ్రామంలో ఉండవచ్చును. "రాజు తలిస్తే కొదువేముంది!"

## దక్షిణభారతంలో - సంచార గ్రంథాలయాలు

దక్షిణాది "మన్నారుగుడి"లో రావుబహద్దరు ఎస్. వి. కనకసభాపిళ్ళైగారు ఒక రెండెడ్ల బండిని సంచార గ్రంథాలయ శకటంగా తయారుచేసిరి. వారు ఆ బండిమీద 75 గ్రామములలో 100 గ్రంథ సంచిత స్థానాలద్వారా విజ్ఞానసేవ చేశారు. ఆ గ్రామం వెళ్ళి నేను ఆ బండిచూచి వచ్చాను. ఆయన యిప్పుడు కీర్తిశేషులైనారు. ఆ బండికూడా యిప్పుడు పూర్వంవలె పనిచేయడంలేదు. ఆ సహృదయుని ఆత్మ యిప్పుడు ఎంతబాధపడుతోందో !! ఈ సంచార గ్రంథాలయ సేవను పునరుద్ధరించి, ఆ పవిత్ర పురుషుని ఆత్మకు శాంతి చేకూర్చే బాధ్యత.ఆ ప్రాంతాలవారిమీద ఉందికదా!

చిత్తూరుజిల్లా కుప్పంలో భారతీ విలాస గ్రంథాలయం వాళ్ళు సైకిలు చక్రాలతో బళ్లు తయారుజేసి, సంచార గ్రంథాలయ సేవ చేసినారు. ఈ సేవలు యిప్పుడు జరుగుటలేదు.

ఇట్లాగే కృష్ణాజిల్లా పెడసనగల్లు గ్రామంలో శివరామప్రసాదు గ్రంథాలయంవారు ఒంటెద్దు సంచార గ్రంథాలయ శకటాన్ని తయారుచేసి చుట్టుప్రక్కల గ్రామాల్లో గ్రంథసేవ చేసినారు. ఇదినీన్ని ఇప్పుడు జరగటంలేదు.

గుంటూరుజిల్లా వేటపాలెంలోని సారస్వత నికేతనం వారు, మనిషిచేత పుస్తకాలు మోయించుకొని పోయి, చుట్టుప్రక్కల గ్రామాదులలో పుస్తకసేవ చేస్తున్నారు. ఇప్పటికీ జరుగుతోంది.

## సారస్వత నికేతన గ్రంథాలయము - వేటపాలెం



"గుంటూరు జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీవారు ఈ 'కమిటీ' గ్రంథాలయమునకు సంవత్సరమునకు ఒక వెయ్యి రూపాయల నిచ్చి ప్రోత్సహించుచున్నారు." పుట 100.

ఈ గ్రంథాలయంవారు మనిషిచేత పుస్తకాలు మోయించుకొనిపోయి చుట్టుప్రక్కల గ్రామాదులలో గ్రంథాలయ సేవను చేస్తున్నారు పుట 266



శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర ఆంధ్ర గ్రంథాలయము - విజయవాడ

ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకసంఘ పక్షమున తృతీయ గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పాఠశాల
26–9–1944 మొదలు 10–11–1944 వరకు ఇచట జరిగినది.

ప్రధాన అధ్యాపకులు :

డాక్టరు పి. శ్రీనివాసాచారి, ప్రిన్సిపాలు. యస్ ఆర్. ఆర్. కాలేజి.

పుట 320

పెదపాలెంలోని సేవాశ్రమంవారు కాలవలో బోటులో ప్రయాణంచేసే వాళ్ళకి ఆ పడవలోనే కొన్ని సంవత్సరములు మాత్రము గ్రంథసేవను ఏర్పాటు చేశారు.

ఈ విధంగా సంచార గ్రంథాలయాలు మూలమూలలకీ వ్యాపించి, ఎపుడు కావలిస్తే అప్పుడు మోటార్లమీద, బళ్ళమీద పుస్తకాలు సప్లయి అయితే విజ్ఞానరాజ్యం విరివిగాంచదా !

ఇంతవరకు భూమిమీద జరిగే ప్రయత్నాలు చూస్తున్నాము. ఇకముందు గాలిలో సంచార గ్రంథాలయాలు చూడాలి. మనము ఆ రోజు కెదురు చూస్తూ ఉందాం !

"సీ. వంకర పాగతో - వలెవాటుతోఁ దంబు
రాతోడ నా రంగ - రాయచరిత
జడకట్టునెరులతో - జాబరావల్వతోఁ
బోతులూర్బ్రహ్మన్న బోధనములు
ఊదుకొమ్ములతోడ - నుఱుము పంబలతోడ
నుల్లసిల్లుచునుండు - గొల్ల సుద్ది
హరి! హరీ! నారాయణా యను ధ్వనులతో
రంజితంబగుచుండు - రామునికథ
గీ. చేతనము దాల్చి సరసమై - చిత్తరంజ
కంబుసేయుచు నొక్కొక్క - గ్రామమునను
సంచరించెడు వైఖరు - లెంచిచూడ
జ్ఞానదములౌచు జనులకు - గ్రాలవొక్కొ."

1939 సంవత్సరంలో మద్రాసు రేడియో స్టేషన్ నుండి శ్రీ అయ్యంకివారు గావించిన ప్రసంగము. "ఆంధ్రగ్రంథాలయము"లో సంపుటం 1, సంచిక 1, 1939 లో ప్రచురింపబడినది.

# గ్రంథాలయ యాత్రలు

## యాత్రలనగా నేమి?

ప్రధానముగ పండుగలకు పర్వములకు పుణ్యతీర్థములకు పుణ్య స్థలములకు వెడలి, ఆయా స్థలముల యందలి ఆధ్యాత్మిక సంపద ననుభవించి — ఆ యా తీర్థముల యందు గ్రుంకులిడి భక్తులు తరించెదరు.

ఇట్టి ప్రయాణములకే "యాత్ర"లను పేరు. ఇట్టి యాత్రల వలన మానవులకు వినోద వికాసములు — ఉల్లాసోత్తేజములు గలుగుటయేగాక, సంస్కృతీ సంవర్ధనముకూడ నగును. మానవులకు సహజమైన సంకుచిత స్వభావము, మనఃకర్కశత్వము, ద్వేషము, అసూయాది భావములు క్రమముగా తగ్గి — తగ్గి — రూపు లేకుండా పోవును; వాని స్థానములో దయ, దాక్షిణ్యము, సహానుభూతి, సౌహార్ద్రము, సామరస్యము, ప్రేమలు క్రమముగా చిగిర్చి — పెరిగి — ఫలప్రదములగును. ఇతరుల కష్టముల నర్థము జేసికొని మానవుడు పరోపకార చింతనము నలవరచుకొనును.

దేశకాల పరిస్థితుల నాశ్రయించి— ధర్మాధర్మములు, ఆహార నియమములు, ఆచారములు, మొదలగు వాని భేదములను గమనించెదరు; అందువలన తమకు తెలిసిన ఆచారములు మొదలగునవియే గొప్పవిగా గ్రహించుకొని కూపస్థ మండూకమువలె యుండు సంకుచిత భావము సన్నగిల్లిపోవును.

ధనికులు బీదవారను తేడా లేకుండ భక్తులందరికిని తీర్థయాత్రలు సమస్థాయిని గల్పించును.

ఇట్టి మానసిక పరిణామము వలన మానవుడు భౌతికతత్వమును అధిగమించి, ఆధ్యాత్మిక తత్వమునందు అడుగిడును. తన జీవితమును సుఖవంతముగ చేసికొని ఇతరుల జీవితములకు కూడ సుఖప్రదుడగును.

## యాత్రలు జీవితము నందొక భాగము

అందువలననే మన పూర్వీకులు యాత్రలను జీవితమునందొకభాగముగ నలవడ జేసిరి. పూర్వుల జీవితమున యాత్రలు

నిత్యనైమిత్తికము లగుటయేగాక, ఆధ్యాత్మికౌన్నత్యమును గూడ కలుగజేసినవి; అనగా యాత్రలు భారతీయ సంస్కృతియం దొక ప్రత్యేక ప్రముఖ స్థానము నధిష్ఠించినవి. ఇవి మన జాతీయ జీవనము నందు చొచ్చుకొనిపోయి, జాతీయ సంస్కృతీ సంపోషకములైనవి.

ఇట్టి యాత్రలన్నియు వ్యక్తుల క్షేమమునకై – కుటుంబ క్షేమమునకై చేయునట్టివి.

ప్రజా సామాన్యోత్తేజమునకును ఉద్ధరణకును ఉపయోగించు సాముదాయకముగ జేయు యాత్రలు కూడ, అనేక విధముల మన దేశమున గలవు. భజనలతో బయలుదేరు జట్టులు, హరికథా బృంద ములు, పగటి వేషకుల సమూహములు, వీధి నాటక సమాజములు, మొదలైనవి ఇట్టివే; పండుగలకు పబ్బములకు ఉత్సవములతోను, ఊరేగింపులతోను సాముదాయకముగ యాత్రల యందు పాల్గొని, సమిష్టి క్షేమమునకు పాటుబడుటగూడ మన సంప్రదాయసిద్ధమైన ఆచారమే.

## శ్రీ రామచంద్రుడు

ఆంధ్రుల ఏకైక ఇష్టదైవము శ్రీ రామచంద్రమూర్తి; సంస్కృత వాల్మీకి రామాయణము, తెలుగున భాస్కరరామాయణము, మొల్ల రామాయణము, రంగనాధ రామాయణము, ఆధ్యాత్మరామా యణము ఆంధ్ర తులసీదాసు రామాయణము, ద్విపదలలో రామాయ ణము, కీర్తనలలో రామాయణము, పాటలలో రామాయణము– సుద్దులలో రామాయణము, తోలుబొమ్మలాటలలో రామాయణము, ఈ రీతిగా, ఆంధ్రులందరు అక్షరాస్యులు నిరక్షరాస్యులు అను భేదము లేకుండా – అందరును – రామాయణ కథామృతమును నిరంతరము గ్రోలుచు ధన్యత నొందుచున్నారు.

శ్రీరామచంద్రుడు భారత వర్షమును ఆదర్శ ప్రభువుగ పరిపాలిం చినాడు. "రామరాజ్య" మనునది ఒక సూక్తియైనది. భగవంతుని నుండి మానవునకు – మానవుని నుండి భగవంతునకు ఒక వంతెన సాధ్యమని నిరూపించినాడు.

మానవసేవకు మౌలికమైనది శ్రీరామచంద్రుని పాదసేవాను రక్తి; ఈ అనురక్తియే ఆది భౌతిక ఆధ్యాత్మిక భావముల సంగమ స్థానము; అది ఈ రెండింటిని సమీకరణము జేసి - జీవన జ్యోతిని దేదీప్యమానముగ ప్రజ్వలింపజేయును.

ప్రతి తల్లియు తన బిడ్డకు నీళ్లు పోయునపుడు "శ్రీరామరక్ష" పెట్టును; శ్రీరామ రక్ష పెట్టకుండ ఉగ్గు పెట్టదు. తలకు నూనె పులిమినపుడెల్ల "శ్రీరామరక్ష" యని ఆశీర్వదింపక మానదు, నిద్ర పుచ్చునప్పుడు కూడ శ్రీరాముని కథామృతమునే పాడుచు హాయిని గల్పించును.

ప్రతి ఆంధ్రుడును కాగితముమీద కలము పెట్టునపుడెల్ల ముందుగ "శ్రీరామ" మంత్రమును చుట్టక మానడు.

ఆంధ్రదేశమున జనసామాన్యము నివసించు అన్ని పల్లెలయందును, అన్ని కోనలయందును రామమందిరములు వెలసియేయున్నవి. వానియందెల్ల రామభజన నిరంతరము సాగుచునే యున్నది.

మానవుడు కేవలము భుక్తితోడనే ముక్తిని పొందడు. "జీవించుటకు తినవలెనుగాని తినుటకు జీవించరాదు" అనునదియే భారతీయుల దృక్పథము.

మానవునకు ఉత్సాహము, ఉద్రేకము జీవితమున అగత్యములు. ఉత్సాహోద్రేకములు రసోత్పత్తిని కలుగజేసి మానవుని జీవితమును ఆనందమయముగ జేయును. రసోద్రేకము 'హృదయ' గతమైనది. యుక్తాయుక్త విచక్షణము 'బుద్ధి' గమ్యమైనది. హృదయమును బుద్ధిబద్ధముజేసి సమప్రీతిలో నడుపుటకు రామచంద్ర పాదసేవానురక్తి తోడ్పడి మానవునకు భుక్తిముక్తులను ప్రసాదించును.

ఈ రీతిగా ఆంధ్రుల నిత్యజీవితమున శ్రీరామచంద్రుడు ఆరాధ్య దైవమైనాడు. ఆంధ్రులందరికీ శ్రీరామచంద్రుడు "రక్ష"యై వారిజీవిత మార్గములను సర్వకాలములయందును తీర్చిదిద్దుచున్నాడు.

## రామదండు

అలనాడు శ్రీరామచంద్రుని సేవార్థమై ఆంజనేయస్వామి "రామదండు"ను ప్రతిష్ఠించినాడు; స్వామి కార్యమును తీర్చిదిద్ది శ్రీరామచంద్రమూర్తికి జయమును జేకూర్చినాడు.

శ్రీరామచంద్రునకు ఆంజనేయస్వామి పెద్దబంటు. నేడు శ్రీరామచంద్రునకు ఆంధ్రులందరు బంటులైనారు; దేశహితైక కార్యము లన్నియు రామకార్యములుగ నెంచి రామదండు నేర్పరచుకొని, రామబంటులై, ఆంజనేయస్వామి ధ్వజమును చేబూని, నిష్కామముగ అట్టి కార్యముల నన్నిటిని నిర్వహించుచున్నారు; తత్ఫలమును శ్రీరామునకే యర్పించి వారి యిష్టదైవము నెడ భక్తితాత్పర్యముల నెరపుచున్నారు.

"రామదండు"నందు భజనపరులు - హరికథకులు - గాయకులు - పౌరాణికులు - ఉపన్యాసవేత్తలు - సామాజికులు - చేరియుందురు; ఈ "దండు" ఒక యూరినుండి మరియొక యూరు యాత్రలు జేయుచు వారి నిర్దిష్ట కార్యములను - వినోదములతో మేళవించిన విజ్ఞానముతో ప్రసారించి ప్రచారము చేయుదురు; ఆ యూరునందు పలువిధములుగ ప్రచార కార్యక్రమమును ముగించిన తర్వాత, ఊరివారు పొరుగు గ్రామమునకు - "రామదండు" వారిని సగౌరవముగ, మేళతాళములతో మర్యాదలతో గొనిపోయి - ఆ యూరివారికి ఒప్పజెప్పి వెనుకకు మరలుదురు. వారికి గావలసిన భోజన మజ్జనాదులకు తగు ఏర్పాటుల నన్నిటిని, విడిసిన గ్రామస్థులే ఉచితముగ సమకూర్తురు; ఈ రీతిగా "రామదండు" ప్రచార కార్యక్రమము నిరంతరాయముగ బరుపుటకు గ్రామస్థులు తోడ్పడుచుందురు.

ఇది అనాదికాలమునుండియు మన ఆంధ్రదేశమున ఆచారముగ వచ్చుచున్న "రామదండు" సంప్రదాయము.

## గ్రంథాలయోద్యమ ప్రచారము

ఏ యుద్యమమైనను ప్రచార మూలముననే బహుళవ్యాప్తి

నొంది ప్రజలలో చొచ్చుకొని పోయి ఆశించిన ప్రయోజనముల నియ్యగలదు.

నేటి గ్రంథాలయ ప్రగతియందు అమెరికా దేశము ఉన్నత పథము నధిష్ఠించి యున్నది, గ్రంథాలయోద్యమ వ్యాప్తికై - అమెరికా దేశమున గ్రంథాలయములను స్థాపించుటయందేమి, వానిని నిర్వహించుటయందేమి, వానిని ఉపయోగించుట యందేమి, వ్యాపింప జేయుటయందేమి - అనేకములగు ప్రచార మార్గములను యోచించి పరిశోధించి, అవలంబించి యున్నారు. అట్టి పరిశోధనలకు సంబంధించిన వాఙ్మయమును సాకల్యముగా చదివి జీర్ణించుకొన్న పిదప, మన దేశ సంస్కృతికి, సంప్రదాయమునకు అనువైన ప్రచార మార్గమును గూర్చి దీర్ఘముగా యోచించితిని.

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము స్వయంభువు - స్వయం శక్తిమీదనే ఆధారపడి ప్రజలు దాని స్వరూపస్వభావములను తీర్చిదిద్ది ప్రచారము చేసిరి. అది పాశ్చాత్యానుకరణముగాదు. అందుచేత మన యుద్యమ ప్రచారము జాతీయ విధానము ననుసరించి జరిగినప్పుడే జనుల మనస్సుల కదిలి నచ్చి, దానితో తాదాత్మ్యమును బొందెదరు. భారత జాతీయమైన దృక్పథము నన్నెల్లప్పుడును పురికొల్పుచునే యుండుచుండెను. అందువలన గ్రంథాలయోద్యమ ప్రచారమునకును ఒక జాతీయమైన నూతన విధానమును వెదకితిని.

ఇట్టి అన్వేషణలో - ఒక శుభసమయమున - రామదండు యాత్రావిధానము నా మనస్సున మెరసినది; అందుచేత రామదండు సంప్రదాయమును ధ్యేయముగా బెట్టుకొని గ్రంథాలయ యాత్రలను రూపొందించితిని.

"రామదండు" యాత్రయందు, ప్రముఖముగ భక్తిరూపమగు ప్రచారము - దాని ఫలితముగ జాతి ఉత్తేజము నొందుటయును ప్రధానము; నిర్మాణ కార్యక్రమము దానియందు లేకపోలేదు. కాని అది సూటిగా నుండదు. గ్రంథాలయ యాత్ర అట్టిదికాదు. భక్తి గూఢ మిళితమై యున్నను, ఇందు నిర్మాణ కార్యక్రమమే ప్రధాన

## శ్రీ జయంతి రామలక్ష్మణమూర్తి

కార్యదర్శి : విశాఖ జిల్లా గ్రంథాలయ సంఘం



ఈయన ఒక పల్లెటూరి ఉపాధ్యాయుడు - విశాఖ జిల్లా జగ్గాపుర గ్రామమందు మొదట గ్రంథాలయమును స్థాపించిరి; దానినే చుట్టుప్రక్కల పెక్కు గ్రామములకు సంచార గ్రంథాలయముగా విస్తరింపజేసిరి.

అనకాపల్లి శారదా గ్రంథాలయమందు, ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకా సంఘము వారు 1947లో నడపిన గ్రంథాలయ శాస్త్ర పాఠశాలయందు తరిబీతును పొందినవారై, జిల్లా గ్రంథాలయసేవను జగద్విఖ్యాతముగా నడుపుచున్నారు.

## శ్రీ రామచంద్ర గ్రంథాలయము - పోడూరు



"నర్సాపురం తాలూకా పోడూరు" గ్రామమందు గ్రంథాలయము నొకదానిని స్థాపించినారని విని (1914) రైలు - పడవ - బండి - లమీద ప్రయాణముచేసి, ఆయూరి కరణంగారి అరుగుమీదనున్న గ్రంథాలయమును చూచి సంతృప్తి జెందితిని."

పుట 276

మయినది. అందుచేత రామదండు యాత్రావిధాన సూత్రము ననుస రించుచు, దానిని నిర్మాణ కార్యక్రమముతో రంగరించి ఒక నూతనమయిన పంథాను ప్రాతక్రొత్తల మేలు కలయికతో గ్రంథాలయ యాత్రలను - రూపొందించితిని.

## వే ద ము

బెజవాడ రామమోహన గ్రంథాలయమువారిచే 1914 సంవత్సర మున నేర్పరుపబడిన ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభకు అధ్యక్షత వహించి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు గంభీరోపన్యాస మిచ్చి, గ్రంథాలయోద్యమ వ్యాప్తికి అమూల్యములైన ఆదర్శములను ప్రసాదించిరి. ఆ యుపన్యాసమున గ్రంథాలయోద్యమ సేవావ్రతులు నిత్యము మననముజేసికొనవలసిన సూక్తులను అనువదించిరి.

"వేదము" ఆర్ష సాంప్రదాయానుసారులకే గాక, ప్రపంచము నంతకును మార్గదర్శకమైన ప్రమాణ గ్రంథము. అట్టి వేదోక్తులతో సమానమైన-గ్రంథాలయోద్యమమునకు ఆదర్శప్రాయమైన-ఈ క్రింది సూక్తులను శ్రీ చిలకమర్తి వారి యుపన్యాసమునుండి ఏరి "గ్రంథాలయ వేదము" అను శీర్షిక నిడి, అప్పటినుండియు ప్రచారముచేయుచున్నాను.

గ్రంథాలయ శాస్త్రము, గ్రంథాలయోద్యమము పతాక స్థాయి నందుకొన్న వివిధ నాగరిక ప్రపంచమునం దంతటను ప్రచారమున నున్న గ్రంథాలయ సూక్తులలో - మణిమకుటాయమానమై, తలమానికమై శ్రీ చిలకమర్తి వారి "గ్రంథాలయ వేదము" నేటికిని ప్రకాశించుచున్నదని చెప్పుకొనుటకు ఆంధ్రులందరు సగర్వముగ సంతోషించ గలరు. ఆ సూక్తులివి :—

## గ్రంథాలయ వేదము

1. **"వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో జ్ఞానము కూడ అట్లు స్వాధీనము కావలయును.**

2. ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో జ్ఞానముకూడ అట్లు సేవ్యము కావలయును.
3. సూర్య చంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి ఎట్లు సౌఖ్య ప్రదముగా నున్నదో జ్ఞానముకూడ అట్లు సౌఖ్యప్రదము కావలయును."

## గ్రంథాలయ యాత్రాకార్యక్రమము

గ్రంథాలయ సేవకులు చేసిన ఘనకార్యములలో గ్రంథాలయ యాత్రలు విశిష్టమయినవి.

ప్రయోజనుల యందు గ్రంథాలయముల ధ్యాస కలుగుటకును, గ్రంథాలయముల స్థితిని పరిశీలించి అభివృద్ధి పరచుటకును గ్రంథాలయ యాత్రలు - భీమవరం - తాడేపల్లిగూడెం - కొవ్వూరు - రేపల్లె తాలూకాలయందు నా ఆధ్వర్యముక్రింద సాగింపబడినవి.

ఒక యాత్రయొక్క జట్టు రమారమి పన్నెండు మంది యాత్రికులు. పన్నెండుగురును ఈ క్రింద వివరించిన ప్రకారము ఆరు జట్లుగా ఏర్పడుదురు. 1. పురోగాములు 2. భజనపరులు 3. ప్రదర్శన జట్టు 4. గ్రామఫోను జట్టు 5. ఉపన్యాసకుల జట్టు 6. మాజిక్ లాంతరు జట్టు.

పురోగాములు సభ నేర్పాటుచేయ సంకల్పించిన వెనుకటి రోజుననే, ముందు గ్రామమునకు పోయి పైన వివరించిన "గ్రంథాలయ వేదము"ను అచ్చువేసిన పెద్దకాగితములను, యాత్రికుల రాకలను గురించి యాత్రావివరములు గల ప్రకటనల పెద్ద కాగితములను (పోస్టర్స్) గోడలమీాద ఆ గ్రామ మంతయు అంటించెదరు. మరియు గ్రామములోని గ్రంథాలయము మొదలగు సంస్థలకు సంబంధించిన వారితోను గ్రామ పెద్దలతోను మాట్లాడి గ్రంథాలయ యాత్రికులకు స్వాగత మిచ్చుటకు తగిన ఏర్పాటులను గావింతురు.

మరునాటి ఉదయమునకు యాత్రికులు ఆ గ్రామమునకు కాలి నడకను పోయెదరు. ముందుగా భజన జట్టువారు భజన చేయుచు

గ్రామమంతా తిరిగి, గ్రామములోని జనుల నందరను సభకు ఆహ్వానించెదరు.

ప్రదర్శన జట్టువారు వారి సామగ్రినంతను బహిరంగసభ జరుగు చోటుకి దగ్గరగా ఒక భవనంలోగాని లేక వీధి అరుగుల మీదగాని గోడలకు వ్రేలాడగట్టి ప్రదర్శించెదరు.

ఈ లోపున గ్రామఫోను జట్టు వారు సభజరుగు స్థలమున గ్రామఫోను రికార్డులను వినిపించు చుండెదరు.

భజన జట్టువారు భజనతో ఊరంతా తిరిగి, వారితో ఒక ఉత్సవమును చేరదీసికొని, ఉపన్యాస వేదిక యొద్దకు వచ్చెదరు.

అప్పుడు ఉపన్యాసకుల జట్టువారు వివిధ విషయముల మీద ఉపన్యాసముల నిచ్చెదరు. గ్రామంలోని గ్రంథాలయమును పరిశీలించెదరు. అవసరమయిన చోటుల అటకలమీదనుండి పుస్తకములను దింపించి, బూజు దులిపించి, పుస్తకముల పట్టికలను తయారు చేసి తిరిగి ఆ గ్రంథాలయము నూతనోత్సాహముతో కార్యక్రమము ప్రారంభించునటుల ప్రోత్సహించెదరు. ఈ రీతిగా ఆ గ్రామములోని గ్రంథాలయము పనిచేయుచున్నయెడ ఇంకను ఎక్కువ ప్రకాశవంత మగునటుల, అసలు పనిచేయకున్న పనిచేయునటుల ఉద్బోధించెదరు. ఈ విధముగ ఆయా గ్రామములలోని గ్రంథాలయముల పునరుద్ధరించుటయో, ప్రతిష్ఠించుటయో, ప్రోత్సహించుటయో జేయుచు గ్రంథాలయ చైతన్యమును గలుగజేయుదురు.

సభ అయిపోయిన పిమ్మట మాజిక్కు లాంతరు ప్రదర్శనము ప్రారంభమగును. బొమ్మల సహాయముతో ఆరోగ్యము, సహకారము, గ్రంథాలయ ప్రచారము మున్నగు విషయములను గూర్చి ప్రదర్శకు లుద్బోధ చేయుదురు. ఈ ప్రకారము కార్యక్రమమును ముగించుకొని ముందు గ్రామమునకు యాత్రాసేవావ్రతులు బోవుదరు.

ఇట్టి యాత్రలు గ్రామస్థులందు ఉత్తేజమును, చైతన్యమును కలుగజేసి, గ్రంథాలయముల ఉపయోగమును, వయోజన విద్య ఉప

యోగములను ఎక్కువగా వినియోగించుటకు అలవాటు పడునటుల చేసినవి.

## నాకు గ్రంథాలయోద్యమమే తపస్సయినది

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమును 1914 సంవత్సరమున స్థాపించినది మొదలు గ్రంథాలయోద్యమము ఎట్లు వ్యాప్తిని పొందునాయని నా మనస్సున తీవ్రమయిన జిజ్ఞాస బయలుదేరినది. పత్రికలయందలి గ్రంథాలయ వార్తలను వివిధ సభల సమావేశముల వార్తలను (ఆంధ్రము-అఖలభారతము) శ్రద్ధగా పరిశీలించెడివాడను.

నర్సాపురం తాలూకా "పోడూరు" గ్రామమందు శ్రీరామచంద్ర గ్రంథాలయము నొకదానిని స్థాపించినారని విని (1914) రైలు - పడవ — బండి మీాద ప్రయాణము చేసి, ఆయూరి కరణం గారి అరుగుమీాద నున్న గ్రంథాలయమును చూచి సంతృప్తి జెందితిని. అట్లే తెనాలి తాలూకా "సంగంజాగర్లమూడి" యను గ్రామమందు గ్రంథాలయమును స్థాపించినపుడు దాని ప్రారంభోత్సవమునకు బోయి అందు పాల్గొని సంతోషించితిని. ఈ రెండు గ్రంథాలయములకు ఇటీవలనే "స్వర్ణోత్సవము"లను (ఏబది సంవత్సరముల పండుగలు) చేసి, నన్ను ఆహ్వానించి సన్మానించిరి.

అదే రీతిని, నా జీవిత గ్రంథాలయ సౌధమునకు ప్రాతిపదికమైన శ్రీరామమోహన ధర్మగ్రంథాలయమునకు (విజయవాడ 1911) ఏబదియారు సంవత్సరములు నిండినవి. నాజీవితమునకు సౌరభము నొసంగిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము (1914) నకు ఏబది మూడు సంవత్సరములు నిండగ, దాని స్వర్ణోత్సవమునందు పాల్గొను భాగ్య మబ్బినది.

ఈ రీతిగా వాని పుట్టుకలు - ఎగుడుదిగుడులు - పెంపుదలలు- మొదలగు ఏబది సంవత్సరముల కార్యక్రమములను అన్నింటిని జూచి- ఇపుడు స్వంత భవనములను నిర్మించుకొని కలకలలాడుచున్న ఆ యనుంగు బిడ్డలను తిలకించుచున్నప్పుడు- నాకు కలిగిన ముచ్చటకు బ్రహ్మానందమునకు అంతులేదు.

శ్రీ రామమోహన ధర్మ పుస్తక భాండాగారము, విజయవాడ - స్థాపితము 1911

గ్రంథాలయ ప్రచారకుల ప్రథమ పాఠశాల 1920 లో ఇచటనే జరిగినది : పుట 313

రెండు దశాబ్దముల కాలము బెజవాడలోని ప్రజాహితోద్యమములకెల్ల ఇది కేంద్రమై విలసిల్లినది.




శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి "జీవిత సౌధమునకు ప్రాతిపదికయైనది" : పుట 276

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, విజయవాడ : 6; స్థాపితము 1914



శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారి "జీవితమునకు సౌరభము నొసంగినది" : పుట 276

ఈ విధముగ దేశములో ఎక్కడ ఎవరు నూతన గ్రంథాలయములనుగాని, గ్రంథాలయోద్యమమునుగాని ప్రారంభించినపుడు అట్టి స్థలములకెల్ల బోయి వానిని సందర్శించి - నా సలహా సంప్రదింపులను వారి కిచ్చుటయును, వారి యనుభవములను నమ్రతతో స్వీకరించుటయును చేయుచుంటిని; ఇందువలన నా ధ్యేయమునకు, నా యాదర్శమునకు సరంజామా సమకూడుచుండెను.

ఈ రీతిని "గ్రంథాలయోద్యమవ్యాప్తి" యను భావము నాయందు ఆవిర్భవించి, నన్నావహించి అదియొక తపస్సుగా పరిణమించినది.

## గ్రంథాలయోద్యమ మనగా నేమి?

గ్రంథాలయోద్యమ మనగా, కొన్ని గ్రంథములను పత్రికలను ఒకచోట జేర్చి - అవి అందరికిని అందుబాటులోనికి దెచ్చుట మాత్రమే గ్రంథాలయోద్యమ పరమావధిగాదు. అది గ్రంథాలయ ధర్మములకెల్ల ప్రాతిపదిక మాత్రమే. గ్రంథాలయము - ఒక గ్రామమందుగాని - పట్టణమందుగాని సాంఘిక సంక్షేమ కార్యకలాపములకెల్ల కేంద్రస్థానమై విలసిల్లవలసినది. మానవత్వ సర్వ సమానత్వ సాధనకు అది సరస్వతీదేవియొక్క ఆలయమే. ఇదినా ధ్యేయము.

అందుచేత బాలభటోద్యమము - ప్రకృతి ఉద్యమము - దివ్యజ్ఞానోద్యమము - సహకారోద్యమము - హరిజనోద్యమము - ఆంధ్రోద్యమముల -ఆదిగాగ సేవోద్యమములనెల్ల-గ్రంథాలయము యొక్క నిత్యనైమిత్తిక ప్రణాళికలకు సాధనమార్గములుగ జేపట్టి - నా జీవిత ధ్యేయమును సాధించి కొంతవరకు కృతకృత్యుడనైతిని.

అందుచే 1914 సంవత్సరము మొదలు 1950 సంవత్సరము వరకు ప్రతి నెలయును సుమా రిరువది రోజులు గ్రంథాలయ ప్రచారమునందే విహరించి నలుమూలల "గ్రంథాలయ వేదము"ను ప్రసారము జేసితిని.

## గ్రంథాలయోద్యమము - బీదది - భాగ్యవంతమైనదికూడ

ఇప్పుడు వెనుదిరిగి కలయజూచిన - ఇట్టి మహోద్యమము నెట్లు చేపట్టి జయప్రదము జేసితినా యని, నాకే ఆశ్చర్యము కలుగు చుండును. ఎందుచేతననగా, నేమేమో సామాన్య సంసారి నేగాని, భాగ్యవంతుడనుగాను.

ఇక చిన్నప్పటినుండియు-నే చేపట్టిన రామమోహన గ్రంథాలయముగాని - నే చెట్టబట్టిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముగాని - ఇతర సహకారోద్యమములుగాని - నిత్య విఘులకు ఏనాటి కానాడు లోటు లేకపోయినప్పటికిని ధారావాహికముగ కార్యములు కొనసాగు చున్నప్పటికిని - ఎప్పుడును ద్రవ్యమేమియు నిల్వగా లేకపోవుటచేత బీద సంసారములేయైనవి. కాని వందేమాత రోద్యమ ఫలితముగ - బిపిన చంద్రపాలు గురువరేణ్యు డిచ్చిన (1907) సేవాదీక్షయే నాకు ఐశ్వర్యములనిచ్చి - ఎప్పటికప్పుడు సుసంపన్నము జేయుచు రక్షణ గల్పించినది.

స్వయంపోషకులగు సేవావ్రతులు ఎల్లప్పుడును కార్యరంగ మున ప్రత్యక్షమగుచుండిరి; అందుచేత గ్రంథాలయోద్యమము భాగ్యవంతమైనది, ఐశ్వర్యవంతమైనదికూడ.

## యాత్రలకు ప్రాతిపదిక : భీమవరం తాలూకా

భీమవరం తాలూకాలో 1918 వ సంవత్సరములో జరిగిన పడవమీది గ్రంథాలయయాత్రయొక్క అనుభవమును పురస్కరించు కొనుటచే, అది తరువాతి యాత్రలకు ప్రాతిపదికయైనది.

భీమవరం తాలూకా కుముదవల్లి గ్రామమునగల శ్రీ వీరేశ లింగకవి సమాజ గ్రంథాలయము పదునెనిమిదవ వార్షికోత్సవమునకు 1915 సంవత్సరమున నేను అధ్యక్షత వహించితిని ✦ అప్పుడే భీమవరం తాలూకా ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు నాయక మణియని గ్రహించితిని.

✦ ఆనాటి అధ్యక్షోపన్యాసము ఈ గ్రంథముననే 118 పుటలో "గ్రంథాలయములే గ్రామాలయములు" అను శీర్షికతో ప్రచురింపబడినది.

రాజకీయ సంచలనముగాని, పత్రికా ప్రచారముగాని జొత్తిగా లేని ఆ దినములలో (1895) భారత రాజకీయములకు పితామహులగు దాదాభాయి నౌరోజీ పేరున "ఉండి" గ్రామంలో ఒక గ్రంథాలయమును, ఇండియనే నేషనల్ కాంగ్రెసుయొక్క సంస్థాపకులును దివ్యజ్ఞాన సమాజమునందు సభ్యులును అగు హ్యూం పేరున కోపల్లె గ్రామంలో ఒక గ్రంథాలయమును, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి పేరున కుముదవల్లి గ్రామంలో (1897) ఒక గ్రంథాలయమును స్థాపించియున్నారంటే, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు ఎట్టి పునాది గలదో — ఎట్టి ఉజ్వలమైన భవిష్యత్తుకలదో పొడ గట్టినది. అంచుచేతనే భీమవరం తాలూకా యాత్రలకు ప్రాతిపదిక అయినది.

పడవమీద గ్రంథాలయయాత్ర †

భీమవరం తాలూకాయందు గ్రంథాలయోద్యమమువల్ల ప్రతిభావంతులైన యువకులలో శ్రీ భమిడిపాటి సూర్యనారాయణగారు చాలా ముఖ్యులు. గ్రంథాలయోద్యమములో ఉద్భవించిన యువకులందరును దేశాభ్యుదయమునకై తమ శక్తియుక్తులను ధనమును ప్రాణమును లెక్కచేయక పాటుపడిరి; వారికి గ్రంథాలయోద్యమము యొక ప్రాతిపదిక మాత్రమే, మిగిలిన యుద్యమము లన్నియు వారికి నిత్యనైమిత్తికములు.

శ్రీ సూర్యనారాయణగారు భీమవరంగ్రామం శివారు "గునుపూడి" గ్రామంలో 1916 సంవత్సరమునందు "శ్రీ గాంధి గ్రంథ నిలయము" ను స్థాపించినారు.

పిమ్మట భీమవరం పట్టణమందే ఒక గొప్ప కేంద్ర గ్రంథాలయమును స్థాపింపవలెనని తలంచి తాలూకాయందంతటను ధనమును ప్రోగుజేసి ప్రస్తుతము "టవునుహాలు" అని పిలువబడుచున్నచోటున ఒక భవనమును నిర్మించి అందులో 8-2-1918 తేదీన ఆదికవియగు

† శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారిచే రచింపబడిన "నా జీవిత కథ — నవ్యాంధ్రము" అను గ్రంథము — పుట 120.

"శ్రీనన్నయభట్టారకు"ని పేరను ధర్మగ్రంథాలయమును స్థాపించిరి. ఆగ్రంథాలయ ప్రారంభోత్సవమునకు బెజవాడనుండి నేను, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ సూరి వెంకటనరసింహశాస్త్రి, శ్రీ దంటు సుబ్బావధానిగార్లును వెళ్ళియుంటిమి. అచట ప్లీడరుగానున్న శ్రీ ములుకుట్ల సుబ్బారాయుడుగారు అధ్యక్షత వహించిరి. శ్రీ కాళేశ్వరరావుపంతులుగారు ప్రారంభోత్సవమును సల్పిరి; బెజవాడనుండి వెల్లిన మిగిలిన మేము నలుగురమును, ఆత్మకూరి గోవిందాచార్యులుగారును ఉపన్యాసముల నిచ్చితిమి.

భీమవరం తాలూకా నాకు క్రొత్తగాదు, అప్పటికే చాల యూళ్ళలోని గ్రంథాలయములతో నాకు పరిచయ మేర్పడినది. అదిగాక నా తండ్రిగారగు శ్రీ వేంకటరత్నం పంతులుగారు – నా చిన్నతనములో – ఆ తాలూకాలోని యండగండి, పిప్పర, చెరుకుగనమ అగ్రహారం, గ్రామములలో "డెల్టాసూపరిండెంటు" ఉద్యోగ పదవిని నిర్వహించిరి; అందుచేత ఆ తాలూకా గ్రామాలలో నాకు పరిచయస్థులు అనేకులుండిరి. నాతండ్రిగారు పాము మంత్రము వేయుటలో సిద్ధహస్తులు. ఆ తాలూకాలో "చినకాకినాడ" గ్రామ మునసబుగారగు శ్రీ ఇందుకూరి జానకీరామరాజుగారు నా తండ్రిగారియొద్ద ఆ మంత్రమును నేర్చుకొని మిక్కిలి ప్రఖ్యాతినిగాంచి ఆ తాలూకా వాస్తవ్యులకేగాక, చుట్టుప్రక్కలనున్న తాలూకాలవారికిగూడ ప్రాణదానమును జేయుచుండిరి. మరియు పిప్పర గ్రామంలో నా చిన్ననాటి గురువులును జాతీయ కవియును దేశాభిమానియును సంఘసంస్కర్తయునగు శ్రీ మంగిపూడి వేంకటశర్మగా రుండిరి.

ఈ సందర్భముల నన్నింటిని పురస్కరించుకొని, నన్నయ భట్టారక గ్రంథాలయ వార్షికోత్సవ సంబరములు ముగిసిన వెంటనే, కాలువమీద పడవలో ప్రయాణము జేయుచు గ్రంథాలయయాత్రను ఏర్పాటు జేయించితిని; బెజవాడనుండి భీమవరం గ్రంథాలయ ప్రారంభోత్సవమునకు వచ్చిన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు ఆదిగాగల

# గ్రంథాలయ యాత్రలకు సూత్రధారులు



"శ్రీకృష్ణుడు పాండవులకువలె సకల సదుపాయములను సహాయములను చేయుచుండిన"

డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మ

పుట 285



"యాత్రికులను నిత్యము ఆయా మజిలీలయందు కలిసి కొనుచు సూత్రధారియై నడిపిన"

డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి

పుట 287

## ప్రథమ భీమవరం తాలూకా గ్రంథాలయ మహాసభ - ఉండి గ్రామం



అధ్యక్షులు : శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య - మధ్యకూర్చున్నారు - 12_3_1933
వారి అధ్యక్షకోపన్యాసము : "గ్రంథాలయములు వాని నిర్వహణ." పుట 126.

నలుగురము, శ్రీ భమిడిపాటి సూర్యనారాయణగారితో చేరి- భీమవరమునుండి పడవమీద గ్రంథాలయ యాత్రకు బయలుదేరితిమి.

మేళతాళములతో గ్రామస్థులు కాలువలోని పడవయొద్దకు వచ్చి యాత్రికులను గ్రామములోనికి తోడ్కొని పోవుచుండిరి.

గ్రంథాలయము లున్నచోట్ల వాటిని దర్శించి సభలు జరిపి కార్యకర్తలను ప్రోత్సహించితిమి; లేనిచోట్ల ఉత్సాహమును గలుగ జేసితిమి. ముఖ్యముగా గ్రంథాలయోద్యమము,స్వదేశీ,స్వరాజ్యోద్యమములను గూర్చియు ఆనీబిసెంటు గారి హోంరూలు ఉద్యమమును గూర్చియు, గంభీరోపన్యాసము లిచ్చుచు గ్రామముల యందెల్ల అపూర్వమైన సంచలనమును గలుగ జేసితిమి.

ఈ రీతిగా పాలకోడేరు, యండగండి, గరగపర్రు, చినకాకినాడ, కేశవరం, పిప్పర, చెరుకుగనమ అగ్రహారం - మున్నగు గ్రామములనెల్ల దర్శించి— ఉద్బోధించి — వారము దినములు నిర్విఘ్నముగా గ్రంథాలయ యాత్రను సాగించితిమి.

ముందుగ యోచించి, ఒకప్రణాళికను సిద్ధపరచి, ఏర్పాటు చేసిన యాత్రకాదు ఇది; భీమవరము వచ్చితిమి గనుక, తిరిగి బెజవాడ వెళ్ళులోపున, కొంత ప్రచార కార్యక్రమమును సాగించవలెనని రూపొందించితిమి; అయినను ఫలితములు జయప్రదముగనే యుండెను.

## ప్రథమ భీమవరము తాలూకా గ్రంథాలయ సభ

ఈ తాలూకా యందు గ్రంథాలయోద్యమ భీష్ములు శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారు (కుముదవల్లి), తాలూకా గ్రంథాలయోద్యమ నాయకులు పాలకోడేటి సత్యనారాయణశర్మగారు (భీమవరం), గ్రంథాలయ సేవావ్రతులు కాళ్ళకూరి నరసింహముగార్ల తోడ్పాటుతో — జరిగిన ప్రచార ఫలితముగ - తుదకు తాలూకా గ్రంథాలయసభను ఏర్పాటు జేయుటకు "ఉండి" గ్రామములో ఆహ్వానసంఘము ఏర్పడినది.

ఆహ్వాన సంఘమువారి పక్షమున శ్రీ కలిదిండి నరసింహరాజు గారు తాలూకాయందంతటను సంచార మొనర్చి 38 గ్రంథాలయ ముల చరిత్రలను సేకరించగా, దానిని ఆహ్వాన సంఘమువారు ప్రక టించిరి.

దీనిఫలితముగ "ఉండి" గ్రామముననే ప్రథమ భీమవరం తా॥ గ్రంథాలయ సభ • నా అధ్యక్షతక్రింద 12-3-1933 తేదీన సమా వేశమైనది— ఈ సభయందే శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారు అధ్యక్షులుగను, శ్రీ డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారు కార్యదర్శిగాను తాలూకా గ్రంథాలయసంఘ మేర్పాటయినది.

అందుచేత నేనుచేయు సేవాకార్యములకు ఒక పథకము ననుస రించి తోడు నీడలుగా నుండుటకు తాలూకా మొత్తముమీద ఈ రీతిగా ఒకసంస్థ ఏర్పడుట, నా కార్యక్రమముల విశిష్టత నంగీక రించుట యైనది. అంతేగాక ఇంకను ఉత్తేజకరముగ ముందు పను లను నిర్వహించుటకు అవకాశముకూడ ఏర్పడినది.

ఆంధ్ర గ్రంథాలయోద్యమ ప్రచారకుల సభ •

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమమున సేవావ్రతుల సేవలను సమీకరణము చేయుటకును పటిష్టము చేయుటకును 21-1-1934 తేదీన ఆంధ్రగంథాలయోద్యమ ప్రచారకుల సభ ప్రథమముగ కాకినాడ పట్టణమందు 16 వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభతో బాటుగ సమావేశమై మిక్కిలి జయప్రదముగ జరిగినది.

శ్రీ నేత్రకంటి యోగానందరావు బి. ఏ; బి. ఎల్; గారు ఆహ్వానసంఘాధ్యక్షుగ నుండి ప్రతినిధులకు స్వాగతమిచ్చిరి. గ్రంథా లయోద్యమ భీష్ములు శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారు సభను ప్రారంభించిరి. గ్రంథాలయోద్యమమందు విశేషమైన ప్రచారాను

• ఈ సభయొక్క అధ్యక్షోపన్యాసము ఈ గ్రంథముననే 126 పుటలో "గ్రంథాలయములు-వాని నిర్వహణము" అను శీర్షికతో ప్రచురింపబడినది.

• గ్రంథాలయ సర్వస్వము. సంపుటము 9; సంచిక 2; నవంబరు 1934

భవము గలిగిన శ్రీమతి జొడ్డపాటి సీతాబాయమ్మగారు సభాధ్యక్షతను వహించిరి.

"ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమ వ్యాప్తిని చేయుటకుగాను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు అనుబంధముగ సేవా శాఖను స్థాపించుటకు తీర్మానించడమైనది" అను తీర్మానమును శ్రీ కళా వేంకటరావుగారు ఉపపాదించగా ఏకగ్రీవముగా అంగీకరింపబడినది. శ్రీయుతులు కోపల్లె శివకామేశ్వరరావు, కనుమూరి వీరేశలింగం, రుద్రరాజు నరసింహరాజు, విరియాల కామరాజు, కిళాంబి రాఘవాచార్యులుగారు పుణ్యమూర్తుల రాజశేఖరంగారు శ్రీమతి వల్లూరి సుబ్బమ్మగారును గ్రంథాలయ ప్రచారమార్గములను గూర్చియు - ఆవశ్యకతను గూర్చియు విపులముగ చెప్పిరి.

ఈ సేవాశాఖ స్థాపనము ఆంధ్రదేశమున ప్రారంభింపబడిన గ్రంథాలయ యాత్రలు నిర్వహించుటయందు ప్రముఖ స్థానమును వహించుటకు తోడ్పడినది.

## యాత్రా సన్నాహము - నిర్వహణము

భీమవరం తాలూకాతో నాకు 1915 సంవత్సరము నుండియు గలిగిన గ్రంథాలయ బాంధవ్యమువలన అనేకులు సన్నిహితులైరి. పడవమీద గ్రంథాలయయాత్రను 1918 సంవత్సరముననే ఈ తాలూకాయందు రూపొందించి అంకురార్పణ జేసితినిగదా!

ఈ రీతిగా గ్రంథాలయోద్యమమును పటిష్టముగ ప్రచారము చేయుటకై, పదునెనిమిది సంవత్సరముల కాలము (1915 మొదలు 1933 వరకు) అనేక విధములైన ప్రయోగములను జేసి - పరిశోధనల నొనర్చి- చివరకు గ్రంథాలయయాత్రలకు సుస్పష్టమైన రూపకల్పన జేసి, వివరముల నన్నిటిని రూపొందించితిని.

ఈ యాత్రవంటి ప్రణాళికను ఇదివరకెవ్వరును నడిపియుండ లేదు. శిల్పికి తాను మలచు విగ్రహ స్వరూప స్వభావములు తన మనోనేత్రము ముందర తాండవించుచునే యుండును. ఆ విధముగనే గ్రంథాలయ యాత్రాస్వరూప స్వభావములును తత్ఫలితములును

నా మనోనేత్రముల ఎదుట విస్పష్టముగ సాక్షాత్కరించుచునే యుండెను.

ఎందులకని ఎదురుప్రశ్నలు వేయకుండ, విశ్వాసముగలిగి అనుసరించు సేవావ్రతులను పన్నెండుగురు అనుచరులను ఎంచుకొని, వారినే గ్రంథాలయ యాత్రాసేవాదళముగ నేర్పరచికొంటిని. అవసరముగ భజనపరులు - ఉపన్యాసకులు - యాత్రాదళముతో యథా సంభవముగ జేరుచుందురు. వారి వారి కార్యక్రమానంతరము యాత్రాదళమును వీడుచుందురు.

ఈ రీతిగా ఏర్పాటుల నన్నింటిని గావించుకొని, ప్రథమ భీమవరం తాలూకా గ్రంథాలయ యాత్రను "కుముదవల్లి" గ్రామమున ప్రారంభించి 1934 సం॥ సెప్టెంబరు 1 తేదీ మొదలు 17 వ తేదీ వరకు జయప్రదముగనడిపి, మహోజ్వలములైన ఫలితములను బడయ గలిగితిమి.

గ్రంథాలయ యాత్రల స్వరూప స్వభావమును సత్ఫలితములును సర్వులకును సుస్పష్టమయ్యెను. అంతటితో, సందేహించు వారికిగూడ యాత్రలయందు విశ్వాసము కుదిరినది.

భీమవరం తాలూకా గ్రంథాలయ యాత్రలు

| | |
|---|---|
| ప్రథమ యాత్ర-: యాత్రాదినములు | 17 |
| మొత్తం దర్శించిన గ్రంథాలయములు | 33 |
| ఉద్ధరించిన గ్రంథాలయములు | 4 |
| నూతనముగా స్థాపించిన గ్రంథాలయములు | 5 |
| వార్షికోత్సవములు జరిపిన గ్రంథాలయములు | 5 |
| గ్రంథాలయముల ఆదాయమందు అభివృద్ధి రు | 300 |
| నూతనముగా బయలుదేరిన సేవావ్రతులు | 100 |
| ఉద్ధరణకు వాయిదాపడిన గ్రామము | 1 |
| కాలినడకను ప్రయాణం చేసిన మైళ్ళు | 84 |

భీమవరంతాలూకా ద్వితీయగ్రంథాలయయాత్రను 10-9-36 మొదలు 31-9-36 వరకును, తృతీయ గ్రంథాలయయాత్రను



ప్రథమ భీమవరం తాలూకా గ్రంథాలయ యాత్ర - 1934 సం. సెప్టెంబరు 1 మొదలు 17 వరకు

యాత్రాదళమునకు నాయకులు : శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య



ప్రథమ తాడేపల్లిగూడెం
గ్రంథాలయ యాత్ర
21-2-35 మొదలు
16-3-35 వరకు

కుర్చీలలో కూర్చున్నవారు :
శ్రీమతులు
తేతలి సావిత్రమ్మ
దామోజీవరపు లక్ష్మీనరసమ్మ

అయ్యంకి వేంకట రమణయ్య
యాత్రాదళములకు నాయకులు.

దద్దనాల సత్యనారాయణ
వావిలాల గోపాలకృష్ణయ్య
తల్లాప్రగడ భీమేశ్వరరావు

క్రిందివరుసలో కూర్చున్నవారు :
తాలూకా నాయకులు
డాక్టరు తేతలి
సత్యనారాయణమూర్తి.

ద్వితీయ తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయ యాత్ర - 8-3-37 నుండి 15-4-37 వరకు



కుర్చీలలో కూర్చున్నవారు : 2. దండు నారాయణరాజు 3. గాడిచర్ల హరిసర్వోత్తమరావు (ప్రారంభకులు) 4. మారేపల్లి రామచంద్రశాస్త్రి (అధ్యక్షులు) 5. అయ్యంకి వేంకట రమణయ్య (యాత్రాదళ నాయకులు) 6. గొల్లపూడి సీతారామశాస్త్రి.

## అలంపురం ఫిర్కా గ్రంథాలయ యాత్ర - 23—1—39 నుండి 31—1—39 వరకు



యాత్రాదళమునకు నాయకులు : అయ్యంకి వేంకట రమణయ్య (శాలువతో మధ్యనున్నవారు)

16-4-37 మొదలు 27-4-37 వరకును మారేపల్లి రామచంద్రశాస్త్రి గారి ఆధ్వర్యమున నిర్వహించితిమి.

ఈ యాత్రల కార్యక్రమమునంతను భీమవరమునుండి పర్యవేక్షించుచు, అవసరమైనపుడెల్ల యాత్రాగ్రామముల యందెల్ల ప్రత్యక్షమగుచు, శ్రీకృష్ణుడు పాండవులకువలె సకల సదుపాయములను సహాయములను చేయుచుండిన డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారి సహకార సానుభూతులు వర్ణనాతీతములు.

## తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయ యాత్రలు

తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయోద్యమ నాయకులగు డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారి ఆదరణలో "ప్రథమ తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయయాత్ర"ను 25-3-35 మొ॥ 16-3-35 వరకు జయప్రదముగ నిర్వహించితిని.

ఆంధ్రదేశము మొత్తముమీద 1934 సంవత్సరమున ప్రథమ గ్రంథాలయయాత్ర భీమవరము తాలూకాలో నిర్వహింపబడుటచేత — 1935 సంవత్సరమున జరిగిన ఈ యాత్ర రెండవదైనది.

### ప్రథమ తాడేపల్లిగూడెం తాలూకా యాత్రా ఫలితములు:

| | | |
|---|---|---|
| యాత్రా దినములు | 20 | |
| యాత్రికులు కాలినడకను ప్రయాణము జేసినదూరము | 83 | మైళ్లు |
| ,, బండ్లమీాద ప్రయాణము జేసిన దూరము | 42 | ,, |
| ,, రైలుమీాద ప్రయాణము జేసిన దూరము | 17 | ,, |
| మొత్తము సంచారము చేసిన దూరము | 142 | ,, |
| పలువురచే ఇయ్యబడిన బహిరంగోపన్యాసములు | 150 | |
| "మ్యాజిక్కు లాంతరు" ప్రదర్శనములు | 50 | |
| యాత్రకయిన మొత్తము ఖర్చు (ఉచిత భోజనాదులుగాక) | రు 61 | |
| తాలూకా విస్తీర్ణము చదరపు మైళ్లు | 348 | |
| తాలూకా జనసంఖ్య | 1,68,721 | |
| తాలూకాలోని గ్రామములు | 115 | |

| | |
|---|---|
| అందు పంచాయతులున్న గ్రామములు | 115 |
| తాలూకాలలో గ్రంథాలయముల సంఖ్య మొత్తము | 51 |
| ఇందు పంచాయతీ గ్రంథాలయములు | 31 |
| "సంఘము" లచే నిర్వహింపబడుచున్న గ్రంథాలయాలు | 17 |
| జిల్లాబోర్డుచే నిర్వహింపబడు గ్రంథాలయములు | 3 |
| యాత్రలో నూతనముగా స్థాపింపబడిన గ్రంథాలయాలు | 8 |
| యాత్రలో పునరుద్ధరింపబడినవి | 5 |
| సంచారము చేసిన గ్రామములు | 46 |
| అందులో గ్రంథాలయములున్న గ్రామములు | 45 |
| ఆ గ్రామముల జనసంఖ్య | 86,572 |
| ఈ సంవత్సరములో ఒక మనిషి చదివిన గ్రంథములు | 1¼ |
| మొత్తం జనసంఖ్యలో, ప్రతి నలుగురు మనుష్యులకు ఉన్న పుస్తకముల సంఖ్య | 1 |
| గ్రంథాలయములలో ఉన్న గ్రంథముల సంఖ్య | 20 979 |
| ఈ సంవత్సరములో చదువబడిన గ్రంథముల సంఖ్య (ఒకే పుస్తకమును అనేకులుకూడ చదివినారు | 51,969 |
| తాలూకా మొత్తముమీద లభ్యమగుచున్న పత్రికలసంఖ్య | 144 |
| ఆ పత్రికలను నిత్యము చదువువారి సంఖ్య | 426 |
| సంఘములచే నిర్వహింపబడు చున్న పంచాయితీలుగాక 17 గ్రంథాలయములందలి సభ్యులు | 421 |
| " ఈ గ్రంథాలయముల ఆదాయము | రు 3,397-7-0 |
| " ఈ గ్రంథాలయముల ఖర్చు | రు 2765-13-0 |

సూచిక:— ఉచితముగా సంపాదించిన గ్రంథముల, పత్రికల, ఖరీదులు ఈ లెక్కలలో చేరలేదు.

తాడేపల్లిగూడెం తాలూకా ద్వితీయ గ్రంథాలయ యాత్ర 8—4—37 నుండి 15—4—37 వరకు జయప్రదముగా నిర్వహింపబడినది గ్రంథాలయోద్యమ నాయకులు, కార్యకర్తలేగాక, సర్దారు దంతు నారాయణరాజు, సర్దారు గొల్లపూడి సీతారామశాస్త్రిగార్లుకూడ

ఈ యాత్రలో పాల్గొనుటచే, ఈ యాత్రకొక ప్రత్యేకమైన శోభ కలిగినది.

గణపవరం, అలంపురంఫిర్కాలలోగూడ ప్రత్యేక యాత్రలను నిర్వహించితిమి.

తాడేపల్లిగూడెము నందుండి యాత్రికులను నిత్యము ఆయా మజిలీలయందు కలిసికొనుచు, సూత్రధారియై నడపిన డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారి నిర్మాణశక్తి అసమానము, అనన్యము.

## కొవ్వూరు తాలూకా - గోపాలపురం ఫిర్కాయాత్ర

10-10-37 తేదీనుండి ప్రారంభమైనది. ఆంధ్రదేశం మొత్తం మీద జరిగిన ఫిర్కా గ్రంథాలయ యాత్రలలో నిది రెండవది.

## రేపల్లె తాలూకా గ్రంధాలయయాత్ర

ఆంధ్రదేశం మొత్తముమీద జరిగిన గ్రంథాలయ యాత్రలలో మూడవది రేపల్లె తాలూకాలో 2-5-36 నుండి 8-5-36 వరకు జరిగినది. రేపల్లె తాలూకా గ్రంథాలయ నాయకులగు శ్రీయార్లగడ్డ శ్రీకృష్ణయ్యచౌదరిగారి ఆధ్వర్యముక్రింద ఈ యాత్ర జయప్రద ముగా నిర్వహింపబడినది.

## ఎన్నో యాత్రలు

ఇంకను తెనాలితాలూకా మొదలైనచోట్లగూడ అనేక ముగా గ్రంథాలయయాత్రలు నిర్వహింపబడి సత్ఫలితముల నిచ్చినవి.

## యాత్రా ఫలితములు

గ్రంథాలయ సేవకులు నిర్వహించిన ఘనకార్యములలో గ్రంథాలయ యాత్రలు విశిష్టమైనవి. భీమవరము, తాడేపల్లిగూడెం, కొవ్వూరు, రేపల్లె తాలూకాలలో నీ యాత్రలు నా ఆధ్వర్యముననే నిర్వహింపబడినవి. యాత్రా ఫలితములు అపూర్వములు. అనన్య సామాన్యములు. గ్రంథాలయములున్న ప్రదేశములందు నూతన చైతన్యముతో ప్రగతి సాధించినవి. జీర్ణమై విస్మృతమై కాలగతి ననుసరించు గ్రంథాలయములను పునరుద్ధరించుట జరిగినది. గ్రంథా

లయ చైతన్యములేని ప్రదేశములందు చైతన్య ప్రబోధము గలిగినది, గ్రంథాలయముల సంఖ్య యభివృద్ధియైనది. అటకలమీద బూజుపట్టి నిరుపయోగముగానున్న గ్రంథముల కుపయోగము గలిగినది; జీర్ణించు చుచున్న తాటియాకు గ్రంథముల సేకరించుటయు జరిగినది; నూతన గ్రంథములను వివిధ గ్రంథాలయములు దెప్పించుకొనుట వలన గ్రంథకర్తలకు ప్రోత్సాహము కలిగినది.

ఈ స్థాపింపబడిన, పునరుద్ధరింపబడిన, గ్రంథాలయముల వారందరు పత్రికలను దెప్పించుకొనుటచే పత్రికా ప్రచార మభివృద్ధియైనది. ఈ విధముగ గ్రామ గ్రామములందు "గ్రంథాలయ వాతావరణ" మేర్పడుటచే వయోజన విద్యా పాఠశాలలు, పఠనమందిరములు స్థాపింపబడినవి.

ముఖ్యముగ గ్రంథాలయోద్యమ ప్రచారమునకిట్టి యాత్రలు అమూల్యమైన సాధనములని యాత్రలలో పాల్గొన్నవారికిని, ఉద్యమాభిమానులకును విస్పష్టమై- వీనియందు విశ్వాసము కుదిరినది. ఈ యాత్రావార్తలు పత్రికలలో ప్రచారముకాగా నితర జిల్లాలవారు గూడ అనేకులు నన్నాహ్వానించి వారి జిల్లాలలోగూడ నిట్టి కార్యక్రమముల నిర్వహించుటచే అంతకుపూర్వము - కని, విని యెరుంగని ఉత్సాహమును గ్రంథాలయ చైతన్యమును ప్రజలు బొందిరి.

## యాత్రికులను గూర్చిన ముచ్చట్లు

(భీమవరం తాలూకా గ్రంథాలయ యాత్రల నాయకులు- నిర్వాహకులు- నగు డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారు ప్రథమ యాత్రయందు పాల్గొనిన ప్రముఖులగు యాత్రికులను గురించిన ముచ్చట్లు, తమ నివేదికయందు వ్రాసిన వానిని - ఈ క్రింద ఉల్లేఖించుచున్నాను, సంపాదకుడు.)

"యాత్రికులలోకెల్ల వృద్ధుడు భూపతిరాజు తిరుపతిరాజుగారు. డెబ్బది సంవత్సరముల వయస్సు గలిగిన (1934) వీరు సరస్వతీ దేవియొక్క ధ్వజమును బుజముమీద నెత్తుకొని, తన సన్నని బక్క పలుచని దేహముతో - పవిత్రవంతమైన దృక్కులతో-'ముగ్గుబుట్ట

మరి నెరసిన వెంట్రుకలతో – అడుగులు తడబడకుండ, నడకయందు ఎగుడు దిగుడులు లేకుండ, పడుచుకుర్రవానివాలె నడచుచు, యాత్రికులయందేగాక గ్రామస్థులయందుగూడ ఉత్సాహమును ఇనుమడింప జేయుచుండిరి. ఈ తాలూకాలో వారి నెరుంగని వారు లేరు. వెళ్ళిన చోట్లనెల్ల – ప్రతి యూరిలోను – వారిని బాబుగారనియు, మామగారనియు, తాతగారనియు వరుసలతో బిలుచువారే. అందరును ఈ విధముగ వారిని పరమ ఆప్తబంధువువలె సంబోధించుచు, వచ్చిన పనిని తెలుసుకొని భక్తిశ్రద్ధలతో ఆ పనిని పూర్తిజేసి పంపువారే – ఈయన చలిపిడుగు, ఆడంబరము లేదు; ఉరుము లేదు; మెరుపు లేదు; ఊరికే అమృతవర్షము కురియుటయే; ఉద్రేకము లేకుండ మాట్లాడు స్వభావము వీరిది. ప్రతిమాటయు వినువారి హృదయములో నిశితముగా ప్రవేశించవలసినదే.

“తిరుపతిరాజుగారి” ప్రయివేటు శెక్రటరీ “సుబ్బరాజుగారు” అను పేరుగలవారు గలరు. ముసలివారికి ముసలివారి తోడ్పాటు. సుబ్బరాజుగారి సలహా తోడ్పాటు లేనిదే తిరుపతిరాజుగారికి ఒక్క అడుగు సాగదు.”

“శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు యాత్రికులకెల్ల నాయకుడు. యాత్రా సంసారమునకు యజమాని. ఎల్లప్పుడు జరుగుచున్న కార్యక్రమమును నడుపుచుండును. ముందు కార్యక్రమమును సూచించుచుండును. ఈ సంసారమునందు ఏయే వ్యక్తి ఏయే కార్యములను నిర్వహింప వలయునో, వారి వారిచే ఆయా పనులను గైకొనుచుండును. అందరికి తలలోని నాలుకవలె, ఎవరి కెట్టుల నచ్చజెప్పవలయునో, అట్టుల జెప్పుచు సంసారచక్రమును నడుపుచుండును. ఈయన మిక్కిలి పట్టుదలగలవాడు. తాను తలచినది చేసినదాక నిద్రపోడు; పట్టుదల వదలడు.

“ఈ యాత్ర ఆంధ్రదేశమున కంతటికిని మొదటిది. యాత్రికులు చేయుపని గ్రంథాలయోద్యమము యొక్క ఉద్బోధనము మాత్రమే గాదు; ఆ గ్రామమందు గ్రంథాలయము చక్కగా పని

చేయుచున్న సరియే, లేనియెడల సరిగా పనిచేయుటకు తగు ఏర్పా టులను చేయుచుందువారు. స్వరూప నాశనమైనచోట్ల తిరిగి స్వరూప మును ఏర్పాటుచేసినారు; అవసరమైనచోట్ల క్రొత్తగ్రంథాలయము లను స్థాపించినారు; ప్రతిగ్రంథాలయమందును – సరస్వతీదేవికి పూజారులుగా – యువకుల నుద్బోధించి ముందు నిర్వాహణకు తగు ఏర్పాటులు చేసినారు. ఈయనది భల్లూకపుపట్టు; తన ఆశయము నెరవేరనిచోట్ల – దానివలననే కార్యమును నెగ్గించుకొన్నారు. ఎక్క డికి వెళ్ళినను జయమేగాని, అపజయ మెంతమాత్రమును లేదు. వీరి యుపన్యాసములు అనుభవపూర్వకములేమై, నిత్యమును గ్రంథాలయ జీవితమునందు ఆచరణలో పెట్టదగినవిగా నుండెను. మాటలసందర్భ మున తన పనిని మరచిపోరు. వీరి ఓర్పును, నిపుణతను వర్ణించుటకు వీలులేదు; వీరిని పరీక్షించు సందర్భము లనేకములు యాత్రాసందర్భ మున తటస్థించినవి. అట్టి సందర్భములయందెల్ల వీరు చూపిన ఓర్పు నిపుణతయు అద్భుతములు. మరియు వీరి త్యాగశక్తికూడ మరువ దగినదిగాదు."

"ఈ గ్రంథాలయ యాత్రలలో శ్రీ అయ్యంకి వేంకటరమ ణయ్య పంతులుగారు చూపిన పట్టుదల, శ్రద్ధ, కార్యదీక్ష వర్ణనాతీత ములు. ఒక్కొక్క గ్రామములో మొదట గ్రామస్థులు ఉత్సాహము లేక అసహాయతను జూపినప్పుడు శ్రీ రమణయ్యపంతులుగారు సత్యా గ్రహమునుబూని, భజనజట్టుతో గ్రామమంతయు దిరుగుచు, యువ కులు వచ్చి గ్రంథాలయమును స్థాపించినగాని ఆగ్రామమును వీడ మనియు, భోజనము గ్రంథాలయ స్థాపన అనంతరమేయనియు ప్రబో ధించుచు, ఒక్కొక్క రోజున భోజనములేకనే గడపిరి. అట్టి శ్రద్ధ తోను పట్టుదలతోను ఉత్సాహముతోను పనిచేయుచున్న శ్రీ వెంకట రమణయ్య పంతులుగారినిచూచి, తదితర యాత్రికులు ద్విగుణీకృతో త్సాహముతో యాత్రనంతను జయప్రదముగా నడపిరి."

"సిరిసంపదలకు పేరెన్నికగన్న పెదపుల్లేరు గ్రామమునకు యాత్రజట్టుతో పోతిమి. ఈ గ్రామమందుగల పార్టీల స్పర్థలవల్ల

ఆచటి గ్రంథాలయమును పునరుద్ధరించుటకు అవకాశముగుపడ లేదు; అందుమీద గ్రంథాలయము పునరుద్ధరించు పర్యంతము వేంకటరమణయ్యగారు నిరాహారదీక్షను బూనిరి; గ్రామమందరికిని కావలసిన ఇట్టి ఉమ్మడి కార్యమునందు స్పర్థలు అడ్డురాగూడదని బోధించి, గ్రంథాలయమును పునరుద్ధరించుటయందు జయప్రదులై - తదుపరి యాత్రను సాగించిరి. వారి దీక్షకు పట్టుదలకు కార్యదక్షతకునిది యొక్క మచ్చుతునక."

"తాడిమేటి కుటుంబశాస్త్రిగారు:-వీరు యువకులను ఆకర్షించి వారిచే పనిచేయించుటయందు కడు నేర్పరులు. కార్యోత్సాహమును, ఉద్రేకమును ఎల్లప్పుడును వెలిగ్రక్కుచుండును. వీరు మొదటి అయిదు రోజులు మాత్రముండి అనారోగ్యముచే వెడలిపోయిరి.

"రావుసాహేబు వఝ్ఝల భోగప్పశాస్త్రిగారు:-వీరి యుపన్యాసములు గంగానది ప్రవాహమువలె తీవ్రవేగముతో ప్రవహించుచు జనులందరిని తన ప్రవాహమున ముంచిలేవనెత్తుచుండును. వీరు మూడుదినములు మాత్రము యాత్రికులతో నుండగలిగినారు."

"కొత్తపల్లి నారాయణరాజుగారు: వీరు పాలకోడేరు గ్రామమందున్న నారాయణ త్రితయమునం దొకరు. (నారాయణత్రితయమనగా "సంగీతపు" నారాయణరాజుగారు, "పురాణపు"నారాయణరాజుగారు, "తరంగము"ల నారాయణరాజుగారు) ఇందులో వీరు "తరంగము"ల నారాయణరాజుగారు.వీరును వీరి భజనబృందము వారును యాత్రికులతో ఎల్లప్పుడునుండి, యాత్రను సాధ్యము జేసిరి. వీరు యాత్రకు జీవము. వీరు లేనిది యాత్రలో జ్ఞానప్రబోధమే లేదు; ఆకర్షణయే లేదు; వీరు నిజమైన భక్తవర్యులు. వీరు భజన జేయునప్పుడు, భక్తిపారవశ్యులై, వినువారందరిని భక్తిపారవశ్యులుగా జేసివై చెదరు. ఎంతసేపు భజనజేసినను వీరికి విసుగు ఏమాత్రముకు లేదు. వీరియొక్క తోడ్పాటు అమూల్యము."

"వావిలాల గోపాలకృష్ణయ్యగారు: వీరు "వాండ్రము"లో మకాముననకు వచ్చి యాత్రికులను కలుసుకొనిరి. వీరు వ్యగ్రోత్సా

హాలుః వీరు ఏవిషయముమీదనైనను అనర్గళముగా చక్కని శైలిలో చక్కని ఆకర్షవంతముగ ఉపన్యాసము లివ్వగలరు. వీరియొక్క సహాయము మరువదగినది గాదు.

యాత్రికులలో శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారిచే నియమింపబడిన - వారి శిష్యులగు ఉప్పర్ల లక్ష్మీనారాయణగారి యొక్క సహాయమును అమూల్యము. మద్రాసు ప్రొవిన్షియల్ కోఆపరేటివు యూనియన్ కార్యదర్శులగు శ్రీ సత్యనారాయణగారు దయతో వీరిని పంపి, యాత్రికంతకును వన్నెదెచ్చిరి; వీరు యాత్రికులతో నుండి, ఎప్పుడు అడిగితే, అప్పుడు, "మ్యాజిక్కులాంతరు" ఉపన్యాసముల నిచ్చుచుండిరి. కొన్ని దినములయందు రాత్రులయందేగాక మధ్యాహ్నములయందు గూడ "మ్యాజిక్కులాంతరు" సహాయముతో బొమ్మలను చూపుచు ఉపన్యాసములిచ్చిరి. వీరు ఎల్లప్పుడు నవ్వుచు ఆనందమును వెలిగ్రక్కుచుందురు. వీరికి కష్టమనునది అసలు తెలియనే తెలియదని చెప్పగలను. మరియు ఇతరులు కష్టబడుచున్నప్పుడు వారికి హుషారును కలుగజేయుచు నిరుత్సాహమును పెకలించి వేయుచుందురు."

"ఇక యాత్రికులలో ఇందుకూరి సోమరాజుగారు, అల్లూరి సుబ్బరాజుగారు, గొట్టిముక్కల రామచంద్రరాజుగారు, కలిదిండి సూర్యనారాయణరాజుగారు, వేగేశిన శివలక్ష్మీపతిరాజుగారు, పెనుమెత్స జగన్నాథరాజుగారు, మొదలగువారు–భజనచేయుటయందేమి, యాత్రికుల కార్యక్రమమును నిర్విఘ్నముగా కొనసాగించుటయందేమి అమితమైన సహాయమును జేసిరి. వీరి సహాయము లేనియెడల యాత్రికుల కార్యక్రమము ఇంతజయప్రదముగా సాగుటకు ఎంతమాత్రమును అవకాశముండెడిదిగాదు."

గ్రంథాలయ సర్వస్వము 1933-1936 సంపుటముల సహాయంతో తయారు చేయబడినది.

# ఆంధ్ర ప్రభుత్వ సంచార శకటు గ్రంథాలయము

## ఆ వ శ్య క త

గ్రామసీమల్లో గ్రంథాలయసేవ చెయ్యటానికీ, గ్రామ గ్రంథాలయాలు చేయు సేవకు దోహదం కలిగించటానికీ, ఆ సేవకు అనుబంధ సేవా కార్యక్రమాన్ని నెలకొల్పటానికీ; సంచార గ్రంథాలయాల ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. గ్రంథాలయాలు నెలకొనని గ్రామాల్లో, వీని ఆవశ్యకతను గూర్చి వేరే చెప్పనక్కరలేదు.

అలసులు, ఉదాసీనులు ఎక్కువగా ఉన్న మన దేశంలో సంచార గ్రంథాలయాలు నవచైతన్యాన్ని పురికొల్పి గ్రంథపఠనా సక్తికి దోహదంజేసి, వయోజనవిద్యకు పునాదులు వేస్తాయనటానికి సందేహంలేదు.

## సంచార గ్రంథాలయ శకటం

ఈ అభిప్రాయంతోనే 1957 సంవత్సరమునుండి, కేంద్ర ప్రభుత్వ సహాయంతో మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము తమ ఆధ్వర్యంలో ఒక సంచార గ్రంథాలయ శకటాన్ని (మోటారువాన్) నిర్వహిస్తున్నారు. పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరులో దీని కేంద్రము.

ఆంధ్రప్రదేశ లైబ్రరీ కమిటీవారి ఆహ్వానంమీద నేను ఏలూరునకుబోయి, ఈ సంచార గ్రంథాలయ మోటారువాన్ యొక్క కార్యక్రమాన్ని – నడకను – సాకల్యంగా పరిశీలించినాను.

ఈ మోటారు వాన్ సంచార గ్రంథాలయాన్ని నిర్వహణ కొరకు ఒక గ్రంథభాండాగారి – ఒక డ్రయివరు – ఒక ఫిలిం ఆపరేటరు – ఒక క్లీనరును ఏర్పరచినారు. ఏలూరు గ్రంథాలయ కార్యాలయంలో ఒక కాపలావాడు, నౌకరు కూడా కలరు.

ఈ సంచార గ్రంథాలయ శకటంలో పుస్తకాలు పెట్టుటకు బీరువా అరలను ప్రత్యేకంగా అమర్చినారు. ఈ శకటంలో పదివేల రూపాయల ఖరీదుతో సర్వవిషయిక గ్రంథాలుగల పదకొండువేల గ్రంథములు కలిగిన ఒక సంపూర్ణ గ్రంథాలయాన్ని ఏలూరు రామచంద్రరావుపేటలో ఏర్పరచిరి. అందుండి ఒక "ప్రయాణము" నకు గావలసిన గ్రంథములను కొన్నింటిని ఈ శకటంమీద తీసికొని బయలుదేరుతారు. ఈ బండిలోనే ఈ గ్రంథాలయమునకు అనుబంధముగ ఒక "టాకీ" చలనచిత్రములను ప్రదర్శించు యంత్ర సరంజామును పదునైదువేల రూపాయల ఖరీదుగలదానిని అమర్చినారు. ఉపన్యాసములను రికార్డుచేయుటకు ఒకటేపురికార్డరుకూడ కలదు. దీనిమూలంగా చిత్రప్రదర్శనములను గ్రామస్థులకు ప్రదర్శించి వారి విజ్ఞాన తృష్ణను దీరుస్తున్నారు.

ఇటువంటి గ్రామ గ్రంథాలయ సేవకు నుద్దేశింపబడిన శకటంలో గ్రంథభాండాగారి గ్రంథాలయ శాస్త్రంలో తరిబీమను పొందినవాడై, గ్రామ సాంప్రదాయాలు, గ్రామస్థుల మనస్తత్వం బాగా గ్రహించగలిగినవాడై, వారితో సన్నిహితత్వం నెరపగలిగినవాడై, కార్యక్రమమందు ఉత్సాహాన్ని చూపువాడై యుండాలి. అట్టివారు కేవలం జీతబత్తెములను ఆశించువారు కాగూడదు. "ఇది గ్రంథాలయ సేవోద్యమము, ఒక ప్రజాహితోద్యమంలో పాల్గొంటున్నాము" అనే తత్వం గలిగినవారుగా ఉండాలి. ఇటువంటి ఉత్సాహంతో గ్రంథాలయ సేవకుల సహాయసహకారాల్ని సంపూర్ణంగా స్వీకరించి ఉద్యమంలో ప్రగతిని సాధించాలి.

ఈ సంచార శకట గ్రంథాలయం ప్రస్తుతం నిర్వహిస్తున్న యేసుదాసుగారు తమ ధర్మమును ఇట్టి ఆదర్శములతోనే జయప్రదముగా నిర్వహిస్తున్నారని చెప్పుటకు సంతోషిస్తున్నాను.

## గ్రంథాలయ నిర్వహణ విధానము

ఈ ప్రభుత్వ సంచార శకట గ్రంథాలయం ఒక గ్రామానికి తరలి ఆ గ్రామంలో ఉన్న- పాఠశాల, లేక దేవాలయం, లేక కూడలి

స్థానం, ఏదోఒక ప్రదేశానికి పోయి ఆగుతుంది; మొదట రికార్డుపాట లను వినిపించడానికి ప్రారంభించి, తాను గ్రామానికి అరుదెంచిన సంగతిని గ్రామస్థులందరికి ప్రసారంజేస్తుంది. ఈ పాటలు విని గ్రామంలోని బాలురు, బాలికలు, పెద్దలు పురుషులు, స్త్రీలు శకటంఉన్న చోటికి గుమిగూడుతారు. ఒక చిన్న తిరునాళ్ళు సాగుతుంది. పాటలు పద్యాలు, రికార్డు చేసిన ఉపన్యాసాలు - అన్నీ విని ఆనందిస్తారు. ఇంతలోనే అంతకుపూర్వం పుస్తకాలను ఎరువు తీసికొన్నవారు, ఆ వెనకటి పుస్తకాలను గ్రంథభాండాగారికి తిరిగి ఇచ్చివేసి, మరల వారికికావలసిన కొత్త పుస్తకాల్ని ఎరవు తీసికొంటారు. అంతటితో ఆ గ్రామంలోని కార్యక్రమం పూర్తి అవుతుంది. మరో గ్రామానికి తరలి వెడుతుంది శకటం. ఆ రాత్రికి మకాంచేసిన గ్రామంలో "టాకీ" చలనచిత్ర ప్రదర్శనాన్నికూడ చూపి, ప్రజలకు వినోదాన్ని విజ్ఞానాన్ని కలిగిస్తారు.

## గ్రంథాలయ సేవను పొందుచున్నవారు

ప్రస్తుతం ఈ శకటం ఏలూరు పట్టణాన్ని కేంద్రంగా పెట్టు కొని చుట్టుప్రక్కల బాటలమీదగల 44 గ్రామములందలి జనులకు నెలకు రెండుమారులు సంచారం చేసి గ్రంథాలయ సేవను చేస్తోంది. ఈ గ్రామాలు ఏలూరునకు అన్నివైపుల ఉన్నవి. ప్రతి వారమును ఒక దిక్కునను న్న గ్రామాలను నిర్ణయించి ఆ వైపుననున్న గ్రామాల్లో గ్రంథాలయసేవను చేస్తున్నారు. మరుచటివారం ఇంకొక దిక్కునయున్న గ్రామాలను నిర్ణయించుకొని ఆవైపునయున్న గ్రామములందు గ్రంథాలయసేవను అందిస్తున్నారు. ఇట్లు ఈ గ్రంథా లయసేవవల్ల ప్రయోజనం పొందువారి మొత్తం జనసంఖ్య 12,8; ఈ శకట గ్రంథాలయసేవను స్త్రీలు బాలురు విరివిగ ఉపయోగించు కోవడం గమనించదగిన విషయము.

ఈ సంచార గ్రంథాలయము ప్రస్తుతము గ్రంథాలను ఎరు వియ్యడము — మరల స్వీకరించడము - చలనచిత్ర ప్రదర్శనములను చూపడము - నిర్వహిస్తోంది.

పుస్తకాలు గ్రామస్థులందరికీ పంచియిచ్చుటద్వారా గ్రామస్థులందరికిని గ్రంథాలయమంటే ఆసక్తికి కలిగించి విజ్ఞాన తృష్ణను రేకెత్తించుటయందు ఈ సంచార గ్రంథాలయము మిక్కిలి జయప్రదముగా గ్రంథాలయసేవను చేస్తోంది.

## భారతవర్షానికే ఆదర్శం

భారతవర్షమున కంతకును సంచారశకట గ్రంథాలయసేవను మొట్టమొదటిసారిగా ప్రారంభించిన గౌరవం ఆంధ్ర ప్రభుత్వమునకే దక్కినది.

ఆంధ్రప్రభుత్వ గ్రంథాలయశాఖను నడపుచున్న శ్రీ రాఘవరెడ్డిగారు, పౌర గ్రంథాలయసేవకు ప్రత్యేకశ్రద్ధనుదీసికొని- ఇట్టి కార్యక్రమములను పెక్కింటిని నిర్వహిస్తున్నందులకు, ఈయుద్యమాభిమానులందరును వారిని కొనియాడదగును. అయిదవ పంచవర్ష ప్రణాళికలో ఇట్టి సంచారశకట గ్రంథాలయాలను అన్ని జిల్లాలకు సరఫరా చేయ సంకల్పించినట్టివారి ప్రయత్నము జయప్రదమగుగాక!

## సూచనలు

సంచార గ్రంథాలయ గ్రంథభాండాగారియొక్క సేవాకార్యక్రమం ద్విగుణీకృతమగుటకుగాను ఈ క్రింది సూచనల స్వీకరించి ఆచరణలో పెట్టదగును.

1. సంచారంచేసే గ్రామముల జనాభా లెక్కలను తయారు చేయుట.- వయోజనులు; అక్షరాస్యులు, నిరక్షరాస్యులు, కార్మికులు, కర్షకులు, పారిశ్రామికులు, వర్తకులు, వ్యాపారస్థులు, కులవృత్తులతో సేవించువారు; వృత్తుల వివరం, పనిపాటలులేక కాలక్షేపముచేయువారు, పండితులు, ఉపన్యాసకులు, భజనపరులు, కళాకారులు మొదలయిన వివరాలు సేకరించాలి.

2. రాజకీయ, సాంఘిక, విద్యావిషయిక సంఘములు, సంస్థలు

3. రవాణా సౌకర్యాలు, కాలువలు, నదులు, రోడ్లు, వగైరా.

# శ్రీ కె. రాఘవరెడ్డి

## ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వమునకు పౌర గ్రంథాలయ శాఖాధికారి



★

గ్రంథాలయచట్టమును నిర్మించి, భారతవర్షమున కంతకును మార్గదర్శకమైనది మన ప్రభుత్వము.

అట్టిశాఖను విజయవంత మగుటకై వీరు తమ యావచ్ఛక్తిని వినియోగించి కృషి చేయుచున్నారు.

★

"భారత వర్షమున కంతకును సంచార శకట గ్రంథాలయసేవను మొట్టమొదటి సారిగా ప్రారంభించిన" గౌరవం ఆంధ్రప్రభుత్వమునకే దక్కినది.

"ఆంధ్ర ప్రభుత్వ గ్రంథాలయశాఖను నడుపుచున్న శ్రీ రాఘవరెడ్డిగారు, పౌర గ్రంథాలయ సేవకు ప్రత్యేకశ్రద్ధను దీసికొని - ఇట్టి కార్యక్రమములను పెక్కింటిని నిర్వహించుచున్నందులకు, ఈ యుద్యమాభిమాను లందరు వారిని కొనియాడ దగును.

నాల్గవ పంచవర్ష ప్రణాళికలో ఇట్టి సంచారశకట గ్రంథాలయాలను అన్ని జిల్లాలకు సరఫరా చేయ సంకల్పించిన వారి ప్రయత్నము జయప్రదమగుగాక !"

ఆ యావిషయములను గురించి లెక్కలను గ్రంథభాండాగారి తయారుజేసి, ఆ జిల్లా చిత్రపటమున ఈ విషయములను జూపవలెను. ఈ సమాచార సేకరణవలనను, లోకల్ లైబ్రరీ అధారిటీ వారితో సన్నిహితమైన సంప్రదింపులు సలహాలు పొందుటవల్లనూ శకట భాండాగారి తానుచేసే సేవ విస్తృతపరచుకొని, నిర్మాణాత్మకమైన పంథాలలో గ్రంథాలయోద్యమ ప్రగతిని సాధించడానికి అవకాశం కలుగుతుంది.

ఇంకొక ముఖ్యవిషయం—ఈ గ్రంధాలయశకటం సరాసరి గ్రంధాలయసేవనేగాక గ్రంథాలయ యాత్రలను కూడ నిర్వహించాలి. (ఈ గ్రంథమునందే "గ్రంధాలయయాత్ర" అను వ్యాసమును జదువుడు. పుట268) అంతేగాక, ఆయాగ్రామాదులలో ఉన్న పండితులు—ఉపన్యాసకులు- సంఘసేవా పరాయణులు, వీరందరికీ గ్రంథభాండాగారి ప్రోత్సాహం కలుగజేసి — ఒక గ్రామములో వారిని మరొక గ్రామానికి శకటంమీద తీసికొనిపోయి ఉపన్యాసా లిప్పించాలి. అపుడు ఆయా గ్రామాదులలో ప్రజలకి ఒక విధమైన అనుబంధం ఏర్పడి - గ్రంధాలయసేవ - గ్రంథాలయోద్యమం - ప్రభుత్వ సేవకులచే నిర్వహింపబడేది అయినప్పటికీ, ప్రజల ఉద్యమ స్వరూప చైతన్యంకూడా కలుగుతుంది. ఇట్టి చైతన్యమే ఉద్యమ వ్యాప్తికి గట్టి పునాది.

శకట గ్రంథభాండాగారి గ్రామాలందలి వివిధ రకములైన జనులకు తగిన గ్రంథములు అందుతున్నవా లేదా యను పరిశీలనను చేస్తూయుండాలి. ఆయా గ్రామాలకు సంబంధించిన సమస్యలకు తగినట్లుగా ఉపయోగపడే గ్రంథములను కూడ సరఫరా చేయాలి.

ఈ రీతిగా గ్రామోన్నతికి - ఉత్తేజమునకు - తోడ్పడి- స్థిరమైన గ్రంథాలయాన్నికూడ వాంఛించేట్టుగా- గ్రామస్థుల మనస్తత్వము మారేలాగున చేయాలి.

ఇంతేగాక గ్రంథాలయములున్న ఊళ్ళలో నూతన గ్రంథములను త్వరితగతిని సరఫరా చేయుటకు లోకల్ లైబ్రరీ అధారిటీ వారికి

ఈ శకట గ్రంథాలయము ఎక్కువగా తోడ్పడుటకు అనేక సావకాశ ములను కలుగజేసికొనవచ్చును.

– ఆంధ్రప్రదేశ స్టేటు లైబ్రరీ కమిటీ వారికి శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య గారు 14–5–65 తేదీన పంపిన నివేదిక; ఆంధ్రపత్రికలో 29–3–66 తేదీన ప్రకటించిన వ్యాసముల సంగ్రహము.

---

# సంచార గ్రంథాలయ పేటికలు

## ప్రారంభము

(విశాఖపట్టణమున 1918 సంవత్సరము జూను 22 వ తేదీన అయిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ పోలవరం జమీందారు శ్రీ కొచ్చర్లకోట వేంకటకృష్ణారావు బహద్దరుగారి అధ్యక్షతక్రింద జరిగినది. ఆ సందర్భమున జరిగిన గ్రంథాలయ ప్రదర్శనమునందు సంచార గ్రంథాలయ పేటికలుకూడ ప్రదర్శింపబడిన సందర్భమున ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు చెప్పిన సంగతులు • ఈ క్రింద వివరింపబడినవి.)

### పాశ్చాత్య దేశములు

"పాశ్చాత్య దేశములందు పట్టణములయందేమి పల్లెలయందేమి సంచార గ్రంథాలయములు జనసామాన్యమునందు జ్ఞానమును వ్యాపింపచేయుటకై గొప్ప సహకారులై యున్నవి. పట్టణములయం దుండు గ్రంథాలయములు జనసామాన్యమునకు గావలసిన వివిధ రకముల గ్రంథములను చిన్నచిన్న పెట్టెలయందు బెట్టెదరు. పాటకపు జనులు, గ్రంథాలయము లందుబాటులో నుండనట్టియు, అందు బాటులో నున్నను అచటికి వచ్చుటకు అలవాటు పడనట్టియు జనులు నివసించియుండెడి పేటలకు ఆ గ్రంథపేటికల నంపి, వానియందలి

---

• గ్రంథాలయ సర్వస్వము – సంపుటము 3 – సంచిక – 3; 1918.

గ్రంథములను జనులు చదువునటుల జేసెదరు. ఇంతేగాదు- ఆటలు- ఆడునట్టి స్థలములు, నాటకములు ప్రదర్శించునట్టి శాలలు - సభలు జరుగునట్టి మంటపములు - వేయేల - జనులు ఎక్కడెక్కడ గుమి గూడి యుండెదరో అట్టి స్థలములకెల్ల ఈ సంచార గ్రంథాలయ పేటి కలతో గ్రంథములను గొనిపోయి జనసామాన్యమునందు జ్ఞానధనమును వెదజల్లెదరు. నే డిచట తెరచినట్టి గ్రంథాలయ ప్రదర్శనమునందు అమెరికా దేశము నందున్న "సెంటులూయిస్ పబ్లిక్ లైబ్రరీ" వారిచే మోటారుబండిమీద పెట్టబడి పంపబడెడు సంచారగ్రంథాలయము నొక దానిని మీరు జూచెదరు. అది ఆటలాడుకొను స్థలములయందు ఉండువారికి గ్రంథముల నిచ్చుటకై పంపబడునది.

## బొంబాయి

"బొంబాయి పట్టణమునందు "సేవకసంఘము" వారు ఒక్కొక్క పెట్టెయందు దేబది గ్రంథములనుంచి, ఆ పెట్టెలను పాటకపుజనులుండు పేటలకు నంపి, అక్కడ ఒక్కొక్క పెట్టెను నెల మొదలు రెండు నెలలవరకు నుంచి, అక్కడి జనులలో చదువగలిగిన వారిచే గ్రంథ ముల జదివించియు, చదువలేనివారికి చదివి వినిపించియు, వారియందు జ్ఞానధనములను వెదజల్లుచున్నారు.

## బరోడా

"బరోడా రాజ్యమునందుగూడ సంచారగ్రంథాలయములు స్త్రీలకు, పిల్లలకు, వ్యవసాయదారులకు, చిత్రకారులకు, ఉపాధ్యాయు లకు, విద్యార్థులకు- ఈ ప్రకారము వేర్వేరు మనోవృత్తులు గలిగిన వారికి వలయు గ్రంథములను ప్రత్యేకముగ నేర్పిపెట్టిరి.

## ఆంధ్ర దేశము

"ఈ పద్ధతుల ననుసరించి ఆంధ్రదేశమునగూడ సంచార గ్రంథాలయములను ప్రారంభింపవలెనని సంకల్పించుకొని, ఆ పనిని ఇపుడే ప్రారంభించితిమి. నేడు మీరిచట గ్రంథాలయ ప్రదర్శనము నందు రెండు సంచారగ్రంథాలయపేటికలను జూడగలరు. అందులో

ఒకటి చిన్నది, ఒకటి పెద్దది. చిన్నదాని ఖరీదు రు 25 లు. పెద్దదాని ఖరీదు రు 50 లు. ఉదారవంతు లందరును ఒక్కొక్క పెట్టెను కొని దాన మొసంగుదురని ప్రార్థించుచున్నారము. అట్టి పెట్టెలను దాన మొసంగువారికి - ఆ పెట్టెలను ప్రజల కందజేయగల బాధ్యతను మేము వహింపగలమని విన్నవించుచున్నారము. మీరందరును విరివిగా సహాయము జేసినగాని, వీని ప్రచారము నెక్కువచేయుట కవకాశముండదు.

"ఈ సంచార గ్రంథాలయములను మనము విశేషముగా పల్లెలయందు వ్యాపింపజేయగలిగితిమేని - అనంతమగు విజ్ఞాన ధనమును దేశమునందంతటను - అచిరకాలముననే వెదజల్లగలమనుట కెంత మాత్రమును సందియములేదు."

"నూతన గ్రంథాలయములను స్థాపించుటకు కావలసిన పరిస్థితులు అనేక గ్రామములందు లేకపోవచ్చును. కాని చదువుకొన గలిగిన ఒక్క మనుజునినైన సంపాదింప గలిగిన - ఏ గ్రామమైనను - వీనిని వినియోగింప సమర్థములగును. ఏలయన- ఆ చదువుకొనగలిగిన మనుజుడే - తాను గ్రంథములను చదువుకొనుటయేగాక - చదువుకొనజాలని తనతోడి గ్రామస్థుల కందలి విషయములను బోధించును.

"సోదరులారా! వేయేల! గ్రామముల నిపుడు వహించియున్న అజ్ఞానతిమిర బాధను అచిరకాలముననే తొలగింపదలంతు రేని— స్వల్పవ్యయముతో వేయదగిన మందు - సంచార గ్రంథాలయ వ్యాపనమేను. ఇతర మందులున్నవి; లేవని చెప్పుటకు సాహసింపను; కాని యితర మందు లన్నియు విశేష వ్యయప్రయాసలతో గూడు కొనినవి. సులభముగ మోక్షమిచ్చున దిది యొక్కటేను."

## సంచార గ్రంథాలయములకు గ్రంథ సహాయము

సంచార గ్రంథాలయములు స్థాపింపవలెనని తలంచి మనసభకు నేడగ్రాసనాధిపత్యము వహించిన శ్రీ కొచ్చెర్లకోట వేంకట కృష్ణారావు బహద్దరుగారిని దర్శింపగా వారు తమచే ప్రకటింపబడిన

గ్రంథము లన్నిటిని ఒక్కొక్కటి మూడు ప్రతులచొప్పున ఇచ్చి ప్రోత్సాహము గలిగించిరి.

ఇంతేగాక తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు గూడ తమచే రచింపబడిన "హిందూదేశ ఆర్థిక చరిత్ర"యొక్క 5 ప్రతుల నిచ్చి సహాయము జేసిరి.

## ఇతర వివరములు

ఇట్టి సంచార గ్రంథాలయ పేటికల మూలమున గ్రంథాలయ సేవ చేయదగు పలుమార్గములను గూర్చిన వివరములన్నియు ఈ పుస్తకము 23 పుటయందు "సంచార గ్రంథాలయము" లను శీర్షిక క్రిందగూడ వ్రాయబడియున్నవి.

నేను "బరోడా" యాత్రకు బోయినపుడు, ఆ రాజ్యమున సంచార గ్రంథాలయపేటికల మూలమున జరుగుచున్న కార్యక్రమమును పరిశీలించి–ఆ విషయము నంతను–ఈసంపుటమున "నా బరోడా యాత్ర" యను వ్యాసమున వివరించితిని.

## విజయవాడయందు జరిగిన యనుభవాలు

అట్టి సేవను మనదేశమునందుగూడ ప్రారంభింపవలెనని తలంచి "బరోడా" రాజ్యమందలి పెట్టెలమాదిరి కొన్ని పెట్టెలను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ పక్షమున 1918 సంవత్సరముననే తయారు చేయించితిని.

అట్లు తయారుచేసిన గ్రంథాలయ పేటికలను బెజవాడ పట్టణమున వివిధ పేటలయందుండిన "రామభజన మందిరము" లకు, ఒక్కొక్క పేటిక చొప్పున బంపితిని. అట్టి మందిర పరిపాలకవర్గము వారొకరు, అందలి పుస్తకములను జనులకు ఎరువిచ్చి తిరిగి వాపసు తీసికొనుటకు బాధ్యతను వహించుచుండిరి. పుస్తకముల పేటికలతో బాటుగా, ఆ పేటికలయందలి పుస్తకముల వివరములను దెలుపు కరపత్రములను గూడ కొన్నింటిని పంపుచుంటిమి. ఆ కరపత్రము

చదువగలిగినవారికి నిచ్చి, తద్వారా ఆ పేటికనుగూర్చి అందరికిని తెలియజెప్పగా, కావలసినవారు రామమందిరమునకేగి అందలి గ్రంథములను ఎరువు తీసికొనుచుండిరి.

ఈ రీతిగా బెజవాడ పట్టణమునందలి రామమందిరములు గల పది పేటలకు, ఈ సంచారగ్రంథాలయ పేటికలనంపి, గ్రంథములను జనుల కందజేసి, విజ్ఞాన వ్యాప్తిని గావించితిమి– ఫలితము ఆశాజనకముగానే యుండెను.

కాలక్రమమున ఇందు:లకై ప్రత్యేక మొక కార్యకర్తసేవ ఆవశ్యక మాయెను. మరియు గ్రంథములకు సరియైన కాగితములు – వానికి సరియైన బైండింగు – లేకపోవుటవలన, త్వరగా చినిగిపోజొచ్చెను. అట్టివాని స్థానే క్రొత్తపుస్తకాలను పూరించవలసివచ్చెను.

ఇటుల ఈ పరిశోధన కార్యక్రమమును ఒక సంవత్సరకాలము నడపినమీదట ద్రవ్యాభావమువలన, అంతటితో విరమించవలసి వచ్చినది.

ఆ విధముగ బంపిన సంచారగ్రంథాలయ పేటికలలో ఒక దానిలో – జనులకు ప్రకటనకై పంపుచుండిన – కరపత్రముయొక్క నకలును ఈ క్రింద యథాతథముగ పాఠకుల ఉపయోగార్థమై ప్రచురింపబడినది.

## సంచార గ్రంథాలయ పేటిక.

అయ్యా ! మీ గ్రామస్థులు చదువుకొనుటకుగాను సంచార గ్రంథాలయ పేటికను పంపియున్నాము. ఈ పేటిక మీ గ్రామమందు 15 దినము లుంచుదుము. ఈ పేటికయందు ఈదిగువ వివరింపబడిన గ్రంథము లున్నవి. వానిని మీరు ఇండ్లకు తీసికొనిపోయి, చదివి, తిరిగి ఇయ్యవచ్చును. అందుకు ప్రతిఫలముగా సొమ్మేమియు ఇయ్యనక్కరలేదు.

# ఇందున్న గ్రంధములు.

| వరుస సంఖ్య | గ్రంథము పేరు | గ్రంథకర్త పేరు |
|---|---|---|
| 1. | ఆంధ్రదేశపు చరిత్రము | చిల్లరిగె శ్రీనివాసరావుపంతులుగారు,బి.ఏ |
| 2. | హిందూదేశ చరిత్రము | కొమర్రాజు వేంకటలక్ష్మణరావు,ఎం.ఏ. |
| 3. | బౌద్ధ మహాయుగము | వేలూరి సత్యనారాయణ, బి. ఏ. |
| 4. | వేదకాలపు స్త్రీలు | జటావల్లభుల పురుషోత్తం, బి. ఏ. |
| 5. | తురుష్క సామ్రాజ్యము (చరిత్ర) | అయ్యదేవర కాళేశ్వరరావు,బి.ఏ.బి.ఎల్. |
| 6. | అమెరికా సంయుక్త రాష్ట్రములు | డిటో |
| 7. | దక్షిణాఫ్రికా (చరిత్ర) | దిగవల్లి వేంకటశివరావు, బి. ఏ, బి.ఎల్ |
| 8. | అమెరికా వర్తకచరిత్ర | పెద్దిభొట్ల వీరయ్య. బి. ఏ. బి. ఎల్. |
| 9. | శివాజీ చరిత్రము | కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, |
| 10. | బెంజమిన్ ఫ్రాంక్లినుచరిత్ర | పి. శ్రీనివాసరావు, బి. ఏ. |
| 11. | బాబా గురునానకు చరిత్రము | ఇ. సుబ్బుకృష్ణయ్య. |
| 12. | కబీరు చరిత్రము | అత్తిలి సూర్యనారాయణ. |
| 13 | బంగాళా దుంప | నిడదవోలు వేంకటరావు |
| 14. | ఉద్యానకృషి ప్రథమపాఠములు | గోటేటి జోగిరాజు |
| 15. | క్రొవ్వువత్తులు | కందుల శ్రీమన్నారాయణ |
| 16. | వృక్షశాస్త్రము | వేమూరి శ్రీనివాసరావు, బి. ఏ. |
| 17. | ఆరోగ్యశాస్త్రము | మోహనదాస్ కరంచంద్ గాంధిమహాత్మ |
| 18. | అల్లాహో అగ్బర్ (నవల) | భోగరాజు నారాయణమూర్తి. |
| 19. | రాయచూరు యుద్ధము (నవల) | కేతవరపు వెంకటశాస్త్రి. |
| 20. | పాతాళభైరవి (నవల) | ఏ. వి. నరసింహంపంతులు. |
| 21. | ధర్మపుత్రుడు (టాల్స్టాయికధ) | కామరాజు హనుమంతరావు. |
| 22. | వీరమతి (నాటకము) | మంగిపూడి వెంకటశర్మ. |
| 23. | లక్ష్మణరాయ వ్యాసావళి | కొమర్రాజు వేంకటలక్ష్మణరావు,ఎం.ఏ. |
| 24 | ఆర్యసూక్తిముక్తావళి (ప్రధమ భా॥) | భారతమునుండి పద్యములు. |
| 25. | ఆర్యసూక్తిముక్తావళి(ద్వితీయ భా॥) | భాగవతమునుండి పద్యములు. |
| 26. | కోటలింగ శతకము | సత్యవోలు అప్పారావు. |
| 27. | లోకపావన శతకము | ఆదిపూడి సోమనాథరావు. |

| | |
|---|---|
| 28. భక్తసంజీవని | భాగవతమునుండి పద్యములు. |
| 29. భక్తితరంగిణి | డిటో డిటో |
| 30. జతకుచ్చులు(రసవంతమగుపద్యాలు) | రాయప్రోలు సుబ్బారావు |
| 31. వైదిక విలయము | బాలగంగాధరతిలకు. |
| 32. ఆంధ్రవీరుడు | పి. వి. రమణారావు. |
| 33. గ్రంథాలయోద్యమము | యాదగిరి లక్ష్మీవేంకటరమణ. |

ఈ పెట్టె యెరువు కావలసినవా రెవరైన ఈక్రింది చిరునామాకు వ్రాయవలెను.

కార్యదర్శి, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము. బెజవాడ"



# గ్రంథ పఠనము

## ఎంతకాలం చదవాలి?

తెలివి తేటలు సంపాదించడానికి పుస్తకాలు చదవాలి అనే సంగతి అందరికీ తెలుసును. కాని ఎన్నాళ్లు చదవాలి? ఈసంగతి అందరికీ తెలియదు.

"చచ్చేదాకా చదవాలి" అని ఒక సూక్తి చాలా యదార్థమైనదే.

చిన్నప్పుడు పాఠశాలలో చదువు నేర్చుకొంటే చాలదు. పెద్ద అయిన తర్వాత పుస్తకాలద్వారా — పత్రికలద్వారా — నిరంతరం ఆ చదువును కొనసాగిస్తుండాలి. లేకపోతే చదువుకొన్న చదువు బూడిదలో పోసిన పన్నీరువలె నిరర్థకం అవుతుంది. కత్తికి వాయి అనగా పదును నిలచి యుండాలంటే అప్పుడప్పుడు పదును పెడుతూ ఉండాలి కదా! లేకపోతే బండ బారిపోతుంది. అదే రీతిని చదువుతో మనస్సునకు కూడా ఉత్తేజం కలిగించి, ఆలోచనాశక్తిని నిరంతరం పెంపొందించుతూ ఉండాలి. లేకపోతే మనస్సు మందగతిని పొందుతుంది. తెలివితేటలు కూడా లేకుండా పోతాయి.

ఎంత పెద్ద పరీక్షలలో ఉత్తీర్ణుడైనవాడైనా, నిరంతరం చదువు ఉండవలసినదే. ఇది అణుయుగం; విజ్ఞానం కళాశాలలయొక్క అల్ప పరిధిని దాటి మొతగానో పెరిగిపోయింది. దినదినానికీ నూతన పరిశోధనలు జరుగుచున్నాయి. నిమిష నిమిషానికీ విజ్ఞానం నూతన దృక్పథాలను అందుకొంటోంది. అందుచేత మెవ్వరూ యేమరి ఉండటానికి అవకాశంలేదు.

ఒక లాయరు నేను బి. ఏ., బి. యల్. పరీక్ష ప్యాసు అయినాను; చాలును అని అనుకొంటే- రోజూరోజూ క్రొత్తగా వెలువడు

తున్న ప్రభుత్వశాసనాల పరిచయం — తీర్పుల పరిచయం — లేక వెనుకబడి పోతాడు. అదేరీతిగా ఒకడాక్టరు తాను పరీక్షలు ప్యాసయి నాను ; చాలునని అనుకొంటే ఈనాడు నిత్యం పెరుగుతున్న క్రొత్త రోగాలు, క్రొత్తమందులు, క్రొత్తచికిత్సా పద్ధతులు — తెలుసు కొనజాలడు. ఈరీతగా ఏవృత్తిలో వున్నవాడైనా, లేక విజ్ఞానవేత్త అయినా, నిరంతరం విద్యాభ్యాసం— గ్రంథాలయ ప్రోత్సాహాన జరుప వలసిందే.

## వినోదానికా లేక వికాసానికా ?

పుస్తకాలు వికాసానికే చదవాలి అని కొంతమంది అభి ప్రాయం; వినోదానికే చదవాలి, అని కొంతమంది అభిప్రాయం. అయితే ఈ రెండు అభిప్రాయాలు సరికావు. పుస్తకాలు చదువు కొనడం ప్రత్యేకం మనోవికాసానికేగాక, వినోదానికి కూడా అయి యున్నది.

అసలు మానవ జీవితంలోనే "వినోదం" ఒక భాగమై పెన వేసుకొని పోయింది. అయితే అది సభ్యమైనదై యుండాలి.

అన్నం నేటప్పుడు నంచుకోవడానికి పచ్చళ్లు అవసరమే. అయితే అన్నాన్నిమించి పచ్చళ్ళు ఉండరాదు. అందుచేత వికాసం మధ్య వినోదం నంచుకొనేదిగా ఉండాలి; అంతేగాని, మించింది కారాదు. మనస్సుయొక్క విశ్రాంతికి వినోదం కొంతపాలు అవ సరమే. అయితే అట్టి వినోదానికి చదివే గ్రంథాలుకూడా వికాసానికి దోహదం చేసేవిగా ఉండాలిగాని— మనస్సును ఉద్రిక్తపరచేవి, మన స్సును బండబారజేసేవిగా నుండరాదు. చదివిన విషయం మనస్సు లోకి చొరక — ఉబుసుపోకకు మాత్రం చదివేవిగా నుండరాదు. రైలులో కూర్చున్నంతసేపుమాత్రం రంజింపజేయగలిగినవి—ప్రయా ణంబాధను మరపింపజేసేవిగా మాత్రం — ఉంటేచాలు.

## ఎట్టి పుస్తకాలు చదవాలి ?

ప్రచురింపబడిన ప్రతి గ్రంథమూ, ప్రతి మనిషికీ అవసరం లేదు. సద్గ్రంథం మానవునకు మిత్రరత్నము; ఎనలేని ఓర్పును

గనబరచును; లేని ఉల్లాసము నొనగూర్చును; సుఖదుఃఖముల యందును కలిమిలేములందును గూడ - సర్వకాల సర్వావస్థల యందును, ఏకరీతిగా సమానమైన ప్రేమను వ్యక్తీకరించుచుండును. మిత్రునికి ఒకప్పుడు కోపము రావచ్చును. ఆగ్రహము రావచ్చును. కాని గ్రంథరూపమిత్రునికి కోపమెన్నడును రాదు. ఆహ్వానము నెన్నడును నిరాకరింపడు. విరోధికానేరడు.

జ్ఞానము వ్యాపించుటకు ముఖ్యాధారము గత లోకానుభవము- గత లోకానుభవము వర్తమాన కాలానుభవమునకును, వర్తమాన కాలానుభవము భావికాల జ్ఞానసంపదకును సాధనములు. ఇట్టి జ్ఞాన సంపద యంతయు గ్రంథములయందు ఇమిడియున్నది.

జ్ఞానతృష్ణను పెంపొందింపజేయునవి సద్గ్రంథములు. అవి చదివినకొలది విజ్ఞత పెరిగి ఆలోచనాశక్తి తీవ్రతరం అవుతుంది. అట్టి సద్గ్రంథములను పఠించినపుడే మానవలోకమునకు కళ్యాణసిద్ధి కలుగును.

## నీ సందేహము

ఒక "నోటు" పుస్తకాన్ని దగ్గరపెట్టుకో; పూర్తిగా అర్థం కాని ఏ భాగాన్నిగాని, లేక నీ మనస్సునందు ఆవిర్భవించిన ఏ ప్రశ్ననుగాని, దానిలో వ్రాసికో. నీకంటె ఎక్కువ జ్ఞానం కలిగిన ఇంకొక జిజ్ఞాసుని కలుసుకొన్నప్పుడు నీ సందేహాలు ఆయన యెదుటబెట్టి - ఆయనతో చర్చించు. కాలమునుగాని, సావకాశమునుగాని వృథాగా పోనీయరాదు. "నోటు" పుస్తకాన్ని పెట్టుకోనియెడల, నీ సందేహాలు సమయానికి జ్ఞాపకానికి రావు.

## పుస్తకాలను ఎట్లా చదవాలి

శరీరపోషణకు ఆహార పానీయాలు ఎట్లు పోషకములో, అట్లే మెదడు పెంపొంది సమస్థితిలో నుండవలయు నన్నచో, దానికిగూడ ఆహారము కావలయునన్న సంగతిని గుర్తించినాము.

శరీరధారణకు అవసరమైన నిత్యనైమిత్తిక క్రియలు ఏవిధంగా మన నిత్యజీవిత విధానాలలో భాగమైపోతాయో – అట్లే గ్రంథపఠనముగూడ నిత్యజీవిత విధానమునందొక అంగమై తిష్ఠవేసికొనవలయును.

అంటే నియమితమైన ఒక ప్రణాళిక ప్రకారము నిత్యవిధులను జరుపుకొంటాముగదా! అట్లే "చదువుల" కు గూడ ప్రత్యేకమైన కాలమును నిర్ణయించుకోవాలి. అనారోగ్యంగా ఉన్నా – అత్యంతావసరమైనట్టి పని కలిగినప్పుడూ తప్ప– ప్రతిదినము ఆ ప్రత్యేక కాలములో – ఒక గంటకాలం కష్టపడి చదవాలి; పరధ్యానంగా ఉండకూడదు. అశ్రద్ధను దరికి రానీయకు; నీ చదువుమీద పూర్తిగా మనస్సును నిలుపు; నెమ్మదిగా– అనగా– తాపీగా చదువు; కాని చదివినంతవరకు, చదివినదానిని హృద్గతము చేసికో, ఎక్కువ చదవలేదని చింతవలదు.

ఏబది పుటలు గబగబ– చదివేకంటె, ఒక్కపుటను చక్కగా అర్థంచేసికొని చదువుటవలన ఎక్కువ విజ్ఞానం లభించగలదు; మన శక్తి విశేషంగా వికసిస్తుంది– పుస్తకం వ్రాసిన గ్రంథకర్తయొక్క ఆలోచనా స్రవంతియొక్క అడుగు జాడలను అనుసరించి వెంటనంటి యుండు; ఆ యాలోచనా స్రవంతిలో అడుగడుగునకు అర్థంచేసికొంటేగాని, ముందుకుబోకు; జాగరూకతతో చదవడానికి నీవు అలవాటుపడి యుండాలి.

ముప్పావుగంట కాలము చదివిన పిమ్మట పుస్తకాన్ని మూసివేసి, చదివిన భాగములయొక్క పాళ్ళను గుర్తించుకొని – చదివిన విషయాన్ని క్లుప్తముగా, నీ స్వంత మాటలతో వ్రాసికో; అట్లు వ్రాసినదానిని అసలు పుస్తకంలో ఉన్న విషయంలో సరిపోల్చుకొని తారతమ్యాన్ని గ్రహించు– గ్రంథంలోని భాగములు గూఢంగా ఉండి తెలిసికొనడానికి కష్టంగా ఉంటే– నిదానంగా చదువు. గూఢముగానున్న భాగముమీద మనస్సును నిలిపి, దానిని విశదీకరించు

దానికిగాను, మనస్సునకు అవకాశము ఇమ్ము. గ్రంథములోని భాగములు స్పష్టంగా అర్థం అవుతూన్నప్పుడుగూడ- గ్రహింప కష్టముగా నున్నయెడల-ఒక భాగమును తీసికొని దానిని గురించి బాగుగా ఆలోచించు,అందులోని మాటలవల్ల స్ఫురించు అర్థానేగాక- గ్రంథకర్త యొక్క-భావమునంతను గ్రహించుటకై ప్రయత్నించు. ఇట్లు అభ్యసించడానికి ప్రయత్నించుటవల్ల, నీలోఉన్న అంతర్వాణి మేలుకొని-నీకుకావలసిన విషయాలు వెంట వెంటనే స్ఫురిస్తూ ఉంటాయి, అట్టి స్థితిలో- నీ మనస్సు, గ్రంథంలోని అచ్చుపుటలు దాటి – దాని వెనుకఉన్న గ్రంథకర్తయొక్క- మనస్సునే తాకుతుంది.

## ఎందుకు చదవాలి?

ఈ పరమార్థసిద్ధిని పొందుటకై నీయొక్క- శ్రద్ధ సంపూర్ణముగా ఉండాలి; మనస్సు సంపూర్ణమైన శాంతతను పొందాలి, మనస్సు అత్యున్నతదశను అందుకోవాలి.

సాధారణముగా "మెదడు" అని మనము అనుకొనేదానికంటె అతీతమైనట్టియు, ధర్మాధర్మ విచక్షణాశక్తిని గలిగినట్టియు – చైతన్యము-ఒకటి వున్నది. పైన చెప్పిన దశయందు, అట్టి చైతన్యమును అందుకొనుటకై నీ మనస్సు ప్రారంభిస్తుంది.

నీ మనస్సునందు,అపరిశుద్ధ మనస్సు-పరిశుద్ధమనస్సు,అని రెండు భాగాలున్నాయి; అందులో అపరిశుద్ధ మనస్సు భౌతికస్థాయిని దాటి పోదు.మనస్సు చైతన్యాన్ని అందుకోవడానికి ప్రారంభించినది మొదలు అపరిశుద్ధ మనస్సునకు-శుద్ధమనస్సునకుగల అడ్డుగోడ పలుచనై కరిగి పోవుటకుప్రారంభమగును;అప్పుడు రెండుస్థాయిల యందున్న మనస్సు ఐక్యసిద్ధిని పొందుటకు ప్రారంభమగును.అట్టి స్థితియందు క్రమముగా, అపరిశుద్ధ మనస్సు నశించిపోయి శుద్ధమనస్సే మిగిలిపోతుంది.

గ్రంథకర్తయొక్క- భావాన్ని గ్రహింపగల అంతరదృష్టి, ఒక నిరూపణ – లేక – తర్కముయొక్క- విధానమును – వెంటనే స్ఫురణకు దెచ్చుకొను శక్తి - ఇవి యన్నియు, నీ జ్ఞానశక్తి పై విధా

నాన్ని అనుసరించుట వలన, త్వరితగతిని అభివృద్ధిజెందుచు బోవును; నెలమీద నెల - జరిగినకొలదిని, నీ మెదడు - మనస్సు - మిక్కిలి సమర్థతగల సాధనములుగా వికసించుచున్నటుల విస్పష్టమగు చుండును.

## నిత్యజీవితంలో చదువుయొక్క అభ్యాసం.

నిత్యం నీవు చేయు అధ్యయనముతోబాటు నీ నిత్యనైమిత్తిక జీవితములో చేయు వ్యాపారమునందు "శ్రద్ధ"- "ఏకాగ్రత" - లను అలవరచుకొనుటకు అలవాటుపడు.

నిత్యజీవితమునందు, ఖచ్చితముగా ఉండటం - పనులయందు ఏకాగ్రత-వినయవిధేయత లను అలవరచుకోవాలి; అవి నీ జీవితము నందు విస్పష్టముగా గోచరిస్తూ ఉండాలి.

నీవు ఒక ఉత్తరమును వ్రాయుచున్నప్పుడు - లెక్కలు కూడు చున్నప్పుడు - వ్యాపారమందు ఒక వివరాన్ని గూర్చి యోచిస్తూ న్నప్పుడు - ఆ విషయములను గూర్చి లక్ష్యముతో ఉండు. "లొల్లి" లేకుండ ఖచ్చితముగా ఉండు, వాని విషయంలో ఏకాగ్రత గలిగి యుండు,ఇట్టి అలవాటులను చేసికొనుటవలన, నీ భావియందు ఉత్తమ స్థితి ఏర్పడగలదు. ఇట్టి అలవాటులవలన అజాగ్రత్తత - పొరబాటు పడుట - సోమరితనము - ఎంతమాత్రము నీపనియందు నీదరికిరావు. ఒక విషయమును తీసికొన్నప్పుడు _ అది చిన్నదే కావచ్చును; కాని నీవుచేయు "పద్ధతి" ని బట్టి అది గొప్పదే యగును.

సాధారణంగా ప్రతిసంసా‌కీ "దినచర్య" అలసటను కలిగించే దిగా ఉండడం స్వాభావికం. కాని పై విధంగా జీవితాన్ని నడుపు వారికి - అతని మనస్సుయొక్క - కండరములు అభివృద్ధిని జెందుటకు చేయు కసరత్తువలెనే - నిత్యజీవిత విధాన మంతయు గోచరించి, అట్టి అనుభవాన్ని అభ్యసించడానికి, అనుభూతం జేసికొనడానికి ప్రారంభమగును.

ఇదంతా నిత్యజీవితంలో జీవిత గ్రంథాన్ని "చదవటమే" అవుతుంది.

## ఆధ్యాత్మిక జీవితం.

ఆధ్యాత్మిక జీవితాన్ని అలవరచుకొనగోరువారు ఎవ్వరైనా నిత్యజీవితమునుండి తప్పించుకొన నక్కరలేదు. నిత్యజీవితంలో సంభవమగు చిన్న చిన్న సన్నివేశముల నన్నింటిని, తాను అధివసించుచున్న మార్గాన్ని ఆరోహించడానికి సోపానములని గ్రహించి — అవి తనను బంధించకుండ చూచుకొనుచు ఉండాలి; ఆధ్యాత్మిక జీవితానికి అవసరమైన అర్హతలను అభివృద్ధి జేసికొనుటకు, ఈ నిత్యజీవిత సన్నివేశములు, తోడు - నీడ - లుగా ఉండవలయునేగాని, అందుకు బంధనములుగా నుండరాదు.

— శ్రీ జవ్వాది లక్ష్మయ్య నాయుడు షష్ఠిపూర్తి ఉత్సవ సంచికనుండి - 196±



# గ్రంథాలయ శాస్త్రము

## గ్రంథాలయ శాస్త్ర శిక్షణ తరగతులు

### ఆవశ్యకత

బరోడా మహారాజుగారు విదేశములకు పోయినప్పుడు గ్రంథాలయములను నడపుటకేగాక, వాటిని వినియోగించుకొనుటకును దానిని నిర్వహించుటకును గూడ క్రమశిక్షణ ఆవశ్యకమని గ్రహించినారు. అందుచేత అమెరికా దేశమునుండి "బోర్డను" అను మహాశయుని రప్పించి వారిచేత "గ్రంథ వర్గీకరణము"ను వారి రాజ్యమునకు ప్రత్యేకముగా ఏర్పరుపజేసిరి. మరియు వారి రాజ్యమునందలి గ్రంథాలయోద్యమమునకు క్రమశిక్షణా కార్యక్రమమును రూపొందింపజేసిరి. 1914 సం॥న ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమును స్థాపించుటకు పూర్వమే, గ్రంథాలయశాస్త్రమునందు వివిధ శాఖలకు సంబంధించిన గ్రంథములలో ముఖ్యమైనవాటి నన్నింటిని తెప్పించి- చదివి అందలి విజ్ఞానమును చవిచూచి - కొంతవరకు శ్రీ రామమోహన గ్రంథాలయమందు (విజయవాడ) ఆచరణలో బెట్టితిని.

బెజవాడలో 1926 సంవత్సరమున ఆంధ్రవిశ్వవిద్యాలయమును స్థాపించినపుడు దానికి శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారిని గ్రంథభాండాగారిగా ఏర్పరచినారు. వారును నేనును అప్పటికే చాలా కాలమునుండి స్నేహితులమై యుండుటచేత, నాయొద్దనున్న గ్రంథాలయ శాస్త్ర విషయికములైన గ్రంథములనన్నింటిని వారికి ఎరవు నిచ్చితిని; అప్పుడు నే నిచ్చిన గ్రంథములలో "డ్యూయీ" మహాశయుడు వ్రాసిన-జగద్విఖ్యాతమైన "దశాంక గ్రంథవర్గీకరణము" (Decimal Classification) అను గ్రంథము కూడా గలదు; ఆ గ్రంథములను ఉపయోగించి వారు ఎంతో ప్రయోజనమును పొందిరి.

శ్రీ అయ్యంకి రామకృష్ణారావుగారు "లండను" నగరమందున్న "బ్రిటిషు లైబ్రరీ అసోసియేషను" వారిచే నడుపబడుచున్న "గ్రంథాలయ శాస్త్రపరీక్ష"కు దరఖాస్తు జేసిరి, ఆ పరీక్షయును బెజవాడలోనే జరుగవలయును; అప్పుడు నేను "అఖిల భారత సార్వజనిక గ్రంథాలయ సంఘము"నకు(All India Public Library Associotion) కార్యదర్శిగా నుంటిని; అందుచేత శ్రీ రామకృష్ణారావు గారిచే సమాధానములు వ్రాయించవలసిన పరీక్షా ప్రశ్న పత్రములను "లండను"నుండి నేరుగా నాకే పంపినారు; నేను పరీక్షను నడపి, సమాధాన పత్రములను ఆ సంఘము వారికి అందజేసితిని.

## ప్రథమ పాఠశాల

గ్రంథాలయోద్యమ ప్రచారము విరివిగ సాగినవెనుక, గ్రంథాలయ శాస్త్ర విజ్ఞానమును సంపాదించిన యువకుల ఆవశ్యకత కలిగినది. శాస్త్రమునందు నిష్ణాతులైనవారు గ్రంథాలయ నిర్వాహణముచేసిన ఇంకను ఎక్కువగా సత్ఫలితములను పొందవచ్చును. ఈ యూహతోడనే గుజరాతు, మహారాష్ట్ర భాషలకు బరోడావారు చేసిన దానిని మాదిరిగ బెట్టుకొని, తెలుగు గ్రంథములకు వర్గీకరణ పద్ధతిని వ్రాసి, తదనుసారముగ యువకులకు శాస్త్రీయ మార్గములలో తగు శిక్షణ నిచ్చునిమిత్తమై గ్రంథాలయ శిక్షణ తరగతుల నేర్పరచితిని. ఆయా విషయములమీద తగు శిక్షణనిచ్చి గ్రంథాలయోద్యమ ప్రచారము ఎక్కువ పటిష్టముగా సాగుటకు తగు మార్గములను చేపట్టితిని.

1920 సం॥న గ్రంథాలయ ప్రచారకులను తయారుచేయుటకై ఒక మాసము దినములు ప్రప్రథమ పాఠశాలను బెజవాడ రామమోహన గ్రంథాలయమందు నడపితిమి. పల్లెటూళ్ళకు సంబంధించిన వివిధ సమస్యలకును గ్రంథాలయ పరిపాలనకు సంబంధించిన వివిధ విషయములను గూర్చియు, ఆయా విషయములనుగూర్చి పరిశ్రమ జేసిన సమర్థులచే అనుభవ పూర్వకములైన ఉపన్యాసము లియ్యబడినవి.

ఈ పాఠశాలకైన వ్యయము రమారమి రు 500 లను శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు భరించిరి. వారేగాక, శ్రీయుతులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, డాక్టరు భోగరాజు పట్టాభిశీతారామయ్య, ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య, వేమవరపు రామదాసుపంతులు, చిలుకూరి వీరభద్రరావు, గూడూరి రామచంద్రరావు, చెన్నుభొట్ల భానుమూర్తి, రాయప్రోలు సుబ్బారావు, అయ్యదేవర కాళేశ్వరరావు, సూరి వేంకట నరసింహశాస్త్రి మున్నగువారు విచ్చేసి, గ్రంథాలయ పాఠశాల విద్యార్థులకు తగు శిక్షణ నిచ్చిరి.

## పాఠ్యవిషయములు

ఆంధ్ర సారస్వతము, రాజ్యాంగశాస్త్రము, ప్రాచీన భారతీయ రాజ్యాంగ తంత్రము, ప్రజాసేవ, సహకార సంఘములు, గ్రంథాలయోద్యమము, హరిజనోద్ధరణ, ఆంధ్రుల చరిత్ర, వ్యక్తికిని రాజ్యాంగమునకుగల సంబంధము, ఆర్థిక శాస్త్రము, ఆరోగ్య శాస్త్రము,–మున్నగు విషయములనుగూర్చి ఆరితేరిన వారిచే ఉపన్యాసము లీయబడినవి. వాటిని విద్యార్థులు సంక్షిప్తముగ వ్రాసికొనుచుండిరి. ఈ పాఠశాలయందు శ్రీ మామిడిపూడి వేంకట రంగయ్యగారు ఇచ్చిన ఉపన్యాసములే కొంతకాలమునకు "ఆర్థిక శాస్త్రము" అను పుస్తకరూపమును దాల్చినవి.

## రెండవ పాఠశాల

1934 సంవత్సరము మే 31 తేదీనుండి జూను 23 తేదీవరకు గ్రంథాలయశాస్త్ర శిక్షణ తరగతుల రెండవ పాఠశాలను, విజయవాడలో దివ్యజ్ఞాన సమాజ మందిరమందు ఏర్పాటు జేసితిని.

ఈ పాఠశాల నిర్వహణమందు శ్రీ కోగారి రామారావు ("హిందూ హైస్కూలు" ప్రధానాధ్యాపకులు), శ్రీ పుణ్య

మూర్తుల, రాజశేఖరం బి. ఏ; బి ఇడి., • దాసు త్రివిక్రమరావు బార్-ఎట్-లా గార్లు నాకు సర్వవిధముల దోడ్పడిరి.

మొదటి పాఠశాలకును దీనికిని భేదము చాలగలదు. మొదటి దానియందు వివిధోద్యమముల ప్రచార ప్రాముఖ్యభాగ మెక్కువగాను — శాస్త్రభాగ ప్రాముఖ్యము తక్కువగాను ఉన్నది. రెండవ దానియందు ప్రచారభాగముకంటె "గ్రంథాలయశాస్త్ర" భాగము ప్రాముఖ్యత వహించినది. "గ్రంథాలయశాస్త్ర" మందలి విభాగము లన్నియు ఈ పాఠశాలయందు పూర్తిగ బోధింపబడినవి.

ఈ పాఠశాలను ప్రారంభించి నప్పుడును, తిరిగి ముగించినప్పుడు గూడ, ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు గ్రంథభాండాగారిక నుండిన యం. ఏ. థామస్‌గారు విచ్చేసి — రెండునాళ్లును ఉత్తేజకరములగు ఉద్బోధనల నిచ్చిరి.

శ్రీ థామస్‌గారు ఈ పాఠశాలయందిచ్చిన శిక్షణను పరిశీలించి, దానిని మెచ్చుకొనుచు పాఠశాల ముగింపు సమావేశపు టుపన్యాసమునందు ఇటుల జెప్పిరి:—

"ఉద్యోగులు" కాని వారిచే నడుపబడుచున్న గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పాఠశాలలలో — ఈ దేశమునందు— ఇదియే మొదటి దని నా భావన; గ్రంథాలయ నిర్మాణ ప్రగతియందు ఆంధ్ర దేశము చేసిన యభివృద్ధి మహత్తరమైనది."

"గ్రంథాలయోద్యమ విస్తరణ విషయమునను పరిపాలన విషయమునను చేయవలసినసేవ అనంతముగా కలదని — అఖిలభారత గ్రంథాలయోద్యమముతో నాకు పరిచయము కలిగినప్పటినుండియు తెలుసుకొన్నాను. శెలవు దినములలో ఏర్పాటుచేసిన ఈ పాఠశాల యందు ఇయ్యబడిన ఉపన్యాసములనుబట్టి స్థిరమైన సూత్రములపై

• వీరిద్దరును మద్రాసు యూనివర్సిటీ లైబ్రేరియను యస్. ఆర్. రంగానాథం గారి ఆధ్వర్యమున తరిబీతును పొంది "లైబ్రేరియను" పరీక్ష యందు ఉత్తీర్ణులైరి.

గ్రంథాలయోద్యమమును నడుపగలిగిన విజ్ఞానము - సామర్థ్యములు మీకు కలవని ఋజువగుచున్నది. ఈ సభయందు పాల్గొను అవకాశము కలుగజేసినందులకు నా స్నేహితులగు శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారికి ఎంతగానో ఋణపడియున్నాను."

శిక్షణానంతరము "గ్రంథాలయోద్యమము"ను గూర్చి ఒక ప్రశ్న పత్రమును, "గ్రంథవర్గీకరణము - గ్రంథముల పట్టికలు" మొదలగు విషయములనుగూర్చి వేరొక ప్రశ్నపత్రమును, విద్యార్థుల కిచ్చి పరీక్షలు జరుపబడినవి. శిక్షణకు వచ్చినవారిలో కొందరికి ఉచిత భోజన వసతులు ఏర్పాటు చేయబడినవి.

ఈ పాఠశాలలో శిక్షణపొందిన 30 మంది విద్యార్థులలో 28 మంది జయమును పొందిరి.

ఈ పాఠశాలలో విద్య నభ్యసించిన వారిలో * శ్రీయుతులు పాతూరి నాగభూషణం, కలిదిండి నరసింహరాజు, వావిలాల గోపాల కృష్ణయ్య, కాటూరి వెంకటేశ్వరరావు, సూరి నారాయణమూర్తి (ఆలిండియా రేడియో) ప్రభృతులు గలరు.

ఈ పరీక్షలయందు ఉత్తీర్ణులైనవారు నేటికిని అనేక గ్రామములలో పనిజేయుచు, గ్రంథాలయోద్యమాభివృద్ధికి పెక్కువిధముల తోడ్పడుచున్నారు.

ఈ పాఠశాలా విద్యార్థుల కియ్యబడిన పరీక్షాపత్రములు రెండింటిని ఈ దిగువ పొందుపరచుచున్నాము:-

---

* "గ్రంథాలయశాస్త్ర ప్రథమపాఠాలు" అను పుస్తకంయొక్క ప్రస్తావనలో శ్రీ పాతూరి నాగభూషణంగారిట్లు స్మరించిరి :- "నాకు ప్రత్యక్షగురువు లయిన శ్రీయుతులు కోరారి రామారావు, పుణ్యమూర్తుల రాజశేఖరం, అయ్యంకి వేంకటరమణయ్య, (ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ స్థాపకులు), డా. యం. ఒ. థామసు (మద్రాసు యూనివర్శిటీ లైబ్రరీ లైబ్రేరియన్లు) గార్లకు నా భక్తిపూర్వక ప్రణామములు." అని కృతజ్ఞత వెలిబుచ్చిరి.

## I. గ్రంథభాండాగారుల పరీక్షా పత్రము 23-5-1934

ఉదయం 7 1/2 గంటలు మొదలు 10 1/2 గంటలవరకు.

I - 1. ఆంధ్ర గ్రంథాలయోద్యమము యొక్క ఆదర్శమేమి? 2. దాని యొక్క ప్రత్యేకత యేమి? 3. ఆంధ్రదేశమందు మీకు తెలిసిన ఒక గ్రంథాలయము యొక్క విశేషాంశములను గూర్చి వ్రాయుడు. 4. మీకు సద్వినియోగము చేయు నిమిత్తమై పదివేల రూపాయల నిచ్చితి మనుకొనుడు. ఆ ద్రవ్యమును ఎట్లు వినియోగింతురో ఒక ప్రణాళికను తయారు చేయుడు.

II - (1) గ్రామమున గ్రంథాలయముయొక్క ఆవశ్యకమేమి? (2) గ్రంథాలయము ఉపకరింపదగిన జనులు ఎన్ని రకములుగా నుందురు? ఏయే రకములవారికి ఎట్లు ఉపకరింతువు? (3) ముఖ్యముగా చదువురానివారికి జ్ఞానము కలుగుజేయుటకు ఏయే మార్గముల నెట్లు అవలంబించెదవు? (4) బాలురకు గ్రంథాలయము ఎందుకు వుపకరింపవలెను? ఉపకరింపదగిన కొన్ని మార్గములను వివరింపుము.

III - (1) సంచార గ్రంథాలయములు ఎందుకు? అవి ఎన్ని రకములు? (2) బరోడాయందును ఇతర దేశములందును ఈ విషయమున జరుగుచున్న పనిని వివరింపుము.

IV - గ్రంథాలయములలో గ్రంథములు మొదలైనవి ఉండు స్థలములు మూయకుండ (Open access) సులభముగా అందుబాటులో యుండవలయు నన్న నేమి? సకారణముగ దీని వ్యక్తిత్వమును నిరూపించునది. ఇందుగల లోపములను సవరించు టెట్లు?

V - గ్రంథాలయ విస్తరణము - (Library Extention) అన నేమి? దీనికి అనుకూలములగు పద్ధతులను తెలియపరచునది.

VI - గ్రంథవర్గీకరణము (Cataloguing) చరిత్రాత్మకముగా దీనికిగల రూపములను వ్రాయుడు. కార్డులతో వర్గీకరణము చేయుపద్ధతి ఎట్లు అనుభవములోనికి వచ్చినది? కారణపూర్వకముగా విమర్శించునది.

VII- గ్రంథభాండాగారియొక్క యోగ్యతలను విధులను గురించి

లేక

గ్రంథాలయోద్యమమునందు ఈక్రింద పేర్కొనబడిన వ్యక్తులకుగల ప్రవేశ ప్రాముఖ్యములను సంగ్రహముగ తెలుపుము:- 1 కారల్ పియర్సన్ 2 మెల్విల్ డ్యూయీ 3 వాల్టరు హాప్మాను 4 ఆండ్రూ కార్నెజీ 5 సూరి వేంకట నరసింహశాస్త్రి.

## II. గ్రంథభాండాగారుల పరీక్షాపత్రము : 28-5-34

మధ్యాహ్నము 2 గంటలు మొదలు 4 గంటలవరకు.

1. సబ్జక్టు క్యాటలాగ్‌నందు మెయిన్ ఎంట్రీలో 'హెడ్డింగ్'ను నిర్ణయించి వ్రాయువిధమును విశదీకరింపుము.

లేక

"క్రాస్ రిఫరెన్సు", "క్రాస్‌రిఫరెన్సు ఇండెక్సు కార్డు" లందు అంశముల విశదీకరించి, ఆ రెండు "కార్డు"ల వలన కలుగు లాభముల వివరింపుము.

2. "కోలన్‌స్కీమ్" ననుసరించి, 'హిస్టరీ' (చరిత్ర) పుస్తకములగాని 'సారస్వత' గ్రంథముల కాని, విభజించు పద్ధతిని వివరింపుము

లేక

'క్లాసిక్ డివైస్'; 'బయోస్ నంబరు డివైస్', 'బుక్ నంబరు'; లనుగూర్చి సంగ్రహముగ వ్రాసి వాటి ఉపయోగముల తెలుపుము.

3. ఈ క్రింది పుస్తకములకు "కాల్ నంబరు" తయారుచేయుము;—

(క) సరోజనీదేవి: రవీంద్రనాథఠాగూరు బెంగాలీ పద్యముల

మీద విమర్శనము. 1901 లో ఆంగ్లమందు ప్రచురణ (రవీంద్రుని పుట్టినతేది 1862)

(చ) వేలూరి సత్యనారాయణ: బౌద్ధమహాయుగము (హిందూదేశ చరిత్ర) 1176 వ సం॥రము వరకు. 1925 లో తెలుగునందు ప్రచురణ. బౌద్ధ మతము నకు క్లాసు నంబరు Q 4.

(ట) చేమకూర వేంకటకవి (1624 ?). విజయవిలాసము(పద్యకావ్యము) 1916 లో తెలుగునందు ప్రచురణ. 2వ పుస్తకము.

(త) ఆల్ఫ్రెడ్ టెన్నిసన్ (1809) యొక్క పద్యకావ్యములు. సంపుటము 2. 1920 లో ఆంగ్లమందు ప్రచురణ.

(ప) కాళిదాసు (401): శకుంతల (నాటకము) సంస్కృతము నందు 1915 లో ప్రచురణ.

4. ఈ క్రింది పుస్తకములకు "కాల్ నంబరు" తయారుచేసి, "సబ్జక్టు క్యాటలాగ్" నందు కావలసిన "మెయిన్ ఎంట్రీ", "డిక్షనరీ క్యాటలాగ్" నందు కావలసిన రెండవరకపు "ఇండెక్సు కార్డులు" తయారు చేయుము:—

(క) విలియం షేక్స్పియర్ (1564) హేమ్లెట్ 'వెరిటీ' చే సంపాదితము. ఆంగ్లమందు 19 2 వ సం॥రములో ప్రచురణ. 19 వ పుస్తకము

(చ) అయ్యదేవర కాళేశ్వరరావు: అమెరికా సంయుక్త రాష్ట్రములు (1920 వరకు చరిత్ర,) విజ్ఞానచంద్రికా గ్రంథమాల – 33, సంపాదకుడు. కె వి, లక్ష్మణరావు, ఆంధ్రమందు 19 4 వ సం॥లో ప్రచురణ.

(ట) మద్దూరి శ్రీరామమూర్తి: శ్రీనాథుని జీవితము, 1926లో తెలుగునందు ప్రచురణ, ఇందు పోతన జీవితమునుకూడ 25– 8 పేజీలలో కలదు. దీనికి "క్రాస్ రిఫరెన్సు" కార్డు తయారుచేయుము.

(త) కందుకూరి వీరేశలింగం రాజశేఖర చరిత్ర, 1907 లో తెలుగున ప్రచురణ.

(థ) క. నరసింహారాజు : తెలుగు నవలల వివరణపట్టిక - 1930 వరకు. ఇందు 1930 వ సంవత్సరమువరకు తెలుగు నవలాచరిత్ర కలదు. దీనికి "క్రాస్‌రిఫరెన్సు కార్డు" తయారుచేయుము. రిఫరెన్సు పేజీలు 2–10.

## తృతీయ పాఠశాల

విజయవాడ పట్టణమున శ్రీ భ్రమరాంబామల్లేశ్వర ఆంధ్రగ్రంథాలయములో మూడవ "గ్రంథాలయ శాస్త్రశిక్షణ" పాఠశాలను, ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసంఘ పక్షమున 26-11-1944 మొదలు 10-12-1944 వరకు నిర్వహించితిమి. ఈ పాఠశాలకు వచ్చిన విద్యార్థులందరికిని "శ్రీ కన్యకాపరమేశ్వరీ అన్నసత్రం కమిటీ" వారు ఉచిత భోజన మజ్జనాదుల నొసంగి అమూల్యమైన సహాకారము నొసంగిరి.

### పాఠ్య ప్రణాళిక

1. గ్రంథాలయోద్యమము యొక్క విశిష్టత 2. గ్రంథాలయ నిర్మాణము 3. గ్రంథాలయ నిర్వహణము 4. గ్రంథవరణము 5. గ్రంథాలయ సమస్యలు 6. విదేశ గ్రంథాలయోద్యమములు 7. వయోజన విద్య 8. సంస్కృతాంధ్ర సాహిత్యచరిత్రలు 9. ఆంధ్ర దేశ చరిత్ర 10. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర 11. ఆంధ్ర రాష్ట్రోద్యమ చరిత్ర 12. ప్రసిద్ధ గ్రంథాలయముల చరిత్రలు 13 ఆధునిక గ్రంథాలయసేవ 14. గ్రంథ వర్గీకరణ 15. అచూకీసేవ 16. గ్రంథముల జాబితా.

### అధ్యాపక వర్గము

1. డా. పి. శ్రీనివాసాచారి, యం. ఏ., పి. హెచ్. డి.
ప్రిన్సిపాలు, యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కాలేజీ, విజయవాడ - ప్రధాన అధ్యాపకులు.

2. శ్రీ యస్. వి. సదానందమూర్తి,
లైబ్రేరియన్, ఆంధ్ర విశ్వవిద్యాలయము
3. శ్రీ పి. కొండారెడ్డి,
అసిస్టెంటు లైబ్రేరియను, ఆంధ్రవిశ్వవిద్యాలయము
4. శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు,
అధ్యక్షులు, ఆంధ్ర దేశ గ్రంథాలయసంఘము.
5. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య,
అధ్యక్షులు, ఆంధ్ర దేశ గ్రంథాలయ సేవక మహాసంఘము.
6. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి,
7. శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మ, ఎం. ఏ.,
లెక్చరర్, హిందూకాలేజీ, గుంటూరు.
8. టేకుమళ్ళ రామచంద్రరావు, కార్యదర్శి,
ఆంధ్ర దేశ గ్రంథాలయ సేవక మహాసంఘం, మచిలీపట్నం.

శుభా కాంక్షలు

ఈ పాఠశాల కార్యక్రమము విజయవంతము కావలెనని యావద్భారతదేశమునుండి శుభాకాంక్షలను బంపినవారిలో ఈ దిగువ ప్రముఖులు గలరు:-

1. డాక్టరు జి. శ్రీనివాసమూర్తి, డైరెక్టరు, అడయారు గ్రంథాలయం
2. విరల్ మధు కొరల్కర్, "లైబ్రేరియన్, పరశురాంభువ కాలేజీ" పూనా.
3. సతీస్ చంద్ర గుహతాకూర్, "ప్రాచ్యవర్గీకరణ పద్ధతి" గ్రంథకర్త, వారణాసి.
4. ప్రొఫెసర్ యన్. జి. రంగా, నిడుబ్రోలు.
5. యం సి. కృష్ణకురూప్, కార్యదర్శి కేరళ గ్రంథాలయ సంఘం, చల్లాపురం, కాలికట్ పోస్టు.

6. టి. ఏ. అనంతఅయ్యర్, కార్యదర్శి సౌత్-ఇండియన్ నేషనల్ అండ్ రానడి గ్రంథాలయం, మైలాపూరు-మద్రాసు

7. బళ్లారి రాఘవాచారి, వకీలు, బళ్లారి.

## ఎన్నో పాఠశాలలు

విశాఖపట్నముజిల్లా అనకాపల్లిలో శ్రీ శారదా గ్రంథాలయము యొక్క ఆధ్వర్యమున నొక గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పాఠశాలను నడపితిమి. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారును, నేనును, ఆధ్వర్యమును వహించితిమి. ఇప్పుడు విశాఖపట్టణ జిల్లా గ్రంథాలయ సంఘమునకు అనేక సంవత్సరములనుండి కార్యదర్శిగా నుండి మహోజ్వలమైన సేవ జేయుచున్నట్టి శ్రీ జయంతి రామలక్ష్మణ మూర్తి ఈ పాఠశాలలో శిక్షణపొంది, గ్రంథాలయ సేవయందు కాకలు తీరినవారే యని మనవిచేయు చున్నాను.

పశ్చిమ గోదావరిజిల్లా తాడేపల్లిగూడెం తాలూకాలో "చిన నిండ్రకొలను" గ్రామమున గ్రంథాలయ శిక్షణ పాఠశాలను శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మగారు 15 దినములు ఏర్పాటుచేయగా నేనును శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారును ఇరువదిమందికి శిక్షణ నొసంగితిమి.

కృష్ణాజిల్లా గ్రంథాలయ సంఘ పక్షమున మచిలీపట్నమున శ్రీ ఉటుకూరి రామచంద్రరావుగారు గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పాఠశాల నేర్పాటు చేయగా, నేనును మారేపల్లి రామచంద్రశాస్త్రి గారును 25 మందికి 15 దినములు శిక్షణ నొసంగితిమి, ఉత్తీర్ణులైన వారికి "ముద్రింపబడిన యోగ్యతాపత్రములు" ఇయ్యబడినవి.

ఈ రీతిగా గ్రంథాలయోద్యమ ప్రగతికిగాను, ఒకవైపున ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘ పక్షమునను, వేరొక వైపున ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసంఘ పక్షమునను అనేక పాఠశాలలను నడపితిమి.

అవకాశము కలిగినపుడెల్ల- గ్రంథాలయ కార్యకర్తలు లభ్యమైన చోట్లనెల్ల గ్రంథాలయశాస్త్ర శిక్షణ పాఠశాలలను నిర్వహించి, శిక్షణనిచ్చి - ముఖ్యముగా గ్రామములందు గ్రంథాలయోద్యమ వ్యాప్తికి నిరంతరాయముగ దోహదమొనర్చితిమి.

---

# ఆంధ్రభాషా గ్రంథముల వర్గీకరణము

## విదేశములు

ఇంగ్లండు అమెరికా దేశములందు-విశేషముగా సమస్తపుస్తకాలయములందు - ముఖ్యముగా రెండు విధములైన విభాగపద్ధతులు వాడుకయందున్నవి. అవియే సర్వత్ర అంగీకరింపబడినవి. వాని పేర్లు డాక్టరు డ్యూయీ అను నాతని "డెసిమల్" లేక "దశాంకపద్ధతి" "కట్టర్" అను నాతని "Expansive" లేక "విస్తరణ శీల పద్ధతి" అనునవి. డ్యూయీ తన పద్ధతియందు ముఖ్యముగ పది ఉప విభాగములను గ్రహించి, అందు ప్రతిదానిని తిరిగి పది ఉప విభాగములుగ జేసియుండెను. కట్టరు అనునతడు (ఏ) మొదలుకొని (జడ్) వరకు యిరువదియారు విభాగములుగ జేసి ప్రతి విభాగమును ఎఎ,ఏబి,ఎసి, (Aa Ab Ac) ఈ విధముగా ప్రతి అక్షరమునకు తిరిగి 26 అంతర్విభాగములను జేసెను. ముఖ్యమైన ఈ రెండు విభాగపద్ధతులేగాక, ఇంక మరి కొన్నిపద్ధతులు బ్రౌన్ పద్ధతి, మేరిల్ పద్ధతి, మొదలగునవి ఇంగ్లండు అమెరికాలయందును, ఇతర దేశములందును వాడుకలో నున్నవి. కాని ఇవి యన్నియు పైన వివరించిన రెండు పద్ధతులంత ప్రసిద్ధమైనవి గావు.

బరోడా కేంద్ర గ్రంథాలయమందు ఆంగ్లేయ గ్రంథముల కొరకు "బోర్డను" అను అమెరికా దేశ గ్రంథభాండాగారి ఒక నవీన పద్ధతిని కల్పించెను. ఈ పద్ధతి పై చెప్పిన రెండు ప్రసిద్ధపద్ధతులను ఆధారము చేసికొని కల్పింపబడినది. దీనియందు ముఖ్యముగా

"కట్టర్" మహాశయుని పద్ధతి ననుసరించి అక్షరక్రమముగా విభాగములు చేయబడినవి. ఈ అక్షర విభాగములన్నియు తిరిగి "డ్యూయీ" పద్ధతి ననుసరించి ఉపవిభాగములుగా చేయబడినవి. "గ్రంథకర్తల యొక్క అనుక్రమణిక" ఆంగ్లేయ గ్రంథకర్తల పేర్ల ననుసరించి జోర్డనుగారు స్వయముగా తయారు చేసిరి.

## బరోడా: మహారాష్ట్ర - గుజరాతీ - పుస్తకములు

బరోడా కేంద్రగ్రంథాలయమునందు "మహారాష్ట్ర" పుస్తకములయొక్క వర్గీకరణ పద్ధతి, జోర్డను మహాశయుని పద్ధతి ననుసరించి అవసరమగు మార్పులతో చేయబడినది. ఇటువంటి విభాగమునే సి. డి. దలాల్ ఎం. ఏ. గారు బరోడా కేంద్ర గ్రంథాలయమందున్న "గుజరాతీ" పుస్తకములకొరకు కూడ తయారు చేసిరి. ఇదియే బరోడా రాజ్యమందలి చాల గ్రంథాలయములయందు వాడుకలో నున్నది. "దలాల్"గారి గుజరాతీ విభాగపద్ధతియందును, మహారాష్ట్ర విభాగ పద్ధతియందును కొన్ని స్థలములందు మార్పులున్నవి. కాని ఇతర విషయములలో రెండును విశేషించి సమానముగానే యున్నవి. బరోడా యందలి కేంద్రగ్రంథాలయము హిందూస్థానమునందు మిక్కిలి అభివృద్ధిలో నున్నట్టిది యగుటచే, ఇచ్చటి సర్వవిధములైన ఏర్పాటులను గూర్చి హిందూస్థానమందలి అనేక భాగములవారు తరుచుగ నడుగుచుండుటచే- దీనినిగూర్చిన సర్వవిషయములు క్రమముగ నచ్చొత్తించి ప్రకటించిరి. ఆ దృష్టితోనే మరాఠీపుస్తకముల వర్గీకరణ పద్ధతియు ముద్రింపబడినది. ఈ పద్ధతి శాస్త్రసమ్మతమగుటచే, మహారాష్ట్ర దేశమందలి ఇతర గ్రంథాలయములకు మిక్కిలి యుపయోగముగా నుండుననియు, అంతటను శీఘ్రముగా వాడుకలోనికి వచ్చుననియు ఆశతో దానినికూడ ప్రచురించిరి.

## ఆంధ్ర గ్రంథములు

బరోడా కేంద్ర గ్రంథాలయమందు వాడుకలోనున్న ఈ పద్ధతుల ననుసరించి, ఆంధ్రగ్రంథములకు అనువుగ నుండునటుల గ్రంథ

వర్గీకరణ పద్ధతిని సమన్వయపరచి, బెజవాడలో నున్న రామమోహన ధర్మగ్రంథాలయమందు- పది సంవత్సరములకు పూర్వమే ఈ పద్ధతిని అమలులో పెట్టినారను. ఈ పద్ధతి మిక్కిలి ఉపయోగకరముగా నున్నదని అనుభవముచుబట్టి చెప్పగలము. కావున ఆంధ్రదేశమందలి గ్రంథాలయములవా రందరును అమలులో పెట్టుకొనవచ్చును.

ఈ పద్ధతి స్థూలముగ నీ దిగువ పొందుపరచ బడినది.

# వర్గీకరణ విధానము

## మొదటి పద్ధతి

అ-సర్వసాధారణ గ్రంథములు (General Books)
క-తత్వజ్ఞానము లేక ధర్మము
చ-విజ్ఞాన శాస్త్రము
ట్ర-సమాజ శాస్త్రము
త్ర-కళలు
ప-వాఙ్మయము
శ-ఇతిహాసము (History)
క్ష-భూగోళము, స్థలవర్ణనము, ప్రవాసము (Travel) మొదలైనవి.
జ్ఞ-జీవిత చరిత్రలు (Biography)



## రెండవ పద్ధతి

2,000 గ్రంథముల కంటె తక్కువగల గ్రంథాలయములకు అనువుగ నుండునది.

అ-సర్వసాధారణ గ్రంథములు.
ఎ - బాలురకు పనికివచ్చునవి
ఐ - స్త్రీలకు పనికివచ్చునవి
ఔ - ఇతరులకు పనికివచ్చునవి
-తత్వజ్ఞానము - ధర్మము.
ఖ - మానసశాస్త్రము - గుప్తవిద్య
గ - నీతి.
ఘ - మతము (హిందూమతముగాక ఇతరమతములు)
ఙ - హిందూమతము
చ-శాస్త్రము.
ఛ - ఆదిభౌతిక శాస్త్రము (Physical & Chemical Sciences)
జ - జీవశాస్త్రము (Biology)
ఝ - మానవజాతి శాస్త్రము (Anthrophology)
ఞ - వైద్యశాస్త్రము
ట-సమాజశాస్త్రము.
ఠ - రాజనీతి

ట–డ – అర్థశాస్త్రము.
ఢ – వివిధరాజకీయ వ్యవస్థలను గూర్చిన గ్రంథములు.
ణ – శిక్షణ (Education)

త–కళలు.
థ – యుద్ధము సముద్రయానము
ద – లలితకళలు
ధ – క్రీడా వినోదములు
న – సంగీతము.

ప–వాఙ్మయము–భాషాశాస్త్రము
ఫ – అలంకారశాస్త్రము
బ – కావ్యములు (ప్రాచీనము)
భ – కావ్యములు (ఆధునికము)
మ–నాటకములు (భరతము ఇత్యాది)
య–నవలలు.
ర–గద్య (Essays and commentaries)
ల–భాషాంతరీకరణములు
వ–వినోదాత్మకములు

శ–ఇతిహాసము – (History)
ష–పౌరస్త్య ఇతిహాసము – (Of Oriental Countries)
స–భారతీయ ఇతిహాసము
హ–పాశ్చాత్య ఇతిహాసము
ళ–అమెరికా మొదలైన దేశచరిత్రలు

క్ష–భూగోళము – స్థలవర్ణనము – ప్రవాసము

జ్ఞ–జీవచరిత్రలు (Biography)

---

## మూడవ పద్ధతి

2,000 గ్రంథములకంటె ఎక్కువ గ్రంథాలయములకు అనువుగ నుండునది.

అ (వర్గము) – సర్వసాధారణ గ్రంథములు
అ–సర్వసాధారణ గ్రంథములు
ఆ–జ్ఞానకోశములు, నిఘంటువులు
ఇ–మాసపత్రికలు
ఈ–వార్తా పత్రికలు
ఉ–సంఘముల వృత్తాంతములు
ఊ–ప్రభుత్వము వారిచే ప్రకటింపబడినవి
ఎ– బాల సాహిత్యము
ఐ–స్త్రీల గ్రంథములు
ఒ–గ్రంథాలయ శాస్త్రము
ఔ–సర్వసాధారణులు, చదువతగినవి

క (వర్గము) – తత్వజ్ఞానము–ధర్మము
క–తత్వజ్ఞానము
కా–సర్వ సాధారణములు
కి–ఆధ్యాత్మికవిద్య (Metaphysics)
కీ–తర్కము
కు–దర్శనములు (Systems of Philosophy)
కూ–ఇతర తత్వజ్ఞానమతములు
కె–తత్వవేత్తల చరిత్రలు

కౌ-వివిధములు

ఖ-మానవశాస్త్రము

ఖా-సర్వసాధారణములు

ఖి-మానవ శరీర సంబంధములు (స్వప్నము-చమత్కారము-వశీకరణము-మోహినీశక్తి-మృతసంభాషణ యోగసమాధి (Hypnotism, Spiritualism) వగైరా

ఖీ-ఇంద్రజాలము, జారణ మారణములు

గ-నీతి

గా-సర్వ సాధారణము

గి-నీతివాదము(Ethical Doctrine)

గీ-రాజనీతి (State Ethics)

గు-కుటుంబనీతి

గూ-వ్యవహారనీతి

గె-జాతినీతి(Sexual Ethics)

గై-సమాజనీతి

గొ-విశేషమైన నీతులు (బాల్య వివాహము, బహుపత్నీత్వము. వివిధకుల నిషేధము, ద్యూతనిషేధము, మద్యపానము, విమ్నజాత్యుద్ధరణము. గౌరాగౌర భేదము [Colour question] మొదలైనవి)

ఘ - వివిధమతములు (హిందూ మతముగాక)

ఘా-సర్వ సాధారణములు

ఘు-జైన మతము

ఘూ-దివ్యజ్ఞానసమాజము (Theosophy)

ఘె-పార్సీ మతము

ఘే-మహమ్మదీయ మతము

ఘొ-క్రైస్తవమతము

ఘౌ-అన్యమతములు

జ - హిందూమతము

జా-సర్వసాధారణములు

జి-వైదికమతము (ఉపనిషన్మతము)

జీ-స్మృతి

జు-శైవమతము

జూ-వైష్ణవమతము

జై-భాగవతమతము

జో-వివిధ సమాజములు (ఆర్యసమాజము, బ్రహ్మసమాజము, నానకు మతము, శిక్కు మతము (Etc)

జౌ-వివిధములు

చ (వర్గము)-విజ్ఞానశాస్త్రములు

చ-గణితము — జ్యోతిషము

చా-సర్వసాధారణములు

చి-అంకగణితము

చీ బీజగణితము

చు-రేఖాగణితము

చూ-త్రికోణగణితము

చై-పృథ్వి-

చొ-ఆకాశము

చౌ-జ్యోతిషము

ఛ-ఆదిభౌతిక శాస్త్రము (Physical Sciences)

ఛా-సర్వసాధారణములు

ఛి-పదార్థవిజ్ఞానశాస్త్రము(Physics)

చి-రసాయనశాస్త్రము (Chemistry)
చీ-ఖనిజశాస్త్రము (Mineralogy)
చొ-భూగర్భశాస్త్రము (Geology)
చౌ-వివిధములు

జ-జీవశాస్త్రము (Biology)
జా-సర్వసాధారణములు
జి-వనస్పతి (Botany)
జీ-వృక్షశాస్త్రము
జు-ప్రాణిశాస్త్రము (Zoology)
జూ-జీవజంతుశాస్త్రము [Enotomology]

ఝ-మానవజాతిశాస్త్రము (Anthropology and Ethnology)

ఞ-వైద్యశాస్త్రము
ఞా-సర్వసాధారణములు
ఞి-కాయవిచ్ఛేదము-కాయధర్మములు Anatomy & Physiol gy
ఞీ-చికిత్స (Thrapeutic )
ఞు-రోగనిదానము (Pathology)
ఞూ-శస్త్రవైద్య (Surgery )
ఞె ఆరోగ్యశాస్త్రము [Hygine and Sanitation]
ఞే-స్త్రీల బాలరోగములు
ఞొ-పశు రోగములు
ఞో-విశేష ఉపచారపద్ధతులు

ట (వర్గము)-సమాజశాస్త్రము
టా-సామాజిక సంస్థ Manners & Customs
టి-సర్వసాధారణములు

టీ-సమాజ సంస్కరణములు (వ్యక్తి విషయము)
టు- మద్యపాన నిషేధము, మత స్వాతంత్ర్యము, అనేక స్త్రీ వివాహము, విధవావివాహము, ప్రౌఢ వివాహము, మొదలైనవి
టూ-సమాజ సంస్కరణములు (జాతివిషయములు)జాతిభేదనిషేధము, మతసంబంధ విషయము మొదలైనవి)

టె-సమాజసంస్కరణములు (సమాజ విషయములు) నిమ్నజాత్యుద్ధరణ పరదేశ గమనము. పతితపరావర్తనము, దేవస్థాన సుధారణము. స్త్రీ శిక్షణ మండలులు

టే- పరోపకారసంస్థ (అనాథ బాల బాలికా ఆశ్రమములు, సేవా సదనములు, పశురక్షణశాలలు, రిఫార్మేటరీలు, జైలు సంస్కరణ, అంబులెన్సు, ప్రాథమిక చికిత్స, ఆస్పత్రులు ఆరోగ్యగృహములు, వగైరాలు

టై-నడవడికలు, దుస్తులు నగలు మొదలైనవాని తరహాలు (Fashions of cloths and ornaments) కర్మకాండలు [Birth and death ceremonies] స్త్రీల సంస్థలు ఘోషా, జాతి బహిష్కరణ, అనేకపత్నీత్వము స్వల్ప,

ఠ–రాజనీతి
రా–సర్వసాధారణములు
రి–అంతర్ రాష్ట్రీయ స్థానిక వ్యవహారములు (International and Home politics)
రి–పరరాష్ట్రీయ రాజనీతి
రు–ఐరోపారాజనీతి
రూ–బ్రిటీషురాజనీతి
రె–భారతవర్ష రాజనీతి
రై–అమెరికా రాజనీతి
రౌ–ఇమిగ్రేషను

డ–అర్థశాస్త్రము
డా–సర్వసాధారణములు
డి–ఉత్పన్నము – నిష్పత్తి
డీ – కార్మికులు, పెట్టుబడిదారులు (Labour and Capital విరోధ వ్యాపారాలు Trade unions etc.
డు–లాభముల పంపకము (Profit Sharing)
సామాన్య స్వామ్యవాదము (Socialism)
డూ–వ్యాపార , వర్తకము, బజారు ధరలు Trade Business,etc.
డె–ద్రవ్యము (Money, Finance, Banking, Interest, etc)
డే–పన్ను ( Taxation, )
డై–ఆస్తి, భూమి (అద్దెపన్ను) (Property, land, rent)
డౌ–వివిధములు

ఢ–వివిధ రాజకీయ వ్యవస్థలు (Government & Law.)
ఢా–సర్వసాధారణములు
ఢి–రాజకీయహక్కు, స్వాతంత్ర్యము, స్త్రీ స్వాతంత్ర్యము (Suffrage Movement]
ఢీ–రాజశాసన పద్ధతి
ఢు–ఆంగ్లేయ రాజ్యతంత్రము
ఢూ–భారతవర్ష రాజ్యతంత్రము
ఢె–ఇతరదేశ రాజ్యతంత్రములు
ఢే–చట్టములు, న్యాయశాస్త్రము (Law & Legislation)
ఢై వివిధములు

ణ–శిక్షణ (Education)
ణా–సర్వసాధారణములు
ణి–ప్రాథమికవిద్య ( Elementary Education)
ణీ–మాధ్యమికవిద్య ( Secondary Education)
ణు–ఉన్నత విద్య (Higher Education)
ణూ–పారిశ్రామికవిద్య (Technical Education)
ణె–స్త్రీ శిక్షణ
ణే–గృహశిక్షణ (Home Education )
ణో–ధార్మికవిద్య, నైతికవిద్య, విశిష్టవిద్య
ణై–విశేషశిక్షణపద్ధతులు (Special systems of Education)

త (వర్గము) – కళలు
త–ఉపయుక్తకళలు [Useful Arts]
తా–సాధారణములు

తి_ప్రత్యక్ష కళలు (Extractive) గనుల మొదలగువానిని త్రవ్వుట, కృషికర్మ, తోటపని, అడవులు, గనులు, సిమెంటు, ఇటుకలు వగైరా

తీ_రసాయనిక కళలు (Preparation of Chemicals) ధాతువులు, రంగులు, దీపములు, అద్దములు, [illegible]ండలు, షరబత్తులు

తు_హస్తనిర్మాణ కళలు (Manufacturing) పత్తి, పట్టు, ఊలు, తోలు, రబ్బరు, కాగితాలు, వగైరాలు.

తూ_నిర్మాణ కళలు (Constructive) ఇంజనీరింగు, గృహనిర్మాణము, పొగబండి నిర్మాణము, ఆనకట్టలు- రేవు స్థలములు (యంత్రీకరణములు.)

థ-యుద్ధ, సముద్రయాన కళలు (సంగ్రామ విషయ చరిత్ర, శస్త్రములు, కోటలు, కిల్లాలు, వ్యూహరచన, సేనావిభాగము.)

ద—లలిత కళలు

దా_సర్వసాధారణములు

ది_రమణీయ ఉద్యాన కర్మలు (Landscape, gardening)

దీ_గృహశిల్ప కర్మలు, వాస్తు, (Architecture)

దు_మూర్తి, శిల్పకళలు (Sculpture)

దూ_చిత్రలేఖనము (Drawing)

చెక్కడము (Engraving)

దె_రంగుతో వేయు చిత్రకర్మలు (Painting) గృహాలంకారము (Decorating)

దొ_ప్రకాశలేఖనము, ఛాయాచిత్రములు (Photography)

ధ-క్రీడావినోదములు

ధా : సర్వసాధారణములు

ధి: సార్వజనిక మనోరంజకములు (నాటకములు, గానములు, సినిమా, తోలుబొమ్మలాట వగైరా)

ధీ: నిలకడగా కూర్చుని ఆడుకొనేవి (బుద్ధిబలముచే ఆడేవి చదరంగ పాళీ వగైరా)

ధు_ తిరుగుచు ఆడుకొనేవి, క్రికెట్టు, ఫుట్ బాల్, కందుకక్రీడ, చెడుగుడు, ఉప్పలపట్టి.

ధూ: వేట, అశ్వకౌశల విద్యలు, పోలో మొదలైనవి.

న—సంగీతము

నా: సర్వసాధారణములు

ని: కీర్తనలు

ను: వాద్యములు

నె: నర్తనము

నొ : పాశ్చాత్య సంగీతము

నౌ_సంగీతోపకరణములు

ప వర్గము - సాహిత్యము- వాఙ్మయము

ప-భాషాశాస్త్రము

పా_సర్వసాధారణములు

పి—హస్తలిపి (Hand writing)
పీ-ఉత్పత్తి
పు శబ్దకోశము (Vocabulary)
పూ-వ్యాకరణము
పె—ఛందస్సు (Prosody)
పై—గ్రంథరచన (Composition)
పొ—సాదృశ్యభాషాజ్ఞానము
[Comparative knowledge]
పో—భాషాంతరీకరణము
ఫ—అలంకారశాస్త్రము
బ—కావ్యము (ప్రాచీనము) ఆధ్యాత్మికములు
బా—సర్వసాధారణములు
బి-అతి ప్రాచీనములు
బీ—మధ్యకాలమునాటివి
బె—ఆధునికములు
బొ—యాలపాటలు, యక్షగానములు వగైరా (Ballards and Bardic litarature)
భ—కావ్యములు (ఆధునికములు) రసికములు,

మ—నాటకములు
మా—పద్యనాటకములు
మీ-గద్యనాటకములు
ము—సంగీతనాటకములు
మె—భాషాంతరీకరణములు

య—నవలలు
యా-చమత్కార కథలు
యి—సామాజిక కథలు
యు-ఐతిహాసికములు
యె—పరిశోధకములు, దోష ఆవిష్కారకములు
యో: ఇతరములు

ర—గద్యవాఙ్మయము (నిబంధనలు, టీకలు, మొ)
రి—నిబంధాత్మకములు
రీ—వక్తృత్వము
రె—టీకాత్మకములు
రొ వ్యాసనంగ్రహములు

ల—భాషాంతరీకరణ వాఙ్మయము (సమూలములు, మూలము లేనివి)
లా-సాధారణములు
లి-సంస్కృతమునుండి
లు—దేశభాషలనుండి
లె పాశ్చాత్యభాషలనుండి
లొ—పౌరస్త్యభాషలనుండి (Oriental languages)

వ—వినోదాత్మక వాఙ్మయము

శ-శ్రీ (వర్గము, ఇతిహాసము
శ—సామాన్య ఇతిహాసము
శా-సర్వసాధారణములు
శి—ప్రాచీన వస్తుపరిశోధనము [Archeology]
శీ—ఇతిహాసిక స్థలములు
శు—ప్రాచీన ఇతిహాసము
శూ—కట్టుకథలు, పుక్కిటి పురాణములు (దంతకథలు) ఆఖ్యాయికలు
శె—వంశావళులు
శై—ఐతిహాసిక పరివర్తనము (సంస్థలు)
శొ—ఆధునిక ఇతిహాసము
శౌ—వివిధములు, వ్రాతకాగితములు, తాళపత్రములు

మ–పౌరస్త్య ఇతిహాసము (History of Oriental Countries)

షా–సాధారణములు

షి–చీనా

షీ–జపాను

షు: జ్యూ

షూ: ఇరాన్, బాబిలోనియా

షె: అఫ్రికా

షో: ఈజిప్టు

షౌ: ఇతర దేశములు

స–భారతీయ ఇతిహాసము

సా–సర్వసాధారణములు

సి : వైదికయుగము

సీ: బుద్ధయుగము(గ్రీకు,సింధియను)

సు : మొగలు యుగము

సూ : మహారాష్ట్రియుగము

సె : ఆంగ్లయుగము

శా : వివిధరాష్ట్రముల చరిత్రలు

హ-పాశ్చాత్య ఇతిహాసము

హా : సర్వసాధారణములు

హి : గ్రేటుబ్రిటను, అమెరికా, కెనడా, మెక్సికో

హీ : ఫ్రాంసు, హాలండు, స్విట్జర్లాండు

హు : జర్మనీ, ఆస్ట్రియా, హంగరీ

హూ , రోమను సామ్రాజ్యము ఇటలీ

హె : స్పెయిను, పోర్చుగల్ గ్రీసు

హై : నార్వే, డెన్మార్కు, స్వీడను, రష్యా, బాల్కనురాష్ట్రములు

హొ : ఉత్తర దక్షిణధృవములు

హౌ : వలసపోయినవారి చరిత్ర

శ–ఆంధ్రదేశచరిత్ర

శ : ఆంధ్రదేశ వర్ణన, మొత్తముమీద

శి : శాతవాహన యుగము

శు : పల్లవ, చాళుక్య యుగములు

శూ : కాకతీయ రెడ్ల యుగములు

శె : విద్యానగరసామ్రాజ్యయుగము

శో : మహమ్మదీయ యుగము

శౌ : పాశ్చాత్య యుగము

క్ష–భూగోళము, స్థల వర్ణనము, ప్రవాసము. (Travel)

క్షి : మార్గదర్శక పుస్తకములు (Guides) గెజటీర్లు, దేశపటములు (Maps)

క్షీ : ఐరోపా ఖండము

క్షు : ఆసియా ఖండము

క్షూ : ఆఫ్రికాఖండము

క్షె : భారతదేశము

క్షే: అమెరికా దేశము

క్షో : ఆంధ్ర దేశము

క్షౌ : ఇతర దేశములు

జ్ఞ–జీవచరిత్ర(Biography)

జ్ఞా : సర్వసాధారణములు

జ్ఞి : అవతార పురుషుల చరిత్రలు

జ్ఞీ : ప్రాచీన ఋషులు, సాధువులు, తత్వవేత్తలు, జ్ఞానులు

జ్ఞు : అమాత్యులు, ముసద్దీలు

జ్ఞూ : వీరుల కథలు

జ్ఞె : కవులు విద్వాంసులు

జ్ఞో : ఆంధ్రదేశస్థ స్త్రీ పురుషుల చరిత్రలు

జ్ఞౌ : స్త్రీల చరిత్రలు

"గ్రంథముల వర్గీకరణము నిశితము చేయవలసిన యావశ్యకత

1. మొత్తము గ్రంథాలయ శాస్త్రము నంతకును గ్రంథములను వర్గీకరణము చేయు శాస్త్రము చాల ముఖ్యమైనది. చదువరులు గ్రంథముల నుపయోగించు వైఖరియంతయు నిశితమైన ఈ పద్ధతిమీదనే ఆధారపడియున్నది.

2. మనదేశమునందున్న ప్రభుత్వ గ్రంథాలయము లందును, మిగిలిన పెద్ద గ్రంథాలయము లందును పాశ్చాత్య వర్గీకరణ పద్ధతులు అమలునందున్నవిగాని, అవి మనదేశ గ్రంథాలయము లందలి గ్రంథముల వర్గీకరణమునకు బొత్తిగా పనికిరాకుండెను.

3. బరోడా గ్రంథాలయములకు 1911 వ సం॥లో బోర్డనుగారును పిమ్మట దాని ననుసరించి గుజరాతి, మహారాష్ట్ర గ్రంథములకును గ్రంథవర్గీకరణ పద్ధతులు సమకూర్చబడెను.

4. వీని నన్నిటిని పరిశీలించి, భారతవర్షమునకు తగిన వర్గీకరణ పద్ధతిని రూపొందించుటయొక్క అవసరమును హిందూదేశమందున్న గ్రంథభాండాగారు లందరునుగుర్తించియున్నారు.

అయితే 192౮ వ సంవత్సరము డిసెంబరులో కలకత్తా పట్టణమున సమావేశమైన ఆరవ అఖిలభారత గ్రంథాలయ సభవారు అట్టి కార్యమును నిర్వహించుటకుగాను ఈ క్రింద వివరింపబడిన సభ్యులతో ఒక ఉపసంఘమును నేర్పరిచిరి:— 1. యస్. సి. గుహా. 2. పి. కె. ముఖర్జీ, 3. లాలా లభూరాం, 4. వై. వి. సి. అయ్యర్, 5. ఏ. సి. విద్యాభూషన్, 6. ఏ. ఆర్. రావు, 7. టి. ఆర్. రావు, 8. యస్. ఆర్. రంగనాథం, 9. యన్. యం. దత్తు, 10. పి. ఎల్. రెయినా, 11. మహమ్మదు షాఫి, 12. వై. అహమ్మదు, 13. డి. టి. రావు, 14. అ. వెంకటరంగయ్య—తరువాత ఈ సభ్యులు సమావేశమగుటకు నావకాశము లేకపోయెను.

5. కాని ఇట్లేర్పడిన ఉపసంఘ సభ్యులలో ఇద్దరు మాత్రము ఎవరికి వారు స్వతంత్రముగా రెండు విధములైన విభాగ పద్ధతులను రూపొందించినారు. ఆ యిద్దరిలో ఒకరు యస్. సి. గుహ గారు వ్రాసినది "ప్రాచీన వర్గీకరణ పద్ధతి" ; 1931 సం॥లో "సరస్వతీ భవన" వ్యాసంగములలో (సంపుటి 9) ప్రకటింప బడెను; మరు సంవత్సరమే ( 932) బెనారెస్ ప్రభుత్వ సంస్కృత కళాశాలకు అప్పుడు ప్రిన్సిపాలుగానున్న మహా మహోపాధ్యాయ ఆచార్య గోపీనాథ కవిరాజ ఎం. ఏ గారి ఉపోద్ఘాతముతో పుస్తక రూపమున కూడ ప్రకటింపబడినది. వీరు వ్రాసిన గ్రంథ విభాగపద్ధతి ఉత్తర హిందూదేశములో అలహాబాదులోనున్న ఆలిండియా కాంగ్రెసు ఆఫీసునందును, వారణాసి యందుండిన కాశీ విద్యాపీఠమునందును, బికనీరు సంస్థాన గ్రంథాలయమందును, కరాచీ కేంద్రగ్రంథాలయ మందును అమలులో పెట్టబడినది.

ఇక యస్. ఆర్. రంగనాథంగారు వ్రాసిన గ్రంథవిభాగపద్ధతి 1933 సం॥న మద్రాసు గ్రంథాలయ సంఘమువారిచే ప్రచురింప బడినది; ఈ పద్ధతిని వారచే పరిపాలింపబడుచున్న మద్రాసు విశ్వ విద్యాలయ గ్రంథాలయమందును, పిమ్మట మరికొన్ని గ్రంథాలయ ములందును ఆచరణలో పెట్టబడినది–

– (అలహాబాదు పబ్లికు లైబ్రరీలో గ్రంథభాండాగారి అగు యస్. యన్. బెనర్జీగారు వ్రాసిన "ఇండియాస్ కంట్రిబ్యూషన్ టు ది సైన్సు ఆఫ్ క్లాసిఫి కేషను" పుస్తకమునుండి)



# గ్రంథ విభజన పేటిక

## Card Cabinet Box

విశాఖపట్నమున 1918 సంవత్సరము జూను 22 వ తేదీన అయిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ జరిగిన సందర్భమున ఏర్పరుపబడిన గ్రంథాలయ ప్రదర్శనమునందు "గ్రంథవిభజన పేటిక" గూడ ప్రదర్శింపబడినది. ఆ సందర్భమున ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శిగారగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు వివరించిన సంగతులను† ఈ క్రింద ఉల్లేఖించబడినవి :—

### గ్రంథముల "పట్టిక"లు

"ఈ ప్రదర్శనమున గ్రంథవిభజన పేటిక ఉంచబడినది. ఇది ఒక గ్రంథాలయమునందున్న గ్రంథములయొక్క పట్టిక. ప్రతిగ్రంథమునకును పుస్తకముయొక్క పేరు - గ్రంథకర్తపేరు - విషయము - వీనిని విడి విడిగా "కార్డుల"యందు వ్రాసెదరు. ఈ పేటికయందు 3 అరలున్నవి. ఒక యరయందు "పుస్తకముల పేర్లు" అకారాదిగ వ్రాసిన "కార్డు" లుండును. రెండవ యరయందు "గ్రంథకర్తల పేర్ల"ను బట్టి అకారాదిగా "కార్డు" లుండును. మూడవ యరయందు "విషయవిభాగము"ను బట్టి అకారాదిగ గ్రంథముల కార్డులుండును.

### ప్రయోజనములు

ఇట్టి "గ్రంథముల పట్టిక"ల వలన అనేక లాభములుగలవు. ఒక చదువరి గ్రంథాలయమునకువచ్చి పుస్తకముల పేర్లనుబట్టి తనకు కావలసిన గ్రంథమును నిర్ణయించుకొన దలచినయెడల, మొదటి యర వానికి సహాయభూతమగును; గ్రంథకర్తల పేర్లనుబట్టి తనకు కావలసిన గ్రంథమును నిర్ణయించుకొన దలచినచో రెండవ యర సహాయ భూతమగును. విషయ విభాగమునుబట్టి తనకు కావలసిన గ్రంథమును ఏరుకొనదలచినయెడల మూడవ యర సహాయము చేయును.

---

† గ్రంథాలయ సర్వస్వము — సంపుటము 3, సంచిక 3, 1918.

## కార్డుపట్టికలు - వ్రాతపట్టికలు

ఇంతేగాక "గ్రంథముల వ్రాత పట్టిక"కును ఈ పేటిక యందలి "పట్టిక"కును వేరొక ముఖ్యమగు భేదముగలదు.

మన మామూలు "గ్రంథముల వ్రాత పట్టిక" యందు "ఆంధ్రుల చరిత్ర"యొక్క "ప్రథమ భాగము" - "చరిత్ర"లను శీర్షిక యందు ౧౦వ సంఖ్యను గలిగియుండు ననుకొనుము. పిమ్మట ౧ హిందూ దేశచరిత్ర- ౨ మహామ్మదీయుల చరిత్ర; ౩ మహారాష్ట్రుల చరిత్ర; ౪ సిక్కులచరిత్ర; ౫ చైనా దేశ చరిత్ర -లు మన గ్రంథాలయమునకు సేకరించితి మనుకొనుము. అప్పుడు ఆ గ్రంథములకు వరుసగ "సంఖ్యల"ను వేయుచు వచ్చెదము. పిమ్మట "ఆంధ్రుల చరిత్ర - రెండవభాగము"గాని లేక "ఆంధ్రకవుల చరిత్ర"గాని లేక "ఆంధ్రవీరుల చరిత్ర"గాని మన గ్రంథాలయమునకు సంపాదించితి మనుకొనుము. ఇదివరలో వచ్చిన గ్రంథములకు ౧౦ నుండి వరుసగ అయినా సంఖ్యలు వేయగా ఇప్పుడు వచ్చిన "ఆంధ్రుల చరిత్ర - రెండవ భాగము"నకుగాని "ఆంధ్రకవుల చరిత్ర"కుగాని లేక "ఆంధ్రవీరుల చరిత్ర"కుగాని ౧౬వ సంఖ్య వేయవలసి వచ్చును.

ఈ క్రొత్త పద్ధతి ప్రకార మట్లుగాదు. "ఆంధ్రులచరిత్ర మొదటి భాగము"నకు ఏ సంఖ్య వేయుదుమో, రెండవ భాగమునకు ఆ సంఖ్యయే వచ్చును; మూడవ భాగమునకుగూడ ఆ సంఖ్యయే వచ్చును. "ఆంధ్రకవుల చరిత్రకును," ఆంధ్రవీరుల చరిత్రకు"ను దాని ప్రక్కసంఖ్యలే వేయవచ్చును.

## క్రొత్తపద్ధతివలన ప్రయోజనము

ఈ ప్రకారమే "గ్రంథవిభజన పేటిక" యందలి "కార్డు"లు కూడా వచ్చును. అందుచేత ఈ క్రొత్తపద్ధతి ప్రకారము ఒక విషయముమీద ఉన్న గ్రంథము లన్నియు - అంతర్విభాగములతో గూడ ఒకచోటనే చూడగలము - ఒక కవివ్రాసిన గ్రంథములన్నియు ఒక చోటనే చూడగలము - ఒక పేరుగల గ్రంథము లన్నిటిని ఒకేచోట చూడగలము.

ఈ ప్రకారము గ్రంథవిభజన పేటికయం దుండును. వీరు వా యందు గ్రంథములు విషయ విభజనమునుబట్టి "అకారాది"గ నుండును. ప్రాతపద్ధతి ప్రకారమైన యెడల ప్రతిదినమును గ్రంథ ముల క్రొత్త పట్టిక నొకదానిని తయారు చేసినప్పటికిని, ఉపయోగము అందుండజాలదు - ఈ గ్రంథవిభజన పేటిక అనేకులదృష్టి నాకర్షిం చినది."



# పత్రికా ప్రపంచము



(విజయవాడలో 1941 సం॥ము మార్చి 29 – 30 తేదీలలో జరిగిన ప్రథమ ఆంధ్రరాష్ట్ర పత్రికా సంపాదకుల మహాసభకు అయ్యంకివారి స్వాగతోపన్యాసం)

## సుస్వాగతము

చారిత్రకమైన మా యీ బెజవాడ పట్టణమునకు నేడు మిమ్ముల నిట నాహ్వానించు భాగ్యము నా కబ్బుట నా యదృష్టము. విజయవాడయందీ పత్రికాధిపతుల సమావేశము జరుగు టెంతయు సమంజసము. విజయవాడ ఆంధ్రదేశ హృదయము.

విజ్ఞానము జాతియొక్క జీవరక్తము; విజ్ఞానంపు గనులు పత్రికా రాజములు. అట్టి పత్రికారాజముల యధిపతులును, విజ్ఞానప్రదాయులును నగు వారందరు ఆంధ్రజాతికిని, దేశమునకును హృదయ తుల్యమైన మా విజయవాడ పురవరంబున సమావేశమై, "జాతి జీవ రక్త" మగు "విజ్ఞానము"ను ఈ "హృదయమున" నింపి తద్ద్వారా జాతీయ దేహరక్తనాళములకు ప్రవహింపజేసి జాతిని నూత్న తేజము తోడను, నూత్న వికాసముతోడను, ఉత్తేజిత మొనర్పగలరని యాశించుచు చారిత్రాత్మకమగు నీ విజయవాడ పురవరంబునకు మిమ్ముల నందరను హృదయపూర్వకముగ నాహ్వానించుచున్నారము.

## పత్రికా సంపాదక ప్రాశస్త్యము

"వాణి నా రాణి" యన్నాడొక ఆంధ్ర కవీశ్వరుడు. అట్టి ధీమాగలవారే పత్రికాధిపతులును. వాణీపతియగు బ్రహ్మదేవుని వలెనే వీరును సృష్టికర్తలే. విజ్ఞానాధిదేవతయగు "వాణి" ని "పాణిం" బూనిన పత్రికాధిపతులకును, "వాణీమనోహరుడై"న సృష్టికర్త "బ్రహ్మకు"ను తారతమ్య మేమియున్నది?

ఇంతేకాదు-పత్రికాసంపాదకులు "వ్యాస సములు" వేద విభాగ మొనర్చి కృష్ణద్వైపాయును డెటుల "వ్యాసు" లన్న పేరును గైకొనెనో యటులనే వార్తాసమీకరణము, వార్తా విభజనము జేసి "వ్యాస" కారులగు పత్రికాధిపతులును "వ్యాస" పదవాచ్యులే యగుదురు.

అపరసృష్టికర్తలై, "వ్యాస" సమానులై "మానవసేవయే మాధవసేవ"గ ఆదర్శము నిడుకొని చరించు పత్రికాధిపతుల స్థాన మెంతయు ప్రశంసనీయమైనది; వాంఛనీయము నైనది.

"సంపాదకు"ల "బాధ్యతలు," "విధులు."

అయినను ఆ స్థాన మెంతయు "బాధ్యత"తో కూడుకొన్నది. పత్రికాధిపతులు ప్రజాబాహుళ్యమునకు "ధర్మకర్త"లు. వారి బాధ్యతలను వారు సక్రమముగ నిర్వర్తించవలెను. ప్రతికాధిపతులు వారి పవిత్రధర్మ నిర్వహణ కొరకెన్నెని త్యాగము లొనర్చ వలసియుండును. మనము మన యాదర్శములను మాత్రము త్యాగ మొనర్చగూడదు.

పత్రికలు - ప్రజలు

ఎన్నో దురాశాపిశాచములు అను నిమిషము మనలను అనుగమించుచుండును. వాని నన్నిటిని దునుమాడి సత్య మైన వార్తలకు, ప్రజాబాహుళ్యాభిప్రాయమునకు ప్రచురణ మిచ్చుచుండవలెను. మన మొక మహోన్నతాదర్శమును కలిగి యుండవలెను. ప్రస్తుత హిందూదేశ పరిస్థితులనుబట్టి ముఖ్యముగ సాంఘిక విషయములను గురించి వ్రాయుటలో అత్యంత జాగరూకు లమై యుండవలెను. ఒక సంఘమునకును, మరొక సంఘమునకును పరస్పర విరోధ భావములు చెలరేగు నటుల వ్యాఖ్యలు, విమర్శలు వ్రాయకుండ, నిష్పాక్షికముగ మన విధులను బాధ్యతలను మనము నిర్వర్తించవలెను.

ప్రజాభిప్రాయము తప్పుత్రోవను బట్టకుండ "దర్శకు" లమై కాపాడవలసిన బాధ్యత మనమీాద నున్నది.

## పత్రికలు - ప్రభుత్వము

ఎట్టి వార్తలను ప్రచురింపవలెను ? ఎట్టి వ్యాసములను ప్రచురించవలెను? అను నీ యుక్తాయుక్త విచక్షణను పత్రికాధిపతులమీాదనే విడువవలెను. పత్రిక యజమానులుగాని, ప్రభుత్వమువారుగాని ఇట్టి విషయములలో జోక్యము కలిగించుకొనరాదు. ప్రస్తుతము ప్రభుత్వమువారు "వార్తా" ప్రచురణకు కలిగించుచున్న నిరోధము వలన "సత్యవార్తా" ప్రచురణ కాటంకము కలుగుచున్నది. ఇంతే గాక "సెన్సారు బోర్డు" వారు కొన్ని వార్తలను ప్రభుత్వ విధానానుగుణముగ నుండునటుల "కత్తిరించి" పంపుచున్నారు.

ఈ "కత్తిరింపు"ల బాధ్యతకూడ సంపాదకునకే విడువవలెను. అపు డావశ్యకమైన "కత్తిరింపుల" నాతడే చేయగలడు. ఈ విధానముల వలన పత్రికాధిపతులు ప్రజాబాహుళ్యమునెడ తమకుగల బాధ్యతలను నిర్వర్తించుకొన జాలకున్నారు. ఈ యుద్ధ సమయమున "సెన్సారుబోర్డు" వారు ఎంత విపరీతముగా వార్తలను "కత్తిరించు" చున్నదియు మనకందరకు దెలియును. ప్రభుత్వమువారు "కత్తిరించిన కత్తిరింపుల"నే మనము చదువుచున్నాము. ఈ విధముగ "కత్తిరించుట" ప్రజలలో చాలమందికి తెలియదు. పాపము, వారు, ప్రచురించిన దంతయు యథావిధిగ నున్నదనియే నమ్ముచున్నారు. ఈ మధ్య నాకు అమెరికానుండి వచ్చు మామూలు ఉత్తరములే సెన్సారు చేయబడి వచ్చినవన్నచో వార్త లెంతవరకు కత్తిరింప బడుచున్నవియు నూహించుకొనవచ్చును. వినోబాభావే గారి సత్యాగ్రహ వార్తలను ప్రచురింపవలదని ప్రభుత్వము వారు ప్రకటించిరి. సత్యమైన వార్తలను, జరిగిన వార్తలను ప్రకటించుటకు వీలులేనిచో వార్తాపత్రిక లున్న నేమి ? లేకున్న లేమి ?

### ప్రెస్ ఆక్టు

ఈ "ప్రెస్ ఆక్టుల"ను గూర్చి ఆలోచించుటకే ఈ మధ్య ఢిల్లీలో హిందూపత్రికాధిపతులగు కె. శ్రీనివాసన్‌గారి యాధిపత్య

మున పత్రికాధిపతుల సమావేశము జరిగినది. ప్రభుత్వమువారి వలనే యు. పి. లో "సైనిక్" వర్గపత్రికలకు మరికొన్ని ఇతర పత్రికలకు జరిగిన అన్యాయమును ఖండించుచు సభవారు తీర్మానము చేసిరి. కాని దానివలన నింతవరకు ప్రయోజన మేమియు గలుగలేదనియే చెప్పవచ్చును.

## పత్రికాసంపాదకుల బాట "రాజబాట" కాదు

పత్రికా నిర్వహణ మందరనుకొన్నంత సులభమైన పనికాదు. ప్రభుత్వమువారి ఆటంకమేగాక ఇంకను అనేకములైన ఆటంకము లున్నవి. పత్రికాధిపతి యజమాని కనుసన్నలలో మెలగవలెను. ఆయనగారి ఉద్దేశములు, పార్టీలు, వీని కనుకూలముగ తన "వ్రాత కోత"లను మార్చుకొను చుండవలెను. ఈ వాక్స్వాతంత్ర్యనిరోధ మనివార్యముగా నున్నది. స్వంత వార్తాపత్రిక లున్నవారు గూడ కొన్ని సమయములందు సంపూర్ణ స్వాతంత్ర్యము చూప వీలుండదు. వారి స్వకీయమైన ఉద్దేశ్యములను, భావములను పత్రికనిండ గుప్పించినచో పాఠకుల కవి నచ్చకపోవచ్చును. పత్రికాపాఠకులలో సనాతనులు, సంఘసంస్కర్తలు, రాజకీయ వేత్తలు, రణరంగ యోధులు, అనేకులుందురు. వీరేగాక పత్రికలలో ప్రకటనలుజేయు ప్రకటనదారు లున్నారు. వారుకూడ సంతృప్తి పడవలెను. వారికి వ్యతిరేకముగా వ్రాసినచో వారు ప్రకటన లివ్వరు. మందులను గూర్చి వ్యతిరేకముగ వ్రాసినచో మందులవారు వారి ప్రకటనల నివ్వరు. జాతీయపత్రిక యైనచో ప్రభుత్వమువారు, ఆంగ్లేయ సంస్థలు వారి ప్రకటనల నివ్వరు. ఈ విధముగా నింతమంది "నెత్తిమీది దేవతల"ను సంతృప్తిపరచినగాని పత్రికాధిపతి నెగ్గుకొని రాజాలడు. పత్రికాధిపతి బాట రాజబాటకాదు. కంటకావృత మైనది.

## సంఘసేవ

అందువలన అంతరాత్మ ప్రబోధము ననుసరించి తన ఆదర్శమును మాత్రము విడువక చాకచక్యముగ ప్రకృతికి వ్యతిరిక్తముగాని

మార్గములను బోధించుచు సత్యదూరముగాని సంగతులను, సమాచారములను ప్రచురించుచు సంఘమునకును, దేశమునకును పత్రికాధిపతులు సేవ చేయుచుండవలెను.

## విద్యావిహీనత - పత్రికల అభావము

ఇక మన దేశమున పత్రికా ప్రాచుర్యమునుగూర్చి విచారింతము. పత్రికా ప్రాచుర్యము మన దేశమున కడుంగడు హీనముగ నున్నదని ప్రతివారును అంగీకరించక తప్పదు. దీని కనేక కారణములు గలవు. ముఖ్యమైన కారణము మన దేశమున ప్రబలముగ నున్న విద్యావిహీనత. విద్యాభివృద్ధికిని పత్రికా ప్రాచుర్యమునకును దగ్గర సంబంధ మున్నది. ఇంతేగాక రాజకీయమైన స్వాతంత్ర్య విహీనత, మన దేశ దారిద్ర్యము, మనలను అడుగడుగునకు పీల్చి పిప్పి జేయుచున్నవి. సంఘము— మతముగూడ మన కనేకబంధములను గల్పించి మన సత్వరాభివృద్ధి కాటంకముగ నున్నవని చెప్పక తప్పదు.

అందువలన నితర సభ్య దేశములందు పత్రికా ప్రాచుర్యమున్నటుల మన దేశమున లేక పోవుటలో నాశ్చర్య మేమియు లేదు. విద్యావిషయికముగను, ఆర్థికముగను అత్యున్నత దశలోనున్న దేశములలో పత్రికాపాఠకులు హెచ్చుగా నుండుటయం దాశ్చర్య మేమున్నది? పత్రికలు చదువుటకు విద్యయున్నది. కొని చదువుటకు చేతిలో ధనమున్నది. ఇంకేమికొఱత; మన దేశములో విద్యావంతు లేవ్రేళ్ళమీద లెక్కపెట్టదగి యుందురు. వారిలో ప్రతికాపాఠకులు కొద్దిమంది. అందును పత్రికనుకొని చదువువారు మరీ కొద్దిమంది. ఇంక మనపత్రిక లభివృద్ధి కావలెనన్నచో నెట్లు కాగలవు? ఇతర దేశములలో పత్రిక లనేకములు లక్షల ప్రతులుగూడ నమ్ముడగును. మన దేశమున 50,000 ప్రతులను ప్రచురించు పత్రికే లేదు. పత్రికా పాఠకులు లేని దే పత్రిక లెట్లు ప్రచురితములగును? ఈ విషయమున మన యాంధ్రుల కింకా తెలివిలు మెరుగని చెప్పవలెను.

## దేశభాషా పత్రికలు - భాషాభిమానము

మన దేశమున నింగ్లీషు పత్రికలకంటె దేశభాషలలోని పత్రికల స్థితి మరియు హీనముగ నున్నది. మన దేశమున భాషలనేకములు. ఆ యా భాషలను మాతృభాషగ వ్యవహరించు వారు కొలదిమందియే యుందురు ఆ కొద్దిమందిలో విద్యావిహీనులే యధికసంఖ్య. దానికి తోడు దారిద్ర్యము. అన్నిటికి తోడు మాతృభాషాభిమానము లేక పోవుట. అందువలననే మాతృభాషా పత్రికల ప్రచారము కడుంగడు హీనముగ నున్నది.

## ఆంధ్రపత్రికలు - బహుళ ప్రచారము

మన దేశములోనున్న ఆంగ్ల పత్రికలలోగూడ బహుళ ప్రచారము. బ్రిటీషువారు పత్రికాధిపతులుగ నున్న పత్రికలు - బ్రిటీషు వారి యాజమాన్యమున నడుపబడు పత్రికలు - వీనికేయున్నది. ఎందు చేతననగా మన దేశములోని బ్రిటీషువారందరు ధనవంతులు. వారన్నిపత్రికలను తెప్పించుకొని చదువగలిగి యుందురు. వారిలో వయోజనులందరు విద్యావంతులు. హిందూదేశ వాణిజ్యము, పరిశ్రమాగారములు, ఎగుమతి దిగుమతి వ్యాపారము—అన్నియు ఎక్కువగ వారి చేతిలో నుండుటచే వారి పత్రికలకు లెక్కలేనన్ని ప్రకటనలు చేకూరును. అందుచేవారి పత్రికాప్రచారమునకు, అభ్యుదయమున కాటంకములేదు. మనలో వయోజన విద్యాప్రచారము బాగుగాజరుగవలెను. దేశవాణిజ్యము, పరిశ్రమలు, ఎగుమతులు, మన చేజిక్కవలెను. మన పారిశ్రామికు లందరును దేశీయపత్రికలలోనే ప్రకటనలను ప్రచురించవలెను. అప్పుడే మన పత్రికా ప్రచారము బాగుగ సాగును.

## "లినోటైపు" - "మానోటైపు" - దేశ భాషాపత్రికలు

మనభాషలో "లినోటైపు," "మానోటైపు" యంత్రములు లేకపోవుటచేతను "సంక్షిప్తలేఖన" సౌకర్యము లేకపోవుటచేతను అచ్చు చేతితో కూర్చుకొని ముద్రించు విధానము చాల వ్యయప్రా

యాసాపూరితమును, అసంపూర్ణమునై యుంకుటచేతను, ఆంగ్లములో వార్తలను ప్రచురించినంత వేగముగ దేశభాషలందు ప్రచురించుట జరుగదు. ఇదియునుగాక విదేశములనుండి టెలిగ్రాములు, "రూటరు" "అసోసియేటెడ్ ప్రెస్" వార్తలు—"టెలిప్రింటర్" ద్వారా అన్నియు ఆంగ్లభాషలోనే సరఫరా యగుటచే మనవారు వాని నన్నిటిని తెలుగులోనికి తర్జుమా చేసికొని ప్రచురించవలసి యుంకుటచేతను, చాల ఆలస్యము జరుగక తప్పదు. ఇవన్నియు నెందుకు వివరించుచున్నానననగా, మన దేశస్థుల జిజ్ఞాస, వార్తలను తెలిసికొనవలెనను ఆసక్తి, ఆంగ్ల పత్రికలద్వారా తీరనేరదు. ఆంగ్లభాషా పరిజ్ఞానము గలవారు చాలతక్కువ. అందుచేత మన దేశమున పత్రిక లభివృద్ధి గావలెనన్నచో దేశభాషా పత్రికల అభివృద్ధి మీదనే మన మెక్కువ ఆధారపడవలెను.

## పత్రికలఖరీదు - ముద్రణయంత్రములు

ఇంతేకాదు. పత్రికా ప్రచార మెక్కువ కావలెనన్నచో బీద దేశమగు మన దేశమున పత్రికల ఖరీదు తక్కువగనుండవలెను. పత్రికల ఖరీదు తగ్గవలెనన్నచో, పత్రికా సామగ్రి మనదేశములో తయారు చేసికొను నేర్పాటు గావించుకొనవలెను. కాగితము, సిరా, మొదలగు పనిముట్లు తయారుచేసి కొనుటకు మన దేశమున ముడి సరుకులు కావలసినన్ని యున్నవి. ముఖ్యముగ నీ యుద్ధ సమయమున ఈ పరిశ్రమల కెక్కువ యవకాశమున్నది. వీనినేగాక యంత్రములు, ఫొటోగ్రాఫు, "ప్రాసెస్" "ఎంగ్రేవింగు" సామానులు, మనమే తయారుచేసి కొనగలిగి యుండవలెను. అప్పుడే మనదేశమున పత్రికా ప్రాచుర్యము విరివిగా సాగగలదు.

## పత్రికా సంపాదకుని దైన్యస్థితి-తన్నివారణోపాయము

ఈ పైన వివరించినవన్నియు పత్రికా ప్రచారమునకు ఎక్కువ యుపయుక్తము కాగలవు. ఇంతేగాదు, పత్రికాప్రాచుర్య మెక్కుడు

గావలెనన్నచో "ప్రతికా సంపాదకులు"–"ప్రతికా జీవనులు" — వీరి స్థితి బాగుపడవలెను. ఆర్థికముగ వా రభివృద్ధి చెందవలెను. వారి జీతభత్యములు వారికి సక్రమముగను, సకాలమునను, సంతృప్తికరముగను ముట్టుచుండవలెను. వ్యాసరచయితలకు తృణమో, పణమో గిట్టుచుండవలెను. 1904-5లో నా ప్రథమవ్యాసమును ప్రచురణకొసంగిన "బాలసరస్వతి" పత్రికాసంపాదకులగు శ్రీ మంగిపూడి వేంకటశర్మగారినుండి, నేటి "గోష్ఠి" పత్రికా సంపాదకులగు బ్రహ్మశ్రీ గుమ్మిడిదల సుబ్బారావుగారి వరకును పత్రికా సంపాదకుల స్థితి ఆంధ్రదేశమున ఆర్థికముగ దైన్యముగనే యున్నదని చెప్పవలెను. వీ రాంధ్ర "కుచేల" బిరుదమున కెంతయు తగియున్నారు. పత్రికా సంపాదకులు దేశమును తీర్చిదిద్దవలసిన "దర్శకు"లు. అట్టి సంపాదకులే దినభత్యమును యేనాటి కానాడు వెదకికొనవలసి వచ్చుచుండ వారేమి దేశమును తీర్చి దిద్ది సక్రమమగు మార్గముల నడుపగలరు?

ఇట్టి దైన్యపరిస్థితులు పోవుటకు దేశము తోడ్పడవలెను; వారికి వారే స్వయముగ సహాయ మొనర్చుకొనవలెను.

## పత్రికా సంపాదకుల పాండిత్యము

ఆంధ్రాంగ్లపత్రికలు — దేశభాషయందును, గీర్వాణ భాషయందును, పాండిత్యము సంపాదించి ఆంగ్లమున ప్రవేశమున్న పట్టభద్రులను–ఆంగ్లమున పాండిత్యమును సంపాదించి, దేశభాషాగీర్వాణ భాషలయందు పరిచయమున్న పట్టభద్రులను–పోషించవలెను. వ్యాసరచయితలకు కట్నముల నిచ్చుచుండవలెను; అపుడే మంచి వ్యాసములు సమకూరగలవు. ఇంతియేగాక ప్రతిధనవంతుడు–అనగా కొనగల ప్రతివారును తప్పక ప్రతిదినము పత్రికలనుగొనుచుండవలెను. ఆంధ్రదేశమునందున్న గ్రంథాలయములన్నియు వీలయినన్ని తెలుగు పత్రికలను తెప్పించుచుండవలెను.

అన్నిటికంటె ముఖ్యమైనది "అపరబ్రహ్మ" యను పత్రికా సంపాదకుని గౌరవ మర్యాదలతో కాపాడవలెను. సంఘమున నాత

డుచ్చస్థానము నాక్రమించవలెను. అపుడే మన పత్రికలకు ప్రచార మభివృద్ధి యగును.

## ప్రభుత్వ సహాయము

ఇంక పత్రికా ప్రాచుర్యమునకు ప్రభుత్వ సహాయ మత్యంతా వశ్యకము. ఆర్థికముగనేమి, నైతికముగనేమి, ప్రభుత్వసహాయ మని వార్యమైనది. కాని నేడు మన దేశమున నట్టి సహాయము లేకపోవుట యేగాక, విరోధమే యెక్కుడుగ నున్నదని చెప్పవలసి వచ్చుచున్నది. దూరావర్తకుని, వేరుశనగ వర్తకుని, పొగాకు పంటదారుని, యోగ క్షేమముల నారయు ప్రభుత్వము, పత్రికలయొక్కయు పత్రికా సంపాదకుల యొక్కయు పోషణ నేల యభిలషింపదో నాకు బోధ పడదు. పూర్వకాలమున మన రాజులు తమ యాస్థానపండితుల నెటుల గౌరవించి పోషించెడివారో మన మీ సందర్భమున మరువ రాదు.

## స్వయం సహాయము

ఇంక పత్రికా సంపాదకులు తమకు తామే సాయముచేసి కొనవలయునని చెప్పితిని. వారందరును తమతమ వ్యక్తిగౌరవములను కాపాడుకొనుచు "రాష్ట్రీయ సంఘములుగ" నేర్పడి "అఖిల భారత సంపాదక సభలో" నైక్యతను పొందవలెను. సంఘశక్తి నెవరును కాదనలేరు. ఇట్టి సంఘశక్తి యెంతవరకు నుపయోగించునో తెలుపుట కొక ఆస్ట్రేలియను ఉదంతమును మీకు తెల్పుదును.

## సంఘశక్తి-ఆస్ట్రేలియా ఉదంతము

25 సంవత్సరముల పూర్వము "ఆస్ట్రేలియా జర్నలిస్టుల సంఘము" "మెల్బోర్న్"లో నేర్పడినపుడు వారిస్థితి నేడు మన దేశములో వలెనే యున్నది. ఆ దినముల నుద్దేశించి ఒకరు "ఆస్ట్రేలియా జర్నలిస్టు" అనే పత్రికలో ఈ విధముగ వ్రాసిరి. "జీతములు జాలి కొల్పునంత సరిపోనివిగా నుండెడివి. నమ్మకమునకు వీలులేనంత కఠినముగ పరిస్థితు లుండెడివి. పనిచేయు కాలము సహింపదగనిదిగా నుండెడిది.

కాని పై "సంఘు" మేర్పడి పనిచేయ మొదలిడిన తరువాత వారి పరిస్థితు లెంతో అభివృద్ధి నొందినవి. జీతములు నిర్ణయించిరి. జర్నలిస్టుల స్థితి యభివృద్ధి యయినది."

## "లండన్ టైమ్సు-జాన్ వాల్టర్"

ఇంతేగాక సంపాదకులు, పత్రికాజీవనులు- వీరి స్థితి బాగుపడవలె నన్నచో "వార్తా పత్రికల నిధులను" ఏర్పాటు చేయవలెను. వారికి పెన్షనుల నిచ్చువటులకూడ నేర్పాటు చేయవలెను. ఈ విషయమును గూర్చి "లండన్ టైమ్సు" పత్రికకు సంబంధించిన "జాన్ వాల్టరు" గారు చెప్పినది వినుడు "పత్రికా జీవనుడు ఇతరు లందరి కంటె తనపనికి తాను బానిస. ఎంతో ఒత్తిడితో నాతడు పని చేయును. అతడు రాత్రింబవళ్ళు టెలిఫోనును వినుచుటకు వీలు లేదు. ఆతని నరములన్నియు ఎపుడును మొదటి యాలోచనలతో సాగిపోవు చుండును...... ఈ విధముగా నిరంతరము కార్యభార నిమగ్నుడగు పత్రికా జీవను డెపుడో యొకపుడు దెబ్బతినక మానడు. మానవ మాత్రుడగుటచే రోగము రాక మానదు. అపు డాతడెట్లు తన్ను పోషించుకొనగలడు?"

## వార్తాపత్రికా నిధులు- అమెరికా

అభివృద్ధియయిన అన్ని దేశములందును "వార్తా పత్రికా నిధు"లున్నవి. కష్టస్థితిలోనున్న పత్రికా జీవనుల కవి ఆధారము లగును. ఈ సందర్భమున అమెరికా సంయుక్తరాష్ట్రముల "వార్తా పత్రికానిధి" ని గూర్చి ముఖ్యముగ పేర్కొనవలెను. 1933 వ సంవత్సరమున ఈ నిధినుండి సాయముచేసిన మొత్తము 21,237 పౌనులు. ఈ నిధికిగాను ధనవంతులు విరాళములిచ్చి యభివృద్ధి పరచుచుందురు. ఈ విధమైన నిధులను మన దేశములోకూడ నేర్పరచినగాని పత్రికా జీవనుల స్థితి యభివృద్ధి కానేరదు.

## పత్రికా జీవనులు

జర్నలిస్టులు (Journalists) అను పదమునకు నేను "పత్రికా జీవను"లని వాడుచున్నాను. "పత్రికాజీవను" లనగా పత్రికాధిపతుల నుండి, పత్రికా సంపాదకులు-పత్రికా విలేఖరులు-వ్యాసరచయితలు-ఇంతయేల, పత్రికలలో వ్రాయు ప్రతివారును అని చెప్పవలయును.

## అందరకును ఆకర్షకము

అందరును పత్రికా జీవనులగుటకు నిచ్ఛగింతురు. ఈ విషయమున భాగ్యవంతుడును బీదవాడును అను భేదముండ నేరదు. ప్రతివాడును ఇందు చేరుట కవకాశమున్నది. ఈ వృత్తిలో ప్రవేశించునపు డొకరు పనికి వచ్చెదరు, మరొకరు పనికిరారని నియమమేమియు లేదు. కావున చాలమంది పత్రికాజీవను లగుటకు ప్రయత్నింతురు. కాని ప్రవేశించిన తరువాత లోతు తెలిసికొని చాలమంది ఆ వృత్తినుండి చాలించుకొందురు.

కాని బాగుగ తరిబీతయి, సమర్థుడైన సంపాదకునకు మనదేశమునగాని, విదేశములందుగాని మంచి అవకాశమున్నది. ఒక్క సమర్థుడగు పత్రికాసంపాదకు డున్నాడన్నచో అనేకమంది ఆ స్థానము నధిష్ఠించ బ్రయత్నించి విఫలులైరన్నమాట. అనేకు లీ వృత్తి నభిలషించుచుందురని పైన జెప్పితిని.

## "అమెరికన్" "ఉదంతము"

ఈ సందర్భమున నొక "అమెరికన్" ఉదంతమును ఉటంకించుచున్నాను. అమెరికాలో నొక భాగ్యవంతుల కుటుంబమునకు చెందిన యువకు డొకడు "న్యూయూర్కు" నగరమున నొక పత్రికా కార్యాలయమున విలేఖరిగ నుండగోరెను. అంత భాగ్యవంతుడగు నాత డా చిన్న యుద్యోగ మెందుల కభిలషించెనని ఆతనిని ప్రశ్నించగా నాత డీటుల సమాధాన మిచ్చెను. "విలేఖరులు సర్వవిజ్ఞాన ఖనులు. వారందరికంటె కిళకళలాడుచుందురు. వారివలె నే నుండ గోరెదను."

## "ఆ ల్వా ఎ డి స న్"

ప్రఖ్యాత పరిశోధకుడగు "ఆల్వాఎడిసన్" అనునాతడు కూడ పత్రికాజీవనునిగ నుండకపోతినే యని తన తరువాతి జీవితమున విచారపడినటుల వ్రాయబడినది. కొంతకాలము "డైలీ ఎక్స్ప్రెస్" సంపాదకుడుగా నున్న "ఆర్. డి. బ్లూమెన్‌ఫీల్డు" గారు తనతో "ఎడిసన్" ఈ క్రిందివిధముగ చెప్పినటుల వ్రాసిరి.

"విలేఖరి నగుటకు నా కపరిమితమైన కోరిక యుండెడిది. ఆ విషయమున మీరు నా తలదన్నుదురు. పత్రికా జీవనములోనున్న వైవిధ్యము, అభిరుచి, చెవిగోసికొనజేయు శక్తి, జీవితమున నింకొక దానియందు లేదు. కేవలము విలేఖరిగ పనిజేయుటే నా యభిమతముగాదు. నా యభిప్రాయమేమనగా ఒకచోట కూర్చుండి కొన్నివందల — వేలమందికి ప్రతిదినము అన్ని విషయములలోను వారెటుల ప్రవర్తించవలసినదియు — వారికి సలహానిచ్చుట, వారికి విద్యగరపుట, వారిని వినోదపరచుట, అవసరమైనచో వారిని చీకాకు పరచుట ఇవన్నియు చేయ సమర్థులైయుండు టెంత గొప్పవిషయము! నా ప్రజలు నన్నుపయోగించు కొందురు. మీ ప్రజలను మీ రుపయోగించు కొందురు. మీకును నాకును మధ్యనున్న వ్యత్యాస మిది."

## భారతదేశమునందలి పత్రికలు

భారతదేశమున పత్రికాజీవనము శైశవదశయందే యున్నదన చెప్పవలెను. మన దేశమున (1941) నిపుడు సుమారు ˙C00 పత్రికలు కొన్ని దినపత్రికలు, మరికొన్ని వారపత్రికలు ప్రచురింపబడుచున్నవి. ఇంకను 3000 నెలపత్రికలు - పక్షపత్రికలు - త్రైమాసిక పత్రికలు మొదలగునవిగూడ గలవు కాని ఈ పత్రికలలో చాల పత్రికలు ఒక రిద్దరివ్యక్తులమీద నాధారపడి ప్రచురింపబడునవే. ముప్పదిమందిగూడ పనిచేయుని కార్యాలయము లనేకము లున్నవి, కావున "పత్రికా

సంపాదక శాస్త్రమున" తరిబీతయిన సమర్థులగు యువకుల కింకను చాల అవకాశము లున్నవనియే చెప్పవలెను.

## ప్రథమ భారతీయ పత్రిక

ప్రప్రథమమున మన దేశమునందు 1780 సంవత్సరమున కలకత్తాలో "హికీస్ గెజెట్" (Hicky's Gazette అను పత్రిక ప్రచురింపబడెను. అది రెండు సంవత్సరములు మాత్రమే జీవించెను.

మన ఆంధ్రదేశమున మాసపత్రిక లిఖితమున్న యాకారమున పూర్వ ముండెడివి కావు. వ్యాసములను ప్రచురించు నాచార మపుడు లేదు. పుస్తకములనే పత్రికల రూపమున ప్రకటించుచుండెడివారు.

## నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము

నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము అమలులోనికి రాక పూర్వము బ్రిటనులో కూడ పత్రికాపాఠకుల సంఖ్య నేడు మన దేశములో నున్నట్లులే యుండెడిది. నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము ప్రవేశపెట్టబడినది బ్రిటీషు దేశమున "లార్డు నార్తు క్లిఫ్" గారి దయ వలన నిర్బంధప్రాథమిక విద్యాప్రచారము విరివిగా సాగినది. పత్రికా పాఠకు లనేకు లుత్పత్తియైనారు.

## భావి భారతీయ పత్రికా జీవనము

ప్రజాశాసనాధిపత్యమున విద్యాభివృద్ధియయిన కొలది మంచి వార్తాపత్రికల కొఱకు ప్రజలలో కోరికయు నభివృద్ధి యగును. ఎందు చేతననగా "బ్రాడ్ కాస్టింగు" గాని, "సినిమా" గాని, వార్తాపత్రికా స్థానమును ఆక్రమించజాలవు. ఇప్పటికే మన దేశమున పత్రికాపాఠకులు ఇంతకు పూర్వముకంటె రెట్టింపుకుంది పెరిగిరనిచెప్పవచ్చును. "సినిమా"కు పోవువారు, "రేడియో" వినువారు గూడ ఎక్కువైరి. సినిమాకు పోవుట, రేడియో వినుట నలవాటు పడినవారు పత్రికా పఠన మొనర్పకుండనుండజాలరు. కావున పత్రికా పాఠకుల సంఖ్య

యింకను అభివృద్ధి చెందగలను. పత్రికలస్థానము నా రెండును ఆక్రమించజాలవు, చాకచక్యములైన చేతులలో నున్న పత్రిక లీ జిజ్ఞాసను అభివృద్ధి పరచగలవు.

## "సర్ శామ్యుయల్ హోర్"

భావిభారత భాగ్యము పత్రికలమీదను, పత్రికల భాగ్యము భావిభారతముమీదను — అన్యోన్యముగ నాధారపడియున్నవి. కొంత కాలము "ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేటు" గానున్న "సర్ శామ్యుయల్ హోర్"గా రీ క్రిందివిధముగ భారతీయ పత్రికా పరిభావమునుగూర్చి వ్రాసిరి.

"భావి వత్సరములలో భారత దేశమున పత్రికా పరిభావము ఇనుమడించు నని నా నమ్మకము. వివేకముతోడను, శక్తివంతముగను నేటి నవీనపద్ధతులతోడను, నియమములతోడను నడుపబడు పత్రికలు క్రమేణ భారత దేశము స్వరాజ్యోన్ముఖమైన కొలది అత్యంతావశ్యకము లగును."

## వార్తాపత్రికలు - వానియంగములు

వార్తాపత్రికలు - వార్తాపత్రిక లనుటేగాని వార్తాపత్రిక మనచేతికి వచ్చునప్పటి కెన్నిదశలలోనుండి మారి, మనము చూచు మాదిరిగ తయారైనదియు చాలామందికి తెలియును.

సాధారణముగ పత్రికలలో "వార్తాభాగము", "వ్యాస భాగము" అను రెండు భాగములుగ విభజింపబడియుండును.

వార్తాభాగమునందు వార్తలు, అభిప్రాయములు, వార్తా విమర్శలు, వ్యాఖ్యలు మొదలగునవి ప్రచురింపబడును. వ్యాస భాగమునందు వాఙ్మయము— కథారూపముగను, గద్య పద్య, వ్యాస రూపములుగను, ప్రచురింపబడుచుండును, నాటకరూపములుగను ప్రచురింపబడు చుండును.

విమర్శ - గ్రంథములు, నాటకములు, ఫిలిములు, సంగీతము మొదలగు వానినిగూర్చి ప్రచురింపబడును. ఇంకా జీవితములోని ఇతర విషయములను గురించిన భోగట్టాయు నుండును.

## వార్తా సమీకరణము

వార్తా పత్రికా ప్రచురణకు ప్రప్రథమమున వార్తలు కావలెను. తమ చుట్టునున్న ప్రపంచ జీవిత విశేషములు, అందేమి జరుగుచున్నదియు గ్రహించి వానిని తమ పాఠకులకు తెలుపుట వార్తా పత్రికలయొక్క ప్రప్రథమ విధి. పత్రిక ప్రచురింపబడు ప్రదేశము యొక్క చుట్టుప్రక్కల మాత్రమే తిరిగి వార్తలను సమీకరించు విలేఖరు లున్నంత మాత్రమున నీ పని నెరవేరజాలదు.

## విలేఖరులు

ప్రతి జిల్లాకును, ప్రతి ముఖ్యపట్టణమునకును, విలేఖరు లుండవలెను. ఒకరిద్దరు ఎప్పుడును ఒక ప్రదేశమునుండి మరొక ప్రదేశమునకు ప్రయాణముచేయు ప్రత్యేక విలేఖరు లుండవలెను. ఏవైనను ప్రత్యేక సమయములు సంభవించినప్పుడా విలేఖరు లాసందర్భమున పనిచేయవలెను. విదేశములలో గూడ ముఖ్యపట్టణములలో విలేఖరుల నేర్పాటు చేయువలెను.

కాని ఇంతమంది విలేఖరులను నేర్పరచి అన్ని పత్రికలును భరించజాలవు. అందుచేత చాల పత్రికలు "రూటరు", "అసోసియేటెడ్ ప్రెస్" వార్తలమీద ఆధారపడుచుండును.

## వార్తా సంపాదకుడు (News Editor)

ఇంతవరకు వార్తా సమీకరణమైనది. వివిధ ప్రదేశములనుండి వచ్చు వార్తలన్నియు వార్తాసంపాదకుని (News editor) యధీనములోనికి పోవును. వార్తా సమీకరణ విషయములో మాత్ర

మాతడు పత్రికా సంపాదకునియెడ జవాబుదారీతనమును వహించవలెను.

ఈ విధముగ ఏజెన్సీలు, విలేఖరులు పంపిన వార్తలు, ఇంకా ఉత్తరములు "టెలిగ్రాములు", "కేబుల్సు", "టెలిఫోను పిలుపులు" ఇవన్నియు అల్లకల్లోలములుగ పత్రికా కార్యాలయమున జేరును. వాని నన్నిటిని విభజించి, అనావశ్యకమైన వానిని పరిత్యజించి, పత్రికయందు దేపుటలో నేది యుండవలెనో నిర్ణయించి, శీర్షికల నిడి, ఆవశ్యకములైన పటములను జేర్చి మనము చదువు వార్తాపత్రికల నారూపమునకు దెచ్చువారెవరో తెలిసికొనుట కుత్సాహముగనుండును.

ఈ పనియంతయు "మెషీను" వద్ద అచ్చు వేయువాని వలన గానిపని యని మనకు దెలియును. వానికీపని చేయుటకు సమర్థతగాని సమయముగాని లేదు. సాధారణముగ అందరు అనుకొనునట్లీ పని యంతయు పత్రికా సంపాదకుని వలనగాని సహాయ సంపాదకునివలన గాని చేయబడదు. వారి కంతకంటె ముఖ్యమైన పని యున్నది.

## ఉపసంపాదకవర్గము

ఈ పనియంతయు 'ఉపసంపాదకవర్గ' వారు (Sub editorial staff) చేయుదురు. వారందరతి సమర్థులై యుండవలెను. ఉపసంపాదకవర్గమువా రున్నారని మాత్రము మనకు తెలియును గాని వారి పేర్లెవరికిని దెలియవు. తెలియుట కవకాశము లేదు.

ఈ ఉపసంపాదకవర్గమున కంతకును- పెద్ద - ముఖ్యోపసంపాదకుడై యుండును (Chief sub editor). ఈతడు, వార్తాసంపాదకుడు (News editor) సమీకరణ మొనర్చిన వార్తా సముదాయమును ఏ స్థలమున నే విషయము నెంతవరకు నే విధముగ ప్రచురించవలెనో నిర్ణయించవలెను. ఆ విషయమై నీతడు పత్రికా సంపాదకునకు జవాబుదారీతనమును వహించవలెను.

## ప్రధాన సంపాదకుడు - అభిప్రాయ వ్యక్తీకరణము

ఇంతవరకును వార్తలను గురించి చెప్పితిని. వార్తలు, పాఠకుల లేఖలు – వీనిమీద తన యభిప్రాయములను వ్యక్తీకరించుట సంపాదకుని కర్తవ్యము. సాధారణముగ పత్రికలో ప్రచురింపబడిన సర్వ వార్తలకును సంపాదకుడు సమాధానము చెప్పవలసినను, ఈ అభిప్రాయ వ్యక్తీకరణ భాగమునే యాతడు స్వకీయముగ నెరవేర్చుచుండును. అతని ఆధిపత్యమున కొందరు సహాయసంపాదకు లుందురు (assistant editors). సాధారణముగ సంపాదకీయములను, ఆవశ్యకమైనచో సంపాదకునితో సంప్రదించి సహాయసంపాదకులే వ్రాయుచుందురు. ఈ దినములలో సంపాదకునకు స్వయముగ సంపాదకీయములను వ్రాయుటకు సమయ ముండదు.

## ప్రత్యేక సంపాదకీయములు

సహాయసంపాదకులకు గూడ ఆఫీసుపని (Executive and organisation work) యున్న పెద్దపెద్ద పత్రికా కార్యాలయములలో ప్రత్యేకముగ "సంపాదకీయములను" వ్రాయుటకు కొందరు నియమింపబడియుందురు. ఇంకను ఎప్పుడైన ఏదైన ప్రత్యేక విషయమును గురించి వ్రాయవలసివచ్చినపుడా యా విషయములలో ప్రత్యేకతను సంపాదించిన యితరులచే గూడ సంపాదకీయములు వ్రాయించుచుందురు. సాధారణముగ నిట్టి పనికి న్యాయవాదు లెక్కువగ నాహ్వానింపబడుదురు. ఒక్కొకపుడు రాజకీయవేత్తలకును నాహ్వానము పంపబడును. ఇంతేగాక ఏ దేని యూరిలోని స్థానిక విషయమునుగూర్చి సంపాదకీయము వ్రాయవలసివచ్చినచో నా యూరి "స్థానిక విలేఖరి" తా నా స్థానిక విషయమున నెక్కుడు పరిచయముగలవాడై యుండుటచేత నాతడా సంపాదకీయమును వ్రాసి పంపుటయు గలదు.

ఈవిధముగ పత్రికాకార్యాలయమున నేర్పాట్లు సక్రమముగ నుండును.

ఇంతమంది వెనుక పనిచేయగా మనకు పత్రిక సర్వాంగ సుందరముగ సర్వవార్తాసంభరితమై చేతికందును.

## పత్రికా జీవనునికి వలయు శక్తి సామర్థ్యములు

ఇట్టి పత్రికలు తయారగుటకు పత్రికాజీవను లెంతయేని పని చేయవలసియుండును. కావున వారికి ప్రప్రథమావశ్యకత పరిపూర్ణారోగ్యము. విలేఖరులకు నియమిత వేళలందు మాత్రమే పనిచేయుట యని నిర్ణయముండదు. రాత్రింబవళ్ళు వార్తాగ్రహణమునకు సంసిద్ధులుగ నుండవలెను. ఎండయనక వానయనక తిరుగుటకు తయారై యుండవలెను. ఒక్కొకపుడు కొంతదూరము నడువవలెను. మరొకపుడు గంటలకొలది ఒకచో నిలచియుండవలెను.

విలేఖరి తాను "ఉపసంపాదకీయ వర్గము"లోనికి గ్రహింపబడినపుడుగూడ నాతని కష్టములు తక్కువ. రాత్రిసమయములందక్కడగూడ పని చేయవలసి యుండును. ఏ దినమున కా దినము చకచక వార్తలను చక్కజేసి పత్రికలో ఆకర్షణీయమైన శీర్షికలతో తగిన స్థానములందు ఏర్పాటు చేయవలెను. ఒక్క నిమిషమైనను అజాగ్రత్త పనికిరాదు. ప్రతి నిమిషమును "కనబడని కాల" మను "ములుకర్ర" వీరిని తొందర పెట్టుచునే యుండును.

## పత్రికా జీవనుడు సర్వసమర్థుడు

ఇంతేకాదు. పత్రికాజీవనమునకు శీఘ్ర గ్రహణశక్తి అత్యంతావశ్యకము. పరిసరానుగుణ్యముగ నానుకూల్యత నేర్పరచుకొను చాకచక్య ముండవలెను. విమర్శనా శక్తి, వార్తాగ్రహణ శక్తి - ఇవన్నియు నుండవలెను. ఆత్మవ్యక్తీకరణశక్తి అన్నిటికంటె ముఖ్యమైనది. వేయేల! పత్రికాజీవనునికి ప్రయాణమొనర్చుచు వస్తువులను విక్రయించు విక్రేతకుండునట్టి ఓర్పు, పర్వతారోహకుని కుండవలసిన ధైర్య సాహసములు,రక్షకభటున కుండవలసిన జాగ్రత, న్యాయవాది

కుండవలసిన సంసిద్ధత, న్యాయాధిపతి కుండవలసిన నిష్పాక్షికత్వము, నటునికుండవలసిన బుద్ధికుశలత, నవలారచయిత కుండవలసిన ఊహా శక్తి, కళాకారునికుండవలసిన పరిశీలనా దృష్టి, వేదాంతికుండవలసిన వైరాగ్యము, మానసిక తత్వవేత్త కుండవలసిన లో దృష్టి, అన్నిటి కంటె ముఖ్యముగ సహనము, దయ దాక్షిణ్యములు - ఇవన్నియు నుండవలెను.

## విదేశములయందు సంపాదకుల "శిక్షణ" తరగతులు

మన దేశమున సంపాదకుల శిక్షణ తరగతులను పెట్టి సమర్థు లగు సంపాదకులను తరిబీతు చేయవలెను. ఆ కష్టసాధ్యమగు పని విశ్వవిద్యాలయములే సాధించవలెను విశ్వవిద్యాలయములలో నేర్చిన శాస్త్రమును పత్రికా కార్యాలయములలో అనుభవమున నిరూటకవ కాశ మేర్పరచవలెను అపుడు సమర్థులగు సంపాదకులు తయారు.కా గలరు. విదేశములో సంపాదకుల శిక్షణకు ప్రత్యేక సంస్థలుగలవు.

## ఇంగ్లండు ప్రథమశిక్షణాలయము

ఇంగ్లండులో ప్రప్రథమమున 1900 సంవత్సరమున సంపాదకుల శిక్షణకు ఒక ప్రైవేటు బడి నెలకొల్పబడెను. కాని 1919వ సంవత్స రమున సంపాదకుల శిక్షణతరగతుల నేర్పరుపలేదు. వారు సంపాదకుల శిక్షణనందిన తరువాత నొక యోగ్యతాపత్రము నిత్తురు, ఆ శిక్షణ రెండు సంవత్సరములు.

## పాఠ్యప్రణాళిక

ఇంగ్లీషువ్యాసరచన, విమర్శన సూత్రములు, రాజకీయాభి ప్రాయముల చరిత్ర, ఆర్థికశాస్త్రము, శాస్త్రపరిజ్ఞానాభివృద్ధి చరి త్రము, వేదాంతము, మానసికశాస్త్రము మొదలగునవి ఆ తరగతు లలో బోధించెదరు. "సంక్షిప్తలేఖనము" "టైపురైటింగులో" కూడ ప్రావీణ్యము సంపాదించవలెను.

బ్రిస్టలు విశ్వవిద్యాలయమున కూడ పోస్టుద్వారా శిక్షణ తరగతులు నిర్వహింపబడుచున్నవి.

## అమెరికా శిక్షణతరగతులు

అమెరికాలో ప్రథమమున సంపాదకశిక్షణ తరగతుల నేర్పరచినది "రాబర్టులీ" యను నాయన. అతడు 1858లో వాషింగ్టన్ కాలేజీ అధిపతిగ శిక్షణ తరగతులను నడుప ప్రారంభించెను. కానిఅతడు గతించిన తరువాత నా తరగతు లంత యభివృద్ధి చెందలేదు. అటు తరువాత మరల 1903 వ సంవత్సరమున "జోసెఫ్‌లిజర్" అనునాయన 60 లక్షల డాలర్లు విరాళమివ్వగా నొక "సంపాదక శిక్షణ తరగతి" ప్రారంభింపబడునను ఆశ పొడమినది. కాని ఆయన గతించినతరువాత 1911లో గాని శిక్షణ తరగతి రూపొందలేదు. అమెరికాలో "మిస్సోరి"లో సంపాదకశిక్షణ తరగతులున్నపాఠశాల చాలప్రఖ్యాతి చెందినది.

ఈ విధముగ నితర దేశములలో సంపాదక "శిక్షణ తరగతు"లను ఏర్పాటు చేసి విశ్వవిద్యాలయములు, ప్రత్యేక సంస్థలు గూడ నడుపుచున్నవి.

## భారతదేశము "సంపాదక శిక్షణ" తరగతులు

కాని మన దేశమున నట్టి ఏర్పాటు లేదనియే చెప్పవలెను. శిక్షణ తరగతుల నేర్పాటుజేసి సమర్థులగు సంపాదకులను తయారు చేయు టత్యంతావశ్యకమను విషయమున భేదాభిప్రాయములు లేవు. కాని శిక్షణ తరగతుల నేర్పాటుచేసి తయారుచేయు పద్ధతినిగూర్చి కొన్ని భేదాభిప్రాయములు గలవు కొందరీ తరగతులను విశ్వవిద్యాలయములందు ఏర్పాటు చేయవలెననియు, మరికొందరు ప్రత్యేక సంస్థలలో శిక్షణ జరుగవలెననియు అభిప్రాయపడుచున్నారు. కాని ఎక్కువమంది ఇతర దేశములోవలె ప్రత్యేక సంస్థలే యుండవలెనని అభిప్రాయపడుచున్నారు.

## శిక్షణ తరగతుల ప్రణాళిక

"భారతీయ పత్రికాజీవనుల సంఘము" కలకత్తా విశ్వవిద్యాలయము వారి కొక ప్రణాళిక నిచ్చినది. దానినింకను అమలులో పెట్టినటుల కానరాదు. "అంతర్విశ్వవిద్యాలయబోర్డు" కూడ భారతీయ విశ్వవిద్యాలయములకు పత్రికా సంపాదక శిక్షణ తరగతులను బెట్టి "డిప్లొమా"ల నివ్వమని సిఫారసు చేసినది.

అన్నామలై మద్రాసు విశ్వవిద్యాలయములవారు దీనిని గూర్చి యాలోచించుచున్నారని తెలియుచున్నది. కాని మైసూరువిశ్వవిద్యాలయమువారు మాత్ర మన లీ విషయమునే యాలోచించుటకు నిరాకరించిరి.

### ఆంధ్రదేశము

ఆ లోటు తీరునంతవరకు చెన్నపురిలో "హిందూ" పత్రికాధిపతులు జరుపుచున్న రీతిగ మన యాంధ్రదేశముననున్న పత్రికారాజములు కొందరు యువకులను తయారుచేయవలెను. ఉదాహరణ: శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి రచన సముద్రమువలె గంభీరము-అపారము – అట్టి రచనావిధాన మాయనతో సరి కాకుండ 'కృష్ణా పత్రిక'వారు అట్టి సంపాదకులను, సంవత్సరమున కొకరినైన తరిబీతు చేయవలెను. అట్లే మన కాంధ్రపత్రిక, "ఆంధ్రప్రభ"యు నున్నవి. సంపాదకుల తయారుచేయవలసిన బాధ్యత వానిమీదకూడ నున్నది. శిక్షణకు మనలో అర్హులగు యువకులకు లోటులేదు. కార్యరంగమున దుమికి నడుము గట్టుకొని పని ప్రారంభించినచో అనతి కాలమున అనేకులు సంపాదకులు, వ్యాసరచయితలు తయారు కాగలరు. ఈ విషయమై ప్రత్యేకశ్రద్ధ వహించవలయు నని ఆయా పత్రికాధిపతులను నేను కోరుచున్నాను.

### ఆంధ్రాంగ్ల దైనందిన పత్రికలు - బెజవాడ

ఇంకొక్క-మాట. ఆంధ్రదేశమునకు "హృదయ" మని విజయవాడను నేను మొదటే చెప్పితిని. ఆ హృదయమున జాతి జీవ

రక్తమగు విజ్ఞానము నిండియున్నగాని, ఆంధ్రదేశము, జాతియు జీవవంతములు, వికాసములు గావు. విజ్ఞానప్రదాయినులు, విజ్ఞానభూయిష్ఠములు పత్రికలని నుడువబనిలేదు. అట్టి పత్రికలు "ఆంధ్రాంగ్ల దైనందినపత్రిక"ల కొరకు బెజవాడ ఆక్రోశించు చున్నది. ఆ శుభదినమునకై ఎదురు చూచుచున్నది. ఆంధ్రమహాజను లందరు పూనుకొనినచో నది యొక ఘనమగు పనిగాదు.

ఆంధ్రులందరును గలసి ఆంధ్రాంగ్లపత్రికాద్వయమును బెజవాడనుండి వెలువడజేయుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

## ముగింపు

శ్రీ న్యాయపతి నారాయణమూర్తిగారు 1914 సంవత్సరమున బెజవాడయందు జరిగిన ఆంధ్రదేశ గ్రంధాలయసభకు స్కూలు ఫయినలు తరగతియందు గాబోలు, విద్యాభ్యాస మొనర్చుచు వచ్చియుండిరి. అప్పటినుండి నేటిదనుక దేశసేవా నిరతులై, త్యాగమూర్తులై, అసమానమైన శక్తి సామర్థ్యములను చూపుచున్నారు. అట్టివారీ సభకు ప్రారంభకులుగ నుండుట ఎంతయు ముదావహము.

ఇక తాపీ ధర్మారావుగా రన్నచో సారస్వత సేవానిరతులు. పత్రికాలోకమున భీష్ములు. జంకు గొంకులు లేకుండ "కాగడా" చేతనిడుకొని మార్గదర్శకులగు వారి యధ్యక్షతక్రింద ఈ సభ జయప్రదముగ జరుగు ననుటకు సందియము లేదు.

వీరి యాధ్వర్యమున నేను పై జెప్పిన యంశములన్నియు యోచించి, యుక్తమగు విధమున తీర్మానించి, "ఆంధ్ర రాష్ట్రీయ సంపాదక సంఘమును" బ్రతిష్ఠించ వలయునని కోరుచున్నాను.



# గ్రంథాలయములు - విదేశములు

## అమెరికా గ్రంథాలయ సంఘము

### ప్రారంభము

అమెరికాదేశ గ్రంథభాండాగార సంఘము "ఫిలడల్ఫియా" అను పట్టణమున 1876 వ సంవత్సరమున ప్రసిద్ధులగు భాండాగారాధిపతులచే సమకూర్పబడినది. ప్రథమ సంవత్సరమున ఆ సంఘమున 108 మాత్రము సభ్యులుండిరి; ఇపుడు (అనగా 1916 సంవత్సరమునకు) ఆ సభ్యుల సంఖ్య 1900 వరకు పెరిగినది. ప్రాథమిక దశయందా సంఘముయొక్క వృత్తాంతము లన్నియు "లైబ్రేరియను" పత్రికయందు బ్రకటింపబడుచుండెను. 1907 వ సంవత్సరమునందా సంఘమువారు ప్రత్యేక మొక పత్రికను ప్రకటింప నారంభించిరి.

### ఉద్దేశములు

గ్రంథాలయ ప్రయోజనముల నాలోచించుటయు, పరస్పరము అభిప్రాయములను అనుభవములను వెల్లడించుకొనుటయు, గ్రంథాలయముల కొరకు ఉపయోగించుచున్న శ్రమను, ద్రవ్యమును ఎక్కువ ఉపయోగకరముగ వినియోగించునటుల జేయుటయు, పుస్తక శాలాధిపత్యమును వృత్తిగ నభివృద్ధి జేయుటయు, ఈ సంఘముయొక్క ముఖ్యోద్దేశములై యున్నవి.

ప్రత్యేక మొక వ్యక్తివలన కాజాలని సంస్కరణములను, అభివృద్ధులను, సంఘముగా జేరుటవలన గలిగెడు బలమువలన సాధించుటయు- అందరును కలసి పనిచేయుటవలన గ్రంథాలయమునకు వినియోగమగు శ్రమను,ద్రవ్యమును తగ్గించుటయు- కష్ట విషయములను తీర్మానించుటకుగాను వివిధ శోధనలను, అనుభవములను పోల్చుకొని

చర్చించుటయు, సభల మూలమునను, ఉత్తర ప్రత్యుత్తరముల మూలమునను పరిచయమును, స్నేహభావమును అభివృద్ధి జేసికొను టయుగూడ ఈ సంఘముయొక్క యభిప్రాయములై యున్నవి.

ఈ ప్రకారము సార్వజనిక గ్రంథాలయము విద్యావిధానము నందు ప్రధాన భాగముగ వికసించి పెంపొందుటకు వలయు అను భవైకవేద్యములగు మార్గముల నన్నిటిని ఈ సంఘము వెదకు చుండును. కొన్ని స్థలములందు సాంఘికుల ప్రత్యేక ప్రయత్నముల వలనను, మరికొన్ని స్థలములందు కొందరుగూడి ప్రయత్నించుట వలనను, గ్రంథాలయముల స్థాపించుటకుగాని, అభివృద్ధిజేయుటకుగాని ఈ సంఘము పాటుబడుచుండును. తద్ద్వారా ఉత్తమంబగు విద్య సర్వజనులకును సులభసాధ్యమగునటుల జేయును. పుస్తక శాలాధి కారులును, గ్రంథాలయోద్యమమునందు అభిమానముగల వారంద రును ఈ సంఘమునందు సభ్యులుగ జేరవచ్చును.

## సంయుక్త రాష్ట్రభాండాగార సంఘము

అమెరికాదేశ గ్రంథభాండాగార సంఘముయొక్క స్థాపన మనేకదేశములయొక్క దృష్టి నాకర్షించినది. అందుచేత ఇంగ్లాండు దేశమునకు రాజధాని నగరంబగు "లండను" పట్టణమున 1879 వ సంవత్సరమున "అమెరికా" "ఇంగ్లాండు" దేశముల పుస్తక శాలాధి కారులందరును గలసి సమావేశమై "సంయుక్త రాష్ట్రభాండాగార సంఘము"ను ఏర్పాటు గావించిరి.

## అమెరికాలోని వివిధ గ్రంథాలయ సంఘములు

అమెరికా ఖండమునందు "రాజధాని సంఘము"లునుగలవు. "అమెరికాదేశ గ్రంథభాండాగార సంఘము" దేశమున కంతకును ఎట్టి లాభమును జేకూర్చుచున్నదియో యట్టి లాభమునే "రాజధాని సంఘములు" తమతమ రాజధానులకును జేయుచున్నవి. కుగ్రామ ముల యందున్న గ్రంథశాలాధికారులు "అమెరికాదేశ గ్రంథ భాండాగార సంఘముయొక్క సభలకు బోవుట కష్టసాధ్యముగా

నుండును. కాబట్టి అట్టివారు "రాజధాని సంఘము" యొక్క సభలకు బోయెదరు. ఇట్టి రాజధాని సంఘము లాదేశమున ముప్పదియారు గలవు.

చదువరులారా ! ఇంతటితో ఇట్టి సంఘములకు మితియుండునని మీరు తలంచితి రేని అట్టి యూహ సత్యమునకు దూరమై యుండును. ఒక్క పట్టణము నందుండు వివిధ గ్రంథభాండాగారముల వారుగాని, చుట్టుప్రక్కలనుండు గ్రామముల గ్రంథభాండాగారములు గాని, కూడి ఎక్కడి కక్కడికి, గ్రంథభాండాగార సమాజముల నేర్పరుచుకొనెదరు. ఈ సమాజములవలన వివిధ భాండాగారములవారు పరస్పర పరిచయము నభివృద్ధి జేసికొని తమకు సంబంధించిన విషయములనుగూర్చి చర్చించుకొనెదరు. మరియు విద్యాధికులను రప్పించి వారి యుపన్యాసములను వినెదరు. ఇట్టి సమాజములలో కొన్ని గ్రంథవిషయ విభజనమునందును, ఇతర విషయములందునుగూడ అమూల్యమగు పనిని సల్పినవి. గొప్ప గ్రంథాలయములందలి ఉద్యోగస్థు లందరును గూడి "ఉద్యోగస్థుల సమాజము"ల నేర్పరచుకొందురు. సమాజములకును వీనికిని స్వల్పభేద ముండునప్పటికిని, వీరును - వారు జేయు పనినే సలుపుచుందురు. వీరి సభలకు ఇతర పెద్దమనుష్యులను గూడ నాహ్వానించెదరు.

ఇంతియేగాక "గ్రంథాలయ సంఘములు"గూడ గలవు. ఇవి ఆ యా పట్టణములకు సంబంధించి మాత్రముండును. కావలసిన విషయములను ఇతర స్థలములకుబోయి నేర్చుకొనుటకుగాని మహాజన సభలకు బోవుటకుగాని, కాలమును ద్రవ్యమును వినియోగించలేని వారందరికిని ఈ సంఘములు అత్యంతోప యుక్తములు.

**గ్రంథాలయ సర్వస్వము; సంపుటము 1; సంచిక 1; 19.6.**



# అమెరికా - గ్రంథాలయ ప్రదర్శనము

"శాన్ ఫ్రాన్సిస్కో" నగరమున 1915 వ సంవత్సరమున జరిగిన "పెనామా పసిఫిక్ ఎక్స్‌పొజిషన్" నందు అమెరికా దేశ గ్రంథాలయ సంఘమువారు "గ్రంథాలయ ప్రదర్శనము" నేర్పాటు జేసిరి.

అందు "క్యాలిఫోర్నియా" రాష్ట్రమున గల గ్రంథాలయ నిర్వాహణ పద్ధతిని జూపు గొప్ప "పటము" నొకదానిని తయారు జేసి ప్రదర్శించిరి. ఇది నలుబది అడుగులు ఎత్తునుగలిగి గోడయంతయు నాక్రమించినది. ఆ రాష్ట్ర మంతటను జరుగుచున్న గ్రామ గ్రంథాలయముల కార్యక్రమపద్ధతి యంతయు నందుజూడ నగును.

### బా ల శా ఖ

ఈ ప్రదర్శనమునందు జూపబడిన "బాలశాఖ" మిక్కిలి హృదయాకర్షకమైనది. చిన్నపిల్లలకు హృదయాకర్షకముగ నుండిన బొమ్మల పుస్తకములను ముందుభాగమునం దుంచిరి. వానికి తరువాత వరుసగనున్న ఏడుమంచెల యందు బాలురలో పిన్నవారికిని, పెద్ద వారికిని (వయోనుగుణముగ) ఉపయుక్తములగు గ్రంథముల ప్రదర్శించిరి. వారికి ప్రత్యేకము అనువుగనుండునట్టి కుర్చీలు, బెంచీలు మొదలగునవి కూడ ఏర్పాటు చేయబడినవి. ప్రతిదినమును పిల్లల యొక్క తలిదండ్రులు, సోదరసోదరీ మణులు, బంధువులు మొదలగు వారందరును ఆ ప్రదర్శనమునకు విచ్చేసి, సద్గ్రంథ సేకరణము-గ్రంథాలయము లెట్లు సమీకరించి అందరికిని ఎట్లు అందజేయుచున్నవో కనులార గాంచగలిగిరి.

బాలశాఖలు. భాండాగారులు పిల్లలకు కథలుచెప్పు దృశ్యములు, మొదలగు నితర కార్యక్రమముల యొక్కయు, "ఫొటోగ్రాఫులు" గోడలమీద అలంకరింపబడి యున్నవి. పాఠశాలలకు గ్రంథాలయము లెటుల ఉపకరింప వలయునో అచట జూపబడినది. ఈ పటముల ప్రదర్శనము జనులను అమితముగ ఆకర్షించినది.

## కేంద్ర గ్రంథాలయ శాఖలు

ఆదర్శప్రాయముగ దీసికొనదగిన యొక పట్టణమునందు కేంద్ర గ్రంథాలయ శాఖలయొక్క పద్ధతులు ఎటుల నిర్వహింపబడు చున్నవియో మరియొక పటమునందు జూపబడినవి. ఇంకొక పటము నందు శాఖలుచేయుచున్న పనిని జూపు ప్రత్యేకమైన "ఫొటో గ్రాపు" లను వాని ప్రక్కనే ప్రదర్శించిరి. గొప్ప గొప్ప పట్టణముల యందు నివసించు జనులుగూడ తమతమ పట్టణముల యందున్న కేంద్ర గ్రంథాలయములు, వానిశాఖల సహాయమువలన ఎట్టి ఘన కార్యములను నిర్వహించుచున్నవియు నీ ప్రదర్శనమున ప్రత్యక్ష ముగ జూచి ఆశ్చర్యమగ్న మానసులైరి.

## సర్వులకు గ్రంథాలయము

ఇతర ప్రదేశములనుండి తమ గ్రామములకు వచ్చువారలకు, గ్రుడ్డివారలకు, కళావేత్తలకు, సంగీతప్రియులకు, వర్తకులకు, వివిధ తరగతుల విద్యార్థులకు - వారు వీరననేల - సర్వజనులకు గ్రంథా లయము లెటుల ఉపకరించుచున్నవో వేరొకచో ప్రత్యేకముగ ప్రదర్శింపబడినది.

## గ్రామ గ్రంథాలయములు

ఇంకొక భాగమునందు వివిధములైన గ్రామ గ్రంథాలయ ములు జూపబడినవి. 'కాలిఫోర్నియా' రాష్ట్రమున గ్రంథాలయములు చేయుచున్న పనిని "సినిమెటోగ్రాపు" యంత్రమూలమున గూడ ప్రదర్శించిరి.

## శాస్త్ర గ్రంథములు

మరియొక ప్రదర్శనమునందు - గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించిన పుస్తకములు పత్రికలకు మితమేలేదు. గ్రంథసేకరణము, వర్గీకరణముచేయుట, బైండింగు చేయుట- మొదలగువానిని గూర్చి చూపరుల కనేక విధములగు విషయములను ప్రదర్శించిరి.

## గ్రంథాలయ భవనములు

అమెరికా కాంగ్రెసు మహాగ్రంథాలయము మొదలు

న్యూయార్కు పౌర గ్రంథాలయ భవనము వరకును - తారతమ్యములను జూపు వివిధ తరగతుల గ్రంథాలయ భవనముల "ప్లానులను" ఫొటోగ్రాపులను పరిదర్శించిరి. నూతన గ్రంథాలయములను నిర్మింప దలచుకొనిన అనేకులకు ఈ పటములు సహాయభూతము లైనవి.

## గ్రంథాలయ శాస్త్రబోధక పాఠశాలలు

వివిధ ప్రదేశములందున్న, గ్రంథాలయశాస్త్రమును బోధించు పాఠశాలల యొక్క కార్యక్రమము వేరొకచో పరిదర్శించిరి. ఆయా పాఠశాలల పటములను, పట్టికలను, కొన్ని పరీక్షాపత్రములను పరిదర్శించిరి. న్యాయశాస్త్రము, వైద్యశాస్త్రము, మొదలగువాని వలెనే గ్రంథాలయశాస్త్రము నందు గూడ పండితులై జనుల కుపకరించుటకు, ప్రత్యేకముగ శిక్షణము అత్యంతావశ్యకమని ఈ పరిదర్శన భాగమును జూచుటవలన జనులకు బోధపడినది.

ఇంకొక స్థలమునందు అమెరికా దేశ గ్రంథాలయ సంఘమువారు గ్రంథాలయములకు సంబంధించిన విషయములను గూర్చి ప్రకటించిన గ్రంథముల నన్నింటిని పరిదర్శించిరి. ఈ పరిదర్శనమును జూచుటకై 50, 000 మంది జనులు విచ్చేసిరి. ఈ పరిదర్శనమును జూచివచ్చి అందలి సంగతులను తమతమ దేశములందు వ్యాప్తము జేయుటకై చైనా, స్పెయిన్, స్వీడను, జపాను, ఇండియా - దేశములనుండి ప్రత్యేక ప్రతినిధులీ పరిదర్శనమునకు బంపబడిరి ఈ ప్రతినిధులందరును పరిదర్శనమును జూచి, దానిని గూర్చి విపులముగ తమతమ భాషలయందు పత్రికలలో ప్రచురించి, ఆయా దేశములందెల్ల ఈ విషయమును గురించి వ్యాప్తమొనర్చిరి.

ఈ విధముగ ఈ పరిదర్శనము అమితముగ ఉపయోగకారి అయ్యెను.

గ్రంథాలయసర్వస్వము - సంపుటము -2. సంచిక -2.- 1917-



# పిల్లల గ్రంథాలయములు
# గ్రామ జీవితమునందలి మార్పు

అమెరికాదేశమందు "శ్యారీఫారము" అను ప్రదేశము నకు చుట్టుప్రక్కల అనేక మైళ్ళలో గ్రంథాలయ మెద్దియును లేదు. అందుచే నా ప్రదేశమందున్న పిల్లలు తీరిక సమయములందు తమకు తోచిన పాత ఆటలనైన ఆడుకొనవలెను; లేక దగ్గరలోనున్న పట్టణ "సినిమాలకైన" బోవలెను. అచట నున్న పిల్లలలో చాలమంది పొలములలో వ్యవసాయముజేసికొను రైతులబిడ్డలు. వారందరును జ్ఞాన సముపార్జ నాసక్తులగు తెలివి, చురుకు, గల పిల్లలు.

## గ్రంథాలయ ప్రారంభోత్సవము

ఆ ప్రదేశమందు కోడిపిల్లల కొఱకై పూర్వమెపుడో రాతితో కట్టబడిన రమ్యమైన చిన్నఇలు ఒకటి కలదు. కొంతకాల మాయిల్లు చిత్రపటములను గీసికొను వారుపయోగించు కొనుచుండిరి. ఇపు డచట నాపనియు జరుగుటలేదు. అందుచే బాలబాలికలందరు కలసి ఆ యింటిని గ్రామ గ్రంథాలయముగ మార్చిన బాగుండునని తలంచిరి.

వెంటనే ఒకబల్ల, కొన్నికుర్చీలు — కిటికీలకు తెరలు— అమర్చ బడెను. ఆయింటియందున్న అలమరలలో నాకర్షకములైన బాలల గ్రంథము లమర్చబడెను. ఆ ప్రదేశమంతయు పటములచే నలంకరింప బడెను. అందు జేసిన యేర్పాట్లన్నియు పిల్లలను ఆకర్షించునవిగను వారితృష్ణను సంతృప్తి పరచునవిగ నుండెను.

ప్రారంభోత్సవమున కాప్రదేశమందలి బాలబాలిక లందరును ఆహ్వానింపబడిరి. ప్రప్రథమమున పిల్లలకు ఒకగంటసేపు కథలు చెప్పిరి. తర్వాత ఆటలు — ఫలహారములు — గ్రంథాలయ ప్రయోజన మంతయు వారికి వివరింపబడినది. తుదకు పిల్లలందరు తలకొకపుస్తక మును దీసికొని ఇండ్లకుబోయిరి.

## ఆచరణ విధానము

ఆ గ్రంథాలయమున బాలలెవ్వరైన సభ్యులు గాదలచినయెడల సభ్యుల పట్టికయందు సంతకము జేసిన చాలును. వానికి ప్రథమమున గ్రంథాలయ నిబంధనలు వివరింపబడును. అచటి గ్రంథములన్నియు విషయములను బట్టి వర్గీకరణము చేయబడినవి. ప్రతి గ్రంథము నందును ఒక కార్డును, చీటీయును గలవు. వానిమీద ఆగ్రంథము ఎన్నిదినములలో వాపసు చేయవలసి యుండునో సూచింపబడి యుండును. పిల్లలెవ్వరైన గ్రంథాలయము నుండి ఇంటికి గ్రంథమును తీసికొని పోవునపుడు పెద్దవారెవరును తనఖీచేయుట యనునది లేదు. వారు గ్రంథములను ఎరువుతీసికొని పోవునపుడు "కార్డు" మీద సంతకము జేసి, నియమితమైన చిన్న డ్రాయరునందు దానినుంచెదరు. ఆ డ్రాయరు ప్రక్కనే తారీకులను దెలుపు "క్యాలెండరు" వ్రేలాడ గట్టబడి యుండును. పుస్తకమును వాపసుచేయవలసిన తారీకును దానిలో జూచుకొని, పిల్లలే ఆతారీకును వ్రాయవలసిన చోట వ్రాయుదురు.ఇదియంతయు,ఏ తనిఖీయును లేకనే జరిగిపోవుచుండును. ఈ విధముగ ఏపారబాట్లును లేకుండగనే కార్యక్రమమంతయు జరిగి పోవును. గ్రంథములు కనబడకుండ పోవుటగాని, వానిస్థానమునం దుండక మార్పుగాని ఎప్పుడుగాని జరుగదు — కలుగదు. పిల్లల నిత్య జీవితమున గ్రంథాలయమొక భాగమైనది.

ప్రతిదినమును బాలబాలికలు గ్రంథాలయమున కరుదెంచి అంతకుపూర్వము తీసికొనిపోయిన గ్రంథములను వాపసుజేసి క్రొత్త గ్రంథములను మరల దీసికొనిపోవుచుందురు. కొందరు పిల్లలు గ్రంథాలయమునకు రావలెనన్న రెండుమూడుమైళ్ళ దూరమునుండి రావలసియుండును. అయినను శ్రమయని దలపక వారరుదెంచు చుండెదరు. అయిదులేక ఆరు సంవత్సరములు వయస్సుగలిగిన వారు గూడ వారివారి సోదరసోదరీ మణులతో గ్రంథాలయమునకు అరు దెంచి ఆకర్షకమైన చిత్రపటములు గల గ్రంథలమును జూచి చూచి ఆప్యాయతతో తుదకొక పుస్తకమును తీసికొని తమ చంకల యందు

అదిమిపెట్టికొని ఇంటికి గొనిపోయెదరు. కొందరు బాలురు సిగ్గు బిడియములు కలిగియుందురు. కొందరు మోటువారిన పిల్లలుందురు. ఈ రెండురకములయిన వారు— వీరననేల— అందరును ఆ గ్రంథాలయమున కరుదెంచి పుస్తకముల నెగవుదీసికొని పోవుట ఆశ్చర్యకరముగను, ముదావహముగను నుండును.

## విచిత్ర సన్నివేశము

ఒకనాడొక విచిత్రమైన సన్నివేశము జరిగినది. ఆ గ్రంథాలయమున కొక బాలికవచ్చి "మా అన్నయ్యకొక పుస్తకము నిచ్చెదరా" అని భాండాగారి నడిగెను. ఆ అన్నయ్యకు అతని వయస్సును బట్టి గ్రంథము నేరి ఇచ్చు నిమిత్తమై "అతనివయస్సు ఎంత" అని భాండాగారి ప్రశ్నించెను. దానికా బాలిక "మాఅన్నయ్య చాల పెద్దవాడు. సుమారు ఇరువది సంవత్సరములుండును" అనెను. అపుడా భాండాగారి "వయసునకు" అనువైన నొక గ్రంథము నాబాలికకు నిచ్చెను. వారము దినములయిన తరువాత నాబాలిక తీసికొని పోయినగ్రంథమును వాపసు తెచ్చియిచ్చెను. "పుస్తకము బాగున్నది – తిరిగి ఇంకొక పుస్తకము తీసికొని రమ్మనినాడు" అన్నయ్య— అని భాండాగారితో చెప్పి మరియొక పుస్తకమును తీసికొని వెళ్ళినది.

## దినదిన ప్రవర్ధమానమైనది

ఈ పిల్లల గ్రంథాలయము ప్రథమమున కొన్నివందల పుస్తకములతో ప్రారంభింపబడినది. ఆసంఖ్య దినదిన ప్రవర్ధమానమైనది. ఈ యుద్యమమును గూర్చి విన్న స్నేహితులందరును అనేక గ్రంథములను పంపి తోడ్పడిరి. 'ఫిలడల్ఫియా' యందలి ఒక ప్రయివేటు పాఠశాలయందలి విద్యార్థులనేక గ్రంథములను దానమొసర్చి సహాయపడిరి.

వేసవికాలపు సెలవుదినములలో ఈ గ్రంథాలయము మూత తెరపిలేకుండ పనిచేయును. ఈ విధముగ ఆ ప్రదేశమందలి బాలబాలికల

జీవితమునందీ గ్రంథాలయము అద్భుతమగు మార్పును కలిగించి ఉత్తేజపరచినదని చెప్పవచ్చును.

గ్రంథాలయ సర్వస్వము, సంపుటము 9, సంచిక 2 1934

---

# జర్మనీ గ్రంథాలయములు-అన్యోన్యాశ్రయము

## "ఏకాదశ" గ్రంథాలయములు

జర్మనీ దేశమందు "ప్రష్యా" అను రాజ్యము కలదు. ఆ రాజ్యమునందు గల "విశ్వవిద్యాలయము" లు పదింటియందును, "రాజమందిరము నందు"ను, కలసి పదునొకండు గొప్ప గ్రంథాలయములు గలవు. ఆ గ్రంథాలయము లన్నియు ఒకే విద్యామంత్రి యొక్క పరిపాలనక్రింద నున్నవి. ఆ గ్రంథాలయోద్యోగు లందరికిని ఒకే విధముగ జీతము లీయబడును. వారంద రొకేవిధముగ తరిబీతును బొందియుండిరి. ఈ గ్రంథాలయోద్యోగు లందరును ఒక గ్రంథాలయమునుండి మరియొక గ్రంథాలయమునకు బదిలీ చేయబడు చుందురు.

## గ్రంథవిభజన పట్టికలు

ఆ గ్రంథాలయములందలి గ్రంథముల పట్టికలన్నియు ఒకే నిబంధనల ననుసరించి తయారుచేయబడినవి. ఆ గ్రంథాలయము లందలి నూతన గ్రంథముల పేర్లన్నియు ఒకే ప్రచురణమునందు ప్రచురింపబడుచుండును. అన్ని గ్రంథాలయములందుగల గ్రంథము లన్నింటికిని కలిపి గ్రంథముల పట్టిక నొకదానిని తయారుచేసిరి.

## విదేశ గ్రంథములు

విదేశ సారస్వత గ్రంథములను — ఈ గ్రంథాలయములు ఒక్కొక్క విషయికమైన గ్రంథములను ఒక్కొక్క గ్రంథాలయము-

కొనుచుండును. అందువలన విదేశ సారస్వత గ్రంథములన్నియు మొత్తముమీద ఏదోయొక గ్రంథాలయమందు కాన్పించును.

విద్యార్థి తనకు గావలసిన గ్రంథము తన గ్రామ గ్రంథాలయ మందు దొరకని యెడల, ఆ గ్రంథాలయముద్వారా తన గ్రామము నకు దగ్గరగనున్న "విశ్వవిద్యాలయము" నకుగాని "రాజభవన గ్రంథాలయము" నకుగాని ఆ గ్రంథముకొరకు వ్రాయును. అక్కడ దొరకనియెడల "ప్రచురణ సంఘము" వారికి వ్రాసి ఆ గ్రంథము ఏ యితర గ్రంథాలయమందున్నదో తెలిసికొని, ఆ గ్రంథాలయము నకు తన గ్రంథాలయముద్వారా వ్రాయును. చదువరి ఆ గ్రంథ విషయమున తన గ్రామగ్రంథాలయమునకు జవాబుదారీ వహించును. ఎరవుతీసికొను గ్రంథాలయము ఎరవునిచ్చు గ్రంథాలయము నకు జవాబుదారీ వహించును.

## ప్రచురణ సంఘము

ఏ గ్రంథమైనను, జర్మనీదేశ మందున్న ఏ గ్రంథాలయ మందున్నదో- లేక విదేశము లందున్న ఏగ్రంథాలయమందున్నదో తెలిసికొని ఆ గ్రంథవిషయమును గోరినవారికి తెలుపుటయే ఈ సంఘ మునయొక్క కర్తవ్యము. ఏ పుస్తక విషయమైన తెలిసిగొనగోరు వారు ఆ గ్రంథము తనకు గావలసిన కారణమును వ్రాయుచు స్వల్పముగ రుసుమును చెల్లించవలసి యుండును. ఈ ప్రచురణ సంఘము యొక్క యుపయోగమును పొందుచున్నవి. జర్మనీదేశమునందే 382 గ్రంథాలయములవరకు గలవు. ఇవిగాక "ఐరోపాదేశ" మందున్న ఇతర గ్రంథాలయములుగూడ దీనియొక్క ఉపయోగమును పొందు చున్నవి.

## ప్రచురణసంఘ ప్రాధాన్యము

"ప్రష్యా" రాజ్య గ్రంథాలయ గ్రంథములయొక్క 'పట్టిక' కును ఈ ప్రచురణ సంఘమునకును విశేషమైన సంబంధము కలదు. ఈ రెండును రాజమందిర గ్రంథాలయముతోగూడ విశేష సంబంధ

మును గలిగియున్నవి. ఈ సంఘ కార్యాలయమందు 1,283,000 "కార్డుల" మీద వ్రాయబడిన గొప్ప గ్రంథముల పట్టిక కలదు. అందు పదకొండు "ప్రష్యా రాజ్య" గ్రంథాలయములందుగల గ్రంథములనుగూర్చియు విపులముగ వ్రాయబడియుండును. అదియుగాక ఆ దేశమందుగల ఇతర గ్రంధాలయములందుగల పట్టికలుగూడ సిద్ధముగ నుండును.జర్మనీదేశమందలి ముఖ్య గ్రంథాలయములందు గల 16,000 పత్రికలయొక్క పట్టికనుగూడ ఈ సంఘమువారు తయారు చేసినారు.

ఏ పుస్తకమును గూర్చియైన విచారణ వచ్చినపుడు ఆ గ్రంథమునుగూర్చి కార్డులమీద వ్రాసి, అన్ని గ్రంధాలయములకును బంపెదరు. ఆ గ్రంథము తమయొద్దనున్నచో గ్రంధాలయము వారు ఆ కార్డు మీద ఆ గ్రంథము తమయొద్ద గలదని వ్రాసి, తిరిగి ప్రచురణ సంఘమునకు బంపెదరు.ఈ రీతిగ విచారణకొరకు వచ్చిన గ్రంథవిషయము తేలిన పిమ్మట, ఆ ఫలితము గ్రంధస్థము చేయబడును.

## గ్రంథములను ఎరవు తీసికొనుట

ఈ ప్రచురణ సంఘమునకు చెందిన గ్రంధాలయములు 400 గలవు. ఈ సంఖ్య దినదినమును అభివృద్ధి చెందుచున్నది. ఈసంఖ్యలో ముప్పాతిక భాగము "పాఠశాలలకు" చెందిన గ్రంధాలయములే.

వ్రాత గ్రంథపతులు, అమూల్యములైన ముద్రిత గ్రంధములు ఎరువు ఇవ్వబడవు. మొత్తముమీద గ్రంథములన్నియు మూడు వారముల కాలము ఎరువు ఇవ్వబడును. పత్రికలు,కరపత్రములు, మొదలైనవి ఒకవారమునకు మాత్రమే ఇవ్వబడును. ఎరువునకు తీసికొను గ్రంధాలయము ఎరువునిచ్చు గ్రంధాలయమునకు జవాబు దారీయై యుండును.ఎరువుతీసికొను గ్రంథాలయము తన చదువరులకు కావలసిన నిబంధనలను ప్రత్యేక మేర్పరచు కొనును.

ప్రష్యారాజ్యమందుగల పదునొకండు పెద్ద గ్రంథాలయము లందును సభ్యులు తాము మామూలుగా ఇచ్చు చందాలుగాక,

తీసికొను ప్రతి పుస్తకమునకు వేరుగ ప్రత్యేకము చందా నివ్వవలసి యుండును. ఆ తీసుకొను పుస్తకమే ఇతర గ్రంథాలయమునుండి తెప్పించి ఇయ్యవలసి యుండిన రుసుము కొంచెము ఎక్కువ యుండును. ఆ రుసుములో కొంతభాగము గ్రంథమును ఎరవునిచ్చు గ్రంథాలయమునకు జెందును.

ఈ విధముగ నింకను అవసరమగు నేర్పాట్లను గూడ గ్రంథాలయములు పరస్పరము జేసికొనుచుండును.

గ్రంథాలయ సర్వస్వము : సంపుటము–6– సంచిక– 6–1925.

---

# జాతీయ కేంద్రగ్రంథాలయము - లండను

## ఎరవు ఇచ్చుట - తెచ్చుకొనుట- ఆవశ్యకత

ప్రపంచము నందలి పుస్తక సముదాయము అనంతము. అందుచేత ఎంత గొప్ప గ్రంథాలయ మైనను అన్ని పుస్తకములను కలిగి యుండుట అసాధ్యము. ప్రపంచము నందంతటను మూడువందలఇరవై లక్షల వివిధ రకములైన గ్రంథములు గలవని అంచనా వేయబడినది. ప్రపంచము నందంతటను గొప్ప గ్రంథాలయమగు "బ్రిటిషు మ్యూజియం" గ్రంథాలయమునందు నలభై లక్షల గ్రంథములు మాత్రమే గలవు. ఇక మిగిలిన చిన్న గ్రంథాలయము లందలి గ్రంథముల సంఖ్య చెప్ప నావశ్యకతయే లేదు. ఇక ప్రతి సంవత్సరము తయారగుచున్న క్రొత్త పుస్తకముల సంఖ్య అపరిమితముగదా! ఒకే ఒక గ్రంథాలయము వానినన్నటిని సేకరించి, సమకూర్చి యుండజాలదనుటలో నాశ్చర్యములేదు.

ప్రతి మనుజుని యొద్దను కొన్ని గ్రంథములున్నను అవి చాలని నాడు గ్రంథాలయమునుండి అతడు గ్రంథముల నెరవు దెచ్చుకొనును. అట్లె గ్రంథాలయములుగూడ, తమయొద్దలేని గ్రంథము

లను ఇతర గ్రంథాలయములయొద్దనుండి ఎరువు తెచ్చుకొనుటయును, ఇతర గ్రంథాలయములలోలేని గ్రంథములను తమ గ్రంథాలయము నుండి ఎరువు ఇచ్చుటయును ఆవశ్యకమును ఆచారమును నైనది.

## జాతీయ కేంద్ర గ్రంథాలయ పద్ధతి

లండను నగరమునగల జాతీయ కేంద్ర గ్రంథాలయము నందు 1,00,000 గ్రంథములు గలవు. ఇవిగాక, ఈ గ్రంథాలయ మందు లభ్యముకాని — పది లక్షల గ్రంథములు - ఇతర వివిధ గ్రంథాలయములందున్న వానిని వివరించు నిఘంటు పద్ధతిని తయారు జేయబడిన "గ్రంథముల జాబితాలు" కూడ నిందుగలవు. ఆ దేశము నందున్న ముఖ్యమైన గ్రంథాలయము లన్నియు దీనికి శాఖలుగ — ఇందు సభ్యత్వమును స్వీకరించినవి అందుచే శాఖా గ్రంథాలయము లందున్నట్టిగాని కేంద్ర గ్రంథాలయము నందున్నట్టిగాని గ్రంథము లను పరస్పరము ఎరువు తెచ్చుకొనుచుందురు.

## శాఖా గ్రంథాలయములు

ఇట్టివానిలో ప్రధానమైనవి నూటముప్పది గ్రంథాలయములు గలవు. విశ్వవిద్యాలయ గ్రంథాలయములు-ఇంకను ప్రత్యేక విషయము లనుగూర్చి యేర్పడిన గ్రంథాలయములు-అన్నియు ఈ కేంద్రగ్రంథా లయము ద్వారానే పరస్పరము ఎరువు నిచ్చుటయును ఎరువు తెచ్చు కొనుటయు జేయుచుండును; దేశమంతయు 32 తాలూకాలు (Countries, గాను, అయిదు జిల్లాలు (Regions) గాను విభజింప బడినవి. ప్రతిజిల్లాకును జిల్లా గ్రంథాయమును, తాలూకాకు తాలూకా గ్రంథాలయమును గలవు. ఇవన్నియు జాతీయ కేంద్రగ్రంథాయము నకు శాఖలే.

## చదువరికి పుస్తకము లభించు పద్ధతి

ఇంగ్లాండు, వేల్సు దేశముల, యందున్న మొత్తము జనాభాలో నూటికి 97 మంది గ్రంథాలయముల యొక్క అందుబాటులోననే నివ సించి యుందురు. ఎవరికైన నే పుస్తకము కావలసినను తమకు దగ్గర

నున్న గ్రంథాలయమునకు బోయి అక్కడ ఆ గ్రంథమున్న యెడల దీసికొందురు; అక్కడ కావలసిన గ్రంథము లేనిచో ఆ గ్రంథాలయముద్వారా కేంద్రగ్రంథాలయమునుండి ఆ గ్రంథమును ఎరవు తెప్పించుకొని చదువుకొనెదరు.

జాతీయ కేంద్రగ్రంథాలయమునకు పుస్తకములకై ప్రతిదినము 200 మొదలు 400 వరకు దరఖాస్తులు వచ్చుచుండును. కేంద్ర గ్రంథాలయమందుగూడ కావలసిన గ్రంథము లేనపుడు తమ దగ్గిర నున్న "నిఘంటు గ్రంథ వివరణ పట్టిక"లో ముందు జూచి ఆగ్రంథమే గ్రంథాలయమందున్నదియు తెలిసికొని అక్కడనుండి సేకరించి,వలసిన వారికి సప్లయిచేయుదురు. ఒక్కొకపుడు ఆ పట్టికలయందుగూడ వలసిన గ్రంథము దొరకని యెడల ఇతర దేశ గ్రంథాలయములకు గూడవ్రాసి దాని వివరములను సంపాదించి గ్రంథమును సేకరించెదరు.

## 'చౌక రకపు' పుస్తకములు

నవలలు మొదలగు 'చౌకరకపు' పుస్తకములను కేంద్రగ్రంథాలయము సప్లయి చేయదు. ఉపయుక్తమైన విషయములను గురించిన గొప్ప గ్రంథమునైనను - చిన్నగ్రంథమునైనను సప్లయిచేయును.

## పత్రికలలోని "కత్తిరింపులు"

ఇంతేకాదు, పుస్తకములనేగాక ఆ యా విషయములనుగురించి వ్రాయబడిన పత్రికలలోని వ్యాసములను గూర్చిన వివరములనుగూడ ఈ కేంద్రగ్రంథాలయము సేకరించిపెట్టును. సాధారణముగ గ్రంథములను ఒక నెలవరకు ఎరవు ఇచ్చెదరు. ఆ కాలములోపలనే ఇతరు లెవ్వరును ఆ గ్రంథముకొరకు దరఖాస్తు చేయనియెడల ఒకరా గ్రంథమును వినియోగించుకొనదగిన కాలమును పొడిగించవచ్చును. గ్రంథమును ఎరవు నిచ్చుటకుగాని, ఏ విషయములనుగూర్చియైన వివరములను దెలుపుటకుగాని రుసుము నేమియు పుచ్చుకొనరు.ఇతర గ్రంథా

ములనుండి పుస్తకములను ఎరవు తెప్పించవలసి వచ్చునప్పుడు కొన్ని గ్రంథాలయములవారు అందులకగు పోస్టు ఖర్చులను దీసికొందురు. కొన్ని గ్రంథాలయములా ఖర్చులో సగముమాత్రము దీసుకొందురు. మరికొన్ని గ్రంథాలయము లసలే దీసికొనరు. కేంద్ర గ్రంథాలయమునకగు ఖర్చులు - పుస్తకములు కొనుటకుగాక- సంవత్సరమునకు ఒకలక్ష రూపాయలు.

గ్రంథాలయ సర్వస్వము : సంపుటము 10- సంచిక 3- జూన్ 1936 సం॥

---

# డెర్బీషైర్ - జిల్లా గ్రంథాలయ సేవ

ఇంగ్లండు దేశములో 'డెర్బీషైరు' అనునది ఒక జిల్లా. 'కార్నెజీ యునైటెడ్ కింగడం ట్రస్టు' వారు జిల్లా విద్యాశాఖాధికారితో చేసిన సంప్రదింపుల ఫలితముగ ఈ జిల్లాలో గ్రంథాలయ సేవ ౧౯౨౪ వ సంవత్సరమున ప్రారంభింపబడెను. ప్రారంభమున ఈ జిల్లాలోని నాలుగులక్షల జనాభాకు తగిన గ్రంథములుగాని, భవనములుగాని లేవు. ఇప్పుడు ప్రతి పల్లెయందును, పట్టణమందును గ్రంథాలయ సేవ సాగుచున్నది. ౧౯౨౪ వ సంవత్సరాంతమునకు ౮౦౦౦ గ్రంథములు మాత్రము ఉపయోగింపబడెను. అట్టిస్థితి మారి ౧౯౩౫-౩౬ సంవత్సరాంతమునకు ౨౧,౦౦,౭౩౭ గ్రంథము లుపయోగింపబడెను. విరివిగా గ్రంథాలయసేవ సాగుటకుగాను, ఈ జిల్లాయందలి కొంత భాగమును మూడు ప్రాంతములుగా విభజించి, మూడు ప్రాంతీయ గ్రంథాలయములను స్థాపించి, మిగిలిన గ్రంథాలయములను వానికి శాఖలుగ ఏర్పరచిరి. ఈ సంవత్సరము నాల్గవ ప్రాంతమున మరియొకటి ఏర్పాటుపబడినది.

## గ్రామ కేంద్రములు

ఈ జిల్లాలో ప్రతి గ్రామమునందును గ్రంథాలయ మున్నది. స్థానికుల ఉత్సాహమునుబట్టి, అచటి జనసంఖ్య తక్కువైనను గ్రంథ

ములు ఎక్కువగ ఉంచబడును. కర్షకులు నివసించు ప్రదేశములలో కంటె కార్మికులు నివసించు ప్రదేశములందే ఎక్కువమంది గ్రంథములను చదువుచుండెదరు.

చిన్న గ్రామకేంద్రమునందుకూడ ౧౦౦ గ్రంథములకు తక్కువయున్నయెడల ఎక్కువ ఉపయోగకరముగా ఉండుటలేదు. ఇప్పటి (1936) కింకను ౧౨౮ కేంద్రములలో ఇంతకంటె తక్కువ గ్రంథములే ఉన్నవి. స్థానికముగ గ్రంథాలయమునెడల ఎక్కువ ఉత్సాహము కలిగినకొలదిని, అందలి గ్రంథములు ఎక్కువ చేయబడును. గ్రామ గ్రంథాలయము లందలి గ్రంథములు నాలుగుమాసముల కొకసారి మార్చబడును.

## 'శకట' గ్రంథాలయములు

అద్దెమోటారుబండివలన పుస్తకముల ఎరవిచ్చు పద్ధతివల్ల గ్రంథభాండాగారికిని, గ్రంథాలయమందలి చదువరులకునుకూడ కేంద్రస్థానమందలివారితో సంబంధములేకుండ పోయినది; ప్రాంతీయ గ్రంథాలయముల స్థాపనవలన ఈ ఇబ్బంది తొలగినది; కాని ఈజిల్లా యొక్క దక్షిణభాగమునను, ఆగ్నేయభాగమునుగల గ్రామగ్రంథాలయములకు గ్రంథములు కేంద్రస్థానమునుండియే పంపవలసియున్నది. ఆగ్రంథాలయములు మారుమూలలయందు కుగ్రామములలోవున్నవి. ఇట్టి స్థలములలో కొన్నింటికి గ్రంథాలయశకటములమీాద గ్రంథముల నంపుటకు ఏర్పాటు జరిగినది. కాని ఈ బండ్లు ఎక్కువ ఖరీదు కలవగుటచే ఖర్చు ఎక్కువ.

## గ్రంథాలయములు అందరికిని ఆకర్షములైనవి

క్రమముగా జనులలో ఎక్కువమంది గ్రంథాలయసేవను గుర్తించి దీని యుపయోగములను పొందుచున్నారు. సక్రమాభివృద్ధి వలన స్థిరమగు పునాది ఏర్పడినది. ఉపన్యాసములవలనను, పుస్తకముల పట్టికలు, నివేదికలు, ప్రకటించుటవలనను, ప్రదర్శనముల నేర్పరచుటవలనను, పత్రికలవలనను, ఇతరులు పెక్కు విధముల వెల్లడి

చేయుటవలనను, దేశమునందలి దశదిశల గ్రంథాలయసేవ విరివిగా వ్యాప్తము కావింపబడినది.

ఊరిచావడులు, సంస్థలు, గృహస్థులఇండ్లు మొదలగుచోట్ల గల గ్రంథాలయములుకూడ ఎంతో బాగుగా సాగుచున్నవి. ఈ విధమునకూడ గ్రంథాలయములు అందరి ఆదరణము పడయుచు గ్రామ మందలి అన్ని తరగతుల జనులను ఆకర్షించుచున్నవి.

## గ్రంథాలయ స్వచ్ఛంద సేవకులు - ఉపాధ్యాయులు

జిల్లా గ్రంథాలయసేవకు మొదట పునాది వేసినవారు పాఠశాలలందలి ఉపాధ్యాయులు. వారును ఇతరులును స్వచ్ఛందసేవకులుగా పనిచేయుటవలననే, ఈ జిల్లాయందెల్ల ఈ పదమూడు సంవత్సరముల స్వల్పకాలములో విరివిగా గ్రంథాలయసేవను వ్యాప్తి కావించుటకు వీలైనది. వీరి ఉత్సాహమును, భక్తితో కూడిన సేవయు, సఫలతకు ముఖ్యకారణములు. ప్రజలకు గ్రంథములు అందజేయుటయందును, గ్రంథములను భద్రపరచుటయందును, అవసరమైన లెక్కల నుంచుటయందును, స్థానిక గ్రంథభాండాగారికులు చేసిన సహాయము మిక్కిలి ప్రశంసనీయము. శాఖాగ్రంథాలయములందు తరిబీతుపొందిన గ్రంథభాండాగారులనే ఏర్పాటుచేసినప్పటికిని, స్వచ్ఛందసేవకుల అవసరము ఎంతమాత్రము తగ్గలేదు. అట్టివారి సహాయములేకుండ మితముగా గలిగిన నౌకరులతో ఈపని జరుగుట సాధ్యముకాదు.

## గ్రంథ సంచయము

ఈ ఉద్యమ ప్రారంభమునగల ౧౨,౯౦౦ గ్రంథములు క్రమముగ ౧౭౩,౦౩౮ అయ్యెను. ౧౯౨౩ సంవత్సరమున ఈ జిల్లాలో ౧౦ మందికి ౧ పుస్తకము చొప్పున అందియుండగా, ఇప్పుడు ప్రతి ముప్వురకు ౧ పుస్తకము చొప్పున అందుచున్నది. ఏటేట పుస్తకములసంఖ్య అభివృద్ధి చేయబడుచున్నది. ౧౯౨౭ సంవత్సరమున "ప్రభుత్వ విద్యాశాఖ"కు చెందిన "సార్వజనిక గ్రంథాలయసంఘం"

వారు జనాభాలో ప్రతి నూర్గురికి ముప్పది వంతున గ్రంథములుండుట ఆవశ్యకమని సలహానిచ్చిరి. ఇప్పటికే నూరుమందికి 38.3 వంతున గ్రంథము లున్నవి. సామాన్యముగా ప్రతి మ్యునిసిపల్ పట్టణము లోను, నూరుమంది జనులకు ఏబది పుస్తకముల వంతున ఉన్నవి. గ్రామగ్రంథాలయములకుకూడ ఇంతకు తక్కువ పుస్తకములు ఉండిన చాలవని ఈ జిల్లా గ్రంథాలయ సేవ ధ్రువపరచుచున్నది.

## సద్గ్రంథ సేవ

గ్రంథోపయోగము దినదినాభివృద్ధి గాంచుచున్నది. చదువరు లను సరియైన మార్గముల నడపుటకు గ్రంథాలయ నౌకరులు ఎక్కువ కాలమును వినియోగించుచున్నారు. ఇందుకు ఫలితముగా నవలలు మొదలయిన శృంగారరస గ్రంథములను చదువుట తగ్గినది. మంచి గ్రంథములందలి అంశములను విశదపరచినకొలదిని ఈ ఫలితము విశే షముగ కన్పట్టుచున్నది

## విద్యార్థులు - పరిశోధకశాఖ

విషయగ్రహణతృష్ణ గలిగిన చదువరులకును, విద్యార్థులకును ఈ పదమూడు సంవత్సరములలోను గ్రంథాలయములు చేసిన 'సేవ' వర్ణనాతీతము. మారుమూలలందుండు చదువరులకుకూడ హెచ్చు ఖర్చులుకూడ భరించి గ్రంథములు పోస్టులో పంపబడినవి. ఉపాధ్యా యులు, విద్యార్థులు, ముఠాలనాయకులు మొదలగువారి సహకార ములో ప్రయోజనులయందు విశేషముగ పుస్తకములను వ్యాప్తిచేయ గలిగినది.

జిల్లా గ్రంథాలయమున పుస్తకములు తక్కువగా నున్న మొదటి సంవత్సరములో అవసరమగు పుస్తకములు కొంత సొమ్ము చెల్లించి జాతీయ కేంద్రగ్రంథాలయమునుండి తెప్పించెడివారు.

## పిల్లలకు ప్రత్యేక గ్రంథసేవ

గ్రంథసేవ ప్రత్యేకముగా బాలురకు, బాలికలకు క్రమక్రమ ముగా అభివృద్ధి చేయబడుచున్నది. ౧౯౩౦ సంవత్సరమున పిల్లలకు

౨,౩౭,౦౦౦ గ్రంథముల నెరవిచ్చిరి. ఈ సంఖ్య ౧౯౩౩వ సంవత్సరమున ౩,౧౨,౦౦౦ కు పెరిగినది. ఈ శాఖయొక్క పని మిక్కిలి యుపయోగకరముగనున్నది; కాని పుస్తకముల సంఖ్య ఇంకను చాలదు. ఈ జిల్లాయందు ప్రత్యేకము పిల్లలకుపయోగము నిమిత్తము ఏర్పడిన కేంద్రములు ఇప్పటికి ౧౩౦ గలవు. ఇందులో ౧౧ సంవత్సరముల వయస్సునకు లోబడిన పిల్లలకు మాత్రమే గ్రంథముల నిచ్చుచుండెడి వారు ఇప్పుడు ఈ వయస్సు పరిమితి ౯ సంవత్సరములకు తగ్గించినారు. సగటున పిల్లవాని కొక గ్రంథము చొప్పుననైన నిచ్చి సేవచేయుటకు ఏర్పాటు చేయబడినది. ఇప్పుడు ౧౫,౮౮౩ మంది పిల్లలు గ్రంథముల నుపయోగించుచున్నారు. విశేషపరిశ్రమతో ప్రత్యేకముగ పిల్లల గ్రంథముల పట్టికలను తయారుచేసి ప్రచురించిరి. ఉపాధ్యాయులును స్థానిక గ్రంథభాండాగారులును - తక్కిన అభిమానులును, వీరి యుపయోగార్థము పెక్కు ప్రదర్శనముల నేర్పాటుచేసిరి. రాబోవు సంవత్సరమున ఏ వయస్సుగల పిల్లలకైనను పుస్తకముల నందజేయు ఏర్పాట్లు పూర్తి చేయబడినవి.

## గ్రంథముల పట్టికలు

జన సామాన్యముయొక్క దృష్టి నాకర్షించుటకును, ప్రత్యేక భోగట్టాలిచ్చి, సంతృప్తిపరుచుటకును, గ్రంథాలయమందున్న పుస్తకముల ప్రత్యేకపు పట్టికలు ఇరువదికన్న ఎక్కువ అచ్చొత్తింపబడినవి. వీనిలో కొన్ని పునర్ముద్రణముకూడ పొందినవి.

## సాంకేతిక గ్రంథముల పట్టికలు

"లాంకషైర్" జిల్లా గ్రంథాలయములతో కలసి సాంకేతిక విద్యలకు సంబంధించిన గ్రంథముల పట్టికలు కొన్ని తయారు చేయబడినవి. ఆ పట్టికలందలి గ్రంథము లేవి కావలసినను రెండు జిల్లాలవారికి లభించును.

## ప్రత్యేక గ్రంథపట్టికలు

ఇందువలన రెండు జిల్లాలవారును, తమ గ్రంథములను పరస్ప

రముగ ఎరవు ఇచ్చుకొనెదరు. ౧౯౦౦-౧౯౩౪ సంవత్సరముల మధ్య ప్రకటింపబడిన "నాటకముల పట్టికలు" ఎక్కువగ అమ్మకమగుటచే, నాటకములు ఎక్కువగ చదువబడుచున్నవని ఊహింప వచ్చును. పిల్లల కుపయుక్తమైన గ్రంథములపట్టికలలో ప్రచురణకర్తలతోడ్పాటు వలన ఆ యా గ్రంథములందలి పటములుకూడ చేర్చబడినందున, ఇవి పిల్లలను అమితముగ నాకర్షించినవి. నూతన గ్రంథముల పట్టికలు ఎప్పటికప్పుడు ప్రచురింపబడుచున్నవి.

## పారిశ్రామిక స్థలములలో శాఖలు

పదివేలకంటె ఎక్కువ జనాభాగలిగినట్టియు, ఆసక్తిగల చదువరులున్నట్టియు స్థలములయందు ప్రత్యేక గ్రంథాలయముల నుంచ వలసిన ఆవశ్యకత ౧౯౨౭ వ సంవత్సరముననే ఉదయించినది. గ్రామ కేంద్రములపద్ధతి ఇట్టి స్థలములకు వర్తింపనందున ఈ ప్రదేశములలో ప్రత్యేకముగా పన్నువిధించి, తరిబీదు పొందిన గ్రంథ భాండారికుల నియామకముతో, నవీన పట్టణ గ్రంథాలయములపద్ధతిని ప్రత్యేక గ్రంథాలయము లేర్పరుపబడినవి.

## ప్రాంతీయ గ్రంథాలయములు

అందుబాటులోనున్న స్థలములలో ప్రాంతీయ కేంద్రగ్రంథాలయమును పెట్టి, జిల్లా గ్రంథాలయమునకు బదులు అక్కడనుండియే గ్రంథములు అందుబాటులోనుండునట్లు చేసిరి. ఈ పద్ధతి ఎక్కువ ఉపయోగకరముగ నున్నది.

౧. 'స్టాప్లీ' పట్టణమున ౧౯౩౧ వ సంవత్సరమున ఈ మాదిరి ప్రాంతీయగ్రంథాలయ మొకటి స్థాపింపబడెను. ఇది పెద్ద పారిశ్రామిక కేంద్రము. ౪౮ పెద్ద గ్రంథాలయములకును ౧౬ పిల్లల గ్రంథాలయములకును ఇది జవాబుదారి. ఇందు ౩౬,౦౦౦ గ్రంథములు కలవు. ౧౯౩౩-౩౪ సంవత్సరమునందు ఈ గ్రంథాలయమునుండి ౩,౬౩,౬౨౮ గ్రంథములు ఎరవీయబడెను. తమపేరు నమోదు చేయించుకొన్న చదువరులు ౩,౦౧౪ మంది కలరు. అందు౧,౦౦

మంది "గ్రామగ్రంథాలయసేవ" అందుబాటులో లేని ప్రాంతముల వారు. ఆ ప్రదేశమునకు సరిపోవునని మొదట అంచనా వేయబడిన ౨౦,౦౦౦ గ్రంథములు చాలక మరి ౬,౦౦౦ గ్రంథములు ఉంచవలసి వచ్చెను. ఇంకను ఎక్కువగ గ్రంథముల ఆవశ్యకత కలదు.

౨. 'ఆల్ ఫ్రిటన్' శాఖా గ్రంథాలయమును కొద్దికాలము క్రిందటనే ప్రాంతీయ గ్రంథాలయముగ మార్చిరి. ఇది శాఖా గ్రంథాలయముగా నున్నప్పుడే ౯౧,౯౨౧ గ్రంథములు సంవత్సరమునకు ఎరవిచ్చుచుండెడిది ఇందు ఉన్న నవలలుకాని గ్రంథములు నూటికి ౧౮-౫ ఇది 'స్టాప్లి' ప్రదేశముకంటె ఎక్కువ జనసమ్మర్దము కలది.

౩. 'హీనర్' ప్రాంతీయ గ్రంథాలయమునందు ఈ సంవత్సరమున ౧,౯౫,౪౪౯ గ్రంథములు ఎరవీయబడినవి. ఇందు నవలలు కాని గ్రంథములు నూటికి ౨౩.

ఈ గ్రంథాలయమునందు "నాటకముల" పరిశోధనమునకుగల "ప్రత్యేక సంఘము" ౨౨ సార్లు సమావేశమయ్యెను. అందు ౩౬ మంది పాల్గొనిరి. దేశీయ, విదేశీయ నవీన నాటకములు అనేకములిందు చదువబడెను. ఈ సంవత్సరమున ఈ ప్రాంత కేంద్రములందలి గ్రంథ భాండాగారుల సభ జరిగినది. ఇట్టి సభ కూడుటకు ఇదియే ప్రథమము.

౪. 'ఛాపెల్ ఎన్ లీఫ్రిత్' అనుచోట ఈ సంవత్సరము నాల్గవ ప్రాంతీయ గ్రంథాలయము స్థాపింపబడినది. మొదటి రెండు వారములలో వెయ్యిమంది చదువరులు నమోదు కాబడిరి. ఎరవీయబడిన గ్రంథములలో నవలలుకాని గ్రంథములు నూటికి ౩౦. ఇందు బాల శాఖకూడ కలదు. ఈ పట్టణ జనాభా ౫,౬౦౦ ఈ శాఖ ౨౫,౦౦౦ జనాభాగల ముప్పది గ్రామములకు పుస్తకము లందజేయును.

ఇంకను రెండు ప్రాంతీయ గ్రంథాలయములను స్థాపింపవలసి యున్నది. అంతటితో అనుకొనిన ప్రణాళిక పూర్తి కాగలదు. ప్రాంతీయ గ్రంథాలయములలోని గ్రంథములను ఒకచోటనుండి మరియొకచోటికి మార్చుకొనవచ్చును.

## ప్రాంతీయ గ్రంథాలయముల ప్రత్యేక ప్రయోజనము

వీని స్థాపనమువలన జిల్లా కేంద్రముల పని చాల తగ్గినది. గ్రామ కేంద్రములపట్ల ఎక్కువ శ్రద్ధవహించుటకు వీలైనది. గ్రంథప్రదర్శనములకు కావలసిన పరికరము లన్నియు శాఖా గ్రంథాలయములందు సిద్ధముగ ఉండును. ప్రాంతీయ గ్రంథభాండాగారులు 3 నెలలకు ఒక తూరి కలసి గ్రంథసేవనుగూర్చి చర్చించుకొందురు.

## "కార్నిజీ యునైటెడ్ కింగ్‌డం ట్రస్టు

ఈ సందర్భమున "కార్నిజి" యను దాతచేత ఏర్పరుపబడిన "ట్రస్టు" వారు చేసిన ఉదారయుతమగు ద్రవ్యసహాయము నుగూర్చి చెప్పవలసి యున్నది. వీరు ఈ కాలములో ౫,౬౦౦ పౌనుల విలువ గల గ్రంథముల నొసంగిరి. ఇదిగాక కేంద్రగ్రంథాలయమునకు నూతన భవనమునకును పట్టణములలో గ్రంథాలయముల అభివృద్ధికిని మరియొక ౨,౫౦౦ పౌనులు ఇయ్యబడినవి. వీరి సాయము లేనియెడల ఇంత సత్వరాభివృద్ధి అగుటకు అవకాశములేదు.

ఈ కాలమున ఇతరులచే ఇయ్యబడిన గ్రంథములు ౧,౦౦౦ కంటె ఎక్కువగానే కలవు.

## గ్రంథాలయ కేంద్రములు

జిల్లాయందంతటను గ్రంథముల నెరవిచ్చుటకై ౭౫౦ గ్రంథాలయ కేంద్రములు కలవు. వీనిలో — పాఠశాలలందును, ఆసుపత్రులందును వయోజనులకును ఏర్పరిచినవికూడ కలవు.

## విదేశ ప్రేక్షకుల రాకపోకలు

ఆస్ట్రేలియా, న్యూజీలండు, దక్షిణాఫ్రికా, అమెరికా దేశములనుండి గ్రంథభాండాగారులు ఈ జిల్లాయందు జరుగుచున్న గ్రంథాలయసేవనుగూర్చి తెలిసికొనుటకై ప్రేక్షకులుగా అనేకులు విచ్చేసిరి.

గ్రంథాలయ సర్వస్వము – సంపుటి 10 – సంచిక 9 – 1936.

# గ్రంథాలయములు - గుడ్డివారు

గుడ్డివారికి గ్రంథాలయములా ? అను పై శీర్షిక వింతగా తోచవచ్చును. కాని మనకు నేటికి ఆశ్చర్యముగ తోచు దానిని ఇంగ్లండు అమెరికా దేశములలో కార్యరూపమున బెట్టిరి. అనేకులు అంధులు మేలుపొందుచున్నారు. మన దేశమునందో - కళ్ళతో బాటు అన్ని అవయవములుండియు కోట్లకొలదిగ ప్రజలు నిరక్షరకుక్షులై తమ జీవితమును నిరర్థకముగ గడుపుచున్నారు.

## "నేషనల్ లైబ్రరీ"

ఇంగ్లండులో, "నేషనల్ లైబ్రరీవారు" ఉబ్బెత్తు, "పల్లము" గల పుస్తకములతో అంధులను అక్షరాస్యులం జేయుచున్నారు. ఇదెంతయు ప్రశంసనీయము.

ఈ సంస్థ 1882 వ సంవత్సరమున స్థాపింపబడినది. గ్రంథాలయాధికారుల నిరంతర కృషివలన గుడ్డివారల కుపయోగపడు పుస్తకముల యుత్పత్తి అధికముగ సాగుచున్నది. 25 సంవత్సరముల క్రిందట 100 పుస్తకముల సంఖ్యనుండి క్రిందటి సంవత్సరమునకు (1935) 1,85,000 "అంధుల గ్రంథములు" అభివృద్ధి నందినవి.

## ద్వివిధములగు "బ్రైలీ" - "మూన్" అక్షరములు

ఈ పుస్తకములో అక్షరములు "ఉబ్బెత్తుగ" నుండును. వీనిని చేతితో తడుముటద్వారా స్పర్శజ్ఞానము వలననే నేత్రాభావులు చదువగల్గును. ఈ అక్షరములు రెండు విధములు. 1. "బ్రైలీ" అక్షరములు, 2. "మూన్" అక్షరములు. "బ్రైలీ" అక్షరముల పుస్తకము సాధారణపు గ్రుడ్డిచదువరులకు పనికివచ్చును. "మూన్" అక్షరములు పై రకమునకన్న పెద్దవి. పై వానిని గ్రహింపలేని వారికివి యుపయోగపడును.

## పోస్టుద్వారా అంధుల గ్రంథములు

ఇంగ్లండులో 11,000 మంది గుడ్డిచదువరు లున్నారు. వారిలో 8,000 మంది పోస్టుద్వారా పుస్తకములు తెప్పించుకొనెదరు. పుస్తకములు వారి దగ్గరనుంచుకొను గడువు సాధారణముగ నొకనెల దినములు. ఎన్ని పుస్తకములు కావలసినను తెప్పించుకొనవచ్చును.

"నేషనల్ లైబ్రిరీ" 1935 వ సంవత్సరమున గుడ్డివారల పుస్తకములకై 24,000 సవరనులు ఖర్చుపెట్టినది. మరియు 3,14,243 పుస్తకములను ఎరవు నిచ్చినది. ఆ సంవత్సరముననే "బ్రైలీ" అక్షరములుగల పుస్తకములు 7,32.015 తయారు చేయబడినవి.

### శ్రవణవిధానము - "గ్రంథఫోను"

పైన చెప్పబడిన స్పర్శజ్ఞానముతో గుడ్డివారు చదువు పద్ధతి అంత సులభముగాలేదని యెంచి అమెరికాలో గ్రామఫోనువంటి "గ్రంథఫోను" అను ఒక యంత్రమును నిర్మించినారు. ఇది గ్రామఫోను వలెనే యుండును. కాని దీనికి రెండు తిరిగే గుండ్రని బల్లలు అమర్చబడి యుండును. శబ్దము "ఫిలిం" మీద రికార్డు చేయబడును. పై బల్లమీదనుండి అడ్డముగ "ఫిలిము" "ఫొటో ఎలక్ట్రిక్ సెల్" (విద్యుచ్ఛక్తివలన వెలుతురును శబ్దముగ మార్చుసాధనము) వద్దకు పోవును. "ఫొటో ఎలక్ట్రిక్ సెల్" వలన "శబ్దము" ఉత్పన్నమై "గ్రంథఫోను" నందున్న యంత్రమువలన స్పష్టీకరింపబడును. "స్పర్శకు" బదులు "శ్రవణము" ద్వారా జ్ఞాన సంపాదన జరుగును.

1935 వ సంవత్సరమున "అమెరికన్ లైబ్రిరీ కాంగ్రెసు" వారు, గుడ్డివారలకై "వాషింగ్టన్" నందు ఏర్పరచిన "అమెరికన్ ఫౌండేషన్ సంఘము" వారిని యంత్రములను తయారుచేయుటకై క్రింది వివరల ప్రకారము బడ్జెటును ఆమోదింప జేసిరి.

మాట్లాడు 'గ్రంథరికార్డు'లను తయారుచేయుటకు 75,000 డాలర్లు 5.000 యంత్రములను తయారుచేయుటకు 211,500 డాలర్లు పై

సంఘముయొక్క పారిశ్రామికాలయమందే "రికార్డు" చేయుటకు ఏర్పాట్లు గావింపబడినవి.

"గ్రంథ" రికార్డులు — గ్రామసేవ

ఒక నవలను 500 అడుగుల "ఫిలిం" మీద రికార్డు చేయవచ్చునట. ఈ విధముగ అమెరికన్ లైబ్రరీ కాంగ్రెసువారు తయారుచేయించు "రికార్డులు" "మెషీను"లు అమెరికా సంయుక్తరాష్ట్రములందుండు గ్రామము లన్నింటికిని ఎరవు ఇయ్యబడును.

మనదేశమున గూడ నిట్టి విధాన మవలంబించిన నత్యంతోపయోగముగ నుండును.

గ్రంథాలయ సర్వస్వము— సంపుటము 10, సంచిక — 1— 1936.

# రైలు స్టేషను - గ్రంథాలయములు

ఇంగ్లాండు దేశమందున్న కొన్ని రయిలుస్టేషనుల యందు "ఫ్రాన్కులెట్ ఛెల్" అను మహానుభావుడు సంచార ధర్మగ్రంథాలయములను స్థాపన జేసెను. రయిలుస్టేషనుయందు డాయన గ్రంథముల బీరువాల నుంచెను. ప్రయాణీకులు తమ కిచ్ఛవచ్చిన గ్రంథములను అందుండి తీసికొనిపోవచ్చును. అట్లు తీసికొని పోవువారు తమ నామములు గాని చిరునామాలనుగాని వ్రాసిపెట్టవలసిన యగత్యములేదు. గ్రంథము లింతకాలములో తిరిగి ఈయవలయుననెడి నియమము లేదు. తమ ప్రయాణములనుండి తిరిగి వచ్చునప్పుడు— తీసికొనిపోయిన గ్రంథములను ఇయ్యవచ్చును. లేదా స్టేషను మాష్టరునకు పోస్టుద్వారా పంపవచ్చును.

ఈ ప్రకారము స్థాపించిన గ్రంథాలయములయం దొక్క గ్రంథమైన తస్కరింపబడలేదు. "లెట్ ఛెల్" గారిని వారి యుదారగుణమునకు అభినందించుచు పాఠకులు ఉత్తరములు అనేకములు వ్రాసిరి. వీటియందలి గ్రంథములు అప్పుడప్పుడు మార్చబడును.

గ్రంథాలయ సర్వస్వము, సంపుటము 1, సంచిక 1, 1915.

# "చీనా" దేశ "విజ్ఞాన సర్వస్వము"

ప్రపంచమునందున్న గ్రంథములయందెల్ల గొప్ప గ్రంథము చీనాదేశామం దుద్భవిల్లిన "విజ్ఞాన సర్వస్వ" మను గ్రంథము. ఈ గ్రంథము 11,100 సంపుటములుగ వ్రాయబడినది. ఈ సంపుటములలో రెండు ఇటీవలనే (1925) లండను గ్రంథాలయమునకు జేరినవి. చైనాదేశ పండిత మండలిచే తయారుచేయబడిన ఈ యుద్గ్రంథము 1900 సంవత్సరమున "బోక్సరు" నందు జరిగిన తిరుగుబాటు యుద్ధమునందు నాశనమైపోయెను. ఆ గ్రంథ శిథిలములనుండి ఈ మహా గ్రంథముయొక్క కొలది సంపుటములు మాత్రము సంరక్షింపబడినవి. చైనాదేశమునకు 1860 సంవత్సరమునుండియు విదేశీయులను రానిచ్చుచుండినను ఈ గ్రంథమును మాత్రము నెవరును జూడనవకాశమిచ్చెడువారు గారట.

## గ్రంథ సంకలనము

చైనాదేశము నేలిన రాజులలో ప్రముఖుడగు "యంగులో" అను నామముగల యాతడు ఈ గ్రంథమును క్రీ. శ; 1403 వ సంవత్సరమున "హేచిన్" అను గొప్ప పండితునిచే సమకూర్ప ప్రారంభించెను. ఆతడు 146 గురు పండితుల సహాయముతో 16 మాసములలో నీ గ్రంథమును పూర్తిజేసెను. కాని రాజుగారికి సంతృప్తికరముగ నా గ్రంథములేదట. అందుచే నీ యుద్గ్రంథ "సంపాదకు"లుగ ముగ్గురు ప్రధానాధిపతులను, అయిదుగురు సంపాదకులను, ఇరువది మంది సహాయసంపాదకులను, 2,141 మంది సహకారులను, మొత్తం 2,169 మందిని ఏర్పాటుచేసెను. వీరందరును అహోరాత్రములు శ్రమపడి పనిజేసి నాలుగు సంవత్సరములలో 11,100 సంపుటములు గలిగిన "విజ్ఞాన సర్వస్వము" ను తయారుజేసిరి.

## గ్రంథ వివరములు

ఇందు 22877 విభాగములు గలవు. ఇవిగాక 60 విభాగములలో విషయ వివరణము గలదు. ఈ సంపుటములో ప్రతి పుటయు

అరంగుళము దళసరిగ నుండును. ఈ సంపుటము లన్నియు ఒకదాని మీద మరియొకటి యమర్చినయెడల 450 అడుగుల యెత్తు అగును. ప్రతి సంపుటమును ఒక అడుగు వెడల్పును, ఇరవై అంగుళముల పొడవును గలిగి బైండు చేయబడి పసుపురంగు గల పట్టుగుడ్డతో నలంకరింపబడి యుండును. ఒక్కొక్క విభాగమునందు ఇరువది పుటల వంతున మొత్తము గ్రంథమునందు 917,480 పుటలు గలవు. ఆంగ్లేయ విజ్ఞాన సర్వస్వమందు 22,000 పుటలు మాత్రమే గలవు. దీనివలన చైనా భాషా విజ్ఞాన సర్వస్వముయొక్క ఔత్కృష్ట్యము గ్రహింపనగును.

## గ్రంథ పరిస్థితి

క్రీ. శ. 1562 వ సంవత్సరమునందు ఈ మహాగ్రంథమునకు నకలు వ్రాయుటకు నూరుగురు పండితులు నియమింపడిరి. 1563 వ సంవత్సరమునకు గాని వారు నకలు పూర్తిగావింపలేకపోయిరి. 1644 వ సంవత్సరమున రాజవంశ మంతరించినపుడు నకలు ప్రతి తగుల బడిపోయెను, పిమ్మట అసలు ప్రతిని 'హోక్సరు' కాలేజీకి తరలించిరి. ఆ మార్పు జరిగినపిమ్మట అనేక సంపుటములు కనిపించకుండ బోయినవి. చైనా ప్రభుత్వము వారీ యుద్గ్రంథమును వెలుగుజూడ నివ్వకుండుటచే, నిది చరిత్రయందు మాత్రము నామావశిష్టమైనది.

గ్రంథాలయ సర్వస్వము. సంపుటము - ౮ - సంచిక - 9, మే 1925.

---

# రష్యా జాతీయ గ్రంథాలయము

రష్యాదేశమందలి జాతీయ గ్రంథాలయము "మాస్కో" నగరమునందున్నది. దీని పేరు "లెనిన్" గ్రంథాలయము; విజ్ఞానమంతయు ఇచట నిక్షేపితమై యున్నది. ఈ గ్రంథాలయమంతయు ప్రధానముగ ఆరు శాఖలక్రింద విభజింపబడియున్నది. ఇందు ప్రస్తుతము రెండున్నర కోట్ల గ్రంథములు గలవు; వీనికి తోడుగా ప్రపంచ

మందన్ని భాగములనుండి ప్రతిదినమును నూతన గ్రంథప్రచురణము లన్నియు సమకూర్చబడును. మానవమేధస్సు ఊహింపగలిగిన అన్ని విషయములను గూర్చిన గ్రంథరాజము లన్నియు ఇందు నిక్షిప్తములై యున్నవి; ప్రపంచమునందు అన్ని దేశములయందును గల వివిధములగు 173 భాషలలోని గ్రంథములు ఇందున్నవి; ఆ సంఖ్యలో రష్యాదేశమునకు సంబంధించిన ప్రజలయొక్క భాషలు 89 యును, ఇండియాదేశమునకు సంబంధించిన ప్రధాన ప్రాంతీయభాషలు 14 ను కలవు.

ఈ గ్రంథాలయమందు చదువరులు చదువుకొనుటకు పెద్ద చావడులు (Halls) 22 గలవు, ఈ చావడులయందు ఒకేసారి 2,500 మంది చదువరులు సుఖాసీనులై చదువుకొనవచ్చును. ప్రతి దినము – శెలవు అనేది లేకుండ – ఉదయము 9 గంటలనుండి రాత్రి 11 గంటల వరకును తెరచియుంచెదరు. ప్రతిదినము 9,000 మంది ఈ గ్రంథాలయమునకు విచ్చేసి, ఉపయోగమును పొందెదరు.

ఈ గ్రంథాలయమునకు ప్రతి వారమును 1200 నూతన గ్రంథములు సేకరించబడుచున్నవి; ఇట్టి నూతన గ్రంథములను ప్రత్యేకమొక చావడియందు మొదటి వారం దినములు ప్రదర్శించి యుంచెదరు. ఆ దినములలో అందరును విచ్చేసి తమకు అభిమానముగల గ్రంథములను గుర్తు వ్రాసికొనెదరు; ఆ వారం దినములైన పిమ్మట ఆ నూతన గ్రంథములను ఆ యా శాఖావిభాగములకు పంపెదరు; అప్పటినుండి ఆ గ్రంథములను అందరును ఎరువు తీసికొనవచ్చును.

ప్రముఖులగు గ్రంథకర్తలు వ్రాసిన గ్రంథములను, వివిధ విషయ విభాగములను గూర్చిన గ్రంథములను ఏర్చి కూర్చి – గ్రంథాలయ నిర్వాహకులు ప్రత్యేక ప్రదర్శనములను అప్పుడప్పుడు ఏర్పాటు చేయుచుందురు.

ఈ గ్రంథాలయముయొక్క వివిధ చావడులయందు అట్టి ప్రదర్శనములు సంవత్సరమునకు 800 జరుగుచుండును. అందువలన – అట్టి సావకాశములవలన – చదువరులు తమకు కావలసిన విషయ

విభాగములమీది గ్రంథములనుగాని, తమకు కావలసిన గ్రంథకర్తల గ్రంథములనుగాని - ప్రత్యక్షముగ చూచి ఏరికొనుటకు తగు సావకాశములు ఎక్కువగా లభ్యమగును.

అపూర్వమైన పుస్తకాలు - పాతపుస్తకాలు- మొదలైన వాటిని— అతి చిన్నసైజున ఫిలింలు (Micro Films) గా తీసియుంచెదరు. అట్టి కార్యనిర్వహణ కొరకు ప్రత్యేక మొక శాఖ కలదు.

పుస్తకముల చరిత్రలు, వాటి గ్రంథకర్తలు, వివిధ ముద్రణములు, మొదలైన విషయ వివరణములను దెలుపు వాఙ్మయ సూచికలతో (Bibliography) వేరొక శాఖ కలదు.

పత్రికలు— అందలి విషయములు- మొదలగు వానిని దెలుపు ప్రత్యేక శాఖ మరియొకటి కలదు.

ఈ గ్రంథాలయమందు అపూర్వములగు గ్రంథములు — అందులో మూలగ్రంథముల వ్రాతప్రతులు - అనేకముగా కలవు; ప్రపంచమందంతటనుగల ప్రధాన గ్రంథాలయములకును, పరిశోధక సంస్థలకును అట్టి అపూర్వ గ్రంథసంచయమును ఎరువుగా నిచ్చెదరు.

అపూర్వగ్రంథములను - శిథిలములగుచున్న పాతగ్రంథములను అతిచిన్నసైజులో ఫిలిములుగా తీయుటకుగాను, ఇతర సంస్థలును వ్యక్తులును, ఈ లెనిన్ జాతీయ గ్రంథాలయముయొక్క సహాయమును అర్థించెదరు. అట్టి వారికి ఒక పుటకు 15 పైసలు వంతున, ప్రతిఫలమును తీసికొని, వారిపని పూర్తిగావించెదరు

ఈ లెనిన్ గ్రంథాలయమును స్థాపించి, నూరు సంవత్సరముల కాలము దాటినది. అది 1862 సంవత్సరములో స్థాపింపబడినది. అంతకుపూర్వము దానికి "రోమన్ సోవు మ్యూజియం" అని పేరుండెడిది. అప్పుడు మాస్కోనగరములో అది ఒక్కటే సార్వజనిక గ్రంథాలయముగ నుండెను. అప్పుడు అందులో 1,00,000 గ్రంథములు మాత్రముండెను. ఒకసారి 20 మంది జనులు మాత్రము

గ్రంథాలయమందు కూర్చుని చదువుకొనుటకు ఆనాడు సావకాశ ముండెను.

అచ్చుఅయిన క్రొత్తపుస్తకముల నన్నింటిని, విధిగా ఈ గ్రంథాలయమునకు పంపవలెనని నిబంధనను ఏర్పరచిరి. అంతేగాక భాగ్యవంతులైన కుటుంబముల వారు అనేకులు తమయొద్దనున్న గ్రంథ సంచయములను ఈ గ్రంథాలయమునకు దానముగా నిచ్చివేసిరి. ఈ రీతిగా "రోమన్ సోవు మ్యూజియం" గ్రంథాలయము క్రమానుగతముగా అభివృద్ధిని జెందినది.

ఈ గ్రంథాలయముయొక్క ఉపయోగమును మాస్కోవాసులే గాక, ఆ దేశమందలి ఇతర నగరములయొక్క - పట్టణములయొక్క - పల్లెలయొక్క - వాస్తవ్యులందరు, తమ స్థానిక గ్రంథాలయముల ద్వారా, తమకు కావలసిన గ్రంథముల నన్నింటిని తెప్పించుకొని ఉపయోగించుకొనవచ్చును,

గ్రంథములను పంపమనివచ్చిన అట్టి కోరికల నన్నింటిని, ఏమాత్రమైన ఆలశ్యము లేకుండగనే తీర్చెదరు. ఈ అఖిల ప్రపంచ మునందున్న అన్ని దేశములయందుగల గ్రంథాలయము లన్నియు గూడ, ఈ లెనిన్ జాతీయ గ్రంథాలయమునుండి పుస్తకములను ఎరువు తీసికొనవచ్చును,

పుస్తకములు - పుస్తకముల చరిత్రలు - వాటికర్తలు- వివిధ ముద్రణములు మొదలుగాగల వివరములను దెలుపు వాఙ్మయ సూచి (Bilbiog aphical) గ్రంథములు - వార్తాపత్రికలు - ఇవిగాక సంగీతకళకు సంబంధించిన అమూల్యములైన సంగీతస్వరాలు, (Musical notes) రికార్డులనుగూడ ఈ గ్రంథాలయమందు విరివిగా గలవు.

శాస్త్ర విషయములందు- పరిశోధక కార్యక్రమమందు - జాతీయ కేంద్రముగ, ఈ లెనిన్ గ్రంథాలయము ఏర్పడియున్నది. అంతేగాక దేశము నందున్న ఇతర గ్రంథాలయములతో సహకార

కార్యక్రమమునుగూడ ఈ గ్రంథాలయము నిర్వహించుచునే యుండును.

సోవియటు రష్యా దేశమునందు మొత్తము నాలుగు లక్షలకు పైగా గ్రంథాలయములు గలవు. ఈ లెనిన్ గ్రంథాలయము, ఆ గ్రంథాలయము లన్నింటియొక్క అనుభవములను పరిశీలించుచుండును. అట్లు పరిశోధించి అమూల్యములగు పాఠములుగా వాని నన్నింటిని క్రోడీకరించి, దేశమునందలి గ్రంథాలయము లన్నింటికి, వానిని ప్రచారము చేయును. దేశము నందలి గ్రంథాలయము లన్నియు, అట్టి పాఠముల దృష్ట్యా అవసరమైన అభివృద్ధి మార్గముల నన్నింటిని అవలంబించును. ఈ రీతిగా దేశమునందలి గ్రంథాలయములన్నియు, తోడి సోదర గ్రంథాలయముల అనుభవముల నన్నింటిని జీర్ణించుకొని దినదినాభివృద్ధి నొంది సుసంపన్నము లగుచున్నవి.

ఇంతేగాక, ప్రపంచమునందున్న అనేక గ్రంథాలయములతో ఈ లెనిను గ్రంథాలయము సంబంధ బాంధవ్యములను పెట్టుకొని, అట్టివాని యనుభవములనుగూడ లెక్కలోనికి దీసికొని, అందుండి నేర్చుకొనదగిన విషయములనెల్ల స్వీకరించుచునే యుండును.

అంతర్జాతీయ గ్రంథాలయ శాస్త్రముయొక్క సూత్రముల దృష్ట్యా- ఈ లెనిను గ్రంథాలయము తన కార్యక్రమమును రూపొందించుకొనుచు- తన దేశమునందలి గ్రంథాలయముల పనినిగూర్చి, ప్రపంచమునందు ప్రచురింపబడుచున్న పుస్తకములనుగూర్చి, ప్రతి మూడు మాసముల కొకసారి ఒక సంపుటమును ప్రచురించుచున్నది.

ప్రపంచమునందున్న గొప్ప గ్రంథాలయము లన్నింటిలో ఈ లెనిను గ్రంథాలయము వయస్సులో చిన్నది. వాషింగుటను పట్టణము (అమెరికా) — ప్యారిసుపట్టణము (ఫ్రాన్సు) - లండనుపట్టణము (ఇంగ్లాండు) - లందు స్థాపింపబడిన గ్రంథాలయము లన్నియు, ఈ "రోమను సోవు మ్యూజియం" గ్రంథాలయమునకు పూర్వమే స్థాపింపబడి యున్నవి, వయస్సులో చిన్నదైనను ఈ లెనిను గ్రంథాల

యము అపూర్వము లగునట్టియు, మిక్కిలి విలువవైనట్టియు, గ్రంథములతో నిండియున్నది. అంతేగాక, ఈ గ్రంథాలయ మందలి విజ్ఞాన సరోవరమునుండి, జ్ఞానామృతమును ఎక్కువమంది గ్రోలుచున్నారు.



# దేశరక్షణ - మన కర్తవ్యము

## దేశమంటే

ఆది మధ్యాంతర రహితుడైన భగవంతుడు, తాను అనేకం కావాలని సంకల్పించినాడు; ముందుగా ధ్వని ఆవిర్భవించినది; అది ఓంకార రూపమైనది. ఆ ఓంకారమే అక్షరం - శబ్దం - భాషగా అయినది; అదియే జ్ఞానస్వరూపిణి సరస్వతీదేవిగా ఆవిర్భవించినది.

ఆ ధ్వనియే - ఆ ఓంకారమే — ఆ జ్ఞానమే - ఈ దృగ్గోచర ప్రపంచరూపము నొంది, దానికి లోపల - బైట - అంతటా నిండి నిబిడీకృతమై యున్నది. ఆ ఓంకారమే ఘనీభవించిన స్థితియందు పదార్థముగా దృగ్గోచర మగుచున్నది!

క్రైస్తవుల వేదమగు "బైబిలు" గ్రంథమునందుగూడ "సృష్ట్యాదిని శబ్దమున్నది; ఆ శబ్దము భగవంతుని యందున్నది; ఆ శబ్దమే భగవంతుడు" ♦ అని శబ్దబ్రహ్మయే రూపించబడినది.

అట్టి అనంతకోటి సృష్టి - బ్రహ్మాండమునందుగల ఈ భూగోళము నందెల్ల - భౌతిక ఆధ్యాత్మిక సమ్మిళితశక్తి స్వరూపిణిగ భారతవర్షమును సృజించి, ఆ దేశ రక్షణకై ఉత్తర దిక్కున దేవతాత్మయగు పర్వత చక్రవర్తి హిమాచలమును నిర్మించి, అందు గౌరీశృంగమున తన నివాసము నేర్పరచుకొని పరమేశ్వరుడు సృష్టి-స్థితి — లయ తాండవలాస్యమే నిరంతరానందముగా నున్నాడు.

అందుచేత స్వర్గమునుండి భువికి దిగునట్టి-భువినుండి స్వర్గమునకు ఎక్కునట్టి మార్గము ఈ భూమండలమునకెల్ల హిమాచల పర్వతములు మాత్రమే.

పాండవాగ్రజుడు ధర్మరాజు అందుండియే స్వర్గధామమున కేగినాడు.

---

♦ "In the begining was the Word
and the Word was with God
and the Word was God" Bible.

భారతీయ ధర్మము సనాతనము; నిత్య వీర్యసముచితము. అన్ని మతముల ప్రత్యేక ప్రాంతీయ ఆచార అభిప్రాయ విభేదముల యందును,ఏకత్వమును సూచించుచు అంతర్గతముగ ప్రవహించుచుండు ఒక ఆధ్యాత్మిక తత్వము; స్రవంతి. అన్నింటిని తనలో కలుపుకొను టయు, ప్రతిదానికి స్వేచ్ఛ నొసగుటయు భారతీయ ధర్మమునకు ప్రత్యేక లక్షణము. ఇతర మతము లన్నియు ప్రవక్తరూపుడగు ఒకా నొక మతకర్త జీవితముపై ఆధారపడియున్నవి; కాని మన సనాతన ధర్మ ప్రతిపాదకమగు హిందూమత మటుల మానవులపైనగాక భగ వంతుని ధర్మ సిద్ధాంతములపైన మాత్రమే ఆధారపడి యున్నది; అందు చేతనే మనది విశ్వజనీన మతము.

"ఏకో దేవః సర్వభూతేషుగూఢః" అనగా ఒకే దేవుడు; సర్వ భూతములందు గూఢముగ నున్నాడు; ఇది భారత మత రహస్యము.

"లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు" అను సంకల్పముచే సిద్ధులై తమ ఉజ్వల తపోసంపత్తిచే దేశమునంతను గప్పివైచిన ఋషి పుంగ పులచే నేటికిని సంరక్షింపబడుచున్నదీ దేశము.

ఈ సూత్రముల నధిగమించి భారతదేశము ఎన్నడును పరుల మీదికి దాడివెడలి యెరుంగదు.

వేలకొలది విదేశ దాడులను, భిన్న భిన్నము లగు ఆచార మర్యాదల సమ్మేళము వలన గల్గిన వందలకొలది విప్లవములను భరించి, తట్టుకొని, ఉజ్వలమై నిలచినది ఈ భారతభూమి-

భారతీయ జీవనమునకు సార్వజనికమైన సనాతన మతమే కీలకము.

మన దేశ సమస్యలు ఇతర దేశముల వానికంటె చిక్కయినవి; ప్రముఖమైనవి. మన సంఘము- మతము- భాష - పరిపాలన - ఇవి యన్నియు కలసి మన "జాతిగా" నేర్పడినది.

ఆర్యులు- ద్రావిడులు- తార్తారులు- తురుష్కులు- మొగ లులు- యూరపియనులు -మున్నగు ప్రపంచ జాతుల నాగరికతా స్రవంతి- రక్తస్రవంతి- ఈ దేశమున ప్రవహించుచున్నది.

భౌతికమును అనీశ్వరమును అగు నేటి ప్రాపంచిక నాగరికతను మరల ఈశ్వరోన్ముఖము గావింపనున్న ఆధ్యాత్మిక మహాస్రవంతి భారతవర్షమందే ఉద్భవించనున్నది.

ఒకరి జోలికి- ఒకరి శొంఠికి- పోక, ఋషి జీవనమును నడపుచున్న— మనపవిత్ర భారతభూమినే కబళింపవలెనని చైనా దేశీయులు తమ కబంధహస్తములను జాచి, చూచిరి, ఎంతజూచినను చేతులకు నొప్పులు పుట్టినవేగాని ఆవంతయైన ప్రయోజనము లేకపోయినది— దైవబల సంపన్నత మనలను అదనునకు కాపాడినది.

అసలు ఈ చీనా దేశీయులు ఎవరు ! మానవ పరిణామంలోనే వెనుకబడినజాతి; ప్రపంచమంతయు ఆరవ మూల జాతివైపు పరిగమించుచుండ, వారు ఇంకను నాలుగవ మూల జాతిగానే దిగబడియున్నారు. అందుచేత వారిది పాతకాలపు నాగరికత, మంద బుద్ధులు మూర్ఖులు; మంకుపట్టువారు, ఆ జాతి నశించి, తిరిగి ఆవిర్భవించిన గాని వారికి మోక్షంలేదు.

మనది "ఇదం బ్రాహ్మ్యం" — "ఇదం క్షాత్రం"

ఇంతవరకు బ్రాహ్మ్యమును జూపినవారము; సమయ మాసన్నమగుసరికి క్షాత్రమునందుకూడ మన ప్రతిభను జూపి, మన ధీరతను ప్రదర్శించి, భారత దేశము యెడలగల మన భక్తిని వెల్లడించినారము. సుప్రసిద్ధమైన భారత దేశ సమైక్యతయొక్క — సహజీవనముయొక్క రుచిని జూపినారము.

బ్రాహ్మము నొక చేతితో — క్షాత్రము నొక చేతితో - దేశసంరక్షణార్థమై, ఎల్లప్పుడును సంసిద్ధులముగ నుండుటకు ప్రారంభించినారము.

**అయితే దేశ రక్షణయందు ప్రమత్తత తగదు.**

**"ఈ దేశం నాది" అనే స్మృతిని ప్రతి భారతీయుని హృదయంలోను నాటుకోవాలి.**

చిత్తశుద్ధి, హృదయ పవిత్రత, కావాలి.

పూజలలోకెల్ల పరిపరిధమమైన పూజ విరాట్పూజయే.

అనగా మనచుట్టు — ఈ జగమున ఉన్న సర్వభూతముల అర్చనయే.

మిత్రులు - శత్రువులు - అని ఇద్దరు లేదు.

అందరు మనకు గురువులే.

మనము సేవింపవలసిన ప్రధాన దేవతలు-ఆత్మ స్వరూపులగు మనదేశ ప్రజలే.

## సంకల్పము

మన మహా భారతమాతయే మన అధిష్టాన దైవతముగ నుండుగాక.

ఇతర దేవతలు మన మనస్సులనుండి అదృశ్యమైపోయెదరు గాక; ఆమె ఒక్కతెయే మన అన్ని అవస్థలలోను ఉండవలసిన ప్రధాన దేవత.

ఆమెయే మూర్తీభవించిన మనజాతి స్వరూపము.
సర్వత్రా ఆమే బాహువులే!
సర్వత్ర ఆమె పాదములే!
సర్వత్ర ఆమె కర్ణములే!
సర్వత్ర ఆమె వాక్కులే!
ఆమెయే మన సర్వస్వమును ఆవేశించి యుండుగాక!
తక్కిన దేవతలెల్ల నిద్రపోయెదరుగాక.

## ని వే ద న ము

సాధనము - తనువు - ప్రాణము - ఆత్మ -
అన్నియు నీవు మా కొసంగినవే।
అవి యన్నియు నీ స్వరూపములే!

ఈ పవిత్రమైన భారత స్వాతంత్ర్యదినోత్సవ సందర్భమున
వాని నన్నింటిని
తిరిగి
నీ పదములయందు అర్పించి
పవిత్రుల మగుచున్నాము.

---

1963 స్వాతంత్ర్య దినోత్సవ సమయమున శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారిచే, ఆలిండియా రేడియో, విజయవాడ నుండి, ప్రసారము చేయబడిన ప్రసంగము.

శా. తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చే
తన్ బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా
నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లంబల్కుము నాదు వాక్కులను సం
ప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూ
ర్ణేందు బింబాననా! —బమ్మెర పోతన.

ఉ. మేలిమి మంచుకొండ నుప
మింపగఁ జాలిన యంచనెక్కి, వా
హ్యాళి నటించి వచ్చి చతు
రాస్యు నెదుర్కొని, నవ్వు దేరగాఁ
వాలిక సోగకన్నుల ని
వాళి యొనర్చి ముదంబుగూర్చు వి
ద్యాలయవాణి శబ్దముల
నర్థములన్ సతతంబు మా కిడున్
—మొల్ల.



భారతవర్ష గ్రంథాలయోద్యమమునకు కల్పతరువు

## శ్రీ శాయాజీ గాయక్వారు - బరోడా మహరాజ



1936 లో వీరికి వజ్రోత్సవము జరిగినప్పుడు, అఖిల భారత ధర్మ గ్రంథాలయ సంఘ పక్షమున శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య బరోడాకు పోయి వీరికి "శ్రీ సరస్వతీ సామ్రాజ్య రమారమణ" అను బిరుదు నిచ్చిరి.

బరోడా గ్రంథాలయోద్యమోద్ధారకులు

## శ్రీ జనార్దన కుడాల్కారు



శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య మద్రాసులో 1919 న జరిపిన అఖిల భారత ధర్మ గ్రంథాలయ సభకు వీరు అధ్యక్షత వహించిరి.

పుస్తకములను ఎరువిచ్చు శాఖ



ఆచూకీ (రిఫరెన్సు) గ్రంథాలయము




బాలురు చదుపు — ఆటలను ఆడుకొంటున్నారు




స్త్రీల శాఖ